శ్రీ

# వర్ణనరత్నాకరము





గ్రంథకర్త:

దాసరి లక్ష్మణస్వామి,

పిఠాపురము, (తూర్పుగోదావరిజిల్లా.)

1927.

ఓమ్ !

# అభినందనము.



ఒక నవీనగ్రంథమును దొలుదొలుత ముద్రింపించి ప్రకటింపఁ దలఁచినప్పుడు తన్ముఖమున నెవ్వరిచేనైన నొక కొన్నివిషయములు "పీఠిక" యనియో, "ఉపోద్ఘాత" మనియో, "తొలిపలు"కనియో పేరు పెట్టించి వ్రాయించుచుండుట కొంతకాలమునుండి యొక సాంప్రదాయముగా వచ్చుచుండుటచేఁ దత్సాంప్రదాయమునను సరించి, యీ వర్ణరత్నాకరమును సంకలనమొనర్చిన దాసరి లక్ష్మణకవి తనకు నాయెడలఁగల భక్తిగౌరవములచే నన్నిగ్రంథమునకుఁ బీఠిక వ్రాయఁ గోరెను. పీఠికాదుల పరమప్రయోజనము గ్రంథమునందలి విషయ సంగ్రహమును, గ్రంథప్రాశస్త్యమును, పాఠకమహాశయులకుఁ బరిచయము చేసి నివేదించుటయే కాదా?

ఈ వర్ణరత్నాకరము ప్రథమ ద్వితీయభాగములు 1928 వ సంవత్సరమున ముద్రింపఁబడి యొకసంపుటముగాఁ బ్రకటితములై యున్నవి. ఆసంపుటమునందు మొదట నొక పర్యాప్తమైనపీఠికయును బలువురు గొప్పవిద్వాంసులిచ్చిన యభిప్రాయములును విపులముగఁ బ్రకటింపఁబడియే యున్నవి. పండితులు, కవులు, కవితాప్రియులు, భాషాభిమానులు, భాషాపోషకులు మొదలగు పెక్కురు తెలుఁగు నాఁటివా రాసంపుటమును మిక్కిలి యాదరముతోఁ దిలకించినారు. దానియందలి వర్ణనములను జదివి యానందాతిశయమునఁ బులకించినారు. దానియందలి గుణాగుణముల నెంతయు నన్వేషించినారు.

దాని గుణవిశేషమును బరమోపయోగమును బహుముఖముల నుద్ఘోషించినారు. దానిని దా మెల్లరు నాదరించితి మన్నారు; అట్టి యత్యావశ్యకగ్రంథము తమకు లభించుటచేఁ దరించితి మన్నారు! ఇంక నేనిప్పుడు క్రొత్తగాఁ జెప్పవలసిన దేమియున్నది? ఆంధ్రదేశ వివిధభాగస్థులు నపరిచితులు నభిజ్ఞులు నగు మహామతు లెందఱో నిష్పక్షపాతబుద్ధితో నీగ్రంథమునుగుఱించి వెల్లడించిన యభిప్రాయ విశేషములకంటెను ఈగ్రంథము గ్రంథాలయములయందుంచఁదగినదని చెన్నపురాంధ్రపఠనీయగ్రంథనిర్ణాయకసభవా రనుమతించి యాదరించుటకంటెను, నన్ను గురువుగా భావించుకొనుచు నాతో విశేష పరిచయము గలిగియున్న యేతద్గ్రంథకర్త సమకూర్చిన యీగ్రంథమునుగుఱించి నేను వ్రాయు పీఠికాదు లధికప్రయోజనకరములు కావుగదా?

పైని పేర్కొనఁబడిన వర్ణనరత్నాకరము తృతీయచతుర్థ భాగములే యీసంపుటము. ఇదియును ప్రథమసంపుటమువలెనే సర్వజనామోదమును బడయుటయు నేతద్గ్రంథకర్త భగవదనుగ్రహమునఁ జిరాయురారోగ్యాదులు గలిగియుండి మఱియు నిట్టియుద్గ్రంథములు రచించుచుండుటయు మదీయాభీప్సితములు.

కవితావిలాసము
పిఠాపురము
19—5—1930.

ఓలేటి వేంకటరామశాస్త్రి.
(రామకృష్ణకవులు)

# రాజపోషకులు

మొదటి సం॥

శ్రీ రాజా వత్సవాయి వేంకట సూర్యనారాయణజగపతిరాజు బహద్దరు
జమీందారుగారు, శ్రీ తుని రాజావారు.

శ్రీ చింతలపాటి సూర్యనారాయణరాజు బహద్దరుగారు,
ప్రొప్రైటర్, కోటవురట్ల.

శ్రీ కాకర్లపూడి జగన్నాథరాజుగారు, మొఖాసాదార్లు,
అన్నమరాజాపేట.

శ్రీ వత్సవాయి వేంకట లక్ష్మీనృసింహరాజుగారు,
మొఖాసాదార్లు, భీమవరపుకోట.

శ్రీ దాట్ల వేంకట సూర్యనారాయణజగపతిరాజుబహద్దరుగారు, తుని.

శ్రీ మీర్జా నల్లపరాజు వేంకటసూర్యనారాయణ శ్రీహరిరాజుగారు, తుని.

శ్రీ చింతలపాటి సుదర్శనరాజుగారు, ప్రొప్రైటర్, ఏటికొప్పాక.

శ్రీ కంకిపాటి అప్పలరాజుగారు, బెంచికోర్టు ప్రెసిడెంటు, ఏటికొప్పాక,

శ్రీ కోటగిరి జగన్నాథ రాయనింగారు, గంపలగూడెము జమీందారుగారు.

శ్రీ సూరానేని వేంకట పురుషోత్తమ జగన్నాథ గోపాలరావుబహద్దరు
జమీందారుగారు, ఆఫ్ నార్త్ ఎస్టేటు, మైలవరము.

శ్రీ వెల్లంకి శ్రీనివాస జగన్నాథరావుగారు, తిరువూరు.

శ్రీ వెల్లంకి జగన్నాథరావుగారు, తిరువూరు.

శ్రీ వెల్లంకి రాధా వేంకట కృష్ణారావుగారు, తిరువూరు.

శ్రీ వెల్లంకి సత్యనారాయణరావుగారు, తిరువూరు.

శ్రీ వెల్లంకి పార్థసారథిరావుగారు, తిరువూరు.

శ్రీ రావు వేంకట రామారాయనింగారు, కొత్తపల్లి.

శ్రీ రావు వేంకట ప్రకాశరావుగారు, కొత్తపల్లి.

శ్రీ రావు వేంకట నరసింహారావుగారు, కొత్తపల్లి.

శ్రీ రావు వేంకట తిరుపతిరావుగారు, కొత్తపల్లి.

# రాజపోషకులు



శ్రీ చెలికాని అప్పారావుగారు, బొబ్బిలి.
శ్రీ చెలికాని వేంకటరాజగోపాలనరసింహారాయనింగారు, ఆర్యవట్టము
శ్రీ చెలికాని బుచ్చివెంకటావుగారు, ఆర్యవట్టము.
శ్రీ చెలికాని సూర్యనారాయణమూర్తిగారు, ఆర్యవట్టము.
శ్రీ రావు వెంకట్రావుగారు, కరప.
శ్రీ చెలికాని పెదబుచ్చివెంకట్రాయనింగారు, వేళంగి.
శ్రీ గజరావు సీతారామస్వామిగారు, చేబ్రోలు.
శ్రీ దామెర సీతారామస్వామిగారిపుత్రులు శ్రీ సీతారామస్వామిగారు [పిఠాపురము.
శ్రీ చెలికాని అప్పారావుగారు, గోరస.
శ్రీ చెలికాని వేంకట పార్థసారథిరావుగారు, భావవరము.
శ్రీ మోతే గంగరాజు జమీందారుగారు, ఏలూరు.
శ్రీ మెర్ల వీరన్నగారు, ప్రొప్రైటర్, వేళంగి.
శ్రీ మెర్ల రామన్నగారు, ,, వేళంగి.
శ్రీ మెర్ల సత్యనారాయణగారు ,, వేళంగి.
శ్రీ మెర్ల వెంకట సుబ్బారావుగారు ,, వేళంగి.
శ్రీ గుడివాడ సుబ్బారావుగారు, ప్రొప్రైటర్, పెద్దాపురము.
శ్రీ ముప్పన సోమరాజుగారు, ,, పెద్దాపురము.
శ్రీ పెపల సుబ్బారాయుడుగారు, మున్సిపల్ కౌన్సిలర్, పెద్దాపురము.
శ్రీ [illegible] సుబ్బరాజుగారు, గ్రామమునసబు, కొత్తలంక.
శ్రీ [illegible] వేంకట సూర్యప్రకాశరావుగారు, ల్యాండ్ లార్డ్సు,
పనసపాడు.
శ్రీ [illegible]ప్పలనరసింహరాజుగారు, ప్రొప్రైటర్, తంగేడు.
శ్రీ కుంటముక్కుల వేంకటనరసింహముగారు, ల్యాండ్ లార్డ్సు,
దొంతమ్మూరు.

శ్రీ

# వర్ణనరత్నాకరము

3-4 భాగములు.

శ్రీమదభినవాంధ్రభోజ పీఠికాపురమహారాజ

సూర్యరాట్ప్రభుపోషితుఁడగు

## దాసరి లక్ష్మణస్వామిచే

సమకూర్పఁబడి

పండితులచేఁ బరిష్కరింపఁబడినది.




మొదటికూర్పు 1000.

పీఠాపురము.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల.

1930.

 [ వెల రు|3-0-0 లు.

స్ఖాలిత్యములు లేకుండఁ బరిశీలించి వలయుచోట్ల సముచితరీతిసవరించి నాయీగ్రంథాభరణమునకు వన్నెపెట్టిన విమర్శకాగ్రేసరులును, శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలాధికారులును అగు శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారికిని, ప్రథమ ద్వితీయ భాగములకుఁ బీఠికవ్రాసి ప్రోత్సాహమొసఁగిన సహృదయులును, శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థాన ప్రధానపండితులును (మేనేజరు) అగు శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారికిని, పత్రికాముఖమునఁ దగుసాహాయ్యమొనరించి నాయుద్యమమున కెంతయుఁ దోడ్పడిన ఆంధ్రపత్రికాధిపతులు శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, సమదర్శనీపత్రికాధిపతులు పింజల సుబ్రహ్మణ్యశెట్టిగారు, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయాధికారులు వేంకటపార్వతీశ్వరకవులు మున్నగు ప్రముఖులకును, భాషాసేవకుఁడనగు నాయందలి వాత్సల్యమున ధనాభిప్రాయాదు లొసంగి నాకత్యంతోత్సాహ మొనఁగూర్చిన మహామహులందఱకును వినయపూర్వకవినతు లొనరించుచు నా యల్పజ్ఞతవలనఁ గలిగిన తప్పుల మన్నించి యొప్పుల గ్రహింప విబుధుల వేఁడుకొనుచున్నాఁడను.

పీఠికాపురము.
ది 28—5—30

ఇట్లు
దాసరి లక్ష్మణస్వామి.

# సుభాషితగ్రంథప్రశంస.

ఆంధ్రగీర్వాణములలోఁ బరస్సహస్రాబ్దములనుండి సంధాన (సంకలిత) గ్రంథములు గలవు. ప్రాచీనకాలమునుండి యిట్టిగ్రంథములు సంధానింపఁబడుట వానిప్రాముఖ్యమునకు, వానియెడఁగల రసికాభిలాషమునకు నుజ్జ్వలోదాహరణము. ఇట్టి సుభాషితరత్నభాండారములు రెండువిధములు. 1 "భర్తృహరిసుభాషిత త్రిశతి" మున్నగు గ్రంథములవలె నొకకవియే వివిధవిషయములపైఁ జెప్పిన సుభాషితసుధాత్మకములగు మధుకోశములు. 2 "సుభాషితహారావళి" మొదలగువానివలె వివిధవిషయములపై బహుకవీశ్వరులు చెప్పిన సూక్తులు గలగ్రంథములు. లక్ష్మణస్వామిగారి "వర్ణనరత్నాకర" మీవిధము.

సంధానగ్రంథము నాంగ్లమున 'ఏన్థొలజీ' (Anthology) అని యందురు. ఈపదము పుష్పాపచయమను నర్థము నొసఁగు నొక "గ్రీక్" భాషాధాతువునుండి పుట్టినది. ఇట్టి మహాగ్రంథసంధాన మతిమాత్రకాలవ్యయప్రయాససాధ్యమనియుఁ దత్జ్ఞుల మస్తోకమనియుఁ బండితేతరులకు దురవగాహముగా నుండును. 'గ్రీక్', 'లాటిన్' 'ఇంగ్లీషు' మొదలగు నైరోపీయభాషలలో ననేకసుభాషితగ్రంథములు గలవు. "గ్రీక్" భాషలోని సుభాషితగ్రంథ మొకటి క్రీ. పూ. ప్రథమశతాబ్దిలోఁ గూర్పఁబడినది.

సముపలబ్ధగీర్వాణసుభాషితరత్నకోశములలోఁ 'కవీన్ద్రవచనసముచ్చయము' ప్రాచీనతమము. దీనిసంధానకాలము క్రీ. శ. 1200 కుఁ బరముకాఁజాలదని దానిం బ్రచురించిన 'తామస్' పండితుఁడు వ్రాసియున్నాఁడు. ఈగ్రంథపీఠికలోఁ బ్రాచీనకవిపుంగవసంకలితములగు నిరువదిమూఁడు సుభాషితగ్రంథములు పేర్కొనఁబడినవి. వటుదాససూనుఁడగు శ్రీధరదాసుఁడు క్రీ. శ. 12 వశతాబ్దిలో "సదుక్తికర్ణామృతము" ను సంకలనము చేసెను. ఇందు కొంతభాగము కలకత్తాలోఁ బ్రకటింపఁబడెను. మహామహోపాధ్యాయ పండిత రామావతారశర్మపాండేయ (M A.) మహోదయులీగ్రంథముం బూర్తిగాఁ బ్రచురింపఁబోవుచు, గీర్వాణవిద్వల్లోకదౌర్భాగ్యముచేఁ

గీర్తిమూర్తిని ధరించిరి. ఇందు 446 కవుల సూక్తులు గలవు.

శార్ఙ్గధరుని 'శార్ఙ్గధరపద్ధతి' (క్రీ.శ. 14 వశ.) యందు 264 కవులసుభాషితములు గలవు. వల్లభదేవుని 'సుభాషితావళి' (క్రీ. శ. 15 వశ.)లో 350 కవితల్లజులకావ్యభూషణములనుండి శ్లోకరత్నములు సంగ్రహింపఁబడినవి. ఇంకను ముద్రితసంస్కృతసుభాషితగ్రంథములలోఁ బ్రధానములు, హారిహారసుభాషితము, సుభాషితరత్నసందోహము, సుభాషితరత్నాకరము, సుభాషితరత్నభాండాగారము; అముద్రితములు బరశ్శతము లనవచ్చును.

మహారాష్ట్రప్రాకృతములోఁ బ్రథమసంధానగ్రంథమగు 'హాల' సంకలిత "గాథాసప్తశతి" క్రీ శ. ప్రథమశతాబ్దిలో సంకలనము చేయఁబడెను. [Vide 'Modern Review' Oct. 1919 Page 407] రెండవది జైనజయవల్లభసంకలితమగు "వజ్జాలగ్గము" బౌద్ధగ్రంథమగు "సుత్తనిపాతము" పాళీభాషలోని సుప్రాచీనసంధానగ్రంథములలో నొకటి.

ద్రావిడభాషలో "పురనునురు" అనుసుభాషితగ్రంథము రమారమి 18 శతాబ్దములక్రిందటఁ గూర్పఁబడినట్లు తెలియుచున్నది. [Vide 'Triveni' Vol. I. No. 2 for March & April 1928; Page 128; footnote.]

ఆంధ్రమున క్రీ. శ. 15 వశతాబ్దిలో మడికిసింగన "సకలనీతిసమ్మతము"ను సుభాషితగ్రంథముం గూర్చెను.

పూర్వోక్తగ్రంథములకంటె 'వర్ణనరత్నాకరము' లో ననేక విశేషములు గలవు. ఉద్ధృతపద్యముల కాకరములు (Location)—ఆశ్వాసపద్యసంఖ్యలు—గలవు. కవికాలక్రమానుసారసంకలనమానుషంగికకవితావిమర్శకులకుఁ గవితాపరిణామవిచారకులకుఁ గరం బుపకారకము. అనన్యసామాన్యమగు లక్ష్మణకవి భగీరథప్రయత్న మత్యంతాభినంద్యము.

ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులు,
(ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషదధ్యక్షులు, విజయనగరము.)

శ్రీ

# వర్ణనరత్నాకరము

## పండితాభిప్రాయములు.

M. R. Ry.

C. Ramalinga Reddy Garu,

Vice Chancellor, Andhra Uuniversity,

BEZWADA.

My Dear Sir,

Many thanks for the copy of your valuable book "Varnana Ratnakara" which you were good enough to present to me. It is an admirable compilation which will give people a fairly good idea of the range and beauty of Telugu poetry.

మ. రా. రా. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు,

వైస్ ఛాన్సిలర్, ఆంధ్రవిశ్వవిద్యాలయము

బెజవాడ.

అయ్యా !

మీరు దయచేసి నాకుఁ బంపిన 'వర్ణనరత్నాకరము'ను మీ యమూల్యగ్రంథ మందినది;

పెక్కువందనములు.

ఆంధ్రకవిత్వముయొక్క విస్తీర్ణతయెట్టిదో సౌందర్యమెట్టిదో చాలవఱకు లోకమునకుఁ దెలియఁజేయఁగలుగునదియు మెచ్చుకొనఁదగినదియు నగు కూర్పు మీ గ్రంథము.

ఆంధ్రపత్రికాధిపతులు మ. రా. శ్రీ దేశోద్ధారక
కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, చెన్నపట్టణము

మహారాజశ్రీ దాసరి లక్ష్మణకవిగా రాంధ్రలోకమునకు చిర పరిచితులు. వారు రచియించిన నాటకాదిగ్రంథములు వారిరచనా సామర్థ్యమును తెలుపుచున్నవి. వారు చిరకాలమునుండియును చాల పరిశ్రమచేసి ఆంధ్రగ్రంథములను చదివి పరిశీలించి "వర్ణనరత్నాకరము" అను గ్రంథమును సిద్ధముచేసిరి. ఆగ్రంథమునందు మహాకవులు రచియించిన కావ్యాదిగ్రంథములనుండి కాలానుక్రమణముగ వివిధ వర్ణనలను పరిశోధించి ప్రత్యేకశీర్షికలక్రిందను చేర్చిరి. ఈగ్రంథావలోకనమువలన నాంధ్రవాఙ్మయమంతయును మనోగోచరమయిసహజానందము గలుగఁగలదు. వీరేరితీసిన పద్యములన్నియును రత్నములవలె ప్రకాశించుచు మనోహరముగ నున్నవి. ఈగ్రంథము బహుగ్రంథముల సంపుటిగ నున్నది. గ్రంథమును కలిగియున్నవారందఱును మహాకవుల సాంగత్యలాభమును బొందఁగలరు.

---

మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులుగారు
చెన్నపట్టణము.

సరస్వతీలోకమున ఎన్నివిధముల విలసించునో కని ఎప్పటికప్పటి కాశ్చర్యానందము లనుభవింపవలయునేగాని అన్నివిధములును ఊహకు ఎవరికిని ముందుగా అందవు. అట్టివిశేషములలో శ్రీ దాసరిలక్ష్మణస్వామిగారి మహాభాగ్యమొక్కటి. వీరికిమున్ను వీరివలెనే బహు గ్రంథగతవిషయములను ఏకత్ర సంకలించి లోకులకొసంగినవారు సర్వ విషయములను సంపూర్ణముగా పరామర్శించినవారు గారు. వీరు అట్లు ఏకదేశమాత్రప్రదర్శనముచే తనియక ఈభాషయందు వర్ణనలు ఎన్ని

విధముల నెలకొనియున్నవో యన్నిటికిని సమగ్రముగా సకలగ్రంథముల నుండియు వాఙ్మయమును ఉద్ధరించి ఒక్కధర్మహర్మ్యమున నిలిపినారు. ముద్రితాముద్రితములగు పరశ్శతగ్రంథములనుండియు వర్ణనలను కూర్చినారు. ఇన్నిగ్రంథముల యుపలబ్ధికి వీనియందు తాటియాకు వ్రాతలలోఁ గూడ నున్నవానినిసయితము ఇంతబాల్యములోనే చదివి రసమెఱిఁగి సమకూర్చుట నాకు ఆశ్చర్యకరముగా నున్నది. ఈయుద్యమము యొక్క ప్రయోజనము కష్టమెఱుఁగనివారికి తెలియదు. ఇట్టిగ్రంథ మొకటి నాకు చిరకాలమునకు మున్ను దొరకియుండిన మదీయ నైషధవ్యాఖ్యకు ఆముక్తమాల్యదావ్యాఖ్యకును మిక్కిలి సాయమయి యుండెను. దీనియందు కవులకాలక్రమమునుగూడ పాటించినారు. అది కరిమపేక్షణీయము. ఇది గ్రంథకోశములందును పండితులకేమి విద్యార్థులకేమి కవులకేమి ఎల్లవారికిని భాషాదేవతయొక్క పండిన పెరటికల్పకముగా నుండునని చెప్పనక్కఱ లేదు.

---

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకులును
శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుసంపాదకులును రిటైర్డుడిప్యూటి కలెక్టరుగారును నగు మహారాజశ్రీ జయంతి రామయ్యపంతులుగారు,

ముక్త్యేశ్వరము.

దాసరి లక్ష్మణస్వామిసంకలితమగు "వర్ణనరత్నాకర" మను గ్రంథ మచ్చుటచ్చుటఁ జూచినాఁడను. ఇందనేకములు రసవంతములగు పద్యములు గలవు. దీనివలన నాంధ్రకవిత్వము కాలక్రమమున నెట్లు మాఱినదో తెలిసికొనుట కవకాశము కలుగునని నాయభిప్రాయము. ఉద్యమము మంచిది.

---

మ. రా. శ్రీ చిలుకూరి నారాయణరావు, ఎమ్. ఏ. ఎల్. టి.
అనంతపుర దత్తమండలకళాశాలయందు సంస్కృతాంధ్రి
కర్ణాటక భాషాధ్యాపకులు.

మహారాజశ్రీ దాసరి లక్ష్మణస్వామిగారు రచించిన "వర్ణన రత్నాకరము" అనేపుస్తకమును చూచినాను. అందులో ఒక్కొక విషయమునుగురించిన పద్యములనన్నిటిని ఆయాకవులకాలము ననుసరించి ఒక చోటికిచేర్చి ఉంచినారు. ఇట్టిగ్రంథములు ఇంగ్లీషులో ఉన్నవి. తెనుగులోకూడా కొన్ని ఉన్నవికాని, అవి అంత విపులములుగా లేక పోవడముచేత ఉపకారకములు కావు. శ్రీ లక్ష్మణస్వామిగారు ఈ గ్రంథమునసేకసంవత్సరములనుంచీ, ఎంతో శ్రమపడికూర్చి, ఆంధ్రులకు గొప్ప ఉపకారము చేసినారు. ఈపనిలో ఉండేకష్టము సాధారణ జనులకు బోధపడదు. ఇట్టి ఉద్గ్రంథము లింకా ఎన్నో తెనుగులో బయలుదేరవలసిఉన్నవి. ఇట్టి గొప్పపనులకు పూనుకొనేవారికి శ్రీ లక్ష్మణస్వామిగారు మార్గదర్శకులయినారు. వారుపడినశ్రమకు ఆంధ్రులు కృతజ్ఞులుకాగలరని నాఅభిప్రాయము. వారిట్లే ఇంకను కృషిచేసి ఆంధ్రసారస్వతమునకు వన్నె తెత్తురుగాక అని కోరుచున్నాను.

---

మ. రా. శ్రీ ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుపంతులుగారు,
చెన్నపురి.

మదీయగ్రంథప్రకటనమున నాకిహపరలోకముల శాశ్వతస్థానంబు గలిగించి యభినవభోజుఁడని విఖ్యాతిగడించిన శ్రీ పిఠాపురమహారాజులవారి కాశ్రితుండను, నాకుఁ బరమమిత్రుండైన క్రొత్తపల్లి పద్మనాభశాస్త్రులవారిచే సాహిత్యాన్నప్రాశము గొన్నవాఁడును నైన దాసరి లక్ష్మణస్వామిచే గ్రథితంబైనవర్ణనరత్నాకరము కవితాకామినికిఁ

గ్రోత్రయుంకువలు సంపాదింప సాహిత్యమకరాలయంబున దేవులాడు వారికిని సాహిత్యరసాస్వాదనతత్పరులకు నుపకారంబగుట యీప్రయత్న మత్యంతశ్లాఘ్యము.

ఉదాహృతపద్యముల కాకరములు వ్రాయుట యత్యంతావశ్యకము. ఈగ్రంథము కేవలాత్యంతప్రయాసకృతమనుటనిస్సంశయము. దీనికై దీర్ఘకాలము శ్రమించి యముద్రితగ్రంథములను సేకరించి పఠించి పద్యరత్నములేఱిన వీరియోర్పు, నోపిక, సాహిత్యపటిమయు శ్లాఘ్యము. ఇది బాలకవులకేగాక ప్రౌఢకవులకును భావమార్గప్రదర్శనంబునను సూచనలయందును మిక్కిలి తోడుపడఁగలదు. వినోదపఠనమునకును దగియున్నది గావున నిది సమస్తజనులకు నాదరణీయమగు.

---

బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, శతావధానులు
(తిరుపతివేంకటకవులు) కడియము.

శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారు తాము ప్రయత్నపూర్వకముగ బహుగ్రంథములనుండి సంగ్రహించి, రచించి, ముద్రింపించుచున్న వర్ణనరత్నాకరగ్రంథము నాకుఁజూపిరి. స్థాలీపులాకన్యాయమునఁ జదివిచూచితిని. ఈపుస్తకము తెలుఁగుబాసలోఁ బాండిత్యము సంపాదించుకోఁగోరు భాషివిద్యార్థులకుఁ, గవులకు, విమర్శకులకు నత్యంతోపకారకంబని ఇదివఱకు నభిప్రాయములొసఁగిన పండితులయభిప్రాయములయందలి సంగతులతో నేనుగూడ నేకీభవించుచున్నాను.

---

మహోపన్యాసకులును, విమర్శకులు నగు
బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.

శ్రీయుత దాసరిలక్ష్మణస్వామిగారు విరచించిన ‘‘వర్ణనరత్నా

కర " మను గ్రంథరాజము నక్కడక్కడ వినియున్నాను. ఇది యాంధ్ర సారస్వతమున కమూల్యాలంకారముగ నుండుననుటకు నేవిధమగు సందియము లేదు ఇయ్యది కవులకు, విమర్శకులకు, చరిత్రప్రియులకు, భాషాభిమానులకు మిగుల సాహాయ్యకారిగా నుండుటయేగాక పామర జనులకుఁ గూడ నానందదాయకమ్మును, వివేకప్రదమ్మును నై యలరారుచుండును. ఈయుద్గ్రంథమును విరచించుటకై గ్రంథకర్తగారు తీసికొనినశ్రమ కడుంగడు శ్లాఘనీయము. సారస్వతవిషయములగు సర్వవిశేషములునుగల యిట్టి యుద్గ్రంథములిదివఱ కాంధ్రమున లేవు. నేఁటికాకొఱఁత తీరినదని చెప్పుట కెంతయు సంతసముగనున్నది.

---

కవిసార్వభౌము బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు
రాజమండ్రి.

వర్ణనరత్నాకరము. ఇది శ్రీ దాసరిలక్ష్మణస్వామిసంకలితము. ఇందు నన్నయ మొదలుకొని వీరేశలింగకవిపర్యంతమునగుకవులు రచియించిన 300 గ్రంథములనుండి సుమారు 1500 వర్ణనాంశములు చేర్పఁబడినవి. అందుఁ జివర బంధగర్భచిత్రాదికవిత్వములోనగు కొన్ని కవితాచమత్కారములును జేర్కొనంబడినవి. ఈగ్రంథ మొక్కఁడు చే నిడికొన్నఁ గవులగ్రంథములన్నియుం జదివిన ఫలంబు గలుగక మానదు. కవులకును గవితాప్రియులకు నిది కల్పవృక్షము. ఇంతకుము న్నిట్టికార్యమునకుం గడంగినవారు కొందఱు గలిగిరిగాని వారువీరివలెఁ గృతకృత్యులు కాఁజాలకపోయిరి. ఈకృషికి 15 సంవత్సరములు పట్టినట్లు తెలియుచున్నది. అంతపని యీసంకలనమందున్నదని గ్రంథమే చెప్పుచున్నది. సమగ్రవర్ణనాంశములతో నలరారు నీగ్రంథము సర్వజనాదరణీయంబగునని నాయభిప్రాయము.

చాటుపద్యమణిమంజరీత్యాదిగ్రంథప్రకాశకులు ఉభయభాషాకోవిదు

నగు మ. రా. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చెన్నపురి.

అయ్యా! సంస్కృతమునఁ బద్యరత్నభాండాగారమువలె తెలుఁగున మీరు సంధానించుచున్న వర్ణనరత్నాకరము ప్రచారముఁ గాంచఁగలదు. కవులకు, విమర్శకులకు, విద్యార్థులకు నిది కరము సాహాయ్యకరము. కవికాలము, కావ్యాశ్వాసపద్య చేర్చుట యత్యావశ్యకమే. ఇది యెంతో పరిశ్రమ చేసినఁగాని కానిపని. అసామాన్యమయిన మీ పరిశ్రమ నభినందించుచున్నాఁడను.

---

ప్రబంధమణిభూషణాద్యనేకసద్గ్రంథసంపాదకులు

విస్మృతకవిగ్రంథప్రకాశకులు **విమర్శకాగ్రేసరులు** నగు

మ. రా. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, **M.A.** చెన్నపట్టణము.

శ్రీమద్దాసరి లక్ష్మణస్వామిగారిచే రచింపఁబడిన వర్ణనరత్నాకరము నచ్చటచ్చటఁ జూచినాఁడను. ఇందుదాహరింపఁబడిన పద్యములకు మూలగ్రంథముల నామములను విషయసూచికను దిలకింపఁగా వీరు బహుకాలము బహుగ్రంథములఁ జాలఁ బూనికతోఁ బరీక్షించి మంచిమంచి ప్రకరణములలోని యుత్కృష్టపద్యములనే యేఱియున్నారని తెలియుచున్నది. నేటికాలపుస్థితిననుసరించి బహుగ్రంథములు సాంతముగఁ జదివి నానాకవుల నానావిషయముల మనోభావముల వ్యక్తులెఱుంగఁజాలని వారికి నిక్కముగా నిట్టిగ్రంథములు నిధిప్రాయములు. ఇందు దేశకాలస్థితులననుసరించి కవికాలనిర్ణయములును బద్యములు గ్రహింపఁబడిన ప్రకరణములును జూపఁబడియె. భాషయందు గ్రంథకర్తగారికిఁగల యాదరణమును నేతద్భాషాసేవయుఁ దప్పక యెల్లరు మెచ్చుకొనుదురని నమ్ముచున్నాను.

విజ్ఞానచంద్రికాగ్రంథమండలీప్రతిష్ఠాపకులు
మ. రా. శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు, చెన్నపట్టణము.

శ్రీయుత దాసరి లక్ష్మణకవిగారాంధ్రులయుపయోగార్థము ఆంధ్రవాఙ్మయమునంతను పరిశోధించి కూర్చుచున్న "వర్ణనరత్నాకరము" అనుగ్రంథమును చూచి చాల సంతసించితిని. ఇట్టిపనిచేయుటకు నెంతయు సహృదయతయుఁ బాండిత్యమును ఓపికయుఁ గావలయును. ఇయ్యది కవిత్వముచెప్పఁదలఁచినవారికిఁ గల్పవృక్షమువంటి దనుటకు సందేహములేదు. వాఙ్మయచరిత్రయు, ఆంధ్రకవితాభివృద్ధి యెట్లయినదియుఁ దెలిసికొనఁగోరువారికిని ఈగ్రంథము ఎక్కువగా నుపయోగించుననుటకు సందేహములేదు.

---

రావుసాహెబ్ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు,
బి. ఏ. పర్లాకిమిడి.

మీరు ప్రకటించు "వర్ణనరత్నాకరము" చూచినాను. ఇది సుభాషితరత్నభాండాగారము వలెనే అనేకవిధములుగ ఆంధ్రులకు ఉపయోగం కాగలదని నానమ్మకం. ఇందులో అముద్రితగ్రంథముల నుండికూడా పద్యములెత్తి ప్రకటించినారు. తాళపత్రగ్రంథములు సులభముగాదొరకనివారికి ఈపద్యములు చదవగానే ఆగ్రంథముల గురించి కొంతవరకు తెలుసుకొనుటకు అవకాశము కలుగుతుంది. ఆంధ్రసారస్వతములోఉన్న వర్ణనరత్నము లన్నిటిని సంగ్రహించి ఆంధ్రులకు మీరందజేసిరి. ఈపని ఎంతకష్టమైనదో అనేకగ్రంథములు పరిశీలిస్తూఉన్నవారికి బోధపడుతుంది. మీపరిశ్రమలవల్ల ఆంధ్రుల కెంతో మేలుకలుగవచ్చునని నానమ్మకం.

---

ఆంధ్రభారతీతీర్థప్రధానులు మ. రా. శ్రీ బుర్రా శేషగిరి
రావుగారు, ఎం. ఏ. విజయనగరము.

మహారాజశ్రీ దాసరి లక్ష్మణస్వామిగారు సమకూర్చిన "వర్ణన రత్నాకరము" అనే తెలుగుగ్రంథములో కొన్ని భాగములు నాకు వినిపించి నాయభిప్రాయము కోరినారు. ఆంధ్రకావ్యమహోదధినుండి యేరినజాతిరత్నము లీవర్ణనలు. ఇవి పలువిధములై ఆంధ్రకవితాచరిత్ర పరిణామమును సూచించును. ఈవర్ణనలు గల యసలుకావ్యములు శృంగారప్రధానములగు ప్రబంధములు. ఈప్రబంధములు పాడినపాటనే పాడుచుండుటచేత నేమో మనుచరిత్ర వసుచరిత్ర కళాపూర్ణోదయములవంటివిమాత్రము ప్రచారములోనుంచి మిగిలినవాటిని ప్రొయ్యి నిడవలయునని కొందఱుమానీయు లందురుగాని ఆంధ్రదేశమందలి దేవాలయకట్టడములవలె ఈకావ్యములుకూడ ఏకపక్కిగా నున్నప్పటికిని సమాదరణీయములును, హృదయాకర్షకములును అగు చిత్రకల్పనలతో భాషాశిల్పనైపుణ్యమునందు ప్రత్యేకతను చూపుచున్నవి. ఈసంగతి ఈకూర్పులో విశదము కాగలదు. పలువురుపండితు లిదివఱకే చెప్పియున్న ట్లీగ్రంథము కవులకు, విద్యార్థులకు, విమర్శకులకు సాహిత్యపరులకును అత్యంతోపయోగకరము కాగలదు. ఈసంఘటన ప్రయత్నము చాల ప్రశంసనీయము.

---

జాతీయ సుప్రసిద్ధాంధ్రకవులు
మ. రా. శ్రీ. వేంకటపార్వతీశ్వరకవులు, కాకినాడ.

మనోజ్ఞచిత్రంబులనెల్ల నొక్కయద్దమునఁ బ్రతిబింబింపఁజేసినట్లు మధురరసంబులనెల్ల నొక్కరసాయనంబున సమ్మేళనంబుగావించినట్లు బహుముఖంబులఁ బ్రవహించుచున్న యాంధ్రకవితాసరస్వతుల

కేక్షముఖంబుగావించిన యీ "వర్ణనరత్నాకరము" మహాత్ములగు నాంధ్రమహాకవులనందఱ నొక్కచోఁ బ్రదర్శించు దివ్యజ్ఞానదీపము వలె నియ్యాంధ్రలోకమున వెలయఁజాలియున్నదని చెప్పుట యతిశయోక్తి కాదని భావించుచున్నాము.

అతిప్రయత్నమున నిట్టిసంఘటనముంగావించిన శ్రీ దాసరి లక్ష్మణస్వామిగా రాంధ్రులకృతజ్ఞత కెంతయుఁ బాత్రులైయున్నారు. చిన్నతనమునుండియు నిట్టి భాషావిషయికసత్కార్యములయందే పాటుపడుచున్న వీరికిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యభాగ్యములొసఁగుఁగాక

---

అనేక నాటకాదిగ్రంథకర్తలు సుప్రసిద్ధవక్తలు నగు

మ. రా. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, రాజమండ్రి.

పీఠికాపురవాసులగు శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారిచేత సమకూర్పఁబడిన "వర్ణనరత్నాకర" మను గ్రంథమునఁ గొన్ని పద్యములు విని దానియేర్పాటునంతయు గ్రంథకర్తగారివలన నాకర్ణించి మిక్కిలి సంతసించితిని. అనేక నూతనాలంకారములతో విరాజిల్లుచున్నయీయాంధ్రసారస్వతమున నిట్టిమహాగ్రంథము లేకపోవుట గొప్పలోపము. అనేక ముద్రితాముద్రితగ్రంథములను పరిశోధించి చిరకాలము శ్రమపడి యాంధ్రవాఙ్మయమునంగల యాలోపముఁ దీర్చినందుకు లక్ష్మణస్వామిగారి కాంధ్రులు కృతజ్ఞులయి యుండవలెను. ఈమహాగ్రంథ మెవ్వని యొద్దనుండునో యాతఁడు సకలాంధ్రకవులమధ్యమున గూర్చుండి వారితో ముచ్చటించినట్లే యానందపారావారమున దేలుచుండును. సకలపుష్పలతాభిరతమైనయుద్యానవనమట్లు సర్వరత్నగ్రథితమైనహారమట్లు సకలవస్తుసంపూర్ణమైన యంగడియట్లు పాఠకులకీగ్రంథము మహామోదప్రదమై యమూల్యమై మనోరథపూరకమై విరాజిల్లుఁగాక.

మ॥ రా॥ శ్రీ శేషాద్రిరమణకవులు, శతావధానులు,
నందిగామ, కృష్ణాజిల్లా.

శ్రీయుత దాసరిలక్ష్మణస్వామిగారుకూర్చిన వర్ణనరత్నాకరము పఠనార్హమనుటలో సంశయము లేదు. మహాకవుల యమూల్యభావములు సుస్వరూపమునొందునవకాశము వర్ణనావసరములయందె తటస్థించును. కాన ప్రబంధసముద్రములో వర్ణనపద్యములు రత్నములె. అట్టిరత్నముల నుద్ధరించి యాంధ్రభాషాసేవకులకు, బంచి యొసంగ సాహసించి కృతార్థుఁడైన యీలక్ష్మణస్వామిగారు ఆంధ్రలోకమున శాశ్వతకీర్తిఁ గడించిరి.

ముద్రితాముద్రితగ్రంథములనుండి వర్ణనాంశములయందుగల రసవత్తరములగుపద్యములనేరి కవికాలాదికముల నిరూపించి సంకలితం బొనరించుటలో గ్రంథకర్తగారు మిగుల శ్రమపడి యాంధ్రమహాజన కృతజ్ఞతాపాత్రులైరి. భగవంతుఁడీగ్రంథకర్తగారికిఁ జిరాయుర్భాగ్యములఁ బ్రసాదించి యుత్తమగ్రంథముల రచింప ననుగ్రహించుఁగాక.

---

శ్రీ విజయనగరంమహారాజావారి ఆగ్నేయపాఠశాలా ప్రధానసంస్కృతోపాధ్యాయులగు మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు.

శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారిచే సంకలితమయిన వర్ణనరత్నాకరమును నే నచ్చటచ్చట జదివియున్నాను. ఇట్టిగ్రంథ మొకటి లేదనుకొరత నీయాంధ్రలోకమున శ్రీగ్రంథకర్తగారు పూర్తి జేసినందుకు మిగుల సంతసిల్లుచున్నాను. ఈగ్రంథము కవనము జెప్పు వారికి నితరాంధ్రపండితులకు మిక్కిలి యుపయోగకరమని తలంచుచున్నాను. గ్రంథసంకలన మత్యద్భుతముగా నున్నది. ఇది లోకమునకు మహోపకారము జేయును.

శ్రీ పీఠికాపురసంస్థానపండితులు వ్యాఖ్యాతలు నగు
బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిలుగారు.

మ. రా. శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారు తెలుఁగుగ్రంథము లన్నిటినుండి యేర్చి కూర్చిన 'వర్ణనరత్నాకరము' ను పొత్తమును నేనక్కడక్కడఁ జూచితిని. సంస్కృతభాషయందు మున్నిట్టికావ్యమును బద్యరత్నభాండాగారమనుదానిని జాలంగాలముక్రిందటనేఁ జూచితిని. అప్పటినుండియు దెనుఁగున నిట్టికావ్యముండునేని మిక్కిలి యుపకరించునుగదాయని తలఁచుచుంటిని. చిరకాలమునకు నేనట్టికావ్యమును జూడగల్గినందులకు మిక్కిలి సంతసించుచున్నాను. ఈగ్రంథమును మిక్కిలి జాగ్రత్తగాఁ జూచినచో నించుమించుగా నాంధ్రగ్రంథముల రచియించిన మహాకవులందఱియాశయములు గ్రహింపవచ్చునని నాయభిప్రాయము. ఇందు శృంగారాదిరసములన్నియు ప్రసాదాదిగుణములన్నియు మొదలగు కావ్యలక్షణములెల్ల నుండఁబోలునని తలంచెదను. ఇన్ని మహాగ్రంథములను సంపాదించి చక్కఁగఁబరిశీలించి ప్రశస్యములగు వర్ణనములఁగూర్చి విభజించి వ్రాయుట మిక్కిలి శ్రమాకరమని నిస్సంశయముగాఁ దోఁచును. ఇట్లు మిక్కిలి శ్రమపడి యిట్టి మధురతరగ్రంథము నాంధ్రలోకమునకుఁ గల్గఁజేసిన వీరు మిక్కిలి శ్లాఘ్యులని నాయభిప్రాయము.

---

మహారాజశ్రీ కూచి నరసింహముపంతులుగారు బి. ఏ.
రిటైర్డు హెడ్‌మాస్టరు పిఠాపురం హైస్కూలు.

దాసరిలక్ష్మణస్వామిగారిచే సంకలితమైన "వర్ణనరత్నాకరము" లోని కొన్ని పద్యములు చదివినాము, మిగుల మనోహరముగా నున్నవి. ఇది విశేషవివేచనాప్రయాససాధ్యమైనదని. ఈగ్రంథము సమస్తభాగ

పదార్థము లొక్కచో సమకూర్చిపెట్టినయాపణమువలె విద్యాభిలాషులగు పెద్దలకుఁ బిన్నలకుఁగూడ మిక్కిలి యుపయుక్తమై నాతిశ్రమముతో వారికిఁ జిత్రవిచిత్రభావభాషానందముల నందించుననుటకు సందేహము లేదు. ... ... ... ...

---

ఆంధ్రగీర్వాణభాషావిశారదులు, కవితల్లజులు నగు
మ. రా. శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు, విశాఖపట్టణము.

గీ. ఆంధ్రసాహిత్యముకురమ్ము ♦ నాంధ్రకవిత
యనెడి పైఁడివన్నెలఁ గనుఁ ♦ గొనఁ గనమ్ముఁ
గవులకును రసికులకును ♦ గల్పకమ్ముఁ
బ్రథితవర్ణనరత్నాక♦రమ్ము సుమ్ము.

---

మ. రా. శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు
జమీందారుగారు, అష్టావధానులు, ఏలూరు.

చ. ఒకనికి నారికేళములు ♦ నొక్కనికిం గదళీఫలంబు లిం
కొకనికి ద్రాక్ష యిష్టము♦యగుచుట నందఱికిన్ ఘనంపు టు
త్సుకత ఘటించు వర్ణనల♦తో ఘలతోయముతో సుధార్ణవ
ప్రకటితకీర్తిసంపద వి♦రాజిలు నీకృతి రాజమొంతయున్.

మత్తేభవృత్తమాలిక.

ఘనుఁడౌ నన్నయభట్టసత్కవిలస♦ద్గానంబుతో నెఱ్ఱనా
ర్యనితాంతోన్నతవాక్యవీచికలతో ♦ రంజిల్లు నామంత్రి తి
క్కనరమ్యాన్వయసద్గభీరరచనా♦కాండంబుతో నల్ల పో
తనవక్త్రోదితపద్యరత్నములతో ♦ నాభాస్కరస్తవ్యపా
వనపాదంబులతోడ ధూర్జటినుశో♦భక్తిధ్వని వ్యాప్తితో

జను శ్రీనాథనవీనశయ్యాదు జొక్కా♦టంబై విరాజిల్లు సో
మనిరాకందగునుబ్బుతో విమలుఁడౌ ♦ మూర్తిప్రతిష్ఠుండు రా
మునియాశ్లేషవిశేషపోషణముతోఁ ♦ బాల్పొందు తిమ్మన్నదా
రిని బెన్నన్నవచఃప్రవాహములతో ♦ శ్రీరామలింగప్రథా
నినవీనామృతకల్పనేర్థజయడిం♦డీరంబుతో వీరభ
ద్రునిసత్త్వప్రభతోడ రుద్రునిమహా♦మాక్షప్రయోగంబుతో
డా నృసింహోజ్జ్వలదూరదర్శనపటి♦ష్టత్వంబుతో రంగనా
థనృపాలామలశబ్దశబ్దములతోఁ ♦ దమ్మయ్యపూర్ణార్థగుం
భనతో సూరనసత్పథప్రచురశో♦భాయుక్తసంచారతన్
వినుతింగాంచుచు లోకజాలమున వ్యా♦ప్తింగాంచి యీనవ్యవ
ర్ణనరత్నాకర మెల్లకాలము బుధా♦నందంబుఁ జేకూర్చుతన్.

మ. అల రత్నాకర మేమియిచ్చు వలవే♦యన్ వల్లెవేయంగని
మ్ముల రత్నాకర మిద్దియిచ్చు నమృతం♦బుం బద్యరత్నంబులం
బలుభంగంబులకాలయంబది; విప♦ద్భంగంబుఁ గావించు ను
జ్జ్వలరత్నాకరమిద్ది; దీనఁదరియిం♦పంజాలు లోకంబొగిన్.

డాక్టరు సీతారామరాజుగారు, జొన్నవలస.

ఉ. ఎన్నిక కెక్కు పద్యము ల♦నేకము గూరిచి వర్ణనాబ్ధివి
ద్యన్నికరంబు గన్గొని సె♦బాసనునట్లొనరించి తెంతయే
నిన్నను మెచ్చఁగా వలదె ♦ నీఋణ మీఁగఁగలేను పాఠకుల్
సన్నుతిఁగాంచు నీయశ మ♦జస్రము దాసరిలక్ష్మణాహ్వయా.

క. పురుషార్థంబులు నాలుగు
కరతలధాత్రియనుబోలె♦ ఘటియిల్లును నీ
వరవర్ణనరత్నాకర
మునుతరభక్తిన్ బఠించు ♦ యోగ్యుల కెల్లన్.

మ. రా. శ్రీ పప్పు మల్లికార్జునరావుగారు, బి. ఏ.
డిప్యూటీతహసీల్‌దార్, పిఠాపురము.

శ్రీయుత దాసరిలక్ష్మణస్వామిగారిచే సమకూర్చఁబడిన "వర్ణన రత్నాకరము"ను తిలకించినాఁడ. అయ్యది భాషాయోష కొక యమూల్యభూషణం బనుటకు సందియము లేదు. పూర్వకవు లందఱు సభ చేసియుండి యొక్కొక్క విషయము పోటాపోటిగ వర్ణించుచున్నట్లు చదువరుల కీగ్రంథరాజము చదువుపట్ల స్ఫురింపఁజేయును. ఇది క్రొత్తవారికి నాంధ్రగ్రంథములయెడ నభిరుచి జనింపఁజేయుచుఁ గవులకును, వ్యాఖ్యాతలకును, బరమప్రయోజనకారిగ నుండుననుట నిర్వివాదాంశము. మఱియు వర్ణనలు కాలక్రమము ననుసరించియే యుద్ఘాటింపఁబడుటచే మన పూర్వు లొక్కొక్కవిషయ మెట్లు పెంపు చేసి క్రమముగా వర్ణించినదియుఁ దెలిసికొనుట కవకాశము గలుగుచున్నది. ఇట్లు వ్రాయుట చాల దుర్ఘటమగువిషయ మనుటలో భిన్నాభిప్రాయ ముండదు. ఎన్నియోరోజులు శ్రమపడి ఎన్నియో గ్రంథములు పరిశీలించి హృద్యమగువర్ణనలయందు నభిరుచి కలిగియుండి వాని నొక్కచోఁ బ్రదర్శింపఁగలిగిన యీగ్రంథకర్తగా రాంధ్రపాఠకలోకమునకు మహోపకారముఁ గావించి వారి కృతజ్ఞతకు శాశ్వతముగాఁ బాత్రులై యున్నారు.

పూర్వగ్రంథాభిమానము సడలుచున్న యీకాలములో పాతవంతములుకాని స్వతంత్రకల్పనాగ్రంథములకంటెఁ బాటుపడి రచించెడి యిట్టిగ్రంథములే భాషకు పెక్కుమడుంగు లుపకారము చేయునని నాయభిప్రాయము. ఇట్టి వింకను విరచించుటకు దేవుఁ డీగ్రంథకర్తగారి కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధు లొసంగుఁగాత.

---

మ. రా. శ్రీ సురభి తులసీదాసు నాయఁడుగారు, బి.ఎ.బి.ఎల్.
డిస్ట్రిక్టు మునసబ్, ఏలూరు.

మ. రా. శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారిచే ప్రకటింపఁబడుచున్న "వర్ణనరత్నాకరము" ను మహాగ్రంథము ఆంధ్రసారస్వతాభివృద్ధికి అత్యంతోపయోగముగా నుండును. ఆంధ్రభాషయందిట్టిగ్రంథ మిదివఱకు ప్రకటింపఁబడియుండలేదు. ఆంగ్లభాషయందును ఆంగ్లకవుల పాండితీగరిమను దెల్పుగ్రంథములు (anthologies)న్నను వర్ణనరత్నాకరమునుబోలు గ్రంథములు ప్రకటింపఁబడియుండలేదు. ముద్రితములును అముద్రితములు నైన అనేకప్రబంధములనుండి తొల్లింటికవిపుంగవుల పద్యరాజములను ఆయావర్ణనస్థానములందుఁ బొందుపఱుపఁబడినవి. ఆంధ్రకవితాకల్పవృక్షమని చెప్పదగు నీవర్ణనరత్నాకరము కవులకును, కవిత్వేచ్ఛగలవారికిని భాషాభిరుచిగలవారికిని మహోపయోగమను టతిశయోక్తి కాజాలదు. గ్రంథకర్తగారు యేండ్లును పూండ్లును పరిశ్రమగావించియుండిననేగాని యీమహాగ్రంథము నాంధ్రలోకమున కందఁజేయుటకు సాధ్యమైయుండెడిదికాదు. ఆంధ్రులును ఆంధ్రభాషాభిమానులును గ్రంథకర్తగారియెడల కృతజ్ఞులై యుండకతీరదు. వర్ణనరత్నాకరము ఆంధ్రభాషాజ్ఞానజ్యోతియై ఆచంద్రతారకము విరాజిల్లుగాక! ఈరత్నాకరమును సకలసద్గుణరత్నాకరుండును ఆంధ్రభోజుండును నగు శ్రీపీఠికాపురాధీశ్వరునకుఁ గృతియిచ్చుటెంతయుసమంజసము.

కవిభూషణ, కవిరాజ, శ్రీరాజా వత్సవాయ వేంకట
నీలాద్రిరాజుగారు, తుని.

ఉ. వ్యాకరణం బలంకరణ • వైభవమున్ రసభావపోషణ
స్వీకరణంబు వర్ణనవి • శేషచమత్కరణం బనంగ నా
నాకవికావ్యలోకమున • నాలుగుసారములందు నిందు సు
స్వీకృత మయ్యె వర్ణనవి • శేషచమత్కరణం బశేషమున్.

శ్రీమదుయ్యూరుసంస్థానాధిపతులు
శ్రీరాజా వేంకటాద్రిఅప్పారావుబహద్దరుగారు,

మహారాజశ్రీ దాసరి లక్ష్మణస్వామిగారి 'వర్ణరత్నాకర' మును జూచితిని. ఈగ్రంథము పండితులకుం బామరులకుంగూడ నుపయోగించునది. ఈకవిగారిగ్రంథము లిదివరకు కొన్ని జూచియుంటిని. ఈ గ్రంథముమాత్రము బహుకష్టముతోం బరిశోధించినశ్రద్ధయొక్క పర్యవసానము. మహాజనులీపుస్తకముం బరిశీలించునప్పుడు అనేకగ్రంథములనుండి సారముతీసి తమముందు చేటతెల్లముగాం బెట్టిన యీతద్గ్రంథ నిర్మాతృపరిశ్రమమును దలంతురుగాక.

---

బ్రహ్మశ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు, విశాఖపట్టణము
శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారు గూర్చిన వర్ణరత్నాకర

మను గ్రంథమును జదివితిని. ఆంధ్రప్రబంధములనెడి మహాగహనంబునం బరిభ్రమించి మిక్కిలిగ పరిశ్రమించి మణిఖనిప్రదేశములవంటి యుత్తమవర్ణనములం బరిశీలించి యుత్తమజాతిపద్యరత్నంబులను సంపాదించి యొకమాలగా గూర్చి యాంధ్రభాషామతల్లి కంఠసీమ నలంకరించి తదీయకాంతిసంతతులచే నాంధ్రభాషామతల్లికే కాక తత్పుత్రులగు నాంధ్రమహాజనులకుంగూడ వింతవన్నె గల్గించిన శ్రీలక్ష్మణస్వామిగారి పరిశ్రమకరంబు శ్లాఘనీయంబు. ఆంధ్రభాషాగ్రంథములం జదువ తీఱిక లేనివారికి మనపూర్వకవుల యుత్తమవర్ణనామృతరససారమును రుచి చూపించినందుల కాంధ్రు లెంతయుం గృతజ్ఞత జూపవలయును. పెక్కుగ్రంథముల సారమును సులభముగా చవిచూచుట కింతకంటె సులభసాధనము మనయాంధ్రమున నిప్పటికి లేదు. ఈగ్రంథ మాంధ్రులకు నాంధ్రభాషకును మిగుల నావశ్యకము.

ఎర్నగూడెము, గోరీపట్టణము ఎగ్రైరావిస్టేట్లు జమీందారుగారు

మ. రా. శ్రీ కావ్యసుధి చెలికాని లచ్చారావుగారు, చిత్రాడ.

దాసరి లక్ష్మణస్వామిచే వ్రాయఁబడిన "వర్ణనరత్నాకరము" సాత్మగ్రంథకర్తలకు శబ్దరత్నాకరముబోలె తనరారుచున్నది. మఱియు నిందు సుప్రసిద్ధపూర్వకవిప్రణీతంబులగు అమూల్యగ్రంథరాజంబుల నుండి సముత్కృష్టవర్ణనాసమంజసములగు పద్యరత్నంబులు స్వీకరించుటంజేసి యమ్మహామహుల యమృతవచనంబు లొక్కయెడ విరాజిల్లుచు గంటికర్దముగట్టినట్లు "ఆంధ్రకవులచరిత్రము" బోలె నీప్రాజనీయుల నెల్లర నొక్క సభామంటపము నలంకరింపఁజేసినట్లు ఎంతయు నొప్పారుచున్నది.

ఇయ్యది పాఠశాలలయందును, గ్రంథాలయంబులయందును ప్రవేశము గావించిన ఆంధ్రలోకమున కెంతయు నుపయోగకరముగా నుండును.

సుప్రసిద్ధవిమర్శకులు సకలజనమనోరంజనావి
మనోహరప్రబంధసంధానచతురులు నగు
**మ. రా. శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు, పిఠాపురము.**

శ్రీయుత దాసరి లక్ష్మణకవివర్య సంకలితంబగు 'వర్ణనరత్నాకర' గ్రంథమును జాలవఱకుఁ బరీక్షించితిని. ఈయన దీనివిషయమునఁ జైకొనిన పరిశ్రమము మిగుల సంస్తవనీయము, ఆశ్చర్యదాయకము. అపారమైన యభిలాషముతోఁ గడుంగడు శ్రద్ధతో నిట్టిసత్కార్యమునకుఁ బూనిన యిక్కవికి నాంధ్రులందఱును మిక్కిలియు నప్పుపడి యుందురని చెప్పఁదగును. శర్కర, తైలము, పిష్టము—వీనిని వేఱుగ ననుభవించుటకంటె వాని నోపికమెయి నొకఖాద్యముగ నొనరించి యుపయోగించుటవలన నతిశయమైనరుచి యొదవునట్లు, యీయోగ్యగ్రం

భూభాగముల నప్పుడప్పుడు చక్షుఃపుటములనఁ గలిగెడు నామోదముకంటె మనసందలి రసవత్తరవర్ణనముల నెల్ల నేర్చికూర్చిన యీగ్రంథరాజము తన్నుఁ జదువు భాషాభిలాషికి—భాషాభిలాషి కేయన నేల?—విద్యార్థికి కవికి, పండితునకు—అందఱకును గల్పతరువుంబోలె నతిశయానంద మును గూర్చుననుట యతిశయోక్తి గానేరదు. ఈగ్రంథమునందలి వర్ణ నములలోని పద్యములన్నియు, నాయాగ్రంథములలోని వర్ణనములలో మేలైనవియే యగుటంజేసి పాఠకులకు నిసుమంతయు విసువు జనింప నేరదు. ఏతద్వర్ణనసంగ్రహకార్యమునందు నీతఁడు చేసినవ్యవసాయము మఱి యేయితరశాస్త్రాభ్యసనమునం దుపయోగించియుండినను గొప్ప పండితుఁడను పదవిం గైకొనియుండును. కాని యప్పాండిత్యమును గడియించుటవలనఁ గలుగు నల్పకాలస్థాయియగు యశముకంటె నీ సంకలితగ్రంథమువలనఁ బొడము సమజ్ఞయే యాచంద్రార్కముగ నుండునని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

ఈగ్రంథమువలన నాంధ్రలోకమున కింకొకగొప్ప మేలుఁగలదు. అది యేదియన, ఏకవియైన, దేనింగూర్చియైన, నేదియే నొకపద్యమును రచియింపవలయునను తలంపుఁగొనుచో, నిందులేని క్రొత్తభావమున కై యాకవి యన్వేషించునట్లు చేయుచు, ఏనూత్నభావములుగలపద్య ము లాయాకవులచే రచియింపఁబడునట్లు చేయుచు, నాంధ్రభాషా దేవిని నవనవాలంకారకలితను జేయున ట్లీగ్రంథ మొనర్పఁగలదని హృదయానందపూర్వకముగఁ జెప్పుచున్నాను.

శ్రీ గంపలగూడెము కుమారజమీందారుగారు

శ్రీరాజా కోటగిరి వేంకటకృష్ణారావుబహద్దరుగారు.

అధికశ్రమంజేసి శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారు సమకూ ర్చుచున్న “వర్ణనరత్నాకరము” యొక్క ప్రాశస్త్యము వర్ణనాతీతము.

ఈ యుత్కృష్టగ్రంథరాజ మాంధ్రభాషాయోషామణికి నూత్నవిభూషణము. విమర్శకులకీగ్రంథము కడుంగడుఁ దోడ్పడఁగలదు. ఆంధ్రలోకము లక్ష్మణకవి కెంతయుఁ గృతజ్ఞత చూపింపవలసియున్నది.

---

శ్రీ పిఠాపురం హైస్కూలుపండితులు
బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శ్రీయుతులగు దాసరి లక్ష్మణస్వామిగారిచేఁ గూర్పఁబడిన "వర్ణనరత్నాకరము"ను స్థాలీపులాకన్యాయముగఁ జదివితిని. ఆంధ్ర మహాకవుల యుక్తికజిగిబిగువులు, ముద్దుపల్కులు, పదగుంభనములు, నొక్కులు మొదలుగాఁ గూర్చిన వీరిపరిశ్రమ మతిశ్లాఘనీయము. వర్ణనరత్నాకరముఁ జదివినచో వర్ణనవిషయమునఁ జదువరుల కన్యగ్రంథపఠన మనవసరమనియు వర్ణనరత్నాకరముఁ జదువనిచో నన్యగ్రంథపఠనపరిశ్రమము వ్యర్థమనియుఁ దలఁతును.

భవిష్యత్తున నీగ్రంథరాజ మాంధ్రవిశ్వవిద్యాలయపాఠ్యగ్రంథములలో నగ్రగణ్యమగుఁగాత మనియు లక్ష్మణస్వామిగారి కితోఽధికమగు పరిశోధనాశక్తి యలవడుఁగాక యనియు దేవదేవుని వేఁడుచున్నాను.

కల్పలతాధిపతులు సుప్రసిద్ధులు నగు మహారాజశ్రీ
ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు, పార్వతీపురము.

వివిధరత్నములకు వివిధప్రదేశము లుత్పత్తిస్థానములు. అవి యన్నియు లభించుచోటు రత్నాకరము. కావ్యశరీరమునకు వర్ణనములు రత్నములు. ఆంధ్రసారస్వతమునఁగల ప్రబంధరాజము లనేకముల నుండి వివిధవర్ణనములను రత్నములను సంగ్రహించి వర్ణనరత్నాకరమున సులభసాధ్యములఁ గావించిన గ్రంథకర్త యెంతయుఁ బ్రశంసనీయుఁడు. సంగ్రహించిన రత్నములన్నియు నమూల్యములగుటచేత నీవర్ణనరత్నాకరమునకు విలువ యింతయని చెప్ప నెవరితరము? కావలెనన్నంత

నే రత్నాలరాసుల నలవడఁజేయు నీవర్ణనరత్నాకరము హస్తగతమగుటవలన నాంధ్రలోకము ధన్యమగుచున్నది. గ్రంథసంపాదకులగు శ్రీయుతులు లక్ష్మణస్వామిగారిఋణము నాంధ్రు లెన్నటికిని దీర్పఁజాలరు.

---

బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయశాస్త్రులుగారు,
సంస్కృతోపాధ్యాయులు, మల్లాది సత్యలింగనాయకునిహైస్కూలు, కాకినాడ.

అనేకగ్రంథసముద్ధృతపద్యపూరితంబగు నీవర్ణనరత్నాకర'మను గ్రంథము మాధుర్యాదిగుణములఁ గలిగి యనేక పుష్పసముద్ధృతమకరన్దపూరితంబగు మధుకోశంబుపోలె సర్వజనానన్దకమగుచున్నది.

---

ఆంధ్రగీర్వాణ విద్యాలయాధ్యక్షులగు మ. రా. శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, గోదావరీతీరము. కొవ్వూరు.

శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారిచే సమకూర్పఁబడిన వర్ణనరత్నాకరమను గ్రంథమును అందలిపథకమును గాంచితిని గ్రంథము చదువుటయే కష్టము. చదివినవానిలో సమానస్కంధములగు భాగములను స్ఫురించుట మఱియొకకష్టము. వానినేర్చి కూర్చుట యింకను గష్టము. వీనినన్నిఁటిని ఆంధ్రవాఙ్మయమునఁగల పూర్వగ్రంథముల నన్నిఁటినో పరిశోధించి అందందుఁగల వర్ణనలను విడదీసి ప్రోవులు ప్రోవులుగా నొక్కచోటఁ గనుబఱిచిన లక్ష్మణస్వామిగారి ప్రయత్నమెంతయు సంస్తవనీయము మిగిలినవారిమాట యటుండ విమర్శకలోకమున కీగ్రంథమువలనగలుగులాభ మపారము. వీరి మహోద్యమమునకు ఆంధ్రలోకము కృతజ్ఞులు. ఇంకను ఆంధ్రవాఙ్మయమున కిట్టిమహోపకారమును చేయు లక్ష్మణస్వామిగారి కాయురారోగ్యములు కలుగుగాక.

---

శ్రీ పీఠికాపురసంస్థాన విద్వత్కవులు శతావధానులు
బ్రహ్మశ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రిలుగారు,
(రామకృష్ణకవులు)

క. నిర్ణిద్రదీక్షతో సం
పూర్ణముఁ గావించి లోక♦మునకిచ్చిన నీ
వర్ణనరత్నాకర మా
కర్ణించితిఁ బరమకౌతు♦కం బుప్పొంగన్.

సీ. చెప్పితిమి హేలగా నిట్లు ♦ సేయుమనుచు
సఖియె గురుపదముగ హృద♦యమున నిల్పి
శ్రమమునకు నోర్చి వర్ణన♦క్రమములరసి
తుదకుఁ బూర్తి చేసితివి సం♦తోషమయ్యె.

గీ. ప్రస్తుతిం గన్నయాంధ్రప్ర♦బంధజాల
మెల్ల శోధించి విసువాక ♦ యింతలేక
దానఁ గలవర్ణనమ్ములు ♦ తత్తదుచిత
ఘటన నేర్చి కూర్చుట పయి♦పయినఁ గలదె?

గీ. ఆంధ్రకావ్యప్రపంచంబు♦నందుఁ గల్గు
వర్ణనములెల్ల నరయంగ ♦వలయునన్న
నరయఁగావచ్చు నీదు ర♦త్నాకరమునఁ
గరతల సమర్పితామల♦కంబు పగిది.

గీ. తెలుఁగుబాసను బెంపునొం♦దింపఁ జేయ
వలయు పను లెన్నొయున్నవి ♦ వానిలోన
నొకటి గావించి నీ ప్రథ♦ముండవైతి
సూక్ష్మబుద్ధివి దాసరి ♦ లక్ష్మణకవి,

# గ్రంథాదిప్రణాళిక.



| గ్రంథములనామములు. | గ్రంథకర్తలనామములు. | శతాబ్ది |
|---|---|---|
| అంగశృంగారము | ముడుంబనరసింహాచార్యస్వామి | 19 |
| అచ్చతెలుఁగురామాయణము | కూచిమంచి తిమ్మకవి [ర్యులు | 17 |
| అచలాత్మజాపరిణయము | తిరుమలబుక్కపట్టణ వేంకటాచా | 18 |
| అనిరుద్ధచరిత్రము | కనుపర్తి అబ్బయామాత్యుఁడు | 18 |
| అధ్యాత్మరామాయణము | కాణాద పెద్దనసోమయాజి | 17 |
| అప్పకవీయము | కాకునూరి అప్పకవి | 17 |
| అభాగ్యోపాఖ్యానము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| అష్టమహిషీకల్యాణము | తాళ్లపాక తిరువేంగళనాథుఁడు | 16 |
| అహల్యాసంక్రందనియము | సముఖ వేంకటకృష్ణప్పనాయఁ | 18 |
| ఆనందసుందరీచాతుర్యవిలాస | బసవరాజు నాగేంద్రకవి [డు | 18 |
| ఆముక్తమాల్యద [ము | కృష్ణదేవరాయలు | 15 |
| ఇందుమతీపరిణయము | కుమారధూర్జటి | 16 |
| ఇందుమతీపరిణయము | మతుకుమల్లి నృసింహకవి | 19 |
| ఉత్తరహరివంశము | నాచన సోమనాథుఁడు | 14 |
| ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము | తక్కెళ్ళపాటి లింగన | 18 |
| ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజు | 18 |
| ఉద్భటారాధ్యచరిత్రము | తెనాలి రామకృష్ణకవి | 16 |
| ఉషాకల్యాణము | కైప మాయనకవి | 18 |
| ఒడయనంబివిలాసము | అజ్జరపు పేరయకవి | 18 |
| ఓఘవతీపరిణయము | అక్కినేపల్లి నృసింహకవి | 18 |
| కకుత్‍స్థవిజయము | మట్లి అనంతభూపాలుఁడు | 16 |
| కళావిలాసము | నన్నెచోడదేవకవి | 12 |
| కళాపూర్ణోదయము | పింగళి సూరన్న | 16 |

| | | |
|---|---|---|
| కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి | 16 |
| కవిరాజమనోరంజనము | కనుపర్తి అబ్బయామాత్యుఁడు | 18 |
| కవిజనరంజనము | అడిదము సూరకవి | 18 |
| కవిచకోరచంద్రోదయము | అల్లమరాజు రామకృష్ణకవి | 19 |
| కవిజనచకోరచంద్రోదయము | నారపరాజు కాంతకవి | 19 |
| కార్తికమాహాత్మ్యము | కొండుర్తి వేంకటాచలకవి | 18 |
| కార్తికమాసమాహాత్మ్యము | మండపాక కామేశ్వరకవి | 19 |
| కాళహస్తిమాహాత్మ్యము | ధూర్జటికవి | 16 |
| కాళిందీపరిణయము | శొంఠి భద్రాద్రిరామకవి | 19 |
| కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దన్న | 14 |
| కాశీఖండము | శ్రీనాథకవి | 14 |
| కిరాతార్జునీయము | గోపాలునిసింగయ్య | 18 |
| కుచేలోపాఖ్యానము | గట్టుప్రభువు | 18 |
| కుబ్జాకృష్ణవిలాపము | అక్కినప్రగడ హరిదాసు | 18 |
| కుమారనృసింహము | కొక్కొండ వేంకటరత్నశర్మ | 19 |
| కుమారసంభవము | నన్నెచోడ దేవకవి [కుఁడు | 12 |
| కువలయాశ్వచరిత్రము | సవరము చిననారాయణనాయ | 16 |
| కృష్ణకర్ణామృతము | వెల్లపూడి వెంగనామాత్యుఁడు | 19 |
| కృష్ణకళ్యాణము | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 19 |
| కృష్ణభూపాలీయము | చంద్రికవి | 19 |
| కృష్ణరాయవిజయము | కుమారధూర్జటి | 16 |
| కృష్ణజన్మఖండము | గోపీనాథ వేంకటకవి [ధాని | 19 |
| కృష్ణార్జునసంవాదము | వెలిచెరుకుల వేంకటరామప్ప | 19 |
| కృష్ణార్జునచరిత్రము | మంత్రిప్రెగడసూర్యప్రకాశకవి | 19 |
| కృష్ణామాహాత్మ్యము | తాతంభట్టుగురుమూర్తిశాస్త్రి | 19 |
| కృష్ణాభ్యుదయము | మండపాక పార్వతీశ్వరకవి | 19 |
| కేయూరబాహుచరిత్రము | మంచనకవి | 12 |

| | | |
|---|---|---|
| తపతీసంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధరకవి | 16 |
| తారకబ్రహ్మరాజము | చింతగుంట రాధామాధవకవి | 16 |
| తారాశశాంకవిజయము | శేషము వేంకటపతి | 18 |
| తాలాంకనందనీపరిణయము | మరింగంటి సింగరాచార్యులు | 17 |
| దశకుమారచరిత్రము | కేతనకవి | 13 |
| దశరథరాజనందనచరిత్రము | మరింగంటి సింగరాచార్యులు | 17 |
| దశావతారచరిత్రము | ధరణిదేవుల నాగయామాత్యు | 18 |
| ద్వాత్రింశత్సాలభంజికాకథలు | కోవెల గోపరాజు [డు | 17 |
| దిలీపచరిత్రము | కొటికలపూడి కృష్ణకవి | 18 |
| ద్రౌపదీపరిణయము | తిరుమలరాజ సూరపరాజకవి | 18 |
| ధనాభిరామము | నూతనకవి సూరన | 17 |
| ధరాత్మజాపరిణయము | కొత్తలంక మృత్యుంజయకవి | 19 |
| ధర్మఖండము | ఈదురుపల్లి భవానిశంకరుడు | 18 |
| ధర్మాంగదచరిత్రము | దాసరాజు | ... |
| ధీరజనమనోవిరాజితము | తెనాలి రామలింగకవి | 17 |
| నయనోల్లాసము | దేవులపల్లి వేంకటకృష్ణకవి | 19 |
| నరసభూపాలీయము | మూర్తికవి | 16 |
| నరసభూపాలరాజీయము | సోమశేఖరకవి | 19 |
| నలచరిత్రము | సిరిప్రగడ ధర్మయామాత్యుడు | 17 |
| నలచరిత్రము (ద్విపద) | చక్రపురి రాఘవాచారి | 17 |
| నాగరఖండము | తుర్గా రాజకవి, అయ్యంకి బా | 16 |
| నాగ్నజితీపరిణయము | వెల్లూరి నరసింహకవి [లసరస్వతి | 18 |
| నాచికేతోపాఖ్యానము | మిక్కిలి మల్లికార్జునుడు | 17 |
| నారసింహపురాణము | హరిభట్టు | 17 |
| నాసికేతూపాఖ్యానము | దుగ్గుపల్లి దుగ్గయ్య | 15 |
| నారాయణాచలమాహాత్మ్యము | అల్లమరాజు రంగధామకవి | 18 |
| నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి | 16 |

| | | |
|---|---|---|
| నిర్వచనోత్తరరామాయణము | తిక్కన | 13 |
| నిర్వచనవిచిత్రరామాయణము | వేల్పూరి వేంకటకవి | 19 |
| నీతిసారము | ప్రతాపరుద్రకవి | 12 |
| నీతిశాస్త్రముక్తావళి | బద్దెనకవి | 11 |
| నీలకుంతలావిలాసము | తులగాన నీలకంఠకవి | ... |
| నీలకుంతలీవిలాసము | మావూరి పట్టయ్య | ... |
| నీలాసుందరీపరిణయము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| నృసింహపురాణము | ఎఱ్ఱాప్రెగడ | 13 |
| నృసింహవిలాసము | పైడిపాటి వేంకటనృసింహకవి | 17 |
| పంచతంత్రము | బైచరాజు వేంకటనాథుడు | 15 |
| పంచతంత్రము | దూబగుంట నారాయణకవి | 15 |
| పండితారాధ్యచరిత్రము | పాలకురికి సోమనాథుడు | 15 |
| పట్టాభిరామాయణము | ఘట్టు వేంకటరామకృష్ణకవి | 18 |
| పద్మపురాణము | మడికి సింగన్న | 15 |
| పద్మినీపరిణయము | ఉన్నవ యోగానందసూరి | ... |
| పరమయోగివిలాసము | తిమ్మనృపాలుడు | 16 |
| పర్వతపురాణము | శేషనాథార్యుడు | 18 |
| పలునాటివీరచరిత్రము | శ్రీనాథకవి | 14 |
| పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | 16 |
| పాంచాలీపరిణయము | కాకమాని మూర్తికవి | 17 |
| పారిజాతాపహరణము | నంది తిమ్మన్న | 15 |
| పార్వతీపరిణయము | కోటి రఘునాథతొండమాన్ | 18 |
| ప్రద్యుమ్నచరిత్రము | పొన్నాడ పెద్దిరాజు | ... |
| ప్రబంధరాజవేంకటేశ్వరవిజయ [విలాసము | గణపవరపు వేంకటకవి | 17 |
| ప్రబంధరాజశిరోభూషణప్రకృష్టబలరామచరిత్రము | గుడారు వెంకటదాసకవి | 18 |
| ప్రబోధచంద్రోదయము | నందిమల్లయ్య, ఘంటసింగన్న | 15 |

| | | |
|---|---|---|
| ప్రభావతీప్రద్యుమ్నము | పింగళి సూరన్న | 16 |
| ప్రభులింగలీల | పిడుపర్తి బసవప్ప | ... |
| ప్రభులింగలీల (ద్విపద) | పిడుపర్తి సోమనాథుఁడు | 16 |
| బలరామక్షేత్రమాహాత్మ్యము | మండపాక కామేశ్వరశర్మ | 19 |
| బసవపురాణము (ద్విపద) | పాలకురికి సోమనాథుఁడు | 12 |
| బసవపురాణము | పిడుపర్తి సోమనాథుఁడు | 16 |
| బహుళాశ్వచరిత్రము | దామెరల వేంగళభూపాలుఁడు | 16 |
| బిల్వేశ్వరీయము | కొక్కొండ వేంకటరత్నశర్మ | 19 |
| బిల్హణీయము | చిత్రకవి సింగరార్యుఁడు | 18 |
| బృందావనవిహారము | దామరాజు లక్ష్మీనారాయణ | 19 |
| బ్రహ్మోత్తరఖండము | శ్రీధరమల్లె వేంకటరామకవి | 19 |
| భద్రాపరిణయము | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 19 |
| భరతాభ్యుదయము | మాడభూషి వేంకటాచార్యుఁడు | 19 |
| భర్తృహరిసుభాషితము | ఏలకూచి బాలసరస్వతి | 16 |
| భర్తృహరిసుభాషితము | పుష్పగిరి తిమ్మన్న | 18 |
| భర్తృహరిసుభాషితము | ఏనుఁగు లక్ష్మణకవి | 18 |
| భల్లాణచరిత్రము | పోచిరాజు వీరన్న | 18 |
| భాగవతము | బమ్మెర పోతనామాత్యుఁడు | 14 |
| భానుమతీపరిణయము | రెంటూరి రంగరాజు | 16 |
| భారతము | నన్నయభట్టాదులు | 11 |
| భారతము | అథర్వణాచార్యులు | 13 |
| భార్గవపురాణము | కాండూరి వేంకటదాసకవి | 18 |
| భీమేశ్వరపురాణము | శ్రీనాథకవి | 14 |
| భోజరాజీయము | అనంతామాత్యుఁడు | 15 |
| భోజసుతాపరిణయము | కోటీశ్వరకవి | 18 |
| మత్స్యపురాణము | హరిభట్టు | 17 |
| మదనసాయకవిలాసము | చదువుల సోమలింగయ్య | 18 |
| మనుచరిత్రము | అల్లసాని పెద్దన | 15 |

| | | |
|---|---|---|
| మల్హణచరిత్ర | ఎడపాటి ఎఱ్ఱనకవి | ... |
| మహాలక్ష్మీపరిణయము | వద్దిపర్తి కోనంరాజు | ... |
| ముగ్ధాశృంగారము | ముడుంబనరసింహాచార్యస్వామి | 19 |
| మహేంద్రవిజయము | దేవులపల్లి సుబ్బరాయకవి | 19 |
| మార్కండేయపురాణము | మారన | 13 |
| మిత్రవిందాపరిణయము | కుందుర్తి వేంకటాచలకవి | 17 |
| మిత్రవిందాపరిణయము | రావు జనార్దనరంగారావుగారు | 19 |
| ముకుందవిలాసము | కాణాద పెద్దనసోమయాజి | 17 |
| మూర్తిత్రయోపాఖ్యానము | దంతులూరి బాపరాజు | 18 |
| మైరావణచరిత్రము | మాడయకవి | 19 |
| యతిరాజవిజయము | దేవులపల్లి సుబ్బరాయకవి | 19 |
| యయాతిచరిత్రము | పొన్నికంటి తెలగనార్యుఁడు | 16 |
| యాజ్ఞవల్క్యచరిత్రము | గట్టుప్రభువు | 18 |
| యాదవరాఘవపాండవీయము | నెల్లూరి వీరరాఘవకవి | 18 |
| యామినీపూర్ణతిలకావిలాసము | చెళ్లపిళ్ల నరసకవి | 18 |
| రంగరాయచరిత్రము | దిట్టకవి నారాయణకవి | 18 |
| రంగనాథరామాయణము (ద్వి) | రంగనాథుఁడు | 13 |
| రంగనాథరామాయణము ,, | కాచభూపతి, విఠ్ఠలరాజు | 13 |
| రంభానలకూబరవిలాసము | బండి వెంకటస్వామినాయనికవి | 19 |
| రఘురామచరిత్రము | కృష్ణగిరి కృష్ణకవి | 19 |
| రసికజనమనోభిరామము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రసికజనమనోరంజనము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| రాఘవపాండవీయము | పింగళి సూరన్న | 16 |
| రాఘవపాండవయాదవీయము | అయ్యగారి వీరభద్రకవి | 19 |
| రాజశేఖరచరిత్రము | మాదయగారి మల్లన | 16 |
| రాజవాహనవిజయము | కాకమాని మూర్తికవి | 17 |
| రాజశేఖరవిలాసము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రాధామాధవసంవాదము | వెలిదండ్ల వేంకటపతి | 18 |

| | | |
|---|---|---|
| రాధాకృష్ణసంవాదము | మండపాక పార్వతీశ్వరకవి | 19 |
| రాధామాధవవిలాసము | సత్యవోలు సోమసుందరకవి | 20 |
| రాధికాసాంత్వనము | ముద్దుపళని | 18 |
| రామచంద్రోపాఖ్యానము | వారణాసి వేంకటకవి | 19 |
| రామచంద్రోపాఖ్యానము | మిక్కిలి మల్లికార్జునుడు | 19 |
| రామవిలాసము | ఏనుగు లక్ష్మణకవి | 18 |
| రామరాయవిలాసము | దేవులపల్లి సుబ్బరాయకవి | 19 |
| రామాయణము | భాస్కరాదులు | 14 |
| రామాయణము | మొల్ల | 16 |
| రామాయణము | గోపీనాథ వేంకటకవి | 19 |
| రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రకవి | 16 |
| రామేశ్వరమాహాత్మ్యము | ఏనుగు లక్ష్మణకవి | 18 |
| రావువంశముక్తావళి | దేవులపల్లి వేంకటకృష్ణకవి | 19 |
| రుక్మాంగదచరిత్రము | ప్రౌఢకవి మల్లనార్యుడు [డు | 14 |
| రుక్మిణీకళ్యాణము | జన్నాడ వేంకటరంగాచార్యు | 19 |
| రుక్మిణీపరిణయము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రుక్మిణీపరిణయము | సత్యవోలు భగవత్కవి [రులు | 18 |
| రెట్టమతశాస్త్రము | అయ్యలరాజు, అయ్యలభాస్క | 18 |
| లంకావిజయము | పిండిప్రోలు లక్ష్మణకవి | 18 |
| లక్షణాపరిణయము | కుప్పిలి సీతారామకవి | ... |
| లక్ష్మీవిలాసము | రాయసము వేంకటపతి | 16 |
| లక్ష్మీనారాయణపరిణయము | శివపల్లి సర్వోత్తమకవి | 18 |
| వరాహపురాణము | నందిమల్లయ్య, ఘంటసింగన్న | 15 |
| వరాహపురాణము | హరిభట్టు | 17 |
| వల్లీవల్లవోల్లాసము | మాడభూషి నృసింహాచార్యులు | 19 |
| వసుచరిత్రము | రామరాజభూషణుడు | 16 |
| వాల్మీకిచరిత్రము | రఘునాథభూపాలుడు | 17 |
| వాసవదత్తాపరిణయము | వక్కలంక వీరభద్రకవి | 18 |

| | | |
|---|---|---|
| వాసవదత్తాపరిణయము | ఎఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణ | 19 |
| విక్రమసేనము | చిమ్మపూడి యమరేశ్వరుఁడు | 13 |
| విక్రమార్కచరిత్రము | జక్కనకవి | 14 |
| విజయసేనము | తిక్కనసోమయాజి (?) | 13 |
| విజయవిలాసము | చేమకూర వేంకటకవి | 17 |
| విజయనందనవిలాసము | మంగళగిరి ఆనందకవి | 18 |
| విజ్ఞానేశ్వరము | కేతన | 13 |
| విజ్ఞానప్రదీపిక | చెన్న వీరయ | 19 |
| విప్రనారాయణచరిత్రము | చదలువాడమల్లయకవి | 16 |
| విశ్వకర్మపురాణము | వీపూరి వేంకటాచార్యుఁడు | ... |
| విశ్వగుణాదర్శము | తిరుమలబుక్కపట్టనచినతాతా | 19 |
| విష్ణుపురాణము | వెన్నెలకంటిసూరన్న [చార్యుడు | 15 |
| విష్ణుమాయావిలాసము | రోసనూరి వేంకటపతి | 17 |
| వీథినాటకము | శ్రీనాథకవి | 14 |
| వీరభద్రవిజయము | బమ్మెరపోతనామాత్యుఁడు | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము | దామెర చినవేంకటరాయకవి | 18 |
| వేంకటాచలమాహాత్మ్యము | తరిగొండ వెంకమాంబ | 18 |
| వేంకటేశ్వరవిలాసము | చెళ్లపిళ్ల నరసకవి | 19 |
| వేదాంతరసాయనము | మంళగిరి ఆనందకవి | 18 |
| వైజయంతీవిలాసము | సారంగు తమ్మయ్య | 16 |
| వైశ్యపురాణము | శ్రీగురు భాస్కరాచార్యులు | 18 |
| శంకరవిజయము | ఆలూరి కుప్పనకవి | 19 |
| శంతనువిలాసము | అల్లమరాజు రామకృష్ణకవి. | 19 |
| శంతనూపాఖ్యానము | శొంఠిభద్రాద్రిరామశాస్త్రి | 19 |
| శకుంతలాపరిణయము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి | 14 |
| శకుంతలాపరిణయము | రేవణూరి వేంకటార్యుఁడు | 18 |
| శకుంతలాపరిణయము | కృష్ణకవి | 18 |
| శకుంతలాపరిణయము | పెద్దాడ నాగయామాత్యుఁడు | 18 |

| | | |
|---|---|---|
| శకుంతలాపరిణయము | పక్కి వేంకటనరసయ్య | 19 |
| శతకంఠ రామాయణము | లింగకవి, గంగకవి | 17 |
| శశిరేఖాపరిణయము | అప్పప్పకవి | 19 |
| శివజ్ఞానదీపిక | పెదపాటి సోమనకవి | ... |
| శివరాత్రిమాహాత్మ్యము | శ్రీనాథకవి | 14 |
| శివరాత్రిమాహాత్మ్యము | లోకేరావు సోమనాథార్యుఁడు | ... |
| శివయోగసారము | అనియాది గణపతిదేవుఁడు | 17 |
| శివలీలావిలాసము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| శిశుపాలవధ | గోపీనాథ వేంకటకవి | 19 |
| శుకసప్తతి | పాలవేకరి కదిరీపతినాయకుఁడు | 18 |
| శుద్ధాంధ్రోత్తరరామాయణము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| శుద్ధాంధ్రభారతసంగ్రహము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వ॥ నైష॥ | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశ | మచ్చ వేంకటకవి | 19 |
| శృంగారనైషధము [చరిత్రము | శ్రీనాథకవి | 14 |
| శృంగారరసమంజరి | గుడిపాటి కోదండకవి | 18 |
| శృంగారరసాలవాలము | వెణుతుర్ల వడ్డికవి | 18 |
| శేషధర్మము | వెణుతురుపల్లి విశ్వనాథకవి | 17 |
| శేషధర్మములు | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 19 |
| శ్రీరంగమాహాత్మ్యము | భైరవకవి | 15 |
| శ్రీరంగమాహాత్మ్యము | కట్టావరద రాజేంద్రకవి | 17 |
| శ్రీరంగమాహాత్మ్యము | నల్లాన నృసింహాచార్యుఁడు | 18 |
| శ్రీరామస్తవరాజము | ముమ్మిడి మల్లనామాత్యుఁడు | ... |
| షట్చక్రవర్తిచరిత్రము | మల్లారెడ్డి | 16 |
| సంవరణచరిత్రము | తెనాలి రామకృష్ణకవి | 16 |
| సకలకథాసారసంగ్రహము | అయ్యలరాజు రామభద్రుఁడు | 16 |
| సత్యభామాపరిణయము | జిఋమర్తి నరసింహకవి | 19 |
| సత్యభామాసాంత్వనము | కామేశ్వరకవి | 17 |

| | | |
|---|---|---|
| సమీరకుమారవిజయము | పుష్పగిరితిమ్మన్న | 18 |
| సర్పపురమాహాత్మ్యము | కూచిమంచితిమ్మకవి | 17 |
| సర్వకామదాపరిణయము | శిష్టుకృష్ణమూర్తి | 18 |
| సానందోపాఖ్యానము | బాంధవకోటిశివరామకవి | 16 |
| సారంగధరచరిత్రము | చేమకూరవేంకటకవి | 17 |
| సారంగధరచరిత్రము (ద్విపద) | కూచిమంచితిమ్మకవి | 17 |
| సారంగధరచరిత్రము (ద్విపద) | బాణాలశంభుదాసు | 18 |
| సావిత్రీపరిణయము | దంతుర్తి దత్తాత్రేయకవి | 19 |
| సింహాచలమాహాత్మ్యము | కూచిమంచితిమ్మకవి | 17 |
| సీతారామాంజనేయసంవాద | పరశురామపంతులగురుమూర్తి | 18 |
| సీమంతినీకళ్యాణము [ము | పెదమల్లసోమకవి | 17 |
| సుదక్షిణాపరిణయము | తెనాలి అన్నయకవి | 16 |
| సునందాపరిణయము | చింతకుంట కోదండరామకవి | 18 |
| సుబ్రహ్మణ్యవిజయము | త్యాగరాజమొదలి | 19 |
| సుభద్రాపరిణయము | కూచిమంచిజగ్గకవి | 17 |
| సుమనోమనోభిరంజనము | ఓగిరాల జగన్నాథకవి | 19 |
| సురాభాండేశ్వరము | గట్టుప్రభువు | 18 |
| సూర్యతనయాపరిణయము | తక్కెళ్ళపాటి లింగన | 18 |
| సోమదేవరాజీయము | కూచిమంచిజగ్గకవి | 17 |
| సౌగంధికప్రసూనసంగ్రహము | అప్పప్పకవి | 19 |
| హంసవింశతి | అయ్యలరాజు నారాయణామా | 18 |
| హరవిలాసము | శ్రీనాథకవి (త్యుడు | 14 |
| హరివంశము | ఎఱ్ఱాప్రెగడ | 13 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి | 16 |
| హరిశ్చంద్రోపాఖ్యానము (ద్వి) | గౌరన | 15 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము | రామరాజభూషణుడు | 16 |

# వర్ణనానుక్రమణిక.



శ్రీ

పరమేశ్వరాయనమః

# వర్ణనరత్నాకరము

## తృతీయభాగము



## శ్రీకారము



శ్రీకారము శుభకర మగు
శ్రీకారము సకలకార్యసిద్ధి నొసంగున్
శ్రీకారము గీర్త్రిద మగు
శ్రీకారముఁ గృతుల నాదిఁ జేకూర్పఁ దగున్. 1

(చాటుధార.)

శుభదేవతాత్రయంబును
శుభఖచరత్రయముఁ గలిగి శుభవాచకమై
యభినుతిఁ గాంచినకతమున
శుభములు శ్రీకారమనను జొప్పడు టరుదే. 2

సుమనోమనోభిరంజనము ఆశ్వా 1 పద్య 1.

## కావ్యాభిలాష

ధరణిఁ దొమ్మిది లిబ్బులు దాఁచుకొన్న
వానికైనను ధనకాంక్ష పోనియట్లు
కృతులు పదివేలు గైకొన్నఁ గీర్త్రికాముఁ
డైనవానికిఁ జనదు కావ్యాభిలాష. 3

ఘటికాచలమాహాత్మ్యము పీఠిక పద్య 19.

## బ్రహ్మవిష్ణుమహేశ్వరస్తుతి

సీ. తతశుద్ధసత్త్వప్ర◆ధానవిగ్రహుల ని,త్యుల రజస్సత్త్వత◆మోగుణకుల
స్వసుధర్మశృంగార◆వైరాగ్యవేషుల, విశ్వోద్భవస్థితి◆విలయకరులఁ
దప్తకాంచననీర◆ధరచంద్రవర్ణుల, శుభకమండలుచక్ర◆శూలధరుల
ఘనసత్యవైకుంఠ◆కైలాసవాసుల, వరహంసఖగవృష◆వాహనులను
గీ. షడ్గుణైశ్వర్యయుతుల భా◆షావధూప్ర,సన్నమంగళదేవతా◆సర్వమంగ
ళాధిపతుల సాక్షాత్పర◆మాత్మమయుల, బ్రహ్మవిష్ణుమహేశులఁ◆బ్రస్తుతింతు.

సీతారామాంజనేయసంవాదము, పీఠిక, పద్య, 3.

ఉ. చల్లనిపుట్టినిండ్లుగల◆చాన యురంబున మేన మోమునం
దెల్లపుడున్ వసించి కడు◆నింపులు గుల్కఁగఁ బ్రేమ మీఱ ను
త్ఫుల్లమనోజ్ఞతన్ బ్రకట◆మూర్తియునై సగమై విలీనమై
తెల్లమి నుండు మూర్తుల ను◆దీర్ణతతో నుతియింతు ముచ్చరన్. 5

కిరాతార్జునీయము, ఆ 1 ప 3.

## వాణీలక్ష్మీపార్వతీస్తుతి

శా. బ్రహ్మాండంబు సృజింపఁ బెంప సమయిం◆పం జాలు సామర్థ్యముల్
బ్రహ్మోపేంద్రనగేంద్రచాపులకు సం◆పాదించుచున్ వారికిన్
బ్రహ్మత్రైకవివేకమిచ్చుచును సం◆భావించుచుం బ్రోచు నా
బ్రాహ్మీమంగళదేవతాగిరిజలం◆బ్రార్థింతు నశ్రాంతమున్. 6

సీతారామాంజనేయసంవాదము, పీఠిక ప 4.

## వేంకటేశ్వరస్తుతి

సీ. అలమేలుమంగామ◆నోబ్జభృంగ పరాకు, యహరహర్దానవ◆హర పరాకు
శ్రీతిరుపతిమహా◆సింహాసన పరాకు, దివిజాధినాథవై◆భవ పరాకు
సకలభక్తజనర◆క్షణవిచక్షణ పరా,కజరవందితపదాం◆బుజ పరాకు
కమనీయసందీప్త◆గరుడవాహ పరాకు, శతకోటిమన్మథా◆కృతి పరాకు
గీ. దేవర పరాకు తిరుమలా◆ధిప పరాకు, మా యురే స్వామిచాగుభ◆ళా యటంచు
మాగధులు చేరి సముఖంబు◆వేగ విన్న, నలువుమీఱంగ నిజవాహ◆నంబు డిగ్గి. 7

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 79.

సీ. బహుచిత్రచిత్రప్రపంచ♦భావాయ భావాయ, కల్పితాఖిలలోక♦కారణాయ
ధీజనస్తుతవామ♦దేవాయ దేవాయ, నందితాశ్రితనంద♦నందనాయ
నళినలోచన జగ♦న్నాథాయ నాథాయ, దాసకామితఫల♦దాయకాయ
సన్మునీంద్రమనఃప్ర♦శాంతాయ శాంతాయ, పరమపావనభక్త♦పాలనాయ
గీ. శంఖచక్రధరాయ తా♦ర్క్ష్యధ్వజాయ, శేషశైలవిహారాయ♦ శ్రీధరాయ
దివ్యశ్రీవేంకటేశాయ♦ తే నమోస్తు, టంచు వినుతించి మతియుని♦ల్పించుఁ బొగడె.

వేంకటేశ్వరవిలాసము, ఆ 3 ప 134.

సీ. అచ్యుతాహ్వయమున♦ నమరితివే కాని, నిజముగా నాపేరు♦ నీకుఁ దగునె
యాతరఁ బద్మాలయే♦శ్వరుఁడ వనిపరగితే, కాని నీ కా పేరు♦ కలుగఁదగునె
రహిని శ్రీశేఖనగర మహోహితుఁడవని, తనరితి వే కాని♦ తగునె నీకుఁ
బరగ నాగేశర♦పక్షుఁడ వనియొప్పితివె కాని యా పేరుఁ♦ దెలియఁ దగునె
గీ. తవిలి రాత్రించరాంతకుం♦డవను చీర్తి, తనరితివె కాని యా పేరు♦ తగునె నీకు
నౌర నీ కవి దోచింప♦నగుట పెద్ద, మత్తరిపుహర్త యలిమేలు♦ మంగభర్త. 9

సీ. మహాదేవమిత్ర శుం♦భత్పుణ్యవనక్షేత్ర, జలజాతదళనేత్ర♦ జలదగాత్ర
యరిచయభీమ ని♦ర్జరవాధనుతనామ, సుందరజితకామ♦ సుగుణధామ
కౌస్తుభవక్ష సం♦తతకలపుండరీకాక్ష, నరకేభహర్యక్ష♦ మురవిపక్ష
యళివేలమంగచి♦త్తాంభోజమదభృంగ, కరుణాతరంగాపాంగ♦ చరణగంగ
గీ. మహితనవనీతచోర దు♦ర్మదవిదూర, పంచపాండవపక్షక♦ల్పకవిశిక్ష(?)
యమరచాతకవారిద♦యంబుజపద, కల్మషాత్మవినాశ వేం♦కటగిరీశ. 10

కవిజనచకోరచంద్రోదయము, ఆ 2 ప 88, 89.

## కాశీవిశ్వేశ్వరస్తుతి

ద్వి. జయ భక్తమందార♦ సజ్జనోద్ధార, జయ సద్గుణాధార♦ సంసారదూర
జయ సత్కృపాలోల♦ శాతత్రిశూల, జయ హుతాశననేత్ర♦ జలజాక్షమిత్ర
జయ మేరుకోదండ♦ జయ విఘ్నకాండ, జయ నిర్జితానంగ♦ శశిధవళాంగ
చారుకోమలహాస♦ చతురవిలాస, గౌరీమనోల్లాస♦ కాశీనివాస.

హరిశ్చంద్రోపాఖ్యానము. గౌర. భా 2.

సీ. క్షీరాబ్ధిసంభవ♦క్ష్వేలానలోగ్రకీ,లావళీనీలకం♦ఠాజిరాయ
పవనాశనాధీశ♦పర్యంకకంకప, తాస్తమిత్రత్రిపు♦రాసురాయ

హాసేందుచంద్రికా♦జాలస్ఫురద్దేహ, నిమ్నగాకైరవేం♦దీవరాయ
పాపవాఃపారస♦ద్భక్తలోకానీక, మానసాంభోజాత♦మధుకరాయ
గీ. వసుమతీధరకన్యకా♦వర్తులస్త, నాగ్రికాశ్మీరసురభిదో♦రంతరాయ
మందిరాయితకైలాస♦కందరాయ, హస్తిచర్మాంబరాయ తు♦భ్యం నమోస్తు.
హరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 4 ప 22.

సీ. పదియారు వండెన్మిందు♦పరియలు చక్రము, లిట్టట్టు గదలసి♦ యట్టితేరు
మేనులతొమ్మిది♦ పూనినసారథి, నపరిమితంబులై♦నట్టిహరులు
మూఁడగ్రములతోడఁ♦ గూడినచాపంబు, వేయితెఱంగుల♦ వెలయువారి
దళవిధాకృతులచేఁ♦ దనరినబాణంబు, త్రిపరికారంబులఁ♦ దివురుదృష్టి
గీ. యిట్టి పరికర మెల్లఁ జే♦పట్టినింగిఁ, బఱచుగురియగుతిగవీళ్ళఁ♦ బడ నడంచి
జయముఁ గొన్నట్టి నిన్నెన్న♦ శక్య మగునె, కాశికావిశ్వనాథ వి♦క్రమసనాథ.
బలరామక్షేత్రమాహాత్మ్యము, ఆ 2.

## కుక్కుటేశ్వరస్తుతి

సీ. చిన్నివెన్నెలతేఁటు♦ చెన్నైనసికపువ్వు, పసమించు పులితోలు♦పట్టుసాలు
చిలువలయొకిమీఁదు♦ బలుమానికపుఁదాలి, వాటంపుఁ దెలిగిబ్బ♦ వారువంబు
గటికిపూజలమెచ్చు♦ గారాబుకొమరుండు, వలిగొండకూఁతురు♦ వలపుటింతి
కేకేతుటుములెల్లఁ♦ జేరికొల్చెడు బంట్లు, మనువెండిగుబ్బలి♦ యూనికిపట్టు
గీ. నగుచుఁజెలువొందభువనంబు♦లనుదినంబు, రమణఁబాలించునిన్నునేఁ♦బ్రస్తుతింతు
బుధనుతవిలాస పీఠికా♦పురనివాస, కుముదహితకోటిసంకాశ♦ కుక్కుటేశ. 12

సీ. బృందారకామంద♦ మందారవీతాఘ, బృందారవిందాక్ష♦వందనీయ
పాటీరవర్ణేందు♦ కోటీర గౌరీవ,ధూటీరతాదిత్య♦ కోటితేజ
క్షోణీరథాంబోధి♦ తూణీరగంగాప్రి,వేణీరవామోద♦ పాణిహరిణ
నీహారవాగ్భామి♦నీహీరహారాని, లాహార పర్యాభ♦వాహవార్య
గీ. శర్వ సర్వజ్ఞ దుర్వహా♦ఖర్వగర్వ
పర్వపూర్వామరోదగ్ర♦ శార్వరహర
పారసుకుమార సంతతో♦దారవీర
ఘోరతరకుక్కుటాకార♦ జయ సుధీర. 13
రుక్మిణీపరిణయము, పూ, ౧, పీఠిక, ప 19, 20.

## భీమేశ్వరస్తుతి

గీ. విశ్వనకు శాశ్వతునకు వి◆శ్వేశ్వరునకు, విశ్వరూపాత్మకునకు మ◆హేశ్వరునకు
శ్రీస్వయంభూమహానుధా◆స్నిగ్ధలింగ, భీమనాథేశ్వరునకు న◆ర్పింతు మనసు.

గీ. భీమ భీమేశ్వరేశ్వర◆భీమనాథ, భవభవారణ్యపావక ◆ భవ్యమూర్తి
భర్గ ఫాలాక్ష భసితాంగ ◆ ఫణివిభూష, శిఖిశిఖాభాసమానభ◆జింతు నిన్ను. 14

గీ. శర్వు సర్వేశ్వరేశ్వరు ◆ సర్వవంద్యు, శర్వు సర్వప్రదాయకు ◆ సర్వధాత
శర్వు సర్వంసహామహీ◆చక్రధరుని, శర్వు వర్ణింతు దేవతా◆సార్వభౌము. 15

శా. వేదాతీతుని వేదవేద్యుని శివున్ ◆ వేదాంతవేద్యున్ భవున్
వేదాంతోపనిషద్రహస్యముఁ జతు◆ర్వేదీవిహారాలయున్
వేదాంగాదిపురాణముఖ్యవిలస◆ద్విద్యాగమప్రక్రియా
వేది న్నిన్ను భజింతు నెమ్మనమునన్ ◆ విశ్వేశ భీమేశ్వరా. 16

క. కామేశ్వరు నీశ్వరునిం, గామితఫలదానకల్ప◆కముఁ గామరిపున్
గామాతీతుని దేవ, గ్రామణి నిను నాశ్రయింతు ◆ గౌరీరమణా. 17

క. ఆనందజ్యోతిని బర,మానందానందమూర్తి ◆ నవ్యయునిఁ ద్రిలో
కానందామృతదాయి మ,హానందుని వృషభవాహు◆నభివర్ణింతున్. 18

సీ. ఓ మహాలింగంబ ◆ యో మహాదేవుండ, యో మహాత్ముఁడ దేవ ◆ యో మహేశ
యో మహాసంపత్ప్ర◆యోగదీక్షాదక్ష, యో మహాపాపేంధ◆నౌఘదహన
నీమూర్తిసంస్మృతి ◆ నీ నామసంస్మృతి, నీకథాశ్రవణంబు ◆ నిఖిలదురిత
యూథాంధకారసూ◆ర్యోదయం బఖిల క,ల్యాణనికాయసం◆ప్రాప్తిహేతు
గీ. చందనాగరుకుంభద్ర◆యాంగరాగ, పరిమళాసారవాసిత ◆ బాహుమధ్య
దక్షిణాపథకాశికాం◆తర్విహార, గిరిశ శ్రీభీమనాథ ర◆క్షింపు మమ్ము. 19

క. ఈసప్తమునిస్తోత్రము, వ్రాసినఁ జదివినను వినిన ◆ వర్ణించినఁ గై
లాసపతి దక్షవాటిని, వాసుఁడు జనులకు నభీష్ట◆వరము లొసంగున్. 20

భీమేశ్వరపురాణము, ఆ 5 వ 132, 139.

## కోటిలింగేశ్వరస్తుతి

సీ. వేవేలకోటుల ◆ వేఁడివెల్లులపరిధుల్, నించువాఁడు పరిధుల ◆ మించువాఁడు
వలగొను భక్తుల ◆ తలఁపులు చేకూర్చి, యేలువాఁ డఘముల ◆ దోలువాఁడు

పదకంబుఁ గొలువిచ్చి ◆ సత్కవివరులఁ బాలించువాఁ డహితులఁ దూ◆లించువాఁడు
పుంశపేటికలఁ దఁ◆గంటెటనే ప్రకాశించువాఁ, డానతుల్ ◆ గాంచువాఁడు
గీ. మొల్లము దనర్చి వెలయుశ్రీ◆యెల్లమంద, నగన గానీకమందిరుఁ◆డైనవాఁడు
కోటిలింగేశ్వరుఁడు గడుఁ ◆ గూర్మి వెలయ, నగసకవితాపటుత్వ మొ◆సంగుఁ గాత.
ఓఘవతీపరిణయము, ఆ 1 ప 12.

## సృష్టికై బ్రహ్మయొనరించిన సూర్యస్తుతి

గీ. యోగిజనము లెవ్వనిఁ బరం◆జ్యోతి గాఁగ, దలఁతు రఖిలమయాత్ముఁడై వెలుఁగు నెవ్వఁ
డగయ సకలంబు నెవ్వని◆యందుఁ గలుగు, నట్టి రవికి మ్రొక్కెద నే స◆మగ్రభక్తి.
ఉ. ఏమహితాత్ముఁ డెప్పుడును ◆ నెంతయు వెల్గుచు నుండు ఋగ్యజు
స్సామములైన యేకమూర్తి రుచి◆సంపద నే నిగమాత్ముఁ డర్థమా
త్రామయసూక్ష్మత న్వెలుఁగుఁ ◆ దద్దయు నే త్రిగుణాత్ముఁ డోంకృతి
శ్రీమయలీల సంతతముఁ ◆ జెల్వగు నారవి కేను మ్రొక్కెదన్. 23
క. శ్రుతిరూపుఁడుఁ గ్రతురూపుఁడు, నతులబ్రహ్మైకరూపుఁ ◆ డాత్మవిదారా
ధితరూపుఁ డాద్యుఁ డవ్యయుఁ, డతితేజుం డగు దినేశు ◆ నభినందింతున్. 24
క. అపరిమితమైన నీయుగ్రపువేఁడిమిఁ బ్రాణు లెల్ల ◆ గ్రాఁగెడు దేజం
బుపసంహరింపు సృష్టికి, విపరీతము పుట్టకుండ ◆ విశ్వమయాత్మా. 25
మార్కండేయపురాణము, ఆ 7 ప 81, 84.

## అదితియొనరించిన సూర్యస్తుతి

క. పరమంబై సూక్ష్మంబై, పరిపూర్ణంబై సుఘమ్మఁ ◆ బ్రభవంబై సు
స్థిరమైన బ్రహ్మతేజము, ధరియించిన నీకు మ్రొక్కె◆దను నే ద్యుమణీ. 26
క. జగముల నుపకారంబుగఁ, దగుతఱి నుదయించుచున్న ◆ తాపకవిలస
న్నిగమమయతీవ్రమూర్తికి, గగనమణికి మ్రొక్కెద న్బ్ర◆కాశితభక్తిన్. 27
క. ఘనవర్షార్థము రసమో, చనముం జేయుచును సకల ◆ జగమున కాప్యా
యనకరమగురూపముగల, ఘనాత్ముఁడగు నీకు వినుతిఁ ◆ గావింతు రవీ 28
గీ. బ్రహ్మ కేశవ రుద్రరూ◆పములు నీవ, యింద్ర పావక యమ జల◆ధీశ పవన
ధనదరూపములు నీవ చం◆ద్రధర మేది, నీధ్ర భూవార్ధిరూపము◆లీవె తరణి. 29
క. యాగములను సతతాంత, ర్యాగములను నిను భజింతు ◆ రవనినుపగ్నుల్
యోగులు త్రిదివాక్షయసుఖ, భోగంబులకై సమస్త ◆ భువనస్తుత్యా. 30
మార్కండేయపురాణము, ఆ 7 ప 92, 98.

# విశ్వకర్మ యొనరించిన సూర్యస్తుతి

చ. కనదరుణాంబుజాతనవ♦కాంతి నుదంచితభూరిచారుకాం
చనరుచిఁ దప్తతామ్రవిమల♦సద్ద్యుతి నూత్నలసత్ప్రవాళదీ
ప్తి నిజతనూద్గతాంశుతతి♦ దిక్కులఁ బర్వ వెలుంగనొప్పు నీ
దినమణికి న్నభోమణికి♦ దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. 31

చ. ఘననిబిడాంధకారరిపు♦ఖండనచండమయూఖరాజిచే
ననుదినము న్ప్రభాతముల♦యందమృతాంశుశురీచి వేఁడి గా
వనజము లుల్లసిల్లఁగఁ దొ♦వల్ మొగుడన్ ప్రథమాద్రిఁ బొల్చు నీ
దినమణికి న్నభోమణికి♦ దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. 32

చ. దినకరయుష్మదీయతను♦తేజము ద్రచ్చెద భక్తి నీకు వం
దన మొనరించుచు న్బహువి♦ధంబుల నిన్ను నుతించుచు న్దయ
న్నను శుభదృష్టిఁ జూడుము స♦నాతనకారుణికాగ్రగణ్య య
త్యనుపమపుణ్యసర్వనిగ♦మాత్మక నన్ను ననుగ్రహింపుమీ. 33

మార్కండేయపురాణము, ఆ 7 ప 122, 126.

# బ్రాహ్మణగణ మొనరించిన సూర్యస్తుతి

సీ. ఆదిత్యు నార్యుని♦సర్యముఁ బూషు న్వ, భాను దివాకరు♦భాను సవిత్రు
నక్షరుఁ జరము సి♦తాసితవర్ణుని, భాస్కరు దుష్ప్రేక్ష్యుఁ♦ బంకజాప్తు
రవిఁ బ్రళయాంతకు♦ రక్తపీతుని దీప, దీధితి నవితర్క్య♦ దీర్ఘరూపు
యజ్ఞాగ్నిహోత్రవే♦దావస్థితుని యోగి, నిత్యు ననంతుని♦ నిగమవేద్యు

గీ. నాద్యు మిత్రుని నఖిలలో♦కైకరక్షు, వ్యక్తగుణయుక్తుఁ బరమద♦యానురక్తు
శాంతు నిన్నుఁ బ్రభాకర♦ శరణు వేఁడి, సంతతము నినుఁ గొల్తుమ♦నంతభక్తి.

క. సుర దనుజ ఖచర కిన్నర, గరుడోరగ సిద్ధ శౌర♦కాగ్రిహములయం
దరయంగ నధిక తేజ, న్నఖిలతుఁడగు దేవు శరణుఁ♦ జొచ్చెద మర్థిన్. 35

గీ. గగనమునుండి నిజమయూ♦ఖములఁ జేసి, యవనితలమును దిశలను♦నంతరిక్ష
మును వెలింగించుచును వ్యా♦ప్తమూర్తిఁ దాల్చి, పరగు దేవు నిగొలుతుమా♦శరణు వేఁడి.

ఆ. అరయ బ్రహ్మ యన మ♦హాదేవుఁ డనవిష్ణుఁ, డనఁ బ్రజాపతి యన♦ననిలుఁ డనఁగ
సంఖరం బనఁగ♦ సముఁడు దా నే దేవుఁ, డట్టి భానుఁ గొల్తు♦ మర్థితోడ. 36

మార్కండేయపురాణము, ఆ 7 ప 156, 159.

# అగ్నిస్తుతి

శా. భూతాధారుఁడ వై మహాధ్వరకళా♦పూజ్యుండ వై యాగమ
వ్రాతస్తుత్యుఁడ వై సురార్చితుఁడ వై ♦ బ్రహ్మణ్యదేవుండ వై
శ్రౌతస్మార్తశుభక్రియాధిపతి వై ♦ శాంతాంతరంగోజ్జ్వల
జ్యోతీరూపుఁడ వై వెలుంగునిను సం♦స్తోత్రిం బొవర్తున్ శిఖీ. 37

క. దేవతలకు నీవ ముఖము, దేవతలకు నీవ బ్రతుకుఁ ♦ దెరువు హుతవహా
దేవతల కెల్ల నాత్మవు, నీవ సకలదేవతలును ♦ నీప్రాణంబుల్. 38

శా. నీవలం దెర్పెదు వేల్పుహవ్యములొగి ♦ న్మేఘమ్ములై వర్షము
న్జేయ న్మేదిని నోషధుల్గలుగుఁ ద♦త్సేవ న్జనశ్రేణి దీ
ర్ఘాయుర్వృద్ధి వహించి యధ్వరము లు♦ద్యత్ప్రీతిఁ గావింపఁ గా
వాయజ్ఞంబులఁ దృప్తిఁ బొందుదురు నా♦కాధీశ్వరు ల్పావకా. 40

క. జలముల నీవ సృజించితి, జలముల యగ్ని యగు నీకు ♦ జనన మొనర్చె
న్జలములు నీచేఁ బక్వ,మ్ములగుచుఁ బ్రాణులకుఁ జేయుఁ♦బుష్టి హుతవహా. 41

మార్కండేయపురాణము, అ 7 ప 50, 58.

సీ. పావకశిఖి సర్వ♦భక్షణపవనాప్త, విజయ ధనంజయ♦వీతిహోత్ర
సప్తజిహ్వానల♦జ్వాలనధూమధ్వజ, స్వాహామనోహర ♦ లోహితాశ్వ
శుక్లమేషారూఢ ♦ శుద్ధజటాబద్ధ, గౌరవర్ణారుణ♦కమలనయన
తపనయక్షేశ్వర♦దహనదిక్పతివహ్ని, యాశుశుక్షణి కామి♦తార్థఫలద
గీ. దేవవదనద్విమస్తక; ♦ త్రిదశవంద్య, సకలజీవాత్మకస్థ వి♦శ్వప్రకాశ
రూఢచారిత్ర విశ్వాన♦రునిసుపుత్ర, యతిపవిత్ర నమస్కార ♦ మగ్నిహోత్ర.

గీ. నీవలనఁ దృప్తిఁ గాంతురు ♦ నిర్జరులును, తనియ యజ్ఞఫలం బిచ్చు♦దాతవీవు
నీవె కనుపట్టువేల్పవీ♦నిఖిలమునకు, ఘనుఁడ నినుఁబోలు దైవంబు♦గలదె జగతి.

ఆ. గంగమొదలునదులు ♦ కడలిలోపలఁ బడ్డ, నీరుపెల్లుపొంగి ♦ నింగి ముట్ట
వెల్లివిరియకుండ ♦ విలయ మొందింతువు, పావశక్తి నీదె ♦ బడబవహ్ని. 44

యాజ్ఞవల్క్యచరిత్రము, అ 2.

సీ. నిఖిలాగమస్తోత్ర♦నిరుపమతేజఃప్ర,చార మేషారూఢ♦గౌరవర్ణ
లోహితాంబక జటా♦వాహ చతుశ్శృంగ, సప్తజిహ్వా త్రిపాద♦సరసిజాప్త

మండలకుముదాప్త♦మండలస్థితహారి, దంబరనేత్ర వి♦లంబచరిత
జగదంతరాత్మక♦సజ్జనప్రూజిత, సకలభువనసమ♦స్కారవిభవ
గీ. యమితసత్సంగ గురునిర్మ♦లాంతరంగ, పరిణవవర్ణానుషంగ శ్రీ♦పావనాంగ
భక్తచిత్తాబ్జభృంగ వి♦పక్షభంగ, వరదయాపాంగపాప తి♦మిరపతంగ. 45
చ. దివిజులు నీముఖంబుననె ♦ తృప్తి వహింతురు వేద మెప్డు ని
న్నవనిఁ బరాత్పరుండవను ♦ నాహవనీయము దక్షిణాగ్నిసం
భవమగునీదు మేనను శు♦భప్రదపావనరూప యోక్రితూ
త్సవకలనప్రమోదముని♦సన్నుతభావుకచిత్తసంయుతా. 46
ఆ. యజ్ఞకర్త వీవు ♦ యజ్ఞేశ్వరుఁడ వీవు, యజ్ఞభోక్త వీవు♦యజ్ఞపురుష
యజ్ఞ యజ్ఞఫలద♦యజ్ఞనియంత్రిత, యజ్ఞపాలదేవ♦ యగ్నిదేవ. 47

ఓఘవతీపరిణయము, ఆ 3 ప 202, 204

## మహేంద్రస్తుతి

సీ. బల వృత్ర నముచి జం♦భ పులోమముఖదైత్య,వనవహ్ని హేతి యె♦వ్వాని హేతి
చిత్రసంగరజయ♦శ్రీకరగ్రహణ ని,ర్వహణనిహస్త మె♦వ్వానిహస్త
మనఘకర్మాయాత ♦ ఘనతరైశ్వర్యని,ర్వ్యథపుణ్యలోక మె♦వ్వానిలోక
మసమానకారుణ్య♦రసవర్షిలోచన, వనజనికాయ మె♦వ్వానికాయ
గీ. మమర వనమధ్యకేళిసౌ♦ధాంతరాళ, వర్ణ్యతరసంప్రచరణ మె♦వ్వానిచరణ
మట్టి లోకైకవందితు ♦ నప్రమేయు, నిన్ను వర్ణింపఁగా నేర్తు♦నే సురేంద్ర.
శా. వంశారణ్యముఁ గాల్చు పావకుగతిన్ ♦ వర్ధిష్ణువై విద్విష
ద్వంశారణ్యము నిర్దహించు భవదు♦ద్దాఘప్రతాపాగ్ని శి
తాంశుస్ఫూర్తులు సంశ్రితావళికి నీ♦యాకారరేఖల్ త్రయ
స్త్రింశత్కోటిసుపర్వనాథుఁడవు కీ♦ర్తింప న్నినున్ శక్యమే. 49
గీ. తగఁ బరాగము గప్పిన ♦ తమ్మికోలను,మాఁడ్కి హరిచందనాలిప్త♦మగుచువేయి
గములతో నొప్పు నీయుదగ్రప్రదీప్త, తనువుఁ గీర్తింప నేర్తునే♦యనిమిషేంద్ర.

నిరంకుశోపాఖ్యానము, ఆ 4 ప 117, 119.

## దత్తాత్రేయస్తుతి

సీ. నిజగర్భగతజగ♦న్నిచయ మారయలీల, నంతర్ముఖాపాంగుఁ♦డైనవాని
నలినజాండావృత్తి♦ నాభివీథికి నేర్పు, రీతి నక్షసరంబుఁ ♦ద్రిప్పువాని

కుంభితులాత్మయందని◆ల్చుటఁ దెల్పుతెఱఁగున, నవరుద్ధనిశ్వాసుఁ◆ డైనవానిఁ
దనపూనినధరిత్రి◆కి నలోలత ఘటించు, పగిది జటిలవృత్తిఁ◆ బరగువానిఁ
గీ. ప్రాక్తనస్వీయదామోద◆రత్వ మెఱుఁగఁ, జేయుగతి యోగపట్టికఁ◆ జెలఁగువాని
యోగముద్రికసూచితా◆మ్యతచరిత్రుఁ, డైనవాని దత్తాత్రేయ◆మౌనిఁ గొలుతు.
మ. యతిలీలాయితదత్తచిత్తుఁ డగుప◆ద్మాక్షుండు విశ్వావన
స్థితికిన్ రాజు నొనర్చి యాత్మభుజహే◆తిన్ సర్వసౌభాగ్యయో
గ్యత యెల్లం గరుణించు నాఁగఁ గృతవీ◆ర్యక్ష్మాపసూతి న్నిరా
హతచక్రేశ్వరవృత్తిగా మనుచు ద◆త్తాత్రేయుఁ గీర్తించెదన్. 51
మ. కమలాకాంతున కెంత సత్కృపయొ లో◆కశ్రేణిపై బ్రహ్మశ
క్రమహేశాదుల నమ్మ కీజగము యో◆గక్షేమముం గాంచునె
య్యామునం దావె చరించు నెల్లెడల ద◆త్తాత్రేయయోగీంద్రవే
షమునన్ దీనులఁ బ్రోచుచున్ ఖలులయు◆చ్ఛ్రాయంబు వారించుచున్. 52
సీ. ఈముని మునివేళ్ళ◆నెనయునక్షసరంబు, పద్మాక్షువిస్ఫూర్తిఁ◆ బరిఢవిల్లె
నీయతి యతిపుణ్య◆ధృతిఁ గాంచుకుండిక, తీర్థపదఖ్యాతిఁ◆ దేజరిల్లె
నీయమి యమితస◆త్కృపఁ గన్నయాజినంబు, నీలవర్ణనిరూఢి◆ నివ్వటిల్లె
నీశమి శమితౌఘ◆వృత్తి నూనినదండ, మురుతరానంతవై◆ఖరిఁ దనర్చెఁ
గీ. దన పరికరంబు లెల్ల ని◆ట్లనుపమాచ్యుతప్రభావంబులై మించఁ◆ దా ధరిత్రి
నరుదయోగీశ్వరేశ్వరుఁ◆ డగుటయనఁగఁ, బొలుచు ధన్యుదత్తాత్రేయుఁ బొగడఁదరమె.
మ. అనువొప్పం బరమాచలాత్మఘటితో◆ద్యత్కుండలిస్ఫూర్తిచే
ఘనపంకాబ్ధిముఖంచి నిత్యతరయో◆గశ్రీనితాంతోపగూ
హనరోమాంచసమంచితాంగుఁడగు ద◆త్తాత్రేయనారాయణుం
డనవద్యామృతసారము న్విబుధలో◆కాధీనముం జేయఁడే. 54

చంద్రభానుచరిత్రము, ఆ 1 ప 46, 50.

## రామేశ్వరస్తుతి

సీ. రామనాథాయ పు◆రచ్ఛిదే శంభవే, పరమేశ్వరాయ తు◆భ్యం నమోస్తు
పర్వతికన్యకా◆పతయే నమోస్తుతే, నాగేంద్రముఖగుహా◆నందనాయ
రవిశశివహ్నినే◆త్రాయ కపర్దినే, దేవాయ సోమాయ◆ తే నమోస్తు
కరుణార్ణవాయ మా◆ర్కండేయభవభిదే, విభవే నమస్తే క◆విస్తుతాయ

గీ. సాక్షిణే నమ ఉగ్రాయ ♦ శంకరాయ, నీలకంఠాయ భీమాయ ♦ నిర్మలాయ
శూలినే సకలజ్ఞాయ ♦ సుస్థిరాయ, మదనవీర్యహరాయ న♦మశ్శివాయ. 55

ఆ. దేశకాలభేద ♦ దిగభిన్న మేవస్తు, వద్వితీయ మగుచు ♦ నమరు నెద్ది
అట్టి భేదవిరహి♦తాత్ము నీశ్వరు రామ, నాథు నభవు లోక♦నాథుఁ గొల్తు. 56

సీ. జన్మజరామృత్యు♦సలిలపరిపూరంబు, సంతాపబడబాగ్ని ♦ సంకులంబు
దారపుత్రక్షేత్ర ♦ ధనవీచినికరంబు, దుష్టరోగవ్యాళ ♦ దుస్సహంబు
కామాదిపరిపంథి♦గణఘోరమకరంబు, విషయస్పృహాఫేన♦విలసనంబు
బహుళదారుణవిప♦త్పాఠీనవారంబు, మజ్జదజాండకుం♦భవ్రజంబు
గీ. భవ దుదారపదాంభోజ♦భక్తిపోత, మనఁగఁ దగు భవజలరాశి♦యందు మునుఁగు
చున్న నన్నుద్ధరింపు మ♦త్యూర్జితాంగ, వృషభరాజతురంగ రా♦మేశలింగ.

ఉ. పాపము లాచరించియును ♦ బాయక మర్త్యుఁడు రామనాథు ని
న్నోపికఁ జేరి భక్తిభర♦ముల్లసిలం బ్రణమిల్లెనేని త
త్పాపసమూహ మంబురుహ♦బాంధవబంధురదీప్తిపుంజని
ర్వాపితఘోరసంతమస♦రాశిగతిన్ లయ మొందు గొబ్బునన్. 58

క. రామేశ నిన్నుఁ జూచి ప్రణామముఁ గావించి కొలుచు ♦ నరుఁ డురుబాధా
ధామమగు మాతృగర్భ,గుహామధ్యము మగుడఁ జొరక ♦ యమృతముఁ జెందున్. 59

సీ. రామేశ మేశని♦రంతరపూజిత, జితపురాసురసురా♦శ్రితసుచరణ
రణభయంకరకర ♦ ప్రవిలసత్సారంగ, రంగద్గవేంద్రతు♦రంగ రాజ
రాజశేఖర ఖరా♦రాతిదోషవిదార, దారసంత్యక్తశ♦రీరభాగ
భాగమనీరుద్ధ♦బహుసూర్యసూర్యజ, దినకరకరటీకృ♦త్తికృతవసన
గీ. సనకముఖమునిరంజన ♦ జననరహిత, హితసదాచారచారణ♦స్తుతవిహార
హారదహిపాలపాలనా♦యత్తచిత్త, చిత్తభవభూతివిలసిత♦సితనిజాంగ. 60

రామేశ్వరమాహాత్మ్యము, ఆ 4 ప. 12 118.

## అగస్త్యస్తుతి

సీ. ఏవారిరాశిలో♦నించువిల్తునితల్లి, కలుము లీనెడు వాలు♦గంటి పుట్టె
వేల్పులవేలుపు ♦ వెన్నుఁ డేమున్నెటఁ, బడగపానుపుమీఁదఁ ♦ బవ్వళించె
లచ్చికన్నియ యాడు♦నచ్చనగుండ్లునాఁ, గొండలేవార్ధిలో♦నుండు నొకట
వేఁడిమంటలఁ జేఁదు♦విత్తే యదిలోఁ, బొడమి యీశ్వరుకంఠ♦భూష యయ్యె

గీ. నట్టి నూచుక్కమగవాని♦యయ్య నొయ్యఁ, గొంటి వాపోశనం బొక్క♦గ్రుక్క నీవు
నీ ప్రభావంబు లోకుఁడు వర్ణింపఁగలఁడె, పరమపుణ్యాయగస్త్యతా♦పసవరేణ్య.
రామాభ్యుదయము, ఆ 5 ప 121.

# యాజ్ఞవల్క్యస్తుతి

సీ. సంయమితిలక నీ♦సరసవాక్యంబులు, పరికింప వేదాంత♦భాషణములు
పరమబుభుక్షీంద్ర నీ♦కరుణాకటాక్షంబు, ఽఖిలంబులకు జీవ♦నౌషధములు
ధరణీసురేంద్ర నీ♦యురుతరక్రోధము, ల్దావపావకశిఖా♦ధారణములు
సజ్జనశ్రేష్ఠ నీ♦సభ్యనైష్ఠికములు, సకలపురాణాను♦సమ్మతములు
ఆ. దినము నీ వొసంగు♦దీవనల్ నృపతుల, భూరిసంపదలకుఁ♦గారణములు
నిన్ను సన్నుతింప♦నే నెట్లు శేర్తును, యాజ్ఞవల్క్యమునికు♦లాగ్రగణ్య. 62
యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 2.

# సూతస్తుతి

క. హస్తామలకీభూత స,మస్తపురాణార్థజాత♦ మాధవచరణ
న్యస్తహృదయాంబుజాత ని,రస్తాఘవ్రాతరోమ♦హర్షణజాతా. 63
సుమనోమనోభిరంజనము, ఆ 1 ప 47.

# వాసుకిస్తుతి

చ. అదితితపోవిభూతి నమ♦రారులబాధలు వొందకుండఁగా
సురగుల నెల్లఁ గాచినమ♦హోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచి♦శోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయిన♦వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 64
భారతము, ఆది. ఆ 1 ప 105.

సీ. పాలయల్క నొకవేళఁ♦బలుకని పార్వతి, వెఱపించి కూర్తువు♦విశ్వనాథుఁ
బావనబ్రహ్మక♦పాలమాలికల జో,డౌదు వొక్కొకనాఁడు♦హార మగుచుఁ
బడగమానికపుఁ జె♦క్కడపుఁ గీల్కంకణం, బగుదు వొక్కొకయెడ♦హస్తమునకుఁ
గన్నెఁగేదగిరేకు♦కమ్మతావులు వెల,యింతు వొక్కొకచాయ♦నింపుగాఁగ

గీ. నెన్నిభంగులఁ జూడ విశ్వేశ్వరునకు, నీవెకా కెవ్వ రున్నారు నిశ్చలాప్తు
లట్టి నిన్నుఁ బ్రశంసింప నలవి యగునె, ప్రణుతగుణగణ్య వాసుకి ఫణివరేణ్య.
దశావతారచరిత్రము, ఆ 2.

## తక్షకస్తుతి

ఉ. గోత్రమహామహీధరనికుంజములన్ విపినంబులం గురు
క్షేత్రమునం బ్రకామగతిఖేలన నొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించుబలదర్పపరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు సూరుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 66
భారతము, ఆ 1 ప 107.

## నదీస్తుతి

క. పావనగుణానుభావము, భావన గావింప నెట్టి పరమనదులు నీ
కావేరికి సదృశంబులు, గావేరికి నైనఁ బొగడఁ గా వెరవగునే. 67

లయ. ఈనది ప్రవాహయుగళీనిభవిభాసితభు, జానియతరంగసదనూనపరిరంభం
బీనది భజన్నిఖిల మానవమనఃకలుష, తానిరసనాతిపటుతానుతజలౌఘం
బీనది సమస్తతటినీనికరదుష్కరత, రానుపమచిద్విభవ దానమహనీయం
బీనది పవిత్రతరమీనది శుభైకనిధి యీనది విముక్తికి ని దానము గణింపన్.

ఉత్సాహ. అమితరంగధామలక్ష్మి నరయఁ బ్రసూతమణినికా
యములఁ బూజ సేయఁ దాల్చినట్టి నేత్రిభుజసహ
స్రములు గాని జలరుహములు జలరుహములు గావు భం
గములు భంగములును గావు గణన సేయ నీనదిన్. 69

మానిని. బంగరుచేలయుఁ బద్మనిభాక్షులు బాహుచతుష్కము భవ్యవిభో
త్సంగితశంఖసుదర్శనశార్ఙ్గగదాముఖచిహ్నము తత్త్వము నీ
లాంగము నీనది యారఁ సృజించు నిజాశ్రితదేహికి నంతికస
ద్రంగళయానుఁ దిరంబుగ జూచి కరంబికివో చతురత్వ మనన్. 70
కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 137–140.

శా. తా నైరింపక పర్ణయుండఁగ భవద్గర్భమ్మునం దాల్చి తే
జో౽సహ్యున్ శరజన్ముఁ గాంచి యలనీహారక్షమాభృత్కుమా

రీసాపత్న్యముఁ గన్న మోహపుఁబురం◆ధ్రీరత్నమా దీనకా
వే సర్వజ్ఞుఁడు నిన్ను నేల దలపై ◆ నెక్కించుకో జాహ్నవీ. 71

క. వెల్లువెసగఁ జల్లువిసమా, తెల్లనిదొర కుతికమోవఁ ◆ దిని బ్రతుకుటనీ
చల్లఁదనమ్మునఁ గాదే, కల్లోలవతీమతల్లి ◆ గంగాతల్లీ. 72

క. పువ్వారుఁబోఁడివై వరి, యొవ్వారన భీష్ముఁ గాంచి◆యిం పొందితివీ
నవ్వాని యెఱుఁగుదువె మా,యవ్వా పోషింపఁ బాడి యగు◆నను నికున్. 73

క. తల నీ గంగాతీర్థము, చిలికినవాఁ డీశ్వరుండు ◆ చేరెఁడు లోఁ గోఁ
గలిగినఁ దరఁగలఁ దేలం, గలిగినఁ దన్మహిమ లెన్నఁ◆గాఁ దర మగునే. 74

క. మునకలు గంగానదిలో, నొనరించుటకన్న భాగ్య◆మున్నదె ? యనుచున్
మునకలు గంగాదిగి వరి,జనములు కైలాగొసంగ ◆ స్నానోన్ముఖుఁడై. 75

విజయవిలాసము, ఆ 1 ప 114, 120.

సీ. కృపయును మేధయుఁ ◆ గీర్తియు సిద్ధియు, శ్రద్ధయు బుద్ధియు◆క్షమయు నీవ
సంధ్యయు రాత్రియు ◆ శశియందుగల్గు కాం,తియుఁ బావకునియందు◆ తేజమీవ
రవియందు ప్రభయు స◆రస్వతి గాయత్రి, సావిత్రి స్వాహాయు◆స్వధయు నీవ
లక్ష్మియు గౌరియు ◆ లజ్జయుఁ దుష్టియు, శాంతియు భూతియు◆దాంతి నీవ

గీ. నీవ యన్వీక్షకీదండ◆నీతు లనఁగ, యజ్ఞవిద్యయు నాత్మవి◆ద్యయును నీవ
మతిత్రయీవార్తలును మహా◆మతియు నీవ, సర్వమును నీవ సురమాన్య◆జహ్నుకన్య.

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 4 ప 16౨.

సీ. అఖిలలోకేశ్వరి◆కాదిశక్తికి జగ,జ్జననికి మాయకు◆శంభుపత్ని
కామ్నాయవేద్యకు ◆ నపవర్గధాత్రికి, పరమకల్యాణికి ◆ పావనికిని
జలజోద్భవస్థాన◆సౌధాధిరోహని, శ్రేణికి శుభవిత్త◆సేవధికిని
భరతఖండక్షమా◆భరణముక్తాహార, వల్లికి భవదుఃఖ ◆ వనధితరికి

గీ. కపిలమునివరదృగనల◆క్షపితసగర, తనయసురపదసౌఖ్యసం◆ధాయినికిని,
గామితార్థైకవితరణ◆కల్పలతకు, నీకుఁ బ్రణతి భగీరథ ◆ నృపకుమారి. 77

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 4 ప 166.

శా. గంగాసంగమ మిచ్ఛగించునె మదిన్ ◆ గావేరి దేవేరిగా
నంగీకారమొనర్చునే యమునతో ◆ నానందముం బొందునే
రంగత్తుంగ తరంగ హస్తముల నా ◆ రత్నాకరేంద్రుండు నీ
యంగంబంటి సుఖించునేని గుణభ◆ద్రోత్తుంగభద్రానదీ ! 78

పాండురంగమాహాత్మ్యము, ఆ 4 ప 139.

స్రగ్ధర. నీరస్మేరాజ్జభృంగే • నిరుపమకరుణో • న్నిద్రభద్రాంతరంగే
తీరప్రోద్యత్కుడుంగే • దివిజమునికృతో • దీర్ణవాక్యప్రసంగే
ధీరవ్రాతానుషంగే • గృతపవనముఖో • ద్దీర్ణరంగత్తరంగే
పారావారాంగసంగే • భవభయచకితం • పాహిగంగే శుభాంగే. 79

వాసవదత్తాపరిణయము, ఆ 4 పద్య 49.

## సంస్కృతకవిస్తుతి

శా. లోకాలోకపరీతభూచరమహా • లోకోపకారంబుగా
శ్రీకల్యాణకరోరుకావ్యచయముల్ • సిద్ధంబుఁ గావించి న
శ్లోకుల్ పుణ్యమతుల్ జగద్గురువులై • శోభిల్లుచున్నట్టి వా
ల్మీకిన్ వ్యాసమయూరబాణకవికా • ళిదాసులం గొల్చెదన్. 80

సీతారామాంజనేయసంవాదము, పీఠిక. ప 9.

## ఆంధ్రకవిస్తుతి

ఉ. నన్నయభట్టు నాంధ్రకవి • నాథునిఁ దిక్కనసోమయాజినిం
బన్నగ సోమనత్కవిని • భాస్కరబమ్మెరపోతరాజులన్
మున్న ప్రసిద్ధిఁ గాంచుకవి • ముఖ్యుల నందఱ నెమ్మనంబులో
నెన్ని నమస్కరించెద న • భీష్టఫలాప్తిదనర్చునట్లుగాన్. 81

సీతారామాంజనేయసంవాదము, పీఠిక, ప 12.

## వ్యాసస్తుతి

మ. వివిధామ్నాయలతాలవాలధిషణా • విఖ్యాతవిజ్ఞానదీ
పవిభాలోకితలోకవర్తనుఁ గృపా • పారంగతున్ సాంఖ్యయో
గవిదు న్భారతసంహితావిరచనా • కల్పున్ దపోనిత్యు సా
త్యవతేయుం గృతకృత్యుఁ గొల్చెద ము • నీంద్రస్తుత్యు నత్యుత్తమున్. 82

మార్కండేయపురాణము, ఆ 1 ప 7.

క. వినుతింతు నవఘుఁ గవితా, జనకు రఘుస్వామి పుణ్య • చరితాంబుధిఖే
లనపరుఁ బ్రాచేతసుహృ, ద్వనరుహసన్నిహితశివుని • వల్మీకభవున్. 83

క. పంచమవేదగ్రథనవిరించను బ్రహ్మర్షిగణవ♦రేణ్యుం ద్రిదశా
భ్యంచితు నిశ్చలసత్కరుణాంచదపాంగునిఁ బరాశ♦రాత్మజుఁ దలఁతున్. 84

రామేశ్వరమాహాత్మ్యము, ఆ 1 ప 9, 10.

మ. నవచిత్రధ్వనిజాతిరీతులఁ బద♦న్యాసంబులం జూపఁగాఁ
గవితానర్తకిఁ బంచమశ్రుతిసభం♦ గౌశల్యమేపారఁ దాం
డవితంగా నొనరించి మించి భరతా♦మ్నాయాధికానర్ఘ్యమున్
స్తవనీయంబుగఁ జేయువ్యాసముని డెం♦దంబందు భావించెదన్. 85

సుమనోమనోభిరంజనము, ఆ 1 ప 10.

## వాల్మీకిస్తుతి

మ. కవిలోకాద్యుని హృద్యపద్యకవితా♦కల్పుం ద్రిలోకీజన
శ్రవణానందన రామకీర్తనకథా♦సందర్భదక్షు న్ముని
ప్రవరు న్భవ్యతపఃప్రభావవిభవ♦ ప్రఖ్యాతు వాల్మీకిఁ ద
త్త్వవిదు న్నిర్మలసత్త్వ సంతతము స♦ద్భక్తిం బ్రశంసించెదన్. 89

మార్కండేయపురాణము, ఆ 1 ప 8.

మ. తొలుతన్ వాక్కులహంసి సర్వమునమ♦స్తోమస్తుతాస్తోకది
వ్యలసద్రామకథాసుధాలహరికా♦వారంబులం దేలఁగాఁ
దులనాతీతకసత్కవిత్వకలనా♦ద్ధోరణ్యుపేతంబుగా
మెలఁగంజేసిన యాదిసత్కవిని వా♦ల్మీకిం బ్రశంసించెదన్. 86

సుమనోమనోభిరంజనము, ఆ 1 ప 9.

## కవిత్రయస్తుతి

క. భారతముఁ దెలుఁగుజేసిన ధీరాత్ము న్నన్నయార్యుఁ♦ దిక్కనమఖి నం
భోరుహభవనిభు నెఱ్ఱను ధీరత్నము నాత్మలో నుతింతు న్భక్తిన్. 87

రామేశ్వరమాహాత్మ్యము ఆ 1 ప 12.

## నన్నయభట్టస్తుతి

ఉ. సారకథాసుధారసమ♦జస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచు న్జనులు♦ హర్షరసాంబుధిఁ దేలునట్లుగా

భారతసంహితన్మును ద్రి♦పర్వము తెవ్వఁడొనర్చె నట్టి వి
ద్యారమణీయు నాంధ్రకవి♦తాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్. 88

మార్కండేయపురాణము, ఆ 1 ప 9.

## తిక్కనస్తుతి

చ. ఉభయకవిత్వతత్త్వవిభ♦వోజ్జ్వలు సంవిహితాధ్వరక్రియా
ప్రభు బుధబంధుభూరిగుణ♦బంధురు భారతసంహితాకథా
విభుఁ బరతత్త్వబోధను న♦వీనపరాశరసూను సంతత
త్రిభువనకీర్తనీయయశుఁ ♦ దిక్కకవీంద్రునిఁ గొల్తు నర్థితోన్. 89

మార్కండేయపురాణము, ఆ 1 ప 10.

## విశ్వకర్మస్తుతి

క. వేయివిధంబుల నినుఁ బ్రా, ధేయులమై పిలిచినాము ♦ తీరని ప్రేమన్
మాయుంచఁబోకు మాయెడ(?), మాయయ్యా విశ్వకర్మ♦ మముఁ బ్రోవఁగదే.
క. జగముల్ కల్పనఁ జేసిన, భగవంతుఁడ! సర్వమూర్తి ♦ పాలన! దేవా
యుగముల నన్నియుఁ గడపిన, మగవాఁడవు విశ్వకర్మ♦ మముఁ బ్రోవఁగదే. 91
గీ. దీనరక్షణ సర్వేశ ♦ దివ్యరూప, అంతకుఁ బ్రభవ యావ్యక్త♦ యమలతేజ
విశ్వభర విశ్వకారణ ♦ విశ్వకర్త, విశ్వపర విశ్వరక్షణ ♦ విశ్వకర్మ. 92

సనారీవిశ్వేశ్వరసంవాదము, ఆ 1 ప 192, 193, 216.

## బ్రహ్మవర్ణనము

ఉ. తారతుషారహారహిమ♦ధామసితాంబుజశారదాభ్రిమం
దారనిభోజ్జ్వలం బగుచుఁ ♦ దద్దయు వేగ మరాళవాహుఁడై
భూరిగుణాకరుం డమృత♦భుక్పతివంద్యుఁడు ధాత వచ్చె వి
(స్ఫా)రుఁడు భారతీవిభుఁడు ♦ పార్వతినాథునిఁ గొల్వ భక్తితోన్.(?) 93

వీరభద్రవిజయము, ఆ 1 పే 7.

సీ. తాతలతాత నా♦ త్తమ్మినెయ్యపుఁబట్టి, వేల్పుపెద్ద వా♦ వెలఁదిమగఁడు
తపసులకొనగాఁడు ♦ తనయులజట్టికాఁ, డెల్లవిద్యల నెఱ♦ నెఱుఁగుజాణ
ముక్కంటిసారథి ♦ ముల్లోకములఁ జేత, నంటకచేయు ని♦న్నానువుకాఁడు
పంచాళిరాయంచఁ ♦ బలసియాడెడురౌతు, కైలాటకపుమునిఁ ♦ గన్నతండ్రి

గీ. జగతి నేరికిఁ దన ప్రాలు ◆ మిగులదాని, బిరుదు లేకరి నేర్పులఁ ◆ బగులుపోఁడి
వాల్గు మొగముల దేవుఁడు◆న్నతి దలిర్ప, నచటి కేతెంచుటయు విన◆యమునఁ బ్రొక్కి.
శ్రీరంగమాహాత్మ్యము, ఆ 3 ప 485.

సీ. వాగీశ్వరీవక్త్ర◆వనజసారంగంబు, కలహాభోజనమానిఁ ◆ గన్నతండ్రి
సప్తలోకీచరా◆చరకల్పనాచణుఁ, డామ్నాయరత్నర◆త్నాకరుండు
కలశాబ్ధిశాయిపొ◆క్కిలితమ్మిపసికందు, తోయజాతాస్త్రుని◆తోడఁబుట్టు
పాలును నీరు నే◆ర్పఱచుతత్తడిరౌతు, కడుపు బంగారుబొ◆క్కసమువాఁడు
గీ. నలుమొగంబులవాఁడు వే◆ల్పులకు ఱేఁడు, బ్రదుకు బ్రొద్దుజనులకును◆నుదుటుటాకు
కవిలను లిఖింప నేర్చిన◆కరణికంబు, గరిమ నొప్పారుధాత జ◆గద్విధాత. 94
ఘటికాచలమాహాత్మ్యము, ప 22.

సీ. ఆకారమునఁ జతు◆రామ్నాయములు బ్రోయ, వందిబృందమ్ము భా◆వములఁ బొగడ
పాణిస్థితంబైన◆వీణయు నొసపరి, పాటల భాషావ◆ధూటి గొలువ
స్తుతులు నారదవసి◆ష్ఠులు వెంటరాఁ బారి, పజ్జల దేవతా◆ప్రభులు రాఁగ
గరుడగంధర్వకిం◆పురుషవారాన్నృత్త, గీతవాద్యములు ది◆గ్వితతి నిండ
గీ. మూర్తిమంతంబు లాయాగ◆ములు బురాణ, ములును ధర్మంబులును గొల◆కుల భజింప
హంసవాహనుఁడై సరో◆జాసనుండు, దక్షుఁ డలరంగ ధాత ప్ర◆త్యక్షమయ్యె.
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 1.

సీ. వెన్నపొక్కిటిదమ్మిఁ◆గన్నవేలుపు ఱేఁడు, తెలిపుల్గుపయ్యాళి◆నలరువాఁడు
బయకారిజడదారి◆పాపనిగనువాఁడు, పలుకుచిల్కలకొల్కి◆పాలివాఁడు
చావంచతూపుల◆సైదోఁడు గలవాఁడు, పాఁపమిన్కు ఱేఁబ్రొద్దు◆మోమువాఁడు
నుదుటఁ గన్నులవాని◆నుదుటఁ గాచినవాఁడు, జగములగలిగించు◆చతురులాఁడు
గీ. తూర్పుదొరవేఁడివేలుపు◆దుంతరౌతు, శేయినడకరి సంద్రంపు◆ఱేఁడు గాడ్పు
లిబ్బిదొరగిబ్బనెక్కుడు◆గబ్బిమగఁడు, కొలువదనరుచునుండును◆నలువ యెపుడు.
భోజసుతాపరిణయము, ఆ 1 ప 25.

సీ. శ్వేతకేతుఁడు జోక◆సేసి తెచ్చినపదా, ర్వన్నెయంచపుమాయి◆పడిగ నెక్కి
వెనువెంట వచ్చు సా◆విత్రీముఖస్త్రీల, ప్రణయభాషలమీఁది◆బాళి మాని
ప్రాఁబల్కుతుదలతోఁ◆బ్రణుతించుసంయమి, ప్రవరులనుతిఁ బెడ◆చెవులఁ బెట్టి
సృష్టిక్రమముఁ దెల్పఁ◆జేరికై నడచు బ్రహ్మల దిక్కు గని పూట◆లాడ మఱచి

గీ. ఘనకుచద్వయంబుఁ బఱితెంచు◆ కొదుకు వీణ, వినెదుర క్రియయుఁ బూనక◆ వేల్పుఁ జెలువ
లాడఁ బాడంగ నెడయాక◆ యాక్షణమున, దశముఖున కబ్జభవుఁడు ప్ర◆త్యక్షమయ్యె.
ఉత్తరరామాయణము, ఆ 2 ప 178.

సీ. వెలిదమ్మిరేకుపొ◆త్తులచిన్నిపాపఁడు, నలువమోముదమ్ముల◆ వెలయుసామి
తఘనబంగారురే◆క్కలవారువము జోదు, బ్రిత్తుకుపొద్దుల లెక్క◆ వ్రాఁతకాఁడు
కడుపుబంగారుబొ◆క్కపము నేపినదొర, జీవసూత్రముల సృ◆ష్టించుజాణ
కెందమ్మిగద్దియె◆క్కినవేలుపులపెద్ద, పలుకుఁబూబోణికిఁ◆ బ్రాణపదము
గీ. దివముఁ బోరిడుగాయకుఁ◆ గనినగేస్తు, కలిమిజవరాలు నోముకఁ◆ గన్నబిడ్డ
కంతుగాఁదలితోఁడు లో◆కముల ఱేఁడు, నలువగొలువున్న కనకమఁ◆టకముఁ జేరి.
దశావతారచరిత్ర.

చ. దురితవిదూరు సత్కరచ◆తుష్కు సమూర్ధచతుష్కు నుజ్జ్వలాం
బరమణిపావకోపమ వి◆భాపరిపూర్ణుని వేదశాస్త్రవి
స్ఫురణము మూర్తిగైకొనిన◆పోలిక వెల్గుచునున్నవానిఁ బం
కరుహవరాసనస్థుని వి◆కారవిదూరు విసర్వతోముఖున్. 99
క. సావిత్రియుఁ గాయత్రి, దేవియు వాగ్వనితయును శ్రు◆తిసూక్తముగా
సేవింప సిద్ధయక్షసు, రావలి గొలువంగ నున్న◆ యజుఁ గని రంతన్. 100
వేంకటాచలమాహాత్మ్యము, దా. చి. వేం. ఆ 2.

సీ. కాంచిరచ్చటఁ దప్త◆కనకాభదేహుండు, లోకవంతుండష్ట◆లోచనుండు
మహనీయదండక◆మండలుహస్తుండు, బాలభానుప్రభా◆భాసితుండు
నతిశయదివ్యప◆ద్మాసనాసీనుండు, పరమతాపసజన◆పరివృతుండు
నిర్మలసత్కర్మ◆నిష్ఠాగరిష్ఠుండు, పరమామృతధ్యాన◆పరవశుండు
గీ. నగుచు నామ్నాయధర్మశా◆స్త్రాదులందు, వింతమీఱఁగ మూర్తిభ◆వించి మెలఁగఁ
జేరి సావిత్రి గాయత్రి◆ భారతియును, గొలువఁగాఁ గొల్వునందున్న◆ జలజభవుఁడు.
వేంకటాచలమాహాత్మ్యము, ఆ 2.

సీ. గరుడవాహననాభి◆కాసారసంభూత, పానీయజాత మె◆వ్వానిమాత
సదవతాఖిలబుధ◆సత్కరదేవశ్రేణి, వాణి సుశ్రోణి యె◆వ్వానిరాణి
సకలచరాచర◆ జంతుసంతతిరూపు, పరసృష్టిజాల మె◆వ్వానిలీల
దివ్యాంగసహితమూ◆ర్తిభవద్ఘనవేదములపిండు లెవ్వాని◆మోములందు
గీ. నట్టిచతురాననుండు ప◆రాత్మభవుఁడు, సకలలోకేశుఁడజుఁడు ప్ర◆శాంతమూర్తి
కనకగర్భుఁడు పరమేష్ఠి◆ వినుతబుధుఁడు, ప్రకటగుణధుర్యుఁడగు పర◆బ్రహ్మ దనరు.
నరసభూపాలరాజీయము, ఆ 1.

గీ. వ్యాసశౌనకముఖభాగ♦వతులతోడ, సిద్ధగంధర్వకిన్నర ♦ శ్రేణి గొల్వ
గరుడవాహనమెక్కి యిం♦దిరయుఁ దాను, నాదినారాయణుండు ప్ర♦త్యక్షమయ్యె.
రుక్మాంగదచరిత్రము, ఆ 5 ప 164.

సీ. శ్రీవత్సకౌస్తుభ♦ చిహ్నితోరస్థలుం, డతులితపుండరీ♦కాయతాక్షుఁ
డిందీవరశ్యామ ♦ సుందరగాత్రుండు, హాటకరుచిరపీ♦తాంబరుండు
కనకకుండలకాంతి ♦ గండస్థలుండును, సురరత్నఘనకిరీ♦టోజ్జ్వలుండు
సురుచిరకటకనూ♦పురహారభూషితుం, డనుపమరూపయౌ♦వనవిలాసుఁ
గీ. డంచితస్మితకలితము♦ఖాంబుజుండు, శంఖచక్రగదాభయ♦చారుహస్తుఁ
డతిజవోన్నతి గరుడవా♦హనము నెక్కి, యంబుజోదరుఁ డప్పుడు ప్ర♦త్యక్షమయ్యె.
పద్మపురాణము, ఉ. ఆ 6 ప 100.

ఉ. నీరదనీలకాయమును ♦ నీరజపత్రనిభాయతాక్షులున్
శ్రీరమణీయవక్షమును ♦ జెన్నగుకౌస్తుభరత్నకాంతులున్
హారకిరీటకుండలస♦ముంచితదీప్తులు శంఖచక్రవి
స్ఫారవిరాజహస్తములు ♦ నద్భుతమై హరి దోఁచె ముందటన్ (?) 107
పద్మపురాణము, ఉ. ఆ 7 ప 19

సీ. అడుగునఁ బ్రభవించు ♦ నాకాశగంగతోఁ గటి నందమగుపీత ♦ పటముతోడ
భూతప్రపంచంబుఁ ♦ బుట్టించు శిశువుతోఁ దనరారు నాభిప♦ద్మంబుతోడఁ
బదునాల్గుజగములు ♦ భరియించు కుక్షితో, సిరికి నాస్పదమైన♦యురముతోడఁ
గన్నులఁ దొలఁకాడు ♦ కరుణారసంబుతో, నవ్విసన్నాననస♦మ్మూర్తితోడ
ఆ. వైనతేయు నెక్కి ♦ వరభూషణప్రభా, జాల మెసఁగ శంఖ♦చక్రకలిత
హస్తుఁ డగుచు నభయ♦హస్తంబుతోఁ బొడ, చూపి నిలిచె దనుజ♦సూదనుండు.

సీ. ఉభయపార్శ్వంబుల♦నొగిఁ జంద్రబింబంబు, సూర్యమండలమును♦శోభితముగ
నొక దొడ్డ చుక్కయు ♦ నొక యింద్రధనువును, నేకదేశంబున♦నిం పెలర్ప
నిడుపారి వెడలుపై ♦ నెటఁజొట్టివచ్చిన, సౌదామినీసము♦చ్ఛాయము దనరఁ
దనరుచనీలాంబు♦దం బుర్వి కేలొకో, చనుదెంచె నన శంఖ♦చక్రయుతుఁడు
గీ. కౌస్తుభంబును వనమాలి♦కయును మెఱయఁ, బీతవస్త్రంబుతోఁ బురు♦హూతనీల
కాంతిఁ దనువొప్పనత్యంత♦కరుణ నంబుజాక్షుఁ డాదంపతులకుఁ బ్ర♦త్యక్షమయ్యె.
భోజరాజీయము, ఆ 4 ప 188, 343.

సీ. దివ్యవిగ్రహకాంతి ♦ దిగ్విలాసినులకుఁ గర్ణోత్పలశ్రీలు ♦ గడలు కొలుప
మహితనానాకల్ప ♦ మణిదీప్తులంబర, స్థలిఁ జిత్రరచనలు ♦ సంఘటింప

నభినవాంశుకరుచు♦లానఁగా కచకాళి, ద్రాయోగశంకనీ♦రధికి నింప
శంఖచక్రాంశుపుం♦జము జ్యోత్స్నకౌముదీ, బాలాతపంబుల♦ పసలు చూప
గీ. సితవిశాలాయతేక్షణ♦శ్రీలు కుముద, వారిరుహకాననముల♦ వన్నె నెఱపఁ
గరుణ మూర్తీభవించె వి♦శ్వకారణి యనఁగ, నెలమిఁ బ్రత్యక్షమయ్యె ల♦క్ష్మీశ్వరుండు.
శ్రీరంగమహత్త్వము, భైర. ఆ 2 ప 429.

సీ. శరదిందుచకచక♦స్మయజిత్ప్రసన్నాస్యు, దొడ్డకెందమ్మికన్♦దోయివాని
నతిక్రమగల్లభా♦గాభోగఫాలాఢ్యు, మకరాంకరత్నక♦ర్ణికలవానిఁ
గాంబవోద్యచ్ఛ్రీవి♦డంబివృత్తశిరోధి, సిరిపొల్చు మచ్చ పే♦రురమువాని
నతనాభియుతవళి♦త్రితయశాతోదరు, జానులంబిచతుర్భు♦జములవానిఁ
గీ. గరివరకరోరుయుగు-చిరజం♦ఘురమణీయు, నరుణశోభితపదపల్ల♦వములవాని
హైమవసనుఁ గిరీటహా♦రాంగదాది, కలితు శంఖరథాంగాఢ్యు♦ నలరువాని. 111
ఆముక్తమాల్యద, ఆ 3 ప 84.

సీ. నీలమేఘముడాలు♦ డీలుసేయఁగఁజాలు, మెఱుఁగుచామనిచాయ♦ మేనితోడఁ
నరవిందములకచ్చు♦ లడఁగించుజిగిహెచ్చు, నాయతంబగుకన్ను♦దోయితోడఁ
బలుగురాయనిచట్టు♦ పలవన్నెదొరవట్టు, హొంబట్టుజిలుగుగెం♦టెంబుతోడఁ
నుదయార్కబింబంబు♦ నొఱపువిడంబంబు, దొరలంగినాడు కౌ♦స్తుభముతోడ
గీ. జయజయధ్వనిమౌళిపం♦జలులు నేర్చ, శర్వశతధృతిశతమన్యు♦ శమనశరధి
పాలకైలబిలాడిదే♦వాళితోడ, నెదుటఁ బ్రత్యక్షమయ్యె ల♦క్ష్మీశ్వరుండు. 112
మనుచరిత్రము, ఆ 6 పద్య 101.

సీ. దివ్యవిగ్రహకాంతి♦ దిగ్వధూవితతికి, హరినీలపల్లవు♦ లభినయింపఁ
జేవురంబునయందు♦ బెడఁగైనకౌస్తుభం, బెల్లచోఁగలయనీ♦రెండ గాయఁ
బింజింబికట్టిన♦ బిగుపుపచ్చనిపట్టు, తొలకారుమెఱుఁగులఁ♦ నుఱఁగలింప
నిడుదహస్తములఁ బూ♦నినశంఖచక్రంబు, లినచంద్రదీప్తుల♦నీనికొనఁగ
గీ. శిరసుమకుటంబు నింగిఁజొ♦త్తెవు గొలుప, గల్లములఁగుండలద్యుతి♦వెల్లిగొనఁగ
గలికితెలిసోగకన్నులఁ♦ గరుణచిలుక, జనవరునిమ్రోల శౌరి సా♦క్షాత్కరించె.
కవికర్ణరసాయనము, ఆ 6 ప 190.

సీ. శయనాసనాంశుక♦చ్ఛత్రాదికంబులు, దానయ్యె ఫణికులో♦త్తముఁడు గొలువ
ధ్వజమువాహనమువీ♦వనయు నాఁగఁ బెక్కు, రూపమై గరుడుఁడా♦రూఢిఁ గొలువ
వఱలువిద్యాధిదే♦వతయైనవేత్రంబు, పూని సూత్రవతీవి♦భుండు గొలువ
నారక్షకత్వమిఁ♦ పారఁ బత్పురిఁ గాచు; కుముదాదినిత్యసం♦ఘములు గొలువ

గీ. భువనములమష్టనిగ్రహం◆బునకుఁ దాన, పాలువడియున్న యాయుధ◆పంచకంబు
జయజయధ్వను లెసఁగఁగఁ◆జారుపురుష, భావమునఁ గొల్వ నాశ్వర◆భర్తకెఱఁగు.

మధురగతిరగడ

కెందమ్మిలవడఁ◆కించుపదంబులు, నిందువైభవము◆ నేలునఖంబులు
గరమరుదగుచో◆క్కటపుఁజీలుఁదొడలును, గరికరవిభవము◆ గాదనుదొడలును
బదియార్వన్నియ◆ బంగరుపలువును, మెదలెడితళుకుల◆ మేఖలచెలువును
భువనజనకుఁగమ◆ పొక్కిలివిరియును, దవిలియురంబునఁ◆ దనరెడుసిరియును
నరయజీవమయ◆మగుకౌస్తుభమును, నెరయవైజయం◆తీసౌరభమును
బ్రికృతిమయతఁజొ◆ప్పడుశ్రీవత్సము, వికసిల్లఁగఁబ◆ర్వెడుఘనవత్సము
నహంక్రియాత్మక◆మగుశంఖంబును, మహానీయమనో◆మయచక్రంబును
దనర నొకవిచి◆త్రపుపోయగమును, ననువుచఱచుహ◆స్తాంబుజయుగమును
నురగతల్పమున◆ నూఁదినకరమును, బిఁగినజానువు◆పై నొకకరమును
నవ్యమకరకుం◆డలనువిలాసము, భవ్యకపోల◆ ప్రకటితహాసము
పవడమునుగణిం◆పనిమెమ్మోవియు, నపచంపకనిభ◆నాసికఠీవియుఁ
దెలిదమ్ములఁబగు◆తీరునయనములు, పొలుపలరెడుకను◆బొమలచెలువములు
కనుఁగొనవింపగు◆కస్తురినామము, వనువమానమగు◆ నలకస్తోమముఁ
గలకలనగుచ◆క్కనిపదనంబును, ధళధళమమర◆త్నకిరీటంబును
పనుకృతజలధర◆మగువర్ణంబును, నివకోటులపగి◆దిరౌంద తేజంబును
గలుగుదివ్యమం◆గళవిగ్రహమున, వలదుభక్తిని◆త్యానుగ్రహమునఁ
బరఁగురమావిభుఁ◆బరమపదేశ్వరు, నిరవద్యాత్మకు◆ నిత్యు నిరీశ్వరు
నజు నచ్యుతు హరి◆ నఘువంహారుని, త్రిజగన్నాథుని◆ త్రిగుణవిదూరుని
నఖిలశేషిఁగరు◆ణైకపరాయణు, నిఖిలవేదవ◆ర్ణితు నారాయణుఁ
గొలిచి నిత్యము◆క్తులు ప్రమదంబున, నలరుదురక్కడ◆ నతివిభవంబున. 115

కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 230, 231.

సీ. శ్రీవత్సమనుమచ్చ◆ జెలఁగుపెమ్మోవితోఁ, గౌస్తుభమణిపతా◆కంబుతోడ
మకరకుండలభాస◆మానకర్ణములతో, దంబైన మణికిరీ◆టంబుతోడ
శంఖచక్రాదిత◆జద్భుజాగ్రములతో, దయ లీను నేత్రప◆ద్మములతోడ
నొసపరివలువాటు◆పసిఁడిదువ్వలువతోఁ, గమల గాపున్నప◆క్షంబుతోడ

గీ. హారమంజీరకటకకే♦యూరకంక, ణాంగదంబులతో మంద♦హాసవదన
చంద్రబింబంబుతో గుణ♦సాగరుండు, హరి సుబోధుని యెదురఁ బ్ర♦త్యక్షమయ్యె.
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 2.

సీ. నలువుగాఁ బులుఁగురా♦బలుగుటానిదువాళి, దోలువాఁ డభయంబు♦ కేలువాఁడు
చెలువుగా నలువుగా♦దలువ గాయెనటంచు, మెచ్చువాఁ డన్నింట♦ హెచ్చువాఁడు
నీలుగాఁ గరము మా♦నిక ప్రమాటున మాటు, మచ్చువాఁ డిడుమాని♦రచ్చువాఁడు
వెలయఁగాఁ జెలిమి చేఁ♦గలిమి చేడియ యొక్కు, నురమువాఁడు దిరియాం♦బరమువాఁడు
గీ. పొడుగుచుడుగును గాంచిన♦యుడుగువాఁడు, పిడుగు వడుగు నరిపునొంచుఁ నుడుగువాఁ
చెడుగులుడుగునట్లుగ నమ్మ♦దోడుగువాఁడు, బడుగువడుగు రూపున బలి♦వడుగువాఁడు.

సీ. కరశాఖలజనించు ♦ వరప్రవృత్తరుణప, త్రములు శాశంఖచ♦క్రములు దనర
గొనబుమై నిండఁబ♦ర్వనకౌస్తుభచ్ఛాయ, పడుపుజ నపరంజి♦వలువ జెలఁగ
బహిరీక్షితాంతఃకృ♦పారసస్థితమై, వాలంబు రూఢి శ్రీ♦వత్స మమర
మర మెక్కు సిరితోడ ♦ నొరయికశిర మెక్కు, మహాయనహరినీల♦మకుటమొనర
గీ. నలుగువిలుకాఁడులవలీద♦శాయుధములఁబూన్పనిజచిహ్నములు నాఁగ♦పోలయుగళి
నవ్యమణిమయమకరకుం♦డలము లెసఁగ, నించువేడుక సాక్షాత్క♦రించె మదిని.
చంద్రాంగదచరిత్రము, ఆ 1 ప 70, 71.

సీ. పదివేలసూర్యబిం♦బము లొక్కట్రో వైన, కరణి సుత్కృష్టప్ర♦కాశ మెసఁగ
శృంగారరసము మూ♦ర్తీభవించినలీల, ఘనలీల సుందరాం♦గము వెలుంగ
నిందుషోడశకళ♦లేకోత్తరాభివృ, ద్ధి నెసంగెనన మోము ♦ తెలివిమీఱ
సౌదామినీలతాం♦చ్ఛవినిచ్ఛలంబైన, పడుపునజాళువా♦వలువ మెఱయఁ
గీ. పాంచజన్యసుదర్శన♦ప్రముఖదివ్య, సాధనంబులు మరకత♦స్తంభవిజయుఁ(ఱ్యె.
బాహుపలుఁబూని పతగేంద్ర♦వాహుఁడగుచు, నాదినారాయణుండు ప్ర♦త్యక్షము
కవిరాజమనోరంజనము, ఆ 2.

సీ. లోచూపునిలుకడ♦యై చూచువారిలో, నుండువాఁ డసురులఁ ♦ జెండువాఁడు
నెమ్మదిలోఁ దన్ను ♦ నమ్మి కొల్చినవారి, నేలువాఁ డంబుధిఁ ♦ దేలువాఁడు
వేడుకఁ దొలువల్కు ♦ మేడలలోనఁ గ్రీ, డించువాఁ డఘములఁ♦ద్రుంచువాఁడు
సంచరింపుచు నీప్ర♦పంచ మెల్లప్పుడుఁ, జూచువాఁ డమరులఁ♦గాచువాఁడు
గీ. నిక్కి యెక్కులతేజినై♦నెక్కువాఁడు, మీఱి పెనుబావపాన్పునఁ♦జేరువాఁడు
చుట్టువాలును సంకుసు♦బట్టువాఁడు, గొప్ప బంగారుదుప్పటిఁ♦గప్పువాఁడు. 120
లక్ష్మీనారాయణపరిణయము, ఆ 3.

# తృతీయభాగము

సీ. వనజమోహనునఁ జేరినభాస్కరుఁడో నాఁగ, [illegible]ముసఁ జక్రమమరఁ
గరికరంబునఁ బీతాంబరమహంబు వగులీల, నొకకేల శంబుజంబొప్ప మీఱ
నంజనాచలముపై నరుణాతపము మించు, రిహిమేనఁ గనకాంబరము దనర్పఁ
దొలివేల్పురాపత్రిమలచెక్కడపుగండ, పెండెంబు శాకాలఁ డిండిఁ జూప
గీ. శార్ఙ్గతూణగదాఖడ్గసహితమహిత, గాయనస్కంధమెక్కి బంగరపుగట్టు
తుదను గనుపట్టు నీలతోయదమనంగ, శాత్రవజిగీషనరుదెంచెఁ జక్రధరుఁడు.
ఉత్తరరామాయణము, ఆ 2 ప 43.

సీ. తొడలపై నిడి యొత్త వడుగుపంటవలంతి, జఘనంబుఁ జాఁకించు సరసలీలఁ
మడుపు దెమ్మని మోము మలచిచూడనిలీలఁ, గుచముపై చేసాచు గోడిగంబు
వవఖకన్యాకకిన్క వత్తంబు డిగ్గిరయు, త్రిగిలచేవలగొను దంటతనము
విసరకుమని తాళవృంతపుత్రినవల్చి, యందఱ నవ్వించు సంతసింపు
గీ. వొకరొకరెఱుంగనటులగాఢోపగూహ, చుంబనంబులసౌఖ్యంచుసాగనువగలఁ
తెలియ దక్షిణనాయక విలసనమున, శేషశయ్యాశయానుఁడై శ్రీవిభుండు. 123

సీ. తనమొగ్గిక్కఁ గినుకఁగ్రొ గొనక లచ్చివిదిర్చ, పదనఖం బంటినఁ బాలతలము
వనశాళివండన వలచి మూర్ధానఁగాఁ, బాంబూలమంటిన తెసుకఁగన్న
లరవిందమందిర యామాలమాగఁ బీల్చ, మొదటిరక్తిమమించు ముద్దుమోవి
కెమ్మోవి నొక్క జంకించియుందిరవిాటఁ, గొనగోటసోఁకిన మినుకుఁ జెక్క
గీ. చిటులఁ కస్తూరితిలకంబు జిరు చెమటయు, గలిగినుత తాంత కాంతిశృంగార
జాటు శ్రీహరిమఖజలజమునవాత్రి,మఱిఱినళిపద్మకులల్లానమ్మానిపరులు (లక్ష్మి
గీ. భువనమోహనశృంగారపూర్ణ మగుచు, వెలయు హరిదివ్యమంగళవిగ్రహమును
మగ్నమై చిత్తమానందమయతఁగాంచె, విషయవిక్షేపములులేమిఁబుసివరులకు.
దశావతారచరిత్ర, ఆ 8.

సీ రజకుని గొట్టి వస్త్రములు గట్టకయున్నఁ, దనకు లే వాటొనే కనకపటము
వెస ముడామడోసంగు విరులుదాల్పకయున్న, వక్షస్థలిని లేద వైజయంతి
కుబ్జచేఁ గలపంబుఁ గొనకున్న నిందిరా, కుచకుంభఘుసృణంబు కొదవపెనకుఁ
ఘంధశారాతివిల్లువమారింపకయున్న, నరయమే యూశ రాముఁడమ చుఁదన్న
గీ, కరికువలయంబు దయ్యుఁ జెల్లునేకరివధింప,భువనపతి యయ్యుఁ జెల్లుతోఁ దోరవలెనె
హరికి నివియు వినోదంబులయ్యెనే మొ,యనుచుఁదోవఱ్చనక్రూరుఁడనఁగ శౌరి.
దశావతారచరిత్ర, ఆ 9.

సీ. శ్రీకమలాలయా ◆ సీమంతినీమణి, నాయకుం డఖిలార్థ ◆ దాయకుండు
హారకిరీటకే ◆ యూరకుండలముఖ్య, భూషణుం డాశ్రిత ◆ పోషణుండు
శంఖచక్రగదాసి ◆ శార్ఙ్గాదిసాధన, భూషితుం డతులసం ◆ భాషితుండు
ఘనవనమాలికా ◆ కౌస్తుభగ్రైవేయ, కంధరుం డురుదయా ◆ బంధురుండు
గీ భాసురుండు సురక్షిత ◆ వాసవుండు, శ్రీధరుండు బలోద్ధృత ◆ భూధరుండు
సాధుజనముని దేవతా ◆ సకలభక్త, రంజనపరాయణుండు నా ◆ రాయణుండు 126
నరసభూపాలరాజీయము, ఆ 1.

# ఈశ్వరవర్ణనము

సీ. తలమీఁదియేటిలో ◆ త్తరఁగలతో మించు, తరఁగలు పొరిఁబొరిఁ ◆ దార్కొనంగ
సడలిననిడుదకెం ◆ జడలును ముదురఁబం, డిన నాఁచుదీఁగలుఁ ◆ బెనఁగొనంగ
నఱచందురునికొ ◆ త్తమెఱుఁగులునంచ కెక్కలయచ్చతెలుపులుఁ ◆ గలయఁబడఁగ
నతిలిక్రొన్నలుపుని ◆ పగునల్లకలువపు వ్వులనిండుజిగియును ◆ జెలిమిసేయ
గీ నంగమునభూతిపొలుపున ◆ నంబుమూర్తి, మిగులఁ జెలువెక్కి మొగిచిన ◆ మీఁదికంటి
చెన్నుపద్మరేణువులంట ◆ నొప్పు మిగిలె, నభవునకు గంగ సలిలవి ◆ హారలీల. 127
హరివంశము, ఉత్తర. ఆ 7 పే 172.

సీ. తలమీఁదిచదలేటి ◆ దరిమీలఁ దినఁ జేతు, కొంగలు చెలఁగికొం ◆ గొంగు రనఁగ
మెడదన్ను పునుకల ◆ నిడుపేరులొండొంటి, బొరిఁబొరిఁ దాఁకి బొ ◆ బ్బొణుఁగురనఁగఁ
గట్టినపులితోలు ◆ కడకొంగుసోఁకి యాఁ, బోఁతు తత్తడి చిట్టు ◆ బుట్టు మనఁగఁ
గడియంపుఁబాములు ◆ కకపాలలో నున్న, భూతిమైఁ జిలికిన ◆ బుస్సు రనఁగ
గీ. దమ్మ్రపూజాలిపునుకకం ◆ చమ్ము సాఁచి, దిట్టతనమున బిచ్చము ◆ దేహి యనుచు
వాడవాడల భిక్షించు ◆ కూడు గాని, యిట్టి దివ్యాన్నములు మెచ్చు ◆ నే శివుండు.
హరవిలాసము, ఆ 5 ప 16.

సీ. పైనొప్పఁ బెట్టిన ◆ భద్రదంతావళి, తోలుతో మొలఁబులి ◆ తోలుతోడ
కమనీయమైనవే ◆ గంధుకంఠముతోడఁ, బోలుపార నెరపూఁత ◆ భూతితోడ(?)
ఘనతరంబగు నాగ ◆ కంకణంబులతోడఁ, దనరారుఁ శూలాయు ◆ ధంబుతోడఁ
బటుజటావలిలోని ◆ బాలచందురుతోడ, దయతోడ నభయహ ◆ స్తంబుతోడ
ఆ. లీల నంది నెక్కి ◆ లేనవ్వు దొలకాడ, పడఁతి కభయ మియ్యఁ ◆ బల్లవించి
భక్తబాంధవుండు ◆ భవుఁడు ప్రత్యక్షమై, శైలరాజపుత్రి ◆ మోల నిలిచె.
వీరభద్రవిజయము, ఆ 2 పే 28.

సీ. గిరిజానాథుండు ముం♦గిటి పెన్నిధానంబు, కృత్తివాసుండు తం♦గేటిజున్ను
గోరాజగమనుండు♦ గుజ్జుమామిడిపండు, కుసుమాస్త్రహరుఁడు ముం♦గొంగుపసిఁడి
శీతాంశుధరుఁ డఱ♦చేతిమాణిక్యంబు, కద్రూజకటకుండు ♦ గాదెకోలుచు
కరటిదానవవైరి ♦ పెరటికల్పద్రుమం, బసమనేత్రుఁడు సిద్ధ♦రసము చెలఁగ
గీ. పింగళుఁడు గాడెఁ గట్టిన♦వేల్పుటావు, పాటకాచలధన్వి సి♦ద్ధాంజనంబు
పురహరుఁడు పెట్టెలోనున్న ♦ పరసువేది, ప్రమథభర్త చింతామణి♦ భక్తులకును.
శకుంతలాపరిణయము, ఆ 4.

సీ. వనరాశిఁ బొడసూపు వాఁ♦డనితలపువ్వుతో, జడలఁగట్టిన గంగ♦మడుపుతోడ
మినుకు లీనెడుకన్ను ♦ మినుకరిసొమ్ముతోఁ, బూసిన మదనసం♦భూతితోడ
చెలఁగి అంకెలువైచు ♦ వెలిగిబ్బయూపుతో, డావంక నొరగు పా♦మరితోడ
వెంటఁదాఁ బ్రవుడుగాము♦చప్పుడువ్వలువలోఁ, జేయూపు ప్రుణికెఁ ♦ జేమతోడ
గీ. తుంటవిరిచిన మిక్కిలి ♦ కంటితోడ, సంకువన్నెయౌ నెవ్వని♦చాయలోడ
గ్రామగుర్తంబు పాలిఁటి♦భాగ్యరాశి, యతఁడు నక్షత్రహారుఁడు సత్కృపను గాచు.
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 4.

సీ. అతులసౌదామినీ ♦ లతలకెంజిగిమించు, లతల మీఱెడు జటా♦వితతివాని
సకలంకహరిణాంక ♦ శకలకోటీరంబు, దండమిన్నేటిపూ♦వండవాని
వనజాస్త్రచందద్రిపా♦వకనిశాధికపా, తిరిముగైన విషమనే♦త్రములవాని
నిరుపమందహితకుం♦డలి ఫణామణిరోజి, జిగి ధరించినగళ ♦ యుగమువాని
గీ. సనద్ధశానందమయసుధా♦గసము మించి, పసుపులను సృజించిన♦పసిమిచాయ
కన్నెఁజెలువ్వవెన్నెల, కలిమిచెలువుఁజూపుముఖచంద్రబింబంబు♦సొగసువాని.
శ్రీమంతస్వీకళ్యాణము, ఆ 2.

సీ. రాకేందునీకాశ♦రమ్యనేత్రమువాని, రమణీయఫణిభూష♦ణములవాని
కందర్పశతకోటి♦సుందరాకృతివాని, డమరుత్రిశూలల♦క్ష్మములవాని
సమమలదరహాస♦సరసాననమువాని, భసితాంగరాగవి♦భ్రమమువాని
సింధురాజీసమం♦చితకిశోరమువానిఁ, గరుణాకటాక్షవీ♦క్షణమువాని(?)
గీ. ప్రథితభువనాద్భుతోరువై♦భవమువాని, ఘనతరానందహృదయపం♦కజమువాని
సకలలోకాధిపతియైన ♦ సాంబశివునిఁ, గనిరి యా మునిమాళి కన్నుల♦కఱవుదీర
శివలీలావిలాసము, ఆ 1 ప 45.

సీ. కంకణఫణి లోప్పం♦కగమెత్తి వృషభంబు, నదలింప శశిరేఖ ♦ బెదరుచుండ
బెదరెడుశశిరేఖ ♦ వదలిరా పెడసేరు, లాగి నాని వేదముల్ ♦ మగుడఁజదువ

జదువుచో ౘానర◆సంబు మిక్కుటమైన, ఖట్వాంగ మప్పుడె◆క్కటి జిగుర్పఁ
జిహ్వరెక్కచెలరేగ◆జీకను గమనట్టి, పడతిఁ జేర్పగువామ◆భాగ మమర(?)
గీ. వివిధదిక్కుల (బహ్మ◆విబుధు లలర, నాగదైత్యులు గోరువ◆రంబు లొసఁగఁ
బొసగఁజను దెంచెశివుఁడుచి◆న్మూర్తితోడఁ, దోడ నేతెంచుప్రమథసం◆స్తోమ మమర.
ఒడయనంబివిలాసము, ఆ 2 పే 25.

సీ. చలువలు వెదచల్లు◆తలపూవుగుత్తితో, జడలలో మించుమి◆న్నడముతోడ
తెలుపైనవంగులు◆తుంకించు మేనితో, సామేన నిడుకొన్న◆చానతోడ
కనకజాతలమూఁడు◆మొనలకైదువుతోడఁ, గట్టిన ముప్పన్నె◆కాసెతోడ
బలువైనడాకాలి◆పాపపెండెముతోడఁ, బొలుపారువలపుల◆బూతితోడ
గీ. చక్కనగు నెమ్మొ చిఱుగంట◆సరులతోడ, నొడలు నేనికతోలుప◆చ్చడముతోడ
చేతఁ బట్టిన ముద్దుల◆జింకతోడ, వెలయు ముక్కంటిఁ గాంచి రా◆వేల్పులెల్ల.
లక్ష్మీనారాయణపరిణయము, ఆ 3 పే 70.

సీ. మొలకచుక్కలరాజు◆మొల్లపువ్వునుబోలి, మించినలీల గీ◆లించినాఁడు
పాడలఁ గెంజాయల◆పులిరక్కనునితోలు, కటిమీద డిండుగాఁ◆గట్టినాఁడు
విశదరత్నప్రభల◆వెదజల్లు శేషాహి, గొడుగుపావాలుగాఁ◆దొడిగినాఁడు
వడకుగుబ్బలిరాచ◆పట్టిని సామేన, నునిచినగతినుండ◆నిచ్చినాఁడు(?)
గీ. కలికిమాపులఁబచ్చవి◆ల్కానిఁజూచి, భూతిగానెరిపూఁతను◆బూసినాఁడు
అట్టిదేవుండు సకలక◆ల్యాణమూర్తి, యాశిలాదునియెదుటఁబ్ర◆త్యక్షమయ్యె.
పర్వతపురాణము, ఆ 2 పే 18.

సీ. ముడిచినాఁ డేవేల్పు◆మున్నీటివడువీథి, సింగారపూఁదోఁట◆చిన్నిపువ్వు
కట్టినాఁ డేవేల్పు◆కటిమీద శింధుగా, పదితెరంగుల వన్నె◆పచ్చడంబు
అలఁదినా డేవేల్పు◆యంగరాగము మేన, కలికివాసన దశ◆గతులు దవగ(?)
కైసేయు నేవేల్పు◆కమ్మతెమ్మెర లంబు, కడిగినమాణిక్య◆కంకణములు(?)
గీ. సకలలోకములనుజేయు◆జాల సొబగు, మించి మెరయును నేదేవు◆మేనితోడ ప్ర
అట్టిదేవుండు కరుణాను◆ధాంబురాసి, యచలవల్లభు నెదుటఁబ్ర◆త్యక్షమయ్యె.
పర్వతపురాణము, ఆ 2.

సీ అరుణజటాధారి◆యయ్యు భక్తులకును, జ్వలహేమమకుటము◆ల్గలుగఁ జేయు
నాశాంబరుండయ్యు◆నాశ్రితశ్రేణికిఁ, బట్టాంబరంబులు◆కట్టనిచ్చు
భసితలేపనుఁడయ్యుఁ◆బాదసేవకులకు, ఘనసారసారచం◆దనములొసఁగు
వృషభవాహనుఁడయ్యుఁ◆వినమజ్జనులకెల్లఁ, గరితురగాందోళి◆కలు ఘటించు

గీ. గరళధరుఁ డయ్యె ♦ నాత్మకళత్ర దీన,జనుల నందఱ నమృతభో♦జనులఁ జేసె
కొండకూఁతురిమాంగల్య సూత్రమహిమ ప్రభావ, మీశుఁడే యింత భువనంబు♦లందుఁ గలఁడె.

సూత్రిత్రిమూర్తివ్యాఖ్యానము, ఆ 5.

సీ. జలు కెంజడలతోడఁ ♦ బెలిగ చెన్నలరు వెన్నెల, కల్కి నెన్నలవతంస♦కంబుతోడ
వలుఁద శూలముతోడ ♦ వలిపంపు జలములో, నెల్లకొబ్బ గరళభ♦ృత్కళముతోడ
గిబ్బతత్తడితోడ ♦ గిరిరాజు హాసరాజుఁ, గరిరాజు సగు మేని ♦ కాంతితోడ
బుసుకకంచముతోడ ♦ ననతూపు లనయేపు, గనవోపు దొరబూది♦మినుకుతోడఁ
గీ. బ్రహ్మథతతితోడఁ బార్వతీప్రమదతోడఁ, గరిముఖాదికుమారవ♦ర్గంబుతోడ
శివుఁడు మందానగిరితుంగ♦శృంగవీథిఁ, జెలువుమీఱంగ స్వారి వేం♦చేయునపుడు.

ఉత్తరరామాయణము, ఆ 1 ప 260.

సీ. నందికేశ్వరు నెక్కి ♦ సజనసంపారంగ, నాగభూషణములు♦ నవ్యముగను
వ్యాఘ్రాజినాంశుక♦వ్యక్తి సొంపారంగఁ, బాణిపద్మంబులఁ ♦ బరగువరము
నభయంబుశూలంబు♦ నద్భుతడమరును, బిలసిల్ల శృంగార ♦ విభవ మెసగఁ
జంద్రికళాజాతి ♦ సౌందర్య మొప్పార, నమితతేజస్ఫూర్తి ♦ నవహసించు
గీ. దివ్యవిభ్రమకాంతులు ♦ దేజరిల్ల, నిఖిల భూషణ లాంఛన ♦ నియతుఁ డగుచుఁ
బ్రమథతతిగొల్వ సెంతయుఁ♦ బ్రమద మెసగఁ, హరుఁడు గిరిజకుఁ బ్రత్యక్ష♦ మయ్యె నంత.

వైశ్యపురాణము, ఆ 4.

సీ. శ్రీపార్వతీపరి♦ష్కృతశరీరముతోడ, నవసుధాధవళవ♦ర్ణంబుతోడఁ
గుండలీకృతమహా♦కుండలీంద్రులతోడ, డమరుత్రిశూలహ♦స్తములతోడ
మందాకినీవిని♦ర్మలకపర్దముతోడ, రమ్యమౌ వ్యాఘ్రచ♦ర్మంబుతోడఁ
జంద్రపాండురవృష♦భేంద్రయానముతోడఁ, గరవిరాజన్మృగాం♦కంబుతోడ
గీ. నారదాదులు సామగా♦నములు చదువఁ, బ్రమథగణములు సేవింప♦ భద్రయుతుఁడు
సకలసురచక్రవర్తి శ్రీసాంబ♦మూర్తి, సోమశేఖరుఁ డపుడు సా♦క్షాత్కరించె.

బ్రహ్మోత్తరఖండము, ఆ 4.

సీ. అనురాగసమ్మర్మ♦పడఁగ కుప్పించె నాఁ, దలగంగ ఘుమఘుమధ్వనులు బెరుగ
మకుటస్థపద్మసా♦మాన్యంబు దోఁచె నాఁ, దలఁ జంద్రకళ తళ♦తళల నీనఁ
గరుణార్ద్రనేత్రరం♦గములట్లు హర్షక,టాక్షేక్షలొండొంటి ♦ ననగి పెనఁగ
హృదయస్థహాస్యల్య♦ మెల్లఁ దెల్పెడులీల, ముసిముసినగవు కెం♦మోవి నెనయ

గీ. దంబు మీఱంగ నల జగదంబతోడఁ, బాకశాసనముఖ్యసుపర్వసర్వ
సతులు దేవర్షిసతులసన్నుతులు గొనుచుఁ, గంటఁ బడె నాకు గలనును [illegible]కంటి వేల్పు.
రాఘవపాండవయాదవీయము, ఆ 1.

సీ. జడముడి దోలఁ గాడు జాహ్నవీనదితోడ, మేనగమున నున్న మెలఁతతోడ
బరికిలఁ బ్రణుతించు ప్రమథవర్గముతోడ, జముపెట్టి [illegible]తోడఁ
బొగడెడు బ్రహ్మాది పుణ్యపేరులతోడ, [illegible]తోడ
గాలిచేవల్లనఁ గనలు సొమ్ములతోడఁ, [illegible]తోడఁ
గీ. బొలుపు మిగిలిన వలపుల భూతితోడ, [illegible]
గ్రమ్మునొదలఁ జంద్రిక[illegible]తోడ. [illegible]
[illegible]

# అర్ధనారీశ్వరుఁడు

సీ. పులితోలు రెంటెంబు వెలిపట్టు గెంటెంబు, కటిమండలంబున గరిమఁ [illegible]
భసితాంగరాగంబు బహుగంధయోగంబు, బాహుమధ్యంబునఁ బర్ధ[illegible]
శీతాంశునవకాంతి చేమంతి పూబంతి, యుత్తమాంగంబున నొప్పుఁ జూప
గండపెండేరంబు కలితమంజీరంబు, పాదపద్మములందుఁ బ్రతిఘటింప
గీ. నర్ధనారీశ్వరస్వామియై తనర్చు, దక్షపురిభీమలింగంబు దయ వొసంగ
నర్థిఁ గల నాకుఁ బ్రత్యక్షమైనఁ జూచి, మోదమిగురొత్తఁ బాదాబ్జములకు మ్రొక్కి.
రుక్మాంగదచరిత్రము, ఆ 1 ప 29.

సీ. విన్నాలపైఁ బాఱు వెల్లముత్యపుజల్లి, చలువలబచ్చు చెంగలువకచ్చు
పుత్తియలచౌకీలు పాలుపైనతడపాలు, పన్నగపసరము పన్నసరము
బలుకులబూది కొలిక్రొవ్వలపులజవ్వాది, వేలిమి మెకము విసాళిశుకము
చాలలరెంటెంబు పన్నంపుగెంటెంబు, ఫాలాషండులనాలు పసిఁడినూలు(?)
గీ. జమునిశిరమును మణినూపురమును మెఱయ, మురువుగలిగినతోడుగువాపురము నెక్కి
కరుణనయనాంబుజంబులఁ గడలుకొనఁగ, నెదుటఁ గనుపట్టె నర్ధనారీశ్వరుండు.
వరాహపురాణము, నం. మ. ఆ 9 ప 68.

సీ. గడితంబుఁ బూవన్నె పాదలదుప్పటియును, పసనినబంగారు పట్టుచేల
రుచిరాభినవమైన రుద్రాక్షమాలికల్, మురుసైన తొగమంజి ముత్యసరులు
భువనాభిరామ భూత్యంగరాగంబు, సారకాశ్మీర[illegible] చర్చ
భూరిశోభాకీర్ణ భుజగభూషణములు, ఘణిమయాతపనీయ కుండనములు

గీ. పాండురాయతవర్ణ ♦ విభ్రాజితాన, గాత్రమునఁ గల్గి శృంగార ♦ గరిమ వెలుఁగు
నర్ధనారీశ్వరేశ్వరుం ♦ డభవుఁ డిందు, మౌళి భక్తాళి వనయుంబు ♦ మనుపుచుండు. 143

శివలీలావిలాసము, ఆ 2 ప 150.

సీ. శార్దూలచర్మంబు ♦ మార్దవచేలంబు, భూతియుఁ గస్తూరి ♦ బోలుపు మిగులఁ
బాములహారముల్ ♦ పద్మాక్షిఖండంబు, సీమంతరేఖయుఁ ♦ జెలువు దనర
మిన్నేటినటనయు ♦ మేలిమిశాసయు, ఫణికుండలము దంత ♦ పత్రికయును(?)
సూక్ష్మస్తనంబు వి ♦ జృంభితకుచమును, మహనీయసౌందర్య ♦ మహిమ లలర
గీ. నర్ధనారీశ్వరాకృతి ♦ నమరఁ దాల్చి, పరగ శూలాంకుశాభయ ♦ వరదహస్త
సరసిజాతుం డగుచు మించి ♦ సదమలమతిఁ, జారుతేజోమయుం డైన ♦ శంకరుండు.

వైశ్యపురాణము, ఆ 2.

## శ్రీరంగశాయి

సీ. దక్షిణహస్తోప ♦ ధానవిధానుఁడై, వలపక్క గా నొత్తి ♦ గిలినవాని
నాజానుదీర్ఘత్వ ♦ మఖిలవేద్యంబుగా, నెడమబాహువు సాఁగ ♦ విడిచినవాని
నాకుంచితోత్కుంచి ♦ తాగ్రజానుకమై, యుండ నంఘ్రులు సాఁచి ♦ యున్నవాని
నాకస్మికస్మిత ♦ వ్యాకోచలోచన, యుగకోణములఁ గృప ♦ యొలుకువాని
గీ. జలధిని శ్శేషభూషణ ♦ శ్రమహిమాచ, లాగ్రవిశ్రాంతనవ మేఘ ♦ మనఁగ శేష
శయనశయుఁడైన కోమల ♦ శ్యామలాంగు, రంగపతిఁ గాంచె భారతీ ♦ రమణుఁ డపుడు.

కవికర్ణరసాయనము, పీఠిక, ప 40.

సీ. ఒనపరిపసమించు ♦ పసిఁడిదుప్పటివాని, శుభమైన యురము కౌ ♦ స్తుభమువాని
జెలిదమ్మి కేలఁ ♦ దొగడుకన్నులవానిఁ, గమ్మకస్తూరితిల ♦ కంబువానిఁ
దొలుపలుకు గిలుకుఁ ♦ బావలఁ జరించెడువానిఁ, జలువతావుల సెజ్జ ♦ వలచువాని
నింద్రనీలపుడాలు ♦ చేలువన్నెవానిఁ, సిరిమురుల్ గొలుపు మై ♦ చెలువువాని
గీ. మకరకుండలదీప్తిడం ♦ బరమువాని, దంబు నెఱపెడు మణికిరీ ♦ టంబువాని
రంగనాయకుఁ గాంచి సా ♦ ష్టాంగనతులు, సలిపి తన్మూర్తి మంతయుఁ గలయఁ జూచి.
చ. తమి యమరంగ జొక్కు కటిఁ ♦ దక్కఁగ నేలెడు నారమద్వలో
కమలవనీకిరీటమును ♦ గస్తురినామము వత్సమోము హా
రములును వైజయంతియును ♦ రక్షలరత్నము శంఖచక్రము
ఖ్యములును బొడ్డుఁదామరయుఁ ♦ గంకణకాంచిపదాంగదాదులున్. 150

కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 142, 143.

సీ. అక్కున వనమాలి • కాగరభృంగమో, శ్రీవత్సమో వి భ • జింపరాదు
జఘనసీమ సువర్ణ • శాటీద్యుతియొ నాభి, నలినపరాగమో • తెలియరాదు
పదమున శోణతా • పగవీచియో నఖ, రేందుమరీచియో • యెఱుఁగరాదు
తనువున నర్చనా • దత్తసూనంబులో, పాఁపమేపారలో యే • ర్పఱుపరాదు
గీ. కాంచితమనోజకించిదాకుంచితాంఘ్రి, యుగమిలారమలొత్తఁగా • నొత్తిగిల్లి
కటినొకకరంబుసాఁచి యొ • క్కటితలాడ, సమరఁబవళించియున్న రం • గస్వనిభుడు.
చంద్రభానుచరిత్రము, అ 2 ప 116.

సీ. వికటాక్షశశిభాను • లోకటనహాసమో, కరపాల శంఖచ • క్రములు మెఱయ
శ్రీకాంతవక్షస్థ • లీకౌస్తుభంబున, బంగారుప్రతిమనాఁ • బ్రతిఫలింప
భశ్రీయుకూణశేష • ఫణామణిప్రభ, దిననాథదీప్తులఁ • బోనుగు పఱుప
వాయుభక్షులు మునీ • శ్వరులు సురలు సంస్తుతి, సరసిజమ్ముల పైని • శిరసు లొగ్గ
గీ వాసవానల యమ దైత్య • వరుణ వాయు, వైశ్రవణ శర్వగీర్వాణ • వరులు గొలువఁ
గరుణఁ బ్రత్యక్షమయ్యె భ • క్తప్రజాంత, రంగవాంఛాప్రదాయి శ్రీ • రంగశాయి.
వైజయంతీవిలాసము, అ 4 ప 116.

సీ. తలగడగా నిడి • తలమూఁదివలచెంపఁ, గుడిహస్త మెత్తుగా • నిడినవాని
మేలి చేఁదొడవులు • మెఱుఁగుజాపలు మించు, పెఱకేలు కటిఁజాఁచి • మెఱయువాని
సిరి మేనిపొందునఁ • జిత్తంబు సొగయింప, నరమోడ్పుఁగన్నుల • నమరువాని
వాకుంచితోన్నతం • బగు వామపదమున, బిరుదునూపురము శో • భిల్లువాని
గీ. మొలకనగవులఁ దెలివొందు • మోమువాని, మెఱుపుగలమేఘరుచిఁ బోల్చు • మేనివాని
నురగశయ్యపై నొడికిలి • యున్నవాని, సకలశుభదాయి శ్రీరంగ • శాయిఁ గనియె.
శ్రీరంగమహత్త్వము, భై. ర. అ 1 ప 80.

సీ. పఱుపుగాఁ బఱచిన • ఫణిరాజభోగంబు, నవరత్నసింహాస • నంబు గాఁగ
నలఘూపధానంబు • వాజానుదీర్ఘంబు,లగు చేతులరిశంఖ • యుగము దాల్ప(?)
యఖినవో న్మేషజి • హ్వాంబైన తొలుచూపు, జాయమానదయారసంబుఁ గురియఁ
బవళించిలేచుని • బ్బరమునఁ బెనగొన్న, హారము నేవాని • తీరుపరుప
గీ. శారినకిరీట మహిమపై రి • చక్రదిద్ద, దివ్యమంగళపాదకో • ద్యన్ముత్తి మెఱయఁ
జంద్రపుష్కరిణీసర • స్సరిదభూమిఁ, జంద్రునకు రంగశాయి సా • క్షాత్కరించె.154
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. అ 4.

సీ. అమృతాంశుమూర్తిపై • నంకంబు పొంకంబు, బెరగుపన్నగశయ్య • నొరగువాని
జాచియుఁ జాపని • చరణపద్మంబులు, కమలలేదొడలపై • నమరువాని

ముఖచంద్రమండల◆సఖచంద్రిక యానంగ, సెలవుల చిఱునవ్వు◆చిలుకువాని
తలగడచాఁచిన◆దక్షిణహస్తముగా, నభయదానాభిన◆యంబువాని
గీ. పలుదమణులయనర్ఘకుం◆డలకిరీట, తారహారాంగదప్రభా◆తతులవాని
దివ్యమంగళవిగ్రహుం◆భవ్యతేజు, రంగనాయకుఁ గోర్కె లూ◆రంగఁ గనిరొ.
శ్రీరంగమాహాత్మ్యము, క. ప. ఆ 9.

## వటపత్రశాయి

సీ. కోమరొందు మట్టియా◆కునఁ బవ్వళించి చూ, పట్టెడు బాలరూ◆పంబుతోడఁ
బాణియుగ్మంబునఁ ◆ బదిలంబుగాఁ బట్టి, మొగమునకనియు పదాం◆బుజముతోడఁ
జరణాంగుళీపాన◆జాతలాలాభిషి, క్తంబైన చిన్నిహా◆రంబుతోడఁ
బూనిచూడ్కులకు బ్ర◆హ్మానందశైత్యంబు, గులుకు సెయ్యావు ముద్దుఁ◆జెలువుతోడ
గీ. నతని మనమున నతిరత◆ధ్యానమహిమఁ, దిరముగాఁ బాదుకొన్నయా◆దేవరూపు
వెలిఁ బ్రకాశింపఁ జేయుచు◆విష్ణుదేవుఁ, డధిక కారుణ్యలీలఁ బ్ర◆త్యక్షమయ్యె.
కళాపూర్ణోదయము, ఆ 8 ప 161.

## శార్ఙ్గపాణి

సీ. నునుగాడ్పుదూదినిం◆చినయట్టిచల్లని, పానుపుపై లీలఁ◆బవ్వళించి
పటువులై హొంబట్టు◆బటువులోయననొప్పు, రమచన్నుదోయిఁ బా◆దములఁ జేర్చి
చెలువుదీపింపంగ◆శిరముక్రిందటనొక్క, కేలుదలాడగాఁ◆గీలుకొలిపి
బంగారువలువచే◆రంగారుకటిమీఁదఁ, జక్కఁగా నొక్కహ◆స్తంబుఁ జాఁచి
గీ. యాన్యకరయుగ్మమునఁ బాంచ◆జన్యమును సు, దర్శనంబును దాల్చిసు◆దర్శనమున
నచటి జనముల చూడ్కి ధ◆న్యముగఁ జేయు, శార్ఙ్గపాణినిగొల్చెను◆త్సవమెలర్ప.
కళాపూర్ణోదయము, ఆ 2 ప 148.

సీ. కటిభాగపర్యంత◆ఘటితదీర్ఘసువృత్త, కుంచితభుజముచే◆వెలయువాని
యుపధానమైదాని◆కుపమింపసరిలేక, మెఱయు హస్తంబుచే◆వరలువాని
శంఖచక్రాంకితా◆సంఖ్యతేజోవృత, కరపద్మయుగళంబు◆గలుగువాని
గురువార్ధిజాకుచ◆కుంభప్రసాదిత, పదయుగ్మమునను బెం◆పొదవువాని
గీ. దివ్యపీతాంబరముఁ దాల్చి◆దివ్యభూష, ణములనలరించి స్రక్చంద◆నములు పూసి
నిర్మలముఖారవిందుఁడై◆నెగడువానిఁ, బుండరీకాక్షుఁడై కీర్తి◆నుండువాని.158

గీ. చికిలిజిగిమట్టుకత్తి చే◆కేలఁబట్టి, సెలవువాని మరాసుల◆ బలువువాని
వేంకటస్వామిఁ గనుఁగొని◆ వినయవినమి, తాంగవైఖరి మెఱయ సా◆ష్టాంగ మెఱఁగి.

చంద్రభానుచరిత్రము, ఆ 5 ప 57.

సీ. సద్భక్తి కొండవ◆ చక్రవర్తియొసంగు, దండైనపరికరి◆టము ధరించి
రవివంశజుండైన◆ రాఘవుఁడిచ్చిన, గణుతింపరాని భూ◆షణముఁ దాల్చి
తనకు ముత్తాతయా◆ ధర్మజుఁ డిడినట్టి, ఘనమైనయొడ్డాణ◆ మును ప్రపరచి
బహువిధముగా నంతరముభూ◆షాలు కర్పించిన, యానాగేంద్రుమణాలు◆ కుముదఁదాల్చి
గీ. రూప గాంభీర్య సద్గుణా◆రూఢమహిమ, శేషకాద్రిపతి వేంకటే◆శుఁ జూచి
శరణు శరణని మ్రొక్కి సా◆ష్టాంగముపుడు, విడుచునక్ష్మోష్ణనక్షుఁ◆ డెలమితోడ.

వైశ్యపురాణము, ఆ 6

సీ. పలరాజు గాన్పు చి◆ల్వలరాజు పాన్పగ, ల్వలరాజుతోమ్మ గా◆గలుగువాఁడు(?)
కడలేనికళ్యె యె◆క్కుడలేవిబల్మిని, జక్కడబోని చె◆ల్మెసంగఁగలవాఁడు
కరపద్మ ఛాయకు◆ న్నరిఁ గన్నమాయతో, లక్కరిఁగన్న మా◆యకెచ్చరికెవాఁడు
కరమున్నరూపు న◆క్కరమున్నచూపు మొ, క్కరమున్నబాపు వి◆క్కరుగువాఁడు
గీ. మేలువాఁడు జగజ్జాల◆ మేలువాఁడు, నోమువాఁడు నగం బిమ్ము◆ నోమువాఁడు
వన్నెవాఁడు దలంప ము◆వ్వన్నెవాఁడు, యాశ్వయుఁడగు శ్రీవేంక◆టేశ్వరుండు.

వేంకటేశ్వరవిలాసము, ఆ 1 ప 24.

# మాధవుఁడు

సీ. శంఖచక్రములు హ◆స్తముల శోభిల్లంగఁ, బీతాంబరచ్ఛాయ◆ భాతిమీఱ
మణికుండలకిరీట◆ మౌక్తికహారముల్, కడునొప్ప మేను మే◆ఘమును నవ్వ
వనమాలయురమునఁ◆ దనరఁ జక్కఁదనంబు, కోటిమదనులెట్లు◆ సాటిగానఁగ
వామాంకమునలక్ష్మి◆ ప్రేమతో నుండంగఁ, గోటిసూర్యప్రభల్◆ కొమరుమిగుల
గీ. నిత్యముక్తులు బ్రహ్మరు◆ద్రనిర్జరులును, నారదాదులు నప్సర◆స్సారసాక్షు
లలరి సేవింపఁ బ్రత్యక్ష◆మయ్యె మాధ, వుండు భూసురులు భజింప◆ నుండవపుడు.

భార్గవపురాణము, ఆ 7.

# వరదరాజస్వామి

సీ. తనశంఖరుచికి నా◆తనిమనస్సత్త్వోదయంబు ప్రత్యుత్థాన◆ మాచరింపఁ
దనచక్రమునకు నా◆తని దివ్యతేజంబు, గురుభావమున నెదు◆ర్కొలు సేయఁ

శ్రీసాలక్ష్మి కాంతనిభక్తి నెనరు పెంపెసఁగఁ గౌఁగిటఁ జేర్చి ♦ యొత్తుకొనఁగఁ
ననకాన్నభమున కాంతనిజుడ్డచిత్ప్రకాశము పైతిరి నెఱపుము ♦ సరప మాడె
గీ. పానరాజదేవుఁడు భక్త ♦ వత్సలుండు, మిగులఁ గనుపట్టె నాఁడు స ♦ జ్జగదధీశుఁ
గని పులకితాంగుఁ డగుచును ♦ వినుతిజేసి, పాడుచు భజించె నెంతయు ♦ భక్తిమీఱ.
కళాపూర్ణోదయము, ఆ 2 ప 132.

# రామేశ్వరుఁడు

సీ. అది కోనాద్రిపై ♦ యాచంటపురిలోన, లలిఁ బరబ్రహ్మపై ♦ వెలసినాఁడు
పరశురామాదిశుం ♦ భద్బ్రాహ్మణోత్తముల్, దయఁబూజఁ జేయఁగాఁ ♦ దనరినాఁడు
ప్రేమతో దశరథ ♦ రామభద్రుం డంత, వెఱిఁ బ్రతిష్ఠ యొనర్ప ♦ నిలిచినాఁడు
ఒడయనంబి యొనర్చు ♦ చున్న పూజకు మెచ్చి, పరమనాచికిచంటఁ ♦ బలికినాఁడు
గీ. జలజజామరాచ్యుత ♦ స్తవవినోద, సకల నిగమాంతమార్గసం ♦ చారభూరి
విశదఘనదివ్యమంగళ ♦ విగ్రహుండు, శాశ్వతైశ్వర్యధుర్యరా ♦ మేశ్వరుండు. 167
సీ. ఏదేవదేవుని ♦ యిల్లాలు ప్రాలేయ, శైలసంభవపార్వ ♦ తీలతాంగి
ఏమహాదేవుని ♦ ధామంబు పారిష, దాధారమగు రజ ♦ తాచలంబు
ఏసదాశివమూర్తి ♦ లింద్రాదివందితుల్, వీరభద్రకుమార ♦ విఘ్నపతులు
ఏచంద్రమౌళిన ♦ మిద్ధభవ్యగుణంబు, లఖిల వేదాంతర ♦ హస్యకృతులు
గీ. అతఁడు బ్రహ్మాండభాండభా ♦ సిత సమస్త, జంతురక్షాకటాక్షవీ ♦ చక్షణుండు
పరమ నాచీకుచోద్భవ ♦ ప్రాభవుండు, శాశ్వతైశ్వర్యధుర్యరా ♦ మేశ్వరుండు.
ఒడయనంబివిలాసము, ఆ 1.

# భైరవుఁడు

గీ. హస్తములు రెంట నందంద ♦ యదిమి యదిమి, తాటిపండారగించెడు ♦ చీటకమున
నత్యయంబున బ్రహ్మాండ ♦ మాస్వదించు, భైరవుం డిచ్చుఁగాత శో ♦ భనము మనకు.
మ. క్షయకాలంబున సింధుసాగర గభా ♦ స్వాదాతిరేకంబునన్
ఘనునాబ్జంబులు ఘూర్ణితంబులుగ సం ♦ ధ్యాకాలరాత్రీకర
ద్వయతాళామగతిప్రకారమున స ♦ వ్యారి న్మహానృత్తమున్
బ్రియమేపారఁగ నాడు భైరవుఁడు గ ♦ ల్పించు నస్మహైశ్వర్యముల్. 170
కాశీఖండము, ఆ 5 ప 81, 82.

సీ. పగడంపుఁజిగురుజొం◆పము సొంపువిహరింపు, కడునొప్పుకుఱుచకెం◆జడలవాఁడు
విదియచందురుతోడ ◆ వీడుజోడాడెడు, రమణీయదంష్ట్రాంకు◆రములవాఁడు
సీధుపానక్రీడఁ ◆ జెంగల్వపూచాయ, దొంగలించెడుకన్ను◆దోయివాఁడు
క్రొత్తనీలాలరం◆గునకు నించుకమించి, మెఱుఁగారు నల్లని◆మేనివాఁడు
గీ. పృథివి కవతంసమణియైన ◆ బిట్రగుంటఁ, బావకంబుగ నవతార◆మైనవాఁడు
భైరవస్వామి సకలసం◆పదలనొసఁగి, మనుచుఁ జిల్లరవెన్నయా◆మాత్యవరుని.

శకుంతలాపరిణయము, ఆ 1.

## భీమేశ్వరుఁడు

సీ గజచర్మమెన్నఁడో◆కాని నిచ్చలు గట్టు, పసిఁడికమ్ముల పట్టు◆పచ్చడంబుఁ
భసితమెన్నఁడో కాని◆ప్రతిదినంబునలందు, మలయజంబుకురంగ◆మదముగూర్చి
నిడుదపాములరాజు ◆ తొడవు లెన్నఁడో కాని, తారహారములుని◆త్యముధరించు
నృకరఁకరుండమా◆లిక లెన్నఁడో కాని, ధరియించుకల్హార◆దామ మెపుడు
గీ కాటనడుచక్కి వెన్నఁడో◆కానియుండు, దక్షవాటినువర్ణసౌ◆ధములమీఁద
నెన్నఁడో పిశాచులను గాని◆యిందుముఖుల, నెల్లకాలంబుఁదలఁచుభీ◆మేశ్వరుండు.

సీ. ఒకవేళధరియించు ◆ యువనాశ్వుఁ డిచ్చిన, కట్టాణిముత్యాల◆కంఠమాల
మాంధాతృఁ డిచ్చిన ◆ మాణిక్యఖచితకే, యూరంబుధరియించు◆నొక్కవేళ
నిక్ష్వాకుఁ డిచ్చిన◆హీరాంకురంబుల, యుంగరంబుధరించు ◆ నొక్కవేళ
శిబిచక్రవర్తియి◆చ్చినప్రవాళంబుల, యొడ్డాణము ధరించు ◆ నొక్కవేళ(?)
గీ. వేడ్కధరియించు నొక్కొక్క◆వేళయందు, భరతదుష్యంతరంతిసా◆భాగనహుష
నల భగీరథ నృగమహీ◆నాథదత్త, హేమమణిభూషణములు భీ◆మేశ్వరుండు.

భీమేశ్వరపురాణము, ఆ 1 ప 115, 116.

## జగన్నాథుఁడు

సీ. సకలదేశాయాత◆సర్వజనవ్రాత, సంకులనిజపరి◆సరము వాని
సకలజనైకభా◆జనభోజనాఖిలా, న్నమహాప్రసాదాతి◆శయము వాని
నవరార్యమాంతరి◆క్షపదనితాంతస్ఫు, రద్విమానాగ్రిచ◆క్రింబువాని
శర్కరాక్షీరాజ్య◆సహితనానావిధ, భక్ష్యోపభోగ్యాన్న◆భవము వాని

గీ. బహుళజలమధ్యమునఁ జెనుఁ♦బాఁపపాన్పు, పై రజశ్శక్తి గైకొని♦ప్రవర్తించు
లీల నఖిలలోకములు గ♦ల్పించువినయు, ధుర్యనారాయణాఖ్యచ♦తుర్థమూర్తి. 184
మార్కండేయపురాణము, ఆ 1 ప 158-161.

# రాముఁడు

మ. అమలాంభోజదళాక్షుఁ డక్షతఘన♦శ్యామాంగుఁ డాజానుదీ
ర్ఘమహాబాహుఁడు సంహతోరుకటినో♦రస్కుండు సింహోరువి
క్రముఁ డుద్ధతశౌర్యధైర్యకలనా♦కల్పుండు కళ్యాణధీ
రమణీయుండు వెలింగె రాముఁడు గుణా♦రాముండు భూమండలిన్. 185

ఉ. శైశవకేళియందు తన♦సత్త్వము లోకము ప్రస్తుతింపఁగాఁ
గౌశికుఁ డస్త్రకోటి యొసఁ♦గంగఁ బ్రదీప్తత నొంది తన్మఖ
క్లేశకరున్ సుబాహుఁడను♦ కిల్బిషరాత్రిచరున్ ససైన్యుఁ గీ
నాశునిఁ జేర్చి పేర్చె జన♦నాథతనూజుఁ డజేయుఁడై యనిన్. 186

హరివంశము, ఆ 4.

సీ. కన్నెకయ్యమునందఁ♦ఘటితనాకపురీక, నాటకఁ దాటకఁ♦ గీటణంచెఁ
దూలుకూఁకటినాడ♦లీలఁ గౌశికయాగ, భంజనోత్సాహు సు♦బాహుఁ జంపెఁ
బల యొగగట్టునఁ♦త్ర్రతి దేవదైత్యదు, స్తరము ధూర్జటిధను♦ర్వరము విఱిచె
నలఘోక దొరసి హే♦లాజితాఖిలనృప, స్తోము భార్గవరాము♦ దూలఁ ద్రోలె
గీ. దండకావనమార్గసం♦తతనిరోధు, రచితసుజనాపరాధు వి♦రాధు నణఁచె
దోతసకలామయునిఁ జతు♦ర్దశసహస్ర, దితిజముఖరుని ఖరుని వ♦ధించెఁ గడిమి.
శ్రీరంగమహాత్మ్యము, భైర. ఆ 2 ప 356.

సీ. కూఁకటిముడికిసై♦కుతుకలు గూడనినాఁడె, బెదరక తాటక♦ బీఁచ మణఁచె
గాధేయుఁ డొనరించు♦క్రతువును రక్షింపఁ, బెక్కండ్రు దైత్యుల♦నుక్కడంచె
నవనిపై విలసిల్లు ♦ నఖిలరాజన్యులు, వేరిఁ జూపగలేని♦విల్లు విఱిచె
ఘోరాటవులలోనఁ ♦ గ్రుమ్మరునప్పుడు, ఖరదూషణాది రా♦క్షసులఁ జంపెఁ
గీ. బాదరజమున నొకరాయిఁ♦బడఁతిఁ జేసె, లీల మాయామృగంబును♦గూలసేసె
రాజమాతుర్యిండె మేదినీ రక్షకుండు, రామభూపాలుఁ డాదినా♦రాయణుండు.
మొల్లరామాయణము, సుంద. ప 64.

సీ. సిగకు నంటక వెన్కఁ♦జిరలాడుకురులతో, లాగియాం మట్టికు♦ల్లాయిదనరఁ
జెన్నారినొసటికొ♦ప్పెనుటయూడిగములు, పలిపెంపుచల్వపా♦వడలదుడువ

నును నెపందయారంబు♦నను జీని సరిపెణల్, మిన్ను జన్నిదముతో♦మేలగొనఁగ
బెడఁగు చెంగావిచ♦ల్లడము పై బిగియించి, కట్టిన క్రొంబట్టు♦దట్టి దనర
గీ. పంజకెంజాయదగు నీల♦జలదమనఁగ, మెఱుఁగు టెఱమట్టి జిగిదొట్టి♦ మేను మెఱయ
జికిలి నాసాళరంబునఁ ♦ జెఱువ్రుగులకఁ, గరడి వెలువడి వచ్చె రా♦ఘవుఁడు గాంచి.

దశావతారచరిత్ర, ఆ 6.

సీ. అన్నదాస్య మెతన♦కెన్న భాగ్యము గాఁగ, నున్న సౌమిత్రితో♦నున్నవాని
క్షీరాబ్ధిఫేనది ♦ శేషాభచామర, వీజ్యమానాంగుఁడై ♦ వెలయువానిఁ
బూర్ణేందుసంకాశ♦భూరిసితాతప,త్రచ్ఛాయ చేతను ♦ దనరువాని
భవపద్మభవశచీ♦ధవముఖ్యదేవతా, సేవ్యమానుం డౌచుఁ♦జెలఁగువాని
గీ. నిజశరీరంబు జగము గా♦నెగడువానిఁ, బరుని కన్నను బరు డౌచుఁ♦బరగువాని
నక్షర మనంత మవ్యక్త♦మనఁగ నుండు, వాని జగదుదయాదులఁ♦బూనువాని.

భార్గవపురాణము, ఆ 4.

సీ. మంజులగతి రత్న♦మంజీరములు పాద,కంజంబులను ఘల్లు♦ఘల్లు మనఁగఁ
బట్టుదట్టీలాగు♦పైనున్న కటిసూత్రి, కనక కాంతి జిగాల్జి♦గాలనంగ
మండిత నవరత్న♦ కుండలోపేతమౌ, గండదీప్తి ధగాల్ధ♦గాలనంగ
మోమునందు బులాకి ♦ ముత్తియంపుగరంబు, మేలిడాలు ధళాల్ధ♦ళాలనంగ
గీ. శిరమునందుఁ గిరీటంబు ♦ చెన్ను మిగుల, వేణిపుచ్చులఁ బిరుదులు♦వెలయ మండఁ
గాకపక్షవిలాసంబు♦గ్రందుకొనఁగ, రాముఁ డపుడెంచె నసమాజా♦భిరాముఁ డగుచు. 191

సరసభూపాలరాజీయము, ఆ 1 బాల.

## బలరాముఁడు

క. కమలాక్షుఁడు దేవకిస,ప్తమగర్భముఁ జేరి పిదపఁ ♦ దనయోగము చే
విమలంబౌ రోహిణిగ,ర్భమునఁ బ్రవేశించి పుట్టె ♦ బలరామాఖ్యన్. 192
గీ. గర్భసంకర్షణమునను సం♦కర్షణాఖ్యఁ, గలిగె బలరామునకు నంతఁ ♦ గంసభీతి
రోహిణీకాంత నందుని ♦ గేహమున వ,సించి పోషింపఁ బెరుగుచు♦ సీరపాణి.
మ. హరియుం దాను గొల్లగుబ్బెతల గే♦హంబుల్ ప్రవేశింపుచున్
బెరుగుం బాలును గొల్లలాడుచును గో♦పీకృత్తవత్సోజముల్
కరజాగ్రంబులఁ జీరుచున్ గదిసినం ♦ గౌగిళ్ళఁ జొక్కింపుచున్
గర మర్థిన్ విహరించు కేళిసఖసం♦ఘంబుల్ ప్రశంసింపఁగన్. 194

దశావతారచరిత్ర, ఆ 9.

# కృష్ణుఁడు

చ. నునుపగుపచ్చకట్టునఁ గ♦నుంగొన నొప్పఁగ దిండు కట్టి నూ
తనముగు బర్హిబర్హకృత♦దామము వెట్టెము నుట్టి కమ్రికా
ననతరుపుష్పమాలికఁ ద♦నర్చి మకష్ఠ్నలి మధ్యపాంచి యిం
పొనరఁగ వేణునాదరస♦సోత్సుకుఁడై హరి యొప్పె నెల్లెడన్. 195

హరివంశము, ఆ 6,

సీ. మహనీయమణిమయ ♦ మంజీరములు పూని, పసిఁడితొంగలిపచ్చ♦పట్టు గట్టి
కమనీయహస్తకం♦కణముద్రికలు దొడ్డి, లలినొప్పుకుండల♦ములు ధరించి
కౌస్తుభవనమాలి♦కాకంఠభూషణ, కమ్రహారములు వ♦క్షమునఁ దాల్చి
కొమరొంద నెఱికప్పు ♦ కొప్పుపై, బర్హిదామము చుట్టువేసలి♦మలఁచి తుఱిమి
గీ. మెరయు మలయజపంకంబు♦మేన వలఁది, తిలక మొప్పారఁ గస్తూరి♦దీర్చిపెట్టి
మదనశతకోటిలావణ్య ♦ మహిమ నొప్పె,నపుడుకృష్ణుఁడుశృంగార♦మువధరించి.

పద్మపురాణము, ఆ 9 ప 201.

సీ. వసుదేవచిరభాగ్య♦వాససాహారంబు, దేవకీకృతపుణ్య♦జీవనంబు
నందయశోదాజ♦ననసంచితఫలంబు, బలదేవసుకృత సం♦బంధపీఠ
రమ్యబృందావనా♦రామశేకపికంబు, కంసాదిఖలతమః♦ఖరమరీచి
రుక్మిణీముఖవధూ♦రూపసరోహంస, శుకవాక్యమాణిక్య ♦ సూత్రసరణి
గీ. యానగర మేలుమేలున♦ యానఁగరము,భూజనమునకుబహుసౌఖ్య♦భాజనముగ
మదనశతమూర్తి వల్లవీ♦మానవస్తు, చౌర్యవిస్ఫూర్తి యదువంశ ♦ చక్రవర్తి.197
ఉ. గొల్లవింటూరి గుబ్బెతల ♦ కోర్కులపంట తదీయమానముల్
గొల్లలు బెట్టుదంట మురు♦గూరిమిఁ గాంచిన మేటి రాధికా
పల్లవపాణిభాగ్యపరి♦పాకము నందునిముద్దు నిందిరా
వల్లభుఁడైన శౌరి చెలు♦వంబు లవంబు గణింప శక్యమే. 198
చ. సిరికిఁ బతుండు భాగ్యమునఁ ♦ జెల్వమునన్ మరుఁగన్నమేటి ధీ
సరణి విరించికిన్ గురుఁడు ♦ శౌర్యమునం బురభేది నోటమిం
బరపినయట్టిజోదు సిత♦భానునివిర్యము పత్కళాప్తిను
శ్రీకృష్ణశౌరి యొఖరి ను♦తింపఁగ శక్యమె తద్గుణావళుల్. 199
సీ. ఎల్లలోకనికాయ ♦ మేలువాఁ డజుఁగన్న, మేలువాఁ డభవుసా♦మేలువాఁడు
మౌనిదువ్వాలుపగొ♦మ్మించువాఁ డమరుల,మించువాఁ డసురబొ♦మ్మించువాఁడు

నలదమ్మిసూడుదో ◆ డాలువాఁ డహీనాంప్రు, డాలువాఁ డసితంబు ◆ డాలువాఁడు
నిజభక్తకోటికి ◆ నింపువాఁ డభీప్సిత, మింపువాఁ డట్టిలో ◆ నింపువాఁడు(?)
గీ. సామధారివిదారి గ◆దాధారి, యదుకులోద్ధారి దారిద◆యావిహారి
సీరిసహచారి యయ్యెనీ ◆ సిరిమురారి, జేరి యీశౌరి సెవ్వ నె◆వ్వారివశము. 200

ముకుందవిలాసము, ఆ 1 ప 132-213.

సీ. ఒకకాంతయొరఁగిన ◆ సికమీఁదిముడిపువ్వుఁ, బెత్తుల దొరయఁ డా◆తొతులఁజుట్టి
వన్నిటిచిమకులఁ ◆ బడనైన నికరంపుఁ, గస్తూరి చరతిల◆కంబుఁ దీర్చి
గంబూరమించి క◆దంబంబు చేసిన, పలుచని కుంకుమ ◆ కలవ మలఁది
చెక్కుటద్దములపైఁ ◆ జికిలిపెన్నెలసోన, లొలికెడు కట్టాణి◆యొంట్లు దాల్చి
గీ. మెఱుఁగుఁజంద్రికకోణము◆చెఱఁగుదాలు, వలిపెపలెవాటుదుప్పటి◆వలికిఁగ్రమ్మ
మినుకుఁబకెంపుఁబావలు◆మెట్టియొక్క, యతివ కైదండయొసఁగవో◆య్యారమెసఁగ.

చంద్రభానుచరిత్రము, ఆ 1 ప 89.

సీ. మారుతాసురుఁ దుంచె ◆ మద్దులఁ బెకలించెఁ, గినిసివత్సకుఁ జంపెఁ◆ గుని మెబకుని
నఘదానవునిఁ గూల్చె ◆ నలరి కాళియునొంచె, దవశిఖిమ్రింగెఁ గో◆త్రిము ధరించె
శంఖచూడునిఁ గేర్చె◆సాధించె వృషదైత్యుఁ, గేశి సంహరించె ము◆గించె వ్యోముఁ
చాణూరుఁ దెగటార్చెఁ◆జక్కాడెఁ గంసునిఁ, దఱిలియొయ్యనఁ గాల◆యవనుఁ జిదిమె
గీ. నల జరాసంధముఖ్యులౌ◆ఖలులఁ దఱిమె, ద్వారకయనంగ నొకరాజ◆ధాని నిలిపె
బాంధవులకెల్ల నిత్యసు◆ఖంబు లొసఁగె, మనుజమాత్రుండె దేవకీ◆తనయుఁ డరయ.

రుక్మిణీపరిణయము, కూ. తి. ఆ 1 ప 123.

సీ. తొడలు తలాడగా◆నిడి రుక్మిణి భజింపఁ, బదము లొత్తుచు సత్య◆భామ కొలువ
నురటిచేకొని భద్ర◆సుశ్రీమఁ గావింప, విరిచామరము మిత్ర◆విందయిడఁగఁ
కాళింది వేడ్కతోఁ ◆ గాళంజిఁ దాల్పఁజాం, బవతితములపాకు◆మడిచియొసఁగఁ
గొనుచు పావలు కేలఁ◆గొని నాగ్నజితి యుండ, జలములగిండిలక్షణవహింపఁ
గీ. గ్రామ్మెఱుంగులతోడి కా◆ర్మొగిలు వోలె, నొప్పు కృష్ణుని చేరువ◆నొక్కహంసి
విందునెలరీతిఁ దారకా◆న్వితనభంబు, పోలుపుఁ జెలిపెటి కెత్తమ్మి◆కొలనికెలన.

భర్తృహరిసుభాషితము, ఆ 2 ప 15.

సీ. శ్రీకారసమితి యీ◆చెలువుపీనఁ లకులోఁ, బడి ప్రబంధంబులఁ ◆ బడియెనొక్కొ
కరులహస్తంబులీ◆ఘనుని బాహులఁ గాంచి, నోముటచాంచల్య◆ మొందెనొక్కొ
యనఁటులీహరితొడ◆లను బోలఁజాలక, కఱుపుచర్మము నిండఁ ◆ గప్పెనొక్కొ
చిగురాకులీశౌరి ◆ శ్రీపాదతులలేక, తలగి నానాఁటడా◆ల్దరగెనొక్కొ

గీ. కానినో వీని కిటుల ని◆ష్కారణముగ, గంథములబద్ధమై యుంట ◆ గనలుచుంటి
జిలుగుఁజాలల పాలు విడుట కోమలతపిడుట, సహజవృత్తిగ మతియేల ◆ సంభవించు.

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 1 పే 13.

సీ. కమ్మతావులనీను ◆ కస్తూరితిలకంబు, మోముచందురువందు ◆ ముద్దుగుల్కఁ
గోటిసూర్యప్రభల ◆ నీటుమీఱెడు తేజు,గల కౌస్తుభంబు వ◆క్షమునఁ గ్రాల
నమృతబిందువులీల ◆ నలరుచుండెడు మణి, ముత్తెంబు నాసాగ్ర◆మున నమ్రవేల
దరహస్యమునమండి◆ ధారగాఁబడురీతి, నలుముత్తెములసరు◆లటుత మెఱయఁ
గీ. గరజలజముల రత్నకం◆కణము లలరఁ, దమవ్రువెన్నెడ రక్తచం◆దనము దనర
మురళిఁ బాడుచు నాడెడు ◆ పుణ్యశీలు, భక్తపరిపాలు వేణుగో◆పాలుఁ గంటి.

రాధామాధవవిలాసము, ఆ 1 ప 4.

సీ. శ్రీరుక్మిణీమనః◆సార్వరసమిత్రుండు, మిత్రుండు మన్మథ◆శాత్రవునకు
లసమానసౌందర్య ◆ నావితేక్షుధర్ముండు, ధర్ముండు తిలకంస◆ధరణిపతికిఁ
జరణకంజాతజా◆సనసత్కుమారుండు, మారుండు దానవ◆వారమునకుఁ
బరిధానభాసిత◆భాసితచంద్రుండు, చంద్రుండు వృజినాంబు◆జాతములకు
గీ. నిజపదసరోజభజమాన◆రజతధరణి, ధరశరణపద్మభవపురం◆దరముఖాఖి
లామరవ్రాతమానస◆కాంక్షితఫల,దాయకుం డొప్పు యదువంశ◆నాయకుండు.

సుమనోమనోభిరంజనము, అ 1 ప 73.

చ. అలరుమెఱుంగు రంగు గల◆హాటకశాటికమౌళిఫాళిఖా
సిలు నవపింఛకంబు తుల◆సీదళదామముఁ గల్గివట్టి మే
ఘలలితమూర్తిమానికభుఁ ◆ గంబముఁబోని భుజద్వయంబుచే
నలమి రమావధూటిఁ జెలు◆వందఁ గలం గనుపించె నింపుగన్. 208
ఉ. నెమ్మది యామునాంతరవ◆నిన్ వసియించుచుఁ గావిమోవినం
దిమ్ముగ వంశిఁ గీలుకొలి◆పి తత్స్వరమ్ముల నంగుళీతతిం
గ్రిమ్మచుఁ జిమ్మచున్ శ్రుతిను◆తిమ్మగ గానముఁ దానమానముల్
గుమ్మని మోయిఁ జేయురసి◆కుం గనుగొంటిరె కంటి కింపుగన్. 209

కృష్ణకర్ణామృతము, ఆ 2 ప 7, 14.

సీ. తనయశస్ఫురణంబు ◆ తనయశస్ఫురణంబు, వలె హారదంతప్ర◆వర్తిగాఁగఁ
దనచంద్రహాసంబు ◆ తనచంద్రహాసము,ట్లతిపుణ్యజనసంఘ ◆ హారిగాఁగఁ
దనధర్మభరణంబు ◆ తనధర్మభరణంబుఁ,బోలె సన్మార్గణా◆పాలిగాఁగఁ
దనబంధురాగంబు ◆ తనబంధురాగంబు, కరణి గోపానంద ◆ కరముగాఁగఁ

గీ. దనుజ దానవిచక్షణ♦త్వంబు దెలియ, భూరిబుధమోదకరదాన♦వారి యగుచు
నతనిగుణములతోఁ బోటి♦యతనిగుణము, లనఁగఁ దగియుండువాఁడు దేవ♦నాత్మజుండు.
సీ. వానిసౌందర్యంబు ♦ వర్ణింపఁగా నేల, సాత్మసంభవనామ♦ మందియుండె
ముఖపద్మకాంతివి♦ మొనవిచెప్పఁగ నేల, విధుఁడను పేరట ♦ వెలయుచుండఁ
జికురబృందము పొరుఁ ♦ బ్రకటింపఁగా నేల, జనులెల్లఁ గేశవుం♦డనుచుఁ బల్క
వాని నెన్నఁడుమును ♦ వాక్రువ్వఁగా నేల, హరిమధ్యనామునఁ♦ బరఁగియుండఁ
గీ. బుండరీకాక్షుఁడనుటక♦తం డెయుచితుఁ, డర్థుఁ డాతఁడె పురుషోత్తమాహ్వయమున
కతఁడె తగియుండు భూమీశ్వ♦రాంకితమున, కిలఁ గలఁడె యందు వానికిఁ♦ దుల యొకండు.
కాళిందీపరిణయము, ఆ 1 ప 78, 78.

# అష్టదిక్పతులు—వారి పురములు

సీ. అమరావతీపురం ♦ బమరవిభుం డేలు, నర్చిష్మతీపురం♦ బనలుఁ డేలు
శ్రాద్ధదేవుం డేలు ♦ సంయమినీపురం, బసురనాయకుఁడు పు♦ణ్యవతి నేలు
నమలావతీపురం♦ బంబునాయకుఁ డేలు, వాయువేలును గంధ♦వతిపురంబు
నలకాపురంబు య♦క్షాధీశ్వరుం డేలు, నైశాని యేలుఁ జ♦స్వాన్తిమాళి
గీ. యనిరి దిక్పాలపురములం ♦ దవనిసురుఁడు, రెండవపురంబు వీక్షించి♦ ప్రీతినుండె
నపుడు వర్ణింపఁదొడఁగిర♦ య్యగ్నిలోక, మహిమ సంపదగోవిబుద♦ మాన్యహితులు.
కాశీఖండము, ఆ 3 ప 204.

# అష్టశక్తులు

గీ. సరసిజాలయ సావిత్రి♦ సర్వభద్ర, విమల పద్మ మహాదేవి ♦ విలసదీశ
జాహ్నవి యనంగ నెనమండ్రు♦ శక్తు లెపుడు, జామరంబులు వీతురు♦ చక్రిమోల.
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 25.

# ఇంద్రుఁడు

చ. కనియె నతండు దివ్యగణి♦కాజననేత్రచకోరికాసురం
జనహాసచంద్రికాలపన♦చంద్రునిఁ జారుపులోమజాఘన
స్తనపరిరంభసంభ్రమన♦శస్ఫుటకుంకుమపంకసౌరభాం
జనతనుకాంతిరుంద్రుని భు♦జాబలసాంద్రుని నిర్జరేంద్రునిన్. 214
విక్రమార్కచరిత్రము, ఆ 2 ప 84.

సీ. అతిమోహనాకారుఁ◆డై వెలింగెడువాని, శశివర్ణంగారుఁ◆డైనవానిఁ
కడిమిమై మూఁడులో◆కముల నేలెడువాని, నోడలెల్లఁ గన్నులై ◆ వెలయువాని
బాలుపారఁగేల దం◆భోళియొప్పెడువాని, నత్యంతవైభవుఁ◆డైనవానిఁ
గేయూరకంకణాం◆కితబాహువులవాని, నిర్మలమణికిరీ◆టమ్మువాని
ఆ. గరుడ సిద్ధ సాధ్య◆గంధర్వ కిన్నర,భుజగపతులు గొలువఁ ◆ బొలుపు మిగిలి
తేజరిల్లువాని ◆ దేవేంద్రుఁ◆బొడఁగాంచి, సమ్మదమున నంగ◆సంభవుండు. 215

వీరభద్రవిజయము, ఆ 2 షే 4.

సీ. మహిమతో మడిచిన ◆ మందారసుమసౌర,భమ్ము తుమ్మెదల రా◆రమ్మనంగ
దివ్యభూషణరత్న◆దీప్తులు తోరమై, సకలదిక్కులఁ బ్రతి◆చ్ఛాయ లెసఁగఁ
గరపంకజంబునఁ◆గ్రాలెడిదంభోళి, మెఱుఁగులు కడు మిఱు◆మిట్లు గొనఁగ
గంధర్వకిన్నర ◆ గానవాదంబులు, చెవుల కానందంబు ◆ సేయుచుండ
గీ. దివ్యదుంధుభిరవములు ◆ దిక్కు లెల్లఁ, బిక్కటిల్ల దిగీశులు ◆ బెరసి కొలువ
నభ్రమాతంగపతి నెక్కి ◆ యమరలోక,నాయకుఁడువచ్చె ద్వారకా◆నగరమునకు.

విష్ణుపురాణము, ఆ 8 ప 79.

సీ. శతవాజిమేధసం◆స్కృతశ్రాతమగు మస్తకంబుపై మణికిరీ◆టంబుదనర
ప్రతివీరహతజవా◆భయదానకరమైన, కరమున శతకోటి ◆ కరము మెఱయ
సుమనోమనఃకాంక్షి◆తములైన దశశత,కరుణాకటాక్షవీ◆క్షణము లమరఁ
బౌలోమికాకుచ◆స్ఫాలనస్నిగ్ధమౌ, నురమున రతనంపు ◆ సరులు మెఱయ
గీ. మొలకనగుముద్దుమొగమునఁ ◆ దిలకమమరఁ, బైనవలెవాటుబంగరు◆పని మెఱుంగు
వలువ చెంగులు జీరాడ◆వన్నెమీఱ, సుందరాకృతినుండు శ్రీ◆రంగరుండు. 217

వేంకటేశ్వరవిలాసము, ఆ 2 ప 17.

సీ. వృత్రగర్వస్ఫూర్తి ◆ విదళించినయతండు, పాకపాతుజమదో◆త్పాటనహరి
పరమహీభృత్తుల ◆ భంజించుజిష్ణుఁడు, తఱియైనశరవృష్టి ◆ గురియుఘనుఁడు
మఘశతయాజియౌ ◆ మహితసుత్వర్ముండు, భువనైకభారంబుఁ ◆ బూనువృషుఁడు
కరమునశతకోటిఁ◆గలస్వస్థజీవనుఁ, డమరభోగినులతో ◆ నలరుభోగి
గీ. శచికుచంబులమకరికా◆సముదయంబు, వ్రాయు లేకర్షభుండన◆వద్యహృద్య
మాఘ్యవిచికిలరుచిరస◆మాఖ్యఁగాంచు, దేవతాసార్వభౌముండు ◆ తేజరిల్లు. 218

అహల్యాసంక్రందనీయము, ఆ 1.

## అగ్నిదేవుఁడు

క. శిఖలయ్యేడును వెలుఁగఁగ, సుఖతరమగునజము నెక్కి ♦ శోభిల్లుచుఁ ద
న్నఖిలమునులు నుతిసేయఁగ, నఖిలేశ్వరుఁ గొల్వ వచ్చె ♦ ననలుఁడు ప్రీతిన్.
వీరభద్రవిజయము, ఆ 1 పే 7.

ఉ. దేవమునీశ్వరుల్ పొగడఁ ♦ దేజము దిక్కులఁ బిక్కటిల్ల
నావిధమూర్తి లోకులఁ గ ♦ నంబడ మేషహయాధిరూఢుఁడై
కేవలభక్తియుక్తిఁ గడుఁ ♦ గేరుచు స్వాహనుఁగూడి వేడుకం
బావకుఁ డేఁగుదెంచె విభ ♦ వంబుల పేటికిఁ జక్రివీఁటికిన్. 220
మహాలక్ష్మీపరిణయము, ఆ 4 పే 111.

## యముఁడు

మ. కనిరొం గోమలనీలమేఘవిలస ♦ త్కాలాంజనాకారు ఘో
రనిశాతోత్కటదంష్ట్రి నుజ్జ్వలచల ♦ ద్రక్తాక్షుఁ బ్రత్యగ్రకాం
చనవర్ణాంబరు నంత్యకాలదహన ♦ జ్వాలాప్రచండున్ జగ
జ్జనసంత్రాసకు నొక్కదివ్యుఁ బటుపా ♦ శప్రౌఢహస్తోద్ధతున్. 221
అర. ఆ 7 ప 226.

క. చండప్రచండహస్తులు, మండితగతిఁ దన్నుఁ గొలువ ♦ మదమహిషారూ
ఢుండై వచ్చెఁ గృతాంతుఁడు, ఖండితఖండాలదనుజ ♦ గణములు గొలువన్.
వీరభద్రవిజయము, ఆ 1 పే 7.

క. కనుఁగొనియె నప్పురంధ్రి, జనమణికృతజంతువివిధ ♦ శమసంయమనున్
వినుతాచారప్రమనున్, ఘనకల్మషదమను మహిమ ♦ గమనున్ శమనున్. 223
శ్రీరంగమాహాత్మ్యము, ఆ 4 ప 780.

ఉ. చండతరోరుకింకరులు ♦ సందడిఁ గొల్వఁగ జీవసంయముల్
దండల నేఁగుదేర వని ♦ తాయుతుఁడై నభ మంటి పైరిభో
ద్దండమహాయంబు నెక్కి నిజ ♦ దండము కేల వెలుంగుచుండఁగా
దండధరుండు వచ్చె మధు ♦ దండనువీఁటికి మోత్సవాటికిన్. 224
మహాలక్ష్మీపరిణయము, ఆ 4 పే 111.

## నైర్ఋతి

క. ఢిక్కాలి విభవము మెరయఁగఁ, గ్రక్కున మానవుని నెక్కి ♦ కడు వేడుకతోఁ
జక్కని నైర్ఋతి వచ్చెను, మక్కలరాయుని ధరించు ♦ శుభగునిఁ గొలువన్. 225

వీరభద్రవిజయము, ఆ 1 పే 7.

## వరుణుఁడు

క. వానరము నెక్కి వరుణుఁడు, కానుక లెన్నేనిఁ గొనుచుఁ ♦ గాంతలు గొలువన్
దానవగురుఁ డెంచె రాజిత, మీనధ్వజహరునిఁ గొలువ ♦ మించిన భక్తిన్. 226

వీరభద్రవిజయము, ఆ 1 పే 7.

## కుబేరుఁడు

ఉ. మంగళదివ్యసంపదలు ♦ మానుగ నన్నియుఁ గొంచుఁ గిన్నరుల్
ముంగలఁ బేర్మితో నడువ ♦ మోదముఁ బొంది తురంగవాహుఁడై
సంగతి సిద్ధులు ఋషులు ♦ సంయములున్ దను గౌరవింపఁగా
సంగడికానిఁ గొల్వ నతి ♦ సంపద నేఁగెఁ గుబేరుఁ డాఢ్యుఁడై. 227

వీరభద్రవిజయము, ఆ 1 పే 7.

చ. కనకములం బెరుబల్మి సిమి♦ కాంచనరత్నమయాంశుముల్ దిశా
వలయముఁ బర్వ నచ్చరలు ♦ వైభవలీల నటింపఁ గిన్నరుల్
బలసి రథంబు చుట్టు నస♦ భక్తినిఁ గొల్వ సరోజబాంధవుం
డిల కరుదెంచెనో యన ధ♦నేశుఁడు రాఁగ వియన్నిరీక్షుఁడై. 228

నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 3 పే 100.

ఉ. అచ్చర లాడ మాగధులు ♦ హాయని సన్నుతి సేయఁ గిన్నరుల్
చెచ్చెరఁ గొల్వగాఁ మునులు ♦ సిద్ధులు యక్షులు దోడరా సిరుల్
హెచ్చిన వేడ్కఁ బుష్పకము ♦ నెక్కి విలాసవతీసమేతుఁడై
వచ్చె నిధీశ్వరుండు విభ♦వంబుల పేటికిఁ జక్రివీఁటికిన్. 229

మహాలక్ష్మీపరిణయము, ఆ 4. పే 111.

## ఈశానుఁడు

క. గణనాథులు కొల్వఁగ గో,గణపతి వాహనుఁడు భుజగ ♦ కంకణుఁ గొలుగన్.
గణుతింపరాని వేడుక, ఫణిధరుఁ డీశానుఁ డరిగె ♦ భవ్యాత్మకుఁడై. 230

వీరభద్రవిజయము, ఆ 1 పే 7.

# రాజశ్రేష్ఠులు

సీ. ఇక్ష్వాకు మాంధాతృ ♦ ఋతుపర్ణ యువనాశ్వ, సగర శంతను హరి♦శ్చంద్రనహుష
రామలక్ష్మణ భగీ♦రథ శశిబిందు భార్గవ నిమి సంయాతి ♦ కార్తవీర్య
నల నృగ దుష్యంత ♦ నాభాగ ముచికుంద, పురుకుత్స వైదేహ ♦ పూరు భరత
రఘు దిలీప సుహోత్ర ♦ రంతి పురూరవో, జ్యామఘ తృణబిందు ♦ సోమదత్త
ఆ. భీష్మ ధర్మపుత్ర ♦ భీమ బీభత్సపాం, చాల కేక విరట ♦ సత్యసేన
ముఖ్యనృపులచరిత♦ములు విన్నఁ జేకొన్న, మహితశుభము లొదవు♦ మానవులకు

విష్ణుపురాణము, ఆ 6 ప 409.

# షట్చక్రవర్తులు

## హరిశ్చంద్రుఁడు

సీ. ఎవ్వని మాహాత్మ్య ♦ మెప్పుడు వేదముల్, చెలఁగి సుస్తోత్రము♦ల్సేయుచుండు
నెవ్వని శాసనం ♦ బేడుదీవులరాజులకు శిరోభూషణ ♦ లక్ష్మి నొందు
నెవ్వనిరక్ష మ♦హేంద్రాదిసురలకుఁ, బెట్టనికోటయై ♦ పెంపుఁ దాల్చు
నెవ్వని సత్కీర్తి ♦ యీ యజాండం బెంత, యంతయుఁ దానయై ♦ యతిశయిల్లు
గీ. నట్టి మహితగుణాభర♦ణాభిరామ, మూర్తి ప్రఖ్యాతి నృపసమ♦వర్తి పరమ
పూజ్యసామ్రాజ్యవైభవ♦స్ఫూర్తి నిత్య, సత్యవర్తి హరిశ్చంద్ర♦చక్రవర్తి. 232

మార్కండేయపురాణము, ఆ 1 ప 188.

సీ. నిత్యసత్యవ్రత♦స్తుత్యచారిత్రుఁడై, గౌరీశునోనాథు ♦ కరుణవడసె
సమదశాత్రవలోక ♦ జయరమాకాంతుఁడై, రాజసూయమహాధ్వ♦రం బొనర్చె
ధారాధరత్యాగ ♦ ధౌరేయుఁడై వనీపకులదారిద్ర్యంబుఁ ♦ బాయఁ జేసె
భుజగనాయకతుల్య ♦ భూరిదోర్దండుఁడై, వసుమతీభరము స♦ర్వమువహించె
గీ. నవనిలోఁ బదునాల్గు మ♦హాయుగములు, పూజ్యసామ్రాజ్యపదవిని ♦ భూతి నెగడె
సకలకకుబంతరాళప్ర♦శస్తకీర్తి, చంద్రమూర్తి హరిశ్చంద్ర ♦ చక్రవర్తి. 233

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 1 ప 109.

# నలుఁడు

సీ. శౌర్యగర్విత♦ సర్వభూపాలుఁ డై, హరికి సమానాధి♦కరణ మగుచు
స్త్రీకతరవీర్యసం♦నితమహాసేనుఁ డై, యురగకంకణుని పె♦న్నుద్ది యగుచు
భాసురగురునీతి♦ పాలనాసక్తుఁ డై, సుత్రామునకు సహ♦స్రోత యగుచు
జనతానిరుద్ధ శా♦శ్వతభూతిశాలి యై, కుసుమాస్త్రునకుఁ బ్రతి♦కోటి యగుచుఁ
గీ. బోగడికకు నెక్కి నిశ్చల♦ బుద్ధి నహిమఁ, బూని తనదాన మెప్పూను♦ బుధులపాలె
చేయుచున్నాఁడు ధరణిఁ జ♦ర్చింప సార్వ,భౌమమాత్రుండె నలమహీ♦పాలవరాళి.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 4 ప 3.

# పురుకుత్సుఁడు

సీ. తనదానమునను బ్రా♦హ్మణుల యర్థుల, బ్రియజీవనము లుద్ధ♦రించినాఁడు
తనయిష్టమునను గో♦త్రజుల గోత్రజులకు, ఘనత రాజ్యసమృద్ధిఁ♦ దనిపినాఁడు
తనపురంబునను బ♦ద్మను బద్మనాగుని, నీడితస్థితి నిర్వ♦హించినాఁడు
తనధర్మమున రసా♦తలమునఁ దద్రసా,తలమునను సమాఖ్య♦ నిలిపినాఁడు
గీ. తనభుజాపీఠి నహికూర్మ♦ దంతిదంష్ట్రి, ధరములకు నూఱటగ ధాత్రిఁ♦ దాల్చినాఁడు
సత్యవాచాగరిష్ఠుండు♦ చక్రవర్తి, మాత్రుఁడే యెంచఁ బురుకుత్స♦ మహివిభుండు.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 6 ప 3.

# పురూరవుఁడు

గీ. ఎలమి ముత్తాతగతిని వా♦హినుల మెఱసి, తాత కైవడి సన్మార్గ♦నీతి నడచి
తండ్రిచొప్పున గూఢవ♦ర్తనము నేర్చి, మీఱె శౌర్యంబు మెఱయఁ బు♦రూరవుండు.
సీ. తతభేరిభూరిభాం♦కృతులు పర్వకమున్న, పటుకేతుకోటి మా♦పడకమున్న
బహురజఃపాళి య♦భ్రమునఁ గప్పకమున్న, కరిఘటాఘీంకృతుల్ ♦ గాకమున్న
సైంధవహేష లా♦శలు గప్పకయమున్న, రథచక్రఘోషముల్ ♦ రాకమున్న
చటులభటాట్టహా♦సములు పుట్టకమున్న, శరవృష్టి పిబలి ముం♦చకయెమున్న
గీ. హితవు గల్గి నవద్వయ♦ద్వీపపతులు, కట్నము లొసంగి పాదయు♦గ్మంబుఁ గొలువ
దానగాంభీర్యమహిమలఁ♦ దనరి సార్వ,భౌముఁ డన మించె నమ్మహీ♦పాలవరాళి.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 6 ప 39, 40.

# సగరుఁడు

సీ. తనదానధారాళి ♦ ధారను సత్కీర్తి, జాలంబు లతుల స ♦ స్యములు గాఁగఁ
దనసముజ్జ్వలితప్ర ♦ తాపానలార్చికిఁ, బరభూపతులు శల ♦ భములు గాఁగఁ
దనజగత్పరిపూర్ణ ♦ ఘనగుణవల్లికి, నక్షత్రములు ప్రసూ ♦ నములు గాఁగఁ
దనరూపచంద్రిక ♦ కును గామినీలోచ, నములు చకోరసం ♦ ఘములు గాఁగ
గీ. వినుతిఁ గాంచె నవద్వయ ♦ ద్వీపభూప, కనకకోటీరమాణిక్య ♦ కలితదీప్తి
నికరబాలాతపసదావి ♦ నిద్రితాంఘ్రి, పద్మయుగపాళి తన్మహీ ♦ పాలమౌళి. 238

షట్చక్రవర్తిచరిత్రము, అ 7 ప 3.

# కార్తవీర్యార్జునుఁడు

సీ. నిరతంబుఁ గొల్వఁడే ♦ దురితంబు లణఁగించు, దానేప్సితత్యాగి ♦ దత్తయోగి
భుజసీమ నిల్పఁడే ♦ నిజధామసంరక్షి, తాబ్ధిచతుష్కాంత ♦ నవనికాంతఁ
జెఱసాలఁ బెట్టఁడే ♦ మొఱసాలఁ బెట్టంగఁ, బ్రథనజయోత్కంఠుఁ ♦ బంక్తికంఠు
ధృతితృప్తుఁ జేయఁడే ♦ యతితప్తుఁడై వేఁడు, సకలదాహోమోదు ♦ జాతవేదు
గీ. సకల సామాన్యుఁడే యణి ♦ మాదిసిద్ధి, సిద్ధకీర్తిఁ భువనప్ర ♦ సిద్ధకీర్తి
స్నిగ్ధసద్గుణరత్న ప్ర ♦ సిద్ధమూర్తి, శత్రుసమవర్తి యర్జున ♦ చక్రవర్తి. 239

దశావతారచరిత్ర, ఆ 5 పే 202.

# బలిచక్రవర్తి

ఆ. అతనిసుతుఁడు బలి మ ♦ హాగ్నికల్పుఁడు శుచి, సత్యసంధుఁ డధిక ♦ సత్త్వధనుఁడు
విష్ణుభక్తుఁ డఖిల ♦ విదుఁడు సర్వేంద్రియ, జిత్తు దానరతుఁడు ♦ శిష్టనుతుఁడు. 240

పద్మపురాణము, ఆ 7 ప 139.

సీ. ఘనగదాదండంబుఁ ♦ గైకొని యిందిరా, కాంతుఁడు వాకిలిఁ ♦ గాఁచియుండఁ
దనకు లోఁగాని యు ♦ ద్ధతులయుద్ధతిమాన్చ, పనిపట్లఁ జక్రంబు ♦ పంపుసేయ
నేకార్యమునకైన ♦ లోకపాలాదికు, లనిశంబు దనబుద్ధి ♦ యడిగికొనఁగ
లలితరూపవిలాస ♦ లావణ్యవతులైన, కన్యకామణులూడి ♦ గములు సల్ప

గీ. స్వర్గలోకంబుకంటెను ♦ శతసహస్ర,గుణము లెక్కుడుగాఁ గల్గి ♦ ప్రణుతికెక్కు
సుతలమున నేఁడు నున్నవాఁ♦డతులకీర్తి, చక్రిసుతవర్తి బలిదైత్య♦చక్రవర్తి. 241
దశావతారచరిత్ర, ఆ 4.

సీ. త్రైలోక్యవర్ణితౌ♦దార్యశౌర్యాదితో,జ్జ్వలకీర్తి బలిదైత్య♦చక్రవర్తి
ఖలజనానీకని♦గ్రహవిగ్రహోత్సుకస్థి, పమవర్తి బలిదైత్య♦చక్రవర్తి
జగదీశ్వరార్పణా♦చ్ఛాప్రకల్పితయజ్ఞ, శతపూర్తి బలిదైత్య ♦ చక్రవర్తి
యవలోకమాత్ర నే♦త్రానందకరనిరం,జనమూర్తి బలిదైత్య ♦ చక్రవర్తి
గీ. స్వవశచక్రపరిచ్ఛిన్న♦సకలశత్రు, చక్రవిస్ఫూర్తి బలిదైత్య ♦ చక్రవర్తి
యమ్మహాత్మునిఁ దొడర నీ♦కలవి యగునె, నైనఁ బోవలతేనిఁ బో♦మ్మసురనాథ.
ఉత్తరరామాయణము, ఆ 4 ప 14.

ఉ. భాగవతాగ్రగణ్యుఁడు కృ♦పాపరిపూర్ణుఁడు సత్యభాషణుం
డాగమవేది యజ్ఞపరుఁ♦డాహవదోహలుఁ డుజ్జ్వలాత్ముఁ డ
భ్యాగతపూజకుండు సక♦లార్థిజనాభిమతార్థసంతత
త్యాగపరాయణుండు బలి♦దానవుఁ డొప్పు వజేయసత్త్వుఁడై. 243
జాహ్నవీమాహాత్మ్యము, ఆ 2 ప 3.

# జనకచక్రవర్తి

సీ. యమనియమాసనా♦ద్యష్టాంగవిధముల, శిరవైన రాజయో♦గీశ్వరుండు
వేదవేదాంతాది ♦ వివిధశాస్త్రార్థముల్, కడదాఁక నెఱిఁగిన ♦ ఘనకళాఁడు
పరమధర్మాధర్మ♦పథము లేర్పాటుగా, భూమి యేలెడి నృప♦పుంగవుండు
మౌనుల కెల్ల స♦మ్యగ్జ్ఞానపద్ధతుల్, దెలిపిన పరమోప ♦ దేశికుండు
గీ. పాదమొక్కటి మహదుగ్ర♦పావకమున, చరణ మొక్కటి కర్పూర♦చందనమున
నిలిపి సుఖదుఃఖములు సమం♦బులుగ నడుచు, దేవసదృశుండు జనక ధా♦త్రీవిభుండు.
యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 2 పే 40.

# భోజరాజు

క. భోజుఁడు ప్రసన్నవదనాంభోజుఁడు నిఖిలార్థికల్ప♦భూజుఁడు విలస
త్తేజుఁడు సంభృతసుకవిసమాజుఁడు రూపాదిజితర♦మాజుఁడు జగతిన్. 245

సీ. భూనాకశ్రీమునఁగల ◆ రాచబిడ్డల కెల్లఁ, దిలకమై పుట్టినఁ ◆ జెలువుఁ డితఁడె
కర్ణాదిదాతల ◆ కథ లెల్ల మఱపించి, పేరుఁ గాంచిన దాన ◆ శూరుఁ డితఁడె
సారంబులగు చతు ◆ ష్షష్టివిద్యలకును, దానతానక మగు ◆ ధన్యుఁ డితఁడె
తనమోముఁ జూచిన ◆ జనుల కెల్లఁ గవిత్వ, సరణిఁ జేకుఱఁ జేయు ◆ చతురుఁ డితఁడె
గీ. నిఖిలరాజన్యముకుటమ ◆ ణిప్రభావి, భూషితాంఘ్రిపద్ముండగు ◆ భోజుఁ డితఁడె
యనుచుఁ గొనియాడుపౌరుల ◆ హర్షభాష, లంబునిధిఘోషమునకంటె ◆ నతిశయిల్లె.
భోజరాజీయము, ఆ 2 ప 52, 94.

# దుష్యంతుఁడు

సీ. ఏరాజు భేరికా ◆ ఘోరనిర్ఘోషంబు, ఘోషంబు నరఁ జేయుఁ ◆ గుటిలనృపుల
కేరమ్యగుణశాలి ◆ భూరిప్రతాపంబు, తాపంబుఁ గూర్చు న ◆ ధర్మరతుల
కేమేటినిజభుజా ◆ ధృతచంద్రహాసంబు, హాసంబుఁ గావించు ◆ నశనిధాన
కేధన్యువితరణ ◆ సాహసంకల్పంబు, కల్పంబునకు వెలి ◆ కాంతి నెఱపు
గీ. నతఁడు కేవలనృపుఁడె క్రూ ◆ రాట్టహాస, చకిత చకితాహితాహిత ◆ స్వర్ణపూర్ణ
విశ్వవిశ్వంభరాధురా ◆ విధురతరభు, జాగ్రజాగ్రద్బలుండు దు ◆ ష్యంతవిభుఁడు. 247
శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 1.

# దశరథుఁడు

సీ. గోరథంబుల నెక్కి ◆ కులగురుఁ డాదియౌ, తాపసోత్తములు సం ◆ దడి నడువ
భద్రేభములమీఁద ◆ భరతశత్రుఘ్నులు, సరిగాఁగ నుభయపా ◆ ర్శ్వముల నడువఁ
గౌసల్యమొదలైన ◆ గరితలు ముచ్చప, న్నాగంపు పల్లకీ ◆ లు ముందు నడువ
వెనుక డెబ్బదిరెండు ◆ వినియోగములవారు, నాప్తులు నృపులు సం ◆ దడిని నడువఁ
గీ. జిమటుపనిమీసములకప్పుఁ ◆ జెంపకురులు, నెదను గస్తూరిపట్టెలు ◆ నుదుటితిలక
మలర వెలువడె దశరథుఁ ◆ డౌర మురళి, సొగసనుచు వారకామినులు ◆ లూచి నగఁగ.
దశావతారచరిత్ర, ఆ 7.

సీ. గురుశాత్రవానేక ◆ తమకఠోరకఠారుఁ, దరిమేఘపటలపా ◆ వానిలుండు
ప్రత్యర్థికరిఘటా ◆ పంచాననోగ్రుండు, పృథుపరారణ్యకృ ◆ పీటభవుఁడు
ప్రతివీరకేసరి ◆ ప్రతతిగంధర్వుండు, పటువైరివార్నిధి ◆ బాడబంబు
సాహసవిమతస ◆ ర్పాహితుండికమూర్తి, భీకరాహితగోత్ర ◆ భిదురపాణి

గీ. భూరికరుణాసముద్రుం డు ♦ ఘోరశౌర్య, ధైర్యగాంభీర్యచాతుర్య♦కార్యకార
ణానురాగప్రభావైక♦మానధనుఁడు, ధర్మమార్గవిధేయుండు ♦ దశరథుండు. 249

సత్యభామాపరిణయము, అ 2.

## పాండవులు

సీ. అబ్ధివేలాపరీ♦తాఖిలోర్వీభార, ధౌరేయభూరిదో♦ర్ధాముదారు
లతిశాస్త్రనిస్త్రింశ♦శతధారధారాభి, హతశత్రురాజన♦వ్రాతకలాపు
లకలంకకీర్తి మౌ♦క్తికవరస్రగ్భూషి, తాశావధూకైశి♦కాభిరాము
లశ్రాంతవిశ్రాణ♦నాసారపుషితవి, శ్వంభరామర్త్యభూ♦జపరికాండు
గీ. లసదృశప్రాజ్యసామ్రాజ్య♦హసితశక్రు, లసమబాణోపమానస♦ర్వాంగసౌకు
మార్యతారుణ్యలావణ్య♦మాననీయు, లింపెసఁగుచుండ్రు పాండవు♦లేవు రెలమి.

క. పంచామరతరులో, హరి, పంచాయుధములో, గిరీశు ♦ పంచాస్యములో
యంచున్ సకలజనంబులు, నెంచన్ బాండవులు వెలసి ♦ రేవురు ఘనులై. 251

చ. ఒరిమయు భక్తియు న్ననరు ♦ నోర్పు గనంబడఁ, బెద్దపిన్నయుం
తరువు లెఱింగి, మాట జవ♦దాఁటక, చెయ్వుల వేఱులేక, యొం
డొరులమనమ్ములో మెలఁగు♦చుండిరి పాండుకుమారు, లెంత నే
ర్పరు! లిల సన్నదమ్ములను♦రాగము వారలదేసుమీ యనన్. 252

విజయవిలాసము, ఆ 1 ప 90, 91.

## పాండవులమాఱువేషములు

సీ. కాషాయదండంబుఁ♦గైకొని యమసూతి, కంకుభట్టన్నునామ♦కంబుఁ దాల్చె
నడబాలతనమున ♦ నఘుఁడై పావని, వలలుఁడనునాఁగ న♦వ్వలన నిలిచె
నటవేషమున నింద్ర♦నందనుఁ డొకయేఁడు, పేడితనంబునఁ ♦ బెంపుఁ దొలఁగ
హయశిక్షకుండయి ♦ యాలగాపరియునై, మాద్రేయు లుండిరి ♦ మహిమఁ దొలఁగి
గీ. కృష్ణ సౌభాగ్యరేఖను♦త్కృష్ట యయ్యు, నిలిచె సైరంధ్రియనుపేర♦నీచవృత్తి
బలపరాక్రమవంతులౌ♦పతులఁ గలిగి, బ్రతుకరా వారు మగుడంగఁ ♦ బతికినాథ.

పంచతంత్రము, సంధి. ప 301.

## ధర్మరాజు

ఉ. ఆపురమేలు, మేలు! బళి! ♦ యందుఁ బ్రజల్ జయ వెట్టుచుండ, నా
జ్ఞాపరిపాలనవ్రతుఁడు ♦ శాంతిదయాభరణుండు సత్యభా
షాపరతత్త్వకోవిదుఁడు ♦ సాధుజనాదరణుండు దానవి
ద్యాపరతంత్రమానసుఁడు ♦ ధర్మతనూజుఁ డుదగ్రతేజుఁడై. 254

శా. దేవబ్రాహ్మణభక్తిప్రోవు, ప్రియస♦త్కృత్యంపుఁగాణాచి, వి
ద్యావైదుష్యముదిక్కు, ధర్మమునకుం ♦ దార్కాణ, మర్యాదకున్
ఠావౌచిత్యము జీవగఱ్ఱ, హితశి♦ష్టవ్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీ♦భృన్మాత్రుఁడే చూడఁగన్. 255

సీ. అవలఁ బోయినవెన్క ♦ నాడు టెన్నఁడులేదు, మొగముముందఱనంట ♦ మొదలెలేదు
మఱవిచెప్పినఁ జేయ♦కునికి యెన్నఁడు లేదు, కొదువగా నడుపుట ♦ మొదలెలేదు
చనవిచ్చి శోకచే♦సినది యెన్నఁడు లేదు, పదరి హెచ్చించుట ♦ మొదలె లేదు
మెచ్చినచోఁ గొంచె ♦ మిచ్చు టెన్నఁడులేదు, మొకమిచ్చకపుమెచ్చు♦ మొదలెలేదు
గీ. మఱియుఁ దొల్లిటిరాజుల♦మహిమ లెన్న, నితఁడెపో సార్వభౌముఁడ♦ప్రతిముఁ డనఁగఁ
బ్రజలఁ బాలించె సకలది♦గ్భాసమాన, కీర్తివిసరుండు పాండవా♦గ్రేసరుండు. 256

సీ. ఎంతలెస్సఁ గనున్న ♦ నంతవేడుకె కాని, ప్రజలకల్మి కసూయ ♦ పడుటలేదు
తనుఁ గొల్వవలె నంద♦ఱనుప్రియంబె కాని, మానిసి వెగటించు♦కైన లేదు
నిచ్చవేఁడిన నర్థి♦కిచ్చుచిత్తమె కాని, మునుపింత యిచ్చితి♦ననుట లేదు
రేవగల్ ధర్మమా♦ర్జించుదృష్టియె కాని, న్యాయంబు దప్పిన ♦ నడక లేదు
గీ. కలఁడె యిటువంటి రాజు లో♦కమున నెందు, జలధివలయితవసుమతీ♦చక్రమెల్ల
నేలవలె శాశ్వతముగాఁగ ♦ నీఘనుండె, యేలవలె నన్యులన నాన్న♦పాలుఁ డలరె.

ఉ. కోప మొకింత లేదు, బుధ♦కోటికిఁ గొంగుపసిండి సత్యమూ
రూపము, తారతమ్యము లె♦ఱుంగు, స్వతంత్రుఁడు, నూతనప్రియా
లోపములేనినిశ్చలుఁ డి♦టుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపరలక్షణుం డనఁగ♦వచ్చునొకో యల ధర్మనందనున్. 258

విజయవిలాసము, ఆ 1.

వెలయఁ గృతాధిపత్యమున ♦ విశ్రుతమై తనఁ బోలె నాదరం
బలరఁగ తన్నియుండఁగుచు ♦ నారయు లెస్సఁగ సంతతంబుగన్. 263

గీ. అలయధర్మార్థకామంబు♦లను త్రివర్గ మతఁడు సమభక్తి విభజించి ♦ యగయుగట్టి
గుణవిశేషత సఖ్యంబుఁ ♦ గోరిచేసి, నట్టు లన్యోన్యమునుగూడి ♦ యలరు నధిప.

ఉ. సామము దానవర్జముగ ♦ సల్పుట లేదల భూరిదానమున్
దామతి సత్క్రియావిరహి♦తంబుగఁ జేయఁడు సద్గుణాంచితం
బామహనీయసత్క్రియయు ♦ నర్హ మెఱుంగక సేయఁ డెన్నఁడో
సామి సుయోధనుం డతని ♦ జాగ్రతయేచుని విన్నవించెదన్. 265

మ. ధనకాంక్షన్మతి కోపకారణమునన్ ♦ దండింపఁ డెవ్వారినిన్
దనరాజోచితనీతిమార్గమున శా♦స్త్రజ్ఞుండు బోధించిన
ట్లనయంబున్మతి నూనుఁజేనియుఁ బరుఁ♦డౌ నేనియుం దుర్నయం
బున వర్తించినదండనంబు సలుపున్ ♦ భూమీశ నిర్లోభతన్. 266

సీ. పరరాజులను మది ♦ భయమంది యెంతయుఁ, బరభేదనప్రౌఢిఁ ♦ బగఁగు గూఢ
చారుల సకలదే♦శములందు నియమించి, పనులనఁ దాభయ♦పనుట గాన
గాకుండునట్టిని♦జాకారమున నుండి, పరరాజు లోపలి♦వారి నెల్ల
వశులఁగాఁ జేసి య♦వ్వారిలో వార యొండొరువుల భేదింప ♦ నొనరఁ జేసి

ఆ. చారు లంపు పనులు ♦ సఫలంబు లొనరించి, వచ్చినపుడె వలయు♦వస్తు విచ్చి
మెచ్చి జనులు తన్ను ♦ మేలుమేలు కృతజ్ఞుఁడనఁ బొగడ్త మెలఁగు♦నయ్యెయెపుడు.
కిరాతార్జునీయము ఆ 1 ప 36-40.

## భీష్ముఁడు

చ. ఇరువదియొక్కమాఱు ధర♦ణీశులఁ గొట్టినయట్టిమేటి స
ద్గురుఁడని జామదగ్న్యునకుఁ ♦ గొంక కెదిర్చియు నంబకై కడున్
దురమునఁ బాఱఁదోలి తన♦దోర్బల మాగురుఁ డాత్మలోన న
చ్చెరువడి యెంచునట్లుగను ♦ జేసినభీష్ముని గెల్వ శక్యమే. 268

మ. అదిగో కాతని కెంచిచూచిన నిజా♦త్మాయత్తపంచత్వమున్
చెవ లజ్జించుమ శక్తి లేక జముఁడు ♦ స్నేంతే పరాభూతుఁడై

మది క్షితిల్లును నట్టిభీష్ముఁ డని భీ♦ ష్మం బైనవిల్ ద్రిప్పు మన్
గడెయ న్నిభతిఁ దొలంగ కేరు నిలువం♦ గా నోపువా కి భవస్. 269

కిరాతార్జునీయము, ఆ 1 ప 168, 169.

# ద్రోణుఁడు

చ. రణమున నుగ్రసాయక పరం♦పరలన్ మిణుఁగుర్లు గ్రక్కుచున్
గణఁకను జంచలోజ్జ్వలశి♦ఖల్ ఘనజిహ్వలయట్లుగాఁగఁ దాఁ
గణఁగి జగంబు మ్రింగుబలు♦ కాంతిను మండు యుగాంతవహ్ని నాఁ
దొణఁగి మహోద్ధతిన్ నడుచు ♦ ద్రోణుని నైనను నోర్వ శక్యమే. 270
మ. పరమాస్త్రోపనిషణ్ణ ధైర్యరిపుభూ♦పాలుండు శూరుండు స
ద్గురుభావాశ్రితజామదగ్న్యుఁడు లస♦త్కోదండుఁ డా ద్రోణునిన్
బరఁగఁ జూచి యసంస్తుతంబగు భయ♦ప్రాప్తిన్ వెసం బొందుచున్
బరువెత్తున్ మతి మృత్యువేని యతనిన్ ♦ మర్దింపఁగా వచ్చునే. 271

కిరాతార్జునీయము, ఆ 1 ప 170, 171.

# భరతుఁడు

సీ. ఇందీవరచ్ఛాయ ♦ నిందించురుచిమించు, సుందరంబగుమేని ♦ సొబగువాని
శతపత్త్రిసత్పత్త్ర ♦ జైత్రంబులై మీఱు, వాలుఁగన్నులమేలు ♦ డాలువాని
నాజానులంబాహి ♦ రాజాధిరాజోరు, బాహావిలాసవై♦భవమువాని
సంపూర్ణపూర్ణిమా ♦ చరదిందుసౌందర్యధామమౌ చిఱునవ్వు ♦ మోమువాని
గీ. దంబుమీఱుజటామకు♦టంబువాని, సతతవేల్లితచీరవ♦స్త్రములవాని
రంజితకవాటదోరంత♦రంబువాని, భరతు శ్రీరామసద్భక్తి ♦ నిరతుఁ గాంచె. 272

నరసభూపాలరాజీయము, ఆ 5.

# భరతుఁడు

## (దుష్యంతపుత్త్రుఁడు)

సీ. సనసాస్ఫుటీమేటి ♦ శరభసాహసకోటి, పరభయంకరధాటిఁ ♦ బరిఢవించుఁ
గుంచితోరకపాణి ♦ నొంచిదక్షిణపాణి, బంచాననశ్రేణిఁ ♦ గొంచెపఱుచు

వారణంబులఁ గిట్టి ♦ పేరిగొండముఁ బట్టి, భూరుహమ్ములఁ గిట్టి ♦ కేరుచుండుఁ
జండవైఖరి మీటి ♦ కొండలోయలఁ దాటి, గండశమ్ముల జేరి ♦ బెండుపఱుచు
గీ. రుచిరతరఖురస్పృగాలశా♦ర్దూలకోల, ముఖముఖరదుష్టసత్త్వస♦మూహమూహ
మోహరింపఁగఁ దెగవారి♦సాహసమున, డిందుపఱుచు శకుంతలా♦నందనుండు. 273

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 3 ప 89.

## జడభరతుఁడు

సీ. ఏయాశ్రయంబున ♦ నిందిరాధీశ్వరుఁ, డచ్చటివారల ♦ నాదరించి
ప్రత్యక్షమున నుండుఁ ♦ బాయక యెప్పుడు, నట్టిరమ్యంబైన ♦ యాశ్రమమున
నిలిచి సాలగ్రామ♦ములు గలగండకీ, నది యొందు నెంతయుఁ ♦ గదిసి యుండు
నహోచ్చితు నేకాకి ♦ యగుచును భరతుండు, బహువిధనవపుష్ప ♦ పల్లవముల
గీ. నతులతులసీదళంబుల ♦ నంబువులను, గందమూలాదిఫలములఁ ♦ గంజములను
ఘనత నర్పించి నిచ్చలుఁ ♦ దనివిలేక, సేవసేయుచు నుండె నా♦శ్రీపు హరిని. 274

భాగవతము, స్కం. 5 ఆ 1 ప 97.

## గయుఁడు

సీ. ధర్మమార్గంబున ♦ ధారుణీజనులను, బ్రేమతోఁ బోషణ ♦ ప్రేమణోప
లాలనశాసన ♦ లక్షణాదులచేతఁ, బోషించుచును యజ్ఞ♦ములను యాజ్ఞ
పురుషు నీశ్వరుఁ జిత్త♦మున నిల్పి సేవించి, స్వాంతమందున్న యీ♦శ్వరునిఁ గాంచి
యఖిలజీవతతికి ♦ నానంద మొసఁగుచు, నిరభిమానత మెయి ♦ ధరణి నేలె
ఆ. సత్యమందు మిగుల ♦ సత్త్వయందును, ధర్మమందు యజ్ఞ ♦ కర్మమందు
గయుఁడు వసుధలోనఁ ♦ గంజాక్షుఁడే కాని, మానవుండు గాఁడు ♦ మానవేంద్ర. 275

భాగవతము, స్కం. 5 ఆ 2 ప 9.

## కుశలవులు

క. సీతకు నుదయించిరి ప్రద్యోతనశశినిభులు దోష♦దూరులు సుగుణో
పేతులు కాకుత్స్థాన్వయపూతులు కుశలవులు కవల♦పుత్త్రులు వరుసన్. 276

పద్మపురాణము, ఆ 9 వ 21.

## సుందోపసుందులు

చ. మునిజనకోటిఁ బట్టుకొని ♦ మోములు [illegible]యుచు యాగశాలలం
దనలము వెట్టి కాల్చుచు జ♦నాశ్రయధర్మము లెల్ల మాన్చి యు

యీ్యనిమిషసిద్ధసాధ్యఫణి ♦ యక్షసురాహితరాజసంతతిన్
గనుఁగొని పాఱఁద్రోలుచును ♦ గర్వము దిక్కుల దుస్సహంబుగన్. 277
పద్మపురాణము, ఉత్తర. ఆ 2 ప 4.

## రావణుఁడు

సీ. కనకాంబరముకటి♦తల్పమై విలసిల్ల, మేచకాభ్రమువంగి ♦ మేను మెఱయ
రమణీయతరలిప్త♦రక్తచందనచర్చ, కలితసంధ్యారాగ ♦ కాంతిఁ దనర
భ్రుకుటిరేఖాభీల ♦ భూరిఫాలము లొప్ప, దంష్ట్రికరాళాస్య ♦ దశక మెసఁగఁ
గుండలమణిరుచుల్ ♦ గండభిత్తుల నిండ, మణిముద్రికలు వ్రేళ్ళ ♦ ఘృణుల నీన
గీ. నభ్రగజదంతకులిశ♦వ్రణాంకములను, దనరు బాహుల రత్నాంగ♦దంబు లమర
వాఁకడ నిద్రవోవు రా♦వణునిఁ గాంచె, నమరలోకవిద్రావణు ♦ ననిలసుతుఁడు.
భాస్కరరామాయణము, సుం. ప 106.

సీ. కైలాసశిఖరంబు ♦ కందుకం బెవ్వని, కండూతినిజభుజా ♦ దండములకుఁ
గృత్తాత్మశిరములు ♦ నెత్తమ్ము లెవ్వని, నీలకంఠార్చనా ♦ నియమములకు
శతమఖాంతఃపుర♦స్మితము లుగ్గెవ్వని, యుగ్రాసిపుత్రికా♦భ్యుదయమునకుఁ
గనకగర్భాండంబు ♦ కరఁగెడు నుయిద యెవ్వనిరోమశిఖిశిఖా♦వైభవమున
గీ. కతఁడు సుర్వారదిగ్విజ♦యప్రయాణ, సరళమార్గాంతరాంతర ♦ సన్నివేశ
భువనవలయీకృతాఖిల ♦ భువనకుండు, రావణుఁడు వొల్చు విశ్వవి♦ద్రావణుండు.
కవికర్ణరసాయనము, ఆ 2 ప 113.

## రావణుని సన్న్యాసివేషము

సీ. కరమున రుద్రాక్ష♦కటకముల్ చెవులను, మండితరుద్రాక్ష♦కుండలములు
శిరమున భద్రాక్ష ♦ వరకిరీటం బెద, భూరిభద్రాక్షాళి ♦ హారసమితి
గటిఁ గృష్ణమృగచర్మ♦పటమును వ్రేళ్లను, దర్భపవిత్రసం♦తతులు హస్త
మునఁ దీర్ఘకుండిక♦యును గక్షమునఁ బాల, సజ్జ పాలగ్రాసు ♦ చయము మెఱయఁ
గీ. బేటికయుఁ బంచగడ్డముల్ ♦ బెరిగి చెలఁగి, చేత దండముఁ గొని శివ♦శివ యటంచు
సౌమ్యగతి వచ్చె నొక ముని♦స్వామి యగుచు, రావణుండు నమిజ్జివై♦ రావణుండు.
నరసభూపాలరాజీయము, ఆ 3.

# కుంభకర్ణుడు

సీ. శ్వాసమారుతవేగ♦వశమున ముకుగ్రోళ్ళ, వెలికి లోనికి జనుచు ♦ వితతి వాఱఁ
బోరి గుఱుపెట్టుచోఁ ♦ బొగరించురవమున, గహ్వరవిపనంబు ♦ గలయఁ జెలఁగ
ఘుటఘుటాయితదంతి ♦ కోటిఘట్టనఁ గల్గు, వదనవిక్రియఁ గావు♦వాయ పెదర
గీర్వాణసంగర♦క్రీడలు వాక్రుచ్చు, కలవరింతలభూత♦గణము గలఁగ
గీ. భూరిపూత్కృతు లురగేంద్ర ♦ బుద్ధిఁ జేయ,నుగ్రగతి నిద్రపోవుచు♦నుండఁ గాంచి
రద్భుతాకార సమరాట్టు♦హాసదళిత, ఘోరదిక్కుంభికర్ణు న♦క్కుంభకర్ణు. 281

భాస్కరరామాయణము, యుద్ధ. ప 355.

సీ. గుర్వాజ్ఞఁ గడతేర్చి ♦ గర్వోద్ధతిని లేచి, వినువీధి నరికట్టు ♦ వింధ్యుఁ డొక్కఁ
సురదానవులు పున♦శ్చరధిని మథనేచ్ఛ, రహిఁ దెచ్చువరమంద ♦ రాగ మొక్కఁ
యశ్రాంతవారివా♦హాయాసమున లేచి, నాకాంత చరితమై♦నాక మెట్కొఁ
వైరివైరికిఁ దోడు♦వడఁగ నేతెంచిన, సర్వధరాధర♦స్వామి యొక్కఁ
గీ. గాక యుండిన నీరూప ♦ గరిమ గలదె, యనుచుఁ గపినాథు లెల్లనం♦దంద బర్వఁ
జారుమణికుండలాకార ♦ శాతకుంభ, కర్ణుఁడైనట్టి యక్కుంభ♦కర్ణుఁ డరిగె. 282

నరసభూపాలరాజీయము, ఆ 5.

# వాలి

సీ. మహితాహిగుణవేష్ట్య ♦ మానోరుమంథాన, మహీధరోన్మథితోర్మి ♦ మాలివాలి
మాయావిముఖదైత్య ♦ మాయావనప్లోష, కేళిభీమణదావ ♦ కీలి వాలి
పదఘట్టనోద్భగ్న♦పాదపాదపశిలో,జ్జ్వలశృంగశతసప్త♦శైలి వాలి
వజ్రదృఢోత్తాల♦వాలవిక్షేపణో,త్పాతితనక్షత్ర♦పాళి వాలి
ఆ. యట్టివాలిఁ దొడరి ♦ యమృతంబుఁ ద్రావిన, వారికైనఁ బ్రదుక♦వచ్చునొట్టు
కాదుకూడదతని ♦ కయ్యంబు వలెనన్న, నిపుడె దక్షిణాబ్ధి ♦ కేఁగుమనిన. 283

ఉత్తరరామాయణము, ఆ 3 ప 275.

సీ. భోగిభోగాయత♦భూరిభుజోత్క్షిప్త, వరవసుధాభృద్ధ ♦ వాలివాలి
విపులవాసుకిగుణా♦వేష్టితక్ష్మాధర, వైశాఖమథితార్ణ ♦ వాలివాలి
గత్నావటూస్థల♦గ ముకులీకృతపంక్తి, వదనప్రమథితాన ♦ వాలివాలి
చారువిక్రమకళా♦జవనిర్దళీకృత, తాళగోత్రాసంధ ♦ వాలివాలి

ఆ. యట్టివాఁడితఁడట ♦ నెట్టివీరవరేణ్యు,లైన నిల్వఁజాల ♦ రైన గోత్ర
యేమి చెప్పుద వాని ♦ భీమపరాక్రమ, ధామచరితములను ♦ రామచంద్ర. 284
నరసభూపాలరాజీయము, ఆ ౬.

## సుగ్రీవుఁడు

సీ. హిమధామకరకుండ ♦ సుమదామశరబృంద, సమధామమై జన్ని ♦ దము పొసంగ
వినుఁగెంపునగఁజాలు ♦ మనుఁగెంపు తెగడాలు, మొనయింపుకుండలం ♦ బులు వెలుంగ
శుచిరత్న వరనీల ♦ రుచినూత్న హారనీల, సుచిరత్నహారగో ♦ చులు సెలంగఁ
దులకించుతోఁలుకారు ♦ బలుమించుఁ బలుమాఁలు,నలయించు మేనికాం ♦ తులురహింపఁ
గీ. బసిఁడిముంజియు హొంబట్టుఁ ♦ బంచ హేమ, కంకణంబులు నరుణము ♦ ఖంబు దీర్ఘ
వాలమును గల్గునొక మహా ♦ వానరుండు, వచ్చి పొడగన్న రఘువంశ ♦ వర్యుఁ డలరి.
ఉత్తరరామాయణము, ఆ ప 99.

## విరాధుఁడు

చ. అటుఁజని కాంచె రామవిభుఁ ♦ డద్రిశరీరసనాథు దేవతా
పటలవిరోధ భూరిరస ♦ పాటితకర్ణదిశేభనాథు వి
స్ఫుటమునిమార్గరోధు ఘన ♦ శూలవిలగ్నలులాయకుంజరో
త్కటమృగనాథు నిష్కరుణ ♦ ఖండితసాధు విరాధు నయ్యెడన్. 286
నరసభూపాలరాజీయము, ఆ 3.

## తారకాసురుఁడు

సీ. ఆలంబులో నింద్రు ♦ నాలంబుఁ గావించి, వహ్నికిఁ దనకోప ♦ వహ్నిఁ జూపి
యంతకునకు దాను ♦ నంతకమూర్తియై, యసురకు నసురయై ♦ యలవు మెరసి
నీరధీశ్వరు పెంపు ♦ నీరుగా నలయించి, గాలిబలంబెల్ల ♦ గాలిచేసి
వెరయంగఁ దననాథు ♦ నిర్ధనుగావించి, హరునిబలంబెల్ల ♦ హతముఁ జేసి
గీ. యసురగంధర్వయక్షరా ♦ క్షసపిశాచ, గరుడపన్నగమానవ ♦ గ్రహమునీంద్ర
చయము లెల్లను బలుమాఁలు ♦ చంపి శౌర్య, భాసురుండగు నత్తార ♦ కాసురుండు.
వీరభద్రవిజయము, ఆ 2 షే 23.

## నరకాసురుఁడు

మ॥ జలధివ్రాతము నైనఁ గ్రోలఁగఁ గుల♦క్ష్మాభృత్సమూహంబునై
న లుఠత్స్థూలముగాఁ గదల్ప భువియై♦నన్ లోపడం ద్రొక్కఁగాఁ
బ్రిశిరోదగ్రకృశానునైనఁ గబళిం♦పం జాలు నాఖిలదో
ర్బలనిష్ణాతుఁ డభీతుఁ డాతతభయో♦త్పాదిప్రభావుం డిలన్. 288

హరివంశము, ఉత్త॰ ఆ 4.

క॥ ధరణీదేవితనూజుఁడు నరకాఖ్యుఁడు భూరిబలుఁడు ♦ నక్తంచరుఁడు
ద్ధురుఁడై ప్రాగ్జ్యోతిషమును, పుర మేలుచు నుండె నిఖిల♦భోగాస్పదమై. 289

సీ॥ అతఁడు మహోగ్రుఁడై ♦ యఖిలరాజన్యులు, సమితులై తనశాస♦నమున మెలఁగ
నమితబలంబుతో ♦ నమరేంద్రు సాధించి, సురలోకమంతయుఁ ♦ జూఱవుచ్చి
సొంపైన దేవతా♦సుదతులఁ జెఱపట్టి, యఖిలవస్తువులను ♦ నపహరించి
యమరేంద్రుహయమును ♦ నైరావతంబును, గొనిపోయి తనయింటి♦ నునిచి కల్ప
గీ॥ తరువులన్నియుఁ దెప్పించి ♦ తనవిహార,వనములోపల నాటించి ♦ వజ్రమాది
రైనసాధనములు దాన♦ పూని యెందు, నఖిలవిక్రముఁడై పేర్చి ♦ యంతఁ బోక. 290
ఆ॥ అఖిలదేవమాత♦యైనయయ్యదితికుం,డలములంటఁ బట్టి ♦ బలిమిఁ గొనియెఁ
ధనదు పురము మీఁదఁ ♦ జని శంఖపద్మాది, నిధుల నెల్లఁ దాన ♦ యధిపుఁడయ్యె.

పద్మపురాణము, ఆ 10 ప 76, 78.

## కంసుఁడు

సీ॥ జలరుహాక్షుండు వి♦శాలవక్షుం డురు,శ్యామలదేహుఁ డా♦జానుబాహుఁ
డమితబలోద్ధతుఁ ♦ డతిబాణకౌశలుఁ, డతికార్యధుర్యశౌ♦ర్యాన్వితుండు
హరిహరాదులకేని ♦ నలవిపడనివాఁడు, జనపాలనఖ్యాతిఁ ♦ గొనినవాఁడు
వాసవగుహ్యకే♦శ్వరులమించిన భోగ,భాగ్యాతిశయములఁ ♦ బరఁగువాఁడు
గీ॥ పుణ్యరహితుండు దుష్ప్రవృత్తి♦భూషణుండు, గపటవేషుండు నుద్ధతర♦కఠినహృదయుఁ
డమితచతురంగసేనాస♦మన్వితుఁడు, నైన యాకంసుఁ డుగ్రసేనా♦త్మజుండు. 292

చిత్రవతీపరిణయము, ఆ 1 ప 10.

## హిరణ్యకశ్యపుఁడు

సీ॥ కులపర్వతంబులు ♦ కుదురులు కదలి సం,ధులు వాసి తటములు ♦ దునిసిపడఁగ
జలరాసు లేడును♦ గలగుండుగొని యెడ, గడ్డల ద్రోరంపుఁ♦ గడలు వొడవ

దిక్పాలములు గూల ♦ దిగ్గజంబులు గట్టు, పట్టులు విడిచి వి♦భ్రాంతిఁ గూల
దర్వీకరాధిపు♦తలల చుట్టులు వీడి, పడగ లొండొంటితోఁ ♦ దొడరి ప్రెంగ
గీ. నాదికూర్మంబునకు భీతి ♦ యాగ్గలింప, సప్తపాతాళములు డిగ్గ♦జాతి యడఁగ
నూర్ధ్వభువనములుత్క్రంప♦ మొందనుర్వి, రెండు చెఱఁగులఁ బట్టియుం♦ డొండ యూఁచె.

హరివంశము, ఉత్త. 239. ఆ 9.

సీ. కనలుబింకపుఁగింకఁ ♦ గలుగువేఁడిమి యెల్ల, నొక్కటియై యొడ♦లొత్తె ననఁగఁ
గఱుకుఁ బ్రల్లదమునఁ ♦ గల్గుపోఁడిమి యెల్ల, నచ్చమై తెగఁబొడ♦వయ్యె ననఁగఁ
గటికరియై తనరారు ♦ గర్వంబునకుఁ గల, చేగ యెల్లను రూపు♦ చెందె ననఁగ
వెగ్గలంబై పేల్చు ♦ వీరంబునకుఁ గల, పసిగ యెల్లను మేను ♦ వడసె ననఁగఁ
ఆ. బ్రళయకాలదహనుఁ ♦ బాటించుదొరయనఁ, జండదండధరుని ♦ సఖుఁడనంగఁ
దేజరిల్లె నైజ♦తీవ్రమానమని హిరణ్యకశిపుఁ డపశ♦రణ్యరిపుఁడు. 294

నృసింహపురాణము, ఆ 2 ప 3.

## హిరణ్యాక్షుఁడు

సీ. అంగుష్ఠమున దల్చె ♦ నా కిరీటము దాఁకి, పటపట బ్రహ్మాండ ♦ భాండ మదర
నట్టి చేతులు సాచె ♦ నా పూర్వపశ్చిమ, చంద్రదినేంద్రులు ♦ చంకనిఱుకు
వడిగాఁగ నాలుగై ♦ దడుగులు నడిచెనా, ధారుణీతలము పా♦తాళమంటు
నొకయింత ఘనముగా ♦ నోడ లుబ్బఁజేసెనా, హరిదంతరములెల్ల ♦ నవియఁ బాఱు
గీ. నడిఁది నిట్టూర్పుగాడ్పుల ♦ గ్రహగణంబు, లాక్రమాలకుఁ జిక్క్రన♦ తుగ్రదృష్టి
నిగుడుచో నెల్ల నిగురులై ♦ నెగయుఁ నట్టి హొసనొసరింపవిధిగుండె♦లవియుచుండు
వానియౌద్ధత్య మెన్న నె♦వ్వారితరము. 295

దశావతారచరిత్ర. ఆ 3.

## మహిషాసురుఁడు

సీ. అలలీలనంతకు ♦ నతిదీనుఁ గావించి, బలిమిఁ గోణాధిపు ♦ భంగపెట్టి
పరిగొని వరుణునిఁ ♦ బరిభూతి నొందించి, కడిమిమైఁ బవనుని ♦ గాసిచేసి
మత్తిల్లి విత్తేశు ♦ మానంబడంగించి, గండున నీశానుఁ ♦ గష్టపఱిచి
యేచి గంధర్వేశు ♦ హీనదశకుఁ దెచ్చి, యలుకమైఁ సాధ్యపుఁ ♦ దలఁగఁ ద్రోచి

గీ. యప్పురంబులు వడిఁ దాన ♦ యాక్రమించి, గరుడసిద్ధవిద్యాధర ♦ ఖచరనాగ
వరులనుద్వృత్తిసతతంబుఁ♦బఱపిపనులు, గొనుచునున్నాఁడుమహిషుండు♦క్రొవ్వుమిగిలి.
మార్కండేయపురాణము, ఆ 6 ప 71.

# అంగదుఁడు

సీ. కడకాలఁగొనిమత్త♦గజముల బలిమిచే, వినువీథిఁ బోఁకంగ ♦ విసరి విసరి
వాలాగ్రమున దైత్య♦జాలంబులనుజుట్టి, వెస మహాపథమునఁబై ♦ వ్రేసివ్రేసి
రంగదుత్తుంగతు♦రంగంబులను గని, ముంజేత నిలఁబడ♦మోది మోది
పరపదాతులడాసి ♦ గురుతరబలమున, క్ష్మాతలి డాకాలఁ ♦ జమిరిచమిరి
గీ. వడి రథంబుల రథముల♦ వైచివైచి, మఱిమహాకాయుశతమాయు ♦ మహోగ్రకాయు
ఘోరదైతేయులనుబట్టి ♦ గుదియఁ గొట్టి, యలరెఁ జామీకరాంగదుఁ♦డంగదుండు.
నరసభూపాలరాజీయము, ఆ 5.

# అబ్రహాము

సీ. గంభీరతాధరి♦తాంభోనిదానంబు, సాంద్రకృపామృత ♦ సారసరసి
సదమలజ్ఞానల♦క్షణలతావాలంబు, భూరిసద్గుణరత్న♦భూషణంబు
కమనీయతరయశః ♦ కర్పూరపేటిక, నిఖిలార్థినీపవ♦నీఘనంబు
చిరసత్యనయక్షేమ♦ పీఠసమాశ్రయభూమి, సన్మార్గహితవృత్తి ♦ జన్మసీమ
తే. ఖ్యాతుఁడని యభిజ్ఞులు నుతింప ♦ నిం పెసంగె, బహుదినంబులు సర్వేశ♦సత్యనామ
మంత్రపఠనానుమోదశుం♦భన్నిజాంత,రంగుఁ డబ్రహాముఁ డవనీసు♦రాగ్రగణ్య. 298
వేదాంతరసాయనము, ఆ 2 ప 57.

# అల్లమప్రభువు

సీ. పరమపావనమైన ♦ భస్మత్రిపుండ్రంబు, ఫాలభాగంబునఁ ♦ బ్రజ్వరిల్లఁ
గరపాదనఖరరే♦ఖలు రాజయోగసం, భరితసామ్రాజ్య వే♦ల్పఱుచుచుండ
ఘోరమాయాసతి ♦ కోలాహలోద్రేక, బిరుదవాక్యంబులు ♦ పరిభవింప
యాజానుబాహుల ♦ నలరారునిజదివ్య, దేహంబు కాలచం♦ద్రికల నీన

సీ. నెలరవిభంగి పన్నెండుమూర్తులఁ దాల్చి, ధవళోర్ధ్వపుండ్ర విధంబుఁ బూనె
తన మేన పుండ్రముల్దనరఁ దనమఘంబు,లను రవి తనుకాంతులను వసింపఁ
దగఁజేసెనన హరిముద్రాచూర్ణరేఖలు, దంబుగానుండఁ దరంబుఁ దనముఁ
జెన్నుగా నొనరించి శ్రీతులసీసరో,జాక్షసూలలఁ దాల్చెనన గళంబు
గీ. నందు దోమాలికలు పాలుపొందఁ ద్రిభువనములు నిండిన హరికీర్తి దనునుభక్తి
ధవళసూత్రత్రయాకృతిఁ దా వహించె, ననఁగ యజ్ఞోపవీతాంకుఁడైనవాని. 308

భార్గవపురాణము, ఆ 5 పే 121.

# కుచేలుఁడు

గీ. తనకుచేలత్వమట యథార్థంబు గాఁగఁ, జింపిధోవతికొంగునఁ జేరెఁడంత
ముడిచితెచ్చినయటుకులు పిడికెఁడంటి,మనతఁ గృష్ణుండు మెసవెడిసమయమునను.
సీ. చినిగి పూసికలు వేసినకోక బంగారు, చెఱఁగుల చెంగావి చీరయయ్యెఁ
జెవులకుఁ జాలని చిఱుతలక్కాకులు, కట్టాణిముత్యాలకమ్మ లయ్యెఁ
బుస్తెమాత్రమె కాని పోఁడిమెఱుంగని, గళమున హారముల్ నెలవుకొనియె
నొకటి రెండో గాజులున్నకరంబుల, నవరత్నమయకంకణములు వొదవె
గీ. నల కుచేలునిసతికి దుస్సలకుమతియుఁ,జూడఁజూడఁగ మైగ్రమ్మెసొమ్ములకును
కొదవ లేదయ్యె ప్రబలుసంపదలవలన, రుక్మిణీనాథు దివ్యకారుణ్యమునను. 310

దశావతారచరిత్రము, ఆ 9 పే 318.

# బిల్హణకవి

శా. ఆవాచాలత యాకవిత్వసురసప్రౌఢి యారూఢి యా
భావం బాపదశబ్దగౌరవము లాపాండిత్య మాశాస్త్రబో
ధావిర్భావక మాసుధారసవచోవ్యాపార మాగ్రజ్ఞ యిం
కేవిద్వద్వ్రలభేదికైనఁ గలదే యెంతేనిఁ జింతింపఁగన్. 311
సీ. ధరణివస్త్రములలో ధవళాంబరము మేలు, ఋతువులలో సుమాన్వితము మేలు
సుమములలో శరచ్ఛోభిమల్లిక మేలు, విలుకాండ్రలో రతివిభుఁడు మేలు
ఘనసౌరభములలోఁ గస్తూరి మేలగుఁ, గలయస్త్రములఁ గార్ముకంబు మేలు
తనువాస్తులలోనఁ దర్కవాక్యము మేలు, సారసముఖులలో శ్యామ మేలు

తే. పరగుపదవులలో విష్ణు♦పదవి మేలు, దశలయందున యౌవన ♦ దశయు మేలు
మహితగీతులలోఁ బంచ♦మలయ మేలు, కవులలో నెల్ల బిల్హణ♦కవియు మేలు. 312
చ. మృగములలోన సింహ మవ♦నీంద్రులలో రఘురామమూర్తి ప
న్నగములలోన శేషుఁడు వ♦నమ్ములలో పల నందనమ్ము దే
వగణములోన శంకరుఁడు ♦ వార్ధులలోఁ బయోబ్ధి యెట్లనో
మిగులఁ గవీంద్రసంతతిని ♦ మేటియ బిల్హణుఁ డెట్లు చూచినన్. 313

బిల్హణీయము, ఆ 1 ప 77–79.

సీ. వివిధాంబరములందు ♦ ధవళాంశుకవితాన, మఖిలర్తువుల వసం♦తాగమంబు
నెల్లపుష్పములందు ♦ మల్లికాకుసుమంబు, ధానుష్కచయమందు ♦ దర్పకుండు
సౌరభావళులందు ♦ సారంగనాభంబు, నస్త్రంబులందు శ♦రాసనంబు
సుందరోక్తివిలాస♦మందు దర్కారసంబు, ప్రియ తమంబులకల♦పించుచామ
గీ. మొనయఁ బ్రాయములందుఁ జ♦వ్వనము ముక్తి, మార్గములయందు శాంకర♦మతము మధుర
గీతములయందు పంచమ♦గీతిరీతి, కవులయందును బిల్హణ♦కవిఘనుండు. 314
సీ. చిత్తగింపుము దేవ♦ సింధుజవిద్యావ, తీపురం బీతని♦కాపురంబు
లక్షణనాటకా♦లంకారకావ్యశా, స్త్రాగమోభయకవి♦త్వాతిచతుర,
శృంగారవిద్యావి♦శేష శేషాహిబి,ల్హణచోరభుక్కుండుఁ ♦ డనెడి పేరు
లలరెడివాఁడు మే♦లలరుఁ బ్రాయమువాఁడు, తగుగుణంబుల మెచ్చఁ♦ దగినవాఁడు
గీ. పరమపావనుఁ డఖిలప్ర♦పంచసార, మరసి తావకపురము వి♦ద్యాధిదైవ
తావిహారణస్థలంబని ♦ దలఁచి తనకుటుంబసహితంబుగా నివా♦సంబుఁ జేసె. 315

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 2.

## ధన్వంతరి

సీ. తొలుకాఱు మెఱుఁగుచా♦యలమేనిజిగివాఁడు, ప్రవిమలాజానుబా♦హువులవాఁడు
కెందామరల కాంతిఁ♦ గేరుకన్నులవాఁడు, కలితవిశాలవ♦క్షంబువాఁడు
నవరత్నమయభూష♦ణములు దాల్చినవాఁడు, రమణీయపీతాంబ♦రంబువాఁడు
పద్మనాభాంశసం♦భవమూర్తి యైనవాఁ, డఖిలవైద్యకళాఢ్యుఁ ♦ డైనవాఁడు
ఆ. యాగభాగభోక్త ♦ యాయుఃప్రమాణజ్ఞుఁ డమృతకుంభకలిత♦హస్తుఁ డగుచు
నమర లోకవైద్యుఁ♦డైన ధన్వంతరి, యనెడు పురుషుఁ డబ్ధి♦యందుఁ బుట్టె. 316

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 4.

సీ. పదియాఱేండ్ల ♦ ప్రాయంబుఁ గలవాఁడు, కమనీయతరగ కంబు♦కంధరుండు
కలితమాణిక్యకుం♦డలకిరీటాంగద,హారకేయూర భూ♦షాన్వితుండు
దివిజేంద్రకరితుండ♦దీర్ఘదోర్దండుండు, స్వర్ణపీతాంబర ♦ సంవృతుండు
కోమలజలధర♦శ్యామలవర్ణుండు, సింహసంహననుండు ♦ శ్రీధరాంశ
ఆ. భవుఁడు యాగభోక్త ♦ దివిజేంద్రవైద్యుండు,నమృతపూర్ణకుంభ♦హస్తుఁ డగుచుఁ
గడలి వెడలి వచ్చె ♦ ఘనుఁడు ధన్వంతరి, సురసురాళితతులు ♦ చోద్యమంద. 317

మహాలక్ష్మీపరిణయము, ఆ 2 పే 54.

## ఆంజనేయస్వరూపము

సీ. బాలభానుప్రభా♦పటలంబు కైవడి, నుగ్రలోచనముల ♦ యొప్పు మిగుల
ఘనతరనీలమే♦ఘంబు చందంబునఁ, జటులవిస్ఫురితను♦చ్ఛాయ దనర
జండదిగ్వేదండ ♦ తుండంబులట్టుల, నురుభయంకరబాహు♦యుగ్మ మమర
నిరుపమానుతలస♦ద్వరుణపాశము మాడ్కి, వపుసముద్దీపిత ♦ వాల మెసఁగ
గీ. మృత్యుదేవతకత్తుల♦రీతి మెఱసి, నిశితఘనదంష్ట్రపఙ్క్తులు ♦ నీటు గొనఁగ
ధైర్యధర్మాద్రిమారుత ♦ తనయుఁ డపుడు, పెరిఁగె నక్షత్రగణములు ♦ పేర్లు గాఁగ.

మైరావణచరిత్రము, ఆ పద్య 105.

## విరాడ్రూపము

సీ. బలిముఖ్యులైనపు♦ణ్యులకు శేషాదిభు,జంగవర్యులకు నా♦శ్రయము లగుచుఁ
గరమొప్పు క్రిందిలో♦కములైదురెండును, బ్రవ్యక్తముగఁ బర♦బ్రహ్మమునకుఁ
బాదమూలపదాగ్ర♦పార్ష్ణిగుల్ఫంబులు, చారుజంఘలును జా♦నూరుయుగము
సప్తాంబుధిద్వీప♦సంయుతంబైనట్టి, ఘనమహీభాగంబు ♦ కటితలంబు
గీ. సిద్ధచారణగుహ్యకాం♦చితవిమాన, శోభితబిలప్రదేశంబు ♦ నాభితలము
తారకాగ్రహశక్రాది ♦ దైవతప్రజాకలితమైనయట్టి స్వ♦ర్లోక మురము. 319
క. మహదాదిలోకములు త,న్మహితగళాననలలాట ♦ మస్తకలీలా
సహితములు బహుదిగీశని,వహము భుజార్గళము లయ్యె ♦ వర్ణించినచో. 320
క. శ్రవణంబులు దిక్కులు త,చ్ఛ్రవణేంద్రియ మరసిచూడ ♦ శబ్దము నాసా
వివరంబు లశ్వినీతను,భవు లాననవారిజంబు ♦ పావకుఁ డయ్యెన్. 321

సీ. రవిసుధాకరులు నే♦త్రములు నిమేషంబు, లున్మేషమును రాత్రి♦యును దినంబు
భారతి రసన సం♦భాషణంబులు శ్రుతుల్, దంష్ట్రాకరంబులు ♦ దండధరుఁడు
దంతముల్ పుత్రమి♦త్రస్నేహబంధముల్, చతురమాయావిశే♦షంబు నగవు
లలితాధరయుగంబు ♦ లజ్జయు లోభంబు, నఖిలనాడీనివ♦హంబు నదులు
గీ. భూరుహంబులు రోమము♦ల్వారిదములు, శిరసిజంబులు హేయము♦చ్ఛిష్టమైన
యట్టికాలంబు శల్యంబు ♦ లద్రిగణము, జఠర మద్దేవునకు సర్వ♦సాగరములు. 322

ఉ. ఈపటిమం ద్రిమూర్తిమయ♦దేవుని యద్భుతమైన యీవిరా
ద్రూపము నెవ్వరేని నెపు♦డున్మదిలోనఁ దలంతు రట్టి ని
ష్ఠాపరులమ్మహాత్ముని వి♦శాలదయాపరిపూర్ణదృష్టిచేఁ
బ్రాపితసర్వవాంఛితఫ♦లాన్వితులై సుఖియింతు రెప్పుడున్. 323

మూర్తిత్రయోపాఖ్యానము, అ 2.

సీ. ఇనచంద్రులక్షులు ♦ హృత్సీమవిశ్వంబు, తగసర్వదేవత♦ల్తనువునందు
సరసిజభవుఁడాత్మ♦కరపద్మములు రత్న,హాటకగిరులౌ ము♦ఖాంబుజములు
మహనీయములగునా♦మ్నాయసమూహముల్, భుజపఙ్క్తి నాచతు♦ర్భుజుఁడు శౌరి
భూర్భువస్స్వర్ముఖ్య♦భువనపరంపరా,జనుహేతుశక్తి కే♦శములు నిట్లు
గీ. విశ్వకర్మవలననె యీ♦విశ్వమొదవె, విశ్వకర్మయె తద్విరా♦డ్విగ్రహంబు
విశ్వకర్మయె వేదాంత♦వేద్యమూర్తి, విశ్వకర్మసమానుండు ♦ వేల్పుఁగలఁడె. 324

నాగరఖండము, ఆ 2 ప 35.

## పర్వతునియోగివేషము

సీ. గట్టిగా సవరించి ♦ చుట్టికట్టినయట్టి, పులితోలుడాపంకఁ ♦ బొదివిపట్టి
కుదురుగా ముదుసజే♦గురుకావివల్వమొ,త్తలమూట వలచంకఁ ♦ దాళిఁ జేసి
పోకపొత్తులపొత్తుఁ ♦ బొదలిన పుస్తక,బండారమదినెత్తి ♦ పైని బెట్టి
సళువులేకొక్కమం♦డలముపాళెపుబ్రహ్మ,నాళంపుబుర్రపైఁ ♦ బాళిఁ బట్టి
గీ. బడుగునడకల నుపచార♦బట్టొకండు, వెంటఁజనుదేర హరిభక్తి♦వివశుఁ డగుచు
గట్టుతెగి శాంతిరసమెల్ల ♦ నుట్టిపడఁగ, నేఁగె నందందఁ బర్వత♦యోగివరుఁడు.

వేంకటేశ్వరవిలాసము, ఆ 2 ప 34.

# కాముఁడు

సీ. రతిదేవి నెవ్వగు ◆ రారాపుఁ జన్నులు, గడకన్నులకు నింపు ◆ గడలుకొలుప
గుడు సైన పూవింటఁ◆గూడి కమ్మనితూపు, కటకాముఖపుఁ గేలఁ◆గరము మెఱయఁ
గటిమండలంబుపైఁ ◆ గనకంపుఁ జెఱఁగుల, జిలుఁగుఁబచ్చని పట్టుఁ◆జేల మమర
వాలీఢ పాద వి◆న్యాసంబు శృంగార, వీరాద్భుతములకు ◆ విందు సేయఁ
గీ. జిన్నిచిలుకరాచుఁ జేరోఁకాలఁ ◆ జేతఁబట్టి, పేరుఁబూమని రాచిల్క◆తేరు నడుప
నుక్కడీఁడయియేతెంచె◆నుక్కు మిగిలి, కలికి గారాబుఁజెలి కాఁడు◆కలికిమరుఁడు.

ఉ. చీకటితప్పఁ బరుల◆చేడియలన్ రమియింప దూతికా
లోకము మాట తీపులకు ◆ లోఁబడి భీత్యభిమాన లజ్జలన్
బోకడఁ బెట్టి ప్రాణ మొక ◆ పోఁకకుఁ గైకొన కుండు సాహసుల్
పైకొని చేర తన్నుభయ◆పార్శ్వములందును భక్తిఁ గొల్చి రాన్. 327

గీ. బుద్ధ దేవ పరిస్పర్ధఁ◆బోలెఁ దాల్చె, లోకజిద్భావ మెవ్వాఁడు ◆ లోక మెఱుఁగ
నీశ్వరునిమీఁదఁ దగిలిన ◆ యీర్ష్యఁబోలె, నతనుఁడై యేలె నెవ్వఁడీ◆యఖిలజగము.

శృంగారనైషధము, అ 7 పద్య 41-43.

# క్రోధుఁడు

సీ. కట్టెఱ్ఱసెరల దీ◆ర్ఘవిలోచనంబుల, కడల నగ్నిస్ఫులిం◆గంబు లురుల
జృంభించి మిగులంగఁ ◆ జేవురించినమేనఁ, బ్రస్వేద జలముఁ గం◆పంబుఁ బొడమఁ
గుటిల మై చిమ్మచీ◆కటి సంఘటించుచు, నిటల భాగమున భ్రూ◆కుటి నటింప
నత్యంత గాఢ దం◆తాగ్ర పీడనమునఁ, దొట్టు వాతెఱనెత్తు◆రుట్టిపడఁగఁ
గీ. గటము లదరుగ మీసాలు◆గత్తరిల్లఁ, గంఠ కుహరంబునందు హుం◆కారమెసఁగ
నింగి నేలయుఁ దాటింప ◆ నంగలించు, పగిది నేతెంచెఁ గ్రోధంబు ◆ గగన వీథి.

శృంగారనైషధము, ఆ 7 పద్య 46-50.

స్రగ్ధ. ఆక్రోశాక్రోశ ఘోషం◆బయి వికటకఠో◆రాట్టహాసార్భటంబై
వక్ర భ్రూవల్లరీ సం ◆ వలన భయద మై ◆ స్ఫార నిశ్వాస ధారా
చక్రం బై రక్త రూక్షే◆క్షణ మయి విగత ◆ క్షాంతి యై నిర్దయం బై
యాక్రోధం బభ్రవీథిన్ ◆ హతగతి నమృతా◆హారులన్ ధిక్కరించెన్. 330

గీ. పాముసరుల బలి పెట్టని ♦ ప్రతినవారు, ఈఁగ కెన్నఁడు నే నిలి ♦ యిడనివారు
ఘనము గాఁ బున్నదయ్యాలఁ ♦ దఱుమువారు, బలసి శోభంబు నిరుపంకఁ గొలుచువారు.

మ. కమియం బాపము లొండు రెండు వరుసన్ ♦ గల్పింపఁగాఁ జాలు కా
మముఁ గ్రోధంబును నిచ్చ మెచ్చక యహం♦కారంబుతో నుండుఁ బం
చమహాపాతక సంగ్రహైక ఘటనా♦చాతుర్య ధుర్యంబు లో
భము లోభంబు గదా గుణద్విరద రా♦ట్పంచాస్య మూహింపఁగన్. 338

సీ. ఇన్ని యింద్రియములు ♦ నెవ్వానికి గ్రహంబు, లయి విశేషంబు జి♦హ్వాంచలంబు
సంప్రార్థనా దీన♦చాటూక్తి యెవ్వాని, కాజన్మ సంసిద్ధ♦మైన మతము
పాత్ర హస్తములపైఁ ♦ బడు దాన జలవృష్టి, వారించు నెవ్వాఁ డ♦వగ్రహమయి
అన్య విత్తాపేక్ష ♦ యాత్మ విత్తాపరి,త్యాగ మెవ్వని యంత♦రంగగుణము
గీ. జార చోరాది ధూర్త వి♦హార భూమి, దైన్య కార్పణ్య జలరాశి♦ధవళకరుఁడు
కలిమహారాజు నెచ్చెలి♦కాఁడు లోభుఁ, డతఁడు సురలకు జ్జోహారు♦వనుచు మ్రొక్కు.

శృంగారనైషధము, ఆ 7 పద్య 52–55.

## కలిరాజు

ఆ. గగనమండలమునఁ ♦ గాలాయసపు దేర, మాలకాకిపడగ ♦ మూలియాఁడ
ద్వాపరంబు వాసుఁ ♦ దన్మధ్యవర్తియై, వచ్చువాని నీల♦వర్ణదేహు. 340

సీ. కఱకుటై పెరిఁగిన ♦ కుఱుచెండ్రుకలతోడఁ, బట్టియాఁదలఁ గావి♦పాగ యమర
నిగిడిపూరెట్టి బా♦గుగ గత్తిరించిన, గడ్డంబు కొనలొమ్ము ♦ గమ్మలింప
బండికండెనతోడఁ ♦ బ్రతివచ్చుమైచాయ, నీలిపచ్చడముతో ♦ మేలవింప
నవరక్తచందన♦ద్రవకల్పితంబైన, నూత్నత్రిపుండ్రంబు ♦ నొసల నొప్పఁ
గీ. గోఱమీసలు మిడిగ్రుడ్లు ♦ కుఱుచపాదవుఁ డొప్పచెవులును గొగ్గి♦పండ్లును గలిగి
యున్న మద్గ్రీవుఁడై వచ్చు♦చున్నవానిఁ, గలిమహారాజుఁ గనిరి ది♦క్పాలవరులు.

చ. పొలుపగు జంబుకాశ్వములఁ ♦ బూన్చిన కాకపతాకనిల్వ వి
ట్టులమగు నెల్లుతోలు పయి♦డంబుగఁ గట్టి మహోష్ట్రశల్యక
ల్పలలితచక్రముల్ నిలిపి ♦ సారథిసన్నిక బల్ రథంబుపైఁ
గలివిభుఁ డేఁగుదెంచెఁ గనఁ♦గా నొక దుర్జనమంత్రియుక్తుఁడై. 342

మహాలక్ష్మీపరిణయము, ఆ 2 పే 50.

# కలిరాజభటులు

సీ. పాతకంబులు నీలి♦పట్టుబొందడములు, పగలింటి నిద్రలు ♦ పచ్చడములు
పర దూషణంబులు ♦ ప్రాలంబహారంబు, లన్యకాంతా సక్తి ♦ యంగరాగ
మీర్ష్యాపరత్వంబు ♦ హేలా వతంసంబు, బుధ జన ద్వేషంబు ♦ పువ్వుదండ
మిథ్యా ప్రలాపంబు ♦ మృగనాభితిలకంబు, బహులాశనత్వంబు ♦ పరికరంబు
గీ. పరులఁ జూపులు వాకొల్పఁ ♦ బ్రసభలీల,రాసభాంగ రుహధూ♦మ్రప్రకార
బర్బరాకార దేహు లం♦బరము నిండి, సరస వచ్చిరి కలిరాజు ♦ సైన్యభటులు.
సీ. ఖండబొజ్జలక్రిందఁ ♦ దిండుగా బిగియించి, గడితంపుమడుఁగులు ♦ గట్టినారు
బూజుపట్టినదేహ♦ములపైఁ దళంబుగా, మలయజపంకంబు ♦ లలఁదినారు
నునుబట్టతలలపైఁ ♦ గనకంపుజెఱఁగులఁ, బట్టుచీరెలు మాయఁ ♦ జుట్టినారు
కరముఁ బ్రేలుడు లైన ♦ కర్ణపాశంబులఁ, దోరంపుఁబోఁగులు ♦ దొడిగినారు
గీ. తెలుపు మృగనాభినీర్బొట్టు ♦ పెట్టినారు, పసిఁడిబెత్తాలు సేతులఁ ♦ బట్టినారు
చండముద్రాఘనులు నభో♦మండలంబుఁ, బూరటిల్లంగఁ గలిరాజుఁ ♦ బొగడినారు.

శృంగారనైషధము, ఆ 7 ప 61-62.

# కర్కోటకుఁడు

ఉ. కోటి భుజంగపుంగవులు ♦ గొల్వఁగ వందిజనంబు ముందటం
జాటువు లుగ్గడింప ఫణ♦సంభృత రత్న దిశా విభాసియై
వీటిజనంబు లెల్లఁ దను♦విస్మయ మొంది కనుంగొనంగఁ గ
ర్కోటకుఁ డేఁగుదెంచె మద♦ఘూర్ణిత పాటల నేత్ర పద్ముఁడై. 345

శృంగారనైషధము, ఆ 4 పద్య 126.

# వాసుకి

మ. ప్రమథాధీశ భుజాంతర స్థల ఘన ♦ ప్రాలంబహారం బద
భ్రమనోజ్ఞాకృతి వచ్చె వాసుకి ఫణా♦పర్యంత మాణిక్య మం
జు మయూఖాంబర పుంజ మంజుల నభ♦స్కుండై భుజంగాంగనా
సముదాయం బిరువంకఁ బాడఁగ యశ♦స్సంగీతగాథావళుల్. 346

శృంగారనైషధము, ఆ [illegible] పద్య 127

ఉ. కోటులకొద్ది పన్నగులు ♦ కొల్వ రసాస్థలినుండి కుండలీ
పాటలగంధు లెల్ల మురి♦పంపునడంకల నేఁగుదేరఁగా
మేటిఫణాసహస్రమణి ♦ మేదురకాంతులు నిండఁగా నిరా
ఘాటత వచ్చె వాసుకి జ♦గత్ప్రభుపీఠికి మ్రొక్కువాటికిన్. 347

మహాలక్ష్మీపరిణయము, ఆ 4 పే 112.

# తక్షకుఁడు

సీ. ఆరసాతలమునం ♦ దత్యంత రమ్యంబు, మణిదీపకోటి స♦మన్వితంబు
భర్గమిత్రమహేంద్ర♦భవనసంకాశంబు, ఫణిఫణారత్న వి♦భ్రాజితంబు
వజ్రముక్తాఫల ♦ వైడూర్యరాజిత, ప్రాసాదసాహస్ర ♦ భాసురంబు
తపనీయతోరణ♦ద్వారకవాటంబు, చంద్రకాంతోపల♦స్థలయుతంబు
గీ. మంజులంబైన యొక దివ్య♦మందిరమున, నంచితంబైన రత్నసిం♦హాసనమునఁ
బన్నగేంద్రులుగొల్వఁగా♦బ్రసన్నఘనుని, దక్షకునిఁగాంచెఁజంద్రాంగ♦దప్రభుండు.

బ్రహ్మోత్తరఖండము, ఆ 3.

# ఆదిశేషుఁడు

సీ. తనమహోపవనిరం♦తరసమ్యగాసక్తి, కుండలీంద్రత్వంబు ♦ కుదుఱుపఱుపఁ
దనశ్రీనహాన సము♦ద్భాసితోత్సాహంబు, చక్రిభావమున కౌ♦జ్జ్వల్య మొసఁగఁ
దనభోగినీభోగ♦జనితానుభావలీల భుజంగపుంగవో♦ల్లాస మెసఁగఁ
దనమహాబలసము♦ద్యద్విగ్రహ ప్రవృద్ధి యహీనభావంబుఁ ♦ దేటపఱుప
సోమరుచియు ననంతవి♦స్ఫూర్తి భోగి, ముఖ్యతయు భూమిభరణస♦ముత్సుకత్వ
మలరఁ జెలువొందు నెప్డు డు♦దారఫణితి, నట్టి శేషాహి వచ్చె న♦య్యవసరమున.

దశావతారచరిత్రము, అ 2.

చ. సలలితకుందచందన ని♦శాకరహారపటీర హీరకా
మలఘనసారహారరుచి♦మండితమై నిజభోగమొప్పఁగా
వెలికి సహస్రజిహ్వికల ♦ వేదశిఖోరువచోవిశేషముల్
పలుకుచుఁ బద్మలోచనుని ♦ పజ్జ ననంతుఁడు పొల్చు వేడుకన్ 350

మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 24.

## శేషశయ్య

సీ. సాంద్రశరచ్చంద్ర ♦ చంద్రికాకర్పూర, నీహారహారాభ♦దేహ మమర
నిందిందిరేందీవ♦రేంద్రనీలద్యుతిఁ, గరమొప్పు మేచక ♦ కంఠసమితి
యరుణాంశుబింబభా♦సురపద్మరాగ వి,న్యస్తసహస్ర ♦ మస్తకంబు
విస్తృతాననోద్గత ♦ విషధూమరేఖల, లీలఁ జూపట్టిన ♦ నాలుకలును
గీ. గలితసాయంతనజ్వాల♦జ్వలనకుండ,ముల విడంబించు వేఁడిచూ♦పులను గలిగి
భూరికలధౌత గిరినిభా♦కార మమరఁ, బరఁగు భోగీంద్రభోగత♦ల్పంబునందు. 351

భాగవతము, స్కం 10 ఉత్తర పద్య 1307.

## కబంధుఁడు

చ. ఉరమునయందుఁ గన్నులుఁ బృ♦థూదరదేశమునందు నోరు ప్ర
స్ఫురితభుజద్వయంబుఁ గుల♦భూమిధరోన్నత భావముం గరం
బరుదుగ నగ్ర మై యవికృ♦తాకృతితోడ నశేషసత్త్వఘ
స్మరుఁ డగుచున్నవానిఁ బటు♦సత్త్వుఁ గబంధునిఁ గాంచి రచ్చటన్. 352

భారతము, ఆర. అ 6 పద్య 357.

## వృషభేంద్రుఁడు

సీ. ఖురపుటాహతి రేఁగు ♦ ధరణీపరాగంబు, పంకేరుహాప్త బిం♦బంబుఁ బొదువ
విపులవాలాటోప ♦ విక్షేపజాతవా,తాహతి వారివా♦హములు విరియఁ
గుఱుచతిన్నని వాఁడి♦కొమ్ములఁ జిమ్మిన, బ్రహ్మాండభాండక♦ర్పరము వగుల
నలవోకవలె ఖణి♦ల్లని ఱంకె వైచిన, రోదసీకుహరంబు ♦ భేదిలంగ
గీ. గళచలద్బ్రహ్మఘంటికా♦గణఘణప్ర,ఘోషమున దిక్తటంబు లా♦కులత నొందఁ
లీల నడతెంచు కలధౌత♦శైలమనఁగ, నుక్కుమిగిలిన వృషభేంద్రు♦ఁడెక్కి వెడలె.

భాగవతము, స్కం 10 ఉత్తర పద్య 402.

సీ. కుఱుచలై మెలవంక ♦ గుబ్బికొమ్ములరెంటి, తుదలయందును పైఁడి♦తొడవులమర
ఱంకెవేసిననూగి ♦ యోంకారవములు వల్కు, గంటలపేరుల ♦ గళము మెఱయఁ
జటురత్నమయమైన ♦ బంగారుపల్లంబు,పైని జెబ్బులితోలు♦భాసిలంగఁ
ఫాలలోచనునాజ్ఞఁ బరువడి చనుదేర, నందియన్ ఘల్లుఘు♦ల్లనుచు మ్రోయ

గీ. నాత్మపురకీర్తులను రాజ♦హారహీగ, కలశపాథోధిరాణ్మల్లి♦కలను గెలువ
నుబ్బుచునువచ్చి శివుప్రోల♦నొసరనిల్చె, రూఢిమెఱయఁగ ధర్మస్వ♦రూపుఁడపుడు.
ఒడయనంబివిలాసము, ఆ 1.

సీ. ముకురువేల్పులకాని♦మూలమై చెన్నొందు, పరశివతత్త్వసా♦మ్రాజ్య మనఁగఁ
త్రిభువనసంచార♦దీప్తమై వెలుఁగొందు, చంద్రమండలసుధా♦సార మనఁగఁ
వటపత్త్రశాయియై ♦ నటియించు శ్రీవిష్ణు,రమణీయక్షీరవా♦రాశి యనఁగ
సాంబశివుండు న♦త్సాహంబుతో నున్న, గొప్పైన కైలాస♦భూధర మనఁగ
గీ. ధవళకళకళదశదిశ ♦ దళితముగను, మంజుముక్తనికుంజముల్ ♦ రంజితముగ
ఘనఘనాక్రాంతమూపురా♦గ్రంబు గదురఁ, గేరుచును వచ్చె నా నంది♦కేశ్వరుండు.

సీ. మోముపట్టాంచిత♦ముక్త ఝల్లరులతో, నసియాడశృంగముల్ ♦ విసరుచుండు
విసరుకొన్నంతలో ♦ వీఁక నొండొంటితోఁ,దాఁకి ఘంటాధ్వాన♦తతులు చెలఁగు
చెలఁగి అంకెలువేయఁ ♦ గలఁగి సింహంబులు, పర్వతగుహలకు ♦ బాఱఁజూచుఁ
బాఱఁజూచి త్రిలోక♦భయదంబుగాఁదోఁచుఁ,దోఁచినృత్యము సేయఁ♦దొణఁగుచుండుఁ
గీ. దొణగి యాసాంబమూర్తిని ♦ దువ్వఁ బిలుచుఁ,బిలిచి రేమోయటంచను♦బెదరిమఱలు
మఱలి దనయంగములతీట♦మాన్ప నెమరు, నెమరు వేయుచు బసవన్న♦నిండుసభను.
బృందావనవిహారము.

## ఋషిశ్రేష్ఠులు

సీ. వ్యాసభరద్వాజ ♦ వాల్మీకి గౌతమ, కాశ్యప జాబాలి ♦ కణ్వ పులహ
యాజ్ఞవల్క్యాత్రి రై♦భ్యాంగిరో భృగు పరా,శరధూమ్రి గాలవ ♦ శంఖలిఖిత
హారీతసంవర్తక ♦ హయశిర శౌనక, భదరి కక్షీవద్వి♦భాండకోగ్ర
బక దాల్భ్య కౌశికా♦పస్తంబ మాండవ్య, మంకణ రోమశ ♦ మందపాల
గీ. కథకలాప రోహిత కాము♦కాయనాది, మునులు చిరతపోనిర్మల♦మూర్తు లాఢ్యుఁ
లరుగుదెంచి కాంచిరి పర♦మాత్ము నభవు, నాదిదేవు నచ్యుతుఁ గృష్ణు♦నధికభక్తి.
హరివంశము, ఉత్తర ఆ 5.

సీ. మౌద్గల్య మాతంగ ♦ శాలంకాయన మరీచి, మైత్రేయ మాండవ్య ♦ మందపాల
కపిల కశ్యప కాత్స ♦ కామందక కణ్వాత్రి, కౌశిక కౌండిన్య ♦ కలహభోజ

కాత్యాయన వ్యాస ♦ వాల్మీకి వరతంతు, వాలఖిల్య వసిష్ఠ ♦ వామదేవ
శరభంగ శుక శక్తి ♦ శార్ఙ్గ శారద్వత, శౌనక శాండిల్య ♦ శాలిహోత్ర
గీ. జడభరత జహ్ను జాబాలి ♦ జామదగ్న్య, పులహ పిప్పల పర్వత ♦ పుండరీక
గార్గ్య గౌతమ గాలవ ♦ గణక ముఖ్యులైన యాసంయమీశ్వరు ♦ లర్థిఁ గొలువ.

విక్రమార్కచరిత్రము, ఆ 2 ప 25.

సీ. శాండిల్య మౌద్గల్య ♦ మాండవ్య కశ్యప, వ్యాసాత్రి కౌండిన్య ♦ వాలఖిల్య
హారీత పిప్పల రైభ్య ♦ వరతంతు గాలవ, బక దాల్భ్య గౌతమ ♦ శుక వసిష్ఠ
కౌశిక చ్యవన మా♦ర్కండేయ నారద, జమదగ్ని భృగు పరా♦శర శలాక
కణ్వ జాబాలి సాం♦ఖ్యాయన వాల్మీకి, కపిల భరద్వాజ ♦ కలశజన్మ
గీ. శృంగి తృణబిందు భరత మ♦తంగ శక్తి, గర్గ శ్రీవత్స మునివరుల్ ♦ ఘనత మెఱయ
వర సభాసీనులై విను♦వారలపుడు, విమలవాగ్భంగిఁ గర్ణామృ♦తములుగాఁగ. 359

రుక్మాంగదచరిత్రము, ఆ 1 పద్య 51.

## సప్తర్షులు.

గీ. కశ్య పాత్రి విశ్వామిత్ర ♦ గౌతములును, విను భరద్వాజ జమదగ్ను♦లును వసిష్ఠుఁ
డును జగంబుల నెల్లఁ జే♦ర్కొనిన ఋషులు, వారి సప్తర్షి గణ మండ్రు ♦ కౌరవేంద్ర.

భారతము, ఆ 2 పద్య 208.

## వేదవ్యాసుఁడు

శా. వేదజ్ఞుండు త్రిలోకవేది ధృత సం♦విత్సం ప్రమోదుండు ని
ర్భేదుం డప్రతిమప్రభావుఁడు తపో♦విద్యానవద్యాత్మకృ
త్యోద్దీప్తుం డవికీర్ణధర్ముఁడు సదు♦ద్యుక్తుండు యుక్తుండు శ్రీ
వేదవ్యాసమునీశ్వరుండు గరుణన్ ♦ వీక్షించె నచ్చోటికిన్. 361

హరివంశము, ఉత్తర ఆ 9.

సీ. ప్రావృట్పయోధర♦పటలంబు కైవడి, మెఱుఁగారు నల్లని ♦ మేనివాఁడు
చండదీధితికర♦సాదృశ్యమగు చలజ్జాంబునదాగ్ర్యదం♦డంబువాఁడు
చిగురాకుజొంపంబు♦ చెలువునఁ గనుపట్టు పాటలపటుజటా ♦ పటలివాఁడు
కటుకీయమానచీ♦కటుల నుల్లంఘించు, నవ్యకృష్ణమృగాజి♦నంబువాఁడు

గీ. భవ్యపదవర్ణసత్క్రియా♦ప్రౌఢి మెఱయ, ఋగ్యజుస్సామవేదముల్ ♦ పూర్తిఁ జదువు
శిష్యజనములు దాను వేఁ♦జేసె బాదరాయణమునీంద్రుఁ డా బ్రహ్మ♦రాతికడను.
యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 1.

## వాల్మీకి

సీ. తరుణాబ్జబంధుబిం♦బరుచిరాంశుల నీను, లలితజటాపటు♦లము బిగించి
శరదిందుకౌముదీ♦స్ఫురితకృష్ణాజినం,బును జగమాంగంబు♦నను ధరించి
యుదయాతపచ్ఛాయ♦నొంది పెంపలరారు, చతురత కటిశాటి ♦ సంఘటించి
నీలాంబుదప్రభా♦జాలమై తళ్కొత్తు, సలలితంబగు కమం♦డలముఁ బూని
గీ. కలుషసమదయదందశూ♦కముల పెంపు, ఖండన మొనర్చు దండమ♦ఖండలీలఁ
గొని పురారికి సాదృశ్య♦మున నటించు నలువయనఁ జోలు నమ్ముని♦నాయకుండు.
నిర్వచ॰విచిత్రరామాయణము, ఆ 2.

## విశ్వామిత్రుఁడు

సీ. పంచాక్షరీమంత్ర ♦ పరమోపనిషదర్థ, వాసనాసురభి యే♦వాని బుద్ధి
శ్రుతిపారపూతవా♦క్పతిముఖస్తుతులచే, వఱలె నెవ్వాఁడు నవ♦స్వర్గసృష్టి
బాహుజుండయ్యుఁ ద♦పశ్శక్తి నెవ్వాఁడు, బ్రహ్మర్షియై యెక్కె ♦ బ్రహ్మరథముఁ
బందెమోడిదివంబు ♦ పంచి యిప్పించె నిశ్శంక నెవ్వాఁడు హరి♦శ్చంద్రునకును
గీ. నమ్మహాత్ముండు సకలలో♦కైకవినుతుఁ, డౌర్వశేయునితోడి మం♦త్రాటకాఁడు
నిష్ఠతోడుత నాశ్చర్య ♦ నియమవృత్తిఁ, దపమునకు నుండె నంబికా♦ధవునిఁ గూర్చి.
శకుంతలాపరిణయము, ఆ 2.

సీ. కరుణారసము వెలి ♦ కుఱికెనో యన మౌళిఁ, బల్లవస్ఫుటజటా♦పటల మమర
జాబిల్లి పూఁదేనె ♦ జాఱెనో యన మేన, నతనుభూతిప్రభా ♦ వితతి మెఱయ
రహిఁ గంటిలో వహ్ని ♦ రాఁజుచున్నది యన, నొసల మేలిమిబొట్టు♦పసలు మసలఁ
దొలఁకిన గాంగబిం♦దుపరంపరో యన, నఱుతను స్ఫటికహా♦రాళి బెళుకఁ
గీ. గలికి వన్నియపులితోలు ♦ కటిని గట్టి, యీశ్వరుఁడువోలె గాధేయుఁ ♦ డేఁగుదేర
నెదురుగా నేఁగి భయభక్తు ♦ లెసఁగ నృపతి, యర్ఘ్యదండప్రణామంబు♦లాచరించె.
షట్చక్రవర్తిచరిత్ర, ఆ 2 పద్య 21.

సీ. తపము పెంపునఁ దోఁచు ♦ దహనకీలములతో, జటిలంబులగు పల్లఁ♦జడలవాని
భసితాంగరాగసం♦పదల సొంపదలింపఁ, దగు వలీవలితగా♦త్రంబువాని
మైఁబుట్టు పుట్టకో♦మఁ జీమలెగఁబ్రాఁకి, మార్పనేర్పడని లో♦మములవాని
వ్యాఘ్రాజినోత్తరీ♦యము మేనిచాయగా, బలుమొగంబులఁ దోఁ♦ప బఱచువానిఁ
గీ. కందమూలాదికాశన♦ కాయశోష, ణోద్యదస్థ్యంగసంతత ♦ యోగభాగ
పావనబ్రహ్మఋషిభావ♦భావనాప్రతీతదీక్షావిధేయు గా♦ధేయుఁ గాంచె. 366

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 2 ప 109.

సీ. రవిధారుణీస్థలి♦రాఁ గారణంబేమి, యని లోకు లాశ్చర్య ♦ మందుచుండ
ననలుండు నరరూప♦మును దాల్చివచ్చిన, భంగి యేమని ద్వార♦పాలు రరయ
ముక్కంటి నరరూప♦మును దాల్చివచ్చిన, హేతు వేమని పౌరు♦లెల్లఁ జూడ
నలువ నా మూఁడుమో♦ములు వీడివచ్చిన, పని యేమియని రాజ♦భటులు జూడ
గీ. దళితరవిదీప్తితో శుచి♦త్వంబుతో జటాపటలితోఁ బ్రభావదా♦ర్ఢ్యంబుతోడ
వచ్చె సాకేతపట్టణ ♦ వరవరిష్ఠ, రాజవీథిని యల గాధి ♦ రాజసుతుఁడు. 367

సరసభూపాలరాజీయము, బాల. ఆ 1.

శా. విశ్వామిత్రుఁ డమిత్రభీకరభుజా♦వీర్యం బవార్యంబుగా
విశ్వం బేలి వసిష్ఠమౌనిపతితో ♦ విద్వేషియై యంతటన్
శశ్వద్బ్రహ్మఋషిత్వముం గనియె సా♦క్షాద్బ్రహ్మదేవాగ్రణీ
విశ్వేశాదులు దన్నుతింపఁగ జగ♦ద్విఖ్యాతశీలంబునన్.
సీ. ధరణి యేకాతప♦త్రంబుగాఁ బాలించె, బ్రహ్మఋషిత్వగ ♦ పదవిఁ గాంచె
మేనకాధరసుధా♦పానంబునకుఁ జొక్కె, రంభను దిట్టె జ♦ట్రాయిగాఁగ
నలుకశక్త్యాదిపు♦త్త్రుల మన్నిఁగొనిపించెఁ, ఋషివగుద్విజపుత్రు ♦ బ్రతుకఁజేసె
గురుశాపహతుఁ ద్రిశం♦కుని దివంబున నిల్పెఁ, బీడించెఁ దత్పుత్రుఁ♦ బెక్కుగతుల
గీ. వేదమాతను గాయత్రి ♦ వెలయఁజేసె, వివిధశస్త్రాస్త్రములు లెఱింగె ♦ విశదముగను
వినవిచిత్రము గాధిపు♦త్త్రుని చరిత్ర, మనఘగుణగణ్య దశరథ♦జనవరేణ్య. 369

దశావతారచరిత్ర, ఆ 7.

## వసిష్ఠుఁడు

చ. కవియె శ్రుతిస్మృతిప్రకర♦గాఢతరార్థవరిష్ఠదివ్యబో
ధనపదవీమహత్త్వసము♦దగ్రగరిష్ఠుఁ దపోవిశేషసం

జనితనితాంతపుణ్యగణ ♦ సంచయసువ్రతనిష్ఠు శేముషీ
జనితహితప్రభావముని ♦ సంఘవరిష్ఠు వసిష్ఠు నగ్ర్యుడన్. 370

చ. పరమవివేకసాగరుఁడు ♦ పంకజసంభవసన్నిభుండు భూ
సురహితవహ్నితుల్యుఁ డన♦మానతపోనిధి నిష్ఠభక్తిత
త్పరుఁ డఘసంఘదూరుఁడు కృ♦పారసచిత్తుఁడు దివ్యబోధసు
స్థిరుఁ డగు నవ్వసిష్ఠుఁ డరు♦దెంచె దిలీపనృపాలుపాలికిన్. 371

పద్మపురాణము, ఆ 4, ప 188.

సీ. మానసాబ్జవిరాజ♦మానపన్నగహారుఁ, బల్లవోపమజటా♦పటలధారు
భూతిత్రిపుండ్రవి♦స్ఫురితకోమలఫాలు, వక్షోసదృతరుద్రా♦క్షజాలుఁ
బుండరీకాజిన♦ఖండరమ్యకిరీటు, శతదళభానుభా♦స్వచ్ఛనీరు
లాలితస్ఫటికాక్ష♦మాలికాంచితహస్తు, భాసురస్వస్తిప♦ద్మాసనస్థు
గీ. యోగగతినిష్ఠు విపులత♦పోగరిష్ఠుఁ, దాపసశ్రేష్ఠు నిఖిలవి♦ద్యాపటిష్ఠు
సూనృతశ్రేష్ఠు ఋష్యులక♦చోవరిష్ఠు, నావసిష్ఠుని వీక్షించె ♦ నవనివిభుఁడు. 372

షట్చక్రవర్తిచరిత్ర, ఆ 2 పద్య 123.

సీ. ఉదయించురవిమెఱుంపు ♦ నదలించుజిగినొంపు, జడలతో బలితంపు♦టొడలితోడ
సరసీజములగేరు ♦ కరసీమఁ జెలఁగుదం,డంబును నూర్ధ్వపుం♦డ్రంబుతోడఁ
బంగారు గడితంపు ♦ రంగారురత్నకుం,డలముతో ఘనకమం♦డలముతోడఁ
దెలిజందెములఁగూడి ♦ కలజెందునకుమా,లికలతో దివ్యము♦ద్రికలతోడ
గీ. భూతితోడను మిగులసం♦ప్రీతితోడ, డంబుమీఱిన కృష్ణాజి♦నంబుతోడ
మౌనిపుంగవు లిరువంక ♦ మసలి గొలువఁ, జెలఁగి నిష్ఠాగరిష్ఠు వ♦సిష్ఠుఁ డొప్పె. 373

కవిచకోరచంద్రోదయము, ఆ 4.

## దూర్వాసుఁడు

సీ. అనుభావశక్తిబ్ర♦హ్మాదుల నొకపూరి,పుడకకుఁ గైకోని ♦ పోతరీఁడు
ఘనకోపవాశిష్య♦మునఁ దపోవిత్తజా,లముఁ గూడఁబెట్టెడు ♦ లాబగాఁడు
తనరథంబునకు మా♦ధవసత్యభామల, గుఱ్ఱాలఁ జేసిన ♦ కోడిగీఁడు
యతిసతీకులరత్న ♦ మనసూయకడుపున, మునుమునఁ బుట్టిన ♦ ముద్దులాఁడు

గీ. సకలకల్యాణకరుఁడు సా♦క్షాద్దశాంగ, హారుఁడు నిర్మలశక్తిప్రకటి♦ గ్యానిరూఢ
ణావిలాసుఁడు దూర్వాసుఁ♦డావసుంధ,రాధిపతికి నగంబు నీ♦కుగుదెంచె. 371

వరాహపురాణము, సం. మం. ఆ 2 ప 180.

సీ. నిండుకెంజాయ నీ♦రెండ లీనెడు జటా,మకుటబాలార్క బిం♦బంబు వెలుఁగ
భసితలేపనచారు ♦ పాండురాగేందుబిం,బమునఁ గృష్ణాజినాం♦కము ఘటిల్లఁ
బంచాక్షరీమంత్ర ♦ పఠనసంఖ్యావృత్తి, నహితరుద్రాక్షాత♦మాల యమరఁ
గలితపుణ్యోపేత ♦ గంగానదీజలో,జ్జ్వలదివ్యఘటికయుఁ♦దలువు మెఱయఁ
గీ. గన్ను లరుణాంబుజంబుల ♦ గరిమఁ జెలఁగ, దండంబు గనుపట్టు బాహు♦దండంబు దనర
శిష్యగణములు వెనువెంటఁ♦ జేరి కొలువ,నపుడు దూర్వాసుఁ డెదురయ్యె♦ నమరపతికి.

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 3.

క. భూసురగుఁ డత్యుగ్రతపో,భాసురుఁ డభవాంశభవుఁడు ♦ పటురోషిజనా
గ్రేసరుఁ డఖిలజగత్సం,త్రాసుఁడు దూర్వాసుఁ డత్రి♦తనయుఁడు పేర్మిన్ 375

మహాలక్ష్మీపరిణయము, ఆ 2.

## అగస్త్యుఁడు

సీ. పంచాక్షరీమంత్ర♦పారాయణమునకు, నెవ్వానిమానసం♦ బేదుగడయు
దర్పోద్ధతు లగువా♦తాపీల్వలులకును, వధశిలాస్థాన మె♦వ్వానికుక్షి
యాదినెవ్వానిది♦ వ్యావతారమునకుఁ, బూర్ణాంబుకుంభంబు ♦ పుట్టినిల్లు
మెఱసిలోపాముద్ర♦ మెఱుఁగుఁబాలిండ్లపైఁ, బవళించు నెవ్వాని ♦ భవ్యమూర్తి
గీ. కసరి యెవ్వానికంఠహుం♦కారరవము, కొండచిలువలకులములోఁ♦గూర్చె నహుషు
నట్టి పరమమహాతేజు ♦ నలఘుతేజు, వెదకి రానందవనములో ♦ విబుధమునులు.

కాశీఖండము, ఆ 2 ప 40.

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి♦నిట్టింక లింకించె, గంభీరహుంకార♦గర్జనమునఁ
బ్రణవపంచాక్షరో♦పనిషత్ప్రపంచంబు, లెవ్వాఁడు శివునిచే ♦ నెఱిఁగికొనియె
గడసిల్లుధరయొడ్డ♦గెడవైన నెవ్వాఁడు, త్రాసుపైఁ గల్లైచం♦దమునవంచె
నంబోధు లేడింటు ♦ నాపోశనంబెత్తి, కలిగించె నెవ్వాఁడు ♦ క్రమ్మఱంగ
గీ. భీమనాథేశ్వరుఁడు గౌరిఁ ♦ బెండ్లియాడి, దక్షిణాముఖకల్యాణ♦దర్శనమున
వత్సరము వత్సరంబు నె♦వ్వానిఁజూచు, నతఁడు గగనాగ్రమాణిక్య♦మరుగుదెంచె.

భీమేశ్వరపురాణము, ఆ 2 పద్య 77,

సీ. సరిగా జగత్ప్రియం◆బముతోడ నొకవంకఁ
దూనికవచ్చిన ◆ దొడ్డకపిల
పేరిమ రెట్టింపలో◆పాముద్ర మోముదా
మరతావిఁ గ్రోలుచుఁ ◆ దిరుగుతేఁటి
వానకాలంబుచే ◆ వండువట్టినజలం
బెల్లఁ దేర్పఁగఁజాలు ◆ చిల్లగింజ
పరిపూర్ణకుంభగ◆ర్భంబనుశుక్తిలో
మొనసినకట్టాణి ◆ ముత్తియంబు
గీ. సింధురామాశుగము రోద◆సీకటాహ
సహారపాటనపటుకూటు ◆ కోటికోటి
వింధ్యనగబలిద్విత్యత్రి◆విక్రమాంఘ్రి
ఋషికులాగ్రేసరుఁ డగస్త్యుఁ◆డేఁగుదెంచె. 378

వరాహపురాణము, నం. మ. ఆ 3 ప 89.

# జమదగ్ని

క. జమదగ్ని మునియొసకలా
గమనిగమపురాణశాస్త్ర◆కలనాచణుఁడై
శమదమయమనియమాదిమ
సమధికగుణశాలియగుచు ◆ సన్నుతికెక్కెన్. 379

దశావతారచరిత్ర, ఆ ౯.

# గౌతముఁడు

క. కృతయుగమున గౌతముఁ డను, నతిపావనమూర్తి మునివ◆రాగ్రణి వహ్ని
ప్రతిమానతేజుఁ డిలఁ బ్రతిహతదోషుండు వేద◆పారగుఁ డొప్పున్. 380

పద్మపురాణము, ఉత్త. ఆ 3 ప 3.

# కణ్వుఁడు

సీ. పరమార్థతత్త్వాను◆భవము వక్కాణించు, సమధికబ్రహ్మవ◆ర్చసమువాని
కైవల్యవాంఛాను◆కలనంబు వివరించు, వ్యాఘ్రాజినోత్తరీ◆యంబువాని

వెలిచూడ్కి – లోలక్ష్య♦ మలఁతిబాహిరముగా, మునుకొన్న కుంభకీ♦ముద్రవాని
వేదములే మూర్తిభ♦వించుమేదలపించు, సముచితాధ్యయనఘో♦షంబువాని
గీ. హుతహుతాశనతేజుండై ♦ యొప్పువాని, హరిచరణభక్తిపుంభావ♦మైనవాని
నాశ్రమాభిముఖంబుగా ♦ నరుగుదెంచు, తాతఁ గాశ్యపుఁ బొడగాంచెఁ♦ దలిరుఁబోఁడి.

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 8 ప. 73.

## సూతుఁడు

ఉ. ఆతఁడె నేఁగుదెంచె సక♦లాగమశాస్త్రపురాణసత్కథా
న్వీతుఁడు తత్త్వవిస్ఫురితవి ♦ నిర్జితదుర్జయమానకేతుఁడు
ద్యోతతపోబలప్రణుత ♦ యోగసమేతుఁ డఘాంధకారఖ
ద్యోతుఁ డరివ్రిజాద్రిపురు♦హూతుఁడు సూతుఁడు సద్వినీతుఁడై. ౨౮౨

నాగరఖండము, ఆ 1 ప 73.

క. సూతున్ వివిధకథారథ,సూతున్ నిజకీర్తిహసిత ♦ శుభ్రాంశు సుధా
సూతున్ ధీజితపంకజ, సూతున్ విద్యాసహేతుఁ ♦ జూచికడంకన్. ౨౮౩

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 ప 13.

## వైశంపాయనుఁడు

సీ. గాలవ జాబాలి♦ పైలముఖ్యులకును, నిరుపమాధ్యయనంబు ♦ నేర్పువానిఁ
బంచేంద్రియంబుల♦ ప్రసరము బంధించి, యోగనిద్రావస్థ ♦ నుండువాని
మహితనారాయణ♦ మంత్రసముచ్చారణానురాగంబుల♦ నలరువాని
మొగలివేల్పుచతుర్థ♦మూర్తి నొక్కనిఁ దక్క, నొండుదైవము నొల్ల♦కుండువాని
ఆ. బాదరాయణునకుఁ ♦ బరికింపఁ బ్రియశిష్యుఁడైనవాని భ్రమల ♦ నణఁచువాని
గాంక్షలేనివాని ♦ ఘనుని వైశంపాయనాఖ్యుఁ గని ప్రణామ♦మాచరించి. ౨౮౪

యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 1.

## సనత్కుమారుఁడు

సీ. తరుషండమాలూర ♦ తరువాటికాంతర, సైకతవేదికా♦స్థలులయందు
గంగానదీతటీ♦ కాంతపఘాముల, జిత్రసింహాసనా♦సీనుఁ డగుచు

సముదీర్ణప్రజ్ఞావి♦శాలభాషాపుణ్య, గోష్ఠీవినోదంబు ♦ గొనలుసాఁగ
శివపురాణాగమ ♦ సింధువీచికలలో, లాలితోత్సవలీల ♦ కేళి సలుప

గీ. సకలమునివరశ్రేణికా♦సహితుఁ డగుచుఁ, మహిమ దీపింప వైధాత♦మౌనివరుఁడు
మృదులభావలసంతోష♦హృదయుఁ డగుచు, వివిధవేదాంతసూక్తులు ♦ విస్తరింప

సీ. మైత్రాయణీయంబు ♦ మండూకశుక్లేయ, సౌరసణీయాది ♦ శాఖలందు
వార్తాంతవేయంబు ♦ వైనేయశౌనకీ, శాపాయనీయాది♦శాఖలందు
కాపాలవారాహ♦గార్గ్యాసురాణీయ, జగరకాత్యాయనీ ♦ శాఖలందు
వైదేయముద్గల♦వారాసురాణీయ, శాటీయభాష్కల ♦ శాఖలందు

గీ. తముపశాఖారిసూక్తిప్ర♦దానపరత, బరఁగువేదాంతసూక్తులు♦పన్యసింప
ఖండనాఖండనోద్దండ ♦ గరిమ మెఱసి, వేదభాష్యంబు సెప్పుచు♦విధిసుతుండు.

పర్వతపురాణము, ఆ 1

## వైఖానసఋషి

ఉ. భూతలనాథుఁ డిద్ధపరి♦పూర్ణయశోనిధిఁ గాంచె వృద్ధహా
రీతుని సత్తపోధనప♦రీతుని నూర్ధ్వజలౌఘపూతు వి
ఖ్యాతకులప్రసూతుని స♦గాధకృపారసికాంతరంగసం
స్ఫీతునిఁ జిత్తభూవిపద♦భీతుని సజ్జనతావినీతునిన్. 387

ఆ. ఊఁతకోలకట్టె♦యొడలితో లెమ్మల, నంటి వరము లెల్ల ♦ నంగళములఁ
గానఁబడఁగఁ దొంటి ♦ గతిఁ దప్పి ముదిసినై, వదలి పతితుఁడైన♦వాని విప్రు.

పద్మపురాణము, ఉత్త. ఆ 1 ప 119, 120.

## శాండిల్యమౌని

సీ. స్వకటాక్షువిశ్రమ♦స్థాసన్నరశ్రేణి, యొడఁబోలె వలభూతి ♦ యొడల నొప్పె
హృదయసారసపీఠి ♦ యొడఁబోలె నలినాక్షు, సంభృతికంధరా♦స్థలి నెసంగ
మహితశిష్యోదితా♦మ్నాయాళియొడఁబోలె, నలఘుజటారేఖ ♦ తలఁజెలంగ
వాత్మసంచితాధ్వ♦రావళియొడఁబోలె, సత్త్రాటకస్ఫూర్తి ♦ చతుల లూనె

గీ. ననుచు నెమ్మది నద్భుతం ♦ బడర నఖిల, జనములు నుతింప నపుడెంచె ♦ సమ్మదంబు
నూని సుకలానిధిస్తోము ♦ జానిసుగుణ, మణినికరఖాని శాండిల్య ♦ మౌని యపుడు.

చంద్రికాపరిణయము, ఆ 1 ప 124.

## మనవాళ మహాముని.

సీ. కనకాంచలోల్లస ♦ త్కౌశేయవస్త్రము, లపరిధానసంవ్యాన ♦ సరణిఁ బొంద
రత్నకుండలకాంతి ♦ రమ్యకపోలుఁడై, మణికిరీటాంచిత ♦ మస్తకుఁడయి
తారహారములుర ♦ స్స్థలిఁ గ్రాలుచుండఁగా, మణిసూత్రసన్నద్ధ ♦ మధ్యుఁ డగుచుఁ
బద్మాక్షమాలికా ♦ సద్మహస్తుండయి, పద్మాక్షకలితహృ ♦ త్పద్ముఁ డగుచు
గీ. నామహామనవాళమ ♦ హామునిమణి, కనులఁ గరుణారసంబెల్లఁ ♦ గరము నొలుక
రామరాయమహారాజ ♦ రాజమణికి, స్వప్నమున నంతలోన సా ♦ క్షాత్కరించె. 389

వాసవదత్తాపరిణయము, వ. వీ. యా. ల. పే 19.

## మార్కండేయులు

సీ. తనయశంబునకు నా ♦ ధారమై విలసిల్లు, ధవళయజ్ఞోపవీ ♦ తములతీరు
తనతపోధన్యత్వ ♦ మునకు సార్థక మయ్యె, రవిబింబరుచిశరీ ♦ రప్రభాళి
తనమృత్యుగర్వని ♦ ర్దళనప్రభావంబు, గనిపట్టు పనిన యు ♦ గంబులందుఁ
దనసాంగవేదశా ♦ స్త్రజ్ఞత నెఱిఁగించు, వితతవిద్యార్థివా ♦ గ్విభవములను
గీ. అంగమున భూతిపూర్ణరు ♦ ద్రాక్షదామములు శివధ్యానమాత్మలో ♦ నిలిపి నివురు
గప్పుకొని దనరారెడు ♦ నిప్పు వోలె, నంతు వచ్చె మృకండుని ♦ నందనుండు. 390

నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 1.

## నారదుఁడు

శా. త్రైలోక్యాతిథియై విశృంఖలవిచి ♦ త్రప్రౌఢి నెల్లప్పుడుం
గేళిం గ్రుమ్మరు యోగసిద్ధుఁ డఖిల ♦ క్షేమంకరప్రజ్ఞుఁడున్
మాలన్మూర్తివికాసనిర్జితశర ♦ న్మేఘుం డమోఘార్థవా
గ్జాలుం డబ్జజసూతియైన ముని వే ♦ డ్కన్ వచ్చె నచ్చోటికిన్. 391
సీ. మందారతరుపుష్ప ♦ మంజరీమండిత, మస్తకరై యొప్పు ♦ మహితవీణ
పచరించి త్రిస్థాన ♦ బంధురశ్రుతిభేద, ములతోడ షడ్జంబు ♦ మొదలుగాఁగ

సప్తస్వరంబులు • సారణావధిన భి,వ్యక్తయై మూర్ఛ•లతిశయిల్ల
వాయించి మధురది•వ్యధ్వని మెఱయఁ జి,త్రప్రబంధోజ్జ్వల• తానరచనఁ
గీ. బూర్వభువనరక్షణములా•భోగములుగ, నద్భుతావతారంబు లిం•పారఁ బాడి 392
యఖిలలోకశరణ్యు దే•వాదిదేవు, విష్ణు నలరించె సభ్యులు• వేడ్కఁ బొగడ.

హరివంశము, ఆ ౬.

సీ. యమనీయకాంచన • మౌంజీసమేతమై, జిగిఁ జెల్వుగుమ్మ్రగా•జినముతోడఁ
బరిలిప్తపాండుర•భసితరజోధూళి,తములైన బ్రహ్మసూ•త్రములు వెలయఁ
గరనఖచంద్రికా•కలితమై నిర్మల,స్ఫటికాక్షమాలిక•ప్రజ్వరిల్లఁ
బుణ్యతీర్థోదక • పూర్ణమై దీప్తిమం,డలిఁ బొల్చు మణికమం•డలువు వెలుఁగఁ
ఆ. బల్లజడలసొంపు • బాలార్కురుచి నింపుఁ, గడవ రామచంద్రు • కడకు వచ్చె
రమ్యకాంతిజితశ•రన్నీరదుండు వీ,ణావిశారదుండు • నారదుండు. 393

భాస్కరరామాయణము, యుద్ధ. ప 607.

సీ. ప్రబలమైనజటాభ•రంబుపైఁ జుట్టిన, కాషాయవస్త్రప్ర•కాశదనర
వక్షస్స్థలమున శ్రీ•వత్సదర్ప్పవనజాక్షు, మాలికాదీప్తిసా•మగ్రినిగుడఁ
గటిమండలమునసం•గతమైన కృష్ణాజి,నోత్తరీయకము చె•న్నలరుచుండ
నంసస్థలమున నా•రాయణసంకీర్తనము మ్రోయుమహతిగా•నము దలిర్ప
గీ. దండము సకలతీర్థక•మండలువును, లాలితస్ఫాటికంపు జపమాలికయును
హస్తమున మిఱుఁగాఁగల•హర్షియుండు, వచ్చె నారదమునిసమ•వర్తికడకు. 394

రుక్మాంగదచరిత్రము. ఆ 1 ప 156.

సీ. అంతరాంతరముల • నాకాశచరకోటి, మోడ్పుఁజేతులు మస్త•ముల ఘటింపఁ
దనుకాంతి చంద్రికా•ధవళమయ్యును బేర్మి, నాదిత్యదీప్తుల • నతకరింపఁ
జదలేఱు వీచిహ•స్తముల నిర్మలవారి, నంఘ్రులకర్ఘ్యపా•ద్యంబు లొసఁగ
నావహాసంవహా•ద్యనిల ఘట్టనముల, శతతంత్రిమూర్ఛనా•స్వరము లీన
గీ. గహన సంసార ఘోర సా•గరముదాఁటి,పరమయోగీశ్వరుఁడు మోక్ష•పదము వోలె
బహుళతరమైన యాకాశ•పథము దాఁటి, నాకభువనంబు సొత్తెంచె • నారదుండు

శృంగారనైషధము, ఆ 3 పద్య 6.

సీ. శారదచంద్రికా • సారంగరుచితోడ, జడముడి కెంపుచేఁ • జఱచి నవ్వ
శరదంబు గాన్పుత • సౌదామనీలతా, శోభఁ గాంచనకటి • సూత్ర మలర

లలితపూర్ణేందుఖం♦డలకలంకముగతి, మృదుకృష్ణాజినరుచి ♦ మించుఁ జూపఁ
గల్పశాఖాగ్రసం♦గతపుష్పగుచ్ఛంబు, లీలఁ గేలను నక్ష♦మాల యమర
గీ. భూరిపుణ్యనదీతోయ ♦ పూరణమునఁ, దగు కమండలు వొక్క హ♦స్తమునఁ దనర
వెల్లజన్నిదముఱుత శో♦భిల్ల వచ్చె, నారదుండను వివేకవి♦శారదుండు. 398
భాగవతము, స్కం. 10 ప 654.

సీ. స్వర్గాపవర్గముల్ ♦ సనదరించిన బిస, దము గాఁగ సుహృతియం♦సమునఁ దనర
నమితతపోనిధా♦నముఁ గామ భుజగసా, యకమునా యోగప♦ట్టిక యొసంగఁ
దను కాంతి వెదఁదహ ♦ స్తమున వ్రాలిన నిశా, నేతనా స్ఫటికకుం♦డిక చెలంగఁ
గంజవిభ్రాంతిఁ జెం♦గట డాయు తేంట్లు నా, వలకేల నలినాక్ష♦వలయ మమర
గీ. నారదుఁడు గానఁ బెనఁగొన్న ♦ నవ్యచంచ, లాలతలకైవడి జటాక♦లాప మెసఁగ
నపుడు దివినుండి యాత్రిప♦ద్దట్లు వచ్చె, దివిజసంయమి హరిసభా ♦ భవనమునకు.
చంద్రభానుచరిత్రము, ఆ 1 ప 114.

సీ. వాతపోతకసమా♦ధూతపింగళజటా, ఝూటసౌదామనీ♦సముదయంబు
రమణీయతరరమా♦రమణీమణీరమ, ణానుభవాశ్రుప♦యఃకణములు
గతిఘనాద్వల్లకీ♦కాండసంఘటితాభి, రామకోమలకృష్ణ♦నామగర్జ
ఖండనాఖండిత ♦ తాండవోచితచామ, రాంకమిళద్బలా♦కావళియును
గీ. మెండుకొని మింట దుగ్ధాబ్ధి♦దండనుండి, నీరదముపోలెఁ జనుదెంచె ♦ నారదుండు
బహుళతనుకాంతినిర్జిత♦పారదుండు, సకలవేదాంతవిద్యావి♦శారదుండు 340
చమత్కారమంజరి, ఆ 3 ప 4.

సీ. హంసపీఠికయందు ♦ ననువొందువల్లకీ, తంత్రులువల్లికా♦తతులు గాఁగ
సుందరముఖపద్మ♦మందస్మితచ్ఛవి, సొంపారు పువ్వుల ♦ గుంపుగాఁగ
రాజిల్లుతులసీప♦యోజాక్షమాలికల్, ఫలశలాటులతోడి ♦ గెలలుగాఁగ
హరినామసంకీర్త♦నాలాపనినదంబు, శుకశారికాపిక♦స్ఫూర్తిగాఁగ
గీ. భసితలిప్తాంగరుచిసిత♦ప్రభలు నిగుడ, గహ్వరీభాగవిహరణ♦గతివిలాస
జంగమాకారకల్పభూ♦జంబు భాతి, నాకముననుండి వచ్చెను ♦ నారదుండు. 341
అనిరుద్ధచరిత్రము, ఆ 4 ప 7.

సీ. సొగసుగాఁ దనరు ప♦న్నగశాయిగీతంబు, నగశాయిగీతంబు ♦ నగడుపఱుపఁ
గరవిపంచీతంత్రి♦కలరవోల్లాసంబు, కలరవోల్లాసంబు ♦ గారవింప

పొడుగునెమ్మెయిఁ గ్రొమ్మ♦బ్బుసుమంపురుచికదంబ, బసుమంపు ప్రసూనికదంబ ♦ బసులఁ బెనఁగఁ
బదపదంబున నొప్పు ♦ మృదుపరాగమ్ములు, మృదుపరాగమ్ముల ♦ మెలఁగి వెలుఁగ
గీ. ఫాలమున నూర్ధ్వపుండ్రంబు ♦ పరిఢవిల్లఁ, జిత్తము మురారిచింతనా♦యత్తముగను
నిల్వ గాంధర్వసర్వస్వ♦నిధి కళావిశారదుం డచ్చటికి వచ్చె ♦ నారదుండు. 342

అచలాత్మజాపరిణయము, ఆ 1.

సీ. నును వెండి రేకునఁ ♦ దనరారు తగటునా, నొసలఁ ద్రిపుండ్రంబు ♦ మిసిమి తీరఁ
జంద్రబింబస్థలాం♦చనముకై వడి నురస్థలిఁ బద్మబీజంబు ♦ సరులు వెలుఁగ
వజ్రసౌధము మీఁది ♦ స్వర్ణకుంభ మనంగ, దలఁ గెంపుజడచుట్టు ♦ చెలువు నింప
హాటకంఠగతహాలా♦హలకాంతిరీతి నంసంబులఁ గృష్ణాజి♦నంబు మెఱయ
గీ. సగససరిగమపదనిస♦స్వరనికరము, కరముఁ గరమున వీణ ప♦ల్కంగ వచ్చె
సుగ్రసేనజన్యాలోక♦నోరుమైత్రి, గొమరు గాంచె నారదుఁడను ♦ సమరమౌని. 343

రాఘవపాండవయాదవీయము, ఆ 2.

చ. అతులనవాంబుదచ్ఛవిమృ♦గాజినబద్ధవలగ్నుఁడై సము
ద్యతకపిశోరువహాంజియుతుఁ♦డై శశితోఁ దులదూఁగు మేనితో
వితతసువర్ణసూత్రపరి♦వీతవినీలవిశాలచేలుఁడై
చతురత నొప్పు నీరిక్రియ ♦ సంయమి గన్గొన నయ్యె నయ్యెడన్. 344

శిశుపాలవధ, ఆ 1 ప 66.

సీ. కెంపుపెంపు వహించి ♦ సొంపారు జడలు బంధురగైరికాదిధా♦తువులు గాఁగ
మహితాంగుళీధూత ♦ మహతీరుతులు మారు, తధ్మాతకీచక♦ధ్వనులు గాఁగ
మందహాసాంకూర ♦ మంజులాచ్ఛచ్ఛాయ, లభ్రగంగాప్రవా♦హములు గాఁగఁ
గటిభాగవేష్టిత ♦ ఘనమృగాజినరుచుల్, బహువర్ణవిపినసం♦పదలు గాఁగ
గీ. నవనిఁ జరియింపవచ్చె శీ♦తాద్రి యనఁగ, నిజకళాజితశారద ♦ నీరదుండు
సరసవాచావశీకృత♦శారదుండు, నారదుఁడు చనుదెంచె వి♦శారదుండు. 345

నృసింహావిలాసము, ఆ 3.

# సరస్వతి

*ఉ. శారద నీరదేందుఘన♦సారపటీరమరాళమల్లికా
హారతుషారఫేనరజ♦తాచలకాశఫణీశకుందమం
దారసుధాపయోధిసిత♦తామరసామరవాహినీశుభా
కారత నొప్పు నిన్ను మదిఁ ♦ గాననగు నెన్నఁడు గల్గు భారతీ. 346

*ఉ. అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా
చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్తివివిక్తనిజప్రభావ భా
వాంబరవీథివిశ్రుతవిహారిణి నన్ గృపజూడు భారతీ. 347

భాగవతము, స్కం. 1 ప 8, 9.

ఆ. వసూక్తికాకుసూత్రమాణిక్యవల్లకీకలితపాణిఁ బద్మగర్భురాణి
వాక్యరాజకీరవరనీలవేణి కా, కలితయైన వాణి గారవించి. 348

శ్రీరంగమాహాత్మ్యము, ఖై. ఆ 5 ప 1250.

సీ. వివిధబుధవ్యూహమనెడు వేదఘోషంబుచే, నలుమొగంబులకు నే నెమ్మిఁ గూర్పఁబోఁడి
యనవద్యతర్కవేదాంతాదిమూర్తిచేఁ, గనుపట్టు నేదళత్కంజనేత్రి
లాలితనాటకాలంకారశబ్దశాస్త్రాకృతిఁ గాంచు నే యబ్జవదన
సంగీతభరతశాస్త్రవిశేషరీతిచే, భాసిల్లుచుండు నే పల్లవోష్ఠి
గీ. యట్టిభారతి ప్రమలదయావలోక, నయసుధామయవర్షదానంబుచేత
మామకోదారకావ్యనిర్మాణవేళ, సరసచాతుర్యమహిమ యొసంగుఁగాత. 349

సీమంతినీకళ్యాణము, ఆ 1 ప 8.

చ. బలుతెలిపుల్గువాహనము బంగరువీణెయు మిన్కుటందెలున్
జిలుకతుటారిబోఁటియును జిందపువన్నియమేనుబొత్తముం
జెలువపునల్లదమ్మివిరి సింగపుగద్దియుఁ గల్గి యొప్పున
ప్పలుకులచాన జాణలను పల్కులలో నంగెముఁగాత నిచ్చలున్. 350

## లక్ష్మి

మ. హరికిం బట్టపుదేవి పున్నెములప్రోవర్థంపుఁబెన్నిక్క చం
దురుతోఁబుట్టువు భారతీగిరిసుతల్ తోనాడు పూఁబోఁడి తా
మరలం దుండెడుముద్దరాలు జగముల్ మన్నించుకనిల్లాలు భా
సురతన్ లేములు వాపుతల్లి సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్. 351

భాగవతము, స్కం. 1 ప 11.

---

* ఈ రెండుపద్యములు వ్రాతప్రతులందుఁ గానంబడవు. ప్రక్షిప్తములుగాఁ దోఁచెడిని. 2 వ పద్యము భారతమునందలి యారణ్యపర్వములోని చతుర్థాశ్వాసంబున సత్రిగౌతమసంవాదఘట్టము తుదినున్నది.

సీ. తామరకనుదోయి ♦ సామిపట్టిపురాణి, క్రొన్ననవిలుకాని ♦ గన్నతల్లి
ముజ్జగమ్ములవారి ♦ మొదలియేలికసాని, నాడెంపుఁజక్కఁద ♦ నాలకుప్ప
నెఱిక్రొక్కుఁగొల్చువారి ♦ ముంగొంగురత్నంబు, నెత్తమ్మిమేడల ♦ నిలుచునగువ
తొలుతలేములుబాఁచు ♦ ద్రోలెడు జవరాలు, కలుములొసంగెడు ♦ నలరుబోఁడి
గీ. నట్టునొరపట్టితో నాడు ♦ కలువకంటి, పలుకుటింతిపనుల్ గొని ♦ వెలయు గరిత
యిట్టిసిరిముద్దియను ముద్దుపట్టిగాఁగఁ, గనుటకంటెను భాగ్యంబు ♦ గలదె చూడ

సీ. సిరి దరిద్రునిఁబట్టి ♦ శ్రీమంతుగాఁజేయు, సిరి రోగినారోగ్య ♦ సిద్ధుఁజేయు
సిరి లోభి నతిదాన ♦ శీలునిగాఁజేయు, సిరి దుష్టచిత్తు వి ♦ శిష్టుఁ జేయు
సిరి కురూపుని మనో ♦ హరమూర్తిగాఁ జేయు, సిరి దుర్బలునిబల ♦ స్థితునిఁజేయు
సిరి మూఢు నతిశేము ♦ షీసమన్వితుఁ జేయు, సిరి పాతకుని పుణ్య ♦ పరునిఁజేయు
గీ. సిరి నిరాయుష్యుఁ జిరకాల ♦ జీవిఁ జేయు, సిరి మహాక్రోధిఁగారుణ్య ♦ సిద్ధుఁజేయు
సిరి గలుగువారి కిష్టార్థ ♦ సిద్ధిగాన, సిరి పొలఁతుక నాపాలఁ ♦ జెలఁగవలయు. 353

క. సిరి యెవనియింట నుండును, హరియును దాఁ బాయకుండు ♦ నాతనియింటన్
సిరియును హరియును గలిగిన, పురుషుం డిహపరసుఖములఁ ♦ బొందుట యరుదే.

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 2.

చ. అలసులవిల్తుతల్లి చర ♦ ణాశ్రితపోషణకల్పవల్లి ని
ర్మలగుణరత్నరత్నముల ♦ రాసులుగల్లి నిజార్చనాకుతూ
హలితసురీమతల్లి కడు ♦ నక్కఁటికంబుల పాలవెల్లి వే
డ్కలఁదగుతల్లి తల్లి మద ♦ గారమునందు వసించుఁ గావుతన్. 355

రాఘవపాండవయాదవీయము, ఆ 1 పే 1.

సీ. మకరందచరదళీ ♦ నికరఝుంకారమై, యలరారు నాకమ ♦ లాకరమున
నాజవంజవసాగ ♦ రాంతర్నిమగ్నచింతాన్వితజనముల ♦ నరసికరుణ
నుద్ధరింపఁదలంచి ♦ శుద్ధజాంబూనద, పద్మరాజమ్మున ♦ ఫాల్గునమున
నుత్తరర్క్షమ్మున ♦ నొప్పైనపౌర్ణమీ, శుక్రవారమ్మున ♦ శక్రముఖులు
గీ. వినుతిచేయంగ లోకైక ♦ వినుతమైన, సుందరాంగి మహాలక్ష్మి ♦ శుభము లొసఁగ
కలితకామకల్పవల్లి లో ♦ కములతల్లి, యవతరించెను నాల్గుబా ♦ హువులతోడ. 356

—భార్గవపురాణము, ఆ 4 పే 105.

# పార్వతి

ఉ. అమ్మలఁగన్న యమ్మ ముగు♦రమ్మలమూలపుటమ్మ చాలఁ బె
ద్దమ్మ సురారులమ్మకడు♦పాఱడిపుచ్చినయమ్మ దన్నులో
నమ్మినవేల్పుటమ్మలమ♦నమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మ♦హత్త్వకవిత్వపటుత్వసంపదన్. 357

భాగవతము, స్కం. 1 ప 10.

సీ. మగనికి సగ మిచ్చి ♦ సగముఁ దాఁ గొనియెనాఁ, దుఱుమున జాబిల్లి♦తునక వెలఁగ
సంచితభాగ్యారు♦ణాంశుపుంజంబునాఁ, గరుణారసంబు క♦న్గవలఁ దొలఁగ
సాంగమై కన్పట్టు ♦ శాంతరసంబునాఁ, బూసిన గంధంపుఁ ♦ బూఁతఁ దనర
బుసికికిఁ గోర్కె లొసంగ ♦ నిది వేళ యనురీతి, రతసంపుటందియల్ ♦రవళిఁ జూపఁ
గీ. దనదు సౌందర్య మిల దృష్టి♦దాఁకకుండ, దండిమై నెత్తు సొన్నంపుఁ♦గుండ లనఁగ
ముత్తెసరిమిన్న చన్గవ♦మురువుఁ జూప, నమ్మహాదేవి జటికిఁ బ్ర♦త్యక్షమయ్యె 358

చంద్రాంగదచరిత్రము, ఆ 3 ప 139.

సీ. రాకేందుబింబవి♦భ్రాజితాస్యముతోడ, ధవళాంబుజాతనే♦త్రములతోడఁ
గటిభాగశోభిత♦కనకాంబరముతోడ, డమరుత్రిశూలఖ♦డ్గములతోడఁ
గళవిలాజన్మణి♦గ్రైవేయములతోడఁ, జంద్రావతంసమ♦స్తకముతోడ
సౌదామినీపుంజ ♦ సన్నిభప్రభతోడ, మహితలావణ్యవి♦గ్రహముతోడ
గీ. హారమంజీరకటకకే♦యూరముఖ్య, భూరిభూషణరాజివి♦స్ఫూర్తి లోలయ
నిర్భరకృపాప్తితోడ వి♦దర్భపతికి, నంబికాదేవి యపుడు ప్ర♦త్యక్షమయ్యె. 359

బ్రహ్మోత్తరఖండము, ఆ 3 పే 89.

# జ్యేష్ఠాదేవి

చ. తరమి సురాసురుల్ కడలిఁ♦ద్రచ్చఁగఁద్రచ్చఁగ రత్నమాలికా
బ్రమములు దాల్చి నల్లనగు♦మై యొసఁగన్ జనియించి జ్యేష్ఠనా
గరిత నిలింపవల్లభులఁ ♦ గన్గొని నవ్వుచుఁ దా వసించున
య్యిరవులు చేయుకృత్యములు ♦ నేర్పడఁ జెప్పఁ దటంచుఁ బల్కెనన్. 360

మహాలక్ష్మీపరిణయము, ఆ 2 పే 49.

సీ. అతుల నిబ్బరముగ ♦ నడుగు నయ్యేలనాగఁ, గనుఁగొని విబుధు లి♦ట్లనిరి తెలియఁ
బాసహాస్పృతంబులు ♦ పలుకుచుండెడువాండ్రు, నిచ్చెద మన్నర్ఘ ♦ మీనివాండ్రు
కాదంబరీపాన ♦ గరిమగల్గినవాండ్రు, వాదులాడి మెలంగు ♦ జూదగాండ్రు
ఆసనముల్ గడుగక ♦ జపము జేసెడువాండ్రు, సంజలందునునిద్ర♦సలుపువాండ్రు
గీ. కామలోభాదిగుణములు ♦ గలుగువాండ్రు, చెలఁగిదోసంబులే ప్రొద్దు♦ సేయువాండ్రు
చెడ కులాచారధర్మము♦ విడుచువాండ్రు, నీకు నమ్మినబంటులో ♦ నీరజాక్షి. 361

మహాలక్ష్మీపరిణయము, ఆ 2 పే 49.

## మోహిని

సీ. పాలిండ్లపైనున్న♦పయ్యెద జాఱించు, జాఱించి మెల్లన ♦ చక్కనొత్తుఁ
దళుక్కుదళుక్కునుగండ♦ఫలకంబులొలయించు, నొలయించి కెంగేల ♦ నుజ్జగించుఁ
గడు మెఱుంగులువాఱు♦కడకన్ను లల్లార్చు, నల్లార్చి ఱెప్పల ♦ నండగొలుపు
సపరనిదరహాస ♦ చంద్రికఁ జిలికించుఁ, జిలికించి కెమ్మోవిఁ ♦ జిక్కపఱచు
గీ. దళితధమ్మిల్లకుసుమగం♦ధమ్ము నెఱపుఁ, గంకణాదిఝణంకృతుల్ ♦ గడలుకొలుపు
నొడలికాంతులు పట్టులే♦కులుకఁ బాఱు, సన్నవలిదంపుఁబయ్యెద ♦ సౌకళింప.

భాగవతము, స్కం. 8 ప 301.

సీ. నిగిడెడుమెఱుచాయ ♦ గగనభాగముడాయఁ, జొగరుతేఁటులుకొప్పు♦పూలప్రోయఁ
గులుకుగుబ్బలజాడ♦కులుకుకొనసియాడ, బంగారుపైఁటచె♦ఱంగు జాఱ
నొయ్యారియాలాగ ♦ యుయ్యలలో నూఁగఁ, దమిలేచి బాలేందు♦ధరుఁడుచూచి
పోయినప్రాణ మ♦ప్పుడు తోఁచనుదెంచి, యొడలున గాంచిన♦ట్లుత్సహించి
గీ. కంటి నౌరౌర మజ్జ యీ♦కలువకంటి, పలుకు ముందర నేఁ గంటిఁ♦బచ్చవింటి
బోయ కడగండ్లు విడ నుంటి ♦ పూవుపాదల, నొంటిగా నేలుకొనని లఁ♦గంటిమంటి.

విష్ణుమాయావిలాసము, ఆ 3 ప 60.

సీ. ధామణీస్థలిఁ దోఁచ♦నూపుమూలముఁ గాంచ, నింత సిగ్గేల మో♦మెత్తు మనుచుఁ
బయ్యెదఁ దొలఁగ గు♦బ్బలు చూడఁ బల్లంటఁ, గెమ్మోవినొక్కి జం♦కించుకొనుచు
భుజమూల మీక్షింపఁ ♦ బొదలుసిగ్గున నీకు, వడ్డించ నని కేలు♦వంచికొనుచుఁ
గను ఱెప్ప లెత్తి ఁ♦గ్గొని మెచ్చితలయూఁచి, యమృతపానముసాలు♦నాయటంచుఁ
గీ. దివ్యసనసంపునాటలఁ ♦ దేనె లొలికి, యమృతరసము కదంబింప♦నమరపతికి
మొదట వడ్డించి వడ్డించుఁ ♦ ద్రిదశతతికి, మోహినీకాంత జగదేక♦మోహనముగ.

చ. మఱఁది యటంచు బావ యని♦మామ యటంచును సల్లఁ డంచునం
దఱకును నన్ని వావు లిడి♦తెచ్చనలన్ మటుమాయసుద్దులన్
ముటిపెములన్ విలాసముల♦ మోహము లెంచి నిశాటచిత్తముల్
గఱఁచె లతాంగి యంగనలు♦గారె మనోధనపశ్యతోహరల్. 365

గీ. సుదతి వడ్డించునపుడు ప♦య్యెదయొకింత,తొలఁగగుబ్బలుసూచుస♦బ్బలియుఁబల్క-
రింప లేఁడయ్యెఁ దాఁబల్క-♦రింపఁదెలిసి, యట్టిపయ్యెదఁగప్పనో♦యనుభయమున

దశావతారచరిత్ర, ఆ 2.

సీ. వలుదగుబ్బలు నూపి ♦ వలపించుఁ గొందఱేఁ, జేసన్నఁ గొందఱే♦నాస గొల్పుఁ
జెక్కుల తళుకులఁ ♦ జొక్కించుఁ గొందఱే, కనుగిల్పి కొందఱేఁ♦గాకు సేయు
వాతెఱజిగి చూపి ♦ వాకట్టుఁ గొందఱే, మాటలఁ గొందఱే ♦ మరులు గొల్పు
జింకచూపులచేతఁ ♦ జిక్కించుఁ గొందఱేఁ, జేష్టలఁ గొందఱేఁ ♦ జిక్కు వఱపఁ

గీ. గలికినగవునఁ గొందఱే ♦ వలలఁ జెట్టు, కతుకాంతులఁ గొందఱేఁ ♦ గరఁగఁజేయు
సురల కమృతంబు వడ్డించు♦వారిఁ గడంగి, యసురపంక్తుల వంచించు♦నపసరమున.

సీ. తాతరో నీవింత ♦ తత్తరపడకుమీ, పడిమాఱెదనువేగ♦కడఁకతోడ
మనుమడరో నిన్నుఁ ♦ దినుమని యిదె పరిసాపాటు వెట్టెద నుల్కి-♦పాటుకలదు
బావరో వేగిర♦పడకుమీ లెస్సఁగా, వడ్డింతు నిదిగో నీ♦తెడ్డుకొలఁది
మఱఁదిరో తాళుమీ ♦ మాననీయంబుగా, గట్టిగా చేకొద్దిఁ♦బెట్టుదాన

గీ. ననుచు వావులు కల్పించి♦యా మురారి, జాణతనములతో భవి♦వ్యత్కృతములు
పలుకుచును రక్కసులనోడఁ♦బఱచి యమృత,రసము వడ్డించె దేవతా♦విసరములకు

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 4.

# అప్సరసలు

సీ. విధివత్సమాపిత♦వివిధయజ్ఞ ఫలంబు, లుంకువయైన యే♦ణాంకముఖులు
పటుసంగరాంగణ♦ప్రాణదానంబులు, రోవెలయైన మె♦లుంగుఁబోండ్లు
నిరుపమతమతపః ♦ పరమపుణ్యంబులు, కట్నడయైన శృం♦గారవతులు
కల్పోక్తతీవ్రవ్రతై♦కవ్రతాచరణముల్, మూల్యంబులైన యం♦బుజవదనలు

గీ. పట్టుఁగొమ్మలు రమణీయభావములకు, జన్మభూములు తారుణ్య♦సంపదలకుఁ
బ్రాప్యదేశంబు లతులాభి♦లాష్యములకు, వచ్చి రచ్చర లనిమిష♦స్వామికడకు.

కవికర్ణరసాయనము, ఆ 6 ప 45.

సీ. పలుకువాల్కన్నులయాఁ♦కలిఁ దీర్చు చలుపరో, మగువలఁ గనిపించు♦మంత్రసాని
తెలినిండుపండువె♦న్నెలసోన లేచాన, లుదయించుటకు ముందు ♦ యుమ్మనీరు
పుత్తడిపాలదిండి♦నెత్తు లేనవలాలఁ, గన్న బాలెంతకుఁ ♦ గాపుబొట్టు
చుట్టలుబొరపట్టి ♦ పట్టంపురాణి యో, మానినీమణులకు ♦ మాఱుదల్లి
గీ. పేరుగలయట్టి జన్మంపుఁ♦బైరుబాఁప, వెట్టిజవరాండ్ర కిరుగోరు ♦ వెట్టుకాఁపు
లట్టి యచ్చరజాతిలో ♦ మొట్టమొదలి, పేరఁగలదాన మేనక ♦ పేరుదాన. 370
చంద్రాంగదచరిత్రము, ఆ 3 ప 101.

సీ. రంభ ఘృతాచి యూ♦ర్వశి మణిప్రభ చిత్ర,రేఖ మేనక శశి♦రేఖ హరిణి
హేమ స్వయంప్రభ♦హితమోహ మోహిని, పుంజకస్థల రత్న♦పుంజ సరస
ధాన్యమాలిని తిలో♦త్తమ వరూధిని మంజు,ఘోష సౌగంధిని ♦ కుంద తార
మణిమాలిక సుమంబు♦మంజరి మణిభద్ర, మణిక విద్యున్మాలి ♦ మదమయూర
గీ. దివ్యమూర్తి సువర్ణదే♦దీప్యమాన, రుచిర మకరంద సుమదామ ♦ విచికిలాంగి
యనఁ దనరు నప్సరస్త్రీల♦కన్న మిన్న, చెన్నలరు వారసఖులహో♦చ్చెన్నఁగలఁడు
హంసవింశతి, ఆ 5 ప 118.

## రతీదేవి

సీ. తరితీపుఁజూపు బి♦త్తరిసోగనునుఁబూఁపు, లలులకు బయలువిం♦డులు ఘటింప
మృదుభుజాయుగళంపు ♦ మిసమిసల్ రాయంచ, తెగలకు రిత్తపం♦డుగ రచింపఁ
గలికితీయనిముద్దు♦పలుకులం చిలుకల, కూరకూరకయ నో♦రూరఁ జేయ
జిగిగుల్కు చికిలిలే♦నగవు తేటచకోర,ములఁ బట్టి పట్టి బం♦తులకుఁ జొనుప
గీ. నడుగడుగు కెంజిగురుటూకు ♦ కడుపుకూటి,బంటుగములకురవళిసం♦బళములొసఁగ
నిండు మురువున నొకతె కై♦దండఁ బూని, పతికడకు వచ్చినిలిచెనా♦రతివధూటి.
చంద్రాంగదచరిత్రము, ఆ 3 ప 53.

## రంభ

సీ. మోవిపైఁ గనిపించు♦ములువాఁడిపలునొక్కు, లూగిఁజిన్ని కెంపుల♦సొగసుఁజూపఁ
జెక్కులపైజాజి♦చెదరు కుంతలములు, మకరికాపత్రసం♦పదవహింప
జిగిగుబ్బచన్నులఁ ♦ జిటులుగందపుసరుల్, జిలుఁగుఁబయ్యెదలోనఁ ♦ జెంగలింప
నలువొందు నునుమేని ♦ నవనఖాంకురములు, బాలేందురేఖల ♦ పస హసింపఁ
గీ. జాఱుఁగొప్పున ముడిచిన ♦ జాజివిరుల,తావి తనతోడియచ్చర♦తలిరుఁబోఁడ్ల
కైశ్యకల్పప్రసూనసౌ♦గంధ్యనాదఁపు, రంభ చనుదెంచె దేవతా♦రాజసభకు. 373
నిరంకుశోపాఖ్యానము, ఆ 4 ప 39.

సీ. నునుముత్తియపుపూవ ♦ పనికట్టుకనపట్టు, పట్టుచన్కట్టు సం♦భ్రమముఁ జూప
నిండుచందురుకావి ♦ నెరికెచే రంగారు, కడవన్నె బంగారు ♦ కాసె యొసఁగ
వలిమట్టి పూదండ ♦ వెలిమట్టు గననొప్ప, కప్పుచిప్పిలుసాము♦కొప్పు దనర
ఝళఝళంఝళనాద♦హాళిహాళితంబైన, బిరుదువజ్రపుజల్లి♦ పెండె మమర
గీ. మాటికిని మ్రోలజయడిండి♦మంబు మెఱయ, రయము భయమును నయమును బ్రియము నమగ
నమరవల్లభుకొలువున♦ కరుగుదెంచె, రంభ సన్నుతనాట్యసం♦రంభ యగుచు. 374

వాల్మీకిచరిత్రము, ఆ 3.

సీ. మగరాలబిళ్లల ♦ నిగనిగఁదగినట్టి, వాలుకీల్జడ మొల♦నూలుఁ జొనిపి
రైకపావడనిగ్గు♦ పోకుండఁ గలచుట్టు, కండెకోరావింత♦గాను దాల్చి
నిదిరించుమరులేప♦రొద సేయుగతిఁ గాళ్ళ, గలగలమనఁగ గ♦జ్జెలను గట్టి
కేరాజుపోల్కిఁ గ♦త్రించుసంచపుకేలు, బొట్టును నొసలికిఁ ♦ బొందుపఱచి
గీ. యొరమాపులఁ జిఱునవ్వు♦లొలుకఁ బొల్చు, తప్పుమెంకులు మెఱుఁ♦గప్పువగల
తెచ్చికోల్గొంకులును మోర♦త్రిప్పడమ్ము, లలరఁ గేళిక కరుదెంచె♦ నల్లరంభ 375

పార్వతీపరిణయము, ఆ 5.

## ఊర్వశి

సీ. పసువాల్గుజాతుల♦ త్రిదశాంగనలయందుఁ, బేరుపెంపును గల♦నీరజాక్షి
నీరజనాభుని ♦ యూరుకాండంబున, నుద్భవంబందిన ♦ యుజ్జ్వలాంగి
యంభోనిధానంబు ♦ నాపోశనముఁ గొన్న, కలశసంభవుఁ గన్న♦ కంబుకంఠి
వసుధయందుఁ బురూరవ♦ శ్చక్రవర్తికిఁ, బ్రాణవల్లభయైన ♦ పద్మనయన
గీ. కట్టితోడిపూపికై సేసి ♦ కౌతుకమునఁ, గొస డిగఁగ నీలిపుట్టంబు♦ ముసుఁగు వెట్టి
గాజు లెగద్రోసి చప్పుడు ♦ గాకయుండ, వచ్చె నూర్వశి యర్జునా♦వాసమునకు.

హరవిలాసము, ఆ 7 ప 119.

సీ. రంభకునాట్యసం♦రంభంబు దిటవవి, కాని గర్వంబు శ♦క్యంబు గాదు
మంజుఘోషకులాస్య♦మహిమపాతముగాని, తాళమానమునకుఁ ♦ దాళ దెపుడు
చిత్రరేఖయది వి♦చిత్రనృత్యము గాని, ప్రౌఢినుద్దండించు ♦ భరతరీతి
మేనకనటనము ♦ మెఱుపుజూపెడుఁగాని, యభినయంబునకు గో♦రంతజంకు
గీ. నర్తనము మించు గర్వమిం♦తయును లేదు, తాళమున కొచ్చు భరతంబు♦ గారవించు
నభినయంబు ఘనంబెంచఁ♦ ద్రిభువనముల, నూర్వశీకాంతకును సాటి♦ యువిద గలదె.

షట్చక్రవర్తిచరిత్ర, ఆ 6 పద్య 130.

సీ. [illegible] ప్రసవ♦ [illegible]ప్రమాణంబు, భద్రేభగతివిలం♦బనము దెలుప
కుచగానిన [illegible]మునఁ♦ గనిపించుజవజవల్, కుచకుంభభారంబు ♦ గుట్టు దెలుప
నవికారవచనవీ♦క్షాగివిలాసంబు, లుత్తమనాయికా ♦ వృత్తిఁ దెలుప
నాజకంఠభ్రాంతిఁ ♦ దనువు వెన్కఁగు తేఁటు, లొగిఁ బద్మినీజాతి♦ యగుట దెలుపఁ
గీ. తరుమనికరంబు వీఁడను ♦ బుష్పశరుఁడు, తెగి ప్రయోగంబుసేయమూ♦ర్తీభవించి
వచ్చు మోహనమంత్రదే♦వత యనంగఁ, జనియె నూర్వశి సురరాజ♦సన్నిధికిని. 378

కవిరాజమనోరంజనము, ఆ 4.

# మేనక

సీ. కమనీయసురసభా♦గారమధ్యమునను, దీపించుమాణిక్య♦దీప మనఁగ
రంభాదిదేవతా♦రంభోరువులకెల్లఁ, జారుచూడావతం♦సం బనంగ
జగములు గెలువంగ ♦ సానఁబట్టించిన, రతిరాజునవఖడ్గ ♦ లతిక యనఁగ
యతులమానసములు♦ద్ధతుల నాకర్షించు, వరవశ్యమంత్రదే♦వత యనంగఁ
గీ. బంతిఁ గూడిన హరిసైనఁ ♦ బద్మభవుని,నైన హరునైన మోహార♦సాబ్ధిఁ ద్రోచి
యీఁదులాడింప నోపెడు ♦ నిగురుఁబోఁడి, మేనకాసతిఁ జూచిస♦న్మానమునఁగి.

శకుంతలాపరిణయము, ఆ 2.

# తిలోత్తమ

క. అలకలతావికి నలికుల, కలకలములియంగవీణ ♦ గదలించుచుఁ దాఁ
గిలికిలనుఁగొనలకొలుకుల, నులుకులు దలకొనఁగ లలిఁ ది♦లోత్తమ యొప్పెన్. 380

పద్మపురాణము, ఉత్తర. ఆ 2 ప 16.

# అహల్య

గీ. పుష్పలత నెండినాకులు ♦ పొదివినట్లు, బెగసి కర్కశవల్కలాం♦బరముఁ గట్టి
క్రొత్తగా గట్టఁగట్టినఁ ♦ గొమకుమిగులు, నంగభవబాణతుల్య న♦హల్యఁ గనియె.

పద్మపురాణము, ఉ. ఆ 3 ప 11.

సీ. జలమధ్యసందీప్త♦సవితృదీధితిమాడ్కి, నతిదురాధర్షయై ♦ యమరుదాని
ధూమశిఖాయావృత ♦ పూర్ణచంద్రికవోలె, నశ్రుధారామగ్న♦యైనదానిఁ
దుషారశిఖామావృత ♦ పావకశిఖభంగి, నుడుపాంశు కలితయై ♦ యున్నదాని
శ్యామశ్రీమేఘచ్ఛన్న ♦ చారుతటిల్లత, కైవడి జడచేతఁ ♦ గ్రాలుదాని

గీ. బ్రహ్మనిర్మితతను సమూర్తిఁ ♦ బరఁగుదాని, విపులశోభాభరంబునఁ ♦ బ్రేఁగుదాని
నఖిలలోకభూతాదృశ్య♦యైనదాని, నంతికాంత్తమాంగల్య న♦హల్యఁ గనియె. 382
భాస్కరరామాయణము, బాల. ప 515.

# విశాలాక్షి

సీ. పసిఁడికమ్మలతోడి ♦ కుసుమపూవన్నియ, నిద్దంపుఁబుట్టంబు ♦ నెఱికఁ గట్టి
యిందిరానీలములతో ♦ నెడకట్టి గ్రుచ్చిన, రమణీయతారహా♦రము ధరించి
పారిజాతకతరు♦ప్రసవగర్భితమైన, కబరిపైఁ జెంగల్వ♦కచ్చు నిలిపి
ఫాలభాగంబునఁ ♦ బన్నిటు మెదిచిన, కమ్మకస్తూరితిల♦కమ్ము దీర్చి
గీ. పలుఁదచన్నుల జిలుగుఁగం♦చుళికఁ దొడిగి, కటిభరంబున వజ్రాల♦కసుకఁ బూన్చి
యరసి యాఁకొన్నవారికి♦నమృతభిక్షఁ, గరుణ నిడు శ్రీవిశాలాక్షి ♦ గాశియందు.
కాశీఖండము, ఆ 7 ప 5.

# శకుంతల

సీ. సురకన్య కాఁబోలు ♦ సురకన్య యయ్యెనే, తీవిమై రెప్పలా♦డించు టెట్లు
పుత్తడి కాఁబోలుఁ ♦ బుత్తడి యయ్యెనే, హంసగతుల నడ♦యాడు టెట్లు
వనలక్ష్మి కాఁబోలు ♦ వనలక్ష్మి యయ్యెనే, కటివల్కలంబులు ♦ గట్టు టెట్లు
రతిదేవి కాఁబోలు ♦ రతిదేవి యయ్యెనే, వలరాజుఁ బెడఁబాసి ♦ వచ్చు టెట్లు
గీ. కన్నుఁగవయార్చుటను సుర♦కన్య కాదు, నడచియాడెడుఁ గానఁ బు♦త్తడియుఁ గాదు
లలిఁ దపశ్చిహ్నమున వన♦లక్ష్మి కాదు, ప్రసవశరముక్తయైనది♦ రతియుఁ గాదు. 384
శకుంతలాపరిణయము, ఆ 2.

# లీలావతి

సీ. కురులు నున్నఁగ దువ్వి ♦ కొప్పు వెట్టెనె కాని, తోరంపువిరిసరుల్ ♦ దుఱుమఁబోదు
పాలుపొందఁ గుంకుమ ♦ బొట్టు వెట్టెనె కాని, ముద్దుగాఁ దిలకంబు ♦ దిద్దబోదు
పాటిగా నెమ్మేనఁ ♦ బసుపు పూయునె కాని, యందమౌ కలపము ♦ లందఁబోదు
పతికి సేమము కోరి ♦ వ్రతము సేయునె కాని, శృంగారవని విహా♦రింపఁబోదు
ఆ. కంటె తాళిబొట్టు ♦ కమ్మలు కడియంబు, లొక్క వన్నెచీర ♦ యొకటి రెండు
పీడియములె కాని ♦ భిషణముల్ గలిగియు, నల్లకుండు దైత్య♦వరపురంధ్రి. 385
దశావతారచరిత్ర, ఆ 4.

# చంద్రమతి

సీ. కురులెల్ల జడగట్టి • చిరిగి మాసిన బట్ట, మరువుగా మై వెట్టి • పొరలు దాని
లాలితాహారముల్ • మేలైనహారముల్, లీలావిహారము • ల్లేని దాని
నెలబ్రాయపడికాలు • బోలి చెక్కులఁ గేలు, గ్రాలు నశ్రులజాలు • గలుగు దాని
నుడివోనిమదిచింత • కడలేనితలవంత, యొడగానికడువింత • వెనయు దానిఁ
గీ. గాంతఁ బ్రోషితభర్తృక • గాఁ దలంచి, కాంచి లజ్జించి తలవంచి • కడకడించి
పలుక సంకించి శంకించి • పంకజాక్షి, కట్టెదుర నిల్చి యాధరా • కాంతుఁ డపుడు.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ ౩ ప 186.

సీ. తుమ్మెదగమి గెల్చు • ధమ్మిల్లబంధంబు, చెదరి కుంతలములు • చిక్కువడియె
శశిబింబకాంతికి • సదనమైకనుపట్టు, వదనపద్మము వసి • వాళ్లివాడె
క్రొక్కారుమెఱుఁగు గై • కొననితనూవల్లి, నిబిడాతపంబుచే • సొబగు దూలె
కెందమ్మిపూవుల • గెలువంగ నూహించు, మృదుపాదతలములు • మిగులఁ బొక్కె
గీ. పచ్చిపగడంపుఁ గెంజాయ • పగటుమోవి, పగిలి బీఁటలు వాఱె వి • భ్రమము దఱిఁగె
తరళనేత్రకు నానిమి • త్తమున నకట, యవిరళంబైన యాయాస • మావహిల్లె. ౩౮౭
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 3 వ 89.

# దమయంతి

సీ. నిలువెల్ల శుచిత రం • జిలుచుండ సాధుని, మాట దాటనియట్టి • మంజువాణి
తనయన్నపక్షపా • తము మీఱ లాలించుచుండఁ గొండగఁ జూచు • చున్న యోగ్య
భువనాధికస్ఫూర్తిఁ • బొదలుతండ్రికిఁ గూర్మి, భాసిల్లఁ జెలఁగువి • లాసలక్ష్మి
సన్మార్గచర్య ని • శ్చలకళావిస్ఫూర్తి, నంచితాంబరశోభ • దైనశ్యాము
గీ. యనఁగఁ దగుభైమిఁ దోడ్తెచ్చి • రబ్జనేత్ర, లట్టిబాల కేశుఁ డట్టిగో • త్రాధినాథుఁ
డట్టిపురుషోత్తమునకు మఱి • యట్టిరాజునైన నైషధుఁ డానంద • మందుచుండ. ౩౮౮
షట్చక్రవర్తిచరిత్రము, నల. ఆ ౫ ప 64.

సీ. సఖులఁ దాఁ బుష్పాస్త్రు • జితనెట్టుపదమున, నభిషేక మొనరించు • నవనినాథు
నలనామధేయమై • న తృణంబు విసఁబడ్డ, నధిపతిపేర్వెన్న • యట్టి యాలరు
నిషధదేశపువిప్ర • నికరంబుఁ బూజించి, యలవోకఁ బ్రియుసుద్ది • యడుగఁ దలఁచు
నభ్యాసవశమునఁ • బ్రాణేశ్వరునిమీఁది, యించుగీతములు వా • యించువీణ
గీ. నేర్పుగల చిత్రకములచే • నిలయభిత్తి, భువనమోహనాకారత • బొలుపుమిగులు
మగని పగువను వ్రాయించి • మదిఁ దలంచు, నిషధరాజును దన్నుఁ గా • నీరజాక్షి

సీ. అఖిలదిగ్దేశరా♦జాకర్షణక్రియా, మహనీయతరసిద్ధ ♦ మంత్రశక్తి
యాకారరేఖాస♦ముద్భూతితానస్య, సాధారణాశ్చర్య ♦ జలధివేల
నేపథ్యహారశ్రీ♦భాపూరనిర్మల, వారిబింబితనిజ ♦ స్వచ్ఛకాంతి
సంకల్పభవమూర్తి ♦ సద్భృశకర్ణాకల్ప, కట్టారసౌరభా ♦ గతమదాళి
గీ. బహువిరోధిమణిప్రభా♦పల్లవాగ్రి, మల్లసంగ్రామఖురళికా ♦ మండలాయ
మానసానాపరిష్కార ♦ మహితగాత్రి, మనుజపతిపుత్త్రి యాస్థాన♦మునకు వచ్చె.

శృంగారనైషధము, ఆ 1 ప 76, ఆ 5 ప 5.

## యామినీపూర్ణతిలక

సీ. సకలంకసంగవాం♦ఛాసక్తి దగదంచుఁ, గమలారిఁ దొరఁగిన ♦ కళయనంగ
మే నెఱుంగనివాని ♦ మిత్త్రత్వ మసదని, మకరాంకు వీక్షింపకున్న ♦ మాయ యనఁగ
నిరవలంబానాస♦నిగతి కానిదటంచు, సురపథం బెడలిన ♦ చుక్క యనఁగ
మలినాంతరంగసం♦బంధ మారడి యంచు, మేఘంబు వీడిన ♦ మెఱుఁగనంగ
గీ. జాయలను జెల్వమైన లేఁ♦బ్రాయమునను, జనుల కల్లారుముద్దుగా ♦ ననుపపడుచు
నాటపాటలు సలుపుచు ♦ నవనిబాల, యామినీపూర్ణతిలకాఖ్య♦మాఖ్యనలరు. 391

బిల్హణీయము, ఆ 1 ప 48.

గీ. పూర్ణచంద్రాస్య యామినీ♦పూర్ణతిలక, గానవిద్యాప్రవీణతఁ ♦ గాంచె సకట
యంత సాహిత్యహీనయై ♦ యమరెఁ గావ్య,భవ్యనాటకములు జెప్పఁ♦బ్రౌఢయగుచు.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 2.

## కుబ్జ

ఉ. దేవకిపట్టి గాంచెను ధృ♦తిన్ మృగనాభియు హైమవారియున్
గోవసవాదియుంబునుఁగు ♦ గుంకుమపంకముఁ గప్పురంబుఁ గ్రొ
త్తావులు పిక్కటిల్లఁగఁ గ♦దంబము గూర్చిన చందనంబు హే
లావిధిఁ జంద్రకాంతపు శి♦లామయపాత్రికఁ దెచ్చు జవ్వనిన్. 393
క. తనువున నెఱపూఁతలుగా, నొనరఁగ గంధంబుఁ బూయు♦చుండి వినోదం
బున సల్లాపము లాడుచు, వనజాక్షుఁడు కుబ్జకాంత ♦ వరచిబుకంబున్. 394
గీ. తనకరాంగుళములఁ బట్టి♦ తానిపాద,యుగముపై నిజచరణంబు ♦ లూనఁ బెట్టి
నిక్కఁదిగిచి విక్షేపణ♦మక్కజముగఁ, జేయుటయు మోహనాకృతిఁ♦ జెలఁగెఁ దరుణి.

విష్ణుపురాణము, ఆ 7 ప 385—389.

## సత్యభామ

సీ. మాత్సర్యఘనమేఘ ♦ మాలికాపగమప్రకాశితహిమధామ ♦ కళ యనంగ
విరహానిశీథిని ♦ విరమసంప్రాప్తితో, న్మీలనాంభోదపద్మిని యనంగఁ
గ్రీష్మదంతావళి ♦ క్షోభణవిభ్రమ ప్రసరస్సంజాతనైర్మల్య ♦ సరసి యనఁగ
సంతాపనైదాఘ ♦ సమయనిర్గతకోరక, కితనవమాలతీ ♦ లతిక యనఁగఁ
గీ. గాంతిఁ జెన్నారి వికసిత ♦ స్వాంతయగుచుఁ, బొలఁకయంతయు విగ్రహింది ♦ చెలువమెసఁగ
కేశవద్విజప్రియభామ ♦ గారవించి, యున్న యత్తటి మునివైరి ♦ సన్నిధికిని. 396

పారిజాతాపహరణము, ఆ 2 ప 15.

చ. కనకపుఁ గ్రొంగొప్పు సిరి ♦ గంధపుబొట్టును ముక్కుకమ్మియు
త్తైము మెడగంధమూన్ పసిఁడి ♦ తీవెలచీరయు వీడెమున్ విలా
సము తులకించుచుందనపు ♦ సందిటి తాయెతు లొప్ప సత్యభా
మ మెఱుఁగు ప్రోడ నచ్చెనగ ♦ యన్ మొనయింపుచు గిల్కుమట్టెలన్. 397

చమత్కారమంజరి, ఆ 1 ప 54.

## మిత్రవింద

సీ. నీలంబులైన పెన్నెఱులజొంపము నుచిత సువర్ణవర్ణయు ♦ క్తముగఁ జేసి
కంసారిచేపట్టు ♦ గలిగి ముక్తాఫలంబైన చన్గవఁ జంద్ర ♦ మలరఁ గూర్చి
యాల పుష్యరాగంబు ♦ లగు పాదనఖముల, వరకచ్ఛురాప్తితో ♦ వఱల నిల్పి
పద్మరాగంబులౌ ♦ పాదతలంబులఁ, దగినకళ్యాణపత్రములఁ బొదివి
గీ. జంభవిస్ఫూర్తి సంక్షేమయ ♦ స్తంభజనిత, తిమిరవిహృద్వ్యహాసితచం ♦ ద్రికఁ దొలంగ
నవ్వుఁ జేసెంచె మిత్రవిం ♦ దాఖ్యనీల, వేణి లీలానమితశార్ఙ్గ ♦ పాణి యగుచు. 398

చమత్కారమంజరి, ఆ 1 ప 56.

## భద్ర

సీ. జాలుకొప్పునసున్న ♦ సంపఁగు లిరులలోఁ, గదిసినఖద్యోత ♦ గణముఁ బోల
నదుటుఁజన్నులఁ బుటఁ ♦ బుదుకునీలపుఁదాళి, గిరులపై జలదాళి ♦ క్రియ నెసంగ
సన్నవల్లెము మేన ♦ జాళువా యనఁటిలేఁ, జిగురాకుపై ఘంచు ♦ వగల మించఁ
గనఁగ భ్రూమధ్యస్థ ♦ కస్తూరి రేఖ సింగిణి ఘటించినకోల ♦ గేలి సేయఁ

గీ. జేతిచిల్కకు మాటలు ♦ చెప్పుకొనుచు, గబ్బిగుబ్బల నిజపాదు♦కారవములు
కుంజరంబులఁ జప్పట్లు ♦ గొట్టుచవుడు, తోడ నేతెంచె భద్రాఖ్య♦తోయజాక్షి.
చమత్కారమంజరి, ఆ 1 ప 55.

# కాళింది

క. చొక్కపునడతోఁ దళుకుం, బుక్కాఘుమఘుమలుదట్టు ♦ పునఁగుబుగులునల్
దిక్కులు నిండఁగ నెంతేయుఁ, జక్కనికాళిందియనెడు ♦ జవ్వని వచ్చెన్. 400
చమత్కారమంజరి, ఆ 1 ప 56.

# జాంబవతి

మ. చెలువై జాంబవతీవధూటి చనుదెఁ♦చెన్ వేడ్కతో నప్పు డు
జ్జ్వలమంజీరయుగంబుమంజుతరఘో♦షం బొట గోపాలుఁ డ
త్యలఘుప్రీతివహింపనున్న తగభ♦ద్రశ్రీవరంబొటుచే
నలకౌశేయము చక్రియుత్సుకనిజ♦స్వాంతుండు గాకుండునే. 401
చమత్కారమంజరి, ఆ 1 ప 57.

# సుదంత

ఉ. ముక్కఱముత్తెమున్ మిగుల ♦ మోహపుఁజొక్కనుగూడి వక్త్రమున్
రిక్కలఱేఁడుఁగాంచి సవ♦రించి సనామపుముద్దుఁగుత్తుకన్
జొక్కపుబాహులన్ బసిఁడి ♦ సోఁగులఁ గట్టినలాలిలీలతో
నక్కన వ్రేలు తాళి చెలు♦వారఁగ వచ్చె సుదంత యంతటన్. 402
చమత్కారమంజరి, ఆ 1 ప 58.

సీ. సంగీతసాహిత్య ♦ సత్కళాభూతికి, శారద యొక్కింత ♦ పాటివచ్చు
భవ్యసౌందర్యవై♦భవమున శ్రీ పురం,దరురాణి యినుమంత ♦ పురుడు వచ్చు
నవిరతపావన♦త్వవిలాసమునకు ని,ర్జరఘుని గోరంత ♦ సవతు వచ్చు
పావకపదభక్తి ♦ తత్పరత్వమునకు, హిమగిరిసుత కొంత ♦ యీడు వచ్చు
గీ. ననుచు జగతీజనంబులు ♦ వినుతిఁ జేయ, సకలసద్గుణసంచయ ♦ సహితరైు ర
మాకళాపరిభాసిరై ♦ మహితరీతి, నలరుచుండు జనార్దన ♦ యాల సుదంత. 403
సుమనోమనోభిరంజనము, ఆ 2 ప 25.

# దేవదేవీమధురవాణులు

సీ. వలరాజుశృంగార♦వనములోఁ గ్రొమ్మావి,కందర్పమాయల ♦ మందుఁ గ్రోవి
చిత్తజన్ముఁడువిటు♦శ్రేణి కిచ్చినయీవి, మదనుసామ్రాజ్యసం♦పదలదీవి

కమలాతనూజరా♦గరసంపునడబావి, జలజాస్త్రుటెక్కెపు ♦ సన్నకావి
పుష్పకేతనువల♦పులయేటివడుదీవి, శంబరారాతియా♦ర్జవపుఠీవి
గీ. దానిసౌందర్యమునకేది♦ధాతృసృష్టి, సరిసమం బీడు జో డెన్న♦సతులు గలరె
పచ్చవిల్కానితో సల్గి♦వచ్చి రంగ, భూవసతినున్న రతిదేవి ♦ దేవదేవి. 404
గీ. ఆతరుణియక్క బహునృత్త♦గీతవాద్య, కళల పెన్నిక్క వలరాజు ♦ కంచునక్క
ధరనహి ప్రతిదానిసౌం♦దర్యమునకు, దుహితశృంగారరసవేణి ♦ మధురవాణి. 405
సీ. ముఖమజ్జన మొనర్చి ♦ నఖరేఖరేఖగాఁ, గమ్మకస్తూరినా♦మమ్ముఁ దీర్చి
నునుపుగాఁ దట్టుపు♦నుగున దువ్వి పువ్వుదండలతోడఁ గోరకొ♦ప్పులు ఘటించి
సొమ్ములసొమ్ములౌ ♦ నెమ్మేనులకు వింత, యందంబుగాఁ దావి♦గంద మలఁది
పావడరంగుపై ♦ పైపన్నియలు గుల్కు, వలిపెంపుమడుఁగుఁజ♦ల్వాలు ధరించి
గీ. కప్పురపుఁదావిచిలుకు బా♦గాలొసంగ, నడపకత్తెలు తెలనాకు ♦ మడుపులొసఁగ
నందియలు మ్రోయ సాన్తాని ♦ కరుగుదెంచి, రింతు లలకంతుపట్టంపు♦దంతులనఁగ
వైజయంతీవిలాసము, ఆ 1 ప 102, 103, 153.

## దేవదేవి దాసరిసానివేషము

సీ. నడిముక్కుమీఁద స♦న్న పునాభినామంబు, నడుమ మంజిడికావి ♦ నిడుదరేక
యలఁతివీనులవిచ్చు♦టాకుపిదుద్దులు, సికవేసిముడిచిన ♦ చిన్నితుఱుముఁ
జనుదోయినిబిడియఁగ♦ట్టినచుట్టుపయ్యెద, క్రొత్తదోమినసంత ♦ కోరకములు
క్రిక్కముపై నెగఁగట్టు ♦ దిగఁగట్టు దువ్వల్వ, నేలపైఁ జీరాడు ♦ వ్రేలుఁగచ్చ
గీ. కంఠపార్శ్వంబున సగంబు ♦ గానిపించు, తులసితామరపూసల ♦ వలుదసరులు
పూని నిక్కింపుదాసరి ♦ సానివోలె, విప్రనారాయణారామ ♦ వీథిఁ జొచ్చె.
వైజయంతీవిలాసము, ఆ 2 ప 54.

## లక్ష్మీదాసి

సీ. ఏయింతిమేల్బంతి ♦ స్త్రీయవిద్యాప్రౌఢి, నచ్చరలనె యోర్చు♦నట్టి దయ్యె
నెన్నాతిమిన్న దా♦నెంతేని గలిమిని, గనియును గరువంబుఁ ♦ గాంచ దయ్యె
నేయన్నుగన్నాకు ♦ గేయులౌ శ్రీవైష్ణ♦వులనెకాశన్యులఁ ♦ గలయ దయ్యె
నేపాత్రితిలకట్టు ♦ శ్రీపరాశరభట్టు, సద్గురుశుశ్రూష ♦ సాధ్వి యయ్యె
గీ. నద్దియా సత్యభామ మా♦న్యగుణభామ, యుల్లమునను బ్రసన్న వే♦యోపపన్న
శ్రేష్ఠసన్మానరక్త సృ♦సింహభక్త, లక్ష్మిదాసియనంబడు ♦ లలిత వినుము. 408

సీ. ఆటపాటలచేత ♦ నభినయంబులచేత, నార్జించెఁ బ్రభుసభ♦లందు ధనము
సద్భక్తి సత్పాత్ర♦జనులకే యెల్లప్డు, స్వాపతేయం బిచ్చి ♦ పడసె యశము
విష్ణురూపులటంచు ♦ వైష్ణవుల నెపొందెఁ, దనపేరుసార్థక♦త నొనగన నన
వైష్ణవధర్మసం♦ధరణరక్షణకార్యధుర్యసాక్షాల్లక్ష్మి ♦ స్తుత్య యనఁగ
గీ. శుద్ధసత్త్వప్రధానయై ♦ శోభిలునది, యిద్దియేయని సాధువు♦లెల్లఁ బొగడ
నగరమండనయనుపేరు ♦ దగఁగఁ దనర్చె, తనరుఁ గోల్కొండపురిలక్ష్మి♦దాసివాసి.

కుమారనృసింహము, ఆ ౩.

# చిత్రాంగి

ద్విపద. అప్పుడు చిత్రాంగి ♦ యబ్బురం బొదవ, గుప్పున లేచి యొ♦య్యనవత్తరమున
చిత్తరించుపిసాళి ♦ బెళుకువాల్చూపు, మొత్తమౌ తొగలని♦మ్మగఁ గ్రుమ్మరింప
పెన్నెఱుగీల్గంటు ♦ వ్రేగునఁదద్ద, సన్నంపులేఁగౌను ♦ జవజవలాడ
కట్టాణిముత్యాల ♦ కమ్మలడాలు, ధట్టించి చెక్కుట♦ద్దములఁ జిందాడ
మేపూఁతకలపంపు ♦ మేలిసెత్తావు, లేపొంది దిశల నె♦ల్లెడ గుబాళింప
గాటంపువలియూర్పు ♦ కమ్మఁదెమ్మెరలు, మేటితుమ్మెదలనా♦మోతలకుఁ బిలువఁ
జిలుగుపైఠాణికం♦చెల పిక్కటిల్లి, కులుకుసిబ్బెపుగబ్బి♦గుబ్బ లుప్పొంగ
బలితంపుఁ జెంగావి ♦ పావడరుచులు, వలిపెక్రొందగటుచ్చు ♦ వల్వపైఁ బొదల
మంజులాలంకార ♦ మణిగణకిరణ, పుంజము లల్లడల వి♦ప్పుగఁ గప్పుకొనఁగ
ఘంటలమొలనూలి ♦ ఘణఘణధ్వనుల, నంటి జంటగగిల్కు ♦ టందియల్ మొరయ
మురువైనహురుమంజి ♦ ముత్యంపుసరులు, పరిపరిగతుల గు♦బ్బలపై నటింప
కొలమించుతొలుకరి ♦ క్రొమ్మెఱుం గనఁగ, జెఱుకువిల్తునివాఁడి♦చేకత్తి యనఁగఁ
దొగలసంగడికాని ♦ తునియ యనంగఁ, బొగడొందు జంత్రపు ♦ బొమ్మ యనంగఁ
లలితంపునవపుష్ప♦లతికయో యనఁగ, జిలిబిలివలపులఁ ♦ జిక్కి యక్కొమరుఁ
... ... ... ... ... .. ... 410

సారంగధరచరిత్రము, ఆ 1.

# సరమ

సీ. రాజరాజనగను ♦ రంజిల్లు దివసప్రభావుండు మాపెద్ద ♦ బావగారు
విపులతపశ్శక్తి ♦ వెలయు విశ్రవసుండు, మహనీయమూర్తి మా ♦ మామగారు
మాలివిక్రమకళా♦శాలితనూజయౌ, యల్ల కైకసియు మా ♦ యత్తగారు
మూడులోకంబులఁ ♦ బీడించుచున్నయప్పంక్తికంధరుఁడిరు♦బావగారు

రాముని గెలువకమి ♦ రాజశేకర్యమె యందుఁ, గెలువలోఁ బలుమాఱుఁ ♦ దెలుపుకాని
హృదయతాపము వేఁడి ♦ నొదవు మంటలుఁ గ్రిది, విరిసినయుత్యాల ♦ సరులుగాని
గీ. రవిరసింహాసనము నంగముా ♦ స్పన్నగాని, క్రోశితం సుపఁ జెనగొన్న ♦ వేశిగాని
విన్నవైయున్న తొడవుల ♦ వన్నెదాని, దేవవిద్వేషిపట్టంపు ♦ దేవిఁ గనియె. 416

నరసభూపాలరాజీయము, ఆ 5.

## మంథర

సీ. శ్రీరామచంద్రుని ♦ నికరాయపట్టంబు, గట్టిగా దశరథ ♦ క్ష్మాపతియుండు
సమకట్టి పురమెల్లఁ ♦ జూచి శృంగారింపఁ, బనిచినట్టి సం♦భ్రమముఁ జూచి
దురితాత్మురాలు మం♦థర సహింపఁగలేక, గునుగుచున్ గూను ♦ గునియ నేఁగి
యింక నేఁటినిదురలే ♦ వేయని కైకను, నొడబట్టి లేపి యౌ♦పడఁతి వినవె
గీ. రాము పట్టము గట్టఁగా ♦ రాజు పూనె, భరతుఁ డింకెటు గను రాము ♦ బంటు గాఁడు
నీవు కౌసల్యదాసివి ♦ నేనికేల, వెఱఁది తొత్తుకు బడితొత్తు ♦ నలరె నెంచుచు. 417
గీ. అటులఁ గాకేని రాముప♦ట్టాభిషేక,విఘ్న మొనరింపఁగా నొక ♦ వింత యుపాయ
గలదు అద్దాని నీకుఁగా ♦ వలసె నేని, చెప్పెద నటంచుఁ జెవిలోనఁ ♦ జెప్పె నది కి.

దశావతారచరిత్ర, ఆ 7.

## వృద్ధవేశ్యలు

సీ. అక్కలమ్మల పేర్ల ♦ లెక్క లక్కజముగఁ, జాపచన్నులపైని ♦ జీర పఱచి
తొలినాఁడు ముద్దుబి♦డ్డలు దాల్చి పొగవై, చినసుగంధములు కొప్పు♦లను ధరించి
వ్రేలాడు కుచయుగ్మ ♦ మోలిపై కెత్తిగు,త్తనులుగా రైక లిం♦పమరఁ జేసి
కురుమాపు మాసిన ♦ కోక జిడ్డులు నాకు, నెలవుకుచ్చిళిలోన ♦ నిగుడఁ గట్టి
గీ. యామినులను కాచు పోక పా♦గాకు సున్న, మేకముగఁ జేసి ప్రక్కిళ్ళ ♦ నిరవు పరచి
పాపలబిరుందరాగసం♦పదలు డాయ, సొగసి గత్తరి వృద్ధవే♦శ్యాచయంబు. 419
మ. వినవే పద్మోదర యోరసేయగదె కా♦వేరీ విటుం గన్న స
య్యన నార్లిక్లకు దోసిలొగ్గుదువె మీ♦నాక్షీ భుజంగాళి కో
యనరాగుల్లుక్కులు తెల్క లందవలెఁబ♦ద్మాస్యా ప్రియుం జూచి పా
రని మోహాంబుధిలోఁ బొరల్పనగు శ్రీ♦రంగీ మొఱుం గారఁగన్. 420
ఉ. నేవయసప్పు డెంచుటకు ♦ నేర్చితిఁ జైకపుమందు బచ్చలున్
వావిరి కొల్లఁజేసితి జ♦వం బికసల్లి విలంబమానసం
భావితగండయుగ్మకుచ♦భాసుర నాచు విహీనదంతినై

దేవపుత్త్రోదు పెన్నెఱల ♦ తేజము వెల్వెలఁ బాఱునాటనుం
డీనలగాని సేతకు స♦హించినగాసిడఁ డెవ్వఁడక్కటా. 421

సీ. మును కళింగుని గళిం♦గుని జేసి సాల్వభూ, వరుని సాల్వంబుగఁ ♦ బరిహసించి
తగ ధార్తరాష్ట్రుని♦ధార్తరాష్ట్రఖ్యాతిఁ, బరికించి యధికసం♦భ్రమ మలర్చి
పటుసైంధవుని సైంధ♦వముగాగఁ బాటించి, కోసలేశుమనంబుఁ ♦ గోస పరిచి
శకవంగపతికబ్బ ♦ శకవంగగాఁ జేసి, మోహనాకారుల ♦ మోహపరచి
గీ. రంభ నారులఁ గేడించి ♦ రహిఁ బరగుఘ్ను, తాచి మేనెల్లఁ గరగింపఁ♦దలఁచి యత్తి
లోత్తమకు నల్ప రప్పించి ♦ యొనరునట్టి, దాన నిపుడెన్నఁ గొఱమాలు♦దానసైతి.

సత్యభామాపరిణయము, ఆ 3.

# స్వర్గలోకము

సీ. స్వాధ్యాయసంగీత ♦ సాహిత్యవర్తన, మాననీయము లగు ♦ మండపములుఁ
కోకిల శుక భృంగ♦కులనాదముల నభి, రామంబు లైనయా♦రామములును
హంస సారస రవా♦త్యంతమనోజ్ఞంబు, లై సొంపు మిగులుప♦ద్మాకరములుఁ
జారుమయూర కే♦కారుతకలితంబు, లగుచు నొప్పారు క్రీ♦డాచలములు
గీ. వీనులకుఁ గన్నులకు నింపు♦వెల్లిగొల్ప, నేర్పు గలిగినవిభవంబు♦నెఱయ మెఱయఁ
గరము విలసిల్లు చునికి నా♦కంబు వేడ్క, నయ్యెడకుఁ గాపువచ్చిన♦యట్లు లుండె.

భారతము, ఆ 2 పద్య 318.

మ. కనియెం బుణ్యజనౌకమున్ విగతరో♦గస్వప్నపీడాన్నఖా
దసనంశోకముఁ బుష్పపల్లవఫలో♦ద్దామద్రుమానీకమున్
స్వనితోద్ధూతపతాకముం బ్రవిచర♦ద్వైమానికానీకమున్
ఘనగంగాసలిలైకమున్ మఘవయు♦క్తశ్రీకమున్ నాకమున్. 424

భాగవతము, స్కం, 6 పద్య 444.

ఉ. నాకముఁ గాంచె నట్టియెడ ♦ నందనమందచరన్నితంబినీ
లోకము సంయమీంద్రధృతి ♦ లోపకలోలవిలాసమేనకా
లోకము వాసవేభమద♦లోలుపచంచలచంచరీకమున్
స్వీకృతసత్తపఃఫలవి♦శేషవిపాకముఁ బుణ్యలోకమున్. 425

విక్రమార్కచరిత్రము, ఆ 2 ప 82.

సీ. పదరువ్రటువహరి♦వాణంబుగలమేటి, బండికం ట్లేయూరి ♦ పారిబంట్లు
బిబ్బిరాచూలి సే♦లినచానమొదలైన, పడఁతుక లేయూరి ♦ పడుపుఁగొమ్మ

లేడె కాఁపురము వాని ♦ కుడియెడుగుం దమ్మి, తేనియ రోయియూరి ♦ తేటచెలమ
జేజేలకోరికల్ ♦ చేఁపెడినచ్చయావు, నిగిడ్డి గోయియూరి ♦ మందపసర
గీ. మిచ్చమానిక మేయియూరి ♦ రచ్చతొాయి, పైపైఁ బ్రాఁకు తేయియూరి ♦ పెరటిచెట్టు
లట్టి సురపురి యేలుచు ♦ నమరపతి మహోన్నతైశ్వర్యధుర్యుఁడై ♦ యొక్కనాఁడు.
చంద్రభానుచరిత్రము, ఆ 2 ప 66.

శా. కాంచె న్మౌనివరుండు ముందట నభో ♦ గంగాతరంగచ్ఛటా
చంచచ్చంచలచంచరీకచయపం ♦ చారంబు భూసంచయా
కించిద్బంధురగంధబాంధవమరు ♦ త్ఖేలాగవాక్షావళీ
ప్రాంచత్సౌధచరప్రియాన్వితసుప ♦ ర్వానీకమున్ నాకమున్. 427
సీ. వివిధధనాధ్వరో ♦ త్పన్నపుణ్యపరిపాక, ఫలభోగదేశమే ♦ పట్టణంబు
తావలంబై యొప్పు ♦ నేవీఁడు కల్పపాదపకామధేనుచిం ♦ తామణులకు
భువనత్రయాధిప ♦ త్యవిభూతి నొప్పు సుత్రామున కేప్రోలు ♦ రాజధాని
గరుడగంధర్వకి ♦ న్నరసిద్ధచారణాహీంద్రాదిసేవితం ♦ బే పురంబు
గీ. సకలసౌభాగ్యలక్ష్మిపరి ♦ శక్తినగరి, యగుచు నేపుటభేదనం ♦ బలరుచుండు
నట్టి యమరావతిని గాంచి ♦ యంతరంగమునఁ బ్రమోదంబునొందె న ♦ మ్మునివరుండు.
కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. నందనారామంబు ♦ నకు నాలవాలంబు, రమణీయతరసుధా ♦ రసము చెలమ
యైరావతమునకు ♦ నంచితావాసంబు, వినుతచింతారత్న ♦ మునకు భరణి
యుచ్చైశ్శ్రవంబున ♦ కున్నతమందుర, యని జన్మశూరుల ♦ కును ఖలూరి
కామధేనువునకుఁ ♦ గసవునించినగాఁడి, సవ్యాప్సరస్త్రీల ♦ నాట్యశాల
గీ. గరుడగంధర్వసిద్ధకి ♦ న్నరసుపర్వ, యక్షరక్షోహిదైత్యవి ♦ ద్యాధరులకు
రచ్చపట్టు శచీజాని ♦ రాజధాని,యై పొలుపుమీఱు నమరావ ♦ తీపురంబు. 429
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 ప 42.

సీ. వేదోక్తపద్ధతి ♦ వెలయంగ యాగంబు, లలవరించినసోమ ♦ యాజులకును
బగఱకు వెన్నిచ్చి ♦ పరవక సంగరక్షోణిఁ గూలిన మహా ♦ శూరులకును
సన్నదానాంబుదా ♦ నావనీదానకన్యాదానములు సేయు ♦ ననఘులకును
న్యాయంబుఁ దప్పక ♦ యఖిలభూప్రజలను, రక్షింప నేర్చిన ♦ రాజులకును
గీ. బారలౌకికఫలమై య ♦ పారమహిమ, నాహవశతైకయోగ్యమై ♦ యలరు త్రిదివ
మాహవశతంబు గావించి ♦ యాక్రమించె, నమరవరజేత పూర్వదే ♦ వాధినేత. 48
దశావతారచరిత్ర, ఆ 3.

ఉ. కోరినకోర్కు లిచ్చునఁట ◆ గోవును జెట్టును దాయి మేలిబం
గారఁటనేలయెల్లఁ ద్రిది◆వంబుల నప్సర మగ్రగణ్యమై
పేరిమి గాంచి మించునఁట ◆ వేయువిధంబుల జాగరూకుఁడై
యారసి ప్రోచు నాథుఁడఁట ◆ యచ్చటివారలభాగ్య మెట్టిదో. 431

ఉ. పాయనిజవ్వనంబుఁగల ◆ ప్రాయము సానలఁ దీర్చి యెవ్వరుం
జేయని నాఁడితూపులును ◆ జింగిరియాఁగిరిగాఁగ నెవ్వరున్
నేయని వల్వ లప్పులను ◆ నిప్పుల వండనివంటకంబులున్
మాయని కన్ను లన్నగరి ◆ పోఁడుము లెంతయు వింతలై తగున్. 432

మ. తనకే మున్నగ మ్రొక్కి యూర్వసి వథూ◆త్తంసం బటం చొక్కఁడుం
దనకే కల్పఫలం బొసంగెఁ దొలుదొ◆ల్తన్ గంధ యం చొక్కఁడుం
దనకే మేనక మేనమున్నలఁదె గం◆ధం బంచు వేఱొక్కఁడుం
దనియుం గర్మసురాళిలో నచట ధ◆న్యంమన్యభావంబునన్. 433

సీ. స్వాశ్రితావనము సే◆యక యన్యులను బ్రోచు, భూపమల్ సొరరాని ◆ భువన మెద్ది
యుపకారవిముఖులై ◆ యపకారము లొనర్చు, మూర్ఖులు సొరరాని ◆ భువన మెద్ది
పరగుణస్తుతికిఁ బా◆ల్పడక నిందలు సేయు, ముష్కరుల్ సొరరాని ◆ భువన మెద్ది
స్వమతవిమతులై ◆ పరమతాశ్రయులైన, యవగుణుల్ సొరరాని ◆ భువన మెద్ది
గీ. త్యాగభోగంబులకుఁగాక ◆ ధనముఁ గూర్చి, పొసఁగు లుబ్ధులు సొరరాని◆భువన మెద్ది
యద్ది దనకద్దిగనక వి◆త్యాసపాయి, మోదభవనము శ్రీస్వర్గ ◆ భువన మొప్పు. 434

మహేంద్రవిజయము, ఆ 3 ప 9, 18.

## వైకుంఠము

సీ. నారాయణునిదివ్య◆నామసంకీర్తనం, బనిశంబుఁ జేయు మ◆హాత్ములకును
బద్మాక్షుశ్రీపాద ◆ పద్మంబు లత్యంత, భక్తిమైఁ బూజించు ◆ ప్రాజ్ఞులకును
విశ్వరూపునిమూర్తి ◆ విభవంబు నేకాగ్రి, బుద్ధిభావించు స◆త్పురుషులకును
లక్ష్మీశ్వరుని సము◆ల్లాసహేతువులగు, వ్రతములు సల్పు స◆ద్వర్తనులకు
గీ. భవముకేతనతుది వచ్చి ◆ భవ్యసుఖము, లనుభవింపంగఁ దగు నెల◆వగుటఁ జేసి
యఖిలవస్తుపరంపరలకు ◆ నాకరంబు, గుణవిధావిభాసురము వై◆కుంఠపురము. 435

నృసింహపురాణము, ఆ 1 ప 45.

సీ. మార్తాండచంద్రానల◆స్ఫురణలఁ జొరనీక, నిజదీధితిస్ఫూర్తి ◆ నివ్వటిల్ల
దివ్యమణిప్రభా◆వేదిక సౌధవిమానగోపురహర్మ్య ◆ మండపములఁ

బ్రసవగుచ్ఛస్వచ్ఛ ♦ భరితకామితఫల, సంతానపాదప♦సముదయములఁ
గాంచనదండసం♦గతమారుతోద్ధూత, తరళవిచిత్రకే♦తనచయముల 436
గీ. వికచకైరవదళదర ♦ విందగతమ,రందరసపానమోదితేం♦దిందిరప్ర
భూతమంజులనినదప్ర♦బుద్ధరాజ, హంసశోభితవరకమ♦లాకరముల
సీ. వల నొప్పఁగా నదై♦వం కేశవాత్పర,మ్మని, పల్కు రాజకీ♦రావళియును
మహిమ జగద్విష్ణు ♦ మయ మఖిల మ్మని, చదివెడు శారికా ♦ సముదయంబు
దీపారఁగా జితం♦తే పుండరీకాక్ష, యని లీలఁ బాడుపి♦కావళియును
లలిమీఱఁగా మంగ♦ళం మధుసూదన, యనుచుఁ బల్కెడు మయూ♦రావలియును
గీ. దవిలి శ్రౌషడ్వషట్స్వ♦ధాత్యాదిశబ్ద, కలితముగ మోయు మధుపని♦కాయములును
గలిగి యఖిలైకదివ్యమం♦గళవిలాస, మహిమఁ జెన్నొందు వైకుంఠ ♦ మందిరంబు.
భాగవతము, స్కం. 2 పద్య 227, 228.
సీ. రవిచంద్రతారక ♦ ప్రభలు వర్తిల్లక, దివము రాత్రియు లేక ♦ దేజరిల్లు
హారచతుర్ముఖ సురేం♦ద్రాదుల కైనను, నప్రవిష్టద్వార♦మై వెలుంగు
నెట్టి కేలకు నందు ♦ వేఁగినవారలు, మగిడి రా రెన్నఁడు ♦ మాననీయ
హరిపదాబ్జధ్యాత♦లగు మహాయోగీంద్ర, విప్రాలయంబులు ♦ వెలయుఁ బెక్కు
గీ. లఖిలభోగాఢ్యమై నిత్య♦మై వెలుంగు,నట్టి వైకుంఠనిలయవి♦ఖ్యాతిఁ బొగడ
వేదవిదులకు బ్రహ్మకు ♦ వేదములకు, నమరవరులకు నాకును ♦ నలవి యగునె. 438
గీ. త్రివ్వి చూచినఁ గాని ర♦త్నములె కాని, యన్యసుగుణాలు వోడగాన ♦ మప్పురమునఁ
దగువు లెల్లను సంతాన ♦ తరులె కాని, మందునకునైన నొండొక ♦ మ్రాను లేదు.
సీ. వెలయ నమోవిష్ణ♦వే ప్రభవిష్ణవే,యని చెలంగెడు శుకా♦ధ్యయనములును
గోరినమోనమో ♦ నారాయణాయని, రాజిల్లు కలకంఠ ♦ కూజితములు
కెరలి హరే కృష్ణ♦కృష్ణ మాధవయని, భోరున నెలుఁగించు ♦ శారికలును
ననిశంబుఁ బ్రణవార్థ ♦ మభ్యసించుచు సామ,గానంబు సేయుభృం♦గములయు ళివు
ఆ. గలిగి సకలకాల ♦ ఫలపుష్పఫలితమై, కల్పవృక్షసమితిఁ ♦ గరము మిగిలి
హరివిహారయోగ్య♦మై సంతతశ్రీల, నొప్పు నప్పురంబు ♦ నుపవనములు. 440
పద్మపురాణము, ఆ. 5 ప 132, 148.
సీ. ఘటమంచుఁ బటమంచుఁ ♦ గారయుక్తులఁ బెంచు,దుష్టతార్కికులకు♦ దూరమగుచు
శ్రుతియంచు స్మృతులంచు♦ శుష్కకర్మములెంచు,మీమాంసకులక ప్ర♦మేయమగుచు
ఝరియించు ఘరయంచు ♦ జనులవీనుల నొంచు, శబ్దైకరతుల క♦సాధ్య మగుచు
ద్వైతయంచు నిషయంచు♦విషయోక్తిఁ గలహించు,నద్వైతవాదులక♦సాధ్య మగుచుఁ

గీ. కృష్ణవిష్ణుహృషీకేశ ♦ కేశవ యను, భక్తిన కొకప్పుడును దుర్ల ♦ భంబు గాక
పరఁగుఁ బ్రకృతివికారదు ♦ స్పర్శతరము, గుణతరానందదుర్ధరము వై ♦ కుంఠపురము.
కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 220.

సీ. నునుగాలి దూదిపా ♦ నుపు లెన్నియో కాని, యందఱు శమనీకృ ♦ తాహివరులు
సురలోకవాహిని ♦ ర్ఝరము లెన్నియొ కాని, యందఱు దివ్యతీ ♦ ర్థాంబుపదులు
నీటఁ జనించుమా ♦ ణికము లెన్నియొ కాని, యందఱు కౌస్తుభ ♦ హారయుతులు
చలివేఁడివెలుఁగుల ♦ సాము లెందఱో కాని, యందఱు నిందుక ♦ ంజాప్తదృశులు
గీ. ఖగకులాధీశు లెందఱు ♦ కలరొ గాని, యందఱును బుల్గుగా నెక్కి ♦ యములవారు
వారువోసినరీతి సు ♦ జ్ఞానధీరు, లన్నగరియందుఁ గాపురం ♦ బున్నవారు. 442
ఘటికాచలమాహాత్మ్యము, వ 25.

సీ. పదియాఱువన్నెల ♦ బంగారమే కాని, యితరలోహంబు లిం ♦ దెందు లేవు
నవనీయముగ మించు ♦ నవరత్నములె కాని, యితరోపలంబు లిం ♦ దెందు లేవు
కామితార్థము లిచ్చు ♦ కల్పంబులే కాని, యితరభూరుహము లిం ♦ దెందు లేవు
శ్రుతివచోరచనమిం ♦ చువిహంగములె కాని, యితరఖగంబు లిం ♦ దెందు లేవు
గీ. సరసిరుహనాభ సారూప్య ♦ ధరులె కాని, యితరులైనట్టి వార లిం ♦ దెందు లేరు
తరమె యెంచ గుణాకుంఠ ♦ తరము ముక్తి, గురుకుచాకుంఠసరము వై ♦ కుంఠపురము.
దశావతారచరిత్ర, ఆ 3.

సీ. కమలాక్ష గోవింద ♦ కమలేశ యని పల్కు, కమనీయతరశారి ♦ కాశుకములు
నారాయణ ముకుంద ♦ శౌరే హరే యంచు, చెలరేగిపల్కు కో ♦ కిలకులంబు
చక్రపాణిగదాసి ♦ శార్ఙ్గపాణీయని, సారెకుఁ బల్కు మ ♦ యూరచయము
నారాయణాత్పరం ♦ నాస్తిదైవ మటంచు, లలిని బల్కెడి మరా ♦ ళవ్రజంబు
గీ. గలిగి కిసలయసమగుచ్ఛ ♦ ఫలమధుప్రవాహములఁ బూర్ణమైయుండి ♦ వరలుకనక
వృక్షసంఘాంచితారామ ♦ విసరమొప్పు, నారదాధీశపురరాజ ♦ మందుఁగనఁగ. 444
భార్గవపురాణము, ఆ 1.

సీ. పదియునా ఱేఁడులు ♦ ప్రాయంబునఁ జెలంగి, కమనీయతనువిలా ♦ సముల మీఱి
పద్మాక్షుకైంకర్య ♦ పారవశ్యామోద, భోగులై తనరారు ♦ పురుషవరులు
వరవయోవిహితయా ♦ వనరూపముల నొప్పి, పాలుపొందుశృంగార ♦ ములఁ జెలంగి
శార్ఙ్గిపత్పద్మపాద ♦ పల్లవాగ్ర్యభక్తిపూర్ణలై చెన్నారు ♦ పుణ్యసతులుఁ
గీ. గలిగి పగయు వగయుఁ ♦ గలుషంబు ముదిమియు, నెగులు తెగులు లేక ♦ నిత్యభూతి
గలరి మోక్షలక్ష్మి ♦ కాధారభూతమై, యతులమై వెలుంగు ♦ నప్పురంబు. 445
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 18.

# కైలాసము

సీ. రసరసాయనసుధా ♦ రసనిర్ఝరంబులై, క్రమ్మంగ నలరారు ♦ కల్పతరులఁ
బరుసవేదులఁ బొంది ♦ హరికాంతిశిఖిఁ గ్రాఁగి, కనకంబులగు నయః♦స్కాంతశిలల
సురుచిరౌషధితృణ♦జ్యోతిప్రభాలీల, మాయించి వెలిఁగెడు ♦ మణిగణముల
బహులచింతామణి ♦ ప్రాసాదవృతభూమి, జాంబరజానసా♦సాంగణాగ
గీ. మాలికాంగలతానంద ♦ మందిరముల, క్రమ్మఁ బండలు సేతులను ♦ మహఁగిరీశు
సిద్ధవిద్యాధరామర ♦ స్త్రీవిలాస, భాసితంబగు కైలాస ♦ పర్వతంబు. 446

కుమారసంభవము, ఆ 6 ప 979.

సీ. ఈకొండ సెలయేఱు ♦ లీశ్వరువృషభంబు, గోరాడుకూలము♦ల్గూడియొత్తు
నీగిరికుంజంబు ♦ లిందుశేఖరుదేవి, మెచ్చుపూఁబఱపులు ♦ మెఱయ మెఱయు
నీయద్రినెత్తంబు ♦ లీశతాండవరంగ, భూములై యసమాన♦భూతిఁ దనరు
నీపర్వతముతోఁట ♦ లిభదైత్యదమనుపూ,జకు భృంగి కోయు పు♦ష్పములు పూచు
గీ. నీనగంబు క్రేవలు ప్రమ♦థేశ్వరులకు,రుద్రకన్యాసహస్రంబు ♦ రుచిరకేళి
నలర నెలవులై యెంతయు ♦ నమరు ననిన, బొగడఁదగదె యీరాజత♦భూధరంబు.
గీ. తలలు దఱిగిపూజించిన ♦ దర్పలీల, నెసఁగు వీరుఁడునీశైల ♦ మెత్తఁబోయి
బాహుళిఱుకంగఁ దాల్మిని ♦ బాసికూసె, దీనిగౌరవంబునకద్ది ♦ మానమరయ. 448

హరివంశము, ఉత్తర. ఆ 6.

ఉ. భాసురలీలఁ గాంచిరి సు♦పర్వులు భక్తజనైకమానసో
ల్లాసముఁ గిన్నరీజనవి♦లాసము నిత్యవిభూతిమంగళా
వాసము సిద్ధగుహ్యకని♦వాసము రాజితభూవికాసికై
లాసముఁ గాంతినిర్జితకు ♦ లక్షితిభృత్సుమహాద్విలాసమున్. 449
సీ. ధాతువిచిత్రితో♦దాత్తరత్నప్రభా, సంగతోజ్జ్వలతుంగ ♦ శృంగములును
గిన్నరగంధర్వ ♦ కింపురుషాప్సరో,జననికరాకీర్ణ ♦ సానువులును
మానితనిఖిలవై♦మానికమిథునస,ద్విహారణైకశుభప్ర♦దేశములును
గమనీయనవమల్లి ♦ కాసుమనోవల్లి, కామతల్లీలస♦త్కందరములు
గీ. నమరసిద్ధాంగనాశోభి♦తాశ్రమములు, విబుధజనయోగ్యసంపన్ని♦వేశములును
గలిగి బహువిధపుణ్యభో♦గముల నొప్పు, వినుతసుకృతములకుదండ ♦ వెండికొండ.
శా. ఆవిద్యాధరభర్త గాంచె హరనీ♦హారామృతాహాసమున్
శ్రీవిభ్రాజితమున్ నిరస్తగిరిజా♦సేవాగతాయాసమున్

కేవాసీకవికాసమున్ శుభమహా♦దేవాంఘ్రిసంవాసమున్
భూవిఖ్యాతవిలాసముం ద్రిభువనీ♦పూతంబుఁ గైలాసమున్. 451

భాగవతము, స్కం. 4, 6 పద్య 133, 134, 485.

సీ. గంధర్వకామినీ ♦ గానంబు విని తల, లెత్తి యూఁచెడుభుజ♦గేంద్రములును
భుజగఫణారత్న♦ముల దీధితులఁ బ్రకా, శించుతమస్సహా♦శ్లిష్టగుహలు
గుహలప్రతిధ్వనుల్ ♦ ఘుమఘుమయనఁ బాఱు, నిర్మలోదకముల ♦ నిర్ఝరములు
నిర్ఝరతటముల ♦ నిరుపాధికసమాధి, యోగనిద్రారతి ♦ నుండుమునులు
గీ. మునులతపములు నిర్విఘ్న♦ముగ ఫలింప, భక్తిరక్షించుకొనివచ్చు ♦ ప్రమథగణము
ప్రమథగణభామినీయుత ♦ పార్వతీవి, లాసములు గల్గి దనరు కై♦లాసనగము. 452

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 4 ప 152.

# సత్యలోకము

ఆ. అనఘ యింద్రలోక♦మునకంటె మీఁద ని, శ్శోక మగుచు బ్రహ్మ♦లోక మమరు
నది యనన్యదీప్త♦సదన మై తనదైన, వెలుఁగునను జగంబు ♦ వెలుఁగఁ జేయు. 453.
చ. మనువులు ధాతలున్ మునులు ♦ మానుగ నుండుదు రందు లోభముం
గినుకయుఁ దాపముం బగయుఁ ♦ గిల్బిషమున్ ఘనదుఃఖవైకృతం
బును జనియింప వీభువన♦ముల్ దెగునప్పుడు నాశ మొందద
ద్వినుతపదంబు దానియెడ ♦ వేడుక సేయుదు రింద్రముఖ్యులున్. 454

భారతము, ఆర. ఆ 6 పద్య 132, 133.

సీ. ఉపసృష్టిక్రమమెల్ల ♦ నొప్పించి బహుమాన, మంది వచ్చినకర్ద♦మాదిబుధుల
జనులకర్మశరీర ♦ సంఖ్య లెల్ల దినాంత, కము వేసి లిఖియించు ♦ కరణికులను
దమతమయాధిప♦త్యములు దీర హజార, మందుఁ గాఁపున్న యిం♦ద్రాదిసురుల
వినికి వేళ యటంచు ♦ వీణలతంత్రులు, సారించు తుంబురు ♦ నారదులను
గీ. దానవరసలు పెంచు గం♦ధర్వగాయ, కులను జతగూడునట్టువ♦కులము వారిఁ
గాపెగట్టువియచ్చర♦కంబుకంధ, రలను జూచుచుఁ గన్యాంత♦గములు గడచి. 455

దశావతారచరిత్ర.

సీ. ఏప్రోలువాణీవ♦శీధితాశోకంబు, శోకంబు మోదంబు ♦ సుడియ దెందు
ఏపురిరవికోటి ♦ ఘృణియుతాభోగంబు, భోగంబు మోక్షంబు ♦ పొసఁగు నెందు
ఏపురంబంబర ♦ శ్రీపరమాకల్ప, మాకల్పము వసింతు ♦ రార్యు లెందు
ఏపూర్వమతల్లి యు♦హీనతరానంద, రానంద దఘకర్మ♦రతుల కెందు

గీ. సంతతవసంతసరసర♦సాలసాల, ఫలరసాలోలకీరాది♦పత్త్రిజాల
గదితబుగ్యజుషంబు ని♦ష్కల్మషంబు, నగుచు నవ్విధు లోకము లే♦కలుగు నెపుడు
అహల్యాసంక్రందనము, ఆ 1.

## సత్యలోకమునఁగలనాట్యశాల

సీ. తోరంపుసాంబ్రాణి♦ ధూపధూమము గట్టు, పగడాలబాబాల♦ బాగుపేర్మి
బంధురమురజాది♦ ధింధిమిధ్వానంబు, బహుళగర్జావిజృం♦భణము నెఱప
వేలుపుమిన్నల♦ వివిధభూషణకాంతి, శక్రచాపస్ఫూర్తి♦ సవరింపఁ
దిరువులఁగట్టించి♦ తీవలమైదీఁగలు, క్రొక్కారుమెఱుఁగుల♦ కోపుఁజూపఁ
గీ. బుష్పవర్షంబు వడగండ్ల♦ పోలుపుఁ దెలుప, సారమృదుగీతికామృతా♦సారమెసఁగ
వర్షవేళను బోలు స♦త్యవనజభవుని, నాట్యశాలను దరిసె దా♦నవవిభుండు. 457
దశావతారచరిత్ర.

## స్వర్గమందలిదోషములు

గీ. ఇందుఁ జేసినపుణ్యంబు♦ లెల్ల నందుఁ, గుడుచుఁ గానిమర్త్యలోకమందుఁ♦గడఁగిపుణ్య
మాచరింపంగఁ గాదు పు♦ణ్యావసాన, మగుడు భూమిక ద్రోతురు♦ మగుడ నతని.
క. కడు మరఁగిన సౌఖ్యంబులు, విడుచుటఁ జిత్తంబు దుఃఖవివ♦శము గ మహిం
బడుఁ జూవె పుణ్యలోకం, బెడలిన మనుజుండు జేజ♦ పేది యపులుఁ డై. 459
భారతము, ఆర. ఆ 6 పద్య 135, 136.

## ఇహపరలోకతారతమ్యము

క. ఇది కర్మభూమి భోగా,స్పద మాలోకమ్ము ధర్మ♦పరులకు సులభం
బది సత్యశౌచసౌజ,న్యదయాదులు లేనివారి♦ కప్రాప్య మగున్. 460
క. ఈలోకము దుఃఖబహుళ, మాలోకము భూరిసుఖని♦రంతర మం దే
జాలియును లేక యొండొరు,తో లెస్సఁగఁ బొందియుండు♦దురు జను లనఘా. 461
గీ. హస్తిహయశకాంతరము గల♦ దరసిచూడ, వాసగృహశయనాసన♦ వసనగంధ
మాల్యతౌర్యత్రికారామ♦ మానినీజ,నాదిసుఖసాధనములకు♦ నందు నిండు. 462
భారతము, శాంతి. ఆ 4 పద్య 110, 111, 112.

## భువనములు

గీ. సాల మున్నతి భూర్భువ♦స్స్వర్మహర్జ, నసుతపస్సత్యములు మీఁదు♦ నైన నతల
వితల సుతల తలాతల♦ తతి రసాతలము మహాతల బలిసద♦నము లెఱుంగు. 463
హంసవింశతి, ఆ 5 ప 91.

## —♦ బ్రహ్మవిష్ణుమహేశ్వరలోకములు ♦—

క. ముందటిది బ్రహ్మలోకము, సందర్శింపుము త్రినేత్ర♦శర్మ! ధరిత్రీ
బృందారక! యిది పరమా,నందస్థానంబు ద్రుహిణు♦నకు నెల వగుటన్. 464
గీ. ఊర్ధ్వ కెనిమిది కోటుల ♦ యోజనముల, పొడువునందుండు నీధాత్రు♦భువన మనఘ
యాప్రమాణంబునసయుండు ♦ నిందుమీఁద, విష్ణులోకంబు సతతవ♦ర్ధిష్ణు వగుచు
ఆ. సంశితాచారపర! దాని ♦ సంస్తుతింప, మాకగా దచ్యుతునకుఁ దా♦మరసభవున
కైన శంభున కైనను ♦ నహివిభునకు,నైన గీష్పతికైనను ♦ నలవిగాదు. 455
కాశీఖండము, ఆ 4 ప 288, 292.

## —♦ సూర్యలోకవర్ణనము ♦—

సీ. సిద్ధాంతసంశుద్ధి ♦ సిద్ధసంఘాతంబు, విధ్యుక్తపరిపాటి ♦ విబుధకోటి
చాటుధారాప్రౌఢిఁ ♦ జారణవ్యూహంబు, కిన్నరవ్రాతంబు ♦ గీతసరణి
ఖచరసంఘము విశ్వం♦ఖలవచోవైచిత్రి, యాతుధానశ్రేణి ♦ యధికభక్తి
గరుడలోకము నమ♦స్కారవాక్యంబున, నేకాగ్రమతి దండ ♦ శూకసమితి
గీ. ప్రతిదినంబును బ్రాతరా♦రంభవేళ, నిర్నిబంధననిరుపాధి ♦ నిరవగాధ
నిర్ణిరోధనిరాఘాట ♦ నిరుపమాన, భక్తిసంభజియింతు రీ♦ పద్మబంధు. 466
సీ. సంచారలీలఁ డో ♦ జగదుపక్రియకునై, సమధికస్థైర్యంబు ♦ జరుపుఁ గాని
జనులదృష్టికి వెక్క♦సంబై విభాసిల్లు, లోకచైతన్యంబు ♦ నీనుఁ గాని
సంతాపహేతువౌ ♦ సంయమిశ్రేణికి, నిర్వాణలీల యీ ♦ నేర్చుఁ గాని
ఖరరుచిత్వముఁ బూను ♦ గాలక్రమంబున, శీతలామృతమువ♦ర్షించుఁ గాని
గీ. ప్రాగవస్థాభ్యధికతరో♦పర్యవస్థ, నతిశయిల్లుచు భువనంబు ♦ లఖిలములును
వారకత్యంతసత్కృపా ♦ వైభవమున, ననఘ! రక్షించుచుండు నీ♦ యబ్జహితుఁడు.
కాశీఖండము, ఆ 3 ప 174, 175.

## —♦ చంద్రలోకము ♦—

సీ. ఆవేశచూర్ణంబు ♦ లఖిలేంద్రియములకు, శృంగారరసమును♦జ్జీవనములు
శంబరాంతకభుజా ♦ జయకీర్తిమహిమలు, కోకదంపతికి దృ♦క్కూలశిఖలు
బ్రహ్మాండపురవీథి ♦ రత్నతోరణములు, యామినీకర్పూర♦హారలతలు
నీరజాధ్యాంభోజి ♦ నీవిసాంకురములు, కుముదకాననముల ♦ కూర్మిచెలులు
గీ. గగనకంఠాట్టహాసంబు ♦ గర్వరేఖ, కైటభారాతినవనాభి ♦ కమలశోభ
చంద్రికలు గాయుచున్నవి ♦ సాంద్రలీల, భువనమిదిమొద్దిపనమభా♦గవతులార.

మ. మధురాపట్టణవిప్రముఖ్య! శివశ♦ర్మా! వేదశాస్త్రాగమాం
బుధిచంద్రోదయ! చంద్రలోకమిది యీ♦ప్రో లేలుచుండుం గళా
నిధి యాత్మీయమయూఖకందళశిఖా♦నిష్ఠ్యూతధారాసుధా
విధులన్ భానుగభస్తితప్తమగు నీ♦విశ్వంబు రక్షించుచున్. 469

కాశీఖండము, ఆ 4 ప 169, 171.

## —♦ అంగారకలోకము ♦—

తే. పాంచముద్రమహాస్థాన♦పదమునందుఁ, గంబళాశ్వతరేశోప♦కంఠభూమి
నిష్ఠ నంగారకేశుఁ బ్ర♦తిష్ఠ సేసి, కాంచె నీలోకమేలఁ గం♦గారకుండు. 470

కాశీఖండము, ఆ 4 ప 245.

## —♦ బుధలోకము ♦—

సీ. ప్రతిబింబమో కాని ♦ రజనివల్లభుని క,ధ్యాహారమో కాని ♦ యమృతరుచికి
వినిమయంబో కాని ♦ విధున కన్యాదేశ,మో కాని యత్రినే♦త్రోద్భవునకు
వీప్సమో కాని భూ♦విలు కానిసఖునకు, నామ్రేడితమొ కాని ♦ యబ్ధిజునకు
నభినాంతరమొ కాని ♦ యరవిందవైరికి, సారూప్యమో కాని ♦ చంద్రునకు
గీ. ద్రుమిక యీడ్చినవాఁడు భ♦ర్గునికిరీట,కోటి కాభరణంబైన ♦ కువలయాప్తు
మిగులఁజక్కనికొడుకండ్రు♦మింటినడుమ, గ్రహములందీతఁ డెవ్వండు♦గణములార.

కాశీఖండము, ఆ 4 ప 191.

## —♦ బృహస్పతిలోకము ♦—

క. అదె వీక్షింపు బృహస్పతి,పదము ధరామరవరేణ్య ♦ బహువిధశుభసం
పదలకు నాస్పద మీతఁడు, చదివినవాఁ డర్థశబ్ద♦శాస్త్ర మఖిలమున్. 472

కాశీఖండము, ఆ 4 ప 247.

... ... ... ... ... ... ...

## —♦ శనైశ్చరలోకము ♦—

ఉ. పాండురపద్మలోచనుని ♦ పార్శ్వగులార! మహాత్ములార! మా
ర్తాండసమానులార! యిదె ♦ ప్రాంతమునందు సముజ్జ్వలప్రభా
మండలమధ్యవర్తియు స♦మగ్రవిలాససమన్వితంబునై
రెండవనాగలోకమన ♦ దృష్టికి నింపొనరించె నెంతయున్. 473
గీ. సంశితవ్రత! యిది శనై♦శ్చరునిలోక, మితఁడు గ్రహములలోనెల్ల ♦ నతిబలిష్ఠుఁ
డిమ్మహాత్ముని సుచరి♦త్రమ్ము వినుము, విశదముగఁ జెప్పెదము నీకు♦విస్తరించి.

కాశీఖండము, ఆ 4 ప 258, 259.

## ——♦ నిరృతిలోకము ♦——

గీ. తీర్థములయందు విధి మూఁడి♦ తెగినపుణ్యు,లనఘ!యీలోకమునను దు♦రాత్మహననె
మొక్క కాశీపురంబునఁ ♦ దక్కనొందు,తీర్థములయందుఁబాపంబు♦దెచ్చునంద్రు
సీ. వింధ్యాద్రిసదుమప నీ♦ర్వింధ్యాతటంబునఁ, గానలో నొక్కప♦క్కణము గలదు
పింగాక్షుఁ డనియెడు ♦ పేరివాఁ డావెంటఁ, బల్లె యేలెడు భిల్ల♦పరివృఢుండు
గూరకర్మపరాఙ్ము♦ఖుం డక్రూరాత్ముండు, వ్యాఘ్రాదిదుష్టస♦త్త్వములఁ దక్క
దండింపఁ డితరస♦త్త్వముల నేనాడుల, బాటతీఱుమార్గంబు ♦ నందబ్రతుకు
గీ. విశ్వసించిన నీవు ద్రా♦వినను నిద్ర,పోయినను జాలుకొన్నను ♦ బొర్లుచున్నఁ
దెవులుపడ్డను గుంటైన ♦ దిట్టుచెడినఁ, జంపఁ డనుకంప నెట్టిహిం♦సయుంబు నైన 376
సీ. ఫలమూలముల వాము♦పక్వాశనంబుల, దధిపయఃక్షౌద్రాజ్య♦తక్రములను
శిశిరాంబువులఁ దృప్తి♦నేయుసంబడమిచ్చుఁ, బాదరక్షలునాత♦పత్త్రములును
దాళవృంతములు వ♦స్త్రములు గోవణములు, నొసఁగురోగార్తుల♦నుపచరించుఁ
దస్కరబాధనొం♦దకయుండ నెడలైన, యటవీస్థలంబున ♦ ననుపుఁ బెట్టుఁ
గీ. తీర్థములు పోవువారికి ♦ దివసదివస, మటు విశేషించి కాశికి ♦ నరుగునట్టి
పుణ్యులకుఁజేయుసత్కార♦ములునెరవుగఁ,బింగళాక్షుండుశబరరా♦ట్పుంగవుండు.
గీ. సంతతంబును నాశీర్వ♦దింతురతనిఁ, దీర్థముల కేఁగువారు సం♦తృప్తి నొంది
యగ్నిహోత్రాంతములను జ♦పాంతములను,భోజనాంతములనుదృప్తి♦పూర్వకముగ.
క. దక్షతనివ్యథమునఁ బిం,గాక్షుఁడు సంతతముతీర్థ♦యాత్రాపరులన్
రక్షింపు నటవి నగరస,దృక్షంబై యుండెఁ గొన్ని♦దినములు పేర్మిన్. 479

కాశీఖండము, ఆ 4 ప 58, 63.

## ——♦ వరుణలోకము ♦——

గీ. వరుణదేవునిలోకంబు ♦ ధరణిదేవ, యిందు నుండెడు పుణ్యాత్ము ♦ లెవ్వ రనిన
వాపి కాకూపకాసార♦వారిపద్మ, వాటికోద్యానకల్పనా♦వ్యాప్తిపరులు. 480
సీ. తరుణేందుమౌళిపై ♦ ధారాంబుకుంభంబు, నియమవ్రతంబుగా ♦ నిలిపినారు
తనియఁ దియ్యనిపంచ♦దారపానకములు, భూసురోత్తములకుఁ ♦ బోసినారు
చల్లఁగా నెడరుచోఁ ♦ జలిపందిరులు వెట్టి, యధ్వనీనులదప్పి ♦ యార్చినారు
దీర్ఘయాత్రాపరా♦ధీనమానసులకు, నుదకుంభ్యుపానట్టు ♦ లొసఁగినారు
గీ. వెల్లిలో వేయుపాయంబు♦ వెంటనైన, మునుఁగకుండంగ జంతువు ♦ మనిచినారు
గారవంబునవరుణలో♦కంబునందు, నిండువేడుక సుఖియించు♦చుండువారు! 481

గీ. పుణ్యతటినుల కవతార♦భూములందు, శిలలసోపానపంక్తులు ♦ చేర్చి నీట
జనులసంక్లిష్టి విడిపించి ♦ పనిచినారు, వరుణలోకంబునందున్న♦వారలనఘ! 486
కాశీఖండము, ఆ 4 ప 65, 67.

## —♦ ఈశానలోకము ♦—

గీ. అలకయావలమహోదయ♦మన్పురంబు, బ్రాహ్మణోత్తమ! యీశాన ♦ రాజధాని
యందు నుందు రజైకపా♦దాదులైన, పదియు నొక్కండ్రు రుద్రులు♦పాపిమదులు.
సీ. ఫాలభాగములనం♦బకము లందఁటికిని, నవతంసశశిరేఖ♦లందఱికిని
డమరుఖట్వాంగఖే♦టకము లందఱికిని, హస్తిచర్మపటంబు ♦ లందఱికిని
శ్యామకంఠప్రదే♦శమ్ము లందఱికిని, నాపవాహ్యవృషంబు ♦ లందఱికిని
బవమానభుక్కలా♦పంబు లందఱికిని, నాపాండుదేహంబు ♦ లందఱికిని
గీ. నందఱికి నగ్నితాపత♦త్తారకూట, పాటలచ్ఛాయఘనజటా♦బంధనములు
దేటగొనఁజూడు మీశాను ♦ దిక్కునందు, బ్రాహ్మణోత్తమ! రుద్రులు♦పాపిమదులు!
కాశీఖండము, ఆ 4 ప 164, 165.

## —♦ ధ్రువపదవర్ణనము ♦—

సీ. త్రైలోక్యమంటప♦స్తంభసంభారంబు, గగనలక్ష్మీకంఠ ♦ కనకభూష
బ్రహ్మాండకేతకీ ♦ పాదపప్రసవంబు, గంగాతరంగిణీ ♦ క్రౌంచఖగము
బలిదైత్యమథవాంఘ్రి ♦ పంకేజనఖరంబు, దారకావళితులా ♦ దండయష్టి
ధాతృలోకద్వార ♦ దంతకవాటంబు, గ్రహమండలీపశు♦గ్రామవేది
గీ. తారకాశింశుమారకా♦కారుఁడైన, యాదినారాయణునితోఁక ♦ యలఁతిచిప్ప
దప్పకీక్షింపు ధరణిబృం♦దారకేంద్ర, వివిధకల్పపరంపరా♦ధ్రువుని ధ్రువుని 489
కాశీఖండము, ఆ 4 ప 277.

## —♦ పాతాళము ♦—

సీ. అయుతయోజనసువ♦ర్ణాశ్వత్థగహనఖే,లత్పన్నగము వితల♦లంబు సొచ్చి
ఫలితకాంచనశమీ♦పాదపచ్ఛాయావి,లాసవాసము సుత♦లంబు గడచి
శాతకుంభరసాల♦సాలచిత్రాసేక,తరుసంకులము మహా♦తలము దాఁటి
మరకతమాణిక్య ♦ మయచందనద్రుకాం,తారాంతరము రసా♦తలము వెడలి
గీ. కనిరొ భోగవతీతీర ♦ వనవిహార, హాటకేశ్వరభవనడో♦లాధిరూఢ
గూఢపాతకన్యకాగాన♦గుంభమాన, తాళకోలాహలమ్ము పా♦తాళతలము. 490
జైమినిభారతము, అ 7 పద్య 70.

చ. విలసదనంతరత్నరుచి విస్ఫురిత భూగగనాంతరాళమై
బలవదహీనభోగిచయ భాసురపద్ధతి నాకలోకమై
సలలితచక్రిచారుతర సంశ్రయరూఢిసుధాంబురాశియై
బలినిజసద్మమై వెలసి ప్రస్తుతి కెక్కు రసాతలం బొగిన్. 491

షట్చక్రవర్తిచరిత్ర, ఆ 6 పద్య 16.

## నరకభేదములు

సీ. రౌరవం బనఁగ ధరాస్థలిక్రింద మహారౌరవం బన నవుల దాని
కావల విను కంటకావనం బన నుండుఁ, గ్రమవృత్తిఁ జేర్చు దుఃఖములు గలిగి
యగ్నికుండంబు నా నటు పంచకష్టంబు, నాఁ గలవిట్టున్న నరకతలము
లైదందు పాపక్రియాతారతమ్యంబు, లూహించి యంతకుం డునుపఁ బనుచుఁ
గీ. దగినయెడలఁ బాపాత్ములఁ దద్భటాళి, దహనకర్తనబంధన తాడనములఁ
బఱుప వారలఁ గుక్కలు గఱచుఁ గ్రిములు, దొలుచు గద్దలు నొప్పించు మండనిహతి.
ఉ. అమ్మెయిఁ బాపముల్ వొలియ నంతకు దుఃఖము లంది కీటజ
న్మమ్ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁ బొంది మృగత్వమానుష
త్వమ్ములఁ నోలిఁ బొందుదురు వా రినుమెంతయుఁ గ్రాఁగి కల్మష
త్వమ్ము దొలంగుమాడ్కి నవతామరసప్రతిమానలోచనా. 493

భారతము, ఆ 5 పద్య 170, 172.

గీ. రౌరవం బనఁగను మహారౌరవ మనఁ, గాలసూత్రంబు కుంభీపాకం బనంగ
నంధతామిస్రమనఁగ సంహార మనఁగ, నారకంబులు మఱియు నెన్నంగఁగలవు.

కాశీఖండము, ఆ 3 ప 155.

సీ. రౌరవంబును మహారౌరవంబును నసిపత్రవనము కాలసూత్రకూప
మంధతామిస్రలాలాంబు సేవనములు, కంటకంబు నధోముఖంబు కూట
శాల్మలియును విశసనమయఃపాత్రభంజనము తప్తాగ్నిసేవనము తైల
భాండమజ్జనమగ్ని కుండగోపనశిలాభక్షణంబులు క్రిమిభక్షణంబు
గీ. రాక్షసకరాళమును వికరాళమును వి,ధుంతుదము కుంభిపాకంబు ధూమగర్త
మనఁగ నిరువదియొక్కటి యైనయట్టి, ఘోరనారకబీభత్సకూపములను. 495

శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 8.

### రౌరవవర్ణనము

సీ. ద్విసహస్రయోజనవిస్తారమును జాను, దఘ్నంబునైన గర్తమున నుండి
యనలకణంబులు గనగనఁ గనలంగ, దారుణంబైన యా రౌరవంబు

నడుమఁ గింకరులచే ♦ విడువంగఁబడి వడి,నొఱలుచు నలుగడఁ♦ బఱవఁ జరణ
యుగము నీఱగుచును ♦ మగుడంగ మొలచుచు, నుండ హాహాకృతు♦లుడుగక దర
ఆ. ఘోరదుఃఖ మొక యహోరాత్రమవ్వేయి♦ ననుభవించి యంత ♦ నచట వారు
వేయియోజనముల ♦ వెడలుపుగలవహ్ని,యందు జిట్టుమైతు♦రలని సెత్తి.
మార్కండేయపురాణము, ఆ 2 ప 48.

## ——♦ మహారౌరవవర్ణనము ♦——

సీ. విను చతుః, పంచయో♦జనవిస్తృతమ్మును, దామ్రమయమునైన ♦ దారుణాగ్ని
తప్తమై విద్యుదు♦ద్దామప్రభాజాల, దేదీప్యమానమై ♦ తేఱిచూడ
రాక యత్యంతభై♦రవమగుచుండు మ,హారౌరవంబందు ♦ యమునిభటులు
కాళ్లుసేతులుపట్టి ♦ కట్టివైచినఁ బడి, వృకములుం బకములు ♦ వృశ్చిక మశ
గీ. కములు గాకు లులూకముల్ ♦ గ్రద్దలు దిన,నఱచుచును దహ్యమానులై ♦ యతులదుఃఖ
మనుభవించి వెడలుదురు ♦ హాయనాయు, లార్జితంబైన దుఃకృతంబు♦లడఁచి సతులు.

## ——♦ తమోనరకము ♦——

మ. అతిఘోరంబు తమోభిధాననరకం♦బందుండి దుష్కర్ములు
గ్రతమశ్శీతనిరుద్ధులై యొఱలుచున్ ♦ గంపించుచున్ క్షుత్తృషా
హతి వాపోవుచు శైశిరానిలవిభి♦న్నాన్యోన్యదేహోత్థశో
ణితమద్యంబులు ద్రావుచున్ నిరయవ♦హ్నిం గాంతు రేఁనస్థితిన్.

## ——♦ నికృంతననరకము ♦——

చ. అఱుద నికృంతనాఖ్యనిర♦యంబది యందుఁ గులాలచక్రముల్
దిరుగుచునుండు వానిపయిఁ♦ దెచ్చి యఘాత్ములఁ బెట్టి కాలకిం
కరు లొగిఁ గాలపాశములఁ ♦ గాళులనుండి శిరంబు దాఁక భీ 499
కరముగఁ దెంచుచుందురు ♦ ఖండము లెప్పటిరూపు దాల్పఁగన్.

## ——♦ అప్రతిష్ఠనరకము ♦——

గీ. అప్రతిష్ఠాఖ్యనరకంబు♦నందు దుష్టనరునిఁ ద్రిప్పుదు రొగిఁ గాంటు♦ఘములఁ గట్టి
పెక్కువేలేండ్లు నెత్తురుల్ ♦ గ్రక్కు లోఁచ,నములఁ బ్రేవులునరలివ♦క్త్రముల వ్రేలఁ.

## ——♦ అసిపత్త్రవననరకము ♦——

సీ. అసిపత్త్రవననిర♦యంబు సహస్రయో,జనవిస్తరము పటు♦జ్వాలనమయము
దానిమధ్యమున శీ♦తలమును ననిరూప, దలఫలకలితంబు ♦ బలవ దుగ్ర

సారమేయాయుతో • శ్వనసంకులమున్నై, పెనుపొంది యొక మహా • వనము వోలుచుఁ
పాపులాబహిరగ్నిఁ • బడి తనువులు గాలఁగ, వనముదావమగఁ జని • యనిలహతిని
గీ. రాలు నాకులతాఁకున • వ్రస్సి యొడళ్ళు లవనిఁ గూలంగఁ గుక్కలు • కవిసి కఱవ
బహువిధంబుల నలఁగుల • పడుదు రింకఁ, దప్తకుంభంబు దారుణ • త్వంబు వినుము.

## —• తప్తకుంభనరకము •—

క. ఉడుకఁగ యనలము మండఁగ, నుడుకుచు నూనియలు నిండి • యున్న కడవలన్
వడిదుష్కర్ములఁ గింకరు, లిడుదురు దలక్రిందుగాఁగ • నెత్తి యఱవఁగన్.
ఉ. తలలును నెమ్ములున్ బగుల • దందడిశోణితమజ్జతోయముల్
గలయఁగఁ జర్మమాంసములు • గ్రక్కున ముద్దలుగట్టఁ జీరి గ్ర
ద్దలు వడిఁ బీఁకఁ గింకరులు • దవ్వులఁ ద్రిప్పఁగఁ బ్రాణవాయువుల్
వెలువడకుండఁ బాపులను • వేఁతురు దారుణతైలవహ్నులన్.

మార్కండేయపురాణము, ఆ 2 ప 65–71.

## —• య మ కిం క రు లు •—

క. కింకరుల ధర్మరాజప, శంకరుల దురంతదురిత • సమధికజననా
శంకరుల సకలలోకభ, యంకరులం గనియె నింద్రి • యాకులుఁ డగుచున్.
క. ఘాతుకుల దండదండిత, పాతకుల మహోగ్రకర్మ • భరనిష్కరుణా
జాతసులఁ బ్రేతనాయక, దూతకసంతతుల నతఁడు • దూరమునందున్.
మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁ • కన్ రోమనిష్ఠ్యూతులన్
ఘనపీనోష్ఠవికారవక్త్రవిలస • ద్దర్వీకుణోపేతులన్
జనసంత్రాసకరోద్యతాయతసుపా • శశ్రేణికాహేతులన్ 505
హనసవ్యాప్తివిభీతులన్ ముపుర నా • త్మానేతలన్ దూతలన్.

భాగవతము, స్కం. 6 పద్య 68, 70.

# నరకలోకవర్ణనము

సీ. ఎఱ్ఱఁగాఁ గాఁగిన • యినుపకంబములతోఁ, గట్టినగమగమఁ • గమరువారిఁ
గ్రాఁగినవెడఁదమం • గలములఁ బొరఁటిన, పెల్లునఁ బెరపెరఁ • బ్రేలువారిఁ
గండలూడిగఁ జెక్కి • గంట్లను గొఱవులఁ, జూఁడినఁ జుఱచుఱ • స్రుక్కువారి
గుబ్బడాలు నైకాని • గుండెలు వ్రళ్ళంగ, మోఁదిన మురముర • ములుగువారి

గీ. ముడియకట్టుఁబ్రక్రియఁ గట్టు♦వడినవారి, నోలిఁ దలక్రిందుగా వ్రేలు♦చున్నవారిఁ
జూపి దుర్వర్తనములకుఁ ♦ జొరకు మనుచుఁ, జిత్రగుప్తుండు బుధులు♦ చెప్పిపుచ్చె.
దశకుమారచరిత్రము, ఆ 3 పద్య 16.

కవిరాజ. ఒక్కనిచేత నిమంత్రితుఁడై మఱి♦యొక్కనిశ్రాద్ధమునందు మెదన్
సుక్కకపోయి భుజించినవిప్రునిఁ♦జూడు ఖగంబులు చీరెడుఁ దెం
పెక్కిన సాధుజనంబులమర్మము♦ లెప్పుడు దూఱిగనాడుఖలున్
దొక్కి ఖగంబులు ముక్కున నంగము ♦ దూటులు పుచ్చుచునున్న వొగిన్.

సీ. కొండీనినాలుక ♦ రెండుగాఁ జీరెడు, నల ఖగంబులఁ జూడు ♦ మనుజనాథ
పూయమూత్రపురీష ♦ పూర్ణగర్తంబున, మునుఁగుచున్నాఁడుగ్రో♦ముఖత నొంది
జననీజనకగురు ♦ జనుల కవజ్ఞఁ జేసిన దుర్మదాంధుండు ♦ వినుము దేవ
తాతిథిపితృవహ్ని ♦ భూతపక్షిమిత్రాభ్యాగతభృత్యజ♦నావళులకు

గీ. నిడక యన్నంబు మును దాన ♦ కుడిచినట్టి, పాపకర్ముండు పర్వత♦ప్రతిమతనుఁడు
సూచిసూక్ష్మముఖుఁడునై ♦ క్షుత్పిపాస,నొంది చీమబంకయుఁ దాన♦ యున్నవాఁడు.

గీ. ఒక్కబంతిన విప్రున ♦ కొసగనట్టి, విమలభక్ష్యంబు లడిదినతండు ♦ వినుముడుచు
యాతిథితోనవచ్చిన ♦యతనికన్న,మిడక భుజియించి శ్లేష్మంబుఁ♦ గుడుచునితఁడు

ఉ. ఎంగిలితోడ గోవును మ♦హీసురవహ్నుల నంటినట్టివా
వెంగలి కేలుఁబుండశిఖి ♦ చేమఱుఁ గాల్చెద రట్లు కైరవా
పుంగమలాప్తుఁ జుక్కలను ♦ బోలఁగఁ జూచినవారికన్నులం
దింగలమిడ్డవారదె స♦రేశ్వర కర్మఫలంబు దప్పునే.

మ. జననిం దండ్రి సహోదరుం జెలియలిన్ ♦ జ్ఞాతిన్ గురున్ వృద్ధు వి
ప్రుని గోవున్ శిఖి నల్కఁదన్నినయతి ♦ క్రూరాత్ముపాదంబులన్
ఘనతీవ్రానలతప్తశృంఖలనొగిన్ ♦ గాఢంబుగాఁ గట్టి ప
ట్టినవాఁడుం దొడఁబంటినిప్పుకలలో ♦ డిందున్ మహీవల్లభా. 511

సీ. శాకమాంసము పాయ♦సము పులగంబును, నాదిగా దేవయో♦గ్యాన్నచయము
దగినసంస్కృతిచేయ ♦ కొగి భుజించినవాని, నవనిపైఁ బడవైచి ♦ యంగకంబు
నదె మునిపండ్లఁజీఁ♦కెద రంతకునిభటుల్, దేవతాగమగురు♦ద్విజుల నింద
సేయ వినినవారి ♦ చెవుల సూదులు గాల్చి, యొండొండఁ గూర్కొను♦చున్నవారు

గీ. క్రోధలోభాత్ములై రచ్చ♦కొట్టమును సు,రాలయంబును బ్రపయును ♦ గూలఁద్రోచి
యతిని తిత్తొల్చెదరు లోభ♦మొనసకల, సుకృతవిక్రయము సుజీచెద♦ర్యాడుమధిప

క. మున్నొకని కిచ్చి యొరునకుఁ, గన్నియ మఱి యిచ్చినట్టి ♦ కష్టుఁడు శస్త్ర
చ్ఛిన్నాంగుం డై తేలుచు, నున్నాఁడదె క్షారనది న♦నూనార్తి మెయిన్.

సీ. తెగి మాతృమర్కగో♦ద్విజులకు నెదురుగా, నాచరించిన తుచ్ఛ♦నట్లు కాక
ముఖము నాటఁ బొడుచు కా♦ముఖ్యులఁ బ్రేవులు, గఱవున వాలిని ♦ గన్నపరిజల
నిడిచి తా నొక్కఁడు ♦ కడుపుఁ బ్రోచికొనిన, ఖలుని పండ్లన్ని యు♦డుల్చి యొడలు
దఱిగి కండలు నోరఁ ♦ దుఱిగెద రదె భీతి, శరణంబుఁ జొచ్చిన♦ వరుని లంచ

గీ. మర్థితోఁ గొని యొప్పించి♦నట్టి యధము, నధిక దారుణతర ఘటీ♦యంత్రపీడ
నలచుచున్నవా రెంతయు ♦ యమనిభటులు, చూచితే పాపఫలముల♦సొంపులధిప

క. ఇల్లడగొని యీయఁ జికొనిన, బల్లిదు లదె యిటియఁగట్టఁ♦బడి కీటకముల్
నెల్లుగఁ దేల్లుఁగాకులు, తల్లడ పెట్టంగ నొఱలె♦దరు వోరెండన్.

తరల. తనువు లెంలయు వ్రిస్సి నెత్తురు ♦ ధారలై తొరఁగంగ ని
య్యనుపముం డులబూరువు లై వస♦నెక్కఁ ద్రోవఁగఁ జీలువా
ర్మనుజవాధ పరాంగనాకుచ♦మండలీపరిరంభణం
బును దివాసురతంబు చేసిన ♦ భూరిపాపపరాయణుల్.

క. మనుజేశ్వర విను శ్రాద్ధంబునఁ దమలోఁదారు గలసి ♦ భోజన మొనరిం
చిన భూసురు లొండొరుల వ్రదన లాలలు రక్తములను ♦ ద్రావుట కంటే.

క. చెలులును నతిథియు నిజభృత్యులు చూడఁగ సురుచిరాన్న♦మొక్కఁడు వడిని
మ్మలఁ గుడిచిన నరుఁ డిదె నిప్పులు మ్రింగెడు వృకనికాయ♦ములు వీపు దినన్.

చ. అనఘ కృతఘ్నుఁ డైన మను♦జాధముఁ డోలి నతప్తకుంభవే
దనలఁ గరంభవాలుకల♦ తాపములన్ బహుయంత్రపీడనం
బున నసిపత్త్రఖండనస♦ముద్ధుర యాతనఁ, గాలసూత్రకృం
తన కృత తీవ్రదుఃఖమునఁ ♦ దక్కఁడు నిష్కృతి వీని కెన్నఁడున్.

చ. వినుము పసిండి ముచ్చిలుట ♦ విప్రునిఁ జంపుట గల్లు ద్రావు టే
పున గురుపత్నిఁ జెందుట ప♦ఘాతతరాఘము లెందు వీనిఁ జే
సిన నరుఁ డుండుఁ జుట్టుఁ బెను♦జిచ్చిడి పెక్కుసహస్రవర్షముల్
ఘనముగఁ గాల్చఁ బుట్టు భువిఁ ♦ గ్రమ్మఱఁ గుష్ఠమహాక్షయాంగుఁడై. 519

గీ. చచ్చు మఱియును నరకాగ్ని♦ వెచ్చమగుడఁ, బుట్టు తత్క్షయకుష్ఠ బాధలఁ♦ బొందు మాన
వేంద్ర కల్పంబు తుదిదాఁక ♦ నిట్లు తిరుగుచుండుఁ బాతకియైనయా♦తండు వినుము.

మార్కండేయపురాణము, ఆ 2 ప 92, 108.

సీ. అన్నవిక్రయులు దే◆వాధికారులు సురా,పానవర్తనులు గో◆బ్రాహ్మణాంగ
నాహంత లన్యకాం◆తాపరాయణులు వి,శ్వాసఘాతుకు లనా◆చారనిరతు
లనృతవాక్యులు సజ్జ◆నాపవాదులు గురు,ద్రోహులు పిశునతా◆మ్యాత్యరతులు
గృహదాహకులు విష్ణు◆కీర్తనద్వేషులు, శివదూషకులు కుల◆శ్రీవిదూరు
ఆ. లంతఁగానిసతుల◆ ననురక్తిఁ బొందిన, ఖలులు బాలవృద్ధ◆గణము లుండ
భుక్తిఁగొన్నదుష్ప్ర◆భులు నేఁగుదెంతురు, ప్రతిదినంబు నాదు ◆ భవనమునకు.
సీ. కూటసాక్షులు హీన◆కులసేవకులు వృష,లీపతు లన్యధ◆నాపహరణు
లన్వయచ్యుతులు ర◆ణావనివిముఖులు, చౌర్యవర్తనులు పా◆షండమతులు
సుకృతవిక్రయులు భూ◆సురగురుద్వేషులు, శరణాగతావన◆విరహితులును
మిత్రఘాతుకులు స్వా◆మిద్రోహు లాశ్రిత,జనవిసర్జనులు వి◆వప్రియోగు
గీ. లాదిగాఁ గల్గు పాపాత్ము◆లనుదినంబు, మనుజలోకంబునందుండి ◆ మత్పురమున
కన్నిత్రోవల నర్బుద◆న్యర్బుదముల, సంఖ్య లేకెంతు రరుగని ◆ సందడులను.
రుక్మాంగదచరిత్రము, ఆ 1 ప 163–164.

సీ. పాదంబు లిరుచేతఁ ◆ బట్టి గుంజుండు జ,ర్ఝరితంబుగా వీనిఁ◆ జట్టుత్రొక్క
మెడ మెట్టి గోర్గాండి ◆ మెతికి పుచ్చుఁడు వీని, గ్రుడ్లు చెక్కుల నెత్తు◆రులు స్రవింపఁ
గడికండలుగ వీని ◆ కంఠంబు వ్రేయుండు, గరసానఁ బట్టిన ◆ ఖడ్గధారఁ
బలుత్రాళ్ల బంధించి ◆ తలక్రిందుగా వ్రేలఁ, గట్టుఁడు వీని వృ◆క్షంబుకొమ్మ
గీ. అంపమునఁ వీని కంఠంబుఁ ◆ ద్రెంపివిడుఁడు, మదవమాతాఁపురుషు వీని మ◆ర్మములనొంపుఁ
డెట్టిఁగా నగ్నిఁ గాఁగిన◆యినుపయిసుకఁ, గుళికిపోయుఁడు వీని ము◆క్కునను జెవుల.
గీ. పరకళత్రంబు కుచకుంభపాళియందు, నఖముఁ దివిచిన పాపాత్ము◆నఖమునందు
నెట్టిఁగా నగ్నిఁగాచిన ◆ యినుపసూది, నుగ్రదృష్టిని జొన్పుఁడ◆త్యాగ్రహమున.
కాశీఖండము, ఆ 3 ప 152, 153.

క. ఎడతెగక ముజ్జగంబుల, కడపల నయ్యామ్యదిశను ◆ గదలక నిలుచుం
గడుఘోరములుగ నరకము, లడరంగా నంతరాళ ◆ మందుల నధిపా.
క. పరపుత్త్రికళత్రంబులఁ, బరికింపక యపహరించు ◆ పాపాత్ముఁడు దు
ష్కరపాశబద్ధుఁ డై యమ, పురుషులచే నధికబాధఁ ◆ బొందుచు నుండున్.
క. పరకాంత నెవ్వఁడేనిం, బురుషుం డుండఁగ నొఱఁగి ◆ పొందిన యమకిం
కరు లతనిఁ బట్టి నడిఁ ద,త్తఱమునఁ బడ వైతు రంధ◆తామిస్రమునన్. 527
సీ. తల్లిదండ్రులకును ◆ ధరణీసురులకును, నహితంబు సేసిన ◆ యట్టివాఁడు
కాలసూత్రం బను ◆ కడుఁదీవ్రనరకంబు, నందును నందంద ◆ యయుతయోజ-

నాయతపాత్రాదు ♦ లందుల సూర్యుఁడా, మీఁదఁ గ్రిందను వహ్ని ♦ మిగుల మండ
నత్యంతక్షుత్పిపా ♦ సాదులచేతను, బాధితుం డగుచుండుఁ ♦ బాయ కెపుడుఁ

ఆ. బరువు వెట్టుచున్నఁ ♦ బడియున్న నిల్చిన్నఁ, గదల కున్నఁ జాల ♦ నొదిఁగియున్న
బాధఁ బొందుచుండుఁ ♦ బశురోమములలెక్క, వరుస నపరిమేయ ♦ వత్సరములు.

క. దండింపఁ దగనివారల, దండించిన విప్రవరుల ♦ తనువులు ముట్టం
దండించిన దుర్మతులం, దండింతురు కాలసూత్ర ♦ నరకములందున్. 529

ఆ. చతియు నట్టిదుష్ట ♦ మానవుఁ గింకరుల్, విఱిచి చెఱకుఁగోల ♦ విఱిచినట్లు
బాధవెట్టుచుండఁ ♦ బడి మూర్ఛఁ జెందుచు, మొఱలువెట్టుచుండు ♦ భూపవర్య.

క. తనకలిమి సెవ్వఁడేనిం, దనబాంధవవరులఁ గూడి ♦ తగఁ గుడువక తా
నను వాయసంబు భక్షిం,చినమాడ్కిఁ దిన్నవాని ♦ శిక్షిమొ యచటున్.

క. క్రిమిభోజన మనియెడి నర,కమునం బడి క్రిములెకాఁడు ♦ గాఁ గుడుచుచుఁ దాఁ
గ్రిమి యగుచు లక్షపరిమా,ణముఁ గల క్రిమికుండమందు ♦ నాటుక యుండున్.

ఆ. సర్వజంతుజాల ♦ సంగమ మొందెడు, వానిఁ బట్టి కట్టి ♦ వజ్రదంష్ట్రి
కములు గలుగునట్టి ♦ ఘనతరశాల్మలీ, తరువులందుఁ జేర్చి ♦ దంతు రెపుడుఁ.

ఆ. పార్థివేంద్ర నరుఁడు ♦ పాషండదర్శనుఁ, డగుచు ధర్మమార్గ ♦ మడఁచెనేని
వాఁడు నరకమందు ♦ వైతరణీనది, నుడుగ కెపుడుఁ బొరలి ♦ పడుచు నుండు.

క. శునకములఁ బెంచి యెవ్వం, డనయంబును వేఁట సలిపి ♦ యాత్మార్థముగా
వనమృగములఁ జంపునో యా,మనుజాధము నస్త్రములను ♦ మర్దింతు రొగిన్.

ఆ. ద్రవ్యలోభమునను ♦ దంభార్థమై పశు,వులను జంపి జన్న ♦ ములను జేయు
వానిఁ బట్టి యముని ♦ వారలు గోయుచు,నుందు రెపుడు మిగుల ♦ సందడిలుచు.

సీ. లంచంబుఁ గొని సాక్షి ♦ వంచించి యనృతంబు, వలికెడు పాపాత్ముఁ ♦ బట్టి కట్టి
యంత మానక పీచి ♦ యమనరకమునందు, శతయోజనోన్నత ♦ శైలశిఖర
మునఁ దలక్రిందుగా ♦ నునిచి యధోముఖం,బుగఁ బడద్రొబ్బిన ♦ బొబ్బలిడుచుఁ
గల్లోలములు లేని ♦ కమలాకరమువోలెఁ, జటులమై యున్న పా ♦ షాణమందు

గీ. వడినయంతన దేహంబు ♦ పగిలి పెక్కు, తునుకలై పాసియుదిగూడి ♦ కొనుచునుండ
నుండి యాకులతనుబొందు ♦ చుండుఁగాని, చావు లేకుండునా దుష్ట ♦ జంతువునకు.

ఆ. సోమయాజిభార్యఁ ♦ గామించి పొందిన, వానిఁ గపటమద్య ♦ పానసోమ
పాన మనుదినంబుఁ ♦ బానంబు సేయు విప్రక్షత్త్రియులను బట్టి ♦ సంభ్రమమున.

ఆ. రొమ్ముఁ ద్రొక్కి మోము ♦ తెమ్మనట్టుఁగ మోఁది, యనలముఖమునందు ♦ నగ్నివర్ణ
ముగను గాఁచి వక్త్ర ♦ మును నిండఁగా నుప్పు, నీరు వోతు రేచి ♦ నిష్ఠురముగ.

ఆ. ఎనయ దొడ్డిలోన ♦ నిండ్లలో నైనను, బహుపతంగహరిణ♦పంక్తి నెల్లఁ
బట్టి హింస సేయు ♦ పాపాత్ము విమతహీను, ధూమశిఖల ద్రొబ్బు♦దురు నృపాల.
క. తనయింటికివచ్చినమనుజుని నతిథిఁ గ్రోధదృష్టిఁ ♦ జూచినవానిం
గనుఁగవల వజ్రదంష్ట్రిలఁ, దనరిననయాకంకగృధ్ర♦తతి భక్షించున్. 541
మ. ధనవంతుం డగుమానవుండు గడఁకన్ ♦ ధర్మోపకారంబులన్
ఘనతం జేయక యుండెనేని యమలో♦కంబందు సూచీముఖం
బనువాదుర్గతిఁ బట్టి త్రోచి యిది గాఁ♦పై యున్నభూతం బటుం
చును శోకంబులఁ బట్టి కట్టి వడితో ♦ నొప్పింతు రత్యుగ్రులై.
ఆ. నరవరేణ్య యిట్టి ♦ నరకముల్ యమలోకమందుఁ గలవు మఱి స♦హస్రసంఖ్య
లందు శమనదూత ♦ లనిశంబు బాధింతు, రవని ధర్మదూరు♦లైన నరుల.
భాగవతము, స్కం. 5 పద్య 183–160.
సీ. బలుతంపముల దేహ♦ములు ద్రెవ్వఁగోసి యామరకర్దమంబులఁ ♦ జదియఁ ద్రోచి
పటుకుఠారములచేఁ ♦ బరమొండెములు చేసి, తలగాన రా నేలఁ ♦ ద్రవ్వి పాఁతి
వాఁడికొఱ్ఱుల వాటు♦వైచి మేడెములోనఁ బులులముందఱఁ గట్టి ♦ పారల ద్రోచి
క్రొవ్వాఁడి యినుపము♦క్కుల కాకములచేతఁ, బొడిపించియుచ్చులు♦ మెడలఁ బెట్టి
గీ. వ్రేలఁగట్టి దంచనముల♦ వ్రేసి తప్త, తైలకుండంబులోఁ ద్రోచి♦ దారుణాస్త్ర
శస్త్రనిహతుల నొంపించి ♦ జంతుతతుల, బాధసేయును గాలుని♦భటచయంబు.
విష్ణుపురాణము, ఆ 8 వ 369.
సీ. ఉక్కుతోఁటలకుక్క♦లొక్కింతమర్మముల్, వట్టితీయఁగ మొఱల్ ♦ పెట్టువారి
గొప్పనిప్పులయేటఁ♦గూల్చి పోనీయక, పొదివి యమ్ములనేయఁ♦బొరలువారి
నెత్తురుచీమునిం♦డినకూపముల వ్రాలి, పురుగు లంగముఁ దొల్వఁ ♦ బొగులువారి
గత్తులఁగోసిన♦ కాయముల్ ఘోరవాహినుల ముంపఁగ బెట్టు ♦ పనవువారి
గీ. చిట్టుగాలిన పెనములఁ ♦ బెట్టి వేఁప, మిట్టిపడి యట్టె మ్రొగ్గిల్లు♦నట్టివారిఁ
దప్తతైలకటాహపా♦తమున శోక, తప్తులగువారిఁ జూచె నద్దశముఖుండు.
సీ. పతిపాతులుఁ గూట♦సాక్షులు నన్పతోక్తిపరులు రౌరవబాధ ♦ పడెడువిధము
కులహంతలును భ్రూణ♦గోఘ్నులుచ్ఛ్వాసని,రోధకంబునఁ బడి♦రోఁజువిధము
బ్రహ్మహంతయు సురా♦పాని స్వర్ణస్తేయి, సూకరంబునఁ బడి♦ స్రుక్కువిధము
స్వగురుతల్పఁగుఁడును ♦ స్వసృగామి నృపహంత, తప్తకుంభికఁ బడి♦తలఁకువిధము
గీ. తూఁతునుం గోడలిని బట్టు♦కొన్న చెడుగు, లురుమహాజ్వాలవాలిక♦ట్టొఱలువిధము
దగనిఘుగువలఁ గనయుపా♦తకులు లవన,యాతనలఁ గూలువిధమతఁ♦డ పటుఁ జూచె

గీ. జేరి కొండెంబు నొరులకుఁ ♦ జెప్పినట్టి, జిహ్వఁ గత్తుల నంతింత ♦ చీఱి విడుఁడు
మించి యన్యాయవిత్తమా♦ర్జించినట్టి, కుటిలదేహంబు నంపానఁ ♦ గోయుఁ డిపుడు.
గీ. ఇతరకాంతలఁ దనతోడ ♦ నిచ్చగించి, యుపరిసురతంబు సలుపం♦నొడ్డుకొన్న
యల్లచోటులఁ గ్రాఁగిన ♦ యట్టిలోహ, పాత్రి నెత్తుఁడు కడుఁ గ్రాఁగి ♦ నస్మముగను
ఉ. పట్టుఁడు కాయలం దవుడ ♦ పండులు డుల్లఁగ వ్రేసి సంపెటన్
గొట్టుఁడు కర్పటం బిపియ ♦ గ్రుద్దుల ద్రొబ్బుఁడు బిల్లఁగోలలన్
గుట్టుఁడు గొంగసె గోలముకు ♦ గోళ్ళను మొత్తుఁడు తప్తలోహముల్
చట్టనఁ జీఱి పొట్టనిడి ♦ చర్మముఁ దీయుఁడు త్రిత్తిదోఁపుఁడున్. 554

శృంగారమల్హణచరిత్ర, ఆ ౫.

# పుణ్యలోకము

కం. ఈలోకమునకు మీఁదై, చాలఁగ వెలుఁగొందు చుండు ♦ స్వర్లోకము నా
నాలంకారయుతము దివ్యాలోకము దేవయాన ♦ మది మునినాథా! 555
చ. అమలతపోనివాసులు మ♦హాధ్వరశీలురు సత్యసంధు లు
త్తములు జితేంద్రియుల్ సములు ♦ దానపరుల్ రణశూరు లందు హ
ర్షమున వసింతు రచ్చరలు ♦ సాధ్యులు దేవమునుల్ మరుద్వసు
ప్రముఖులు వేలువేలు తగు ♦ పట్టుల నుండుదు రంద యిమ్ములన్. 556

భారతము, ఆర. ఆ 6 పద్య 129, 130.

సీ. తల్లిదండ్రులకు ని♦ద్దపు భక్తిరవణిల్ల, శుశ్రూష చేసిన ♦ శుద్ధమతులు
పతులకు నిర్వ్యాజ♦పరమతాత్పర్యతఁ, బరిచర్య సలిపిన ♦ పద్మముఖులు
సజ్జనావళికి ని♦ష్కాపట్యంబున నుపకార మొనర్చిన ♦ ధీరగుణులు
దటిదప్పకుండ సం♦ధ్యాజపహోమతంత్రంబులు నెఱపిన ♦ ధర్మవిధులు
గీ. బ్రహ్మరతులు తపస్వులు ♦ భవ్యతీర్థ, సేవకులు నుపవ్రతులు ని♦స్పృహులు మొదలు
గాఁగ నొప్పెడు తత్పుణ్య♦కర్మపరులు, వీరె చూడుఁడు సుఖమున్న ♦ వార లిందు.
క. నుతిచేసి యిష్టధనములు, క్షితిసురులకు నొసఁగినట్టి ♦ శిష్టులు సుండీ!
యతులహిరణ్మయహర్మ్యస్థితులగుచుఁ జరింతువారు ♦ చిరశుభలీలన్! 558
గీ. ఉభయముఖు లగుగోవుల ♦ నొండెనొండెఁ, గపిలలగు ధేనువులఁ బుణ్య♦కాలతిథుల
దానమొనరించినట్టి స♦త్యప్రతిజ్ఞు, లీమహార్ఘ్యపీఠంబుల ♦ నెసఁగువారు. 559

కాశీఖండము, ఆ 2 ప 11–13.

సీ. సకలోత్కృష్టసుఖభూష♦ణములఁ బూనినవారి, దివ్యయానము లెక్కి♦ తిరుగువారి
నికచమందారమా♦లికలు చుట్టినవారి, తెల్లగొడుగులనీడ♦ వెలయువారి
మృగమదశ్రీగంధ♦మిళితాంగులగువారి, వీణాదిగానముల్♦ వినెడువారి
నప్సరల్ గొలువఁ గో♦ర్కెల్ చెల్వు గనువారి, మేల్మిపచ్చలమీఁద♦ మెలఁగువారిఁ
గీ. చంద్రుసౌమ్యంబు తపనుతే♦జంబు మరుని, చెలువ మింద్రునిభోగంబు♦ శివునివిభవ
మూని భద్రాసనస్థులై♦ యున్నవారి, ధార్మికులఁ జూచె నొకవంక♦ దశముఖుండు
ఉత్తరరామాయణము, ఆ 3 ప 326.

# పుణ్యలోకభోగములు

సీ. ఎల్లపుష్పంబులు♦ నెల్లకాలమును దొద్ద, విలసిల్లుఁ గల్పక♦ వృక్షజనిత
మనులేప మాహార♦ మచ్యుత మంబరములు, నిత్యామలినములు♦ నిరుపమాన
భంగి దీప్తంబు లా♦భరణముల్ వాన ర,మించుచు నన్యోన్య♦ మిత్రభావ
మొప్పంగ మేనుల♦ యొప్పును మనముల, మార్దవంబును గుణా♦మాన్యతలును
గీ. గలిగి పురుషులుఁ గాంతలుఁ♦ గామహర్ష, లీల లెసఁగఁ గ్రోధాదులు♦ లేక రుజయు
జరయు నెఱుఁగక నలిఁ జరిం♦తురు దివంబునందు సంతతనిర్భరా♦నంద మొంది.
భారతము, ఆ 5 పద్య 217.

# పుణ్యకార్యములు

సీ. ధర్మంబుభయమున♦ దారిద్ర్యసంబాధమున రోగమును బాప♦ములుఁ దొలంగఁ
జేతకు నైనఁ జే♦సినదేవకార్యార్థ, పశుహింసనమ్మును♦ బరమతపము
శుశ్రూషయునుగల్గి♦ శ్రుతము సంపాదించి, యప్రతిగ్రాహకుఁ♦డైన మద్య
మాంసపరస్త్రీస♦మాగమవైముఖ్యమున నాశ్రమస్థులఁ♦ దనకులంబు
గీ. వారి భరియించినను హేమ♦వస్త్ర మంది,రాన్నపానంబు లొసఁగిన♦ నాశ్రయంబు
దీనులకు నిచ్చినను హింస♦మానినను స,ముంచితస్వర్గలక్ష్మి సి♦ద్ధించు నండ్రు. 562
సీ. రచ్చకొట్టంబు నా♦రామంబుఁ గూపంబుఁ, బ్రపయుఁ గావించుట♦ భయభరార్త
కోటిఁ గాచుట కన్య♦గోవృషవాహనము ద్విజుని దాసి నిచ్చుట♦ దనకుఁ గీడు
సేసిన సైచుట♦ చెలులఁ జుట్టంబులఁ, బ్రోచుట పెక్కండ్ర♦ఁ బొంచెఁ గార్య
మునఁ బరాక్రమమున♦ ధనమునఁ దావల,జడిపాటు దుష్కర్మ♦ సరణిఁ బోరయ
ఆ. కునికి నాకలోక♦మునకు నిచ్చెన లగు, నెక్కులమునఁ బుట్టి♦ రేని బహుసు
తుండగు సతి కృపాన్వి♦తుఁడు వేయు నెలలపై, బ్రదికినతఁడుఁ గాంచుఁ♦ద్రిదశపదము

చ. జనులకుఁ గీడు సేయక యజస్రము ధర్మగతిన్ జరించి స
జ్జనగురుపూజనంబులును ◆ సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును ◆ భూతదయార్ద్రితయుం గలట్టివా
రనిమిషలోకగాము లని ◆ ధర్మ తెలుంగుము మేనకాత్మజా. 564

భారతము, అను ఆ 2, 5, ప 63, 64, 219.

సీ. క్షమఁ గ్రోధ మక్కృతసం ◆ కల్పతఁ గామంబు, చిరనిద్ర సత్త్వసం ◆ సేవనమున
గాఢధైర్యమ్మున రా ◆ గద్వేషములు భయం, బప్రమాదమున మో ◆ హంబు శ్రమము
వినివర్తనాభ్యాస ◆ మున రోగములు నుపద్రవములు హితము మి ◆ తంబుఁ గాల
యోజితంబును నగు ◆ భోజనంబున జీవ, సందర్శనమున ని ◆ శ్వాస మఖిల
గీ. విషయములు నంతవిరసతా ◆ వేక్షణమున, నిత్యసంతోషమున లోభ ◆ నిరతి కృపన
ధర్మ ముచితకృతావేక్ష ◆ ధర్మమవులఁ, ద్రోవ సేర్చుట ముక్తికి ◆ ద్రోవ యనఘ.

శాంతి. ఆ 5 పద్య 370.

సీ. కావున ముక్తికి ◆ గారణం బగుదాని, నేర్పడఁ జెప్పెద ◆ నెఱిఁగికొనుము
దానంబు శమమును ◆ దమమును బ్రహ్మచర్యంబును వ్రతపరి ◆ గ్రహణంబు
దయయును బరధన ◆ దారవర్జనమును, నియమయమేంద్రియ ◆ నిగ్రహములు
జననీజనకగురు ◆ జనపూజలును దేవ, తాతిథిపితృసేవ ◆ తార్పణములు
గీ. సత్యమును శౌచమును శుభ ◆ సంవిధాన, నిరతియును ధైర్యమున గ్రోధ ◆ నిరసనమ్ము
గలిమి పుణ్యవృత్తిం బెని ◆ గలుగునరుఁడు, మొనయుదీనిమాఁతగఁగొని ◆ మోక్షమునకు

ఆశ్వ. ఆ 1 పద్య 192.

మ. గురుదేవర్షి పితృప్రపూజనము స ◆ద్గోష్ఠీప్రియత్వంబు సం
స్థిరసత్యోక్తి సహుస్తఘాతదయ మై ◆ త్రీసాధుసాంగత్యముల్
పరలోకాభ్యుదయక్రియారతి శ్రుతి ◆ ప్రామాణ్యసందర్శనం
బరయన్ స్వర్గముఁ బొసిపుట్టినమను ◆ ష్యశ్రేణిసంజ్ఞల్ నృపా. 567

మార్కండేయపురాణము, ఆ 2 ప 121.

సీ. తనశక్తికొలఁదిని స ◆ త్కర్మముల్ ఫలవాంఛ, మానికృష్ణార్పణ ◆ మతి సలుపుట
ప్రతిషిద్ధకర్మంబు ◆ పరిహరించుట విష్ణుభక్తిపైఁ గ్రమమునఁ ◆ బాదుకొనుట
తద్భక్తులపుణ్యా ◆ తముల సంసర్గంబు, దుర్జను లున్నట్టి ◆ త్రోవఁ జనమి
విష్ణుసన్నిధి కథా ◆ విఖ్యాతవివిధ దివ్యక్షేత్రతీర్థయా ◆ త్రాచరణము
గీ. బ్రహ్మచర్యంబుఁ దపము వై ◆ రాగ్యగుణము, వలయు వైకుంఠమునుగోరు ◆ వారికెల్ల
వీనిలోపలఁ గొన్ని గా ◆ వింపఁ గనిన, వృథఁజనవు చేర్పుఁ గ్రమమున ◆ విష్ణుపదము.

కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 107.

సీ. యజ్ఞానినిత్యక♦ర్మానుష్ఠానవిధి యుత్కృష్ట దానంబు సత్యంబు ♦ దమము శమము
దేవతాభజనంబు ♦ తీర్థజలస్నాన, మాత్మశుద్ధియు నింద్రి♦యముల గెలుచు
టస్పృతంబు విడుచుట ♦ హర్షంబు నొందుటయు చేరి సజ్జననిందఁ ♦ జేయకుంట
గోవిప్రభక్తిసం♦భావితుండగుచుంట, సర్వసమత్వంబు ♦ జరుపుచుంట
గీ. తలచుగను వేదశ్రవణాదవస♦త్కథలు వినుట, క్రోధభయ లోభ మోహంబులఁ గుదియఁదిగుచు
టప్రయాససంప్రాప్తవస్తు♦మందుకొనుట, కణఁకతో విను పుణ్యాన ♦ కారణములు 568
మత్స్యపురాణము, ఆ 1 ప 152.

సీ. అత్యాశ్రితాక్రాంతుఁ ♦ డభయంబు వేఁడినఁ, గరుణార్ద్రచిత్తుఁడై ♦ కాచినదియు
నత్యంతదూరప్ర♦యాణఖిన్నుండైన, పథికునాయాసంబు ♦ వాపినదియు
మునుపు జీర్ణత్వముం♦దిన దేవభూదేవ, నిలయము ల్మగుడంగ ♦ నిలిపినదియు
బలిమిచేఁ గలిమికై ♦ బంధభవత్కారంది, శిరునకు విముక్తి ♦ జేసినదియుఁ
గీ. దస్కరాదులచేత వి♦ధ్వస్తమైన, దీననిధనంబు మగుడ సా♦ధించి తెచ్చి
యిచ్చినదియును మొదలుగా ♦ నెన్నఁదగిన, సుకృతములు విశ్రుతంబులు ♦ సుందరాంగి

క. సత్యంబగు నప్రియము న,సత్యంబగు ప్రియముఁ బలుకఁ ♦ జనదని విబుధుల్
సత్యంబు ప్రియముఁ బలుకుట, యత్యంతవిశేషధర్మ ♦ మందురు తన్వీ. 570

ఆ. సాధురక్షణంబు ♦ సమదర్శనంబును, సర్వభూతజాత♦సదయవృత్తి
వితరణంబు ననఁగ ♦ వివిధపుణ్యంబుల, నుత్తమోత్తమంబు ♦ లుత్పలాక్షి. 571
సీమంతినీకళ్యాణము, ఆ 2.

క. కృతయుగమున జ్ఞానము సం,తతతపములు త్రేతయందు ♦ ద్వాపరవేళన్
క్రతువులు కలిని బురాణ,శ్రుతిపఠనము లిహపరైక ♦ సుఖము లొసంగున్. 572
శేషధర్మము, ఆ 3.

# పాపకార్యములు

గీ. కల్లు త్రావుట గురుపత్ని ♦ గవయుటయును, విప్రుఁ జంపుట బ్రహ్మస్వ♦విషయమైన
ముచ్చిలుటయును నివి గల ♦ క్రూరజనులఁ, బ్రీతిఁ బొందుటయును మహా♦పాతకములు
సీ. ఆదిత్యునుదయాస్త♦మయకాలములనిద్రఁ, బొందుటయును బాత్రి♦భూతుఁడింటి
కరుగుదెంచినఁ బూజ ♦ యాచరింపమియును, బరదారగమనంబు ♦ గురుల కెదురు
పేఁతయు గ్రామంబు ♦ సెలచుటయును వేద,విక్రయంబును రస♦విక్రయంబు
భృత్యుఁ బ్రోవమియును ♦ సత్యోపచారంబు, గహనదాహము నస్య♦కర్మకృతియుఁ

గీ. దనదుకర్మంబు విడుచుట♦యును వృథాప్రహరణంబు మేదినీ♦సురులకవిమిఁ
గొనుటయును శరణార్థిఁ జే♦కొనమి ప్రవ్రజయుఁ బాపంబులందురు♦బుధజనులు.
భారతము, శాంతి. ఆ 1 పద్య 168, 293.

చ. పరుసనిపల్కులం బరులఁ♦బల్కుట మర్మమునాటనాడుటల్
నరులకు నెగ్గుసేఁత కృప♦ణత్వ మశౌచము దేవదూషణం
బొరులధనంబుగొంటు కృప♦నొందమి యల్క కృతఘ్నభావమో
నిరయముఁ జూసిపోయి ధర♦ణిం బ్రభవించినవారిచిహ్నముల్. 575
మార్కండేయపురాణము, ఆ 2 ప 120.

ఆ. అన్యదేవసేవ♦యన్యకాంతాసక్తి, పరధనాపహృతియుఁ♦బ్రాణిహింస
నలి నభక్ష్యభక్ష♦ణమున గమ్యాగమనములు నరుల కివియు♦నరకగతులు. 576

సీ. అవియు నెల్లెంచేని♦యఖిలేశు హరిఁబూజ, సేయక యొరుఁబూజ♦సేయుటయును
దనభార్యయుండంగ♦మనసున నొరుకాంతఁ, గోరుటయును లోభ♦గుణము గదిరి
లలిఁ బ్రతిగ్రహములు♦పలుమారుఁ గొనుటయు, నవనిలోఁ బరధనా♦హరణమయ్యెఁ
గ్రితుకర్మములఁ గాక♦కణఁగి యేజీవికి, నెగ్గుసేయుట ప్రాణ♦హింస యయ్యె
ఆ. నుల్లిదెలికపిండి♦ముల్లంగియును నేతి, బీఱ మునగకాయ♦బిల్వఫలము
వఱలుతుంబి తెల్ల♦వంకాయ మధుమాంసములు నభక్ష్యకములు♦ముదిత వినుము.
పద్మపురాణము, ఆ 11 ప 34-35.

సీ. బహిఁవడ్డద్విజునక♦ల్పపుఁబొచితంబిడి, పసిఁడికై తావాని♦బంతిఁ గుడిచి
కలసి వణిక్ప్రరో♦ధలతోడఁ బుణ్యాహములబియ్యములకునై♦మొత్తులాడి
శశిరవిగ్రహజప♦స్నానాదికములెల్ల, దొరలవాకిండ్లకే♦దొద్దయిచ్చి
పచ్చిత్రిత్తోల్బజై♦చుచ్చాలమెట్టింది, కొనఁ దాన యూరెల్లఁ♦గుత్తవట్టి
గీ. దర్భపోటులఁ దినిలేని♦తలులమైత్రి, నంటి పిత్ర్యశేషము భుజించి♦యదియు నెడల
నక్కవాడలనరకహాళ్లు♦మెక్కి మీఁద, వీనిశేఖరమొకతులా♦త్రివ్యజ్యముక్తొని. 578
ఆముక్తమాల్యద, ఆ 7 ప 5.

గీ. విహితధర్మంబుసేయక♦విడుచుటయును, మానక విహితధర్మంబుఁ♦బూనుటయును
ననఁగ రెండు నధర్మంబు♦లరసిచూడ, నవియె పాతకకర్మంబు♦లరసిచూడ. 579
గీ. బ్రాహ్మణులహింసయునుసురా♦పానరతియు, స్వర్ణచౌర్యంబుగురుదార♦సంగమంబు
తత్సమాగమమునుబ్రశ♦స్తంబులైన, యైదునుమహోగ్రదురితంబు♦లనఁగబరఁగు.
ఉ. ద్యూతము కైతవంబు పర♦దూషణముం గటుభాషణంబు ని
ష్ఠేతుపరాపకారమును♦నీర్ష్య యసూయయు సూచకత్వమున్

గీ. సమరసాక రేయి తగినప్ర♦యత్న మలర, నిజగృహంబున ధారుణీ♦నిర్జరునకు
శయన మర్పించినటువంటి ♦ సజ్జనుండు, చూడఁ డెన్నండు నీమోము♦సూర్యపుత్త్రి

క. చెఱువులు గట్టినపుణ్యులు, దఱపక ధాన్యమ్ము లమ్మ ♦ ధన్యులు పరిజలన్
చెఱవిడిపించినసుకృతులు, సెటి నర్కతనూజ రారు ♦ నీపురమునకున్. 597

మత్త. తాళవృంతములాతపత్రవి♦తానముల్ ధ్వజచామరాం
దోళికల్ రథదర్పణంబులు ♦ తూర్యతల్పచయంబు హే
గ్గాళియల్ బహువస్త్రభూషణ ♦ గంధముల్ హారికర్పణం
బోలిచేసినవారు నిన్నన ♦ నొల్లకుండుదు రర్కజా. 598

రుక్మాంగదచరిత్రము, ఆ 2.

క. ధర్మంబు సేయ నేర్చిన, నిర్మలమతు లెల్ల విబుధ♦నికరము పొగడన్
భర్మమయాంబరధరులై, శర్మస్థితిఁ జనుదు రెపుడు ♦ శమనుని పురికిన్. 599

ఉ. అన్నము పెట్టువారలకు♦ నన్నముదించు జలంబు దప్పికిం
గన్న[illegible] ♦ గాచిన యావులపాలు గ్రావుచున్

భారతము, అను. ఆ 2, 4, 5, ప 61, 62, 261–262, 220.

సీ. పరనిందకుండును ♦ బరుష వాక్యుండును, యమలోకదుఃఖార్తు ♦ లగుదు రెపుడు
వారు చేసినతపో ♦ వ్రతతీర్థదానంబు, లన్నియు విఫలంబు ♦ లై నశించు
పరుఁ గృతఘ్నుఁడు సేయు ♦ దానధర్మంబులు, నష్టంబులై పోవు ♦ నరకమునకుఁ
బోవుఁ దీర్థములాడు ♦ పుణ్యుండు నశౌచవర్జనుఁడును నింద్రియ ♦ సమితి నోర్చు
గీ. నతఁడు చూడంగనొల్లఁ డ ♦ య్యమునిపురము, తీర్థసేవఁ గావించి వ ♦ ర్తించునతఁడు
కడఁగి లోభంబునను బ్రతి ♦ గ్రహముఁ గొనిన, యతని తీర్థంబు నిష్ఫల ♦ మనిరి మునులు

మార్కండేయపురాణము.

సీ. విప్రాలయములందు ♦ విడిచుట్టుగానుండు, వానిమంటలలోన ♦ వైవలేదు
విప్రు నిందించంగ ♦ వినువాని చెవులందు, కఱకునారసములు ♦ బఱపలేదు
విప్రుపై నలిగి యు ♦ ద్వృత్తిఁ దిట్టినవాని, జిహ్వ మంగలకత్తిఁ ♦ జీఱలేదు
విప్రసొమ్ము భుజించు ♦ వృజినాత్ముని వదనంబు, కఱకుటులంపంబులఁ ♦ దఱుమ లేదు

పాపహుఁ గూటశాల్మలుల♦యందులఁ బ్రేకఁగఁ ద్రోయలేదు ఘో
రావలి నేలి విత్తము న♦హర్నిశమున్ హరియించుక్రూరులన్
వావిరి నంధకూపముల♦వైవఁగలేదు మహోగ్రహంబునన్. 658

సీ. పరభామ నభిలాష♦పడి వీక్షించిన, దుర్మార్గుకనుదోయిఁ ♦ దొలుచలేదు
పరకళత్రముచేయి♦పట్టినపాపాత్ము,కరముఁ గాకులగాల్చఁ ♦ గఱపలేదు
పరసతివదనచుం♦బన మొనర్చినదుష్కృ,తాత్మువక్త్రమునఁ గో♦జ్జదమలేదు
పరునియిల్లాలిలోఁ♦బడఁ గౌఁగిలించిన, తులువదేహంబు తి♦త్తొలువలేదు

గీ. పరపయోరుహముఖికుచప్రాంతములను, నఖము డిగిచినఖలుని వ్రే♦ల్లు ఱుకలేదు
పరవధూమణిఁ బొందిన ♦ భాగ్యహీనుఁ, గోశ మసిధార మొదలంటఁ ♦ గోయలేదు

క. ఋతుమతియైయుండినకుల,సతిఁ గవయక వేఱె యొండు ♦ జలజాననతో
రతిసల్పిన భ్రూణఘ్ను,వ్రితుఁ జెఱఁబడఁ ద్రోయలేదు ♦ వ్రక్కలు వాఱన్. 659

క. ధరణీసురవృత్తులు దమ,పరిధానము కొఱకు నడ్డ♦పాటొనరుచున
ద్దురితాత్ములఁ దోయఁగలే,దిరువదియొక నరకముల న♦నేకాబ్దంబుల్. 660

చ. జనకునిఁ దల్లి నగ్రజుఁ బ్రి♦సన్నులఁ జేయక హీనవృత్తిఁ గ
న్గొనినమహాపరాధితల♦నొడ్డటు వ్రక్కలువాపలేదు లే
దనవరతంబు నల్లభుని ♦ నప్రియభాషలఁ గూలవాడుదు
ర్వ్యసనముఖంబుఁ గాల్చి కర♦వాలున మాంసము చెండి వేయఁగన్. 661

కన్నఁగవ సూదిగోరుల • గసికఁ గొట్టి, పలము మాత్రంబు ద్రావించి • మాటిమాటి
కగ్నిఁ బడవైచి వేఁతురా • యమునిభటులు, మద్యపానంబుచేసిన • మానవులను.

సీ. ఋతుమతిం బొందిన • మతిహీనుఁ డెంతయు, రక్తకూపముల ని•ర్మగ్నుఁ డగును
శూద్రచండాలాది • సతులఁ గూడినవాడు, శునకమాంసాశియై • సొదలఁ జొచ్చు
విశ్వసించినవాని • వెలఁదిఁ బొందినఁ దుల్యుఁ, బ్రభుశిలాపాతన•పీడ నొందుఁ
బణ్యభామాసక్తిఁ • బరఁగినపాపుఁడు, శుక్రహ్రదంబులోఁ • జెపుడు నిలుచుఁ

గీ. బరులకాంతల బలిమినిఁ • బట్టుకొన్న, వారిదుర్గతి లెక్కింప•వశము గాదు
తన్ను నేలినభూపతి • తరుణిఁ గవయు, నీచుఁ డుండును గడలేని • నిరయమునను.

గీ. ఒక్కయేఁడాది వీరితో • నున్నవాఁడు, నరకమార్గంబు లాయాత•నల్భుజించి
పుల్కసాదిక దుర్జాతి • బుట్టిపుట్టి, ఘోరదుఃఖంబుఁ గుడుచును • గురువరేణ్య. 693

గీ. పక్షిభేది పృథక్పాకి • బ్రాహ్మనింద, కుందనాదేశి క్రతులమ్మి•కొన్నవాఁడు
నయుతయుగములు కుంభీపా•కమున నుండి, పుడమిసంకరజాతులఁ•బుట్టుచుండు.

సీ. ఇష్టదేవనిషిద్ధి • హీనాత్ములై యర్థిజనులకు లేదుపొ•మ్మనెడివారు
హితవును ధర్మంబు • నెఱిఁగించువారిఁ బూజింపక ద్వేషంబు• సేయువారు
గోవృషద్విజవధూ•కులములయాహార,ములకు విఘ్నంబులు • దలఁచువారు
తనువిశ్వసించిన • జనములపట్లను, వంచనలోఁ గీడు • గాంచువారు

గీ. బ్రహ్మహత్యాసమం బైన • పాప మొంది, కఠినతరులై నకాలకిం•కరులచేత
బ్రహ్మకల్పాంతరంబులా•పదలఁ బడుచు, ఘోరనరకంబులందుండ్రు•గురువరేణ్య.

గీ. బ్రాహ్మణోపేక్షకారులుఁ • బాపచింత, దెలుపువార లసత్యంబు•బలుకువారు,
మర్మభేద లసూయచే • వఱయువారు, బ్రహ్మహత్యాసమానులు•పాత్రకేంద్ర. 696

గీ. ఎంగిలికి రోఁతపడక మెలఁగువారు, గానవిద్యలపైఁ జేరిక • గలుగువారు
విష్ణునామమంత్రయజపంబు • విడుచువారు, నిరయమార్గానువర్తులు • నిశ్చయంబు. 708
శేషధర్మము, ఆ 3.

# బ్రహ్మసభ

చ. దళితవిరోధి యిట్టిదని • గాని తెఱం గెఱుఁగంగ బ్రహ్మకుం
గాఁదిమొ తా నవాఙ్మనస • గోచర మన్యులకూప నిరూపను
త్తల మనుకంబ మొక్కటియ • తొల్పఁగ సుస్థిర మై నిజప్రభా
వళి వెలిఁగించు చుండు శశి • వారిజమిత్రులమండలంబులన్. 709
భారతము, సభా ఆ 1 పద్య 79

సీ. మొగిఁ దమ్ముఁ బడసిన • మునులమూర్తులరీతి, ధర్మశాస్త్రములు మూ • ర్తములుదనర
మణివీధితులపెంపు • మాయించి సాలోక్య, ముక్తులు తనుతేజ • ములు వెలుంగ
వాణివీణారుచి • వారించి సామగా, నంబులుయతులఁ ది • వ్యంబుఁ బెంప
మృగమదాదులతావి • మగిడించి సుడిసి నిశ్వాసనాఁబుజగంధ • మతిశయిల్లఁ
గీ. జామరగ్రాహిణీకర • చామరత్న, రుచులు వెలుఁగఁ జేయుక పాశ • రుమలు వొలయఁ
గనకమయపద్మకర్ణికా • గ్రమున విశ్వ, కర్త సుఖలీలఁ బేరోల • గమున నుండె.
కుమారసంభవము, ఆ 4 ప 353

సీ. అఖిలవిద్యారహ • స్యముల శంకలు దీర్ప, సరస నుండెడు ముని • శ్వరులు వొగడ
స్వస్తికహస్తులై • సమ్ముఖంబునఁ బరా, బరిగాఁగ సర్వాసు • పర్వ లుండఁ
గరతలయుగళివ • క్త్రములు గప్పగవిన్న, పంబులకొఱకు ది • క్పతులు సేరఁ
బూర్వదేవతలు కిం • కుర్వాణులై తన, కనుసన్న చలసిన • పనులు సేయ
గీ. గరుడగంధర్వభుజగకి • న్నరపిశాచ, భటులు చావడిముంగటి • బట్టబయలఁ
జటులతరవృత్తిగోటుల • సంఖ్య లెసఁగ, నబ్జగర్భుఁడు గొలువున్న • యవసరమున
కాళహస్తిమాహాత్మ్యము ఆ 2 ప 4.

సీ. గానం నకార్యమి • దానీంసుఖేన వి, శ్రామ్యతాం గంధర్వ • సముదయేన
నాట్యప్రసంగాయ • నహి సమయోచితం, ప్రాచల్యతామప్స • రాంగణేన
పాపత్యతాంనైవ • పరమార్థజిజ్ఞాస, యాద్యవేదాంతి స • మాజకేన
పరచితానోన్యజ • త్వైరలంస్థీయతాం, మా నేసదేవతా • మండలేన
గీ. భారతీరమణాధునా • పరమపురుష • భావనాపావనసుధాను • భవవశేన
చిరమనుక్రీడతే యంచుఁ • దిరుగుచుందు, రజునిసభయందు వేత్రిహ • స్తాగ్రసరులు
మూర్తిత్రయోపాఖ్యానము. ఆ 2

క. ఎంగిలి దాఁకుచు నన్నము, వెంగిలియై యొసఁగునతని ♦ వెంటంబడి స
ర్వాంగంబులు యమకింకరు, లంగారంబులను వేఁతు ♦ రనవరతంబున్. 697
సీ. స్నేహమునకైన లోభంబు♦చేతనైన, నలసియైనను బొత్తుల ♦ నారగించు
జనుఁడు శ్లేష్మంపుముద్దలో ♦ శతయుగములు, పొరలికడపటశునకమై♦ పుట్టుచుండు.
సీ. మణులుఁ గోకలుఁ గస్తూరి♦మలయజంబుఁ, గప్పురంబును హరియించు♦మొప్పలెల్ల
నేకవింశతియుగముల♦నేకనరకముల వసించియుఁ గాకులై ♦ పుట్టుచుంద్రు. 699
సీ. కంచు సీసంబు రాగి య♦ణంచుకొన్న, యతఁడు వైశ్వానరజ్వాల♦యనెడినరక
మునను వేఁగుచు యుగముండి ♦ శునకయోని, జన్మశత మెత్తిమేకయై♦సంభవించు
సీ. బౌద్ధగృహవర్తి తచ్ఛాస్త్ర♦పాఠకుండు, శూద్రకాంతానురక్తుండు♦స్మృతుల నింద
యొనరవచియించువాఁడు స♦వనిసురులకుఁ గీడుగావించువాఁడు ని♦ష్కృతులుదనరు.
సీ. అనృతవాదులకొండీల♦యన్యమంది, రాన్నభోక్తల మర్యాద ♦ నడచువారి
విశ్వసించినచోఁ ద్రుంచి♦వేయునట్టి, ఖలుల జిహ్వలు గోతురు♦కాలభటులు. 702
సీ. అగ్నిహోత్రంబు కానుక ♦ నడుగఁ దలఁచు, నతని కబ్బునుబ్రహ్మహ♦త్యాయుతంబు
లతిథిపూజలు వర్జించి ♦ యన్నమారగించువారికిఁ బాపంబు ♦ లెంచ నరిది. 703
సీ. భూసురక్షేత్రము హరించు♦బుద్ధి నెవ్వఁ, డడ్డపెట్టును వానిని ♦ యమునిదూత
లినుపజోళ్లను బడవైచి ♦ యినుముగాఁగఁ, గుమ్మ్రమండుగ సతతంబు♦ గోడుకుడువ.
సీ. సురలనేసినతోఁటలో ♦ నున్నపూలు, దేవపూజావికల్పనఁ ♦ దెచ్చువారి
నగ్నిశిఖలందుఁ బడవైచి ♦ యమునిభటులు, వేఁతురంతయుయుగమెల్ల♦ వెళ్లుదనుక.
సీ. [illegible]ములయందు ♦ సంధ్యవేళ, వైధృతినిఁ జతుర్దశిఁ బిత్ర్య♦వాసరమునఁ
గాంతఁ గూడెడు మూర్ఖుమొ♦గంబు నిండి, పాపములఁ బోలుకలగలు♦బాధఁబెట్టు.
సీ. శక్తుఁడయ్యును దురా♦చారంబు మాన్పని, యతనిశద్దోషార్థ♦మందియుండు
లేనిపాపము లెన్న♦మాసవాధముజిహ్వ, యమభటుల్ చిదుముదు ♦ రనుదినంబు
కన్యతో రమియించు ♦ కలుషాత్మకునిఁ బట్టి, భక్షించు సతతంబుఁ♦బక్షివితతి
పూనివహ్నితమును ♦ బూర్ణంబు సేయని, జను నొందుగసిపత్ర♦వనములోనఁ
గీ. దగవు దిద్దురుఁ బక్షపా♦తమునఁ బలుక్రు జనుని నత్యుష్ణసైకత♦స్థలములందు
మిగుల వేఁపుదు పదివేల ♦ యుగము లెల్ల, నంతకంతకుఁ గుంతీసు♦తాగ్రగణ్య. 707
సీ. తల్లిని దండ్రిని ♦ దైవంబు నతిథుల, నొగిఁ బూజ సేయక♦నుండువాఁడు
వేపునుమాపును ♦ నోటికైనడి, దినముఁ బురాణము ♦ ల్వినని వాఁడు
దేవతాభావలు ♦ దిగఁదార్చి యన్యభావలశాస్త్రముల్గాని ♦ చదువువాఁడు
ధర్మశాస్త్రంబుల ♦ దప్పించువారలఁ, దెలిసియు వెంబడి ♦ చనువాఁడు

గీ. ఎంగిలిరి రోఁతపడక వెం♦గంగువారు, గానవిద్యలనైఁ జేసియు ♦ గలుగువారు
విష్ణునామత్రయజపంబు ♦ విడుచువారు, నిరయమార్గానువర్తులు ♦ నిశ్చయంబు. 708
శేషధర్మము, ఆ 3.

# బ్రహ్మసభ

చ. దళితవిరోధి యిట్టి దని ♦ గాని తెలుంగ నెఱుఁగంగ బ్రహ్మకుం
గోఁడి నెవ్వి తా నవాఙ్మనస ♦ గోచర మప్పురికూప సిరాక ను
త్తల మనుకంబ మొకట్ల-బియు ♦ తొల్వఁగ సుస్థిర మై నిజప్రభా
వళి వెలిఁగింపు చుండు శశి ♦ వారిజమిత్రులమండలంబులన్. 709
భారతము, సభా ఆ 1 పద్య 79

సీ. మొగిఁ దమ్ముఁ బడసిన♦మునులమూర్తులసిరాజి,ధర్మశాస్త్రములు మూ♦ర్తములుదనర
మణివీథితులపెంపు ♦ మాయించి సాలోక్య, ముక్తులు తను తేజ♦ములు వెలుంగ
వాణివీణారుచి ♦ వారించి సామగా, నంబులుసుతులఁ ది♦వ్యంబుఁ బెంప
మృగమదాదులతావి ♦ మగిడించి నుడిసి ని, గానవాఁబుజగంధ ♦ మతిశయిల్లఁ
గీ. జామరగ్రాహిణీకర♦ చామరత్న, రుచులు వెలుఁగఁజేయుక పాశ♦సుదులు వొలయఁ
గనకమయపద్మకర్ణికా ♦ గ్రమున విశ్వ, కర్త సుఖలీలఁ బేరోల ♦ గమున నుండె.
కుమారసంభవము, ఆ 4 ప 353

సీ. అఖిలవిద్యారహ ♦ స్యముల శంకలు దీర్ప,సరస నుండెడు మునీ ♦ శ్వరులు వొగడ
స్వస్తికహస్తులై ♦ సమ్ముఖంబునఁ బరా, బరిగాఁగసర్వసు ♦ పర్వ లుండఁ
గరతలయుగళిత ♦ క్రియలు గప్పగవిన్న; పంబులకొఱకు ది ♦ క్పతులు సేరఁ
బూర్వదేవతలు కిం ♦ కుర్వాణులై తన, కనుసన్న వలసిన ♦ పనులు సేయ
గీ. గరుడగంధర్వభుజగకి ♦ న్నరపిశాచ, భటులు చావడిముంగటి ♦ బట్టబయలఁ
జటులతరవృత్తిగోటుల ♦ సంఖ్య లెసఁగ, నబ్జగర్భుఁడు గొలువున్న ♦ యవసరమున
కాళహస్తిమాహాత్మ్యము ఆ 2 ప 4.

సీ. గానం నకార్యమి ♦ దానీంసుఖేన వి,శ్రమ్యతాం గంధర్వ ♦ సముదయేన
నాట్యప్రసంగాయ ♦ నహి సమయోచితం, ప్రాచల్యతామప్స ♦ రాంగణేన
పాపత్యతాంనైవ ♦ పరమార్థజిజ్ఞాస, యాద్యవేదాంతి స ♦ మాజకేన
పరచితానోన్యజ ♦ ల్పైరలంస్థీయతాం, మా నేస దేవతా ♦ మండలేన
గీ. భారతీరమణాధునా ♦ పరమపురుష ♦ భావనాపావనసుధాను ♦ భవవశేన
చిరమనుక్రీడతే యంచుఁ ♦ దిరుగుచుండు, రజునిసభయందు వేత్రహా♦స్తాగ్రసరులు
మూర్తిత్రయోపాఖ్యానము. ఆ 2

సీ. కపిలమార్కండేయ ♦ కణ్వాదిమునిశిఖా, మణులతో నొకమోము ♦ మాటలాడ
నిక జేయఁదగుసృష్టి ♦ యిది సేయుఁ డనియుప, బ్రహ్మల కొకమోము ♦ బయలువలుక
భావగర్భము లాడు ♦ భాషావధూటితో, నొకమోము నగుచు న ♦ ర్మోక్తి నుడువ
నప్సరఃకమలాస్య ♦ లాడులాస్యములొక్క, మొగము నూచుట కాభి ♦ ముఖ్య మొంద
తే. విశ్వతోముఖచాతుర్య ♦ ధూర్వహత్వ, మొంది డెందంబు చెలువొంద ♦ నున్నతాబ్జ
రాగసింహాసనస్థుఁడై ♦ రాజసమునఁ, బెద్దకొలువున్న జేజేల ♦ పెద్దఁ గనిరి. 713
ఉత్తరరామాయణము. ఆ 5 ప 8

సీ. క్షణకళాఘటికాది ♦ కాలంబు సాకార, మై గడియారమం ♦ దండపల్క
గ్రహతారకారాశి ♦ గణము లల్లనఁ జేరి, పంచాంగదినశుద్ధిఁ ♦ బల్కరించ
సకలదిగ్దేవతల్ ♦ సభికుల నెల్లను, జోటు లెఱింగి కూ ♦ ర్చుండ సనుప
పంచభూతంబులు ♦ ప్రణమిల్లి యేసృష్టి, నేమించునోయని ♦ మోముఁ జూడ
గీ. వేదములు వందిజనములై ♦ వినుతి సేయ, శాస్త్రములు వేత్రపాణులై ♦ సంచరింపఁ
జెలఁగి కొలువున్న త్రైలోక్య ♦ సృష్టికర్త, నగరివాఁకిట నిజవాహ ♦ నంబుడిగ్గి.
అహల్యాసంక్రందనము. ఆ 1

# విష్ణుసభ

సీ. అతులితధర్మంబో ♦ ధైశ్వర్యవైరాగ్య, ములును దశ్చక్తులు ♦ మొగిని నాల్గు
వేదచతుష్కంబు ♦ నాదిగానాలుగు, పాదంబు లందును ♦ భక్తి నిలువ
నాక్యపోమాగ్నులు ♦ సారిదివధ్యంబులఁ, గమఠనాగాధిప ♦ గరుడముఖ్యు
లాధారమైత్రాల ♦ నఖిలమంత్రములతో, సావిత్రికర్ణిక ♦ నావహిల్ల
గీ. సలలితదివ్యమకుటకీ ♦ లితనవీన, రత్నరుచిజాలపరివృత ♦ రమ్య మగుచు
నఖిలనాగేంద్రసన్నుత్యగ్రీయ ♦ మై వెలుంగు, నంబుజోదరుదివ్యసిం ♦ హాసనంబు. 715
సీ. [illegible] ♦ [illegible]దళంబుల, విమలాదిశక్తులు ♦ వెలయుచుండు
[illegible] ♦ విమలయుత్కర్షిణి, ప్రజ్ఞాక్రియాయోగ ♦ ప్రహితసత్య
యీశానయును పేళ్ళ ♦ నెనిమిదిదిక్కుల, రమణతో వింజామ ♦ రంబు లిడుచు
సద్దేవు సేవింతు ♦ రంతఃపురాంగన, లేవురు విమలపూ ♦ ర్ణేందుముఖులు
గీ. కమలలాంఛనహస్తలై ♦ కమలనేత్రుఁ, గొలిచియుండుదు రెప్పుడు ♦ కొమరుమిగిలి
విహగనాయకశేషాహి ♦ విబుధవరులు, నిత్యముక్తులుగొలుతురు ♦ నియమమెసఁగ.
సీ. అంచబోదల ధిక్క ♦ రించుయానము లొప్ప, నలినాయతాక్షులు ♦ నాట్యమాడఁ
[illegible] ♦ [illegible] లొప్ప, పర్వేందువదనలు ♦ పాటఁ బాడ

మణిబింబముల నెంచు ♦ మధురాధరములొప్ప, పువ్వారుబోండ్లుతాం♦బూలమీయఁ
జమరువాలములబిం♦కెము లూర్చ కుకలొప్ప, రమణీమణులు చామ♦రములువీవఁ
గీ. బసిఁడిబెత్తములు ధరించి ♦ కుసుమగంధు, లంత నంత నవంతప♦ ర్మాసనాది
పారిణికోటులు మనవులు♦పన్యసింప, నిందుకొలువుండె దైతేయ♦ఖండనుండు. 717
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 24.

# ఈశ్వరసభ

సీ. దశనసౌదామి [illegible] జనక మో మలరించి, నీరజోదరుఁ దన్నుఁ ♦ జేరఁ బిలిచె
వచనామృతౌఘప్రవాహాభిషిక్తుగాఁ, జేయుచుఁ బరమేష్ఠి♦ వాయఁ బిలిచెఁ
గరతలారుణదీప్తి ♦ కరరుహద్యుతులలో, సంధిల్ల నింద్రుఁ జే♦సన్న నునిచె
దృజ్మరీచులు వర్వ♦ దిగధీశ్వరుల నోలి, మన్నించి కన్నుల ♦ సన్న నునిచె
గీ. నంత నందిమహాకాళు♦లఖిలసిద్ధ, సాధ్యదేవాసురేంద్రాది♦జనుల నెల్ల
వరుస నునిచిరి శివుఁడు దే♦వతల కెల్లఁ, గరుణఁ గొలు విచ్చి పేరోల♦గమునునుండె.
కుమారసంభవము, ఆ 6 ప 990.

సీ. తననిజరూప మిం♦తయునుని దెలియక, వాదంబు సేసెడు ♦ వేదరవముఁ
గరుణావలోకనా ♦ కాంక్షితులైయున్న, బ్రహ్మాదిసనకసం♦ప్రణుతిరవము
సారశివానంద ♦ సల్లాపముల నొప్పు, ప్రమథగణాళియా♦ర్భటరవంబు
డమరుమృదంగాది ♦ ధమధమధ్వనితోడి, పటుభృంగినాట్యవి♦స్ఫారర[illegible]
గీ. మానుగాఁ జామరలు వీచు♦మాతృకాది, కామినీజనమహితకం♦కణరవంబు
మెండుఁ జెలఁగంగఁ గన్నుల♦పండువయ్యెఁ, గొండరాచూలి పెనిమిటి♦నిండుకొల్వు.
భాగవతము, స్కం. 6 పద్య 486.

సీ. కైలాసగిరిమీఁద ♦ గాలకంఠుఁడు దివ్య, హాటకరత్నసిం♦హాసనమున
నద్రిజ నుంచి మ♦హాప్రదోషంబున, సకలదేవర్షులు ♦ సన్నుతింప
వాణీమహాదేవి ♦ వీణమీటుచు నుండఁ, గమలసంభవుఁడు దా♦ళములు వైవ
దానవాంతకుఁడు మృ♦దంగవాద్యము సల్ప, శ్రీలక్ష్మి గానంబు ♦ సేయుచుండ
గీ. వాసవుఁడు వైణవోన్నన♦స్వరముఁ గూర్చ, గరుడగంధర్వయక్షకి♦న్నరపతంగ
సిద్ధవిద్యాధరాధిపుల్ చేరి కొలువ, హర్షమిగురొత్తఁ దాండవం♦బాడుచుండు.
బ్రహ్మోత్తరఖండము, ఆ 8.

సీ. అమరకోటులవేత్ర♦హస్తుడౌ నందికేశ్వరుఁడు ముందర బరా♦బరులు సేయ
కంకణఝణఝణ♦త్కారముల్ ద[illegible]కన్యలు చామరో♦త్కరమువీవ

జగ్గకిణకకిణ♦ఝుంఝుంతరికియని, రవళించి భృంగితాం♦డవమొనర్ప
జయజయశబ్దక♦త్సలశర్వయని సనకసనందనాదు ల♦గ్గలికఁబొగడ

గీ. గిరిజవామాంకతలమునఁ♦గరము మెఱయ, మాననీయప్రభాదీప్య♦మానరత్న
చిత్రసింహాసనమున నా♦సీనుఁడగుచు, హరుఁడు పేరోలగంబుండె♦ సమితమహిమ.
నాగరఖండము, ఆ 1 ప 96.

సీ. తొడమీఁదఁ గూర్చుండి♦తొడరియేనికమోము, కొడుకు సయ్యాటముద్దు♦గురియుచుండ
వేమాఱు గౌరితా♦ వెనకయ్య వెనకయ్య,యగు కుమారుని ముద్దు♦లాడుచుండ
గారాము సెఱియంగ♦ సారెసారెకు వచ్చి, వీరభద్రుఁడు దండఁ♦జేరి యుండ
బిత్తరింపుమఁ జేరి♦ భృంగీశ్వరుఁడు మ్రోల, నందంద నట్టుక♦యాడుచుండ

గీ. నారదుఁడు వీణ మీటి గా♦నములు బాడ, బారలుగ నంది కడుబరా♦బరలు సేయఁ
బ్రమథవర్గంబు లొగి విన్న♦పములు సేయ, శివుఁ గొలువుండె నప్పు మహా♦దేవుఁ డపుడు.
లక్ష్మీనారాయణపరిణయము, ఆ 3.

# రామసభ

క. కొలువుండెఁ గలశజలనిధి, వెలిచిలువ మెఱుంగుగద్దె♦ విష్ణుఁడు పోలెన్
ధళధళలుగుల్కు వజ్రపు, బెళుకుల విలసిల్లు సింహ♦పీఠము నందున్. 723

సీ. శృంగసంగతమైన♦బంగారుగట్టుచం,దమున సౌమిత్రి వే♦త్రము ధరింపఁ
జెంత జాబిల్లికిఁ♦జేయిచ్చెనో యన, భరతుండు ధవళాత♦పత్ర మూన
వామనాకృతిఁ జూపు♦వహి నానతాంగుఁడై, లవణారికార్యజా♦లంబుఁ దెలుప
స్వాభీష్టఫలసిద్ధి♦లందుకై వడి వాలి, యనుజుండు కానుక♦లందు కొనఁగ

గీ. నడప మంసంబుపై వ్రేల♦నంగదుండు, మట్టముగఁ జేర్చి తెలనాకు♦మడిచియొసఁగ
ననిలసూనుండు పైఁజాచు♦ నడుగులొత్త, నుండు విభుఁ గొల్వ కన్నుల♦పండువయ్యె.
సుదక్షిణాపరిణయము ఆ 1 పద్య 89, 90.

సీ. మణిసహస్రముల ద్యో♦మణిసహస్రంబుల, డంబు మెచ్చని కిరీ♦టంబుఁ దాల్చి
మొగముచందురుని గెల్వ♦ మొనయుకీర్తియనంగఁ, దెలివి గాఁగ పురంపుఁ♦దిలకమూని
నిజగుణావలిలీల♦ నిర్మలశ్రీమించు, తళుకుముత్యాలచా♦కళి ధరించి
బలిమి కేళికిఁ బూను♦ ఒలుబిరుదములు నాఁ, గరముల వజ్రాల♦కటకము లిడి

గీ. పొసఁగఁ గుంకుమగంధంపు♦పూఁత రత్న,హారములు గానగా ముత్తి♦యంపు టంగి
రహిఁ దొడిగి పెద్దపీతాంబ♦రంబు వెలయఁ, గొలువు సింగారమయ్యె ర♦ఘుప్రభుండు.
ఉత్తరరామాయణము, ఆ 5 ప 247.

# కృష్ణసభ

సీ. విడిదింబు రుక్మిణీ♦విమలాంగి యొసఁగంగఁ, జందనం బరమున ♦ సత్య పూయ
సురటి జాంబవతి వీ♦చుచు నుండఁ బూసరుల్, కాళింది సిగపైని ♦ గడలుకొలుప
నిలువుటద్దముఁ బూని ♦ నెఱి సుదంత వసింప, మిత్రవింద కరంబు ♦ మేనఁ దాల్ప
భద్రపాదాబ్జముల్ ♦ భద్రంబుగా నొత్త, లక్షణ దాసి మే♦లంబు లాఁదఁ
గీ. దక్కిన పదారువేలకాం♦తలును జట్టుఁ, గొలువఁగొలువుం డెఁ గృష్ణుఁడు♦లలితసకల
మైనశృంగారమును మూర్తిఁ♦బూనినట్లు, నిండుమతితోడఁ గన్నుల ♦ పండువుగను.
వేంకటాచలమాహాత్మ్యము.

సీ. బలభద్రముఖ్యులు ♦ భద్రపంచాననా, సనముల నుభయపా♦ర్శ్వములఁ జేరఁగఁ
గంకణాద సం♦కలితశయ్యాబ్జులై, రామామణులు చామ♦రములవీవ
నయనహస్తముఖాభి♦నయములు మీఱంగ, నచ్చరల్ రమ్యలా♦స్యముల సలుప
నఘకంసశకటాది ♦ హరణజయాంకముల్, వినుతింపుచును వంది♦జనము గొలువ
గీ. భువనమోహనకరమూర్తి ♦ భువనజాత, జాతశంకరముఖసుర♦జాతిహృదయ
వర్తి యాదవకులచక్ర♦వర్తి భవ్య, తమసుధర్మను బేరోల♦గమున నుండి. 727
సుమనోమనోభిరంజనము, ఆ 2 ప 4.

# ఇంద్రసభ

క. శతమఖుసభ శుభరత్నాంచితకాంచితరచిత వతిక♦చిత్రము లోక
త్రితయాఖిలలక్ష్మీసంశ్రిత మలవియె దానిఁ బొగడ♦ శేషున కయినన్. 728
చ. అతుల విభూతితో మణిమ♦యాభరణద్యుతు లొప్పఁగా శత
క్రతుఁడు శచీసమేతుఁ డయి ♦ కాంచనచారువిమానమాలికా
గతదివిజోత్తముల్ గొలువఁ♦గాఁ గొలు వుండు వరాప్సరోంగనా
యతవిలసత్కటాక్షకుసు♦మార్చితసుందరవక్త్రచంద్రుఁడై. 729
సీ. వదలక యేలిన♦వానిప్రస్తవమునఁ, బోరిలో నీల్గిన ♦ వీరభటులుఁ
దమకులధర్మముల్ ♦ దప్పక సలిపిన, గృహమేధులును జగ♦న్మహితకీర్తిఁ
బరఁగినధన్యులుఁ ♦ బరహితవ్రతు లైన, పురుషులు దుర్గరా♦మరణశోక
భయబాధుషార్తి♦సాహాయ్యహేతు లై, కొలుతురు సుర♦నాలసిగ ర్త

ఆ. సర్వకామములు స♦దక్షిణక్రతువులు, శ్రీవిలాసములు య♦శేషయజ్ఞ
వాహమంత్రతతులు ♦ వచ్చి సేవింతురు, మూర్తిమంతు లగుచు ♦ ముదముతోడ.
భారతము, సభా. ఆ 1 పద్య 61-65.

సీ. నిండుపున్నమనాఁడు ♦ గండరించినచంద్ర, మండలశ్రీలతో ♦ మారుమలయ
భద్రవిద్యోతాత♦పత్రంబు గ్రాలుచు, మిన్నేటితరఁగల ♦ మేలుకొలుపఁ
గలితదివ్యాంగనా♦కరతలచాతుర్య, చామీకరశ్రేణి ♦ జాడపఱుపఁ
జింతామణిస్ఫుట ♦ కాంతరత్నానేక, ఘటితసింహాసనా♦గ్రంబునందు
గీ. నూరుపీఠంబుపై శచి♦యుండ నుండి, వరుసదిక్పాలకాదిదే♦వతలు గొలువ
సాటిసెప్పంగరానిరా♦జసముతోడ, నింద్రుఁ డొప్పారె వైభవ♦సాంద్రుఁ డగుచు.
భాగవతము, సం. 6 పద్య 260.

సీ. బహులక్షణానుమా♦నప్రభావంబులఁ, గనుపట్టు సుకవివా♦క్యములచేత
నరిదగకవమహి♦మాధాయకంబులై, తనరెడు గురునియం♦త్రములచేత
శాస్త్రాదికరణచ♦ర్చాభీతవిమతరై, కొలువున్నాత్మజబుధ♦గోష్ఠిచేత
శ్రుతిపీఠవర్ణవి♦స్ఫురణమాధురిఁ జాల, సొగయువిద్యాధర♦స్తుతులచేత
గీ. నలరుచుండఁ బురందరుఁ♦డూర్వశీశ, చిత్రభాషారిణీఘృతా♦చీతిలోత్త
మాప్రముఖాప్సరోవధూ♦మణులు గొలువ, నొనరి యొడ్డోలగంబయి♦యుండునపుడు.
చంద్రభానుచరిత్రము, ఆ 2 ప 70.

సీ. ఒకచోటఁ బ్రకటహా♦టకసముద్యద్దీప్తి, పుంజమాతపపరి♦స్ఫూర్తిచూప
నొకచోటఁ బద్మరా♦గోపలప్రభలు సం, ధ్యారాగవిభ్రమం♦బావహింప
నొకచోట వజ్రమౌ♦క్తికధాళధళ్యవి, నిర్మలరుచులు వె♦న్నెలలు గాయ
నొకచోట హరినీల♦నికరవిస్ఫుటనైల్య, కాంతులు చీకటుల్ ♦ గ్రమ్మఁజేయ
గీ. మిశ్రబహువిధమణిగణా♦మితమరీచి, జాలమొకచోటఁ గిమ్మీర♦లీలనింప
వైభవశ్రీసమున్నతి♦వర్ణనీయమగు సుధర్మాభిధానస♦భాంతరమున. 733
కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. శచిముద్దుమోముఁ జూ♦చుచు నాగకన్యాన, వీనగానము విను♦వింతహొయలు
వేల్పులమునవులు ♦ వినుచు నచ్చరమచ్చె, కంటులనటనంబుఁ♦గాంచుమురువు
ధనదాదిహితమంత్రి ♦ జనులతోఁ బల్కుచు, మునులవాదులకు న♦వ్వెనయుహరువు
ప్రెముక్కువారలకుఁ గేల్ ♦ మోడ్చుచుగురుఁడాన, తిచ్చునయుక్తిలెఱుంగు♦ హెచ్చరికయును

గీ. దనరుఁ జెల్లు ననంగ సం♦తసము నొసంగ, వైజయంతంబుపైఁ గొలు♦వై జయంత
ముఖులు బర్హిర్ముఖులు చంద్ర♦ముఖులుగొల్వ,నిందుకొలువున్న దేవతా♦నేతఁ గనితి
ఉత్తరరామాయణము, ఆ 4 ప 278.

సీ. కనకాంగియపరంజి ♦ కాళాంజధరియింప, సొగసుగా మేనక ♦ సురటివిసర
శశిరేఖవలిపెంపు ♦ చల్వపావడ వైవ, రంభోర్వసులు చామ♦రములు వీవ
తారాసరోజాక్షి ♦ తాలవృంతముఁ బూనఁ, గర్పూరతిలక బా♦గా లొసంగఁ
జిత్రరేఖపసిండి♦చే గిండిధరియింపఁ, గ్రితుశుల్కమణిపాద♦కలు వహింప
గీ. దాన్యమాలిని నిల్వుటద్దంబు చూప, మంజుఘోషాలివేణీసాం♦బ్రాణి వేయఁ
జంద్రకళచేరి పాదాంబుజంబు లొత్తఁ, బెద్దకొలువుండె దైతేయ♦భిదురపాణి.
దశావతారచరిత్ర, ఆ 3.

## —♦ యమసభ ♦—

క. ధర్మసభ లోకధర్మా, ధర్మవివేకాస్పదంబు ♦ తైజసము లస
ద్భర్మమణితతుల దానిన్, నిర్మించెను విశ్వకర్మ♦నిపుణత యొప్పన్. 738
భారతము, సభా. ఆ 1 పద్య 67.

సీ. కణ్వ గార్గేయ మా♦ర్కండేయు లొకవంక, సముచితస్మృతివివా♦దములు సలుపఁ
దమరుదెచ్చినప్రాణ♦తతులముందట నుంచి, యొడనెడఁ గింకరుల్ ♦ హెచ్చరింప
నెవ్వరెవ్వరినొంతు ♦ రెందెందుఁబోదుమం,చాకృతుల్ గనియామ♦యములుపలుకఁ
గవిలెలోనున్నప్ర♦కారానఁ బ్రజపాప,పుణ్యముల్ చిత్రగు♦ప్తుండు దెలుప
గీ. ధర్మపీఠంబుననుగాఢ♦దండమ్మునొప్ప, సహితుఁడై నిండుకొలువుండి ♦ సకలలోక
వంద్యుఁడాతండు సుగుణాని♦వహ్నుగాఁగఁ, గాంచియొనరేఁగి మ్రొక్కి యర్ఘ్యంబొసంగి.
ఉత్తరరామాయణము, ఆ 8 ప 816.

## —♦ వరుణసభ ♦—

క. వరుణసభ సర్వలోకో, త్తర ముజ్జ్వలమణిమయము సి♦తప్రభ మతిసుం
దర మం దుండును వరుణుఁడు, వరుణానీసహితుఁడై ధ్రు♦వం బగుమహిమన్.
సీ. అందు సుఖాసీనుఁ♦డైనయవ్వరుణేంద్రు, నంబుధుల్ గొల్తురు ♦ నధికభక్తిఁ
గాళింది నర్మద ♦ గంగ గోదావరి, విదిశ విపాశ కా♦వేరి కృష్ణ
వేణి సరస్వతి ♦ పెన్న యైరావతి, యనఁగఁ బ్రసిద్ధంబు♦లయిననదులు
సరసీతటాకని♦ర్ఝరదీర్ఘికాదులు, దిక్కులు నధికధా♦త్రీధరములు

ఆ. పసుపతియును దేవ♦పంతంబులై వచ్చి, మకరకూర్మశింశు♦మార సింహ
శరభసారంగజాతి ♦ జలచరస్థలచర, తతులతోడ సంత♦తంబుఁ గొలుచు. 739

భారతము, సభా. ఆ 1 పద్య 69-71.

—♦ కు బే ర స భ ♦—

క. గగనగమన యుండ్రసభతో, నెన యగుచు మహావిభూతి ♦ నెంతయు నొప్పం
దనర దిక్పాలక్కి సాతం, డూపరఁగ నిర్మించె దాని ♦ నుత్తమమణులన్. 740
క. అందుఁ గుబేరుఁడు పరమానందంబున నుండు ధర్మ♦నందన విలస
న్మందార పారిజాతక, చందనమందానిలాభి♦నందితుఁ డగుచున్. 741
ఉ. దానికి నెయ్యుఁడై యమర ♦ వంద్యపదాంబుజుఁ డంబికాబృహ
త్స్తనపరూఢరాగ్రపరి♦పీడితవక్షుఁడు భూషణీకృతా
హీనుఁ డశేషలోకగురుఁ ♦ డీశ్వరుఁ డెప్పుడు నంద యుండు నా
నానిశితాయుధాయుతస♦నాథమహాద్భుతభూతకోటితోన్. 742

భారతము, సభా. ఆ 1 పద్య 73-77.

—♦ మ య స భ ♦—

క. జలములు లేనితావుల, వలువలు వెస నెగయఁ దిగిచి ♦ వారక తోయం
బులు గలచోటను జేలం,బులు దడియఁగఁ బడిరొ నిజవి♦భుత్వము వలుఁగన్. 743

భాగవతము, స్కం. 10 పద్య 824.

# పీ ఠి కా పు ర ము

సీ. ఏపట్టణముప్రోల ♦ నేలేలు ప్రవహించుఁ, బృథివికి ముత్యాల ♦ పేరు వోలె
మున్నూటయరువది♦మూర్తిభేదములతో, విహరించు నేవీఁట ♦ వేల్పుపిండు
పీఠాంబచెలిమోఁ ♦ పీఠిహుంకృతిమగ్గ, ననచి కాపుండు నే ♦ నగరి కెలనఁ
గుంతీమహాదేవి ♦ కూర్మితో నెల్లుఁడు, మాధవుం డేవీఁట ♦ మరగినాఁడు
గీ. పెద్దగవమ్మల నెపుట♦ భేదనమున, నెలకు నిలుమందు క్రీడావి♦హీనజఘనుఁ
డట్టి పీఠాపురముఁ జేర ♦ నరుగుదెంచె, బరమశైవుండు శ్రీపరా♦శరసుతుండు.
గీ. నారికేళంబుమట్ట నె♦న్నడిమిచాను, దళములుగాదును బోలె సం♦తతముఁ జాలు
వేణికాసారంబులయందు ♦ విస్మయముగ, జగతి నెక్కుడి వేళేటి♦ సాటినదులు. 745
సీ. ఏవీటి విరిసిరు ♦ నిరుగానుంబందుఁ, బ్రాఫంగుపరిచేలఁ ♦ బసిఁడిచాయఁ
బరిపాకమున వేరు ♦ పనస పండులతావి, యిందిందిరములకు ♦ విందు సేయు

విక్షా చంద్రికా ♦ విలసనేందూదయం, బైశ్వర్యవనవసం ♦ తాగమంబు
ఘనపుణ్యసస్యరా ♦ శ్యమకూలవర్షంబు, ముక్తికన్యోద్వాహ ♦ ముఖ్యలగ్న
గీ. మచటి కరుదెంచు జనులక ♦ యత్నసిద్ధ, ఫలము శ్రీకుంతిమాధవ ♦ స్వామి దివ్య
మందిరవిమానదేదీప్య ♦ మానవిపుల, ధామధామసుదర్శన ♦ దర్శనంబు. 751
రామరాయవిలాసము, ఆ 1 ప 64-66.

# సర్పపురము

సీ. శ్రీసుదర్శనశంఖ ♦ చిహ్నాంకితము గాక, యెపుడు మిన్నకయున్న ♦ యిల్లు లేదు
బహులోర్ధ్వపుండ్రసం ♦ పదలేక వృథయైన, ఫాలరేఖలతోటి ♦ ప్రజయు లేదు
వైష్ణవోత్తమభాగ ♦ వతసాత్వికులగోష్ఠి, వెలియైనవాటికా ♦ వేదిలేదు
నలిసేసకొనుచు భావ ♦ నారాయణస్వామిఁ, దప్పించి పరదైవ ♦ తంబు లేదు
గీ. సనకగీర్వాణయాగవై ♦ భవము నెలవు, నిఖిలకల్యాణగుణకేలి ♦ నిలయ మనఘ
దివ్యములు నూటయెనిమిది ♦ తిరుపతులకుఁ, బరమపదమైన శ్రీసర్ప ♦ పురమునందు.
భీమేశ్వరపురాణము, ఆ 2 పద్య 65, 66.

# కాకినాడ

సీ. చంద్రశాలాగ్రవ ♦ సద్వధూచిత్రిక, రచనాముకురభూత ♦ రాజబింబ
ప్రతిధ్వనమృదురగా ♦ నానుగుణమృదంగ, రావవర్ధితరంగ ♦ రవకదంబ
మణినీసుధాజిద్ధి ♦ నివహాసకృత్ప్రత, సవహోమధూమహ్వ ♦ ప్తద్వృతశంబ
మురసుధామయసౌధ ♦ యూధసమాలోక, నరజతాద్రిగవేషి ♦ హారికలంబ
గీ. మాత్రివిష్టపవాస్తవ్య ♦ నేత్రచిత్ర, దీపికాస్తంభజృంభణా ♦ దిగతభీక
కలశజాభ్యాశగచ్ఛద ♦ ఖిలసుపర్వ, గణము శ్రీకాకినాడ ప ♦ ట్టణము దనరు. 753
సుమనోమనోభిరంజనము, ఆ 1 ప 5.

# దక్షారామము

సీ. కామ్యార్థఫలసమ ♦ గ్రకల్పతరువాటి, దళితపాతకకోటి ♦ దక్షవాటి
పరిణుతకల్యాణైక ♦ గుణమణివ్రజపేటి, ధాత్రీకటీశాటి ♦ దక్షవాటి
సమ్మనీందారిరామ ♦ సస్యమేఘస్ఫోటి, దమితరోగనిశాటి ♦ దక్షవాటి
రథవిమానాతప ♦ త్రపతాకగజఘోటి, తాపాద్రికతకోటి ♦ దక్షవాటి
గీ. దర్పితాశాలతాకోటి ♦ దక్షవాటి, దనరు నిగమాదిపురిచేటి ♦ దక్షవాటి
ద్వారసేవితకర్ణాటి ♦ దక్షవాటి, రక్షితేందుకిరీటి శ్రీ ♦ దక్షవాటి. 754
రుక్మాంగదచరిత్రము, ఆ 1 ప 88.

గీ. దక్షవాటికఁ బశ్చిమ♦ద్వారభూమిఁ, బ్రీతివసించును సర్వాంగ♦రమ్య యగుచు
సేవకులపాలి సురశాఖి♦ పూవుఁగొమ్మ, కోమలార్ధేందుముఖకొమ్మ♦ గోగులమ్మ.

గీ. దక్షపురమునను త్తర♦ ద్వారమందు, నూర్జితంబుగ నుండు మ♦హోజ్జ్వలాంగి
కామితార్థైకసంకల్ప♦ కల్పవల్లి, మహితసుగుణమతల్లి శ్రీ♦మండతల్లి. 755

క. సారమతిదక్షవాటిక, తూరుపుగవనిన్ బ్రసిద్ధి♦తో వసియించున్
హేరాళక్రీడాసంచారిణి నూకాంబ భక్త♦ జనరక్షణకై. 756

క. మట్టయినయట్టి దక్షుని, పట్టణమున దక్షిణంబు♦ పార్శ్వపుఁ గవనిన్
నెట్టుకొని వెలసి నిలిచిన, ఘట్టాంబికఁ గొల్వఁ గలుగుఁ♦ గామితఫలముల్. 757

గీ. పృథివిఁ బదునెనిమిదియోగ♦పీఠశక్తి, గణములో నెంచ సర్వశృం♦గారయగుచు
భీమనాథునిసన్నిధిఁ♦ బ్రేమ వెలయు, మాణికాదేవి సకల క♦ల్యాణమూర్తి. 758

ఉ. ఏదెసఁ జూచినన్ విబుధు♦ లేదెసఁ జూచిన మౌనిమండలం
బేదెసఁ జూచినన్ హరిద♦ధీశ్వరవర్గము వాసవాది యం
దేదెసఁ జూచిన న్నవమ♦హేశ్వరమూర్తులు శ్రీనికుంభకుం
భోదరతండు భృంగిరిటి♦హూహూకహాహులు దక్షవాటికన్. 759

సీ. అగ్రజుండైనను♦ నంత్యజుండైనను, బాఁబోఁడియైనను♦ బురుషుఁడైనఁ
బరమమూర్ఖుండైనఁ♦ బండితుండైనను, దారిద్ర్యగుండైన♦ ధనికుఁడైనఁ
బలవంతుఁడైనను♦ బలహీనుఁడైనను, బ్రాయంపువాఁడైనఁ♦ బంగువైన
నాస్తికుండైనను♦ నస్మృతవాదియునైనఁ బరఁగగార్దభమైనఁ♦ బందియైనఁ
గీ. గీటకంబైన బకమైనఁ♦ గ్రిమియునైనఁ, బాదపంబైనఁ దృణమైనఁ♦ బ్రాణరహిత
మై రహిని దక్షవనచతు♦ర్ద్వారసీమఁ, బొందుఁ గైవల్యకళ్యాణ♦ భోగలక్ష్మి. 760

సీ. దక్షవాటీమహా♦స్థానంబులో లేని, యమరులేస్థానంబు♦నందు లేరు
దక్షవాటీమహా♦స్థానంబులో లేని, యర్థమేస్థానంబు♦ నందు లేదు
దక్షవాటీమహా♦స్థానంబులో లేని, యమృతమేస్థానంబు♦నందు లేదు
దక్షవాటీమహా♦స్థానంబులో లేని, యజ్ఞమేస్థానంబు♦నందు లేదు
గీ. దక్షవాటిక సకల తీ♦ర్థముల కిరవు, దక్షవాటికసకలవి♦ద్యలకు గరిడి.
దక్షవాటిక విభవంబు♦ తానకంబు, దక్షవాటిక శివునియం♦తఃపురంబు. 761

భీమేశ్వరపురాణము, ఆ 1, 6.

## రాజమహేంద్రవరము

సీ. కనకప్రాకారాగ్రవిహార♦మార్కండేయశివశిర, శ్శశిచంద్రికాధౌత ♦ సౌధవీథి
గౌతమీలహరీపుణ్య ♦ కూలంకషాజల, స్నాపితశ్రీపదాబ్జ ♦ పాదయుగళి
బింబదభ్యస్త ♦ ప్రాకారపరివేష, గంధూపితాజాండ ♦ మండలంబు
... దంతావళ ♦ శ్రీవేద ఘంటికా, ఠంకారముఖరఘం♦టాపథంబు
గీ. రాజబింబాననానూత్న ♦ రత్నపేటి, వీరరాహుత్తసుభటకం♦ఠీరవాద్రి
వేదఘోషాభిరామాభ్యా♦వృద్ధికరము, సాంద్రవిభవంబు రాజమ♦హేంద్రవరము. 762
భీమేశ్వరపురాణము, ఆ 1 ప 42.

సీ. ఉండు నేపట్టు మా♦ర్కండేయమునినాథ, సజ్జలింగ మనంగ ♦ శాసనుండు
ప్రవహించు నేపట్టి ♦ పశ్చిమప్రాకార, మొరసిగంగమ్మ సా♦గరముకొమ్మ
యావిర్భవించినా ♦ దేపట్టికోటలో, బలభేది మదనగో♦పాలమూర్తి
పాలించు నేపట్టి ♦ ప్రాగుదక్కోణంబు, నుమబోటి శ్రీమల్ల ♦ గౌరిశక్తి
ప్రబలధారాసురత్రాణ ♦ భద్రజాతి, కరిఘటాసైన్యదుస్సాధ ♦ కనకలోహ
గీ. గోపురద్వారకవాటప్ర♦దీపితమతి, సాంద్రవిభవంబు రాజమ♦హేంద్రపురము.
కాశీఖండము, పద్య 58.

ఉ. రాజిలు వేగినాటి కమ♦రాజితమైనదిరాజధాని శ్రీ
రాజమహేంద్రపట్టణము ♦ రాజనరేంద్రునిచేతఁ బాలితం
బై జగతీసతీగళము♦నందును గౌతమితోడఁ దాలిబొ
ట్టై జిగిమించువార్ధవర♦మాధిప వీర కవీశవంద్యమై. 764

ఉ. బంగరుగిండ్లఁ యయ్యమృత ♦ భావితకుంభములో యనంగ నొ
ప్పుం గమలాఫలంబులవి♦పొల్పుగఁ దత్పరి మాణకాంచనా
ప్తిం గనవట్టివారుకని♦పింప రటం చెటఁగించు నెందు శ్రీ
సంగతి రాజమహేంద్రపురి ♦ సంపదుదంచితలీల మించదే. 765

మ. తమ జాతు ల్వరికింప నేటి కిట ని♦చ్చల్ సర్వవర్ణస్థులున్
సములై మించెద రంచుఁ దెల్పనో యనం♦జానొంద నాబాలవృ
ద్ధముగా నందఱు నాగ్నిహోత్రులుగనే ♦ దైవారుచుం డ్రారచి
త్రము శ్రీరాజమహేంద్రపత్తనము సం♦స్తవ్యంబు గాదేరికిన్. 766

ఉ. ఏవసతిం గనుంగొనిన ♦ నిప్పుకి నొప్పుగ నావకాయనా
మావిడియూరగాయదగు ♦ మాఁగుచు నూనియలోన మీఁగలన్

మావిడియుం గదాయటులె ♦ మాన్యమిదౌనన మించి రమ్యమై
సేవిత మెల్లవారికగు ♦ సిద్ధరసాయనమోయనంగడున్. 767

ఉ. రాజమహేంద్రిపూర్వరము ♦ రమ్యమగుం బతకంబుగాఁగవి
భ్రాజితగౌతమీమణిస♦రంబునఁ దత్పురలక్ష్మిపోఁడిదరై
శ్రీజగతుల్ సుభాగ్యయుతుఁ ♦ జెందెదుచంద మెఱింగి కాంచెదున్
దా జలజాక్షియై యినునిఁ ♦ దామరసాతని నుత్పలాక్షియై. 768

ఉ. అంగుగమామతేఁడి మతి ♦ యంగన మాయెన్యోనా మృగాక్షి చి
త్రాంగి సపత్ని పుత్రకునిఁ ♦ దామరసాంబకుఁ గోరి రామి సా
రంగధరుండు దన్ జెటిచె ♦ నంచును దబ్బఱలాడి కేలుగా
ళ్ళం గొఱగాకయుండఁగ వె♦లార్చుట దండనుగొండదెల్పెడున్. 769

మ. ధర సారంగధరుం డదోషుఁడని త♦త్సాక్ష్యంబునుం దెల్పి వ
చ్చిగొనా నుత్తరపక్షిణంబుల నొగిన్ ♦ శ్రీపుష్ప్రకండూద్భవే
శ్వరుఁడున్ శ్రీపతియౌ జనార్దనుఁడు ని♦చ్చల్ పొల్తు రెద్దాని కా
పురమే రాజమహేంద్రనామమున నె♦ప్డుం జూడ నొప్పుం గడున్. 770

ఉ. ఐదువరాలు రూపఱమ♦హైదువరాలగు నంత నట్లుగా
నైదువగా లదెంతవఱ♦కైనను నైదువరాలుగానొగిన్
గాఁదగుఁబెంపుగాననిల♦నాకము రాజమహేంద్రిపత్తనం
జేదయివాలు నిత్యశుభ♦వృద్ధి సువిశ్రుతిగౌతమీతటిన్. 771

కుమారనృసింహము, ఆ 2.

## ఏలూరు

సీ. బహురత్నవిరచిత ♦ ప్రాసాదములచేత, రమణీయమగు గోపు♦రములచేత
యిందిరాకరదివ్య ♦ మందిరంబులచేత, శుకరకపోతపా♦లికలచేత
తపనీయమయదేవ♦తాధామములచేత, పటువజ్రసోపాన ♦ పఙ్క్తిచేత
భర్మశైలోన్నత ♦ ప్రాకారములచేత, దివిజేంద్రనీలవే♦దికలచేత
గీ. విమలపద్మాకరోద్యాన ♦ సమితిచేత, గంధగజవాజిధేనుసం♦ఘములచేత
ధరణిసురముఖ్యసజ్జనో♦త్తములచేత, భవ్యగతిఁబొల్చు నేలూరి ♦ పట్టణంబు. 772

శివలీలావిలాసము, ఆ 1 ప 63.

## నూజవీడు

సీ. ద్విజరాజకేతన ♦ ద్విజరాజధరసిత, ద్విజవాహసన్నిభ ♦ ద్విజగణంబు
కార్తవీర్యార్జున ♦ కార్తికేయార్జున, కీర్తితకుతిరియ ♦ వర్తనంబు

రాజీవదళపహాస రాజీవనిధిరాజ, రాజసమ్మితవణిగ్రాజితంబు
కర్షణాంచితబాహు దర్శితవైరి సంకర్షణామిత సత్వకర్కశంబు
గీ. చటులవిక్రమపటురటద్భటచయంబు, నటవిటశ్రేణిరంజిత నరచయంబు
మత్తవేదండతండంబు మహితచక్రి, తురగనికరంబు నూజివీట్పురవరంబు. 773

వల్లవీపల్లవోల్లాసము, ఆ 1 ప 12.

## ఆగిరిపల్లి

సీ. మహనీయవిజ్ఞాన మహిమయుగ్వైష్ణవ, నిత్యసూరిశ్రేణి నివ్వటిలఁగ
దివ్యపద్మోత్పల దేదీప్యమానవారాహపుష్కరిణీసరజ జెలంగ
వేదశాస్త్రపురాణ వేదాంతవిద్వన,స్మార్తమానీశ్వర సమితి మెలఁగ
శుకపికారావసంశోభితానోకహా,సురుచిరక్రీడాద్రి సొంపు గనఁగ
గీ. విధిశివాదిసమస్తవిబుధవరేణ్య, సేవితాంబుజపదనార సింహమూర్తి
సంగతావాసమై శ్రీశసదన మనఁగఁ, బరఁగు మేదిని నాగిరిపల్లిపురము. 774

వల్లవీపల్లవోల్లాసము, ఆ 1 ప 36.

## సోమరాజుపల్లి

సీ. లవణాబ్ధివేలాహేలాకాంచియగునంధ్ర, ధరణిమండలికి ముత్యాలజల్లి
సంగ్రామపార్థరాజన్యరాజ్యశ్రీకిఁ, బెంపుమీఱినజగజంపువెల్లి
దాతలు సముదంచితప్రసూనములుగాఁ, గామితార్థములిచ్చు కల్పవల్లి
యఱువదినాల్గువిద్యలకు నపూర్వఘంటాపథంబైన పట్టణమతల్లి
గీ. పంటనృపకౌస్తుభములకుఁ బాలవెల్లి, కదనజయలక్ష్మితొలుచూలు గన్నతల్లి
విపులభుజగర్వదర్పిత విమతరాజ, రాజిహృద్భల్లి ధరసోమరాజుపల్లి. 775

శకుంతలాపరిణయము, ఆ 1.

## బొబ్బిలి

సీ. క్రొవ్వాడివసియార్పు గుమిదొరగానిడ్డ, బలితంపులగ్గడిఁబులబెడంగు
మొనలుగామలఁచితీర్చిననీలిశాసపు, గుఱిరాతిదంచిన గుళ్లసొబగు
మూనెకాకలదేరి జానైనజిగురుటం,బలి గాచు పెనముల పదనుతీరు
యీఁగకాలంబైన యొత్తిపారనిగుఱ్ఱి, నలవోనిగుండుకో పులయొయార

గీ. మారసాతలకలితగ♦భీరనీర, పరిలుఠన్నక్రకమఠాహి ♦ భయదపరిఘ
యారఁ బొబ్బిలికోటమా♦హాత్మ్యమరయ, నబ్బురము నింపదే యేరి♦కైన సహహ.

ఉ. బెబ్బులిమీసమైన మెలి♦పెట్టి తెమల్పఁగవచ్చుఁగాని హా
నిబ్బరగండఁడైన ధర♦ణీపతిరావుకులీనుఁడేలు సా
బొబ్బిలికోటపై నడచి ♦ పోరఁగరాదు కిరీటికైన మా
యబ్బపదంబులాన నిజ♦మాడెద హైదరుజంగుసాహెబూ. 777

రంగారాయచరిత్ర, ఆ 2 ప పే 21.

## పలివెల

సీ. కుంభసంభవునాజ్ఞ♦కును మీఱ కిందుండి, కర మర్థి కొప్పులిం♦గంబునకును
రంభాదికామినీ ♦ రమ్యవంశజులైన, కంజనేత్రలఁ దెచ్చి ♦ కానుకిచ్చెఁ
దత్కాంతలీధరా♦స్థలి నింద్రశేఖరకుంభ, గురుకుచకుంభలై ♦ కొప్పులింగ
మున కెంచ నాట్య మి♦మ్ముగ సల్పుచుందురు, ప్రతిదినంబున మహా♦ప్రౌఢి మెఱయ
గీ. దక్షవాటీపురంబులోఁ ♦ దనరుచున్న, చంద్రముఖులట్లు పల్వేల♦స్థానమునను
భాసురేశ్వరమన్మథ♦ప్రబలగోత్ర, చాన లన నిల్చి రమరమా♦నిను లనంగ. 778

చ. మొదలనుపద్మనాతి సవ♦మోహినులా తెఱగంటికొమ్మలన్
ముదమున దారచించి సుమ♦నోహరమూర్తులదక్షవాటికా
సుదతులగానొనర్చి యట ♦ సొంపునఁ బల్వేలవారకాంతలన్
గదలకఁదా సృజించెఁ గర♦కౌశల మొప్పుచునుండమానినీ. 779

ఉ. శ్రీమహితప్రభావులు ప్ర♦సిద్ధిగ నిందు వసించుమానవుల్
స్వామి సదాశివుండు గడు ♦ వర్ణనసేయఁగఁ గొప్పులింగమీ
భూమి సమస్తమున్ శివుని ♦ పొల్పువహించిన మోక్షలక్ష్మినే
నేమని చెప్పనేర్తు తర♦ళేక్షణ పల్వేలభోగసౌఖ్యముల్. 780

చ. జలజభవాండభాండమున ♦ సన్నుతికెక్కిన ముక్తులందునన్
వలసినమోక్షముల్ గలుగు ♦ వారిజలోచన కౌశికానదీ
జలములయందు గ్రుంకు లిడి ♦ సంతతమున్ భయభక్తిమీఱఁగాఁ
బలివెలకొప్పులింగమును ♦ బ్రార్థనఁజేసినవారి కెంతయున్. 781

ఉ. పంకజపత్రనేత్ర విను ♦ పల్వేలలోపల వేశ్యవాటిలో
ఱఁకని యెవ్వఁడేఁ బలుకు ♦ రంగుగవానినిఁ బట్టి మీఁద ని
శ్శంకను సౌరిమూతలుకు♦చంద్రకతారకశోరశూలబా
ణాంకపిశాలతో మరము♦షాత్తరహేతులఁ ద్రుంచు రెంతయున్. 782

చ. కుసుమసుగంధముల్ సొగసు • గుల్కెడుచూపులు తీయమోవియున్
నసనిప్రౌఢవాక్యములు • గంధకరీంద్రసమానయానముల్
గొసరివడంపుకౌనులును • గుత్తపుఁగుబ్బలు ముద్దుమోములున్
పొసఁగఁగఁ గల్గుకామినులె • పొందుగఁ బల్వలపట్టణంబునన్. 783

ఓడయనంబివిలాసము, ఆ 6 పే 112.

## జగన్నాథము

సీ. శతకుంభపద్మాపవి • స్తారితాంభోధర, పటలోన్నతధ్వజ • పటయుతంబు
హరినీలమరకత • కురువిందవిద్రుమ, కృతమణిస్తంభసు • శ్రీపదంబు
తప్తహాటకనిర్మి • తద్వారబంధబం, ధురవజ్రకీలితా • రరయుగంబు
సభిలదిగ్దేశాగ • తానేకమానవ, మహితసింహద్వార • మంటపంబు
గీ. విశ్వకర్మతపోబలా • విష్కృతంబు, సర్వగీర్వాణసంఘాత • సన్నుతంబు
నగు జగన్నాథదేవు దే • వాలయంబుఁ, గాంచియా రాజు కృతనమ • స్కారుఁడగుచు

వాసవదత్తాపరిణయము, ఆ 4 పద్య 71.

సీ. శతసహస్రఘోరచర • త్సితగరుద్వరగరు, ద్భవమరుత్పదసర • ద్దివిజవార
మతులసద్వేదనస • న్మతిమిషత్పరిహాస, తత్పతివసద్రతిహాస • తుష్టనుజాత
మఖిలలద్దరదల • త్సుభవలత్సుమగల, న్మధుమిళద్ఘురఘల • న్మహిజజాల
మమలహృత్పికగహ • ద్రుమబృహత్కుసుమభృ, త్కలుమహాద్ధరణిభృ • త్కలితసిద్ధ
గీ. మవ్యయానందగాయక • శ్రావ్యగాన, భవ్యసౌధాగ్రవిస్మిత • నవ్యకాంతి
దివ్యచంద్రశిలాగార • దివ్యభీరు, సేవ్యమౌ జగన్నాథ • సీమఁ గాంచి. 785

సర్వకామదాపరిణయము, ఆ 2.

సీ. నలినాక్షునాభి • బలవత్తనంబు త, న్ముఖకాంతశిష్టాన్న • భోజనమున
వర్ణాశ్రమాచార • నిర్ణయం బిందుతే, దా భగవంతుండు • ప్రాభవంబు
తనరఁ జన్నము బ్రహ్మ • మను శ్రుతివాక్యార్థ, మనువరమాద్వైత • మాదరాతి
రేకంబు నస్ఫుటీక • రించె నిచ్చట నిది, యావేదమొకటి • వ్యాఖ్యామహిమ
గీ. మహహ యిక్కోప్ప హరిని వేడి • తాన్నము భువ, నేశ్వరక్షేత్రమునఁ దే • వీశ్వరాని
వేడి తాన్నము మదిశంక • విడిచి సమున్నమ్మఁ గుడిచిన సద్గతి • నమ్మ మతియు.

బలరామక్షేత్రమాహాత్మ్యము, ఆ. 2.

## హస్తినాపురము

( ఢిల్లీ )

సీ. శ్రీరమణాంగుష్ఠ శిఖరేంద్రమణి తోయ, రణ పయోధిజసుధాకరము మనంగ
భువనరక్షక సదాశివ సిద్ధయోగీంద్ర, సంస్తుత సిద్ధాశ్రమం బనంగ
భూరిమేఘాళి విస్ఫుటపత్ర పుష్కరాగ్రాళిందపూరిత మకరంద మనఁగ
ధరణీవధూమహీధర పయోధరభాగ, లక్షితక్షేమ హేమలంబనంగ
గీ. దనరు గంగాతరంగిణీతటమునందు వెలయుఁ ద్రిభువనవిఖ్యాత విభవవిజిత
దేవతాపురభోగవతీపుర ముఖ్యమా గజనాపురము హస్తినాపురంబు.

దశావతారచరిత్రము

మ. కల దుర్వీన్ బలగర్వితాహితకరగ్రాహోగ్రహోద్యన్మహా
గ్గళ రాజద్ద్విజరాజగోత్ర శిఖరద్రాజన్యసౌజన్య పు
ష్కలసద్వస్తు సమస్తహస్తినగరాఖ్య ప్రఖ్య రాజన్వతీ
తిలకం బంగకళింగవంగముఖ దిగ్దేశాధిపాశాస్యమై. 788
మ. స్ఫురదాకాశతరంగిణీ మధురవాఃపూరమ్ము లంబ్రావఁగాఁ
గరమభ్రమ్మున కెత్తి హత్తిన మహాగంధేభరాజంబనన్
హరినీలద్యుతి తీవ్రవప్రవలయంబై యున్నత ద్వారగో
పురమై హస్తిపురంబు పేరునఁ బెంపుం గూర్చు నశ్రాంతమున్. 789
సీ. చూపట్టు నొకవీథి సుకుమారతరపద, క్రమణ మాతంగచంగములగములు
కనుపట్టు నొకవీథి ఘణఘణా క్వాణ రణద్ఘంటికారవళితాంగములగములు
ససిఁబూను నొకవీథిఁ జక్రచంక్రమణాది, గమన దుర్గమ తురంగములగములు
మొనగూడు నొకవీథి ఘనభుజార్గళనిరర్గళ వాహినీపుంగవములగములు
గీ. తివురు నొకవీథి బధిరితదిగిభరాజ, కర్ణకోటరపాటన క్రమసమగ్ర
పటహ డిండిమ భేరికాపణవమర్దళప్రముఖ హృద్యవాద్య కోలాహలములు.

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 1 ప 48.

## వ్రేపల్లె

మ. యమునాతీరమునందు బృందసరి బాగొప్పల్లె వేపల్లె నాఁ
బరఁగున్ గొల్లలపల్లె తజ్జనులసౌభాగ్యంబు వర్ణింప మో

ల్లమిగా నందఱు కొల్లలాడుచుఁ దరు సా♦లన్నైత తన్నైతయై
యమితానందుఁడు నందుఁ డందు దగు దే♦వాధీశభోగంబులన్. 791

సీ. తీరుగాఁ గైసేయు ♦ దేసలచంద్రానఁ బొదుగులతోఁటి యా♦కదుపు లమరఁ
గనుగానక మదించు ♦ గజములకైవడి, గొమ్ములవృషభము♦లొక్కమరు మిగులఁ
జివ్వకు నటుగాలుఁ♦ద్రవ్వువీరులకీతి, జలపోరిపెనఁగు గో♦డెలు చెలంగఁ
జెంగునఁగాఁటు తు♦రంగములవితానఁ, జూచుకైనలేగలు ♦ సొంపు మిగుల

గీ. నదియె చతురంగబలములై ♦ యతిశయిల్లు, మొల్లమైయున్న రేపల్లె ♦ నల్లుకొన్న
ఫలితవనములు కోటలై ♦ పరిఘవిల్ల, నందుఁ జెలువొందు నందుఁ డా♦నంద మొంది.

రాధామాధవసంవాదము.

## కంచి

సీ. ముసువంగ నేర్తురు ♦ మూలనాపటికిగాఁ, జికురబంధములీగి ♦ జీరవాఱఁ
బొన్నపువ్వులఁబోలు ♦ పొక్కిళ్లుబయలుగాఁ, గట్ట నేర్తురు చీర ♦ కటిభరమునఁ
దొడువంగ నేర్తురు ♦ నిడుద్రవేలుఁ జెవులందు, నవతంసకంబుగా ♦ నల్లిపువ్వు
పచరింప నేర్తురు ♦ పదియాఱువన్నెల, పసిఁడిపాదంబులఁ ♦ బట్టుచేలఁ

గీ. బహ్మోదయము నిగ్గుఁ బొలిండ్లఁ ♦ బ్రౌఁకనీక,తఱచు పూయుదు రొడల గం♦ధంబుఁ
బసుపు, బందికత్తెలు సురతప్ర♦పంచవేళఁ గంచియఱవత లసమాస్త్ర♦ఖడ్గలతలు.

కాశీఖండము, ఆ 3 ప 109.

క. నరుఁ డొక పుణ్యముఁ జేసినఁ, బరువడి నది కోటిగుణిత♦ఫలదం బగుటన్
ధరఁ బుణ్యకోటియనఁగాఁ, బరఁగుం గాంచీపురంబు ♦ ప్రతియే పురముల్. 794

సీ. ఘనతరసౌధాగ్ర ♦ కనకకుంభము లవి, కమలమిత్రునిదృశ్య ♦ కరణిఁ జూపఁ
బ్రాసాదకీలిత ♦ బహురత్నదీధితు, లింద్రచాపంబుల ♦ నీనుచుండఁ
బ్రతిమందిరధ్వజ♦పటశీతపవనంబు, సిద్ధదంపతులమై ♦ సేదఁ దేర్ప
గంధసింధురతురం♦గములసాహిణములు, శ్రీకాంత కేకాంత ♦ సీమగాఁగ

గీ. నాపణంబులఁ బచరించు♦నట్టి సరకు,లగ్గపతివైభవంబుల ♦ నపహసింప
రమ్యమైయున్న కాంచీపు♦రంబుతోడ; నితరపురముల నుపమింప ♦ నెట్లువచ్చు.

విక్రమార్కచరిత్రము, ఆ 7 ప 117, 118.

సీ. ఏపట్టణము ముక్తి♦హేతు సప్తపురాంత, రభిగణనాతి వి♦ఖ్యాతశాలి
ఏపట్టణము ఖేల♦దేకామ్రవిభు శిర,స్సింధు మత్సరిసర♦శ్శ్రీవిభాసి
ఏపట్టణము సము♦త్కీర్ణ కామాక్షీ త,పఃపరిపాకసం♦పద్విధాయి
ఏపట్టణము సరి♦న్మాత్రికవాగ్దేవతా, సంశ్రయాంచితసను♦స్థద్విజాళి

తే. బ్రహ్మయజ్ఞజపహోమ ♦ పరిమళసహజాత సాక్షాత్పరబ్రహ్మ ♦ సన్నిధాన
భాగ్యసౌభాగ్యయోగ్య మే♦పట్టణంబు, పుణ్యతరమైన [illegible]కాంచి♦పురవరంబు.

కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 160.

సీ. వెలయ నేవీడు ని♦ర్మలధర్మమహిమచే, ధాత్రి సత్య[illegible]
ప్రవహించె నెందు వే♦దవతిపేరిట బ్రహ్మదేవునింతి సరస్వ[illegible]
కావించె నెచట ని♦ష్కామధీమహితుఁడై, హరిగుణించి విరించి ♦ యధ్వ[illegible]బుఁ
జవిమాచె నెచ్చోట ♦ సవనాగ్నిహుత మహాహుతి హవిస్స[illegible]డు
గీ. కటకమాత్రంబె యది విశం♦కటజలగ్రహాగ్రిణ విగ్రహాయస్త ♦ [illegible]స్తి ద
చిరదయావాల మోక్షల♦క్ష్మివిశాల, కటితటీనూత్న కళ్యాణ♦కాంచి కాంచి. 797

శా. ఆ కాంచీనగరీమణి న్వెలయు నా♦మ్రానారికేళంబు ల
స్తోకానేకరసాలసాలపనసా♦శోకార్జునక్షీరరం
భాకమ్రక్రముకప్రియాళుబదరీ ♦ భల్లాతకప్రస్ఫుర
న్నాకక్ష్మారుహవాటిఁ గూటిజగదా♦నందంబుగా నెప్పుడున్. 798

వైజయంతీవిలాసము, ఆ 2 ప 65.

# కాళహస్తి

సీ. సంసారపారదో♦చ్చాటనానలకీల, కలుషసంచయతామ్ర♦గంధకంబు
కామలతామూల ♦ కందకుద్దాలంబు, సంకల్పపాషాణ♦టంకముఖము
రాగశాలివనాంకు♦రకడంగరీయంబు, శంకాకళంకభు♦జంగనకులి
నవమనోగోరాజ ♦ నాసికారజ్జువు, కోపనేత్రుణవిశి♦ఖోపలంబు
గీ. దివ్యదేశికసాంసోప♦దిష్టమార్గ, నిర్గుణధ్యానసంధాన♦నిరుపమాన
సౌఖ్యసంపన్నసాధక♦జననివాస, మమృతలింగాకరము కాళ♦హస్తిపురము. 799

మ. జనలోకోన్నత మైన తత్పురము తూ♦చా తప్పకుండంగ వ
ర్ణన సేయన్ వశమా నెఁ గీటమున కై♦నం జక్రికైనన్ మదాం
ధునకైనన్ బహుజీవహంతకయినన్ ♦ దుర్వాసనం బాసి మో
క్షనిధిం గొల్ల గొనంగవచ్చునఁట పై♦జాడన్ విలోకించినన్. 800

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 1 ప 17, 20.

# వేంకటగిరి

చ. నటితహరిజ్జయేందిరకు ♦ నాటకరంగ మనంతవైభవో
త్కటమున కాలవాలము త♦తస్ఫుటవిద్యల కాటపట్టు ను

ద్విపటభటసింహకోటులకు ♦ భర్మమహీధరగహ్వరంబు వేం
కటగిరిపట్టణం బలరుఁ ♦ గాంతిజితామరరాజధానియై. 801

గీ. గాఢపుణ్యంబులకుఁ గాశి ♦ కాపురంబు, కలిత సౌభాగ్యముల కల ♦ కాపురంబు
కాంతిసంపదలకు ద్వార ♦ కాపురంబు, కాపురము సేయువారల ♦ కాపురంబు. 802

గీ. విప్రులునుమోధవరులుఋ ♦ త్విజులునచట, ననిశమును శాస్త్రజీవులై ♦ యలరు చంద్రు
వారి ముంగిళ్లు సంతాన ♦ భూరుహములు, నాకపద మప్పురంబునే ♦ న్నంగఁదరమె.

శిశుపాలవధ, ఆ 1 పే 3.

## కుంభఘోణము

గీ. తూరుపున వాలుగామడ ♦ మేర తామ్ర మచట హేమాబ్జ వనిమించు ♦ నందుఁ గుంభ
ఘోణ మొప్పను గీర్వాణ ♦ కులము పొగడ, నాతటమునఁ లక్ష్మీసర ♦ మతిశయిల్లు.

క. తనపేరిఁట ఘనతపమున, నొనరించిన మడుఁగుగాన ♦ నున్నది యిపుడున్
వనజనివాసిని యచ్చట, మనుకొని యది క్షేత్రములకు ♦ ముఖ్యము చంద్రా. 805

గీ. అచట నొకపూట స్నానంబు ♦ లాచరింపఁ, దనరు స్వర్గంబునాసర ♦ త్రియమునిల్చి
నరుఁడు పూనిక నంబుదా ♦ నంబుసేయఁ, బితరు లెల్లను ముక్తిసఁ ♦ బ్రీతిఁ గంద్రు.

శైవధర్మము, ఆ 4.

## శ్రీవిలుబుత్తూరు

మ. లలితోద్యానపరంపరాపికశుకా ♦ లాపప్రతిధ్వానముల్
వలభీనీలహరిన్మణీపికశుక ♦ స్వానభ్రమంబూన్ప మి
న్నులతో రాయుసువర్ణసౌధముల నెం ♦ దుం జూడఁ జెన్నొంది శ్రీ
విలుబుత్తూరు వెలంగుఁ బాండ్యనగరో ♦ ర్వీరత్నసీమంతమై. 807

ఆముక్తమాల్యద, ఆ 1 ప 51.

## మధురాపురము

మధురమణీయకేళిఁ దన ♦ మంజులవంజులకుంజమంజరీ
మధురసధారలన్ రమణ ♦ మానితమానితమానినీమణీ
మధురవచోవిలాసముల ♦ మాసరమాసరమైకవాసమై
మధుర యనంగ నొక్క ♦ పురి మండితమౌ మహిమండనంబునన్. 808

దశావతారచరిత్ర, ఆ 9.

## ఉజ్జయిని

సీ. చెలువొందు నేపురి ♦ శృంగారముఁగఁ గాల, కంఠుఁ డెప్పుడు మహా♦కాలసంజ్ఞఁ
గోటిలింగంబులు ♦ కొమరారు నేపీట, సంధ్యాత్రయమహో♦పచారగరిమ
విలసిల్లుఁబునిధిపూర♦ములయందుడిందక, పెనుపొందు నేపుట♦భేదనంబు
యుగయుగంబునయందు ♦ నొక్కొక్కనిర్వ్యాఖ్య,ధానంబు నేరాజ♦ధానిపూను
గీ. నంబికాదేవి యేపట్ట♦ణంబునందు, శ్రీమహాకాళినా నుతి♦శ్రీవహించు
నట్టియుజ్జేని యోగపీ♦ఠాభిరామ,మైహికాముష్మికప్రదా♦నాద్యసీమ. 809
ఆ. ద్వారవతి యవంతి♦వారాణసి యయోధ్య, మథుర పుణ్యకోటి ♦ మాయ యనఁగ
నలఘుముక్తిపమ్మ♦లగుపట్టణములందు, నగ్రగణ్య యుజ్జ♦యనిపురంబు. 810

విక్రమార్కచరిత్రము, ఆ 2 పద్య 41, 42.

## అలకాపురము

చ. అనుదినపద్మసంఖ్యలస♦దక్షయముఖ్యవిధానయుక్తమై
యనుపమనిర్జరీగణస♦మంచితగానవిశిష్టమై త్రిలో
చనమకుటేందుఖండరుచి ♦ సంచయధౌతసువర్ణహర్మ్యమై
ధనదునిపట్టణం బమరుఁ ♦ దద్దయు వస్తుసమృద్ధి నెప్పుడున్. 811

పద్మపురాణము, ఆ 3 ప 106.

సీ. ఏపట్టణమునకు ♦ నెలఁదోఁటనందనా,రామంబుచెలిచైత్ర♦రథవనంబు
క్రీడావిహారదీ♦ర్ఘిక యేపురమునకు, మధురామృతాంబువు ♦ మానసంబు
మాణిక్యముకురబిం♦బంబు కైలాసమే, నగరివారవధూజ♦నప్రతతికి
నేవీటిపొలిమేర ♦ యింతయం తనరాని, దవ్వనందున్నయు♦త్తగపుదిక్కు
గీ. పృథివితోడవైనయప్పాటు♦భేదనంబు, రాజధానిగఁ దారకా ♦ రాజమౌళి
రాజితంబైనకృపపెంపు♦ప్రాపుగాఁగ, రాజరాజు పేరను నేలె ♦ రాజసమున. 812

కాశీఖండము, ఆ 4 ప 162.

## ద్వారకాపురము

సీ. త్రిదివంబుకంటెను♦ద్దీపితంబై విశ్వ,కర్మమానససృష్టి♦కలన నగుట
యంభోధిపరిఖయై ♦ యలరారదేవతా,దులకు నసాధ్యంపు ♦ దుర్గ మగుట
తను నేలువాఁడు ని♦త్యస్థిరలక్ష్మితోఁ, బ్రాణేశుఁడై జగ♦ద్భర్త యగుట
హరికోపశిఖిఁ గ్రాఁగి ♦ యడఁగినమదనుండు,తనయందుఁ దనుసిద్ధి ♦ ధన్యుఁడగుటఁ

ఆ. ద్వారక కాని వేఱు ♦ ధరణీతలంబున, నితరనగరములకు ♦ నెందు లేక
యుల్లసిల్లియు ననుప♦మోదాత్త దీప్తమై, పొలుచు యాదవేంద్ర♦పురముఁ గనిరి.
హరివంశము, ఆ 4 ఉత్తర.

ఉ. ద్వారకయన్ పురీవరము♦దంచితకాంచనరత్నకీలిత
ద్వారకవాట మంశుకజ♦వాతనిరుద్ధనభశ్చరస్మరు
ద్వారకసద్ధ్వజ వ్రజమ♦ధఃకృతసౌరపురీసురీతిభృ
ద్వారకలంకబింబ మది ♦ వార్ధిఁ జొప్పడి యొప్పు నెప్పుడున్. 814
చమత్కారమంజరి, ఆ 1 ప 19.

సీ. ఏవీథిఁ జూచిన ♦ శ్రీవిష్ణుకల్యాణ, కల్యాణవైభవా♦కర్ణనములు
నేసీమఁ జూచిన ♦ ప్రాసాదశృంగార, శృంగారలీలాని♦రీక్షణములు
నేవాడఁ జూచిన ♦ నావాసకల్హార, కల్హారసుమ రసా♦ఘ్రాణనములు
నేవాటఁ జూచిన ♦ నాహారసారాల, సారాలసానిల♦స్పర్శనములు
గీ. నెందుఁ జూచిన సంతతా♦నందజాత,నందజాతగుణాస్వాద♦నములు గలిగి
యఖిల సకలేంద్రియప్రీతి ♦ నావహించు, గాఁపురంబున నా ద్వార♦కాపురంబు. 815
ముకుందవిలాసము, ఆ 1 ప 102.

ఉ. వారక తత్త్వవాద్వయని♦వారక విప్రగృహాంతగస్థభృ
ద్దారక సద్విలాసనృప♦దారక ఘోరభవార్ణవార్తిని
స్తారక సౌధయూథచర♦తారక నూత్నచిరత్నరత్నవ
ద్వారకయై పురాగ్రిమగు ♦ ద్వారక పశ్చిమవారిధిం దగున్. 816
బలరామక్షేత్రమాహాత్మ్యము, ఆ 1.

సీ. నునుకుందనపుగోడ♦లను విన్దఱుముమేడ,లనునందమగువాడ♦లను దనర్చి
తొగరొల్కుపగడాల♦ తెగతళ్కుమొగరాల,వగగుల్కు మొగసాల♦లఁగడుమించి
సిరిగాంచు నల్లిండ్ల♦దరినించు వాకిళ్ళ, నెఱిమించులనగళ్లు ♦ నొఱపునెఱపి
బలుహాటకకవాట♦ములవాటమగుకోట,లనుదోఁటలను పేట♦లను జెలంగి
గీ. తొగలరాచట్టుపోల్ జిగా♦జిగిజిగిలెలఁ,దమ్మికెంపులయోరులఁ ♦ దగుగవనులఁ
గ్రొత్తముత్తెంపుఁజికిలిమ్రు♦గ్గులఁ గలిమికిఁ, గాఁపురంబుగఁదగు ద్వార♦కాపురంబు.
శ్రీకృష్ణకల్యాణము, ఆ 3.

## లంకాపురము

సీ. మహిమ మహిళాశిరో♦మణిరత్నరంజిత, నూపురం బల్ల లం♦కాపురంబు
పద్మాదినవనిధి ♦ సద్మాళివిజితాల,కాపురం బల్ల లం♦కాపుగంబు

వీరరావణలోక ♦ విజయలక్ష్మిబాలి, కాపురం బల్ల లంక ♦ కాపురంబు
దప్తచామీకర ♦ సప్తసాలాశ్లిష్ట, గోపురం బల్ల లంక ♦ కాపురంబు
గీ. నిశిచరాధిప భుజబలా ♦ నీతభాను, చంద్రదేవేంద్రపావక ♦ శమనదనుజ
వరుణవాయుకుబేరమా ♦ హేశరమకు, గాంపురం బెన్నిచూడ లంక ♦ కాపురంబు. 818
సీ. ఏవంకఁ గన లంక ♦ నేణాంకరత్నాంక, మహిసముట్టంకిత ♦ మందిరమ్మ
లేదండఁ గనఁజండ ♦ వేదండ రథకాండ, కోదండరథచమూ ♦ కోటికోటు
లేచెంతఁ గనవింత ♦ లింన్దిరాక్రాంత, పారిజాతలతాంత ♦ పరిమళమ్మ
లేసీమఁగనరామ ♦ హేమాదిసురభామ, సత్కామినీమణి ♦ సంచయములు
గీ. వెలయ దేవేంద్రపురమును ♦ వెక్కిరించి, దివ్యకౌబేరపురమును ♦ ధిక్కరించి
మెఱయు నవరత్నరత్నచా ♦ మీకరాంక, కుట్టిమంబు సురద్వేషి ♦ పట్టణంబు. 819
సరసభూపాలరాజీయము, ఆ ౯.

# కాశీపురము

సీ. దేవేంద్రభోగంబు ♦ సేవగింపఁడు గదా, కాశిలోపలఁ జావఁ ♦ గలిగినతఁడు
ధననాయకత్వంబు ♦ ప్రస్తరింపఁడు గదా, కాశిలోపలఁ జావఁ ♦ గలిగినతఁడు
గంధర్వసౌఖ్యంబు ♦ కాకుసేయఁడు గదా, కాశిలోపలఁ జావఁ ♦ గలిగినతఁడు
నాకలోకసుఖంబు ♦ నోకిలింపఁడు గదా, కాశిలోపలఁ జావఁ ♦ గలిగినతఁడు
గీ. గరుడఖేచరయక్షరా ♦ క్షసభుజంగ, సిద్ధవిద్యాధరోల్లస ♦ చ్ఛ్రీవిభూతి
తొత్తువలెఁజూడఁడొకనాఁడు ♦ మారమునను, కాశిలోపలఁజావంగఁ ♦ గలిగినతఁడు.
ఉ. ఎంగిలిదిన్నపాపము మ ♦ హీసురహత్యయు నన్యకామినీ
సంగమదుష్కృతంబు మఖ ♦ శాసనదోషము మాతృమస్తకం
బంగనఁ గొట్టినట్టి చినయ ♦ ఘావళిఁ బాయుచు విశ్వభర్తనై
రంగగు కాశికాపురవ ♦ రంబున నిల్చుటఁజేసి భూసురా! 821
ఉ. ప్రాణముతోడనుండి బహు ♦ భంగులఁ బుణ్యము లాచరించియుం
బోణివిగాఁగ మోక్షమును ♦ బొందుట దుర్లభ మగ్రజన్మ! వా
రాణసియందుఁ జచ్చినుక ♦ రంబుగఁ గాంచు సమస్తజంతువుల్
రాణ విరించికిం బడయ ♦ రానివృషధ్వజరూపసంపదల్. 822
క. విషమెక్కుఁ దలఁపఁ మెసఁగిన, విష మమృతంబై తనరు ♦ విషమాస్త్రుఁడు వి
ద్విషుఁడై యణంగుఁ గాశీ, విషయమునన్ దెగిన జంతు ♦ విసరంబులకున్. 823
చ. కరి కరితోలుఁ గప్పు నుర ♦ గంబురగంబు ధరించు శాక్వరం
బిరవుగ శాక్వరంబుగని ♦ యెక్కు వృషంబు వృషగ... ద్రాల్చు భూ

మునివర కాశిలో నధిక♦సుప్తి వహించిన తత్క్షణంబ యే
పురముల కివ్విభూతి పరి♦పూర్ణత నొందుఁ దలంచి చూచినన్. 824

శా. శ్రీవిశ్వేశ్వరుసాటిదైవమును గా♦శీక్షేత్రముం బోలు పు
ణ్యావాసంబును జహ్నుకన్యసరిభా♦వ్యంబైనతీర్థంబు దే
జోవిఖ్యాతివిశాలనేత్రి కెనఁగాఁ♦ జూపన్ మహాశక్తియున్
భావింపన్ సమకూరు నెట్టఖిలభూ♦భాగంబునన్ భూసురా. 825

సీ. కల్పవృక్షము లిందుఁ♦గలగోగణము లెల్లఁ, సిద్ధలింగము లిందు♦ విడిపిరాలు
కామధేనువు లిందుఁ♦గలగోగణము లెల్లఁ, పటుసుధాంబుధు లిందు ♦ పల్వలములు
గంగాసమము లిందుఁ♦గలనిర్ఝరము లెల్ల, నమరు లిందుఁ జరించు ♦ సంత్యజనులు
ఖగకులాధిపు లిందుఁ♦గలమశకము లెల్ల, సంజీవిలత లిందు ♦ కుంటసమితి
గీ. పుసవేదులునగునిందు♦వరుసగోచ,రంబులగుచున్న గండశై♦లంబు లెల్లఁ
గములగర్భునకైననీ♦ కాశిమహిమఁ, బ్రస్తుతింపంగవచ్చునా♦ప్రాభవమున. 826

క. కాశీసంస్మరణంబును, కాశీదర్శనము గా♦శికానివసనమున్
కాశీమరణము గలనరుఁ, డాశంభునిరూపుఁదాల్చు ♦ నాశ్చర్యమునన్. 827

రుక్మాంగదచరిత్రము, ఆ 5 ప 55, 62.

సీ. కాశికానగరంబు ♦ కడసీమమున నున్న, చండాలుఁ బోలగా ♦ ఖండలాదు
లానందవనములో ♦ ననశనస్థితి నున్కి, భువనసామ్రాజ్య వై♦భవముఁ బోలు
నవిముక్తదేశస్థుఁ ♦ డయ్యెనేఁ బతితుండు, నశ్వమేధాధ్వరా♦హర్తదొరయు
వారణాసీసంభ♦వంబైన మశకంబు, నైరావణముతోడ ♦ నవఘళించు
గీ. నాటుకొని శ్రీమహాశ్మశా♦నమున నున్న, యణుకనగ్నాలవటుఁడైన ♦ నాగ్రహమున
గర్వితోద్ధతి నేతెంచు ♦ కాళరాత్రి, మృత్యుదేవతముని పండ్లు ♦ మెఱుకఁజాలు. 828

గీ. ఎన్నికల్పంబులరిగిన ♦ నెడలిపోవ, దెంద రింద్రులు గడచిన ♦ నెలమిదప్ప
దెన్ని మన్వంతరంబులు ♦ చన్న నెపుడుఁ బసిమిదప్పదు కాశికా♦పట్టణంబు. 829

సీ. ధర్మంబు కాశికా♦స్థానమధ్యంబున, నాల్గుపాదంబుల ♦ నడచియాడు
నర్థంబు కాశీపు♦రాంగణంబునయందు, నానాప్రకారమై ♦ వీనుమిగులుఁ
గామంబుగాశికా♦కటకఘంటావీథి, గర్వించురాజలో♦కంబుశేవ
మోక్షసంపదలు గా♦శీక్షేత్రమునయందుఁ, బ్రబ్బితండంబులై ♦ నివ్వటిల్లుఁ
గీ. గాశి కల్యాణములకాది♦కారణంబు, కాశి యణిమాదిసిద్ధుల ♦ కట్టుపట్టు
కాశి జనలోకసంకల్ప♦కల్పవల్లి, కలుషపిశితంబు మెసవు రా♦కాసి కాశి. 830

కాశీఖండము, ఆ 2 ప 47-50.

క. చిరనిద్రయొందుచోటుల; నరయంగా దుఃఖహేతు♦వగుఁగాని, బరగుం
బరమానందప్రదమౌ, చిరనిద్రయరాశి నిట్టి♦ చిత్రము గలదే. 831

చ. చెలువగు రాశికామహిమ♦చిత్రము చెప్పెద లేడి మ్రింగి యా
కలిచెడ కొద్దఁ బట్టఁ బులి♦ కాటున నెద్దును నెద్దుపోటునన్
బులియు శరీరమున్ దొరఁగ♦ బోరన లేదొక లేడిఁ బట్టుటల్
పులిపులితోలు గప్పుటయుఁ♦ బొల్పగు నెద్దొక యెద్దు నెక్కుటల్. 832

సీ. రూపమొక్కటి రెండు♦రూపులై చెలువొందు, మూఁడు మొనలపోటు♦ ముట్టుఁబట్టు
బాహుచతుష్కంబుఁ♦ బంచాస్యములుఁ బూను, షణ్ముఖుపైఁ బ్రేమ♦ సలుపుచుండు
సప్తాశ్వచంద్రులే♦క్షణములుగా నొప్పు, నెనిమిదిమూర్తుల♦ వినుతికెక్కు
నవనిధీశసఖుం డ♦నంగఁ గీర్తి వహించుఁ, బదికొంగులైన యం♦బరము గట్టుఁ
గీ. బదునొకండువిధంబులఁ♦ బ్రణుతి కెక్కు, వెలయఁ బండ్రెండుగనుపులు♦ విల్లుపట్టు
గర్మపాశలవిత్రవి♦ఖ్యాతి మెఱయుఁ, గాశిలో నేను దొలఁగిన♦ ఘనయశుండు. 833

విక్రమార్కచరిత్రము, ఆ 2 ప 190-192.

సీ. కైలాసగిరికిని♦ గాశికాపురి సాటి, గగనసరిద్వంతికి♦ గంగ సాటి
విఘ్నేశునకు డుంఠి♦విఘ్నేశ్వరుఁడు సాటి, రహిఁ గుమారునకు భై♦రవుఁడు సాటి
ప్రమథవర్గములకుఁ♦ బాశుపతు ల్సాటి, సురలకు నిచటి భూ♦సురులు సాటి
యద్రిరాట్పుత్రికి♦ నన్నపూర్ణయె సాటి, హరునకు విశ్వనా♦యకుఁడు సాటి
గీ. యందు వృషభేశ్వరున కిందు♦ నంది సాటి, రుద్రకన్యల కీసుంద♦రులును సాటి
చాటుచున్నవి శ్రుతులు ము♦జ్జములందు, నిందులకు సంశయము వల♦దిందువదన.

సీ. ఇచటి వాక్యము లెల్ల♦ నచలితప్రణవపం,చాక్షరీమంత్రంబు♦ లబ్జగంధి
యిచటి సంచారంబు♦లెల్ల మహాప్రద,క్షిణము లుత్ఫుల్లపం♦కేరుహాక్షి
యిచటఁ బరుండుట♦ లెల్లను సాష్టాంగ, దండప్రణామముల్♦ తలిరుబోఁడి
యిచటి నిద్దుర లెల్ల♦ హితనిశ్చలజ్ఞాన, యోగసమాధులు♦ నాగయాన
గీ. యిచటి నరు లెల్లఁ బ్రమథులె♦ యిచటి పశువు, లెల్ల నిర్జరధేనువు♦ లిచటి తరువు
లెల్లఁ గల్పమహీజంబు♦ లెంచిచూడ, నిదియె భూలోకకైలాస♦ మిందువదన. 835

షట్చక్రవర్తిచరిత్ర, ఆ 3 పద్య 100, 101.

ద్విపద. మగిరాక్షి యిందుల♦మహిమ వర్ణింపఁ, బదినాలుగుముఖముల♦ ఫణియును జాలఁ
డిది వేదవిఖ్యాత♦మిది ముక్తిమార్గ, మిది స్వర్గసోపాన♦మిది సిద్ధసేవ్య
మిది దోషదయదూర♦మిదితీర్థసార, మిది భుక్తిముక్తిప♦మిది సత్యచరిత
మిది శంకరక్షేత్ర♦మిట్టి చిత్రంబు, కంతునికొఱఁగోసి♦కన్నులు మూసి.

చింత లోకకోటిఁ జేసి ♦ శివుఁ దలపోసి, యలసంతతోల్లాస♦మందెడువాసి
గలిగించునీకాశి ♦ ఘనపుణ్యరాశి, వామాక్షి విప్రుని ♦ వధియించునతఁడు
కామాంధుఁడై తల్లిఁ ♦ గదిసినయతఁడు, నుడుగక సురఁ ద్రాగు♦చుండెడునతఁడు
వనితల శిశువుల ♦ వధియించునతఁడుఁ, గినుకమై ధేనువుఁ ♦ గడపినయతఁడుఁ
గోడిఁడు గృహదాహ♦కుఁడు గరదుండుఁ, జండాలుఁ డఖిలదూ♦షకుఁడు నుమతియుఁ
క్రిమిపశుమృగపక్షి♦కీటాదిజంతు, సముదాయమైన ని♦చ్చట మృతిఁ బొంది
మిన్నేటిజడలును ♦ మిక్కిలిగన్నుఁ, గ్రొన్నెలపువ్వును ♦ గుత్తుకనలుపుఁ
బులితోలుకాసెయుఁ ♦ బునుకకంచంబు, శలుఁదశూలము నస్థి♦వనమాలికయును
గలయితఁడాతడై ♦ కమనీయరత్న, కలితమై తలఁచిన ♦ కడలనే మెలఁగు. 836

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. ఆ 2.

సీ. శ్రీకాశికాపురీ♦సింహాసనాసీను, మునివంద్యు విశ్వనా♦థుని భజించి
యాచరీకచ్రభమ♦ద్భ్రమరీహితపదాబ్జ, నన్నపూర్ణను విశా♦లాక్షిఁ గొలిచి
యాఖువాహనునిలో♦కారాధ్యు ఘను డుంఠి, విఘ్నేశదేవుని ♦ వినుతిఁ జేసి
శాతమన్యవమణి♦స్తంభగంభీరబాహుని భైరవస్వామిఁ♦గని నుతించి
గీ. దండపాణిని బొగడి వం♦దన మొనర్చి, తోరివలో నున్న లింగమూ♦ర్తులకు మ్రొక్కి
విపులమైనట్టి ముక్తిమం♦టపముఁ గాంచి, మునిమఠంబులఁ జూచెన♦జ్జనవిభుండు. 837

వాసవదత్తాపరిణయము, ఆ 4 పద్య 57.

సీ. కాశిలో వసియించు♦కతన విశ్వేశుని, కతులితంబైన మా♦హాత్మ్య మబ్బెఁ
గాశి వీడనియట్టి♦కతన విశాలాక్షి, కావిశ్వనాథుకే డ♦ర్ధాంగ మొసఁగె
గాశిలోఁ బ్రవహించు♦కతన జాహ్నవికి వి, శ్వేశాంఘ్రిసంగతి ♦ సిద్ధ మయ్యెఁ
గాశి తన్నుండి ప్ర♦కాశింపఁగా ధాత్రి, కఖిలసంపహానబ♦లాప్తి గలిగెఁ
గీ. గాశి నిరవొందు కతమున ♦ వ్యాసునికి సమస్త వేదపురాణ ప్ర♦శస్త రచన
నైపుణబుద్ధిప్రవాహంబు ♦ నివ్వటిల్లెఁ, గాశి కెన కాశియే కాక ♦ గలదె జగతి. 838

సీ. శ్వానమై కాశిలో ♦ సంచరింపఁగఁ గోరు, వారింద్రపదమైనఁ ♦ గోరఁ జనరు
కాశిలోన ఖరత్వ♦మతిఁ గోరువారబ్జ, భవపదం బబ్బిన ♦ బాళిపడరు
కాశియందుఁ గ్రిమిత్వ♦ఘటనఁ గోరినవారు, గోరరు వైకుంఠ♦గోపనంబుఁ
గాశిలోఁ గీటమై♦ఖరిఁ గోరువారు కై, లాసరక్షణవృత్తి ♦ కాసఁగొనరు
గీ. కాశినసువులు డించిన ♦ కఠినమతులు, భుజగములు భూషణములు గాఁ ♦ బూన్పరే రో
ఘోరహాలాహలములుఁ బా♦గోలరే రొ, దహనగోళముల్ కరములఁ ♦ దాల్పరే రొ.

సీ. తనుఁజూడవలెనంచుఁ ♦ దలఁచువారలఁబ్రోచు, దురితసంఘము లెడఁ ♦ ద్రోసి కాశి
కైవల్యమాటలు ♦ గా నిచ్చుఁ బాపాత్మ,తిలకులదను చేరఁ ♦ జేసి కాశి
పొంగి తనందు మె ♦ లంగువారికొసంగు, మీసరంబగువన్నె ♦ వాసి కాశి
తనువులు తనకొసం ♦ గినవారిని భజించు, శివునిరూపములు రాఁ ♦ జేసి కాశి
గీ. యొకరు ద్వీపాంతరంబుల ♦ నుండియేని, దనుఁదలంచుచునుండెడు ♦ జనులపాసి
కలుషములురోసి గళమెల్ల ♦ నలుపుచేసి, వేడ్కఁ జేయును డోలుపై ♦ వేసి కాశి.
శంకరవిజయము, ఆ 5.

సీ. ధారుణిఁగల్గుతీ ♦ ర్థవ్రజంబుకంటె, వర్ణింప నొక్కింత ♦ వాసి కాశి
ద్వైపాయనుండాది ♦ తాపసులకు నంద,రానిదివ్యజ్ఞాన ♦ రాశి కాశి
దీపించుఁ దనయందు ♦ దీర్ఘనిద్ర వహించు, జీవుల శివులఁగాఁ ♦ జేసి కాశి
తనుఁజూచుమర్త్యసం ♦ తతి పాపదుర్మాంస,ఖండము ల్మెసఁగు రా ♦ కాసి కాశి
గీ. ప్రోచు నివసించునేజాతి ♦ పురుషునైన, గరిమవిలసిల్ల ధర్మార్థ ♦ కామమోక్ష
లక్షణంబులు గలిగించి ♦ లాఘవమునఁ, బ్రస్తుతింపఁ దరంబె యి ♦ ప్పగిది కాశి. 886
సీ. మణికర్ణికాతోయ ♦ మజ్జనం బొనరించి, మరల జన్మించఁడే ♦ మనుజుఁడైన
భాగీరథీవారిఁ ♦ దోఁగి సర్వాఘముల్, కడగంటఁజూడఁడే ♦ కష్టుఁడైన
ముక్తిమంటపమధ్య ♦ మున శంభుజపియించి, దుర్గతికేఁగఁడే ♦ దోషియైనఁ
గాలభైరవుడుంటి ♦ గణనాథు భజియించి, యముపొంతఁజొరఁడే దు ♦ రాత్ముఁడైన
గీ. నన్నపూర్ణావిశాలాక్షి ♦ నఖిలజననిఁ, గాంచి బాధలఁ బొరయఁడే ♦ కర్మియైనఁ
గాశికాతీర్థమహిమలు ♦ గణుతి సేయఁ, దరమె ఫణివల్లభునకైన ♦ ధాతకైన. 887
సురాభాండేశ్వరము, ప 18, 26.

## గయ

సీ. పలువురఁ గొడుకులఁ ♦ బడయంగ వలయు నం,దొక్కరుండయినను ♦ నొప్పి గయకు
నరుగునో యనియును ♦ నశ్వమేధం బొప్పఁ, జేయునో యనియును ♦ శ్వేతమైన
యాఁబోతు విడుచునో ♦ యనియును గోరుదు, రనపత్యులైన గృ ♦ హస్థు లట్టి
గయ కేఁగి యుభయప ♦ క్షములు వసించినఁ, గడుఁబుణ్యు లుభయప ♦ క్షములవారి
ఆ. నుద్ధరింతు రట్టి ♦ యొగిఁ బిండ మిడినవా,రనఘ పితృదయను గృ ♦ తార్థు లగుదు
రంమ ఫల్గుతీర్థ ♦ మాడినవారికిఁ, బరమసిద్ధితో శు ♦ భంబు పెరుఁగు. 888
భారతము, ఆర. ఆ 2 ప 60.

చ. చనిచని పుష్పితోన్నతర ♦ సాలతటీకతటాకవిస్ఫుటా
బ్జనవమరందబిందువిల ♦ సన్మదదంపరసేవితాంగనా

జనకసదస్యంభమర్దనహా♦సత్క్రమనాశ్రితధర్మహర్మ్యవర
మ్యాసటదనేక కేకిగణ♦మా గయ గానఁగ నయ్యె ముందటన్. 889

సర్వకామదాపరిణయము, ఆ 2.

## ప్రయాగ

సీ. మహిఁబుత్త్రికాముఁడై ♦ నహుషాఖ్యుఁ డీతీర్థ,మాడి సత్పుత్త్రి య♦యాతిఁగాంచె
ధనకాంక్షియై యక్షుఁ♦డనుపమంబైనయీ,నదిఁ గ్రుంకి నవనిధా♦నంబులొంది
మాయాబలంబును ♦ నాయతంబుగ నొందె, నారాయణుఁడు దొల్లి♦నరునిఁగూడి
యశనంబు గుడువక ♦ యైదువత్సరము లిం,దుండి మహాబల ♦ యుక్తుఁడయ్యెఁ
గీ. గశ్యపుఁడు దొల్లి యిందు శం♦కరునిఁగొల్చి, తపముఁగావించె నాధర♦ద్వాజుఁడిందు
రూఢి వర్తించి క్షేత్రజ్ఞు♦రూప మొందె, ననఘ యిన్నదిఁగొని యాడ♦నలవియగునె.

పద్మపురాణము, ఉత్త. ఆ 4 ప 162.

ఉ. వేగమ యోఁగి కాంచెఁ బృథి♦వీవరముఖ్యుఁ డశేషయోగిసం
యోగము లోకకల్మషవి♦యోగముఁ జాహ్నతరంగమాలికా
భోగసముద్ధితాంబుకణ♦ఘూర్ణ సమీరణపాలితాష్టది
గ్భాగము సన్మునీంద్రపరి♦కల్పితయాగము నాప్రయాగమున్. 891

భోజరాజీయము, ఆ 2 ప 17.

## అయోధ్య

మ. సరయూతీరమునందు నొక్కపురరా♦జం బుగ్రభాస్వత్ప్రభా
పరయూథప్రతిరోధకృన్మణిమయ♦ప్రాసాదహర్మ్యాంకమై
పరశాఖోత్కరమర్ష్నరీక్షపరిఘా♦ప్రాకారనిశ్శంకమై
మెఱయున్ ధాత్రి నయోధ్యనాఁబ్రకటమై ♦ మిత్రాన్వయాధారమై. 892

ఘటికాచలమాహాత్మ్యము, ఆ 1 ప 87.

సీ. ధర్మమయోన్నత ♦ ప్రాకారములతోడ, రజతకాంచనగోపు♦రములతోడ
వసుధామరక్షత్త్రి ♦ వైశ్యశూద్రులతోడ, గంధేభరథతురం♦గములతోడ
విటనటగాయక ♦ విద్యాధికులతోడఁ, బణ్యపుణ్యాంగనా♦ప్రతతితోడ
లవణాదివివిధవ♦స్త్రసవస్తువులతోడఁ, గలమాదిధాన్యప్ర♦కరముతోడఁ
గీ. బువ్వుతోఁటలతోడ సం♦పూర్ణసుమద, కమలకాసారములతోడ ♦ ఘనత కెక్కి
యొప్పుమీఱిన శ్రీయయో♦ధ్యాపురంబుఁ, గాంచియత్యంతసంభ్రమా♦క్రాంతుఁడగుచు.

యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 1.

# శ్రీరంగము

సీ. ఎయ్యెడ లక్ష్మీస♦మేతుఁడై వసియించు, నాదినారాయణుం♦డవిరతంబు
నెచటితోయస్పర్శ♦ మింతగల్గినమాత్ర, నరులు పాపశ్రేణిఁ♦ బరిహరింతు
రెచ్చోట నొకదినం♦బేని నిల్చినవారి, కపునర్నరత్వమ♦హత్త్వ మొదవు
నెందు దపస్స్థితిఁ♦ జెందిసిద్ధర్షులు, బహులతాగుల్మరూ♦పములనుందు
గీ. రేసెలవునందు దళమాత్ర♦మైనఁ దునుమ, బ్రహ్మహత్యాసమంబగు♦ పాప మొదవు
నేస్థలంబునఁ గీటాది♦ హింసఁజేసి, పతన మొందుదు రతిపుణ్య♦భావులైన. 894
క. ఎందు వసించును జేతన, బృందం బాధ్యాత్మికాది♦ పీడావళులం
జెందక యాపద నలజడిఁ, బొందక యాఁకటఁ గృశించి♦పోవక యెలమిన్. 895
మ. విననేర్చుం జెవిటైన మూఢుఁడయినన్♦ విద్వాంసుఁడౌ వెఱ్ఱియై
నను విజ్ఞానియగున్ ఖలుండు నతిశాం♦తస్వాంతుఁడౌ వక్రుఁడై
నను సౌమ్యాకృతిఁ దాల్చుఁ బాపరతుఁడై♦నన్ దోషనిర్ముక్తుఁడౌ
ఘనపుణ్యంబగు నేప్రదేశము చొరం♦గాఁగల్గుమాత్రంబునన్. 896

శ్రీరంగమహాత్త్వము, ఆ 1 ప 97-101.

సీ. నిలిచె నేరాజధా♦నిఁబయోరుహాసను, సజ్జపూల ననంత♦శయనమూర్తి
చెందె నేకటకంబు♦నందు సంతతసర్వ, పరిపూర్తితోఁ దత్త్రి♦పాద్విభూతి
పుట్టె నేపట్టణం♦బునఁ దృణద్రుమలతా,మూర్తులై తన్నిత్య♦ముక్తవరులు
ప్రవహించె నేవీటఁ♦ బరిఖావిభూతి న,వ్విరజాస్రవంతి కా♦వేరిపేర
గీ. వేదశృంగంబు నోంకార♦విగ్రహంబు,నైన శ్రీరంగదివ్యవి♦మానరాజ
మెచట నివసించె నిల దాని♦ వెన్నఁ దరమె, పుణ్యనికరంబు శ్రీరంగ♦పురవరంబు.
సీ. ఆశించు నెపుడు న♦త్యాసక్తి నమ్మహా,నటుఁడు నేనగరిఁ గో♦ణంగి యగుట
వాంఛించు వాగ్వధూ♦వరుఁ డతిప్రేమ నే,పట్టణంబున మాఁగఁ♦బారుఁదనము
కాంక్షించు నిందుఁడు♦త్కంఠతో నేరాజ,ధానిలోపల నుపా♦దానపరత
కామించు దేవర్షి♦గణము లేపెనుఁబ్రోల, శ్వపచపక్షిమృగాది♦జంతువృత్తి
గీ. విరజకావేరిరైపుట్టి♦ పరిఖగాఁగ, బరమపదవల్లభుఁడు రంగ♦భర్తపేర
నాయకుఁడుగాఁగ వైకుంఠ♦నగరితాన,యైన శ్రీరంగపురము శ♦క్యంబె పొగడ.

వైజయంతీవిలాసము, ఆ 1 ప 41, 42.

ఉ. త్రోవనె దృష్టి నిల్పి తడి♦దోవతి మాఁపునఁ దాల్చి స్తోత్రపా
ఠావళితాస్యులై శయచ♦యంబులఁ జెంబుల బూని యోఁగునీ

కేవలపుణ్యమూర్తుల న♦కించనవృత్తుల రంగనాథస
ప్రావరణప్రదక్షిణప♦రాయణులం గనుఁగొంటె మన్మథా. 899
సీ. అగ్రహారముల మా♦న్యక్షేత్రములఁ బండు, గరిసెలు కోలు చర♦కాండ్రు నింప
సతతంబుఁ బైరుప♦చ్చలుఁదోఁటదొడ్డులుఁ, గావలు లరసి ర♦క్షణ మొనర్పఁ
గీర్లుపెరుఁగునుం♦బాలు మందలనుండి, వడి యేపుమాపుఁగా♦వడులఁ జేరఁ
బైపెచ్చమునకుఁ ద♦ప్పక రూకపాతికల్, ప్రియశిష్యతతి సమ♦ర్పించి యొసఁగ
గీ. సతతిథిసంతర్పణంబె ని♦త్యవ్రతంబు, గాఁగ వ్యాఖ్యానమునఁ బ్రొద్దుఁ♦గడపి గేహ
దేవతార్చనమునవక ♦ భావశుద్ధిఁ, దనరునచటిగృహస్థులఁ♦గను మనంగ! 900
చంద్రభానుచరిత్రము, ఆ 2 ప 104-115.

రగడ. బ్రహ్మధ్యానపరాయణనానా♦భాగవతానందము శ్రీరంగము
కోరిహరుఁడు దెల్పఁగ వినుగౌరికిఁ ♦ గోరిక లీడేరును శ్రీరంగము
దారిమితనలోఁ జంద్రపుష్కరిణిఁ ♦ గుర్రింకిన జయ మిచ్చును శ్రీరంగము
కల్పకచింతామణికరధేనూ♦త్కరములఁ గర మొప్పును శ్రీరంగము
కల్పాదినిమును ధాతకుఁ బూజా ♦ గారంబై దనరును శ్రీరంగము
దాసులవేషముఁ బూనినసురలను ♦ దలఁగఁద్రోయరానిది శ్రీరంగము
దాసోహంబను వైష్ణవకోటుల♦తానకమై మించును శ్రీరంగము
చూచినవారికి నపవర్గమునదిఁ ♦ జూపఁగఁ జేయిచ్చును శ్రీరంగము
వాచంయములకు నేకాంగములకు ♦ వాసంబై తనరును శ్రీరంగము
యేఁటికిఁ బోవఁగఁదపము లాడఁగా ♦ నిదిగో సేవింపుము శ్రీరంగము
యేఁటికి నొకనాఁడైన దలఁచినను ♦ నిహపరము లొసంగును శ్రీరంగము
కంటిమి కన్నుల కఱువెల్లనుబో♦కామితము లొసంగెడు శ్రీరంగము
కంటిమి జన్మాంతరసుకృతంబుల ♦ కళ్యాణఫలంబగు శ్రీరంగము
అపగతకల్మషమగు శ్రీరంగము ♦ అపవర్గాంజనమగు శ్రీరంగము
జపసిద్ధిప్రదమగు శ్రీరంగము ♦ జటిలాస్పదమగు శ్రీరంగము
శ్రీరంగము సాచారనివాసము ♦ శ్రీరంగము దివ్యమహోల్లాసము
శ్రీరంగము హనుమత్పరిచర్యము ♦ శ్రీరంగము నుతసన్మునివర్యము
శ్రీరంగము సజ్జనగుణసేవధి ♦ శ్రీరంగము సద్గుణమణినీరధి
శ్రీరంగము శోభనవిభవారిణి ♦ శ్రీరంగము సేవకచింతామణి
శ్రీరంగము శ్రీరంగము శ్రీరంగము శ్రీరంగము. 901
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 2.

ఉ. రంగము సర్వవిద్యలకు ♦ రంగము సద్గుణసద్గుణాళికిన్
రంగము సాధురాశికిఁ గు♦రంగము భాగవతేంద్రశ్రేణికి సా
రంగము చక్రిపాణికి సు♦రంగము ముక్తికిఁ బూర్వరంబు శ్రీ
రంగము సహ్యజాంచితము♦రంగము శ్రీముఖమౌఁగదా కనన్. 902

కుమారనృసింహము, ఆ 3.

సీ. సాగరసంవృత ♦ జగతీతలముభంగి, కావేరిచుట్టునుఁ ♦ గల్గుదానిఁ
సప్తావరణవృత ♦ జలజజాండమురీతి, నేడుకోటలతోడ ♦ నెనయుదానిఁ
గౌరవహీనశోభి ♦ గగనమ్ముక్రియఁ జంద్రపుష్కరిణినిఁ గీర్తి♦బొందుదాని
దేవర్షియుతసిత♦ద్వీపమ్ముగతి వైష్ణవశ్రేణిచేతను ♦ వఱలుదానిఁ
గీ. ప్రణవగోచరుఁడై జగ♦ద్భర్తయైన, రంగధాముఁడు తనయందు ♦ రంగుమీఱఁ
బ్రణవరూపమ్ముఁ దాల్చిన ♦ రంగసంజ్ఞ, ఘనవిమానము గలదానిఁ♦ గాంచె నపుడు.

భార్గవపురాణము, ఆ 4.

# పుణ్యక్షేత్రములు

గీ. ఉజ్జయిని కాశి మాయ య♦యోధ్య కాంచి, మధుర ద్వారక యనెడినా♦మములఁ గలిగి
పట్టణములేడు కీర్తిసం♦పద వహించు, మహితకైవల్యలక్ష్మికి ♦ మందిరములు. 904

కాశీఖండము, ఆ 3 ప 87.

గీ. పుణ్యతీర్థములైన త్రి♦పుష్కరములు, ద్వారవతి వారణాసి య♦వంతి మాయ
మధుర కాంచి యయోధ్యనా♦నధిక పాపహరములై వార్త కెక్కిన♦ పురవరములు.

ఘటికాచలమాహాత్మ్యము, ప 70 ఆ 1.

మ. మధురా ద్వారవతీ చిదంబరమహా♦మాయాకురుక్షేత్రముల్
మిథిలావంతి గయా ప్రయాగములు రా♦మేశాది పుణ్యస్థలుల్
నిధులున్ సూర్యసుతాసరస్వతులు వే♦ణీతుంగభద్రాకళా
నిధిపుత్రీమణికర్ణికాదినదులున్ ♦ నిశ్రేయసస్థానముల్. 906

బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

సీసమాలిక. మత్స్య కూర్మ వరాహ♦మాండవ్య నరసింహ, రామ పరశురామ♦రామ వామ
న మహేంద్ర చక్రిగో♦నారద శంఖ పాండవ శాకద్వీప త్ర్యా♦స్వవిజయ జయ
కపిల వసిష్ఠ మా♦ర్కండేయ భృగు జహ్ను, వాయుమాని బ్రహ్మ♦వరుణ విష్ణు
ధర్మపరాశర ♦ దామోదర కపింజల శుక గౌండిన్య గా♦లవ హిరణ్య
వసు కృష్ణ శాండిల్య♦వహ్ని కౌశిక ధనంజయ ముక్తి దేవర్షి ♦ సర్వపిప్ప

ల సరస్వతీ ముద్గ♦ల భరత పర్వత, పరమకాశ్యపశేష♦పంచగోప
రైభ్య భరద్వాజ♦శైభ్య తుంబురు గౌతమ జటిలభార్గవ ♦ మాధవ గురు
బాభ్రవ్య పుణ్య గో♦పాల ముకుంద త్రివిక్రమ సౌర గో♦విందమోక్ష
కుల్యాచ్యుతామృత ♦ గోమద సురకృప, నారాయణమనుజ♦నార్దనహరి
వైకుంఠ కేశవ ♦ వాసుదేవ పతంజ్వరిజ రథ ధన్వంత♦రి కురుభోగ
పావనశ్రీధర ♦ పావన ప్రద్యుమ్న, పురుషోత్తమ పరమ ♦ పురుష సిద్ధ
పాతకనాశన ♦ పాపహరణోర్వ్యసు, విమలభాస్కర మధు♦కమల సోమ
ఆ. నామధేయములను ♦ భూమిలో సార్ధత్రి, కోటితీర్థములను ♦ మేటి వసఁగ
దనరుసట్టి నూట♦యెనిమిది తీర్థాల, స్నానదానవిధులు ♦ సలిపె నంత. 907

హంసవింశతి, ఆ 4 పద్య 209.

## కాశీతీర్థమహిమ

సీ. వసియింపవలయు యా♦వజ్జీవ మనురక్తి, పరత వారాణసీ♦పట్టణమునఁ
జక్రపుష్కరిణి ని♦చ్చలుఁ దీర్థ మాడంగవలయు సంకల్పపూ♦ర్వకము గాఁగ
నర్చింపవలయు గం♦ధాక్షతంబులఁ బుష్ప, ఫలపత్రముల విశ్వ♦పతిని పేర్మి
నిలుపంగవలయును ♦ నెఱసు వాటిలకుండ, నాత్మధర్మస్వవ♦ర్ణాశ్రమముల
గీ. స్నానమహిమంబు భక్తితా♦త్పర్యగరిమ, వినఁగవలయుఁ బురాణార్థ♦విదులవలనఁ
దన యథాశక్తివలయును ♦ దాన మిడఁగఁ, గాశిఁ గైవల్య మన్నింటఁ♦ గానిలేదు.
సీ. చక్రవాళపరీత ♦ సర్వంసహాచక్ర, భాగంబులోఁ బుణ్య♦పదము గాశి
కాశికాపట్టణ ♦ క్రోశపంచకతీర్థ, సమితిలో సారంబు ♦ జహ్నుకన్య
జహ్నుకన్యాతీర్థ ♦ సముదాయమునయందు, గడుఁ బెద్దమణికర్ణి♦కాహ్రదంబు
మణికర్ణికాతీర్థ ♦ మజ్జనఫలముకంటెను విశ్వనాథు ద♦ర్శన మధికము
గీ. విశ్వపతికంటెఁ గైవల్య♦విభునికంటెఁ, గాలకంఠునికంటె ము♦క్కంటికంటెఁ
దీర్థములు దైవములు లేవు ♦ త్రిభువనముల, సత్యమింకను సత్యంబు ♦ సంయమీంద్ర.

కాశీఖండము, ఆ 7 ప 112-124.

## మణికర్ణికాప్రభావము

రగడ. శ్రీమత్కాశీపుటభేదనల♦క్ష్మీశ్రుతి మణికర్ణిక మణికర్ణిక
ధామవతీ వరచూడామణికిని ♦ హారకమలదీర్ఘిక మణికర్ణిక
పాదోదకపంచనదాతిమహా ♦ పావన తీర్థోత్తమ మణికర్ణిక

వేదపురాణాగమవిఖ్యాపణ ♦ వీథీమాణిక్యము మణికర్ణిక
పంచమహాపాతకతిమిరౌఘవి ♦ పాటనరవిమండలి మణికర్ణిక
కాంచనగర్భహిరణ్యకమండలు ♦ గండూషితజలధర మణికర్ణిక
పంచారించినకైవల్యశుభ ♦ పరిచయంబులకును ఖనిమణికర్ణిక
పంచక్రోశీముక్తిక్షేత్రా♦బ్జమధూళీపూరము మణికర్ణిక
బిందుమాధవుండను నాకెంతయుం ♦ బ్రేమకళాపాత్రము మణికర్ణిక
మందాకిన్యంభోవేణీభర ♦ మధ్యనాభిచక్రము మణికర్ణిక
గరుడ ఖచర విద్యాధర కిన్నర ♦ గంధర్వ నిషేవిత మణికర్ణిక
ఢుంఢివినాయక మదజలమిళిత క♦టుపరివాహాపుష్కర మణికర్ణిక
కంఠేకాలకిరీటవిటంక ♦ గ్లౌరుచిముకుళితజల మణికర్ణిక
మాణికర్ణికం బనుతీర్థంబున ♦ మజ్జనమాడిన మానవోత్తముండు
భూరిబ్రహ్మహత్య మొదలైనయఘౌఘము ♦ పొడవడంగించును నిమిషమాత్రమునం
గాశీతీర్థము లెన్ని యన్నియును ♦ గదలివచ్చి మధ్యాహ్నకాలమున
రాఁగూడి శ్రీమణికర్ణికతీ♦ర్థంబు నాశ్రయించుం బ్రతిదినమ్మును
నొకయాగము కోటియాగసమమై ♦ యొసంగుఫలము నరునకు మణికర్ణిక
మధ్యాహ్నసమాగమమున నేనును ♦ మదనధ్వంసియునుం బరమేష్ఠియు
సాధ్య సిద్ధగంధర్వాదులతో ♦ సంసేవింతుము శ్రీమణికర్ణిక
వత్తురు మధ్యాహ్నస్నానమునకు ♦ వాసుకిశేషాదులు భుజగేశ్వరు
లుత్తరవాహినియగు గంగానది ♦ కుత్తమభూషణ మగు మణికర్ణిక
నిచ్చలుం బ్రాతఃకాలము మణిక♦ర్ణిక మణికర్ణిక మణికర్ణిక యని
యుచ్చరించు మానవుల హస్తముల ♦ కుసిరిక కాయలు మోక్షవైభవము
లొకదానము కోటిదానసమమై ♦ యొసంగు ఫలము నరునకు మణికర్ణిక
యొకపూర్తము కోటిపూర్తసమమై ♦ యొసంగు ఫలము నరునకు మణికర్ణిక
యొకధర్మము కోటిధర్మసమమై ♦ యొసంగు ఫలము నరునకు మణికర్ణిక
యుదయవేళ నెవ్వండు మణికర్ణిక ♦ యుదకంబునం గ్రుంకును మాఘంబునం
ద్రిదశులు సమ్మానమునకు సంపా ♦ దింతురు సేవాంజలులు మకుటముల
మణికర్ణి హరిశ్చంద్రతీర్థమున ♦ మానవుం డెవ్వండు పితృతర్పణములు
ప్రణిదానంబునం జేయునాతనికి ♦ భద్రపరంపర నొత్తురు పితరులు
మణికర్ణిక ప్రాదతీర్థరాజతట ♦ మధ్యమున హరిశ్చంద్రేశ్వరుండను
గణనాథుని భజియించువారలకుం ♦ గామధేనువై యభిమతము లొసంగుం

మణికర్ణ్యంతరమున గాయత్రీ ♦ మంత్రం బొకమా ఱుచ్చరించినను
గణనకుఁ బదివేలమార్లు గాత్రీ ♦ గాయత్రి జపించిన ఫల మొసఁగును
నొకవంకను గంగాకేశవులను ♦ నొకవంక హరిశ్చంద్రమంటపిని
నకలుషమానస! మణికర్ణికతీ ♦ ర్థావధిసీమంబులుగా నెఱుఁగుము
యాగజ్ఞీనం బగ్నిహోత్రవిధి ♦ యాచరించినట్టి ఫలము గలుగుఁ
బావకుపందుపమణికర్ణిక నొక ♦ భవ్యాహుతివోసినమాత్రింబున
నుపమణికర్ణిక నాజ్యతిలాహుతి ♦ హోమవిధానము మానవవర్యున
కపరిమితంబై నిరతిశయంబై ♦ యక్షయ్యంబగుఫలము ఘటించును
జక్రిపుష్కరిణి యను నామమునఁ బ్ర♦శస్తివహించినయది మణికర్ణిక
చక్రినేమిచంక్రమమునఁ దిరిగెడు ♦ సంసృతికిని విడుగరమణికర్ణిక
శివుఁ గాశీపతి విశ్వనాయకుని ♦ సేవింపఁ దలం పెత్తిన యప్పుడు
ద్రవరూపంబుపరిత్యజించివని ♦ తారూపముఁ దాల్చును మణికర్ణిక
ప్రత్యక్షంబై పుణ్యపురంధ్రీ ♦ భావంబు భజించిన సమయంబున
నత్యంతమనోహారివిభవ♦వాభిరామయగు శ్రీమణికర్ణిక
నాలుగుభుజములు వాలికకన్నులు ♦ నయనాన్వితమగు ఫాలభాగమున
బాలేందుకళామధ్యంబున సిత♦భసితంబు ధరించును మణికర్ణిక
కటకహారకేయూరమేఖలా ♦ కంకణాదిభూషణభూషితయై
కుటిలాలకములమీఁదఁ జిన్నిపువు ♦ గుస్తరించునచ్చుగ మణికర్ణిక
బహుకల్పాంతంబులు సరి గడచిన ♦ పంద్రెండేఁడుల చిన్నప్రాయమున
జాహ్నదజహద్వ్రీడంబగుచేత ♦ స్సంపుటము వహించును మణికర్ణిక
యొకచే నిందీవరమాలికయును ♦ నొకచే మాదీఫలముఫలంబును
బ్రకటితమగుదోర్ద్వయమున నంజలి ♦ బంధంబు వహించును మణికర్ణిక
పద్మసమాసంబగునాసనబిం♦బముచే నొప్పెడు నదిమణికర్ణిక
పద్మరాగమాణిక్యంబులనగు ♦ పలువరుసలుగలయది మణికర్ణిక
పడమరముఖమై నాసాశిఖరము♦పై నిష్కంపంబగుచూడ్కు లెసఁగ
నుడురాజకళాభరణు నుల్లమున ♦ నుద్వీక్షించును శ్రీమణికర్ణిక
కన్నియ గేదఁగిపూరేకుఁ గబరి ♦ కాభరమునఁ దుఱుముము మణికర్ణిక
చిన్నిపూవచన్నులవలిపెపుకం♦చెల ధరియించును శ్రీమణికర్ణిక
మణికర్ణిక చింతామాణిక్యము ♦ మణికర్ణిక బృందారకధేనువు

మణికర్ణిక కల్పద్రుమవాటిక ♦ మణికర్ణికసిద్ధరసస్యందము
శ్రీమణికర్ణిక యణిమాదిమహా♦సిద్ధికారణము సేవకకోటికి
శ్రీమణికర్ణిక నగ్నిబిందుముని ♦ సేవింపుము పుణ్యాత్ముఁడ వయ్యెదు. 910

కాశీఖండము, ఆ 6 ప 125.

## కలహంసతీర్థాదిమాహాత్మ్యము

మ. కలశీసంభవ! యద్భుతం బొకటి యా♦కాశంబునన్ రెండు గా
కులు గాకాకృతిఁ గాకలీకళకళ ♦ క్రూరప్రకారోద్ధతిన్
గలహం బాడి కొలంకులోఁబడి లో♦కం బెల్ల వీక్షింపఁగాఁ
గలహంసత్వము నొందె నిట్టివి సుమీ♦కాశీప్రభావోన్నతుల్. 911

కాశీఖండము, ఆ 6 ప 188.

## త్రివిష్టపేశ్వరమాహాత్మ్యము

గీ. అమ్మహాదేవు ప్రాసాద♦మాశ్రయించి, యుండుఁ బారావతంబులు ♦ రెండు నెమ్మి
నాలుమగఁడుగ స్వర్గా♦పవర్గగరిమ, సకలకాలంబుఁ గవగూడి ♦ సంచరించు.
సీ. పక్షాగ్రములవీచి ♦ ప్రాసాదవలభికా, పర్యంతములధూళి♦ పాఱఁ దుడుచుఁ
జలుపుయాతాయాత♦ములఁ బ్రదక్షిణములు, మాటిమాటికి గర్భ♦మంటపికకు
సోమసూత్రప్రణా♦ళీమార్గనిష్ఠ్యూత, తీర్థోదకంబులు ♦ దివుటఁ గ్రోలు
భక్షించు దేవాళి ♦ బల్యర్థవిక్షిప్త, పిండస్థికములు సం♦ప్రీతియొసఁగ
గీ. వినుఁ ద్రికాలంబు నర్చనా♦వేళలందు, శంఖకాహళపటుహజ♦ర్ఝరరవంబు
కాశినగరంబునఁ ద్రివిష్ట♦పేశునగరి, నవ్విహంగమరత్నంబు ♦ లనుదినంబు. 913

కాశీఖండము, ఆ 6 ప 291, 292.

## ఓంకారేశ్వరమాహాత్మ్యము

సీ. ఆనందవిపినంబు ♦ నందాదిమబ్రహ్మ, దపమాచరించె న♦త్యంతనిష్ఠఁ
బర్యాయమున నేఁగెఁ ♦ బదినూఱులు యుగంబు, లంతఁ బాతాళలో♦కాంతరమున
నుండి యుత్థితమయ్యె ♦ నొకదివ్యలింగంబు, బహుకోటిరవివిభా♦భాసితంబు
విధిమనోవీథిభా♦వించునే తేజమా, తేజంబు లింగమూ♦ర్తిత్వ మొందె
గీ. భూరిభువనాగ్రిభాగవి♦స్ఫుటనవేళ, సంభవించినఘటఘట♦చ్ఛబ్దధారఁ
గ్రమముతోడ సమాధియో♦గంబు విడిచి, కన్నులెనిమిదియును విచ్చెఁ♦ గమలభవుఁడు

సీ. ఆదిమతేజంబు ♦ నంధకారముఁ దోఁచెఁ, గైటభారాతియ♦కారరేఖ
నటఁ జూడఁ జూడఁ బ్ర♦త్యక్షమయ్యె నుకార,మంబుజాసనునిరూ♦పంబుఁ దాల్చి
తదనంతరంబ చం♦ద్రశిఖావతంసు చం,దంబుఁ గైకొని మకా♦రంబు మెఱసె
నంతశబ్దబ్రహ్మ♦మైన నాదంబున, భువనహేతువు బిం♦దువును దోఁచె మునుకార
గీ. నఖిలమును గూడి యోంకార♦మయ్యెఁ బిదపఁ, గ్రమముతోఁ గుంభభవ! యకా♦ర
మును మకారంబునగు వర్ణ♦ములును నాద,బిందువులు ధాతయగ్రంబు♦నందు నిలిచి.
కాశీఖండము, ఆ 6 ప 248, 249.

# కేదారలింగేశతీర్థము

సీ. శిశిరభూధరకన్య ♦ చిఱుబంతిపసుపాడు, నెందుసాయంకాల ♦ మింపెలర్ప
నరుఁ డెందు జలమును♦ద్ధరణంబు సేవించి, శంభులింగముఁ దాల్చు ♦ జరఠపితరి
వినుపీఁచిఁ బోరాడి ♦ వివశంబులై కూలి, హంసంబు లయ్యెవా♦యసము లెందుఁ
బ్రవహించు నెందు శ్రీ♦భాగీరథికిఁ బోటి, యమృతస్రవాహ్వాయ♦యైన తటిని
గీ. యది విముక్తవధూకంఠ♦హారలతిక, దివ్యకేదారలింగేశ♦తీర్థభూమి
నదనదీవాపిపల్వల♦హ్రదసమగ్ర, ద్రాక్షపందిలి కాశికో♦ద్యానమునకు. 916
కాశీఖండము, ఆ 6 ప 304.

# హనుమత్కుండము

మ. మనుజుండై వసుధన్ జనించియు హనూ♦మత్కుండతీర్థంబునన్
ఘనభక్తిం బితృకార్యమర్థి సలుపం♦గా నొల్లఁ డెవ్వాఁడు కో
పనులై పోదురు వానిఁ జూచి పితరుల్ ♦ పాకారిముఖ్యామరుల్
మునులున్ సిద్ధులు గోప మూనుదురు ద♦న్మాహాత్మ్యమై సెంతయున్. 917
గీ. హనుమతకుండసన్నిధి ♦ ననఘులార!, జపము హోమము దానంబు♦ సలుపఁడేని
జనునిజీవిత మప్రయో♦జకము దుఃఖ,భాజనంబగు గదు విప్ర♦పద్వయమున. 918
క. హనుమతకుండసన్నిధి, నేనరుఁడు తిలోదకంబు♦లిడు నియతుండై
వానిపితరు లాజ్యనదీపానము సేయుదురు నిజము ♦ పలికితి వత్సా. 919
రామేశ్వరమాహాత్మ్యము, ఆ 3 ప 85, 87.

# కాశికి దక్షారామమునకుఁగల సామ్యము

సీ. జహ్నుకన్యాతీర ♦ సన్నివేశమునకు, దక్షిణాంభోరాశి ♦ తటము సాటి
కమనీయమణికర్ణి ♦ కాప్రవాహమునకు, సప్తగోదావర ♦ జలము సాటి
కటకరక్షకుఁడైన ♦ కాలభైరవునకుఁ, బ్రకటపాతాళభై ♦ రవుఁడు సాటి
విశ్వాధిపతియైన ♦ విశ్వనాయకునకు, భీమనాథేశ్వర ♦ స్వామి సాటి
గీ. మోక్షవిభవంబునకు సాటి ♦ మోక్షలక్ష్మి, భోగమహిమంబునకు సాటి ♦ భోగమహిమ
వారణాసికి శ్రీదక్ష ♦ వాటమునకుఁ, దారతమ్యంబుఁ జర్చింప ♦ ధర్మ మగునె. 920

భీమేశ్వరపురాణము, ఆ 4 పద్య 40.

# తీర్థసేవ

చ. వ్రతములు లేనివారు నుప ♦ వాసపరాయణులు గానివారు దు
ర్మతులు విహీనశౌచులుఁ గ్ర ♦ మంబునఁ దీర్థము లాడ నోప రా
తతగుణశాలి నీవఖిల ♦ ధర్మవిదుండవు గావునన్ శుభ
స్థితిఁ జని తీర్థసేవనము ♦ సేయుము నీవ నభీష్టసిద్ధికిన్. 921

భారతము, అర. ఆ 2 పద్య 275.

క. విను తీర్థసేవఁ గామంబును గ్రోధము మదము లోభ ♦ మును జేరనినె
మ్మనము గలిగి నడవవలయును, ననఘా! ఫలసిద్ధి దాన ♦ నగుఁ బురుషునికిన్. 922

భారతము, అను. ఆ 2 ప 90.

సీ. చెలువ! శ్రీగిరియందు ♦ శిఖరేశ్వరంబను, శిఖరంబుఁ జూచినఁ ♦ జేరు ముక్తి
కాంత! శ్రీశైలంబు ♦ కంటె వేగంబునఁ, గేదారవారిఁ జాలుఁ ♦ గేవలత్వ
మంతకంటెను వేగ ♦ మరవిందలోచనా!, యమృత మానోపుఁ బ్ర ♦ యాగతీర్థ
మాప్రయాగముకంటె ♦ నతివేగమునఁ జేయు, నపవర్గ మింతి! మ ♦ హాశ్మశాన
గీ. మతివ! యానందకానన ♦ ప్రాప్తికరము, నఖిలతీర్థంబులును సంగ ♦ మంబు లేదు
కాశికాతీర్థమాడక ♦ కదియరాదు, లక్షతీర్థంబులాడిన ♦ మోక్షలక్ష్మి. 923

సీ. పాడిదగ్గు కంఠంబుఁ ♦ బొరిపుచ్చకయమున్న, తలప్రకంపంబుఁ బొం ♦ దకయమున్న
బొమలు కన్నులమీఁదఁ ♦ బొదివి వ్రాలకమున్న, ఘోరనేత్రములకడ్డ ♦ చొరకమున్న
శ్రోత్రపుటంబులశక్తి ♦ సురిఁగిపోవకమున్న, పళ్లు లాననముఁ ♦ బాయకయమున్న
హృదయంబులో జాగ ♦ పదను దప్పకమున్న, గాత్రంబు శిథిలంబు ♦ గాకమున్న

గీ. పండ్లు వేర్వాసి కదలుమా♦పకయమున్న, కాకికడకంటిచూపుగా♦ రాకమున్న
కాలుసేమా కుత్తుతియందఁ♦కదలవలయుఁ, దీర్ఘసేవకు దేహ మ♦స్థిరము గాన! 924
కాశీఖండము, ఆ 3 ప 78, 84.

సీ. ఇంద్రేశతీర్థంబు ♦ ఋషిసమాకీర్ణంబు, సిద్ధేశ్వరము సర్వ♦సిద్ధికరము
నాగేశతీర్థంబు ♦ యోగలక్ష్మీకరాయి, కాశేశ్వరము భక్త♦కల్పతరువు
శుక్రేశతీర్థంబు ♦ శాంతిదాంతవిధాయి, వీరభద్రేశంబు ♦ విశ్వనుతము
బ్రహ్మేశతీర్థంబు ♦ బ్రహ్మర్షిసేవ్య మైశ్వర్యదము కపా♦లేశ్వరంబు
గీ. ఋక్కేశంబు కాశికిఁ ♦ గొంతవెలితి, సోమనాథేశ్వరము ముక్తి♦సూచకంబు
శ్రీమహేశ్వరతీర్థంబు ♦ శివుని మెచ్చు, త్రిభువనాభ్యర్చితం బుమా♦తీర్థ మనఘ. 925
భీమేశ్వరపురాణము, ఆ 3 పద్య 74.

# తిరుమల యాత్ర

సీ. అనశనవ్రతముచే ♦ నతులకార్శ్యంబునఁ గనుపట్టునోరిబీ♦గములవారు
మ్రొక్కుఁదీర్పుటకునై ♦ మూఁకమూఁకలుగూడి,రే తెంచుతలమోపు♦టిండ్లవారుఁ
బ్రాణముల్ పిడికిటఁ ♦ బట్టుక యిట్టట్టు, దెమలని శిరసుకో♦డములవారు
దైహికాయాసంబు ♦ దలఁపక దొర్లుచు, నడతెంచు పొరలుదఁ♦డములవారు
గీ. నామ టోమటు మ్రొక్కు-వా♦రడుగునడుగుఁ దండములవారు మిగులసఁ♦దడియొనర్ప
నడరి పన్నగసార్వభౌ♦మాచలేంద్రుఁ, గొలువఁ గోటానకోట్లు పెం♦న్గాటు మరుగ.
సీ. చేమాఱు తాళము♦ల్ మ్రోలఁగ రొండులఁ జేతులుంచి యందఱి వెక్కి♦రించికొనుచుఁ
బజ్జనూపమున దీ♦పపుఁగోలఁ రాఁజహస్తము సాఁచి జేగంట ♦ చఱచికొనుచుఁ
దలమోరగిలఁ గ్రుంకి ♦ తప్పెటగతికివాయించి గంగడ్ల నా♦డించికొనుచు
దిగువడిసానుల ♦ బెరసిగంటలు మ్రోయ, బోడచప్పరముల ♦ నాడికొనుచుఁ
గీ. ద్రోవఁగూర్చుండి బొంతలు♦ మ్రోలఁబఱచి, ముదురుటెండలకోరగా♦ముసుఁగుఁ జేర్చి
పట్టెవండలు మొరయించి ♦ పాడుకొనుచు, నలరు దాసర్ల వీక్షించి♦ యాక్షణమున.
గీ. పంకజేక్షణు మురవైరి ♦ భక్తసులభు, వేంకటస్వామి వీక్షించు ♦ వేడ్కహృదయ
పద్మమునఁ దొంగిలింప సం♦భ్రమము మెఱసి, యామహీధరమెక్కితి♦ నట్టివేళ.
సీ. చెక్కుల మకరికా♦చిత్రము ల్గరఁగంగఁ, గలయ నూర్చుచు సారె♦ నిలిచి నిలిచి
కటులభారమున వె♦న్కకు వీఁగి యందంద, పతుల యంసము లూఁత♦ పట్టిపట్టి
తరులనీడలు చేర♦ నరిగి నెచ్చెలి వీచు, సురటితెమ్మెరలకుఁ♦ జొక్కి చొక్కి
పాదాబ్జములు తొట్రు♦పడఁగ జానువులూఁది,యెక్కుడుదగ పొట్టు♦ లెక్కి యెక్కి

గీ. వలుదగుబ్బలఁ జెమటలు ♦ వడియఁ బయఁట, లుబ్బనొత్తుచు నున్నని ♦ యూర్చియూర్చి
యలఁతఁ దూలుచు వ్రాలుచు ♦ నలఘుహర్మ్య, జాలఁ దేలుచు సోలుచు ♦ జలజముఖులు.
ఉ. మందలుగూడి యెక్కి కతి ♦ మంజులవంజులకుంజమంజరీ
బృందమరందబిందులహ ♦ రీబహుకితిసగీతికందదిం
దిందిరవందితుందిలను ♦ తిప్రతిహంజదళిందకందరా
మందసరజ్ఝరీఘుమఘుమ ♦ ధ్వనిజాలము శేషశైలమున్. 930

చంద్రభానుచరిత్రము, ఆ 5 వ 41, 45-48.

## శ్రీశైలయాత్ర

క. మనుజుఁడు కార్తికమాసంబున నిశ్చలతత్పరత్వ ♦ మున శ్రీనగముం
గనుఁగొనినమాత్రఁ గలుగును, ననఘునకును వాజపేయ ♦ యజ్ఞఫలంబుల్. 931
క. వేసరక మార్గశిరమను, మాసంబున శ్రీనగంబు ♦ మనుజుఁడు గనినం
జేసినదురితము తొలఁగును, భాసిల్లును పౌండరీక ♦ బహుమఖఫలముల్. 932
గీ. పుష్యమాసంబునందు నే ♦ పురుషుఁడైన, పర్వతంబున కేఁగిన ♦ పావనాంగుఁ
డగును పాతకనిర్ముక్తుఁ ♦ డగును పుణ్యుఁ, డతఁడు వొందును సాహస్రయజ్ఞఫలము.
క. కృతకృత్యుండగు నరుఁడీ, క్షితి ఫాల్గునమాసమునను ♦ శ్రీగిరి కరుగన్
హతకల్మషుఁడగు కలుగును, నతనికి సౌత్రామణీమ ♦ హాధ్వరఫలముల్. 934
క. మధుమాసంబున శ్రీగిరి, విధియుక్తము గాఁ జూచు ♦ విమలాత్మకునన్
ప్రథితశుభంబులు జేకుఱు, నధికంబగు బహుసువర్ణ ♦ యజ్ఞఫలంబుల్. 935
క. వైశాఖమాసమున నా, శ్రీశైలముఁ జూచునతఁడు ♦ జితమోహాతనుః
పాశుఁడగు లక్షగోవుల, పేశలమతులకు నొసంగు ♦ పెంపు వహించున్. 936
గీ. శ్రీనగంబున కెవ్వఁడీ ♦ జ్యేష్ఠమాసమున ప్రయాణంబుఁ జేయు నా ♦ పుణ్యునకును
వాంఛితార్థంబు కోటిసు ♦ వర్ణదానఫలము సిద్ధించు నధికశు ♦ భంబు లొందు. 937
క. జనులెవ్వరేని నియతంబునఁ జని యాషాఢమాస ♦ మున శ్రీనగముం
గనుఁగొనినఁ గోటిగోవుల, ననఘుల కర్పించుఫలము ♦ లప్పుడే కలుగున్. 938
క. వెండియు మనుజుఁడు శ్రావణ, కాండంబున శ్రీనగంబుఁ ♦ గనుగొనునంతన్
బండితులకు యోజనమునఁ, బండిన చేనిచ్చు పుణ్య ♦ ఫలముం గలుగున్. 939
క. అతిభక్తి భాద్రపదమున, గతిఁ గొలుచును నరుఁడు శ్రీన ♦ గంబున కరుగన్
గుతుకమునఁ గోటిగోవుల, కృతమతులకు నిచ్చుచేతు ♦ కృపలము లుగలుగున్. 940

క. అతిశయమని యమవ్రతసంయుతుఁడై శ్రీనగము నూర్జితభుజమునఁ జూడన్
పండితులకును వేవుర, నతిథుల నర్చించుఫలము లబ్బెడి గలుగున్. 941

పర్వతపురాణము, ఆ 3.

# రామేశ్వరయాత్ర

క. రామస్థాపితలింగం, బేమానవుఁ డేకవార మీక్షించు నతం
డామునులార శశాంకశి, ఖామణిసాయుజ్య మొందు నతగల్మషుఁడై. 942

ఉ. స్థాపితుఁడయిన రామనాథుఁ దన మూడుకన్నుల కింపుగాఁ జూడఁడేనరుం
డతఁడు జడుండు మూఢుఁ డతఁ డంధుఁ డతండు కరాంఘ్రివర్జితుం
డతఁడు దరిద్రుఁ డాతఁడు రుజార్తుఁ డతండు ఖలుం డతండు త
త్సుతధనధాన్యమందిరసుపుత్రకరంబు నశించు నెంతయున్. 943

గీ. క్రిమికులంబు శకుంతముల్ కీటకములు, జనులు బృందారకులు తపోధనులు మునులు
పుణ్యరామేశ్వరక్షేత్రభూమియందు, సములు రామేశ్వరుని సుప్రసాదకలన.

గీ. పుణ్యుఁడ నటంచు గర్వంబుఁ బూన వలదు, పాతకి నటంచు మనమున భయము వలదు
సొంపు దీపింప రామేశుఁ జూచిరేని, గొల్లజనులును సములని యెఱిఁగికొనుఁడు.

సీ. రామసేతువునకుఁ జని రామనాథ, శంకరునకుఁ బ్రియంబున సద్ద్విజునకు
గ్రామ మొకటిని నొసఁగిన భూమిపతికి, నఖిలభూచక్రదానపుణ్యములభించు.

క. దళమును కుసుమము ఫలమును, జలమును శ్రీరామనాథ శంకరునకు ని
శ్చలభక్తి నొసఁగుజనముల, నలరామేశ్వరుఁడు బ్రోచు ననవరతంబున్. 947

గీ. భక్తితోడ మహాదేవు భవుని రామ, నాథు శరణంబు వేడిన నరుల కెల్ల
శాంతమతులార లాభంబు జయము గల్గు, నరయ నిహపరలోకద్వయంబునందు.

క. రామేశ్వర రామేశ్వర, రామేశ్వర యనుచు జనులు ప్రత్యూషమునన్
నేమంబుతోఁ బఠించిన, నామేటికిఁ బూర్వదినకృతాఘము వాయున్. 949

సీ. రామనాథుని మందిరము దారువులఁ జేయు, మనుజుండు సురలోకమునఁ ద్రికోటి
కులయుతుఁడై నిల్చు కుదురుగా నిటుకఁ గట్టినవాఁడు వైకుంఠమున వసించు
శిలలచేఁ గట్టించు నలఘుపుణ్యుఁడు బ్రహ్మపట్టణంబున నెప్డుఁ బాయకుండు
స్ఫటికకాంచనమణిప్రభలములరామేశు, భవనంబు నిర్మించు పావనుండు

గీ. భానుమండలమును భేదించి మాన మెక్కి, సురవధూకరచారుచామరమనోజ్ఞ
మారుతాంచితసంవీజ్యమానుఁ డగుచు, హరునిలోకంబునకుఁ జను సుగతిఁ బొందడే.

రామేశ్వరమాహాత్మ్యము, ఆ 1.

# తీర్థయాత్రాదిగర్హణము

సీ. గుడిగుండములఁ గొండ♦గుహలఁ గారడవులఁ, గూరవారలనిరా♦హారములను
బండుగుపర్వాలఁ ♦ బాడిని బంటను, శేర్పు నేరంబుల ♦ నోర్పుఁబనుల
నిప్పుల నీళ్లను ♦ చప్పడుపిల్లను, కీర్తిఁ దినాళ్ళఁ ♦ దిప్పటలను
వడుగులఁ బెండ్లిండ్ల ♦ వన్నెలవాసుల, వాగ్రంతలచదువుల ♦ వాదములను
ఆ. విందుల వినుకళ్ల ♦ వితరణగుణములఁ, బొందు పోరటలను ♦ పోణములను
మోక్ష మబ్బ దయ్యొ ♦ ముక్తికాంతామణి, నాథుఁ జేరకున్న ♦ నయులకధిప. 952

(శ్రీరామస్తవరాజము, ఆ 2.)

# బాహ్యాభ్యంతరతీర్థములు

గీ. తీర్థములు మానసములు ముక్తిప్రదములు, తరుణి! యివి మేలు బాహ్యతీ♦ర్థములకంటె
మానవుం డివి యెఱుఁగ ♦ మధురవాణి, బాహ్యతీర్థంబు లాడ ని♦ష్ఫలము గాదె!
సీ. తీర్థంబు సత్యమిం♦ద్రియనిగ్రహము తీర్థ, మనుమాయ తీర్థంబు ♦ వనరుహాక్షి!
తీర్థంబు దానంబు ♦ తీర్థంబు సంతోష, మనుకంప తీర్థంబు ♦ కనకగౌరి
బ్రహ్మచర్యంబు తీ♦ర్థంబు తీర్థము ధృతి, యమము తీర్థము విద్రు♦మాధరోష్ఠి
సమతతీర్థంబు వి♦జ్ఞానంబు తీర్థంబు, పుణ్యంబు తీర్థంబు ♦ పువ్వుఁబోఁడి
గీ. తీర్థములు మానసంబులు ♦ ధీవిశుద్ధి, యతిశయిల్లంగ నివి యాడ♦ కాడిఁక్రి
పంచజనులకుఁ గలహంస ♦ పక్షిగమన, బాహ్యతీర్థావలులు తీర్థ♦ఫలము నీవు. 953
చ. బిసరుహపత్త్రలోచన! కృ♦పీటములందు మునింగియాడవే
మొసళులు మీలు కర్కటక♦ముల్ సమతంబులు వానికబ్బునే
యసదృశమైన తీర్థఫల ♦ మట్టివిధంబుసుమీ తలంప మా
ననునుగు తీర్థ చూడని జ♦నంబులకుం బహుబాహ్యతీర్థముల్. 954
గీ. సుదతి! యేఁటికి నంతర్వి♦శుద్ధిలేని, బాహ్యసంశుద్ధి? బహుతీర్థ♦పరిచయమున
వేయుఁగడవలజలమున ♦ వెలిఁ గడిగిన, గలుగునే శుద్ధి వారుణీకలశమునకు! 955
గీ. రాగదోషమలాపహా♦రకమమంబు, మానసంబైన తీర్థంబు ♦ మందగమన
యనవిఁ బంకసజ్జోక్యపా♦వతమంబు, బాహ్యతీర్థంబు మెచ్చరు♦త్పలదళాక్షి! 956
సీ. దర్శించినపుడ చి♦త్తము నిర్నిబంధనం,బగుఁ బ్రసాదగుణంబు ♦ నందు నేనిఁ
గలుషంబుగాని దు♦ర్గంధంబుఁ బోరయని, సలిలంబు నెరవుగాఁ ♦ గలుగునేనిఁ

బావనక్షేత్రపు♦ణ్యావనీధరతపో,వనసన్నికర్షంబు ♦ దనరు నేనిఁ
సంతతవ్రతులైన ♦ సంయమిశ్రేష్ఠుల, యధికపరిగ్రహం ♦ బబ్బె నేనిఁ
గీ. దీర్ఘ నది దక్కఁ గలయది ♦ తీర్థ మగును, ధవళలోచన! సలిలమా♦త్రమునఁ జేసి
ముదిత! దేహమునందంగ♦ములకుఁ బోలెఁ, దారతమ్యంబు గలదు తీ♦ర్థములకవని.
కాశీఖండము, ఆ 3 ప 69-76.

# వీరమాహేశ్వరాచార్యవరులు

సీ. సిరియాలు గరికాలుఁ ♦ జేరమునుద్భటు, బాణుఁ గేశవరాజు ♦ బసవరాజు
కన్నప్ప జన్నయ్య ♦ కరయూరిచోడయ్య, కుమ్మరగుండయ్య ♦ నెమ్మినాథు
పండితారాధ్యుని ♦ భల్లాణు నజు నంది, మాహేశు మడివాలు ♦ మాచిరాజు
జేకమరాజయ్య ♦ చిఱుతొండనోహళి, సాంఖ్యతొండనిసుర్య♦కొండ దేవు
ఆ. వెలయమఱియుఁగల్గు ♦ వీరమాహేశ్వరా,చారవరుల వీర♦సత్యవ్రతుల
వీరసచ్చరితుల ♦ వీరవిక్రములను, పరగఁ దలఁతు మ్రొక్కి ♦ భక్తితోడ. 958
వీరభద్రవిజయము, ఆ 1 పే 2.

# పుణ్యనదులు

సీ. కలుషపంకజకళి ♦ గౌతమి గౌతమి, సకలసజ్జనమాన్య ♦ జహ్నుకన్య
జంతుసంతతమన♦శ్శర్మద నర్మద, శమితతాపత్రయా♦దమన యమున
శ్రితసాధుజనలబ్ధ ♦ జీవిక దేవిక, సత్యసంవిద్యోగ ♦ చంద్రభాగ
సతతజనాత్మచలా♦శనిభవనాశని, దూరీకృతక్షుద్ర ♦ తుంగభద్ర
గీ. బహులసౌభాగ్యదానసం♦పన్న పెన్న, భగ్నదుర్మోహపాశవి♦పాశ యనఁగ
భువిఁ బ్రసిద్ధికి నెక్కిన ♦ పుణ్యనదులు, హరికి లీలావిహారయో♦గ్యములుగావె. 959
శ్రీరంగమహత్త్వము, ఆ 1 ప 75.

సీ. శీతాంబువాహిని ♦ శీతమహావక్ర, చక్రపద్మావతి ♦ చంద్రమత్త
శతభద్రహంసహం♦సావతి వనమాల, పంచవర్ణసువర్ణ ♦ బ్రహ్మభాగ
కావేరి సురసశా♦ఖాపతిహరితోయ, యింద్రనది హిరణ్య ♦ కృష్ణతోయ
యరుణావతి సువప్ర♦యంగారవాహిని, క్షీరోదమణివప్ర ♦ శివసుదంతి
గీ. స్కంధవతి సోమవతి ధను♦ష్మతి వసుమతి, నాశవతి మణితల మహా♦నది పదాద
విమలపుణ్యోదవామోద ♦ విష్ణుపదియు, మొదలుగాఁ గొన్ని పెద పెద♦నదులు గలవు.
వరాహపురాణము, నం. మ. ఆ 10 ప 114.

## గోదావరి

సీ. త్ర్యంబికాచలశిఖా ♦ గ్రమునందు నుదయించి, పొదలి యార్యావర్త ♦ భూమి దాఁటి
మలఁగి దండకవనీ ♦ మధ్యభాగమున నా, ప్రస్రవణాచల ♦ ప్రస్థ మెఱసి
పట్టిసశ్రీవర ♦ భద్రేశు సేవించి, తీరసోమేశునం ♦ దిరము డాసి
యేచి యనంతభో ♦ గేశ్వరస్థానంబు, రుద్రపాదములపైఁ ♦ ద్రోవగాఁగ
గీ. గోటిపల్లీశుకోమలాం ♦ ఘ్రులకు మ్రొక్కి, కుండలాముఖతీర్థంబుఁ ♦ గుస్తరించి
భీమమండలిడాపలఁ ♦ బెట్టుకొనుచు, గౌతమీగంగలవణాబ్ధిఁ ♦ గౌఁగిలించె. 961

భీమేశ్వరపురాణము, ఆ 3 పద్య 21.

సీ. తటరూఢకుటవార ♦ చటులాళి పటలాఖ్య, నటజాలగానము ♦ త్కటము గాఁగ
కమనీయవిమలాబ్జ ♦ గమనాఢ్యతమహాంస, రమణీవిరావము ♦ త్క్రమము గాఁగ
లహరీచరహితాప్తి ♦ సహసోద్ధబహుచక్రి, మహిళానినాదమా ♦ గ్రహము గాఁగ
నిరతోదకరతాగ్ర ♦ సరరామతరుణప్లవరవప్రపంచము ♦ త్తరము గాఁగ
గీ. నళికిచూచుచు నిసుకది ♦ న్నెలఁ జరించు, మానిమాణవు లొప్ప వి ♦ మ్మైనదాని
గౌతమీనదిఁ గాంచితె ♦ కమలముకుల; సదృశవక్షోరుహద్వయీ ♦ సన్నతాంగి.

సర్వకామదాపరిణయము, ఆ 2.

## కావేరి

సీ. ఏయేటినడుఁదిన్నె ♦ నే ప్రొద్దుఁ జలిగొన్న, సికతాతలంబులఁ ♦ జెలఁగి చెలఁగి
యేతరంగిణి నించు ♦ కించుక వికసించు, కొత్తమ్మితావులఁ ♦ గొసరి కొసరి
యేనదీక్రీడల ♦ నెసఁగు రాయంచల, కలకలంబుల కాత్మ ♦ నలరి యలరి
యేసరిత్తటమున ♦ నేచినకల్పక, మేదురచ్ఛాయల ♦ మెచ్చి మెచ్చి
గీ. నేఁడు నొకనాఁడుఁ బాయకు ♦ న్నాఁడు శౌరి, యతిమనోహరి నిశ్రేయ ♦ సానుకారి
వివిధతాపనివారిభూ ♦ వినుతవారి, కలితకావేరి భవకరి ♦ కలభవైరి. 962

ఉ. ఉన్నతరంగధామలలి ♦ తోభయపార్శ్వములం బ్రసన్నయౌ
నన్నది యుబ్బిపాఱుఁగలి ♦ తాయతకంకణమౌక్తికద్యుతి
చ్ఛన్నమృదుప్రవాహములు ♦ సాఁచి చిరాగతుఁ బ్రాణనాయకుం
జెన్నుగ నిండుకౌఁగిటికిఁ ♦ జేర్చి చెలంగు మృగాక్షికైవడిన్.

శ్రీరంగమహాత్మ్యము, ఆ 1 ప 87, 89.

శా. ఆవీణాధరుఁ డేఁగి కన్గొనియెఁ బు ♦ ణ్యఖ్యాతదరోల్లస
ద్దైవద్వీపవతీసముత్సరవివా ♦ దప్రౌఢిసూనర్గళ

వ్యాకల్లక్కారభావభృల్లహరికా♦వర్గావృతవ్యోమముం
గావేరీతటినీలలామము నఘా♦సుక్షాళనోద్దామమున్. 965

కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 135.

మ. చిరకాలాగతప్రాణనాయకుని తాఁ♦ జేదోయి నాలింగనా
దరణన్ మెచ్చఁగఁ జేయు మానవతిచం♦దం బొప్పఁ గావేరి తా
నిరువాగై కవగూడి యెన్నఁడును రం♦గేశున్ భజించెన్ దయా
పరుఁడై యచ్చోటు నాయకుండెను బర♦బ్రహ్మంబు రంగేశుఁడున్. 966

శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 2.

సీ. కవులకు జీవన♦కర్మము నొసంగినయట్టి, యీసరస్వతినుతి♦యింపఁ దరమె
పరరాజహంసాళి ♦ భంగంబు నొందించు, నీవాహినీలీల ♦ లెన్నఁ దరమె
యనిమిషప్రతతికి ♦ నమృతంబు లొసఁగూర్చు, నీసింధుచాళినూ♦హింపఁ దరమె
కాదంబవితతి న♦త్కాలికలఁ దేలించు, నీహ్రదినిమహత్త్వ♦ మెన్నఁ దరమె
గీ. సూనసాయకతా మెంత ♦ సుడులఁ బడిన, సాటిసేయంగఁదగునె య♦సహ్యగోత్ర
జాతిలో నన్యనదులనీ♦సహ్యగోత్రజాతను ననంతభువనవి♦ఖ్యాతికరయు. 967

చంద్రభానుచరిత్రము, ఆ 2 ప 100.

## నర్మద

మ. నలినప్రోద్భవసూతి గన్గొనియె విం♦ధ్యక్షోణిభృత్కంధరా
బలవద్గండశిలాభిఘాతవిలుఠ♦త్పాథస్తరంగచ్ఛటా
స్ఖలనారంభవిజృంభమాణపటుఘుం♦కారస్ఫుటాంతర్మదన్
గలనాతత్పరభక్తలోకపరిర♦క్షాశర్మదన్ నర్మదన్. 968

కాశీఖండము, ఆ 1 ప 94.

## పినాకిని

ఉ. నందిగిరీంద్రసంభవజ♦నప్రికరౌఘసమూహశైలపా
రందరవజ్రిదారతటి♦భంగ దభంగురభంగసంగతా
మంద సరోజబృందగత♦మాధుకరామలగానశోభితా
నందితతీరభూసరిద♦నీకిని గాంచెఁ బినాకినీనదిన్. 969

శైవ్యపురాణము, ఆ 6.

## భీమరథి

శా. ఆభైమీనది విశ్వమున్ నిజకృపా♦టార్ద్రంబు గావించుచున్
శ్రీభామావిభుక్షేత్రమండలము డా♦సెన్ డాసిఁన్ వీచికే
ళీభీలం బగుదాని పెంపు గని ముం♦న్నందుండు ప్రాణుల్ మహా
క్షోభోద్విగ్నమనస్కులై వెలుచ నా♦క్రోశించుచున్ బెంపఱన్.

పాండురంగమాహాత్మ్యము, ఆ 5 ప 133.

## జోర్దానది

సీ. అలిమండలీమనో♦హరవేణిభరముతో, శఫరీచలత్కటా♦క్షములతోడ
ఘనశాంబుజాతవ♦క్త్రవికాసలక్ష్మితోఁ, గంబూజ్జ్వలగ్రీవ♦ గరిమతోడ
మదచక్రవాకస♦స్యగురోజపటిమతోఁ, దరలోర్మికావళీ♦త్రయముతోడ
నతిగూఢతరజీవ♦నావర్తనాభితో, సుఘనిమ్నసైకత♦శ్రోణితోడ
గీ. రమ్యకచ్ఛపసన్నిభపదా♦గ్రములతోడఁ, గలితకలహంసయానవై♦ఖరులతోడ
నలయజ్ఞోర్దాభిధేయదీ♦వ్యన్నదీలలామఁ బోడఁ గాంచె నెదుట నుల్లాస మెసఁగ.

వేదాంతరసాయనము, ఆ 3 ప 8.

## ధనుష్కోటి (సేతువు)

సీ. అంధతామిస్రమ♦హాఘోరవారిదు,ర్గమజాతయాతనా♦ ఖండనంబు
సహితాశ్వమేధాది♦ బహుళాధ్వరక్రియా, తతపుణ్యవిభవసం♦ధాయకంబు
భువనాభినుతతులా♦పురుషప్రభృతిమహా,దానఫలోత్కర్ష♦దాయకంబు
బ్రహ్మహత్యాసురా♦పానహేమస్తేయ, గురుతల్పగమనాఘ♦కోటిహరము
గీ. బ్రహ్మచర్యోపవాసాది♦ పరమనియమ, రమ్యబహువిధపుణ్యలో♦కప్రదంబు
కామితార్థైకవితరణ♦కల్పతరువు, ధీరులార ధనుష్కోటి♦తీర్థవరము. 972

ఉ. రావణు నాజిఁ ద్రుంచి రఘు♦రాముఁడు లంకకు నవ్విభీషణున్
శ్రీవిలసిల్లఁగా నధిపుఁ♦జేసి సురాసురసిద్ధసాధ్యసం
భావ్యతుఁడై వెసన్ మరలి♦ యంచితభూతిని గంధమాదన
గ్రామముఁ జేరె లోకములు♦ రంజిల సేతుమహాపదంబునన్. 973

సీ. అంత రాముని జూచి♦ ప్రాంజలియై సత్య,భాషణుండైన వి♦భీషణుండు
పలికె నో దేవ నీ♦ భక్తుని విన్నప, మవధరింపుము పీఠ♦లై నయార్య

మనుజేశులును సేతు♦మార్గంబువలనలం,కరువచ్చి పీడింపఁ♦ గలరుగానఁ
జెలఁగి ధనుష్కోటి ♦ చేసెదు ఛేదనం,బాచరింపుము కరు♦ణార్ద్రచిత్త
గీ. యనుచుఁ బ్రార్థింపఁ గాకుత్స్థుఁ♦డట్లు చేసె, నందువలనధనుష్కోటి♦యయ్యెదాని
దర్శనంబున జంతుసం♦తతికి ముక్తి, గలుగు నవగాహఫలమేమొ ♦ తెలియరాదు.
గీ. రామకరచాపకోటిని♦ర్దళితసేతు, రేఖకైలాసమునకు వి♦రించిలోక
మునకు వైకుంఠపట్టణ♦ంబునకు స్వర్గ,మునకుఁ దెరువది తాపస♦ముఖ్యులార. 975
రామేశ్వరమాహాత్మ్యము, ఆ 1.
సీ. కడఁగి సేతువుఁ జేర♦గానె ముక్తి లభించు, భవకేశవులయందు ♦ భక్తి పుట్టుఁ
ద్రివిధకర్మంబు సి♦ద్ధించు నచ్చోటన, నించుకంతయు సంశ♦యించవలదు
మనుజుఁ డెవ్వఁడు జన్మ♦ మధ్యంబునను సేతు,బంధంబుఁ బొడగాంచు♦భక్తితోడ
ధన్యతనతఁడు మా♦తాపితృవంశకో,టిద్వయోపేతుఁడై ♦ దివి మెఱయు
గీ. బ్రహ్మపదమున నొక్క క♦ల్పము వసించు, ముక్తుఁడగుఁ దారలుపరాగ♦ములుఁ గణింప
శక్యమగు సేతుదర్శన ♦ జనితపుణ్య, మహిపతికినైన లెక్కింప♦నలవిగాదు. 976
క. ధర సేతుస్నానముగల, గురుపుణ్యుఁడు సప్తకోటి ♦ కులములతోడన్
హరిభవనంబునకుం జని, సురుచిరగతి ముక్తిఁ బొందు ♦ సువ్రతులారా. 977
గీ. మానవుఁడు సేతువును గంధ♦మాదనంబుఁ, బ్రీతి రామేశుఁ దలఁచుచుఁ♦బితృకులములు
లక్షకోటులు గూడి క♦ల్పత్రియంబు, శంభుపదముననుండి మో♦క్షంబుఁ గాంచు.
గీ. సేతువున నవగాహంబు♦సేయువాఁడు, పంచపాతకముక్తుఁడై ♦ పద్మనాభు
వీటఁ బితృమాతృకులశత ♦ కోటితోడ, మూఁడుకల్పంబులు వసించి♦ముక్తిఁ గాంచు.
సీ. యాగంబు సేయక ♦ నమరలోకాంగనా,సంగమసుఖవాంఛ ♦ సలుపువారు
జ్వాలవార్కలను దేవ♦తల నుపాసింపక, కుశలంబు మదిలోనఁ ♦ గోరువారుఁ
దిలమహీహేమతం♦డులధాన్యదానంబు, సేయక స్వర్గేచ్ఛ ♦ సేయువారు
సతతోపవాసని♦ష్ఠలఁ దాప మొందక, బలభేదిపురినుండఁ ♦ దలఁచువారు
గీ. సేతుతీర్థాభిషేకంబు ♦ సేయవలయు, సేతుమజ్జనముననగుఁ ♦ జిత్తశుద్ధి
యనఘచరితులార జపతపో♦యజ్ఞహోమ,దానములు సేతువున మోక్ష♦దాయకములు.
క. ఆరోగ్యము రూపంబును, దారిద్ర్యవిమోచనంబు ♦ ధనవృద్ధియునుం
గోరి మది సేతుజలముల, నారూఢిమునుంగువారి♦కవి సిద్ధించున్. 981
గీ. శ్రద్ధచేనైన మనుజుఁ డ♦శ్రద్ధనైన, సేతుసలిలావగాహంబు ♦ సేయువాఁడు
ఘనతదీపింప నుభయలో♦కంబులందు, బాధ లెఱుఁగక సౌఖ్యసం♦పదలు గాంచు.
రామేశ్వరమాహాత్మ్యము, ఆ 1.

సీ. తనుఁ గనుంగొనినమా♦త్రంబున బ్రహ్మహ,త్యాఘము పేస్థలముత♦ద్దయు నడంచుఁ
దనపేరునుడివినం♦తనె సమస్తనదీనదస్నానఫలము తే♦స్థల మొసంగుఁ
దననీటఁ గ్రుంకినం♦తనె యశ్వమేధాది, సవనపుణ్యంబులే♦స్థలి యొసంగుఁ
దనయందు మెలఁగినం♦తనె ముముక్షువుల క,త్యలఘుకైవల్యమే♦స్థలి కుదుర్చు
గీ. నిసుక లెచ్చటు శివరూప♦ మెసఁగి ప్రబలు, నిలుచునీశ్లెచ్చటనుతీర్థ♦ములనఁబొల్చు
నట్టి శ్రీరామసేతువు♦ నరసి మోద, మందె నలశంకరాచార్యుఁ♦ డాత్మలోన. 983

శంకరవిజయము, ఆ 2.

## పంపాసరోవరము

సీ. కూల చంపక నారి♦కేల సాల రసాల,తాలహింతాల శ♦కోట్ల లతరులు
తీర భూజారూఢ♦ హారీత టిట్టిభ, కీర కోకిల కాక♦ కేకికులము
సారస కలహంస♦ చక్ర బక క్రౌంచ, కారండ వాలాప♦ కలకలంబు
కైరవేందీవర♦ కల్హార కువలయ, పుండరీకాంభోజ♦ పుష్పతతులు
గీ. నింగి కుప్పొంగు రంగత్త♦రంగసంచ, యముల నిందిందిరలసిత♦విచులవారి
మత్స్య కచ్ఛపోరగ శింశు♦మారచటుల, జలచరమ్ములకలఁకువల్♦ గలుగువాని.
మ. పరివిలాసాంచితసద్గభీర విమలాం♦భఃపూర సంసేవ్యహ
నవిహంగోత్కర సమ్మదావహమహో♦శక్రశ్రితాభ్యంతరన్
సవిశేషోర్మితరంగసంకుల జన♦శ్లాఘ్యప్రభావన్ సరః
పరివరంబుం గని రాన్నృపాత్మజులు పం♦పన్ బెంపు సొంపారఁగన్. 985

భాస్కరరామాయణము, అర. ఆ 2 ప 421, 422.

సీ. చక్రవాకబకోట♦ చక్రతిత్తిరిఘోట, నక్రాదినీరాట♦ నందితంబు
శతపత్త్రికల్హార♦ శతపత్త్రిరథవార,సితపత్త్రిసంచార♦ చిత్రితంబుఁ
గములచామస్వేత♦ కనులకైరవజాత, విమలవాస్సంఘాత♦ విస్తృతంబు
సాలామ్రమల్లీగ♦ సాలామ్లజంబీర, చేలారుచిస్ఫార♦ వేల్లితంబు
గీ. పుష్పసారపయఃపూర♦పూరితంబు, రాజహంసాదికవిరాజ♦రాజితంబుఁ
జారుతరభృంగసంగీత♦ సంగతంబు, భాసురంబు జెలంగె బం♦పాసరంబు. 986

నరసభూపాలరాజీయము, ఆ 3.

## ఆకాశగంగ

సీ. అరుణాంశుమండలం♦ బంధకారముఁ బోలె, దంభోళిపసుమతీ♦ధ్రములఁ బోలె
ఖనిపాన్యభామండు♦ కాద్రివేయులఁ బోలెఁ, గంఠీరవము గంధ♦కరుల బ్రోలె

దివ్యౌషధంబు వ్యా♦ధినికాయములఁ బోలె, మండువేసవి నిండ♦మసకవుఁ బోలె
ఝంఝూసమీరంబు ♦ జలధరంబులఁ బోలె, మానదంభంబు ధ♦ర్మంబుఁ బోలె
గీ. భక్తి సేవింపువారిపా♦పము లడంచు, దురితతమసఖండశశిఖండ♦పరశుధార
మదనవైరిజటాటవీ♦మల్లికళిక, యభ్రగోధిపయోభంగ ♦ యమరగంగ. 987

కాశీఖండము, ఆ 5 ప 49.

సీ. బ్రహ్మకమండలూ♦ద్భవమైనజాలున, భోరమావక్షోజ ♦ హారలతిక
నందనందనపాద ♦ నాళీకమధుధార, భోగికంకణుతల ♦ పూవుదండ
కనకాద్రిశృంగని♦ర్గళితనిర్ఝరరేఖ, మున్నీటిరాయని ♦ ముద్దురాణి
నెలవైనవేల్పుచు♦న్నీనికేళాకూళి, సగరులు ముక్తికిఁ ♦ జనినత్రోవ
గీ. పద్మముఖులార యిదిసుమీ ♦ భక్తజనుల, కామితార్థంబు లొనఁగూర్చు♦కల్పవల్లి
ప్రస్ఫురితమీనశాబక♦ప్రకటితప్రకాశసన్యాసపాంగ యా♦కాశగంగ. 988

సీ. తనుఁ దలంచినఁ బాప♦మును వేగ పాపును, దను నుతించిన నాప♦దల నడంచుఁ
దనుఁ జేరవచ్చినం♦తనె కోర్కు లొసఁగూర్చుఁ, దనుఁ జూచినట్లకో♦ఫసము నిచ్చుఁ
దనువర్ణనముసేయ ♦ నొనఁగూర్చుసంపదల్, తనుఁగంటు నసుకొల్వ ♦ ఘనజయంబుఁ
దనవారికిణసేవ ♦ నణఁగించు పాపముల్, తనుఁజొచ్చినను ఖ్యా♦తములఁ జేయు
గీ. నెట్టికేలకు తనయందు ♦ నెవ్వరేని, మునిఁగినంతనె సాయుజ్య♦ముక్తి నొసఁగు
నిందుముఖులార యీవేల్పు♦యేటిమహిమ, నలువకైన నుఁగొనియాడ♦నలవియగునె.

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 2.

సీ. వికచపద్మకుడుంగ♦విహరమాణరథాంగ, సహచరచ్చక్రాంగ♦చటులభృంగ
గాహమానపతంగ ♦ కరతప్తమాతంగ, మదగంధిలతరంగ ♦ మయశుభాంగ
తీరజాతలవంగ ♦ నారంగ తరుసంగ, కలనినాదవిహంగ♦కలుషభంగ
బహుళశ్రీమోత్సంగ♦పథికహర్షణచంగ సురభిశీతకురంగ♦వరతురంగ
గీ. నుతగశయనపదాంగజా♦స్యుత్తమాంగ, జీవితోత్తుంగ జననస్థి♦తి ప్రసంగ (?)
కనకగిరిశృంగ నిర్గళ♦ద్ఘనమృదంగ, ఘనరవజలానుషంగ నా♦కాశగంగ. 990

దశావతారచరిత్ర, ఆ 7.

## పాతాళగంగ

సీ. అనిమిషలోచనా ♦ యావర్తనతనాభి, పృథురథాంగస్తని♦ ఫేనహార
శృంగారసైకత ♦ శ్రీజఘనస్థలీ, వికచపద్మాననా ♦ విద్రుమోష్ఠి
కంబుకంధరి మధు♦కర నీలకుంతలి, యంభోజపుష్పర♦సాంగరాగ
మహనీయ కల్లోల♦మాలికాకరయుగ్మ, యభిరామ నవకల♦హంసయాన

గీ. తపనశిలైకవడి యొప్పు పా♦పకవిశంగ, నగతటోత్సంగ మరితప♦స్సగవిహంగ
భవశిరస్సంగ సేవిత♦పావనాంగ, తరళతరంగత్తురంగ పా♦తాళసంగ. 991

పర్వతపురాణము ఆ 3.

# గంగాప్రభావము

గీ. త్రిపథగాసేవనమున సి♦ద్ధించు ముక్తి, గతి జనములకు నియతక♦ల్పితము లయ్యు
సర్వగంబున బ్రహ్మవి♦ద్యాబలంబు గనము, సంపరిత్యాగము జేయ♦జాల వసుధ
క. మేనిం మకు నోకిన గంగాదితోయములు జనుల ♦ కల్మషకోటిం
బోనడిచి పురందరలోకానందము బొందు గేహము ♦ నాగన వేది. 993
క. మును పాపము లెన్ని యొనర్చిన బిదపను గంగ నాడ ♦ జీకటిగవి నో
చినవిరియు గతి విరియు నగ్యాన్ము డేలాతలము దొఱంగి ♦ యమరత నొందున్.
గీ. ఎన్నియేండ్లు మనుజుని ♦ యెముక్క గంగ, వారియం దుండునన్ని వే♦ల్వత్సరములు
నాకలోకమహాసుఖ♦శ్రీకి నాతండు దొత్తుండై యుండు నిర్మల♦చిత్తవృత్తి. 995
సీ. అనఘ సోమములేని ♦ యధ్వగంబును శశి, లేనిరాత్రియు రవి♦లేనినభము
నాత్మధర్మములేని ♦ యాశ్రమంబును బుష్ప,సంపదలేనిభూ♦జమును బోలె
హీనత నొందు గం♦గానదిలేని దేశంబు చాంద్రాయణ♦శతము లైన
గంగాపయఃపాన♦కణంబు గావింమ, నిర్మలత్వము జేయ♦నేర వన్ని
ఆ. యందు బడినవాడ♦య ట్లగు గంగావగాహనమున బాత♦కంబు లఖిల
భూతములకు దుఃఖ♦ములు వాపికొనుటకు, నేవిధములు గంగ♦కీడు గావు. 996
క. శరణంబు లేనిజనులకు, బరమశరణ మండ్రు బుధులు ♦ భాగీరథి వి
జ్ఞులకు నమృతము లట్టుల, నరులకు గంగాజలంబ♦నంగ నే వింటున్. 997
క. తలపై జాహ్నవివాలుక, యలికొనిన శాలతటిని ద♦వంతస్మృత్సా
కలితము జేసిన బాపంబులు దొలంగు సుపర్ణు గనిన ♦ భుజంగముల క్రియన్. 998
క. గంగాతరంగశీకర, సంగత మగుమారుతమున ♦ సద్యస్సర్వం
బంగీకరించు నెవ్వండు, భంగపఱచు నతండు ఘోర♦పాపచయంబున్. 999
గీ. ఇవల నేడుతరంబుల♦నవల నేడు,తరములను బితృవర్గంబు ♦ నరుండు గంగ
నాడి శుచి జేయు జూచిన♦యంతమాత్రి,బాచు వాఙ్మనఃకాయజ♦పాపతతుల
గీ. వినిన వేడుక సేసిన ♦ గనిన జేత, నంటినను రెండుపలముల♦యందు గలుగు
పితృగణంబుల నెల్ల సద్గతికి బుచ్చు,గంగ యొంటు సేయునో యవ♦గాహనమున

క. విను గంగ గంగ యనుకీ, ర్తనములతో నొందునీటఁ ♦ దగ మునిఁగినయ
జ్జనులు దురితములఁ బొఱఁగుదు, రని యార్యులు చెప్ప విందు ♦ నంచితచరితా. 1002

సీ. అనఘ చూడ సమర్థుఁ ♦ డగువాఁడు జాహ్నవిఁ, జూడక యున్నఁ బ ♦ శుప్రతిముఁడు
వంధసమానుండు ♦ నగు నిందుఁ ద్రాదిగా, సురలు గోరెదు గంగ ♦ నరులు గోర
వలదె చేకుఱు నప ♦ వర్గ ముత్క్రమణకా, లంబున గంగఁ ద ♦ లంచి రేని
రాజభయంబుఁ జో ♦ రభయంబుఁ బాపభ, యంబును భూతభ ♦ యంబు లోను

ఆ. గాఁగఁ గలుగు భయని ♦ కాయంబు గంగాప్ర, శంసనమునఁ బాయు ♦ శంభుఁ డర్థి
నతులపుణ్య యైన యద్దేవి దివినుండి, రా ధరింపఁడే శి ♦ రస్థలమున. 1003

గీ. మూఁడుపథములఁజని లోక ♦ ములకు మూఁటి, కుజ్జ్వలాలంకృతియుఁ బెంపు ♦ నొసఁగునట్టి
యమలతరమూర్తి యగు దేవి ♦ నాశ్రయించు, వాఁడు కృతకృత్యుఁ డిది నిక్క ♦ వము కృతాత్మ

క. జనులకు నింద్రుఁడు గ్రహముల, కినుఁడును బితరులకు సోమ ♦ ధీశుఁడు పోలెన్
మనుజోత్తమ కడు నెక్కుఁడు, వినుము నదుల కెల్ల జాహ్న ♦ వి మహత్త్వమునన్.

ఆ. సగరనృపతి పుత్త్ర ♦ చయము మునీంద్రశా, పమున భస్మ మై య ♦ పారదురిత
కల్మషంబుఁ బొందఁ ♦ గా గంగ నిజజల, సేక మొసఁగి యనిచె ♦ నాకమునకు 1005

గీ. దేవతలఁ జిత్రతపమునఁ ♦ దెలచి గంగఁ, బ్రచురపౌరుషుఁ డగుభగీ ♦ రథుఁడు దనదు
పూర్వులైన సగరనృప ♦ పుత్త్రులకు ను, దాత్తగతికయి తెచ్చె ని ♦ ద్ధరణి కనఘ. 1006

ఆ. విష్ణుపదమువలన ♦ విధునివలన సూర్యు, వలన మేరురూప ♦ కలితుఁ డైన
విష్ణువలనఁ ద్రిపుర ♦ విజయమౌళి వలన, నుండి హిమనగమున ♦ నొలసె గంగ. 1007

క. విను తత్పరభావంబున, మనంబు నిశ్చలత నొంద ♦ మనుజుఁడు శరణం
బని యాశ్రయింప జాహ్నవి, సనాతనపదోపలబ్ధి ♦ సంపద నొసఁగున్. 1008

క. ఏ నెఱిఁగినంత చెప్పితిఁ, గాని యనంతమహిమంబు ♦ గంగాగుణసం
తానంబు శతానందము, ఖానిమిషప్రవరకార్త్య ♦ మనఘ చరిత్రా. 1009

క. మేరుపరమాణులును వారిధి, వారికణంబులును నెన్న ♦ వడు వగు గంగా
స్ఫారగుణంబులు దగుసం, ఖ్యారూఢంబులుగఁ జేత ♦ యాతులవివేకా. 1010

ఆ. వేడ్క నీకు నేను ♦ వివరించినట్టి యీ, జాహ్నవీగుణములు ♦ సంతతంబు
మనసు వాక్కుఁ దనువు ♦ ననఁ గలసాధన, ముల భజింపు భక్తి ♦ పూర్వకముగ. 1011

గీ. అట్టు లైన గంగాప్రసా ♦ దాతిశయము, వలన సిద్ధుండ వై త్రిభు ♦ వనములందు
సర్వవిషయసంక్రీడన ♦ మవిహతముగ, సంచరించుమాహాత్మ్యంబు ♦ సంభవించు.

క. నిజధర్మనిరతుఁ డై తను, భజించు సజ్జనునిచిత్త ♦ పద్మముఁ గృపఁ దా
భజియించి గంగ యతనిఁ, బ్రజనితచిరసౌఖ్యుఁ జేయుఁ ♦ బావనచరితా. 1013

క. అని చెప్పి శాంతనవుఁ డిట్లను గంగాస్తోత్రసహిత♦మై పరగినయ
ద్వినుతేతిహాసముఁ బఠించిన వినినను బూజలు వాయుఁ♦ జెంద నఘంబుల్. 1014

భారతము, అను. ఆ 2 పద్య 102-128.

క. ఒకమాటు గంగ నాడిన, యకుటిలమతి బ్రహ్మయంత♦యైనను బుణ్యా
త్మకుఁడై కాలునిపట్టణ, మొకమాటును జూడఁ గోఁడు♦ నురుతరముక్తిన్. 1015

సీ. వ్రతదానజపములు♦ క్రతువులు పావన, ధర్మంబులును బుణ్య♦కర్మములును
గంగాజలాభిషే♦కమునకు సరిగావు, గంగ కేతీర్థము♦ల్గావు సాటి
పావనహరిపద♦ప్రభవమై హరుమౌళిఁ, గర మొప్పుచున్న గఁ♦గాజలంబు
నందుఁ గృతస్నానుఁ♦ డగుపుణ్యపురుషుండు, పాతకసంఘంబుఁ♦బాయు టరుదె

ఆ. నరుఁడు నూఱుయోజ♦నములనుండియు వేడ్క, గంగగంగయనుచుఁ♦గరముభక్తిఁ
దలఁచెనేని దురిత♦తతిఁ బాసి విష్ణులో♦కమును బొందు నరక♦గామి గాక. 1016

పద్మపురాణము, ఆ 2, 4 ప 100, 101.

ఉ. మేలుగ మానవుండు తల♦మీఁద నొకించుకయైన జాహ్నవీ
వాలుకఁ జల్లుకొన్న నని♦వారితభక్తిని గంగమట్టిచే
ఫాలమునందు బొట్టిడినఁ బాతకముల్ దొలఁగున్ భయంకర
వ్యాళతతుల్ విహంగమకు♦లాధిపుఁ జూచి తొలంగు కైవడిన్. 1017

సీ. గంగాతరంగ శీ♦కరసుసంగతపవ,మానంబు లెవ్వాని♦ మేనిసోఁకు
నతఁడు భంగించు దు♦ర్గతిజాతయాతనా,హేతుభూతములైనఁ♦ బాతకముల
గంగానదీవిలో♦కనమాత్రవాఙ్మనః, కాయసంభవమైన♦ కలుష మణఁగు
వినినవేడుక జేసి♦నను గనుఁగొనినఁ జేనంటిన మునిఁగిన♦ ననఘచరిత

గీ. తల్లివంకనుగల యేడు♦తరములందుఁ, దండ్రివంకనుగల యేడు♦తరములందుఁ
గలుగు పితరుల నెల్ల స♦ద్గతికిఁ బుచ్చు, సకలసంయమిజనమాన్య♦ జహ్నుకన్య.

చ. అనఘచరిత్ర చూడఁగ స♦మగ్రత గల్గియు జాహ్నవీనదిం
దనుఁగొన కున్నవాఁడు పశు♦కల్పుఁడు సందియ మేమి పంకజా
సనుఁడు పురాంతకుండు బల♦శాసనుఁడున్ మొదలైనదేవతల్
గొనకొని జాహ్నవిం గొలువఁ♦గోరుదు రాత్మ♦శుభాభిలాషులై. 1019

సీ. సకలదేవతలలో♦ సంక్రందనుఁడువోలె, గ్రహములలో దివా♦కరుఁడు వోలె
నచలసంఘములలో♦ నఘటకాద్రియు వోలెఁ, దరువులలోఁ గల్ప♦తరువు వోలె
నుడుమండలంబున♦ నోషధీశుఁడు వోలెఁ, గరులలో నింద్రుని♦ గజము వోలె
నాశ్రమంబులలో గృ♦హస్థాశ్రమము వోలె, మణులలోఁ గౌస్తుభ♦మణియు వోలె

గీ. వాహములలోన నుచ్చైశ్శ్రవంబు వోలె, నగరములలోనఁ గాశికా♦నగరి వోలె
భువనమునఁ గల్గు నదులలో ♦ భూరిమహిమ, గంగ యొక్కఁడు వేదోక్తకర్మనిరత.
క. ఒకయెడ గంగాజలకణ, మొకయెడఁ జాంద్రాయణంబు ♦ లొగినూఱును బొం
దికగాఁ దులనిడి చూచినఁ, బ్రకటితముగ గంగజలము ♦ బరువై హెచ్చెన్. 1021
ఆ. ఒక్కఁ డోర్చి చేసె ♦ నుగ్రతపంబు వే, ఱొక్కనరుఁడు గంగ ♦ నోలలాడె
నాతపస్వి చేరె ♦ నమరేంద్రుపురము గం, గాభిషేకకర్త ♦ యమృత మొందె 1022
సీ. అనవరతాధ్యాప♦కుని కన్న నెక్కుడు, జాహ్నవీస్మరణంబు ♦ సలుపువాఁడు
భాగీరథీతీర♦భాగంబున వసించు, దోమఁ బోలదు సురేం♦ద్రుని గజంబు
గంగచెంగట నొక్కఁ♦ గవ్వ విప్రుని కియ్య, నది మేరుగిరితుల్య♦మై ఫలించు
గీ. కోటిజన్మార్జితానంత♦కోటిదురిత, కూటకుధరవిపాటనా♦కుంఠకులిశ
ధారయగు జాహ్నవీదేవి ♦ భూరిమహిమ, నలువకైనను వచియింప ♦ నలవిగాదుగనె.
జాహ్నవీమాహాత్మ్యము, ఆ 1 ప 23, 53
సీ. తొల్లి కశ్యపుఁ డిందు ♦ ధూర్జటిఁ గూర్చి త, పంబు చేసి యభీష్ట♦ఫలముఁ గాంచె
నిందు మార్కండేయుఁ♦ డిందుశేఖరుఁ గూర్చి, కాలమృత్యుభయంబుఁ♦ గడచి నిలిచెఁ
బరశురాముఁడు దోష♦పరతఁ జేసిన రాజ, హననము దోషముఁ♦ బాపుకొనియె
నలుఁ డిందు నొకనెల ♦ నిలిచి తేజస్వియై, కలి గెల్చి ♦ సామ్రాజ్య♦కలితుఁ డయ్యె
గీ. నృగమహీపతి యిచ్చోటి♦నీట మునిఁగి, విప్రశాపోత్థకీటత్వ♦వికృతిఁ బాసె
నిమ్మహానదిమాహాత్మ్య ♦ మెన్నఁ దరమె, ధాతకైనను మఱి వాని♦తాతకైన. 1024
జాహ్నవీమాహాత్మ్యము, ఆ 4 ప 158.

## గిరులు

క. వినుము మహేంద్రము మలయ, మ్మను సహ్యము ముక్తిమంత♦మును ఋక్షనగ
మ్మను వింధ్య పారియాత్రం, బును ననఁగా నేడు మిగులఁ♦బొలుచుఁ గులగిరుల్.
మార్కండేయపురాణము, ఆ 4 ప 173.
సీ. మందరశైలంబు ♦ మైనాకకుధరంబు, పాండురాచలము శ్రీ♦పర్వతంబు
గోమంతము చకోర♦కూటంబు సురసంబు, వైద్యుతాహార్యంబు ♦ వాతభవము
రైవతకంబు శా♦రదము జయంతంబు, కృష్ణమహేంద్రంబు ♦ ఋష్యకంబు
కోలాహలము చిత్ర♦కూటము నైకృత, స్థలము మంగప్రస్థ ♦ ధరణిభరము
ననఁగ నివియుఁ బ్రసిద్ధంబులైన గిరులు, మఱియు నుపపర్వతంబులు ♦ దనరుచుఁ గలవు
వీని యవకాశములయందె ♦ వెలయు నార్య, జనపద మ్లేచ్ఛజనపద♦సంచయములు.

# హిమగిరి

సీ. హేమాద్రివిస్తార♦మెంత సప్తాశ్వుండు, నిచ్చలు నోరెల♦వచ్చు నట్టె
తారాచలముప్రేకఁ♦దనమెంత వింశతి, బాహునిచే నెత్త♦వడియె నట్టె
పెరిఁగిన వింధ్యాద్రి♦పెంపెంత కలశజుం, డెడగాలమెట్టిన ♦ నడఁగె నట్టె
నెగడు మంథరగిరి ♦ నిలుపెంత కఱభోగి,చీర్చినఁ జిఱ్ఱునఁ ♦ దిరిగె నట్టె
గీ. యనఁగ విస్తారమునఁ బ్రేకఁ ♦ దనమునందుఁ, బెంపువందును నిలుపున♦బెఱనగముల
నుఱక తనలోన నవ్వుచు♦నున్నకరణి, వెలుఁగు శీతాద్రి ప్రాలేయ ♦ విపులరుచుల.
కుమారసంభవము, ఆ 3 వ 248.

సీ. ధారుణీగపికి ర♦త్నమయాసనంబులు, చేఁపు పుట్టించిన ♦ క్రేఁపుఁగుఱ్ఱ
కఱకంఠునకుఁ గాళ్లు♦నడిగి గౌరీకన్య,దారవోసిన మహా♦దానపరుఁడు
మౌనికోటికినెల్ల ♦ మన్నింపఁదగిన మే,నామానినికిఁ బ్రాణ♦నాయకుండు
తనకూఁతుసవతి మం♦దాకినీనదికి నా,ధారమై నిలిచిన ♦ తగవులాఁడు
గీ. సురధరిత్రీధరమునకు♦జోడుకోడె, వననిధిసఖమైన మైనాక♦మునకుఁ దండ్రి
కాంత కన్నులపండువు♦గాఁగఁ జూడు,మంచు నమ్మించుకొండ వ♦ర్ణించి మఱియు
క. ఈమహిమాచలవరుఁడు గు,హాముఖసంచారి మారు♦తారావములన్
దామించు నెపుడు ప్రాణా,యామంబును జేయుచున్న ♦ హఠయోగివలెన్. 1027
వరాహపురాణము, నం॥ను ఆ 10 ప 48, 49.

సీ. నిడుదపెన్నెఱిగుంపు ♦ జడగట్టి సగరు ము,న్మనుమఁడు తపముఁ గై♦కొనినచోటు
జరఠకచ్ఛపకులే♦శ్వరువెన్ను గానరా, జగతికి మిన్నేఱు ♦ దిగినచోటు
పుచ్ఛడీకతనంబు ♦ పోఁ బెట్టి గిరికన్య,పతిఁగోల్వ నాయాస♦పడినచోటు
వలరాచరాచవాఁ ♦ డలికాక్షుకనువెచ్చఁ, గరఁగిన యల కని♦కరపుఁజోటు
గీ. తపసియిల్లాండ్రచెలువంబుఁదలఁచితలఁచి, మున్ను ముచ్చిచ్చునవిరాళిఁగొన్నచోటు
కనుపపులువేల్పుఁబడవాలుఁగన్నచోటు,హర్షమునఁజూచి ప్రవరాఖ్యుఁడాత్మలోన.
సీ. పసుపునిగ్గులు దేఱు ♦ పాపజన్నిద మొప్పఁ, బ్రమథాధిపతియింటి♦పట్టెఱింగ.
శచి కేఁత గఱపుచు ♦ జదలేటి సురరాజు, జలకేళి సవరించు ♦ చెలు వెఱింగ
నదనుతోఁ జేపి చ♦న్నవిసి యోషధుల మన్,మొదవుకొండలకెల్లఁ♦బిదుక నెఱిఁగ
వేల్పుటింతులలోన ♦ విఱ్ఱవీఁగుచు మేన, నవరత్నరచనల ♦ రవణ మెఱిఁగ
గీ. బరిపరివిధంపుజన్నంపుఁ ♦ బరికరంపు, సొంపుసంపదనిఖిల ని♦లింపసభయు
నప్పటప్పటికిని జిహ్వా♦త్రుప్తు డుల్ల, నా మెత లెఱింగ నీతుపా♦రాద్రికతన. 1029
మనుచరిత్రము, ఆ 2 ప 9, 11.

సీ. పదియాఱువన్నె గు♦బ్బలిరాచకూఁతురు, పట్టంపురాణిగాఁ ♦ బరఁగుజాణ
పతి సర్ధదేహంబు ♦ సతియంట నిజముగాఁ, బ్రబలుకన్నియఁ గన్న ♦ భాగ్యశాలి
ముజ్జగమ్ముఁ బవిత్ర♦ముగఁ జేయుతీర్థమ్ముఁ గొనసాగఁ జేసిన ♦ యనఘమూర్తి
భూమిధరారాతి♦చే మొక్కఁబోవని, యరిదిబిడ్డనిఁ గాంచి♦నట్టిమేటి
గీ. మోహపక్షుల మొలపించిన♦యుత్తముండు, పల్లవనముల కెల్ల దీ♦క్షాగురుండు
సకలమాణిక్యరాశికి ♦ జననసీమ, యానగస్వామి సద్గుణా♦స్థానభూమి. 1030

విజయవిలాసము, ఆ 1 ప 192.

సీ. రమణీయమగువిచి♦త్రమహత్త్వమొక్కటి, వినుమీనగంబున ♦ ననఘచరిత
పల్వలస్థలులెల్లఁ ♦ బరిపక్వములె కాని, లేఁతలై మొనయుట♦ లేదుచూడ
శ్యామలత్వమె కాని ♦ జలజాతవనములు, పాండుత్వమొందు టే♦ప్పాటలేదు
వివిధభూరుహములు ♦ విస్తీర్ణశాఖాప్రతతంబులై యనవర♦తంబుఁ గలయు
గీ. మొనసి నన లెత్తి చిగిరించి♦పూఁచి కాఁచి, ఘనముగాఁ బండియుండుటే♦కానియరయ
బరిణతను జెంది యాపాండు♦భావ మొంది, యాకురాలెడు దినమొక్క♦టైనలేదు.

కిరాతార్జునీయము, ఆ 2 ప 47.

సీ. సురసరిత్పరిసర♦స్ఫురదురస్సరపుర, స్సరదురుత్తరమరు♦త్తరువరంబు
దినదినస్తనితని♦స్వనక సన్మునిమనః, పనితనూతనఘనా♦ఘనఘనంబు
కలభలిట్కలచల♦చ్చలదలస్థలదల, ద్దలమిలజ్ఝలజల♦ఝ్ఝలజలంబు
ప్రవణవజ్జవనవ♦త్పవనవన్నవనవ, శ్రవణవత్స్వపనవి♦ప్లవపదంబు
గీ. గజగవయగండభేరుండ ♦ ఖడ్గచమర, శరభశార్దూలశంబర♦శల్యవృక వ
రాహ సింహ వలీముఖ♦ప్రముఖదుష్ట, సత్త్వముఖరంబుఁ గనియెఁ దు♦షారనగము.

శకుంతలాపరిణయము కృష్ణ. ఆ 2 ప 106.

## మేరుగిరి

చ. కనియె నతండు శంకరశి♦ఖాశశిరంజితచంద్రకాంతసం
జనితజలార్ద్రకల్పతరు♦జాలముఁ గిన్నరకన్యకాప్రమో
దనమణిశృంగసంగతల♦తావనజాలము దివ్యవాహినీ
వనజవనీతలద్రోహిణి ♦ వాహమరాళము మేరుశైలమున్. 1033
సీ. ఈకొండ మణికాంచ♦నాకారరుచిఁ గాంచెఁ, గొండ లెల్లను దనుఁ♦గొండఁ జేయ
నీకొండఁ గాఁపుండి ♦ యింద్రాదిసురముఖ్యు, లెల్లభాగములకు ♦ నెల్లయైరి
యీకొండ దండగా♦నీరేడు జగములు, సుప్రతిష్ఠితములై ♦ సొంపు మిగిలె
నీకొండ కోదండ♦మైకాలకంఠుఁడు, కసమానజయలక్ష్మి ♦ నావహించె

గీ. నిర్ఝరాపగ యీకొండ • నిర్ఝరంబు, పద్మబాంధవుఁ డీకొండ • పారికాఁపు
కొండయల్లునికొండ యీ • కొండశిఖర,మని సుమేరు ప్రభావంబు • లభినుతించి. 1034

విక్రమార్కచరిత్రము, ఆ 2 ప 13, 15.

## మందరగిరి

సీ. కిన్నరకిన్నరీ • క్రీడావినోదాబ్ధి, రామానుమోదవి • శ్రామసీమ
హరిణీహరిణసోత • కానీకనిభువన,వ్యాపారలీలాని • వాసభూమి
మర్కటీమర్కటో • న్మాదఖేలనకలా,కర్షణాకంపశా • ఖాకులంబు
కలభికాకలభఘీం • కారప్రతిధ్వని,స్ఫురితగంభీరగ • హ్వరసమృద్ధి
గీ. సిద్ధగంధర్వఖేచర • స్త్రీనఖాగ్రి,ముఖరితాతోద్యవాద్యసం • భూతగాఢ
పులకితాశేషతరులతా • విలసితంబు, సానుబిభ్రాజమంధాన • శైలభూమి. 1035

రుక్మాంగదచరిత్రము, ఆ 2 ప 131.

శా. కాంచెన్మందరశైలమున్ మృదుతటీ • గండోపలశ్రేణికా
చంచన్నిర్ఝరవేణికాఘుమఘుమ • స్ఫాయద్దిశాగోళమున్
బంచాస్యస్ఫుటకంఠకాళనినద • ప్రధ్వస్తశుండాలమున్
సంచారాలసకిన్నరీశతలతా • సంఛన్నహింతాలమున్. 1036

హరవిలాసము, ఆ 6 ప 42.

## వింధ్యగిరి

గీ. పద్మరాగసభోమణి • ప్రభలు మెఱయఁ, జంద్రకాంతచంద్రద్యుతి • జాల మెసఁగ
బహులతరవజ్రసత్కుత్ర • పంక్తి వెలుఁగ, నంబరస్పర్ధియైవిం • ధ్యంబుఁ గనిరి. 1087

మార్కండేయపురాణము, ఆ ప 141.

చ. సకలధరాధురంధరభు • జాభుజగేంద్రుఁ డతండు గాంచె హా
టకతటకూటకోటినిక • టప్రకటభ్రమరాంబుభృద్వితా
నకశకలప్రకాండమహ • నాగమహద్విపయూథనిగ్రహో
త్సుకజవనోత్పతద్ధరికి • శోరవిశాలము వింధ్యశైలమున్. 1038
సీ. కరిణీకరోత్కీర్ణ • ఝరిణీకసిక్తాభ్ర,చరిణీకుచోపరి • చ్ఛన్నశాటి
జలజాతరాగాఢ్య • పలజాతమయదరీ,స్థలజాతతప్రభా • సాంద్రమూర్తి
నటవాధిగతశిఖి • స్ఫుటనాదహృదయసం,ఘటనార్తతాబిలం • గతభుజంగి
శిఖరాంతరక్రయా • యక్షరాట్సాన్నిధ్య,సుఖరచితబ్జిగీ • స్ఫురితసరసి

గీ. కిసలయఫలలసదసమ♦కుసుమవిసర, సరసతరతరువిహారణ♦పరపరభృత
నికరమధుకరకలరవ♦శుకకులముఖ, విహగముఖరవముఖరి య♦వ్వింధ్యశిఖరి. 1039

కవిరాజమనోరంజనము, ఆ 5.

# వేంకటాచలము

సీ. హరునిబాణంబున♦కాధారమగుకొండ, చెలిమితోఁ గోర్కెలీ♦డేర్చుకొండ
నాపదద్రిముక్కుల♦కాధారమగుకొండ, భక్తులపాపముల్♦వాపుకొండ
వారిఁ జతుర్యుగములఁ♦బూజఁగాంచినకొండ, ప్రేమఁబుణ్యంబుఁగ♦ల్పించుకొండ
చెల్లనికాసు లా♦ర్జించుతక్కరికొండ, సారిది మోక్షపదంబుఁ♦జూపుకొండ
గీ. యవనిజనులకు మంచివాఁ♦డైనకొండ, యంబుజాక్షుని కాటప♦ట్టైనకొండ
రమణఁ బాపాత్ములకు నెక్క♦రానికొండ, మించుతిరుమలకొండవ♦ర్ణించఁదరమె

చ. వరములకొండ భక్తిఁగను♦వారికి మోక్ష మొసంగుకొండ సు
స్థిరవిభవోన్నతుల్ ప్రబలఁ♦జేయునిజంబుతలంచుకొండ వే
గిరఫల మిచ్చుకొండ సిరి♦కిన్ హరికి న్నెలవైనకొండ యీ
తిరుమలకొండ యెన్నఁదగ♦దే ధరలోపల మిందువేశసా. 1041

విశ్వకర్మపురాణము, ఆ 1 పే 31.

సీ. సకలకళాపూర్ణ♦చక్రిమ్మనకు ధాత్రి, భువనత్రయాబ్జకుఁ♦బుట్టినిల్లు
భాసురనిగమాళి♦పాళికి దొరసాని, పరమసౌభాగ్యంబు♦పట్టుఁగొమ్మ
నిఖిలప్రపంచస♦న్నిధికి నిదానంబు, మానసంపదలకు♦మందసంబు
పావనక్షేత్రిక♦ల్పకలతావాలంబు, మహిమాతిశయముల♦మనువుఁ దల్లి
గీ. మహితగుణవిశ్వకర్మని♦ర్మాణధర్మ, మాత్రకౌశలమునకు దో♦ల్బా లనంగ
వరధరణియందుసకలదై♦వతవితాన, ఘట్టణము వేంకటాచల♦పట్టణంబు. 1042

వేంకటేశ్వరవిలాసము, ఆ 1 ప 1.

సీ. ఆశైల మొకతఱి♦ నుత్సృత్తాంఘులకు నెల్ల, శ్రీనివాసాకృతిఁ♦గానఁ బడియె
నందుచే శ్రీనివా♦సాద్రి యనఁ దగె, వైకుంఠవాసుల♦వ్వసుమతీధ్ర
మానందపర్వత♦మంద్రము విష్ణుక్రీడ, ప్రబలుచుండె నట శ్రీ♦ప్రదమునఁగుట
శ్రీనివాసంబను♦స్థిరశబ్దయుతమౌట, శ్రీనివాసాద్రినాఁ♦జెలఁగుచుండె
గీ. బహుళనామంబు లగ్గిరి♦వడసెఁ గల్పభేదముల విష్ణుకల్యాణ♦పృథుగుణంబు
లెన్నఁగల వన్ని దానియం♦దున్నకతనఁ, బరమశోభనదంబయి♦గిరి వెలింగె. 1043

వేంకటాచలమాహాత్మ్యము, పే 45 ప 7.

సీ. కనకమయమ్ములై ♦ గగనంబు నఖరంబు, లను జెంది వనములం ♦ దనరు వాని
సకలమృగస్తోమ ♦ సదనమై నిర్జిత, మదనమై కీర్తిఁ బెం ♦ పొదవు వాని
సాష్టోత్తరశతస ♦ హస్రసభాసురతీర్థ, భరితమై నిరతముఁ ♦ బ్రబలువానిఁ
బంచయోజనములఁ ♦ బరపయి శతయోజ, నాయతంబౌ మఁ జె ♦ న్నలరువాని
గీ. భుక్తిముక్తిప్రదంబును ♦ భూరిపాపహరము ఫణిరాజరూపంబు ♦ నఖిలతీర్థ
పావనస్వామిపుష్కరి ♦ ణీవిరాజమానమై వేంకటాఖ్యను ♦ బూనువాని. 1044

భార్గవపురాణము, ఆ 2.

## సింహాచలము

సీ. ఈవరగిరి హిమ ♦ గ్రావసంఘాతసం, గతి తుషారాచల ♦ గణన నేల
ఈరసాధరమౌళి ♦ సారకాంచననగ, తతి యుక్తి మేరువుఁ ♦ దలఁప నేల
ఈభూభృదుత్తంస ♦ మితచందనాలయ, సంతతి మలయ మెం ♦ చంగ నేల
ఈరమ్యశిఖరి వి ♦ స్ఫారలోకాలోక, చయహారి నలమాద్రి ♦ సంగ మేల
గీ. సమచుఁ గొండలనంగ నిం ♦ తనఁగ నేల, శర్వజీమూతమండల ♦ సదన మయ్యె
నందు లోకకొండ కొండేని ♦ యట్టిసింహ, శైల మల్లదె కనుఁగొంటె ♦ సారసాక్షి.

సర్వకామదాపరిణయము, ఆ 2.

సీ. పరిపంథిదర్పభూ ♦ ధరగరుత్పటలోగ్రి, హారిశతారంబు సిం ♦ హాచలంబు
వితతపాషండ దు ♦ ర్మతమహారణ్య దా, వాగ్నికీలంబు సిం ♦ హాచలంబు
ఘనజగత్త్రయఘోర ♦ కలుష నీహారమా, ర్తాండప్రభంబు సిం ♦ హాచలంబు
కాంచనకశిపుర ♦ క్షః క్రూరభుజగవి, హంగేశ్వరంబు సిం ♦ హాచలంబు
గీ. దాసకల్పంబు నిర్వాణ ♦ దాయకంబు, నద్రిరాజంబు భవ్య ది ♦ వ్యస్థలంబు
పరమకళ్యాణధామంబు ♦ పంకజాల, యాదివాసంబు చారుసిం ♦ హాచలంబు. 1046

మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 10.

## వీరభద్రాచలము

సీ. అంతఃప్రవాహయై ♦ యావిర్భవించె నే, ధరణీధరము పొంతఁ ♦ దల్లిబావి
పాతాళ నేశైలంబు ♦ పాదమూలంబునఁ, గల్లేటితో వృద్ధ ♦ గంగవారి
యుదయించె నేకొండ ♦ యుత్తరాశా రస్థాతలకుక్షి సప్తగో ♦ దావరంబు
జనియించె నేశిలో ♦ చ్చయము దక్షిణమునఁ, గన్యావాహిని యుష్ణ ♦ నదలికొమ్మ

గీ. పద్మగిరితో డంబున్న సే♦పర్వతంబు, బలసియుండు నేయద్రికిఁ♦బంచలింగి
యట్టి వీరభద్రాఖ్యప♦హాచలమున, కనుగుదెంచెను వింధ్యము♦ దాపహారి. 1047
కాశీఖండము, ఆ 3 ప 28.

## ఘటికాచలము

సీ. సంచితాద్యఘసమి♦త్సమితికిఁ గార్చిచ్చు, హరివైభవస్వర్ణ♦ మొరయ వచ్చు
సకలసత్యపురాణ♦సారాంశముల హెచ్చు, కైవల్యరమఁ బ్రీతి ♦ కలువవచ్చు
కృష్ణస్థలములల ♦ వెలవెచ్చు బలుబచ్చు, శ్రీలతాంగి వసించు ♦ మేలుమచ్చు
సాధుసమాగమ♦జ్ఞానవిద్యకు నచ్చు, వివిధజనార్థముల్ ♦ వెరజుముచ్చు
గీ. సనకసనకాదిసురవర♦శయము మెచ్చు, విపులతరనవవిధభక్తి ♦ వెదుకవచ్చు
పుణ్యసౌగవితానంబు ♦ పూలకుచ్చు, వినుము దానిమహత్త్వ మెం♦తనఁగవచ్చు.
ఘటికాచలమాహాత్మ్యము, ప 77 ఆ 1.

## శ్రీశైలము

ఉ. సిరితనో వైభవుఁడు ♦ సిద్ధుఁడు వేడుకమించఁ గాంచె శ్రీ
శైలము నీలలోహితల ♦ సన్మణిచిత్రిత సానువైభవో
త్తాలము సేవకేష్టఫల♦ దానవిధాన నవీనదేవతా
సాలము నిత్యవర్ణగుణ♦జాలము ముక్తిలతాలవాలమున్. 1049
కళాపూర్ణోదయము, ఆ 5 పద్య 177.
మ. పుసపాగ్రంబులు సాదముల్ శుభము త♦త్పుచ్ఛంబు తచ్ఛృంగముల్
గిరిశృంగంబులు గోపురాజి తరువుల్ ♦ క్రేవుల్ దిదృక్షాపరుల్
వరపుణ్యాంబులు దుగ్ధధారలు చతు♦ర్ద్వారస్థలింగంబు లు
ద్ధురవక్షోజము లీనగంబు నతులాం♦దున్ కామధేనుక్రియన్. 1050
సీ. గోకర్ణగోకర్ణ♦గోకర్ణసేవ్యంబు, కౌశికకౌశిక ♦ కౌశికంబు
శ్రీధరశ్రీధర ♦ శ్రీధరావాసంబు, కామదకామద ♦ కామదంబు
నిర్వాణనిర్వాణ ♦ నిర్వాణనివహంబు, భైరవభైరవ ♦ భైరవంబు
గంధర్వగంధర్వ ♦ గంధర్వజయశాలి, శైలాదిశైలాది ♦ శైలయుతము
గీ. మంజుశ్రీశైవాక్యవి♦ద్యానవద్య, సకలసంజీవనీయ ♦ సంస్తంభకుంభ
కాయపరకాయభోగని♦కాయశుద్ధి, ఫలదమహిమోన్నతంబు శ్రీ♦పర్వతంబు. 1051
పర్వతపురాణము, ఆ 2-4.

## అహోబలశైలము

ఉ. ఫుల్లసరోజగంధపరి♦పుష్టమరుచ్ఛిశులోల షట్పద
స్తల్లజగాననాదవివ♦శక్రిమసర్వశరీరిజాలమా
పల్లవహీనమౌనిజన♦పాల ముదగ్రశిలాటుగుచ్ఛరే
ఖోల్లసదేలమై పెదయ♦హోబలశైలముమించు నెన్నికన్. 1052

నృసింహవిలాసము, ఆ 1.

సీ. గురుతరప్రాకార♦గోపురప్రాసాద,మణిరాగచుంబితా♦పత్త్రపదవి
విధుకాంతసోపాన♦వీథీలసత్పంక,జవ్రాతసురభికా♦సారపటలి
యక్షీణసౌభాగ్య♦లక్షణాంచన్మత్త,కాశినీపురుషశృం♦గారపేటి
వారాశితులితగం♦భీరపాథస్స్ఫుర, పరిఘాసమావృత♦ప్రాంతభూమి
గీ. హరిమదనాగతురగవి♦హారసీమ, యగుచుఁ దత్ప్రిధానాచలా♦హ్వయమె పూని
పరగు వన్యాపలాశరు♦ట్ప్రిబలచాయ, పుష్పవల్లి యహోబిల♦పురమతల్లి. 1053

నృసింహవిలాసము, ఆ 1.

## రైవతకాచలము

సీ. చమరీనికరవాల♦సమరీతి రతిఖేల, దమరీగళితవాల♦సమితిలీల
మతికాంత మణికూట♦తతికాంతి కృతఖేట, గతికాంతరుచిరఘోట♦గగనవాట
మబరీణఘనభవ్య♦శబరీఘటితనవ్య,కబరీభరితదివ్య♦కాల్యభావ్య
మసమానసురగాన♦రసమాన సుసమాన, లసమాన తరుసూన♦రసదలీన
గీ. మలఘుతరశీతకరశిలా♦ఫలకఫలిత, కలితపరిసరశశికరా♦వళితలలిత
తతబిసాశయనానత♦త్త్రటతటాక,జాలజాలపరాళి యీ♦శైలమౌళి. 1054

ముకుందవిలాసము, ఆ 1 ప 259.

సీ. అభ్రాపగాహాట♦కాబ్జపరాగసం,ఛాదితాఖిలరత్న♦సానుతలము
కిన్నరకన్యకా♦గీతరావామోద, కటకచరద్దివౌ♦కశ్చయంబు
మండితోన్మత్తవే♦దండతుండోద్గీర్ణ,శీకరధారాభి♦షిక్తభూమి
హర్యక్షమృగయావి♦హారలంపట కిరా,తాహృతఘోరగు♦హాంతరంబు
గీ. ఘనమునీంద్రోత్తమాశ్రిమ♦వన రసాల,సాలకిసలయ ఫలరసా♦లోలబాల
శారికాకీరకోకిల♦చక్రవాల, హరినిసదంబు రైవత♦కాచలంబు 1055

రుక్మిణీపరిణయము, కూ తి. ఆ 4 ప 20.

## కోరుకొండ

సీ. చిటిపొటికొంపలు ◆ చిన్నవి పెద్దవి, యిండ్లుమిద్దెలు దారి◆కిరుగెలంకుల
నారుపోసినయట్లు ◆ నారక యెన్నేని, పూర్వాచరణముల◆పోల్కిఁ దనర
మతికొన్ని సుస్పృహా◆స్మయములు నూత్నాచార,ములయట్లు వైపయి◆మురువుసూప
జైత్యద్రుమంబులే ◆ సత్రంబులుగ వార,మునకొక సంతయే ◆ యొనరవిపణి
గీ. గాసధిత్యకస్పృహాని◆ కాయమె ఘన, రాజమందిరముగఁ గడుఁ◆రాజిలంగ
జాఁపదజనసహాజమే ◆ యైపఁజొర, కోవిదావాసమునగుఁ గో◆రుకొండపురము.

సీ. కోరుకొండ వలఁగొన్నఁ ◆ గోరుకొండ నెక్కిన, ముజ్జగములనజ్జి◆మోపవచ్చు
భవనాశినీసరో◆వరమున నాడినఁ, గ్రిఁగాలవారికిఁ గ◆ల్గింపవచ్చు
సద్వైష్ణవౌఘంబు◆సాంగత్యముం గల్గ, ధరరథాంగంబులం ◆ దాల్పవచ్చు
భగవత్ప్రసాదంబు ◆ భక్షించినం జాలు, విబుధుల కమృతమ◆ర్పింపవచ్చు
గీ. హరికి నిర్మాల్యమైయుండిన ◆ నందవచ్చు, వైజయంతినిఁ గొన్నను◆బడయవచ్చు
గౌస్తుభముఁ దక్కినిడిన వ◆క్షమునలక్ష్మిఁ,బూనవచ్చును ద్విజు నెక్కి◆పోవవచ్చు.

కుమారనృసింహము, అ 4.

## పెనుగొండ

సీ. ఏపురంబునయందు ◆ నెలమిమూలస్థాన, మల్లికార్జునుఁడు శ్రీ◆మండనుండు
ఏపట్టణంబున ◆ గోపికాపతి దైత్య,మర్దనుండైన జ◆నార్దనుండు
పరిసహించుభూస్థలిఁ ◆ బ్రాగ్భాగమునబెట్టు, కడలిరాయనికొమ్మ ◆ గౌతమమ్మ
ఏవీటఁ జెలువొందు ◆ నేప్రొద్దుఁ గరుణతో, విశ్వనాథుని దేవి ◆ వింధ్యవాసి
గీ. విప్రబాహుజవిట్పాద ◆ విమలహర్మ్య,కూటసంస్థాపితస్వర్ణ◆కుంభదీప్త
జాలభాసితబ్రహ్మాండ◆గోళకంబు, ధరణిస్వర్గంబు పెనుగొండ◆పురవరంబు 1058
సీ. పరివహించు నేవీటి ◆ బ్రాగ్భాగమున మించి, శ్రీమత్తరంగ వా◆సిష్టగంగ
దర్పించు నేవీటి ◆ దక్షిణంబున దుగ్ధ,కాసారపురమేలు ◆ ఘనుఁడు శివుఁడు
పాలించు నేవీటఁ ◆ బశ్చిమంబునను గౌరీశ్వరుండైన రా◆మేశ్వరుండు
రాజించు నేవీటి ◆ నుత్తరంబుననుండి, యంబుజాక్షుండు జ◆నార్దనుండు
గీ. అట్టిపురవరమఖిలవి◆ద్యాధురీణ, వైశ్యవంశపరాక్రమ◆వర్ణనీయ
సముదితాశుగసంపూర్ణ◆శాసనాఢ్రి, కీర్తనీయంబు యమ్మహా◆గిరివరంబు. 1059

వైశ్యపురాణము, ఆ 1.

## హేమకూటము

ఉ. లోలతఁ గాంచె నాసుగుణ♦లోలుఁడు చారుశిలాగళజ్ఝరీ
జాలతటీప్రవాళఘన♦సత్తరువాటముఁ బార్శ్వతుంగభ
ద్రాలహరీవినోదవిర♦హజ్జలశీకరనిర్గతశ్రమో
ద్వేలహరప్రణామమతి♦దీపితకూటము హేమకూటమున్. 1060

విక్రమార్క-చరిత్ర, ఆ 2 ప 218.

చ. అలపతి గాంచెఁ జెంత ఘన♦హైమగుహాగృహవాసికిన్నరీ
కులమణివల్లకీసమను♦కూలమనోహరగీత్యుపాంసదు
జ్జ్వలసురసాలజాలసుమ♦వల్లరికావిచరన్మిళిందని
ర్మలరవభగ్నపాంథజన♦మానకవాటము హేమకూటమున్. 1061

చంద్రికాపరిణయము, ఆ 1 ప 167.

## చిత్రకూటము

చ. అటఁ జని కాంచి రంత వసు♦ధాధిపు లారతిలోలకిన్నరీ
ఘటితగుహాకుటీకనక♦కమ్రకవాటము సన్మణిప్రభా
హాటదురుశృంగజూటము స♦మావృతమాల్యవతీతరంగిణీ
తటతరువాటమున్ బహుళ♦తాపసకూటముఁ జిత్రకూటమున్. 1062

సీ. మహనీయతరసామ♦మంత్రస్వరంబులు, గంధర్వమంజుల♦గానతతులు
విలసితకిన్నరీ♦వీణారవంబులు, శారికోపన్యాస♦చతురతలును
రాజకీరాలాప♦రచనాకలాపముల్, కలహంసనిస్వన♦కలకలములు
కమనీయకోకిల♦కలనినాదములు రో,లంబఝుంకారకో♦లాహలములు

ఆ. గలుగుదాని వేద♦గంభీరఘోషముల్, గలయఁ జెలఁగుదాని♦గాలి నోలి
మొరయు వేణురంధ్ర♦ములదానిఁ జేరఁగ, నేఁగుదెంచి యన్న♦గేంద్ర మెక్కి.

రామాయణము, అయో. ప 159, 160.

సీ. కల్లోలడోలాస♦ముల్లోలలీలాస,రాళమరాళవా♦చాలఝురము
లుంగ లవంగాను♦షంగిభృంగీజాత, సంగీతభంగీత♦రంగితంబు
వాతపోతోద్ధూత♦వాసనావశలస,న్మల్లికావల్లికా♦వేల్లనంబు
కిన్నరీఖేచరీ♦పన్నగీజనగీత, సుఖదనానాగార♦ముఖరశిఖర

గీ. పదె కనుంగొంటె రాకామృ♦గాంకవదన, మదనవిశిఖాయమానాస♦మానకుసుమ
సముదయాపారసౌరభో♦చ్ఛ్వసితదశదిశాచలంబగు చిత్రకూ♦టాచలంబు 1064

రామాభ్యుదయము, ఆ 5 ప 62.

చ. అటఁ జని కాంచె రాముఁడు ప్రి♦యానుజులంగొని చిత్రకూటము
త్కటమణిచిత్రకూటముని♦గాయకకిన్నరకామినీలస
చ్చటులవిచిత్రకూటము ని♦షాదనిరంతరబద్ధనిరభ్ర
త్రిటతరుచిత్రకూటమును ♦ దర్శనమోచితచిత్రకూటమున్. 1065

నరసభూపాలరాజీయము, అయో. ఆ 2.

## ఋశ్యమూకము

ఉ. రాకొమరుల్ గనుంగొనిరి ♦ రత్నగుహారమమాణదివ్యనా
రీకముఁ బుష్పరేణుకప♦రిష్కృతకుంజలసన్మృగేశ్వరా
నీకము శృంగసంగళిత ♦ నిర్ఝరలోకము భర్మగండక
స్తోకము సానుజాలపరి♦శోభనదీకము ఋశ్యమూకమున్. 1066

పద్మపురాణము, ఆ 8 ప 184.

## నైమిశము

చ. సురుచిరకీర్తి నైమిశముఁ ♦ జూచినమాత్రన పాయుఁ బాప మ
చ్చెరువుగ నందు మాసము వ♦సించి యనంతఫలంబు లొందఁ గాం
తురు బహుతీర్థసేవనము♦తోడ సమానము నైమిశంబు నం
దరుదుగ నొక్కనాఁడు శుచి♦యై యుపవాసము సేయఁ గాంచినన్. 1067

భారతము, అర. ఆ 2 ప 68.

సీ. ఆదిమనోమయం♦బగునొక్కచక్రంబుఁ, గల్పించె బ్రహ్మజ♦గద్ధితముగ
కల్పించి యాబండి♦కలు ద్రొల్చె సత్యలో,కంబుననుండి యా♦కమలగర్భుఁ
డది ద్రొల్లి గిరివిష్ట♦పాంతరంబులు దాఁటి, క్రమముతో భూమిచ♦క్రమున వ్రాలె
వ్రాలి రంహస్స్ఫూర్తి ♦ వచ్చివచ్చి ధరిత్రి, నిమ్నోన్నతులశీర్ణ ♦ నేమియయ్యె
గీ. నేమి విరిసినకతన న♦న్నేల నెలవు, నైమిశంబయ్యె నదియ తా♦నైమిశంబు
దన్మహాపుణ్యవనమున ♦ ద్వాదశాబ్ద, సత్త్రియాగంబుఁ గావించె ♦ శౌనకుండు.

కాశీఖండము, ఆ 1 ప 77.

ఉ. అంచలు తీర్థతోయముల ♦ నాడవు పువ్వులజాడ సేఁగ వ
ఖ్యంచితవృత్తిఁ దేఁటులు ఫ♦లాప్తిఁ జేరవు కీరముల్, చిగు
ళ్లెంచుఁ దలంచ పించుకయు ♦ నాత్మఁ బికంబులు మౌను లీశుఁ బూ
జించినయంతెఁ గాని దృఢ♦శీలత నవ్విపినాంతరంబునన్. 1069

గీ. అందుఁ జెలువొందు గోమతి♦యను స్రవంతి, దాని జలపూరములు గ్రోలి♦ మౌనివరులు
నిర్జరతనొందియుండఁ జిం♦తింతు రమర, లబ్ధిమథనంబు శ్రమమున♦కయ్యె ననుచు.

క. అమృతంబులెపో సరిదుద,కము లిష్టఫలౌఘకల్ప♦కంబులెపో భూ
జములవ్వనమునఁ గలవిభ,వముఁ బొగడఁగ నేరికైన♦ వాగ్గోచరమే. 1071

గీ. అందుఁ గులపతి శౌనకుం♦డనుమహర్షి, మొదలుగాఁ గల తాపస♦ముఖ్యు లధిక
తత్పరత్వంబు వెలయఁగ ♦ ద్వాదశాబ్ద, సత్రయాగంబు సల్పిరి ♦ శాస్త్రవిధిని.
జాహ్నవీమాహాత్మ్యము, ఆ 1 ప 1-7.

సీ. కీరముల్ వేదాంత♦సారంబుఁ దెల్పఁగా, దివిరి యాచించు జ♦క్కవలకవలు
భ్రమరముల్ సాంఖ్యయో♦గము పచరింపఁగా, నిదమిత్థ మనుచు బ♦ర్హివ్రజంబు
శారికల్ తర్కప్ర♦సంగంబు సేయఁగా, భళిభళి యని మెచ్చుఁ ♦ బారువములు
కలకంఠములు సామ♦గానం బొనర్పఁగాఁ, దలలూఁచికొని యాడుఁ ♦ జిలుకచాలు
గీ. బకము లుపనిషదర్థముల్ ♦ పలుకుచుండ, నౌర లెస్సా యనుచు రాజ♦హంసలనిన
వచటి మౌనులవేదశా♦స్త్రాదినిత్య, పాఠకోలాహలములు చె♦ప్పంగ వశమె. 1073
లక్ష్మీనారాయణపరిణయము, ఆ 1.

సీ. మాధవీమదనసం♦పత్పరీతంబయి, శ్రీపతి మందిరా♦కృతి వహించె
కాత్యాయనీరుద్ర♦గణసేవితంబయి, శ్రీకంఠపర్వత♦శ్రీనిమించె
నారాధనారద♦శారదావాప్తమై, చతురాననాలయ♦సరణిఁ గాంచె
నలనీలపనసాది♦కలితమై హితసరి,త్పతి సేతుబంధన♦స్థితి భరించె
గీ. శుకపికాళిమయూరస♦త్ప్రకటితోరు, గానతాండవవేణుని♦స్వానతతుల
నతులమగునాట్యరంగము ♦ ననుకరించెఁ, బ్రథితమునిధామ నైమిశా♦రణ్యసీమ.
లక్షణాపరిణయము, ఆ 1 పే 6.

# అగస్త్యాశ్రమము

గీ. వృక్షశాఖాంచలంబులపై♦ వ్రేలుచున్న, కోటిసంఖ్యలనీర్కావి♦ గోపణములు
విఘ్నమృగములఁ బట్టంగ♦ వేసినట్టి, చీరవలలను సంస్మృతిఁ ♦ జిగురుగొల్పు. 1075

సీ. ఎనుక లోపాముద్ర ♦ పదపద్మముల ముద్ర,సికతిలంబగు నేలఁ ♦ జెలువుమిగుల
శ్యామాకముష్టిపా♦కాన్నంబు మృగములు, ఋషికన్యకలరాక ♦ కెదురుచూడ
దేవార్చనాధూప ♦ దివ్యగంధములచే, హోమధూమము తావి ♦ యుద్దినదయ
వటుజనస్వాధ్యాయ ♦ వర్ణసందోహంబు, శారీశుకంబులు ♦ చర్చసేయఁ
గీ. గాశికాపట్టణమునకుఁ ♦ గ్రోశమాత్ర,గగన గంగాప్రవాహమై ♦ కటికభూమి
బ్రహ్మలోకమునకు నను♦ప్రాసమైన, కలశజుని పర్ణశాల ద♦గ్గఱిరి వారు. 1076

కాశీఖండము, ఆ 2 ప 55, 56.

# దేవదారువనము

సీ. కర్ణికామాణిక్య♦కనకపద్మినులతోఁ, గల్పవల్లీకుడుం♦గములతోడ
విపులచింతారత్న♦వేదికాస్థలులతో, సిద్ధరసాపగా♦శ్రేణితోడ
దివ్యలోకాప్సరః♦స్త్రీకదంబముతోడఁ, గామదుగ్ధేను సం♦ఘములతోడ
దివ్యౌషధీలతా♦దీపమాలికలతో, సకలర్తు సన్నివే♦శంబుతోడ
గీ. మదనవైరికి గారాపు♦మామయైన, మంచుగుబ్బలి కోనసీ♦మాంచలమున
దేవతాముని సేవ్యమై ♦ తేజరిల్లు, ధర్మసంజీవనము దేవ♦దారువనము. 1077

హరవిలాసము, ఆ 5 ప 27.

# బదరీవనము

మ. కనరయ్యా బదరీవనంబు విలస♦త్కహ్లార పాథోరుహాం
కనసచ్ఛ్రీక సరోవనంబు కృతమా♦ర్గవ్యూహనీహారోద్భవా
దినపోల్లాసక జీవనంబు నతిభృ♦ద్దేవావళీసేవనం
బనివార్యాధ్వపథావనంబు గతతృ♦ష్ణార్యావనం బయ్యెడన్. 1078

సర్వకామదాపరిణయము, ఆ 2.

# దండకావనము

సీ. మదలకప్రతిమల్ల♦భల్లసంగరభిల్ల, భిల్లసన్నాహభల్ల ♦ భల్లతమము
పంకజాతవిశాల♦శాలలతాజాల, జాలలాలితసాల♦సాలకులము
ధీరదయానగభీర♦ఘోరరహితదార, దారకపరివార♦వారణంబు
జ్వలితానలపిచణ్డ ♦ చణ్డదారుశిఖిణ్డ,ఖండకుండలి కాండ♦కాండకంబు
గీ. గండలసమానకుండల♦కంపమాన, మస్తకాణ్డలసుముఖాది♦మండలాగ్ర
ఖండనఖరాదిమాని పరి♦కాంక్షదండ, కావనంబనఁ దగు దండ♦కావనంబు. 1079

దశావతారచరిత్ర, ఆ 7.

# కాలము

క. ఉన్నట్లయుండఁగాదని, కిన్నరులను నావచేస్ప♦క్రియ వెసఁ దాఁ బో
కున్నట్లయుండి కాలం, బున్నరులప వయసుఁ బుచ్చి ♦ మోసముఁ జెప్పున్.
చ. సగరు నలుం బురూరవుఁ ద్రి♦శంకుసుతున్ బురుకుత్సు గార్తవీ
ర్య గయుఁ బృథుం భగీరథు సు♦హోత్రు శిబిం భరతుం దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వ శశి♦బిందు నభాగుని నంబరీషుఁ బూ
రుఁ గుహుని రంతి రాఘవు చ♦సత్తునిఁ గాలము కోలుపుచ్చదే. 1080

ఆముక్తమాల్యద, ఆ 2 ప 79-80.

# కాలప్రమాణము

క. విను మనిమేషంబులు పదు, నెనిమిది యగుఁ గాష్ఠ గాష్ఠ♦లిరువదియుం దో
డన పదియుం గళ యఱువది, యును మున్నాఱుఁ గళలై ము♦హూర్తమునడచున్.
గీ. మూఁడుపదులుముహూర్తముల్♦మొహమారు, యగు నహోరాత్రి మట్టివి♦యన్ని గూడ
మాస మవి రెండు ఋతువను♦మహితసంజ్ఞఁ, బరఁగు ఋతువులారైన వ♦త్సరము వత్స.
గీ. అందు మూఁడేసి ఋతువుల♦ కయననామ, కంబు లగు నుత్తరాఖ్యము♦కండు దక్షి
ణాభిధాన మొక్కటియగు♦ణాభిరామ, యవియహస్సు మరాత్రియు♦ననఁగఁ బరగు
గీ. అనఘ యుత్తరదక్షిణా♦యనములమ్మ, హోత్ములగ్ని యుధూమంబు♦సంప్రమాణియు
వినుము శుక్లంబుఁ గృష్ణంబు♦ననుటఁ గలుగు, సుగతి కగతికి హేతువు♦లగుటఁ జేసి.
క. నరులనెలలు నేఁడులుఁ బిత్రు, సురులకు దినము లగు నంద్రు♦నూరులు వరుసం
బరగుకృతత్రేతాద్వా, పరకలియుగవత్సరముల♦ భంగిఁ దెలిపెదన్. 1085

శాంతిపర్వము, ఆ 5 పద్య 37-44.

సీ. భువిఁ దన కార్యాంశ♦మున నంతమున నస్య, వస్తుయోగంబు లే♦కలన లేక
ఘటపటాదికజగ♦త్కార్యంబునకు నిజ, సమవాయకారణ♦త్వమునఁ బరగి
జలదసూర్యమరీచి ♦ సంగతగగనస్థ, మగుత్రసరేణుష♦డంశ మరయ
బరమాణువయ్యెఁ ద♦త్పరమాణువద్వయం, బతిరయంబునఁ దవుద♦త్కాల మగును
గీ. సూక్ష్మకాలంబు వినుమది ♦ సూర్యమండ, లంబు ద్వాదశరాశ్యాత్మ♦కం బనంగఁ
గలుగుజగమున నొకరాశిఁ ♦ గడచి చనినఁ, గాలమెంతగునదిమహా♦త్కాలమనఘ.
సీ. కైకొని బహువిధ♦కాలాత్యపలక్షి, తమ్ములై యహోరాత్రి♦తతులు జరగ
శతవత్సరంబులు ♦ జనులకుఁ బరమాయు, వైనదాని బంక♦జాసనునకుఁ

బరమాయువగు శతా♦బ్దంబులందులసగ, మరిగిననదియప♦రార్ధ మండ్రు
గానపూర్వార్ధంబు ♦ గడచుటఁజేసి ద్వితీయపరార్ధంబు ♦ దీనిపేరు

గీ. గడఁగి పూర్వపరారార్ధ♦కాలమందు, బ్రహ్మకల్పాఖ్యనెంతయుఁ ♦ బరగునందు
బ్రహ్మముదయించుటంజేసి♦బ్రహ్మకల్ప,మనియుశబ్దాత్మకబ్రహ్మ♦మనియునగడె.

భాగవతము, స్కం. 3 పద్య 345, 359.

సీ. లఘువర్ణపాఠ కా♦లము నిమేషంబగు, నదియ మాత్రాసంజ్ఞ♦నతిశయిల్లు
బరగ నిమేషము♦ల్పదియు నెన్మిదియైనఁ, గాష్ఠముప్పదియవి ♦ కళ యనఁ దగుఁ
గళలు ముప్పదియైనఁ ♦ గలుగు క్షణంబన, నవియాఱు ఘటికాస♦మాఖ్యఁ గాంచుఁ
దద్ద్వయగళము ముహూ♦ర్తంబని ముప్పది,యొక యహోరాత్రమై♦యొనరియుండు

గీ. నవిపదేనుగ నొకపక్ష♦మవియ రెండు, మాస మమ్మాసములు రెండు♦మలయఋతువు,
మూఁడు ఋతువుల నయనంబు మొనసియుండు,నయనములు రెండు సౌరాబ్దమనఁగనుండు.

గీ. అట్టి సౌరాబ్ద మొకటైన ♦ నమరులకొక, దివస మావెంబడినవచ్చు♦దివ్యవత్స
రములు పండ్రెండు వేలైన ♦ రమణనదియ, దేవతాయుగసంజ్ఞయై♦ తేజరిల్లు. 1089

గీ. అమరయుగములు వేయింటి ♦ నజునికొక్క,పగలుచను శర్వరియునట్లు♦పరగుచుండు
నట్టిదినములచేనైన♦యబ్దశతము, వనజభూతికిఁ బరమాయు♦వనఁగ నొప్పు. 1090

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 2.

సీ. లఘువుచ్ఛరించుకా♦లము నిమేషంబగు, నవి పదునెనిమిది♦యైనఁ గాష్ఠ
కాష్ఠలు ముప్పది♦కళ కళలన్నియు, క్షణమగుఁ బండ్రెండు♦క్షణము లొకము
హూర్తము త్రింశన్ము♦హూర్తంబు లొకయహో,రాత్రకం బయ్యహో♦రాత్రపంచ
దశకంబు పక్షంబు♦తద్ద్వితయంబు మా,సంబు మాసద్విత♦యంబు ఋతువు

గీ. అయనమగు మూఁడుఋతువుల♦నవియునుత్త,రాయణంబును దక్షిణా♦యనంబు
ననఁగ నవి రెండు వత్సరం♦బై తనర్చు,నది యహోరాత్రమై చెల్లు♦నమరులకును.

సీ. పదియేడులక్షల♦నైనిరువదియెని,మిదివేలవర్షముల్ ♦ మొదలియుగము
సమలు పండ్రెండుల♦క్షలతోఁ దొంబది,యాఱు సహస్రంబు♦లయ్యెఁ ద్రేత
యష్టలక్షలమీఁదఁ ♦ నరువదినాలుగు,వేలేఁడ్లు ద్వాపర♦వేళ చెల్లె
మొగినాల్గులక్షల♦ముప్పదిరెండువే,లబ్దముల్ కలియుగ♦మై తనర్చు

గీ. నోలి నాలుగుయుగములు ♦ నొక్క దివ్య,యుగము నాఁ జనునమ్మహా♦యుగము సంఖ్య
వెలయు నలువదిమూఁడుల♦క్షలు నిరువది,వేలహాయనములు గల్గి♦విప్రముఖ్య. 1092

తే. ఇట్టియుగములు వేయి వో♦యినపితామహునకు నాలుగుజాముల♦దినము వొవు
నిందునన్నాటు ముప్పది♦రెండుకోట్లహాయనంబుల వర్తిల్లు♦నాదినంబు. 109

క. అంతియ కాలము వాణీ, కాంతుని రాత్రియును దాని♦కుఁ గ్రమము లామ
న్వంతరములు పదునాలుగు, సంతతమును జెల్లుచుండు♦సరిదై యెందున్. 1094

క. ఒక్కొక్కమనువు డెబ్బది,యొక్కమహాయుగము లింత♦యును నేలుసుధా
భుక్కులము మునులు నింద్రులు, నక్కాలమునందు మనువు♦లట్ల మునీంద్రా. 1095

ఆ. మనువు మనువు మాని ♦ మనువు వచ్చినదాఁక, నంబురాసు లేక♦మై చెలంగు
నట్టిప్రళయకాల♦మాదియుగ ప్రమా♦ణాబ్దకాలమయ్యె ♦ ననఘచరిత. 1096

క. వినుము పితామహుదివసం,బును సృష్టియు రాత్రి ప్రళయ♦మును బాటిల్లున్
మునివర యిది నైమిత్తిక,మనుసంకల్పంబిట్లు చెల్లు ♦ ననవరతంబున్. 1097

క. ఇట్టి దినంబులు ముప్పది, వెట్టినఁ బద్మజున కొక్క♦నెల యట్టినెలల్
గట్టిగఁ బండ్రెండగుసమ,మట్టిసమలునూఱు బ్రహ్మ ♦ యాయుస్సుసుమీ. 1098

తే. అదిమహాకల్పమై చెల్లు ♦ నంబుజాత,భవుని ప్రథమపరార్ధంబు ♦ పద్మకల్ప
మగు ద్వితీయపరార్ధంబు ♦ దగు వరాహ, కల్ప మప్పాటు వర్తిల్లుఁ ♦ గాలగతులు

క. కల్పాదులఁ బరమేష్ఠియు, నల్పీకృతసత్వయుక్తుఁ♦డై లోకంబుల్
కల్పించును నారాయణ, కల్పంబగుదివ్యమూర్తిఁ ♦ గైకొనిగరిమన్. 1099

విష్ణుపురాణము, ఆ 1 ప 63—73.

## అక్షౌహిణీసంఖ్య

సీ. వరరథ మొక్కండు ♦ వారణ మొక్కండు, తురగముల్ మూఁడు కా♦ల్వురను నేవు
రనుసంఖ్య గలయది ♦ యగుఁ బత్తి యది త్రిగు,ణం బైన సేనాము♦ఖంబు దీని
త్రిగుణంబు గుల్మంబు ♦ దీనిముమ్మడుఁ గగు,గణము తద్గణము త్రి♦గుణిత మైన
వాహినియగు దాని ♦ వడిమూఁటగుణియింపఁ,బృతన నాఁబరఁగుఁ ద♦త్పృతనమూఁట
ఆ. గుణిత మైనఁ జమువ♦గున్ మఱి దానిము,మ్మడుఁ గనీకినీస♦మాఖ్య నొనరు
నదియుఁ బదిమడుంగు♦లైన నక్షౌహిణి,యా నిరంతరక్ర♦మానుసంఖ్య. 1100

భారతము, ఆది. ఆ 1 పద్య 80.

## సంఖ్యానీకము

చ. శతములు వేలు లక్షలును ♦ శంఖశతంబులు నర్బుదార్బుదా
యుతములు గోటిశంఖములు ♦ నొప్పుసముద్రమహాసముద్రసం

హాతులును వేయిఖర్వములు ♦ సత్యపరార్ధసహస్రబృందముల్
క్షితిపతియున్ మహాక్షితియుఁ ♦ జెప్పనసంఖ్యవనాటసైన్యముల్. 1101

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 587.

## నక్షత్రరాసులు

సీ. అంగుళక్రమమున ♦ నశ్విని భరణియుఁ, గృత్తిక రోహిణి ♦ మృగశిరార్ద్రి
పొసఁగఁ బునర్వసు ♦ పుష్య మాశ్లేషయు, మఘ పుబ్బ యుత్తర ♦ మఱియుహస్త
సరవిఁ జిత్రయు స్వాతి♦పరగ విశాఖానురాధలు జ్యేష్ఠయు ♦ రమణమూల
పూర్వోత్త రాషాఢ ♦ లుర్విని శ్రవణ ధనిష్ఠలు శతభిష ♦ సోర్విపదలు
గీ. నుత్తరాభాద్రి రేవతు ♦ లొనర నెంచి, మేష వృషభ మిథున కర్కి♦మృగప కన్య
కాధటాళిధనుర్గ్రస్త ♦ కలశమీన, రాశిసంఖ్యలు వరుస నే♦ర్పడ గుణించి. 1102

హంసవింశతి, ఆ 4 పద్య 55.

## కలియుగము

సీ. సత్యంబు నరులకు ♦ సంక్షిప్త మగు సత్య,హాని నాయువు గడు♦సరిగి పోవు
నాయువు తఱఁగిన ♦ నల్పంబు లగు విద్య,లల్పవిద్యల విమో♦హంబు మిగులు
మోహంబువలనఁ బై♦మసరు లోభంబు లో,భావేశమునఁ గామ♦మగ్గలించుఁ
గామంబు పెంపునఁ ♦ గడఁగుఁ గ్రోధంబు క్రో,ధంబువ వైరమెం♦తయును బెరుఁగు
ఆ. వైరమున నశేష♦వర్ణులు నన్యోన్య,పీడ సేయుచును వి♦భిన్నబుద్ధి 1103
నొక్కఁ డొకని మేర ♦ నుండక వర్ణసం,కరము సేయఁ గలరు ♦ కలియుగమున.
క. జపనియమస్వాధ్యాయ, ప్రపంచములు విడువఁ గలరు ♦ బ్రాహ్మణులు జనా
ధిప శూద్రులు విప్రులతప, కుపితులుగాఁ గలరు వినవె ♦ కలికాలమునన్. 1104
మ. వివిధవ్యాఘ్రమృగోరగాకులము లై ♦ విస్తీర్ణశూన్యాటవీ
నివహాభీలము లై యరాజకము లై ♦ నిర్మూలధర్మంబు లై
ద్రవిడాభీరతురుష్కబర్బరపుళిం♦దవ్యాప్తి దుష్టంబు లై
భువిలో నెల్లెడఁ బాడగున్ జనపదం♦బుల్ దద్యుగాంతంబునన్.
క. క్షత్త్రియజాతులు శూద్రచ,రిత్త్రంబున శౌర్యమును సి♦రియుఁ దేజంబున్
మైత్త్రియును లేక చెదరి ధ,రిత్రీశ్వర శూన్య లై చ♦రించెదరు ధరన్. 1106
క. రసగంధద్రవ్యంబులు, పస చెడు సస్యంబు లల్ప♦ఫలము లగు మహిం
బసిపాఁడి దఱుఁగుఁ దరువులఁ, గుసుమఫలంబులును గరముఁ♦గొంచెంబు లగున్.

అరులు మిగులఁ గొని రాజులు, నరులకు నెంతయును భయ మొ♦నర్తురు ధరణీ
సురులు గడఁగి వాణిజ్యముఁ, గరిసనమును జేయఁ గలరు ♦ కలికాలమునన్. 1108

సీ. పాషండదర్శన ♦ బహుళంబు లై యుండు, వర్ణాశ్రమంబులు ♦ వసుమతీశ
తవిలి శరీరంబుఁ ♦ దద్దయుఁ బ్రోతురు, పుణ్యఫలంబులు ♦ బొందులనుచుఁ
గాలంబుతోఁ గూడఁ ♦ గల్గవు వానలు, జొల్లులై బీజముల్ ♦ పొలిసిపోవుఁ
గ్రయవిక్రయంబులఁ ♦ గపటంబు దఱ వగుఁ, గడఁగియిల్లడసొమ్ము ♦ లడఁచికొంద్రు

ఆ. సాధుచరితు లైన ♦ జనులు దుర్గతుల రో,గములఁ దెగుదు రల్ప ♦ కాలమునన
పాపపరులు లగ్గుఁ ♦ బరమాయువును నరో,గతయు సిరియుఁ బొందఁ ♦ గాంతు రెందు

క. ఊఱవగు నారుగపంటలు, గొఱియలపాఁడియును దఱ చ♦గుం బురుషులకుం
దెఱవలచుట్టము లయ్యెద, రెఱచియ భుజియింతు రర్థి ♦ నెల్లజనంబుల్. 1110

క. పితృదైవతకార్యంబుల, నితరేతరభోక్త లగుదు♦రెల్లయెడలఁ గు
త్సితదేశకాలపాత్రి, ప్రతతియు వర్తించు దైవ♦పైతృకవిధులన్. 1111

క. హేతుప్రత్యయవాదవి,చేతసు లై వేదనింద ♦ సేయుచును శుభ
వ్రాతంబులు వ్రతములుఁ బెడఁ, బాతురు దుర్మార్గకర్మ♦పరు లై విప్రుల్. 1112

మ. వనితాదుర్బలదీనబంధుజనస♦ర్వస్వాపహారుల్ సుహృ
జ్జనమాతాపితృపుత్త్రిహంతలు యదృ♦చ్ఛాకర్మశీలుర్ ధరన్
జనసంపూజితు లై చరింతురు విన♦ష్టశ్రీకు లై విప్రు లా
జనులం జేరి పరిగ్రహించెద రవ♦జ్ఞాపూర్వదుర్వృత్తముల్ 1113

మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్ ♦ దర్పంబునం బళ్యతో
హరు లై సాధుల దోఁచి చేకొంచు తదీ♦యస్త్రీధనక్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరం♦బై పెల్లు చెల్లుం బర
స్పరవైరంబు ధరాతలేంద్రులకు వి♦శ్వప్రాణినాశంబుగన్. 1114

క. సుతుఁ డవమానించు జనకుఁ, బతి నవమానించు భార్య♦పడఁతులుఁ బతులన్
మతి నొండొరువుల మెచ్చక, సతతముఁ జరియింతు రిష్ట♦సంచారములన్. 1115

క. నడవవు దేవపితృక్రియ, లుడుగును వేదార్థసమ్య♦గుపదేశంబుల్
గడఁగు మహోత్పాతములు, పుడమి సమస్తంబుఁ గుజన♦భూయిష్ఠ మగున్.

సీ. పదియాఱువర్షముల్ ♦ పరమాయు వయ్యెడు, ధరణీశ కలియుగాం♦తమున వినవె
యేడు నెన్మిదియును ♦ నేండ్లప్రాయంబున, బ్రజ లుద్భవింతురు ♦ భామినులకు
ద్రవిణవిహీను లై ♦ దాతయొక్కఁడు లేక, యన్యోన్యతస్కరు♦లగుదు రెందు
నత్యుగ్రదుర్వాకును ♦ నెంతయుఁ గ్రూరులై, చెనసి పాపంబు సే♦సెదరు నూతె

గీ. యజ్ఞవిక్రయ మొనరింతు ♦ రఖిలజనులు, వేదవిక్రయు లగుదురు ♦ విప్రవరులు
పణ్యహీనుల యగుదురు ♦ పద్మముఖులు, కష్టతరమైన యక్కలి ♦ కాలవేళ. 1117

తరువోజ. ఉక్కునశూద్రులత్యుగ్రులైకవిసి ♦ యొండొండ పెక్కండ్రనుఱక చంపుటయు
దిక్కెవ్వరును లేక ♦ దీనులై పసులు, తీసుగల్ నాలుగు ♦ దెసలఁ బాఱెదరు
క్రుక్కిడిచోరులు ♦ ముట్టి నిశ్శేషముగ ధనావలిఁ గొని ♦ మొగి వధింపంగ
స్రుక్కి కాపులయాట్లు ♦ శూన్యులై చెదరి, సొంపరి యడవులు ♦ సొత్తురు జనులు.

క. శ్రుతిధర్మంబులు శూద్రులు, ప్రతిఫం జెప్పంగ వినుచు ♦ బ్రాహ్మణజాతుల్
ధృతి సెడి తత్సేవకులై, యతినిందితకర్మకారు ♦ లయ్యెద రధిపా. 1119

మత్తకోకిల. దేవతాయతనంబులున్ జగ ♦ తీసురావసథంబులుం
బావనాశ్రమభూములుం జెడి ♦ పాడగున్ శుభవృత్తిఁవ
లీవనంబులు నాశ మొందుఁ గ ♦ లిప్రచారమునందు దుస్
స్త్రీవిహారము మద్యపానముఁ ♦ జెల్లుఁ బెల్లుగ నెల్లెడన్. 1120

క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు, గురుఁడును శిష్యునెడ వంచ ♦ కుం డగు పదినాం
డొరువుల నొల్లరుబంధులు, పొరిఁబొరిఁ గఱవులగుఁ బ్రజకుఁ ♦ బాడమును భయముల్

గీ. ఇవ్విధంబున ధర్మంబు ♦ లెల్ల నడగ, తమమునఁ బడు జను లెల్లను ♦ దల్లడిల్ల
బహువిధోత్పాతములు పుట్టుఁ ♦ బార్థివేంద్ర, కడఁగి తత్కాలికాలసం ♦ క్షయమునందు.

క. క్రమమున రాష్ట్రములును నగ, రములును నాశంబు నొందు ♦ రక్షాచ్యుతులై
భ్రమియింతురు జను లతి దుర్గమగిరిసరిదంతికములఁ ♦ గడు నాతురులై.

భారతము, ఆర. ఆ 4 పద్య 288-308.

తే. ఆయుధీయులై బ్రాహ్మణు ♦ లాత్మవిధులు, విడిచి శూద్రులఁ గొల్తురు ♦ వినుము శూద్రు
లంచిత బ్రాహ్మణాచారు ♦ లై చరింతు, రిరుదెఱఁగువారు భుజియింతు ♦ రేకపంక్తి.

క. చోరులు నరపతు లగుదురు, చోరు లగుదు రవనిపతులు ♦ సుజనచరిత మె
వ్వారికి నపూజితము ధన, మేరూపునఁ బడయుటయ య ♦ భీష్ట మొకండున్. 1125

క. భృతి గానక భృత్యజనులు, పతియొసఁగని సొమ్ము లాస ♦ పడుదురు మనుజుల్
పతితులదెస నొక్కింతయు, మతిరోయరు గలయుటకు స ♦ మస్తక్రియలన్. 1126

క. కూడమ్మికొండ్రు జనములు, బాడబులాగమము లమ్మి ♦ బ్రతుకుదు రెందుం
జేడియలమ్ముదు రచ్చోటు, గాడుపడిన కలియుగమునఁ ♦ గౌరవముఖ్యా. 1127

తే. పండ్లెలుపును నింద్రియ ♦ ప్రతతిఁ గెలుపుఁ, దలలబోడతనంబుఁ గా ♦ వులబెడంగు
గలుగు ధర్మంబు శూద్రుల ♦ తలన నిలుచు, శాక్యబౌద్ధాదిదుర్మత ♦ శ్లాఘులెసఁగు..

క. క్రూరపుష్పకములు గములగు, గోరాశియడంగిపోవుఁ ♦ గుజనులు వృద్ధిం
గూరుదురు సాధుజనులకు, దారుణదుర్దశలుపొందుఁ ♦ దఱుచుగ నెందున్. 1129

క. కడపటిభూములు నడుమగు, నడుభూములు కడపలగు వి♦శస్త్రస్థలినుల్
కడగొంద్రుజనులు సెఱుపం,బడుఁజేనులు చిత్రవృష్టిఁ ♦ బండవు మిఱ్ఱుల్. 1130

క. అడిగెడువారలు మునుపయి, పుడికెడువారఁ గొరఁతలేక ♦ పురుషాల్పతయై
పడఁతులు తఱుచై కులములు, సెడి యన్యాయ ప్రబలి జగము♦శిథిలత నొందున్.

క. ఒడఁబాటులు సత్యములున్, గడునస్తంగతంబులుఁ గుటిలులును ♦ గయికొనక వృథా
విడుతురు జనములు ఋణమి,చ్చెడికొనియెడిచోటఁ దా వృ♦సెల్లకపోవున. 1132

క. చదువక పెద్దలగోష్ఠికి, నొదవక పిన్నంబు తెలుఁగ♦కూరక మిగులన్
జదివినవారై గొఱుకలు, పదివేలు నటింతు రిప్పుఁ ♦ బండితమానుల్.

చ. వినిమయయాజ్యయాజనము ♦ విప్రు లొనర్తురు యజ్ఞమున్ దపం
బు ననఘు జట్టియిత్తురు వి♦మూఢతఁ బాయుదు రగ్నిహోత్రముల్
గొనకొని బ్రహ్మవాదులయి ♦ కొందఱు మద్యముఁ గ్రోలి మాంసమున్
దిని ధనవాంఛమై జనులఁ ♦ ద్రిప్పుదు రుగ్ర ప్రపంచనంబులన్. 1134

తే. కొడుకు తండ్రినాజ్ఞాపించుఁ ♦ గోడ లత్త,నాదరింపక పనిగొను♦నతివ మొఱఁగి
మగఁడుఁ బతి డాగురించి భా♦మయుఁ దిరుగుదు,రుఱక గురుని శిష్యుఁడు సిస్త్ర♦
రోక్తి నడుచు.

హరివంశము, ఉత్త ఆ 9.

సీ. ధరణీశకలియుగో♦దయమువేళ విపరీత,రీతి నిన్నియుఁ బ్రవ♦ర్తిలుచునుండుఁ
గల్ల నిజంబగుఁ ♦ గష్టుఁడు దుష్టుఁడై, నెగడు ననిత్యంబు ♦ నిత్యమగుచు
హేయ మహేయమై ♦ యెసఁగు ననాచార, మాచారమై చెల్లు♦ననిసురులు
మతిచెడి శూద్రుల♦గతిఁ జరింతురు శూద్రు,లావిప్రధర్మంబు ♦ లాచరింతు
ఆ. రాలు మగని విడుచు ♦ నాచార్యు నిందించు, శిష్యుఁ డఖిలదేవ♦సేవ్యుఁడైన
హరిభజింప నొల్ల♦ఁ డన్యదైవంబుల, నెపుడుఁ గోరి కొల్తు♦రెల్లవారు. 1136

శ్రీరంగమహాత్మ్యము, ఖైర ఆ 4 ప 984.

క. అల్పప్రసాదములుఁ గడు, నల్పవివేకములు నాయు♦వల్పము మఱియు
ల్పాల్పపరిజ్ఞానంబులు, నల్పములగు వైభవములు♦నగు రాజులకున్. 1137

క. ఆవులఁ బడఁబొడుచుటయును, స్త్రీవధ లొనరించుటయును ♦ శిశువులహత్యల్
గావించుటయును నైజము, లై వెలయును జగమునందు ♦ నఖిలజనులకున్. 1138

క. అనఘుఁడు నతఁడమ్మునిసుతుఁ, గనుఁగొని యిట్లనియెఁ గలియుగంబున ధర్మం
బానరంగ నేకపాదమ్మున నడచుటఁ జేసి ధర్మములు లేకుండున్. 1139.

ఆ. అవనియందు వైదికాచారములుఁ దపో, యజ్ఞములును దేవతార్చనాగ్ని 1140
హోత్రములు వివాహయోగ్యదాంపత్యక్రియలుఁ దొలంగిపోవుఁ గలియుగమున.

సీ. కులహీనులకుఁ గన్యకల నిత్తు రధికులు, బలవంతుఁ డగువాఁడె యేలికుఁ గర్త
ద్విజనామమాత్రులు వీక్షితు లగుదురు, మనుజు లేవేల్పునైనను భజింతు
రాచరించినదె ప్రాయశ్చిత్తమగుఁ బల్కినవి శాస్త్రములు చెప్పినదియె నీతి
దానంబుఁ గావించి తపములు విడుతురు, ధర్మమే లాగువర్తనము లైన

గీ. ధనముఁగలవాఁడె రాజు మహార్ఘ్యమున నున్న, వాఁడె హీనుఁడు కల్లాడువాఁడె ప్రోడ
పాపవర్తనులగువారె భాగ్యవంతు, లెలమిఁగలవారె పూజ్యులు కలియుగమున.

క. కులసతుల విడిచి పురుషులు, కులహీనులయిండ్లఁ బోయి కూటికొఱకుఁ గ
న్నెలఁ బెండ్లియాడియుందురు, నిలువరుసలుఁ బౌరుషములు నెడలి మునీంద్రా.

ఆ. అర్థ మిచ్చె నేని యధమాధమునినైన, నాశ్రయింపఁ జూతుఁ రాగ్యమతులు
సూనృతంబు బలము శూరత్వమును లేదు, కల్లతనము గలుగు కలియుగమున. 1143

సీ. కామతత్పరవృత్తిఁ గాఁగాని పనిపూని, వర్తింతు రెన్నఁడు వావిదప్పి
క్రోధించి సూక్ష్మాపరాధంబునకునైనఁ గావింతు రెప్పుడు జీవహింస
లోభులై బహువిత్తలాభంబు లాసించి, హరియింతు రెప్పుడు పరధనంబు
మోహపాశంబున ముడివడ్డకతమునఁ, దిరుగుదు రెప్పుడు దెలివిమాలి

గీ. మదముచే ధిక్కరింతురు మాన్యజనుల, మచ్చరమె కాని తలఁపరు మంచితనము
దోసములకెల్లఁ దామె నివాస మగుచు, హెచ్చుదురు ధాత్రిఁ గలివేళ నెల్లజనులు.

క. ఆలము విప్రులు చేయఁగ, హాలికులై రాజు లడఁగ సంత్యజులు బేహా
రాలాడం గష్టపుఁగలి, కాలంబున వర్తనములు గత్తరిఁ గలయున్. 1145

చ. పుడమి సహస్రవర్షముల పొల్తురు సీలుపుఁ దప్పి లంజెలై
పడిచి గడింతు రర్థములు బ్రాహ్మణపూర్వకవైశ్యజాతిచే
నడిగముఁ గొంచు గర్వమున నుందురు శూద్రులు సత్యశౌచముల్
పొడవడఁగుం గలిం బెరసి పోవు మహాత్మ్యము దేవకోటికిన్. 1146

వరాహపురాణము, నం. మ. ఆ ౨ ప. 124, 126.

సీ. ఆమ్నాయపథవిహీనాచారములచేతఁ బ్రబలు నన్యోన్యవైరములచేత
నన్యాయవర్తనులైన రాజులచేత, సముత్పన్న దుర్వ్యసనములచేత

ధర్మపత్నీనిరా♦దరకృత్యములచేతఁ, బ్రభవించు వేశ్యాభి♦రతులచేతఁ
బరధనపరదార♦హరణబుద్ధులచేత, నలమినఘోరమో♦హములచేత

గీ. జాలికాదులచేత దూ♦మకులచేతఁ, బ్రల్లదులచేత వంశవా♦పకులచేత
డాంబికులచేతఁ బచ్చిబం♦దగులచేతఁ, గల్లరులచేత దర్పించుఁ ♦ గలియుగంబు.

క. సారిది ననాచారంబుల, మురువగు మం బ్రథమపాద♦మునఁ గలిమహిమం
బెరుఁగును వర్ణును గలిపిన, శరణిన్ వర్ణాశ్రమములు ♦ కర్తరిగలయున్. 1149

జైమినిభారతము, ఆ 8 పద్య 212, 213.

సీ. పతిభక్తియూడిగి సం♦తతము దమయిచ్ఛ,వచ్చినతెరువుల♦వ్యభిచరించి
పెక్కుబిడ్డలఁగాంచి ♦ పేదతికముచేత, బడలుచు జీవనో♦పాయములకు
నెరవేమియునులేక ♦ విచ్చలవిడి నీచ, కర్మంబులకుఁ జొచ్చి ♦ గాసిపడుచుఁ
దల్లిదండ్రుల నన్న♦దమ్ముల నత్తమామల బంధుజనులఁ బు♦త్త్రులను విడిచి

గీ. యుందురు రెండుచేతుల♦నొక్కపరియు, మస్తకము గోఁకికొందురు♦మగువలెల్లఁ
గల్లలాడుచుఁ బరుషవా♦క్యములతోడ, నలిగియుందురు భాగ్యహీనలై♦కలియుగమున.

సీ. తలుచు వానలు లేవు ♦ ధరణిఁ బంటలు పండ, రాజు లన్యాయవ♦ర్తనము లరుగ
దుర్వీసురులు వేద♦మెల్లను దుర్భికు,మగు నెల్లకాలంబు ♦ తగవు వెడలి
వార్తావిహీనులై ♦ వైశ్యులు శూద్రుఁ,యట్లు వర్తింపుదు♦రధమజాతి
వాశ్రయింపుదురు ధ♦నార్థులై యధికులు, కడు నీతి బాధయుఁ ♦ గలిగియుండు

గీ. విప్రవరులకు శూద్రులు ♦ వేదశాస్త్రధర్మములు చెప్పుదురు తల్లి♦దండ్రులందు
భక్తిచెడి యత్తవారల♦ప్రాపుఁ గోరి, మెలఁగుదురు సర్వజనములు♦కలియుగమున.

తే. కాంతకైదునాఱేండ్లకుఁగలుగుసుతుఁడు,పదియుపంద్రెండువేండ్లలోముదిమి చెందు
మనుజుఁ డిరువది యేండ్లలో♦మరణమొందుఁ,బాపసోత్తమకలియుగాం♦తంబునందు.

విష్ణుపురాణము, ఆ 8 ప 296, 307.

# కృతత్రేతాద్వాపరయుగములు

సీ. ఆకృతయుగమున ♦ వలగుఁ జతుష్పాద,చారియై ధర్మంబు ♦ జనవరేణ్య
త్రేత సత్యపదంబు♦తెగి పదత్రయగామి, యగు క్షత్రియులతపం♦బపుడు తలుచు
తరుతపోమహిమల ♦ ధరణీజనులఁ బ్రోచు,రాముఁరారోగ్యభా♦గ్యములు గలుగు
వన్నతముల్ పల్కుఁదు♦గచ్చటచ్చట జనుల్,బుధులుమాత్రిశుహోంకు♦బారయురందు

గీ. ద్వాపరంబున సగపాలు ♦ ధర్మ మేఁగు, నందు ద్విజరాజశుశ్రూష ♦ లాచరించి
వైశ్యులు తపం బొనర్తు ర♦వార్యనిష్ఠ, నదివిపర్యాసమైతోఁచ ♦ దయ్యుగమున 1153
ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 199.

# త్రేతాయుగము

సీ. త్రేతాయుగంబున ♦ ఖ్యాతిగా ధర్మంబు, మూడుపాదంబుల ♦ మోసియుండు
రాజీవనేత్రుండు ♦ రక్తవర్ణాకృతి, వేడుకతోఁ బ్రోచు ♦ విశ్వ మెల్ల
జనులుతపోదాన ♦ సత్యము ల్వదలక, హరిభక్తితో నుందు ♦ రనుదినంబు
ధారుణీశ్వర విను ♦ ధర్మంబు ద్వాపర, యుగమందు ద్వియుగపాద ♦ మొప్ప నుండు
గీ. మాధవుఁడు పీతవర్ణుఁడై ♦ మనుచునుండు, నవనిలోపల వర్ణాశ్ర♦మంబు లెపుడు
రక్షణము సేయుచుందురు ♦ రాజు లరయ, జారచోరత్వములు లేవు ♦ జనులయందు.
విశ్వగుణాదర్శము, తిరు॥ బు॥

# కృతయుగము

శా. ఆరామవ్రజచైత్యసద్మవనదే♦వాగారసౌమ్యంబు లై
భూరిబ్రహ్మతపస్విసంకులము లై ♦ పుణ్యాధ్వరారంభసం
భారోదారము లై నితాంతఫలిత♦భ్రాజిష్ణుసస్యంబు లై
యారూఢస్థితి నెల్లదేశములు నొ♦ప్పారుం బ్రకాశంబుగన్. 1155
క. సమయముతోడఁ గురియు వర్షములు గరము తేజ మెక్కి ♦ చరియించు నవ
క్రము లై గ్రహంబు లారోగ్యము సౌఖ్యము సమధికముగఁ ♦ గలుగు నరులకున్.
భారతము, ఆర. ఆ 4 పద్య 313, 314.

తే. కుటిల మన్నియు సముద్రమ్ముఁ ♦ గూడి ప్రజలు, పెద్దసేయఁగనొక రాజ ♦ పేరుఁ దాల్చి
బలియు రేలెడ రవులఁ బో♦టులుగఁ ద్రుంచి, ధరణిఁ దామయేలికలును ♦ దస్కరులుగ.
సీ. తమలోన రాశిబా♦ధవులు చూఱలుగొన్నఁ, గలుము లెల్లను బోయి ♦ నెలవు వెడలి
బాంధవులును దారు ♦ బహుకుటుంబము ముదుసల్లి బాలుర నలి ♦ చట్లు మోచి
నీరు దూడును గాన♦కారటంబున భీతులయి పాఱెదరు కళిం♦గాంగవంగ
కాశ్మీరభూములు ♦ గౌళికి మును నేలు, చలికొండయును బెలి ♦ మలఘుగరులు
గీ. సాగరోపవనంబులు ♦ సంశ్రయింపఁ, గలరు జనులు పాడును బాడు ♦ గాని యేదియుఁ
గాక యిట్టి దుర్వ్యయుండుర ♦ తుకులుగాని, వారుఁ గాకుండుదురు ధరా♦పరులునపుడు.

ఉ. నారలు పట్టు లాకులు జ♦నంబులు తాపసు లట్లు కట్టుచున్
చీరలు గాఁగఁ బల్లములు ♦ చిక్కనికొయ్యలఁ ద్రిప్పి పెట్టుచున్
గోరినయారటంబులుగఁ ♦ గొండలకాలువ లడ్డకట్టుచున్
నీరికిఁ గాఁగ దీయరతి♦నీచత నొంది మనుష్యు లెయ్యెడన్. 1159

చ. మలినములై శరీరముల♦మంగళతం గులగోత్రచిహ్నముల్
దొలఁగఁగ నల్పసంతతుల♦తోఁ బరమాయువు ముప్పదేఁడులో
కొలఁదికివచ్చి లావులును ♦ గ్రొవ్వులుఁ బోవఁగ నింద్రియార్థసం
కలనము గొంచెమై మఱియుఁ ♦ గల్గు ననేకరుజాపకారముల్.

హరివంశము, ఉత్తర ఆ 9.

తే. కలియుగము దీఱ కృతయుగ♦కాలమైన, ధర్మమార్గంబు నాల్గుపా♦దముల నడచు
ననిమిషులు భూమి కరుదెంచి♦మనుజకోటిఁ, గలిసి వర్తింతు రత్యంత♦గౌరవమున.

క. కలియుగదోషములకుఁ గడు, నలికి తపము లాచరించు♦చున్న నరేంద్రుల్
నలినాప్తసోమవంశజు, లెలమిన్ దొల్లింటియట్ల ♦ యేలుదు రవనిన్. 1162

విష్ణుపురాణము, ఆ 6 ప 405, 406.

సీ. కృతయుగంబున ధర్మ♦మతులితంబుగ నాల్గు, పాదంబులను గల్గు♦పాండుతనయ
హరి శుక్లవర్ణుఁడై ♦ కరుణతో జగములు, బ్రోచుచు నుండఁగా ♦ భూమిసురలు
వసుధాధినాథులు ♦ వైశ్యులు శూద్రులు, వర్ణాశ్రమంబులు ♦ వదల రెపుడు
మదమత్సరాదులు♦మాని వర్తింపుచు, పుణ్యులై యుందురి♦భూమిజనులు

గీ. సుతులు లేకను చింతించు ♦ సతులు లేరు, పతుల నెడఁబాసి వర్తించు ♦ సతులు లేరు
మగువలను బాసి చరియించు♦మగలు లేరు, లేమిచేఁ గుందువారలు ♦ లేరు లేరు.

సౌగంధికప్రసూనసంగ్రహము, అ 2.

# అనాగతమన్వంతరములు

సీ. యుగచతుష్టయమును ♦ నొక్కటిరై యేక, సప్తతివారముల్ ♦ సనిరె యేని
మన్వంతరంబగు ♦ మన్వంతరంబున, సలిలప్లవంబగు ♦ సలిలసంప్ల
వావసానము సృష్టి♦యుంచితచరితయా, సరణిని యుగసహ♦స్రంబు దగిన
నబ్జాసనునకు ది♦నాత్యయంబొందున, త్తఱి సర్వభూతబృం♦దముల నొక్క

గీ. పెట్టియాదిత్యరశ్ములు ♦ పేర్చి పేర్చు, నట్టి బెడిదంబునకు నోర్వ♦కమరవరులు
మునులు నజుఁడు మున్నుగ మహా♦మూర్తివిష్ణు, నుదరదేశంబు సొత్తురు♦బ్రదుకుఁగోరి.

హరివంశము, ఆ 1.

# సత్యము

చ. నుతజలపూరితంబు లగు♦నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొక బావిమేలు మఱి♦బావులునూఱిటికంటె నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతుశ♦తంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొక ♦ సూనృతవాక్యము మేలు సూడఁగన్.

క. వెలయంగ నశ్వమేధం,బులు వేలును నొక్కసత్య♦మును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము,వలనన ములునూఁపు గౌర♦వంబున పేర్మిన్. 1166

క. సర్వతీర్థాభిగమనంబు ♦ సర్వవేద, సమధిగమము సత్యంబుతో♦సరియుఁ గావ
యొఱుఁగు మెల్లధర్మంబుల♦కెందుఁ బెద్ద, యండ్రు సత్యంబు ధర్మజ్ఞు♦లైనమునులు

భారతము, ఆది. ఆ 4 పద్య 93,95.

క. సమతయు దమముఁ దితిక్షయు, నమత్సరము హ్రీయు ధృతియు ♦ ననసూయార్య
త్వములు నహింసాదానతు, మాత్యజనసూనృతములు ♦ సత్యముమూర్తుల్.

క. సత్యాకృతు లగుగుణములు, నిత్యానుష్ఠితసమగ్ర♦నిర్మలయోగ
స్థిత్యభిముఖునకు సులభము, లత్యంతసుఖప్రదంబు♦లవికార్యంబుల్.

చ. కుదురు సమస్తధర్మముల♦కున్ విను సత్యము యోగమోక్షస
త్పదములు సత్యకార్యములు♦పాప మసత్యముకంటె నొండు లే
దు దలఁప నశ్వమేధములు ♦ దొమ్మిదినూఱులు వెండి నూఱు నై
యొదవిన నీడు గావు భర♦తోత్తమ సత్యముతోడ నారయన్. 1170

క. సత్యమ బ్రహ్మము దపమును, సత్యమ ప్రజలనుసృజించు ♦ సత్యము లోక
స్థిత్యాధానముఁ జేయును, సత్యం బనృతంబుచేత ♦ సంపిహిత మగున్.

క. సత్యమ తపమును యజ్ఞము, సత్యమ వేదంబు దాంతి♦శాంతులు నగుటన్
సత్యము దొఱఁగుట నిర్మల, నిత్యానుష్ఠానములును ♦ నిష్ఫలము లగున్. 1172

భారతము, శాంతి. ఆ 3 ప 417-419 ఆ 4 ప 100, 151.

సీ. చిరభక్తిఁ దీర్థముల్ ♦ సేవించుపుణ్యంబు, సత్యవాక్యమునకు ♦ సవతు రాదు
ఘనతులాపురుషంబు ♦ గావించుపుణ్యంబు, సత్యవాక్యమునకు ♦ సవతు రాదు
కలకాలమును దపం♦బులు సేయుపుణ్యంబు, సత్యవాక్యమునకు ♦ సవతు రాదు
ధృతిశతక్రతువు ల♦ర్థి నొనర్చు పుణ్యంబు, సత్యవాక్యమునకు ♦ సవతు రాదు
గీ. దేవతాపూజలును భూమి♦దేవపాద, పూజలును సేయు నతిశయ♦పుణ్యఫలము
సత్యవాక్యమునకు నెన్న ♦ సవతు రాదు, మనుజుఁడనువాఁడు సత్యము♦మఱవరాదు.

ఉ. సత్యముఁబోలు ధర్మమును ♦ శాంతముఁబోలుఁ దపంబు సాహసా
గత్యముఁబోలు లాభము స ♦ గర్వముఁబోలు గుణంబు సన్నుతా
పత్యముఁబోలు మోదముఁ గృ ♦ పామతిఁబోలఁగఁ దీర్థమున్ బుధ
స్తుత్యముఁబోలు భాగ్యము వ ♦ సుంధరఁ గల్గునె రాజశేఖరా. 1174

శా. శ్రీలన్ మించు సమస్తరాజ్యసుఖమున్ ♦ జిత్రంబుగా డించి యి
ల్లాలిం బిడ్డని నమ్మి మాలనికి బం ♦ టై మున్ హరిశ్చంద్రభూ
పాలగ్రామణి యెల్లలోకములకున్ ♦ బ్రఖ్యాతిగా సత్యమున్
బాలింపండె నిలింపవర్గము నుతిం ♦ పన్ రాజచూడామణీ. 1175

క. పాటకు సత్వము శ్రుతి గడి, కోటకు సత్వంబు సమతఁ ♦ గొల్చెడి సైన్యం
బాటకు సత్వము తాళము, మాటకు సత్యంబు నిజము ♦ మనుజాధీశా.

ఆ. శమములేనితపము ♦ సతిలేనిసౌఖ్యంబు, పతిహితంబులేని ♦ భటునిసేవ
పాత్ర మెఱుఁగనీవి ♦ పగచేర్పఁగాలేని, బలిమి నిజములేని ♦ పలుకు లేల. 1177

క. కులసతికి వన్నె మానము, కలిమికి వితరణము వన్నె ♦ కదనంబునకున్
తలఁకమియె వన్నె భటునకుఁ, బలుకునకు నిజంబువన్నె ♦ పార్థివముఖ్యా.

క. అకలంక "నానృతాత్పాతకంపరం" బనుచు సూనృ ♦ తం బెప్పుడు ద
ప్పక నిర్వహించుఁగావునఁ, బ్రకటింపుము నీవు సత్య ♦ భణితి నరేంద్రా.
రుక్మాంగదచరిత్రము, ఆ 5 ప 97, 103.

క. సత్యమున నున్నదీధర, సత్యమున వెలుంగుఁ దరణి ♦ సత్యముననె తా
నిత్యమయి స్వర్గ మమరును, సత్యము ధర్మములలోఁ బ్ర ♦ శస్తం బనఘా. 1180

గీ. వినుము తులనిడియెత్తుచో ♦ వేయుఁదురగ, మేధములకంటె సత్యంబు ♦ మిగులఁగూరుఁ
గాన సత్యయుక్తుండవు ♦ గమ్ము సొమ్ము, దెమ్ము మమ్ము రమ్మనకు నీ ♦ దెసకు వింక.
మార్కండేయపురాణము, ఆ 1 ప 253, 254.

శా. కూపంబుల్ తగుతోఁటలుం జెఱువులుం ♦ గుళ్లున్ ధర న్నిల్పఁగా
నేపుణ్యం బొనఁగూడు మర్త్యులకు ధా ♦ త్రీశాన్వయగ్రామణీ
యాపుణ్యంబు రయంబ ప్రాప్తమగు ని ♦ త్యస్ఫూర్తియై సత్యభా
షాపారీణులకున్ వివేకము మదిన్ ♦ సంధిల్ల నూహించినన్. 1182
హరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 4 ప 43.

సీ. బొంకెడుపురుషునిఁ ♦ బొందనొల్లదు లక్ష్మి, తొల్లింటి సిరియును ♦ దొలఁగిపోవు
బ్రహ్మహత్యాదిపా ♦ పము లెన్నయైనను, నిల నసత్యంబుతో ♦ నెత్తురావు
మద్యపానము చేయ ♦ మరఁగినాతనికంటెఁ, గీడను మ్మనృతంబు ♦ లాడువాఁడు

ఊర్ధ్వలోకముతొరిఁగ♦ నణఁగించి యధమలోకప్రాప్తి గావించుఁ ♦ గల్లతనము
ఆ. కాన నింతనుండి♦ మానవేశ్వర నీవు, నిత్యసత్యనిష్ఠ♦ నెఱపు మయ్య
సత్యమందె నిలుము ♦ సర్వలోకములు సత్యవ్రతంబుకంటెఁ ♦ దపము లేదు.
బసవరాజీయము, ఆ 2 ప 216.

సీ. విపులంబులైన కూ♦పములు నూటికంటెఁ, బరికింప నొకనడ♦ బావి మేలు
బావులచే నడబావు♦లరయ నూటికంటె, గణుతింప నొక్క స♦త్క్రతువు మేలు
ఘనములైన నట్టియా♦గములునూటికంటె,సుగుణాఢ్యుఁడగునొక్క♦సుతుఁడుమేలు
సుగుణాఢ్యులగునట్టి♦సుతులు నూర్వురకంటె, సనినొక్క సత్యభా♦షణము మేలు
గీ. «నానృతాత్పాతకంపర»♦మనుచువినుచు, వేదవాదులవచనంబు ♦ వినవొ మున్ను
వినియు మఱచితివో కాక ♦ వేడబమున, సేచఁ దలఁచితివో ధారు♦ణీశ నన్ను.
శకుంతలాపరిణయము, కృష్ణ ఆ 3 ప 137.

# అసత్యము

క. విను మిచ్చెద నని యీమియుఁ, గొనియెద నని పలికి పిదపఁ♦గొనకునికియు న
త్యనృతంబులు సత్యవ్రత,మునకుం దొలఁగంగ మనకు ♦ భూవర తగునే.
భారతము, శాంతి. ఆ 4 పద్య 150.

సీ. పశువాంఛబొంకినఁ ♦ బంచపశుఘ్నుఁడౌ, గోనృతాత్ముఁడు దశ♦గోప్రహర్త
యశ్వానృతుండు శ♦తాశ్వహింసకదోషి, పురుషానృతిసహస్ర♦పురుషహరుఁడు
వసుధకై బొంకిన♦వాఁడు సర్వధ్వంసి, కనకంబుకొఱకు బొం♦కినవఖలుండు
సకలజాతాజాత♦జనులఁ ద్రుంచినవాఁడు, తనపల్కు మిథ్యచే♦సినయతండు
ఆ. దన్ను నాప్తజనులఁ♦దా వధించినపాపి, భువిఁ గృతఘ్నుఁ డఖిల♦భూతఘాతి
యని కృతఘ్నుఁగూర్చి ♦ యఖిలలోకేశుండు, పరగఁ బల్కునట్టి ♦ పలుకు వినుము.
భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 472.

ద్విపద. బొంకిన మొగసిరి ♦ వోలియునాయువ్వు, మింకుఁదేఁకువదప్పు♦నెడ తెగుఁగీర్తి
నమ్మికమాలు మా♦నము దూలపోవు, వమ్మగుఁ బుణ్యంబు♦వచ్చు నాపదలు
ధర «నానృతాద్దుష్కృ♦తం పర»మనుచు, నురువడి మ్రోయుచు♦నుండు వేదములు.
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. ఆ 2.

ఉ. బొంకినఁ బాతకం బొలయు ♦ బొంకిన నాశము నొందుఁ బుణ్యముల్
బొంకిన రోగముల్ వొడము ♦ బొంకిన నిర్మలకీర్తి హీనమౌ
బొంకిన లక్ష్మి వాసిచను ♦ బొంకిన నాయు వణంగుఁ గావునన్
బొంకరు శే మహాత్ములు ప్ర♦భుత్వముదప్పి నరేంద్రశేఖరా. 1188

సీ. అంత్యజన్మునితోడ ♦ ననృతంబు లాడినఁ, జరియించుఁ బదియేండ్లు ♦ జమునివీటు
శూద్రితో మిథ్యలు ♦ పోఁక నాడిన నల్వ, దేఁడులు నివసించు ♦ నినజువీటు
వైశ్యుతోడ ననృత ♦ వాక్కు లాడిన దండ, సగ్రోల నాళ్వేండ్లు ♦ దాఁక నిలుచు
క్షత్రియాన్వయునితోఁ ♦ గల్ల లాడిన దక్షి, ణేశులోకమున వే ♦ యేండ్లు లుండు
గీ. నవని నిర్జరుతో మృష ♦ లాడెనేని, నరకముల నొందు లక్షజ ♦ న్మముల నరుఁడు
పుణ్యసతితోడ బొంకులు ♦ బొంకి యగణి, తాబ్దములు రౌరవంబుల ♦ యందుఁ బడును
రుక్మాంగదచరిత్రము, ఆ 5 ప 95, 96.

చ. సిరులు దొలంగు శోభనము ♦ సేరదు రాదు యశంబు గౌరవ
స్ఫురణ మడంగుఁ బుణ్య ముడి ♦ వోవు విపత్తులె లొందుఁ బాపముల్
ధరణిధరంబులై పెరుఁగు ♦ లాఘవ మబ్బు జనాపవాదముల్
వొరయు రుజాభరం బొదవు ♦ భూవర సత్యములేనిపట్టునన్. 1190
శకుంతలాపరిణయము, ఆ 3 వ 289.

క. భూవర వివరింపఁగ భా, ర్యావిక్రయపాతకంబు ♦ నైనను బాపం
గావచ్చుఁగాని మఱి మి, థ్యావాగ్దోషంబుఁ బాయఁ ♦ దర మెవ్వరికిన్.
గీ. అనృతభాషణుకంటె దో ♦ షాధికుండు, సత్యవాచాన్వితునికంటె ♦ నిత్యసుకృతి
వెతకి చూచినఁ బొడమఁడు ♦ శ్వేతలేశ, పవనభుఙ్మానవాసుర ♦ భువనములను.
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ ప 52, 53.

## సజ్జనపద్ధతి

సీ. చలిచీమ నేనియుఁ ♦ జాఁగ్రొక్క శంకించుఁ, బలుకఁ డెన్నఁడు మృషా ♦ భాషణములు
కలుషవర్తను లున్న ♦ పాలుపోఁ డింతెఁ జనండు, కలిమి నుబ్బఁడు లేమి ♦ కలఁగఁ డాత్మఁ
దలయెత్తి చూడఁ డె ♦ వ్వలనఁ బరస్త్రీల, ధైర్యంబు విడఁ డెట్టి ♦ యిద్దఱుటుల
నొరులసంపదకునై ♦ యుపతపింపఁడు లోన, నిందింపఁ డెంతటి ♦ నీచునైన
గీ. మిన్నకయ చూడఁ డాకలి ♦ కన్న కడుపు, సర్వభూతదయోదయో ♦ త్సవము నెఱపు
నిగమఘంటాపథైకాధ్వ ♦ నీనబుద్ధి, బ్రహ్మవిద్యానవద్యుండు ♦ బ్రాహ్మణుండు.
పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 6.

మ. దమసంపత్తి మహేశభక్తి నిజకాం ♦ తాసక్తి విద్యాసుర
క్తి మహత్సంగమవాంఛ దేశికపరాఁ ♦ ఘ్రిప్రీతి దుస్సంగమో
క్షునునిందామయబుద్ధి యన్యగుణహ ♦ ర్షం బేరియం దుండు వా
రమరన్ భూమికలంకృతుల్ సుకృతిమ ♦ ల్లా నీతివాచస్పతీ. 1194

శా. ఆపత్తిన్ ధృతి సంపదన్ క్షమ శ్రుతి♦న్యాయ్యాసక్తి సద్గోష్ఠి వా
గ్వాపాండిత్యము పౌరవిక్రమము భా♦స్వత్కీర్తిపై వాంఛయున్
భూషింప న్మహనీయులౌ జనులకెం♦గున్ లక్షణంబుల్ సుమీ
యాపూర్ణప్రతిభానిధీ సురభిమ♦ల్లానీతివాచస్పతీ.

భర్తృహరిసుభాషితము, ఏ. బా. ప 51, 52.

చ. వరకృప భృత్యులందు నిజ♦వర్గమునం దనురాగవృత్తి కా
పురుషులయందు శౌర్యము సు♦బుద్ధులయం దనురక్తి దాల్మి స
ద్గురువులయందు గౌరవము ♦ కోవిదులందు నయంబు రాజులన్
వెరసం గళాప్రవీణులగు♦వారలయందు వసించు లోకముల్. 1197

ఉ. ఆపదలందు ధైర్యగుణ♦మంచితసంపదలందుఁ దాల్మియున్
భూపసభాంతరాళమునఁ ♦ బుష్కలవాక్చతురత్వ మాజిబా
హాపటుశక్తియున్ యశము♦నం దనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ బ్రకృతి♦సిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

చ. పరహింసాపరకీయవిత్తహరణా♦భావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వ మన్యవనితో♦దంతోక్తి మూకత్వముం
బరతృష్ణాఝరభంజనంబు గురుస♦త్కృత్యంబునుం బ్రాణిస
త్కారుణ్యాశాస్త్రసమత్వసద్విధులు భ♦ద్రప్రాప్తికిన్ మార్గముల్. 1199

భర్తృహరిసుభాషితము, ఏ. ల. నీతి పద్య 19, 53, 55.

చ. పరగుణరీతిఁ బ్రీతి గురు♦పట్ల వినీతి బుధాప్తి వాంఛయున్
దఱచుగ విద్య వాఞ్ఛయు స♦ధర్మిణిపై రతి లోకనిందలన్
వెఱపు శివార్చ భక్తి మతి♦విగ్రహశక్తియు దుష్టసంగమం
దరతియుఁ గూర్చి యొప్పెడు మ♦హాత్ములఁ గూర్చి నమస్కరించెదన్. 1200

భర్తృహరిసుభాషితము, పుష్ప. తి. ప 51.

క. దుర్జనసహవాసంబును, దుర్జనసంభాషణంబు ♦ దుర్జనతలఁపున్
వర్జింపవలయు నెప్పుడు, నూర్జితపుణ్యులకు నెల్ల ♦ నుత్పలనయనా.

సీ. హరునందు శ్రీమనో♦హరునందు నవిభేద, భక్తియోగంబునఁ ♦ బరగువాఁడు
నిగమోదితంబైన ♦ నిత్యకర్మంబువి, శ్వాసపూర్వకముగా ♦ జరుపువాఁడు
నార్యభూదేవతా♦చార్యమాతాపితృ, సేవ లశ్రాంతంబుఁ ♦ జేయువాఁడు
సూనృతభాషణమును ♦ నన్యదూషణమును, నెపుడు నాలుకసోఁక ♦ నీనివాఁడు
గీ. మాయయును నసూయ గర్వంబు ♦ మత్సరంబు, నన్యధనవంచనంబును ♦ నాదిగాఁగ

నవగుణము లాత్మఁ జొరనీని ♦ యుక్తివాఁడు, సజ్జనుం డనంబరఁగు నా♦జ్ఞానతిలకము.
గీ. పరునియర్థంబు లోష్ఠంబు ♦ పగిదిగాఁగఁ, బరకళత్రంబు జనయిత్రి ♦ భాతిగాఁగ
బరునికళ్యాణ మాత్మసు♦ఖంబుగాఁగఁ, సమ్మతివహించు సుజనుండు ♦ చంచలాక్షి.
ఉ. చిత్తము చాలనిర్మలము ♦ చెయ్వులు ధర్మవిలాసభాసనా
యత్తము లుత్తమంబు విన♦యంబు నయం బినయంబు మూలకున్
విత్తము నిత్యము న్నిగమ♦విత్తము లెన్నఁగ నిష్టదేవతల్
మత్తగజేంద్రయాన విను♦మా భువి సజ్జనుఁడైనవానికిన్. 1204
ఉ. ఉత్తముఁడైనవాఁడు విభ♦వోన్నతి గల్గిన నంత కంత క
త్యుత్తమవృత్తిచే వెలయు♦ మందుఁడు గాని యఖర్వగర్వదు
ర్వృత్తికి నేల వచ్చు రజ♦నీశునకున్ గళ లెక్కువైన లో
కోత్తరరీతిచే నమృత♦మూరక వేఁబొక నారి గల్గునే. 1205
సీ. కామంబు కామారి ♦ కారుణ్యరూపచింతారత్నలాభయ♦త్నంబు నొంద
క్రోధంబు బోధాన♦రోధకరాత్మసంతానశిక్షాంకుశ♦న్యాసము నంద
లోభంబు సురలోక ♦ వైభవప్రియకారి, ఘనపుణ్యవిత్తసం♦గ్రహము నంద
మోహంబు యోగిసం♦దోహమోహనశక్తి, కాంతానితాంతసం♦గమము నంద
గీ. ముదము చిదమేయహృదయస♦మ్మదము నంద, ప్రకటమాత్సర్యము ప్రమా♦తకము లంద
కాని వేఱొక్కచోటఁ జాఁ♦గంగనీని, యతఁడు సజ్జనుఁ డొకఁడు ప♦ద్మాయతాక్షి.
సీమంతినీకళ్యాణము, ఆ 2.

# దుర్జనపద్ధతి

మ. కరుణాలేశములేదకారణమె యు♦గ్రంబైనకోపం బిడున్
బరనారీపరవిత్తవాంఛితము లా♦త్మన్ నిత్యమున్ జేయు నే
మఱు విద్వజ్జనబంధుబృందము నలం♦పన్ జూచు నిష్ఠూరతఁ గ
ల్లరియౌ వానిగుణంబగున్ సురభిపు♦ల్లా నీతివాచస్పతీ. 1207
మ. బహువిద్యావిభుఁడయ్యు దుష్టజనుఁ డె♦చ్చోటన్ విసర్జ్యుండుగా
ని హితుం జేసికొనం దగండు ఫణమా♦ణిక్యోజ్జ్వలంబయ్యు న
య్యహి సంత్యాజ్యమె కాని చేకొనఁగ న♦ర్హంబే విభాస్వద్దయా
లహరీనిర్ఝరిణీశ్వరా సురభిమ♦ల్లా నీతివాచస్పతీ.
భర్తృహరిసుభాషితము, ఎ. బా. 41, 42.

తే. విద్యచే భూషితుండయి ♦ వెలయుచున్నఁ, దొడరి వర్జింపనగుఁ జుమీ ♦ దుర్జనుండు
చారుమాణిక్యభూషిత♦శస్తమస్తకంబుగల పన్నగము భయం♦కరముగాదె.

శా. హ్రీరమ్యుం జడుఁగాఁగ సువ్రతుని మా♦యింగా శుచిం దంభిఁగా
శూరున్ నిర్దయుఁగా మునిన్ విమతిఁగా ♦ శ్రోత్రప్రియాలాపు ని
స్సారుంగా బలవంతు గర్వితునిగా ♦ సద్వక్త వాచాలుఁగాఁ
గ్రూరుం డెన్ని సుధీగుణంబు దురితా♦రూఢంబుఁ జేయుం గదా. 1210

చ. దినమలినాంగుఁడైన హిమ♦దీప్తియుఁ బ్రాయముదప్పు నాతియున్
వనరుహశూన్యమౌ కొలను♦వర్ణితరూపు నిరక్షరాస్యమున్
ధనపరుఁడైనరాజు సత♦తంబును లేమిని గుందు సాధువున్
జనపతిచెంతదుర్జనుఁడు ♦ శల్యము లేడివి నామనంబునన్. 1211

భర్తృహరిసుభాషితము, ఏ. ల. నీతి. పద్య 43, 45.

ఉ. కారణ మింతలేకొకరిఁ♦గాంచినఁ గిన్క వహించు టాత్మని
ష్కారుణికత్వ మొందు టొరు♦కాంతఁ దలంచుట లన్యవిత్తముల్
గోరుట బంధులన్ సుజను♦లన్ గనుమేలు సహింపకుండుటల్
గ్రూరవిచారులౌ నరుల♦కున్ మృషగాదు స్వభావసిద్ధముల్. 1212

చ. లలితకళావిలాససమ♦లంకృతుఁడైనను దుర్జనుండు చెం
తల వసియింపఁగాఁ దగఁడ♦నర్హుఁడువానిఁ ద్యజింపనే తగున్
గళిత నవారుణారుణ ధ♦గద్ధగితోరుఫణామణిప్రభల్
గలవని చెంతనున్న భయ♦కంప మొనర్పదె సర్ప మేరికిన్. 1213

చ. పగలిటఁ గాంతిలేనిశశి♦ప్రాయము దీఱినభామ పద్మినిం
దగులమి రిత్తయౌ కొలన♦నక్షరరూపవదాస్యమున్ ధనా
శగలప్రభుండు లేమి నని♦శంబుఁ గృశించుబుధుండు భర్తయౌ
లగముననుండు సూచకుఁ డి♦లన్ విడఁగూడనిసప్తశల్యముల్. 1214

భర్తృహరిసుభాషితము, పుష్ప. తి. ప 41, 42, 45.

ఉ. కోపము వానిసొమ్ము ఘనుఁ♦గొంచెము సేయుట వానివిద్య చూ
పోపమి వానివృత్తి పరు♦షోక్తియె వానిగుణంబు సాధుసం
తాపము వానిసంతసము ♦ దంభము వానికి గన్నతల్లి యా
పాపపు దుర్జనుం దలఁచు ♦ పాపము వాయ నుపాయ మున్నదే. 1215

సీ. పరధనముకన్న రుచిరమైన ♦ భక్ష్య మేది, సూచకునికన్న ననువైన ♦ చుట్ట మేఁడి
సాధుజనబాధకన్న న♦త్సాహ మేది, దుష్టజనునకు నెన్నంగఁ ♦ దోషుజాడ్కి.

ఆ. వె. పరుని సద్గుణంబుఁ బరమాణువుగఁ జూచు, వొద్ది కొండ సేయు నిర్గుణంబు
నాత్మవినుతియందు నత్యంతరసికుండు, దుర్జనుండు [illegible] తోయజాక్షి. 1216

సీమంతినీకల్యాణము, ఆ 2.

# మూర్ఖపద్ధతి

క. తెలియనినరుఁ దెలుపఁగనగుఁ, దెలిసినమానవుని వలదు తెలుపఁగ మదిలోఁ
దెలిసియుఁ దెలియనికఱటికిఁ, గలితన మెఱిఁగింపఁ గమలగర్భునివశమే. 1217

పంచతంత్రము, వేంక. ఆ 1.

శా. కాలాహిం దలఁదాల్పవచ్చు విరిహాంకానందరంగద్వహ్నో
జ్వాలంబైనపయోధిఁ జేతులనెయీఁదన్వచ్చు నక్రోగ్రదం
ష్ట్రాలగ్నంబగుమానికంబు హరియింపన్వచ్చు నెట్లేని మూ
ర్ఖాళిం దెల్పఁగరాదు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 1218

మ. వసుధం గుంటెటికొమ్ము తెచ్చుకొనఁగావచ్చుం బ్రయత్నంబునన్
వెసఁ ద్రావన్ జల మెండమావులనెయేనిం గాంచవచ్చున్ నిజం
బిసుక న్నూనియుఁ బిండవచ్చుఁ బ్రతిభాహీనాత్ముఁడౌ మూర్ఖుఁ దె
ల్ప సమర్థత్వము లేదిలన్ సురభిమల్లా నీతివాచస్పతీ. 1219

మ. దిరిసెంపున్విరిచేత వజ్రమణి భేదింపందలంచున్ మద
ద్విరదేంద్రంబు మృణాళతంతువున బంధింపంగ నూహించు మా
ధురి నింపంజనుఁ దేనెచే లవణపాథోరాశికిన్ మూర్ఖుఁ దె
ల్ప ఋజూక్తిం బిడువాఁడు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ.

భర్తృహరిసుభాషితము, ఏ. బా. ప 4-6.

ఉ. అజ్ఞుఁడు సజ్జనోక్తు లెటులైన వినున్ సులభంబుగా విశే
షజ్ఞుఁడు దెల్పినంత సరసస్థితి నూఁకొను జ్ఞానలేశదు
ర్విజ్ఞల దుర్విదగ్ధుఁడగు పామరుఁ డేగతిఁ దెల్పఁబోయినన్
బ్రాజ్ఞతఁ జెందఁ డజ్ఞుఁడని బ్రహ్మయు రంజిలఁజేయ నోపునే. 1221

చ. మకరముకోఱనున్న పెను మానికమైన హరింపవచ్చు దు
శ్శకచలదూర్మిఘోషమగు సాగరమైనఁ దరింపవచ్చుఁ దు
త్ప్రకుపితభోగినైనఁ బువుదండవలెన్ దలఁ దాల్పవచ్చుఁ బా
యక ప్రతికూలమూర్ఖహృదయంబది త్రిప్పఁగరాదొకప్పుడున్. 1222

చ. ఇసుకఁ బ్రయత్నతన్ బిడిచి • పెచ్చుగఁ దైలముఁ గ్రాఁచవచ్చుఁ జే
ష్టైసఁగెడు దప్పి స్రుక్కి మృగ•తృష్ణజలంబులు గ్రోలవచ్చు నల్
దెసలఁ జరించి యెక్కుడు • దేవొరకున్ శశపున్విషాణమున్
బొసఁగదు దుర్వివేకియగు•మూర్ఖునిచిత్తము ద్రిప్ప నేరికిన్.

క. తెలియనిమనుజుని సుఖముగఁ, దెలుపందగు సుఖతరముగఁ • దెలుపఁగవచ్చున్
దెలిసినవానిం దెలిసియు, దెలియనినరుఁ దెల్ప బ్రహ్మ• దేవునివశమే.

చ. మకరముఖాంతరస్థమగు • మానికముం బెకలింపవచ్చుఁ బా
యక చలదూర్మికానికర•మైన మహోదధి దాఁటవచ్చు మ
స్తకమునఁ బూలదండవలె • సర్పమునైన ధరింపవచ్చు మ
చ్చిక ఘటియించి మూర్ఖజన•చిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్. 1225

గీ. తివిరి యిసుమునఁ దైలంబుఁ•దీయవచ్చుఁ, దవిలిమృగతృష్ణలో నీరుఁ• ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సా•ధింపవచ్చుఁ, జేరి మూర్ఖులమనసు రం•జింపరాదు.

మ. కరిరాజున్ బిసతంతుసంతతులచేఁ • గట్టన్ విజృంభించువాఁ
డురువజ్రంబు శిరీషపుష్పములచే • నూహించు భేదింపఁ దీ
ప రచింపన్ లవణాబ్ధికిన్ మధుకణ•ప్రాప్తిం బ్రవర్తించు ని
ద్ధరణిన్ మూర్ఖులఁ దెల్పునెవ్వఁడు సుధా•ధారానుకారోక్తులన్. 1227

గీ. స్వవశము హితంబు మూఢతా•చ్ఛాదనంబు, గాఁగ నీగతి నిర్మించెఁ•గమలభవుఁడు
సర్వవిదులగు సుజనుల•సభలలోన, మౌనమె విభూషణము మూఢ•మానవులకు.

చ. జలముల నగ్ని ఛత్రమునఁ • జండమయూఖుని దండతాడనం
బుల వృషగార్దభంబులను • బొల్వగుమత్తకరీంద్రమున్ సృణిన్
దలఁగెడు రోగమౌషధము•చే విషముం దగుమంత్రయుక్తి ని
మ్ములఁ దగఁ జక్కఁజేయనగు • మూర్ఖునిమూర్ఖత మాన్పవచ్చునే. భర్తృ ఏ ల.3-11.

## —• దుర్జనసజ్జనమైత్రి •—

ఆ. మంటికడవఁబోలె • మఱిదుర్జనస్నేహ, మధికశీఘ్రముననె•హత్తు విరియుఁ
గనకకలశభాతిఁ•గల సజ్జనస్నేహ, మొదవుఁ బగులఁబడక•పదిలమగును. 1230

పంచతంత్రము, నారా. సుహృ. ప 57.

గీ. మొదలఁ జూచినఁగడుగొప్ప•పిదపఁగుఱుచ, యాదిఁగొంచెముతర్వాత•నధికమగుచుఁ
దనరుదినపూర్వపరభాగ•జనితమైన, ఛాయపోలికఁగుజనస•జ్జనులమైత్రి. 1231

భర్తృహరిసుభాషితము, ఏ. ల. ప 50.

—♦ మూర్ఖసహవాసము ♦—

గీ. ఎఱుకగలవానిపొందైన♦నెందు నమరు,నతఁడుకపటాత్ముఁడయ్యె నే♦నదియుఁగాదు
మూర్ఖుతోఁ గూడి దొలఁగఁడు ♦ మూర్ఖశకుని,సఖ్యమెన్నఁడుకొఱగాదు♦సజ్జనులకు.
పంచతంత్రము, నారా. మిత్ర. ప 516.

# సజ్జనసాంగత్యము

గీ. అన్యధనములు దగినప్ర♦యత్నములను, మించుగా మానవులకు ల♦భించుఁగాని
యనఘ సజ్జనసాంగత్య♦మనుమహాధ,నంబు గల్గుట యది దుర్ల♦భంబు గాదె. 1232

క. మునివరసంసారులకును, ఘనతరభయనాశనములు ♦ కలుషచయవినా
శనములు నిరతము శుభసూ,చనములు గద సాధుజనుల ♦ సందర్శనముల్. 1233
కుబ్జాకృష్ణవిలాసము, ఆ 4.

సీ. అభినవాగణ్యపు♦ణ్యాపాదకంబులు, నఖిలాఘజలధిదా♦వానలములు
అలఘుచేతస్సంశ♦యచ్ఛేదకంబులు, సభ్యకర్ణపుటీర♦సాయనములు
అత్యంతసంస్తుత్య♦సత్యాశ్రయంబులు, నమితశాస్త్రాశయ♦వ్యంజకములు
నంగీకృతస్వరూ♦పాంతరామ్నాయముల్, నిఖిలధర్మాధర్మ♦నిర్ణయములు
గీ. వర్ణ్యవైభవభవదీయ ♦ వదనకమల, గదితపూర్వకథాసుధా ♦ కల్పఫణితు
లనఘ మీవంటి పుణ్యవ♦ర్తనులతో స,మాగమముకన్న మిగుల భా♦గ్యంబు గలదె.
నారాయణాచలమాహాత్మ్యము, ఆ 1 ప 121.

చ. కరఁగిన వెల్లలోహములు ♦ గ్రక్కునఁ గూడు నిమిత్తమాత్రమై
జరగుటఁజేసి పక్షిమృగ♦సంతతిగూడు భయంబు లోభమున్
బరగుటఁజేసి మూర్ఖసుల♦భంబునఁ గూడు గుణాఢ్యులైన స
త్పురుషులు చూచినంతటనె ♦ పొందొనరింతురు మనూ హిరణ్యకా. 1235
పంచతంత్రము, నారా. సుహృ. ప 57.

మ. మతిజాడ్యం బడఁచున్ నిజంబుగఱపున్ ♦ మానోన్నతిన్నించు దు
ష్కృతముల్ ద్రుంచు మనఃప్రసాదమిడుఁ గీ♦ర్తిస్ఫూర్తి గావించు నీ
క్షితి నార్యుండు తదీయసంగతినెయిన్ ♦ సిద్ధించుసర్వార్థముల్
ప్రతిభానూత్నఫణీశ్వరా సుకవిభు♦ల్లా నీతివాచస్పతీ.

మ. మనుతన్ గూడిననీళ్లకున్ నిజగుణంబు♦ల్ పాలిడున్ బాలుగ్రాఁ
గునెడన్ వాని నటించి యజ్జలము గ్రాఁ♦గున్ దానె తన్మాత్రనా

శీతమునన్ గన్గొని వహ్నిఁగూలఁజనుఁ బాల్ ♦ శాంతం బొనర్చున్ జలం
బనయాం బిట్టివి సఖ్యముల్ సురభిమ♦ల్లా నీతివాచస్పతీ. 1437

భర్తృహరిసుభాషితము, ఎ. బా. ప 19, 68.

సీ. సత్యవాక్కి ఘటించు ధీ♦జడిమ మాన్చు, గౌరవమొసంగుజనులకుఁ♦గలుషముడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁ జిత్తవి♦స్ఫూర్తిఁ జేయు, సాధుసంగంబు సకలార్థ♦సాధనంబు.

ఉ. క్షీరము మున్ను నీటి కొసఁ♦గెన్ స్వగుణంబును దన్నుఁ జేరుటన్
క్షీరము దప్తమౌట గని ♦ చిచ్చుతికెన్ వెతచే జలంబు దు
ర్వారసుహృద్విపత్తిఁ గని ♦ వహ్నిఁ జొరంజనె దుగ్ధ మంతలో
నీరముఁగూడి శాంతమగు ♦ నిల్చు మహాత్ములమైత్రి యీగతిన్.

భర్తృహరిసుభాషితము, ఏ. ల. నీతి. ప 20, 67.

చ. వినయము నేర్పుఁ బాతకపు♦వృత్తికిఁ జిత్తము హత్తనీదు పా
వనత ఘటించుఁ గ్రుంచుబల♦వంతపువంత పురాణధర్మవ
ర్తనము తెఱం గెఱుంగనివి♦ధంబు నడంచి ముదంబు గూర్చుఁ స
జ్జనుని సమాగమంబునకుఁ ♦ జంద్రముఖీ సుమేధ మేదినిన్. 1240

సీమంతినీకళ్యాణము, ఆ 2.

గీ. సజ్జనసమాగమంబుతో ♦ సాటిసేయఁ, దగవు జగములలోపల♦దానధర్మ
సత్యవచనతపోయాగ♦శతములైన, నదియ నిశ్శ్రేయసనిదాన♦మగుటఁ జేసి.

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 1.

శా. సత్సంగంబునఁ జేయుచుందురు జనుల్ ♦ సత్కర్మముల్ సంతతా
త్యుత్సాహంబునఁ బుణ్యకర్మఫలసం♦యోగంబునన్ శాంతులై
సత్సంతానపరంపరానుగతులై ♦ సౌజన్యసంవేద్యులై
సత్సంజ్ఞానవివేకులై నియతులై ♦ సర్వజ్ఞులై ముక్తులై. 1242

సీ. సత్సంగవశమున ♦ చర్చచేసినయట్టి, బుద్ధియుక్తంబైన ♦ బోధచేత
కడఁగి భక్తిజ్ఞాన♦కర్మముల్ దెలిసిన, యతనికిఁ దెలియు దే♦హంబుకొలఁది
దేహసంస్థావంబు ♦ దెలిసినయతనికి, ధర్మార్థకామముల్ ♦ దనరుచుండు
ధర్మార్థకామముల్ ♦ దనరినయతనికి, మోక్షంబుపైబుద్ధి ♦ మొనసియుండు

ఆ. మోక్షబుద్ధిగలము♦ముక్షువులకు నెల్లఁ, దత్త్వభేదమందుఁ ♦ దలఁపు గలదు
తత్త్వభేద మెఱుఁగఁ♦దలఁచినయతని కానందమయప్రశాంతి♦నందఁగలుగు.

విజ్ఞానప్రదీపిక, ఆ 1.

## దుర్జనసజ్జనతారతమ్యము

గీ. తనకు మేలొనరించు బాం♦ధవునకైనఁ, దోడనే కీడు చింతించు ♦ దుర్జనుండు
తనకుఁ గీడొనరించు శా♦త్రవునకైనఁ, జాలమేలు విచారించు ♦ సజ్జనుండు.

ఉ. కారణమేమిలేక యప♦కారము సేయు దురాత్ముపోలికన్
గారణ మేమిలేక యుప♦కారము సేయు మహాత్ముఁ డెంతయున్
గారణ మేమిగల్గెఁ శిఖి♦కానన మంతయు నీరుసేయఁగాఁ
గారణ మేమి గల్గె శశి♦కైరవముల్ వికసింపఁ జేయఁగన్ 1245

గీ. దుర్జనుని కల్మి దురితంపుఁ♦ద్రోవ కగును, సజ్జనుని కల్మి పుణ్యంపు♦సరణి కగును
పాముబలిసిన గరళంబు ♦ ప్రబల మగును, గోవు బలిసిన దుగ్ధంబుఁ♦ గురియుచుండు

ఉ. వైకొని దుర్జనుండు కడు♦బాంధవుఁడౌ దురాత్ముతోడనే
కైకొని సజ్జనుండు చెలి♦కార మొనర్చు మహాత్ముతోడనే
ఘూకము లంధకారమునఁ ♦ గూడి చెలంగవొ! చక్రవాకముల్
లోకవిలోచనంబుఁ దప♦లో విమలోన్నతిమైత్రిఁ బూనవో!

చ. ఒరునకు నెద్దియేని ప్రణ♦యున్నవిశాలము సేయు హీనుఁడౌ
నరుఁ డడిగప్పు సజ్జనుఁడు ♦ న్యాయమునన్ బరికింప నీగతో
సరియగువాఁడు వాఁడు బలు♦సత్త్వము మీఱిన యౌషధంబుతోఁ
దరమగువాఁ డితండు వసు♦ధాతలనాథకుమారికామణీ. 1248

గీ. కలుగకుండిన నీఁజాలు♦ఘనుఁడు గొంకండు, కలిగియుండియు నీలేని ♦ ఖలుఁడు గొంకండు
నుత్తమాధము లనఁగ♦ వ్యక్తులైన, యజుని యాయాస మణఁగించు♦నట్టివారు.

సీమంతినీకళ్యాణము, ఆ 2.

## ధనప్రాముఖ్యము

క. ధనమూలము జగమంతయు, ధనవంతుని కిష్టమగుప♦దార్థము లెల్లన్
దనచేతిలోని వగుటను, ధనమార్జింపంగ నెవ్వి♦ధంబున వలయున్.

క. శ్రీమంతుఁడె కులవంతుఁడు, శ్రీమంతుఁడె సుభగరూప♦జితకంతుఁడునౌ
శ్రీమంతుఁడె గుణవంతుఁడు, శ్రీమంతుఁడె సిద్ధశేము♦షీమంతుండున్. 1251

సీ. సంరక్ష సేయని ♦ స్వర్ణమున్నూడె చెడు, వృద్ధిఁబొందింపని ♦ విత్తమెడయు
ననుభవింపరాని ♦ యర్థంబు గల్గియు, నేనిఫలమోగాని ♦ లేదు సుఖము
తగనుపార్జించియు ♦ ధనము పాత్రుల కీక, దక్కుచో నిడిన సం♦రక్ష యడియె

నిండి చెఱువుపస ♦ నెరయవాటముగాఁగ, నలువులు దీర్చిన ♦ యట్లు కాన
గీ. ధనము లార్జించి సంరక్ష ♦ తగ నొనర్చి, వృద్ధిఁ బొందించి యనువుగా ♦ వెచ్చపఱిచి
నడవనేర్చినవానిజ ♦ న్మంబు సఫలము న్నవారలజీవన ♦ మెన్న నేల. 1252
క. కలవాఁడె చెలులు చుట్టలు, కలవాఁడగు నతఁడు బుద్ధి ♦ గలవాఁడునగున్.
లలి నతఁడె లోకపూజ్యుఁడు, బలవంతుఁడు నతఁడె వంశ ♦ పావనుఁ డెందున్.
క. పరదేశమె నిజదేశము, పరులే బాంధవులు ద్రవ్య ♦ పరిపాలునకున్
ధరణి నసాధ్యం బెయ్యది, పరమార్థము ధనము సూవె ♦ ప్రజలకు నెల్లన్. 1254
సీ. ఒకవేళ దాత యా ♦ చకవృత్తి నైయుండు, యాచకుం డొకవేళ ♦ నగును దాత
యొకవేళ శాత్రవ ♦ నికరంబు భంజించు, నొకవేళ నిలువక ♦ యోడిపోవు
నొకవేళ సంపద ♦ నుప్పొంగుఁ బై పయి, నొకవేళఁ గడులేమి ♦ నొందియుండు
నొకవేళఁ బుత్త్రమి ♦ త్త్రకళత్రయుతుఁడగు, నొకవేళ నొక్కఁడు ♦ నొదిఁగియుండు
గీ. హెచ్చుకుందులు తెలుచుగా ♦ నెల్లయెడల, నెవ్వరికినైనఁ గలుగు వో ♦ నివ్విధమున
భాగ్యవంతుఁడు కొనసాగి ♦ బ్రతికియుండు, ధాత్రి యదిగాన భాగ్యప్ర ♦ ధానపరయ.

పంచతంత్రము, నారా. మిత్ర. ప 70. సుహృ. ప 104, 138.

క. అర్థమునఁ బండితుండగు, నర్థమునం బలసమగ్రుఁ ♦ డగు నర్థమునన్
బార్థివుఁడగుఁ బుణ్యుండగు, నర్థమునను భువనపూజ్యుఁ ♦ డగు నరుఁ డెందున్.
ఆ. అన్వవాయవృద్ధు ♦ లాచారవృద్ధులు, శౌర్యవృద్ధు లిద్ధ ♦ సత్యవృద్ధు
లాగమార్థవృద్ధు ♦ లఖిలార్థవృద్ధులు, కొలుతు రర్థవృద్ధుఁ ♦ గోరిఁ వేఁడి.
చ. కనకముఁగూర్చి యెన్నఁబడుఁ ♦ గాదె సమస్తగుణంబు లర్థమె
వ్వనికి వసుంధరం గలదు ♦ వాఁడె కులీనుఁడు వాఁడె పండితుం
డనఘుఁడు వాఁడె వాఁడె సక ♦ లార్థవిధిజ్ఞుఁడు వాఁడె వక్త వాఁ
డె నయపరుండు వాఁడె ప్రక ♦ టప్రియభాషణుఁడుం బ్రసిద్ధిగన్. 1258
క. కలవానికిఁ జుట్టంబులు, గలరు హితుల్ గలరు భటులు ♦ గల రఖిలంబున్
గలదు మతిలేనియట్టిది, కలవానికి నీడు జోడు ♦ కలదా జగతిన్.

పంచతంత్రము, వేంక. ఆ 4.

శా. పోవున్ జాతి యధోగతంబయి కడున్ ♦ బోవున్ సదాచారస
ద్భావం బన్వయశుద్ధి నిష్ఫలమగున్ ♦ బాహాబలశ్రీ వృథా
భావంబొందు గుణానుభావము తృణ ♦ ప్రాయంబగున్ నిర్ధనుం
డౌ వాఁడెన్నిట ముఖ్యుఁడౌ సురభిమ ♦ ల్లా నీతివాచస్పతీ.

మ. ఘని యెవ్వాఁడగువాఁడె సత్కులజుఁడున్ వే॰ధాశాలి సర్వార్థవ
ర్మనుఁ డత్యుజ్జ్వలమూర్తి యప్రతిమవా॰గ్జాలుండు సర్వజ్ఞుఁడౌ
ననఁగా శోభిలు నెల్లసద్గుణము ల॰క్ష్మైకాశ్రయంబుల్ సుమీ
యనిశశ్రీజిత వాసవా సురభి మ॰ల్లా సేతివాచస్పతీ. 1261

భర్తృహరిసుభాషితము, ఎ. బా. ప 32, 33:

ఉ. జాతి దొలంగుఁ గాత గుణ॰శక్తి రసాతలసీమకుం జనుం
గాత కులంబు బూదియగుఁ॰ గాత నగంబున నుండి శీలముం
బాతముఁ జెందుఁగాత బహు॰ధంగుల విత్తమె చూపు మేలు వి
ఖ్యాతగుణంబు లెల్లఁ దృణ॰కల్పము లొక్క ధనంబు లేవడిన్.

క. ఏనరునకు విత్తముగల, దానరుఁడు కులీనుఁ డధికుఁ॰ డార్యుఁ డతండే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి, నానాగుణగణము కాంచ॰నంబున నిలుచున్.

భర్తృహరిసుభాషితము, ఏ. ల. నీతి. 32, 33.

చ. కులము రసాతలస్థగిరి॰గూలిన మంచిగుణం బధోగతిం
బొలసిన శీల మద్రితట॰భూమిని జాఱి విదగ్ధమైన ద్వి
ట్కులహరశౌర్యమందు పిడు॰గుల్ పడినన్ గడు మేల్ ధనంబె కా
వలె నది లేనిచోఁ దృణల॰వంబులుగా గుణకోటు లెన్నియున్. 1264

ఉ. వాఁడె కులీనుఁ డుత్తముఁడు॰ వాఁడె రసజ్ఞుఁడు వాఁడె యార్యుఁడున్
వాఁడె బహుశ్రుతుండు మఱి॰ వాఁడె గుణాఢ్యుఁడు వాఁడె వక్తయున్
వాఁడె సురూపియంచు ధన॰వంతుని నందఱు నెంతు రెంతయున్
బోఁడిమిగాన సర్వగుణ॰ముల్ కనకాశ్రయభూతముల్గదా.

భర్తృహరిసుభాషితము, పుష్ప. తి. ప 31, 32

# ధ న ని ర స న ము

గీ. జలములందు మత్స్యంబులు॰ చదలఁ బక్షు, లామిషముఁ జెట్లు భక్షించు॰నట్లు భువిని
యెల్లవారును జేరి య॰నేకవిధుల, ననుదినంబును భక్షింతు॰ రర్థవంతు.

క. అర్థము యనర్థమూలం, బర్థము మాయావిమోహ॰నావహము సుమం
డర్థార్జనదుఃఖమున నపార్థీకృతజన్ముఁ డగుట॰ పరమార్థ మిలన్. 1267

భారతము, ఆరణ్య. ఆ 1 పద్య 27, 28.

క. ధనము కలిమియు లేమియుఁ॰ ద్రాసునందు, నిలిపి యొత్తంగ మునులు నా॰నిర్ధనత్వ
మెక్కుడై దానిదిక్కున॰ నెట్టు లన్న. వినుము గుణదోషములభంగి॰ విస్తరింతు.

క. ధనము గలవానిఁ భృత్యులు, దనమున నున్నట్లు భయము ♦ దనచిత్తమునం
దనుకంగ నుల్లల మురుకను, విను శిఖిచోరాదిముఖ్య ♦ వివిధాపదకున్.

క. కోపంబును లోభంబును, నేపారి మనంబు గలఁప ♦ నెప్పుడుఁ జింతా
తాపంబు నొందు సధనుం, డాపదగా నవ్విధము సు♦ఖావహ మగునే. 1270

క. ఎక్కోటి నైన నధనుఁడు, విచ్చలవిడి నుండు లేదు ♦ వెఱపిం చుకయుం
బొచ్చెపుఁ జందం బొల్లఁడు, మెచ్చరె సుర లైనఁ బలుకు♦మృదువై యుండున్.

క. లోకము చందము గనికొని, యీకాననఁగ నగుధనాదు♦లెల్లను గాల
వ్యాపలతఁ బొందఁ గలయవి♦గా కుండమి యెఱిఁగి విడువు♦గడుఁ జదు రెందున్.

క. ధనవత్త్వము దుఃఖకరం,బని కని తత్కాంక్ష విడుచు♦నతని కధనతా
జనితాత్మాధీనత్వం, బనుపమసౌఖ్యంబు సేయు♦నక్షీణముగన్.

భారతము, శాంతి. ఆ 4 పద్య 33_38.

సీ. శాల్యోదనాపూప♦సద్యోఘృతంబులు, మెసఁగ మేనునఁ గండ♦మెండు గలిగి
రక్త మాంస పరిపూ♦ర్ణత నింద్రియంబులు, ప్రబల మోహంబు లో♦భంబు నిగుడ
దార సుతుల యందుఁ ♦ దనివి చాలక బహుద్రవ్యమందు నపేక్ష ♦ దారసిల్లు
మున్నె "యర్థాతురా♦ణాం న గురు ర్న బంధు" వనెడి వాక్యంబు♦తోడుఁగాఁగ
గీ. బేదలకు బాంధవులకును ♦ బెట్టులుడిగి, పరమ నాస్తికు లై జనుల్ ♦ బ్రదుకు నాస
పడి చెడుదు రంతమున జము♦బారిఁ ద్రెళ్లి, జీవులకు దొడ్డ సంపదల్ ♦ చేటుగావె.

ఆ. ధనముఁ గూర్చి నరుఁడు♦తస్కరుల్ క్షత్రియు,లపహరింతు రొక్క♦యనికృశించు
స్త్రీల నేలు వాండ్ర♦చిత్తంబు లేనెపై, బొజునో యటంచుఁ ♦ బరితపించు.

ఆ. పేర్మి నదురు గుండె ♦ పిక్క చెదరు లేక, యుండవచ్చుఁ బేద♦యులుకుఁ దక్కి
రమణ «గోచిపాఁత♦రాయఁడు దొంగల, మిండఁ» డనెడు మాట♦మేలు దెలిసి.

కుచేలోపాఖ్యానము, ఆ 3 పద్య 43, 44, 47.

ఉ. కన్నులఁ జూపు గల్గినను ♦ గాంచఁగ నీ దెసురైన వీనులన్
బన్నగ విన్కి గల్గిన ద♦వన్విన నీ దిఁక నోరు పల్కఁగా
నున్నను బల్క నీవు మఱి♦యున్నను జేతులు మ్రొక్క నీదు సం
వన్నని గర్వ మత్తవులఁ ♦ బాపెడి లేవడి యేన్ విరక్తుఁ డేన్. 1277

క. కలిమినిఁ గలిగెడు గర్వము, వలు దర్పము దానిఁ దోఁ♦చతి విరాగుం
డలుక నిడు శాప మవు మను, వల గామెడలెడును మేల♦యవుఁ గాదె కనన్.

బిల్వేశ్వరీయము, ఓఁబ. ఆ 3. పద్య 15, 16.

సీ. కామరోగాది దు♦ష్కర శత్రు వర్గ ప్రతాప ప్రధ్వంస సా♦ధనము ధనము
జన్మ పరంపరా♦సంపాదితానేక, ఘన కర్మ జాల ద♦హనము ధనము
కైవల్య సంప్రాప్తి♦కారణ వైరాగ్య, ధర్మమార్గానువర్తి♦ధనము ధనము
సకలావ గుణ పుంజ♦సంశ్రయాశా దూష, ణాయుత నిఖిల బం♦ధనము ధనము
గీ. కలిగి గర్వంబు దొట్టి దుః♦ఖంబు మదికిఁ, జెనుచు సజ్జ్ఞాన పావకేం♦ధనము ధనము
స్వప్న లబ్ధ పదార్థంబు ♦ చందమునను, దలఁచి చూడంగ వట్టి బం♦ధనము ధనము.

కవిరాజమనోరంజనము ఆ 1.

ఉ. లజ్జఁ దొలంపు శీలముఁ గు♦లంబు వడి న్విడిపించు దూష్యకం
బుజ్జనసేయుఁ జేయు మొగ♦మోటమిఁ గూలుచుఁ బాతకంబులన్
మజ్జన మాచ్చి నార్చు నభి♦మానము గోఁతల కియ్యకొల్పు నీ
ముజ్జగమైనఁ ద్రిప్పుఁ దుది♦ముట్టను దా ధనకాంక్ష యోచకిన్. 1279

కవికర్ణరసాయనము, ఆ 5 ప 121.

సీ. నెమ్మనితిమిరంబు ♦ నేత్రగోళంబుల, పర కర్ణపుటముల ♦ బ్రత్తి నోరి
వాకట్టు మందు గ♦ర్వలతాలవాలంబు, వినయకృత్యంబుల ♦ వేరువిత్తు
కరుణారసంబు తే♦క్కలి కాఁడు మదివొక్క, పాతకంబులపాలి♦పట్టుగొమ్మ
మొగమాట మడుగని♦పగ రాజసంబుల, యిక్కువ గురుసేవ♦కెదురుచుక్క
గీ. పరుషవర్తన మునికి లో♦భంబు టెంకి, బాంధవస్నేహసింధూర♦పాలకంబు
కలశపాథోధిపుత్త్రి క్రేఁ♦గంటిచూడ్కి, గాని రాజుల నేరమి♦ కాఁగుసువ్వె.

రాజశేఖరచరిత్రము, ఆ 2 ప 21.

క. ధనమున రిపుషడ్వర్గము, జనియించును గర్వ మెచ్చు♦ సద్బుద్ధి చెడున్
ఘనరాజచోరభయములు, ననిశము ఘటియించుఁ బ్రాణ♦హానియుఁ గల్గున్.

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 4 పే 95.

# దారిద్ర్యము

క. కులసతి రోయును చుట్టంబులు వాయుదు రొరులు గష్ట♦పుంబలుకుల ని
మ్ముల నాడఁ దొడఁగుచుందురు, కలియుగమున ద్రవ్యహీనుఁ♦గలకాలంబున్.
క. మృతిఁజెందిన జనునైనను, హితులెల్లను డాయుదురు మ♦హీస్థలి లోనన్
మతిఁ దలఁపఁ బేదఁ జేరరు, బతిమాలిన నైన సఖులు ♦ బంధులు నెపుడున్. 1283
సీ. వటులు దారిద్ర్యంబు♦వలన సిగ్గు జనించు, సిగ్గున సత్త్వంబు ♦ శిథిల మగును
సత్త్వహీనుఁడు తిర♦స్కారదూషితుఁ డగుఁ, బరిభవయుక్తి స♦న్నరుఁడు వగడు

జెడిన వాఁడు నెవ్వగలచే దురటిల్లు, నధిక దుఃఖితు బుద్ధి యడఁగిపోవు
బుద్ధిహీనుండైనఁ ♦ బాడవడంగును వేగ, పాడ వడంగినఁ గీర్తి♦ యడఁగు ధాత్రి
గీ. నల్లు గావునఁ నిర్ధనుఁ♦డైనవాఁడు, బహువిధంబుల నీచెప్పఁ♦బడినయట్టి
యాపదల కెల్ల మూలమై ♦ యార్తిఁ బొందు, నెవ్విధంబుననతఁడెన్న♦నీఁడుగాఁడు.

పంచతంత్రము, దూ. నా. ఆ 2 పద్య 104, 116.

క. ధనహీనుఁ డధముఁ డల్పుఁడు, ధనహీనుఁడ మూర్ఖుఁ డప్ర♦ధానుఁడు ధరన
ధ్ధనహీనుఁడు తలపెట్టిన, పని గ్రీష్మసరిజ్జలంబు♦పగిది నడంగున్. 1285

పంచతంత్రము, వేంక. ఆ 3.

సీ. కులమహీరుహమహా♦కుఠారకుఠారంబు, కోపాగ్నివృద్ధిక♦ ద్ఘోరనాడి
సంసారసుఖశైల♦శతకోటిపతనంబు, దేహవ్యథాలతా ♦దోహదంబు
శశిముఖీదృక్పాత♦సంగోధిజంబీర, ఫలరసం బతిధైర్య♦ధర్మకషము
ప్రతిభాంబువృద్ధిగ్రీష్మ♦పవనంబు నిజవధూ,రచితనిందాపార ♦ నిచయఘనము
గీ. సంతతాహారిసంపాది♦సంభ్రమప్ర,యత్నవిఘ్నదమతను త్రస♦ధాత్రిదాయి
యమితఘుతాశ్రయస్థాన♦మై కడంగు, భూరిదారిద్ర్యదోషంబు♦పొడవెనపుడు.

హంసవింశతి, ఆ 2 ప 150.

సీ. రూపింపనిర్మల♦రూపంబు లెడలించు, రక్తమాంసములభా♦రము లడంచు
నుద్యోగములకునై♦యూహఁ జేరఁగనీదు, మగల కింతులకును ♦ బగలు సేయు
బహుళంబులైన లో♦భంబు లుత్పాదించు, సూనృతవాక్యంబుఁ ♦ జూఱవుచ్చుఁ
జాల దురాశావి♦చారంబుఁ గల్పించు, మానంబు చెడ బతి♦మాలిపించు
గీ. ననదృశానందవనమున♦కగ్నికీల, యతిశయాక్రాంతచింతావి♦హారణభూమి
భూరిదుఃఖములకు నెల్లఁ♦బుట్టినిల్లు, ప్రజలకును లేమికంటెఁ బా♦పంబు గలదె.

కుచేలోపాఖ్యానము, ఆ 1 పద్య 50.

# లక్ష్మీకటాక్షార్హులు

సీ. నిత్యసత్యులు శౌచ♦నిరతులు గురుభక్త, లప్రమత్తులు దక్షు♦లమలమతులు
సత్కర్మపరులు వి♦జ్ఞానముఁ దపము దానము బ్రహ్మచర్యంబు ♦ శమముఁ గల్గు
వారలు ప్రీతినా♦వసియించునిక్కలు, క్రూరు, నాస్తికుఁ గృత♦ఘ్నునిఁ గుబుద్ధి
వర్జింతు నెంగిలి♦వర్జించి యిలువడి, ఘటశుద్ధి గలిగిన♦కాంతలందు
గీ. నిల్తు వల్లభప్రతికూల ♦ నిష్ఠురాత్మ, నన్యమందిరగామిని ♦ నధికనిద్ర
రైనమానినిఁ దొఱఁగుదు ♦ నబ్జినీత,టాకతరుషండపుష్పనా♦టముల నిలుతు. 1288

సీ. ప్రసన్నపదములఁ • బొందియుండిన తన, సుందరస్మిత కటి • సుందరముగ
నుండి మాణిక్యవ • స్త్రోన్నతత్వము గుహ్యమునఁ జెంది భార్యాప్తి • మొదలిల
క్రోడాంగమున నెల • కొని సుతబహుస్పృష్టి, హృదయంబునొంది య • భీష్టసిద్ధి
గళమునవసియించి • కంఠభూషణలక్ష్మి, వదనాబ్జమున నిల్చి • ప్రసుతరాన్న
గీ. మంజువాక్యకవిత్వస • మగ్రకాంతి సుహితము గలుగంగఁ జేయుఁ దా • మస్తకమున
కరిగనేని రయంబున • నతని విడిచి, యతిముదంబున నన్యుని • నాశ్రయించు.
మార్కండేయపురాణము, ఆ 2 ప 286, 238.

ఉ. తాలిమిఁ గల్గి తాఁ బరుల • దైన్యము వాపుచు శాంతిఁ గ్రి సం
క్షాళితచిత్తుఁడయ్యుఁ దగ • సాహసకార్యము సేయ మైకొనం
జాలి పరోపకారియయి • సంపద కుబ్బనియాతఁ డెప్పుడున్ 1292
శ్రీలలనాకటాక్షసర • సీరుహధాముఁడు మంత్రిశేఖరా.
చారుచర్య, ప 67.

సీ. కలిమి దాఁపక మైత్రి • కంబుఁ జేసినవాఁడు, పుణ్యతీర్థము లాడఁ • బోవువాఁడు
వితరణశీలుండు • వినయంబు గలవాఁడు, పరకాంతలకు నాస • పడనివాఁడు
శూరత మెఱసి ప్ర • స్తుతికి నోర్వనివాఁడు, సత్యశౌచంబులు • సల్పువాఁడు
బాంధవపితృమాతృ • భక్తి జెందినవాఁడు, కిల్బిషంబులకు శం • కించువాఁడు
గీ. సప్తసంతానవిఖ్యాతి • జరగువాఁడు, నిఖిలభూతదయాసక్తి • నెగడువాఁడు
మేలు మఱవనివాఁడు ల • క్ష్మికిఁ బ్రియుండు, వానియొద్దనె హరియును • వదలకుండు
జైమినిభారతము, ఆ 3 పద్య 40.

## లక్ష్మీకటాక్షానర్హులు

క. వ్యవసాయరహితు సాహస, వివర్జితుని నుచితయత్న • విముఖుని నలసున్
దివిరి సిరి గవయ నొల్లదు, యువతిరత్నంబు వృద్ధు • నొల్లనిభంగిన్. చారుచర్య, ప 65.

ఉ. జూదరి దుష్టు దుర్వ్యసనుఁ • జోరుని సజ్జనదూషకున్ మృషా
వాదిఁ గృపావిహీను గృహ • వప్రవిఘాతకు లోభి సంతత
స్వోదరపూరకున్ ఖలు • నుద్ధతునిం బెడఁబాయు లక్ష్మి వే
దాదిసమస్తవిద్యలు ప • రాన్నపరాయణుఁ బాయునైవడిన్. 1294
క. వ్యతిపాతయోగమున వై, ధృతి సంక్రాంతులను బర్వ • దినములఁ దీర్థ
వ్రతచర్యలఁ జైత్యకముల, నతివలఁ గామించువాఁడ • నర్హుఁడు సిరికిన్. 1295
జైమినిభారతము, ఆ 3 పద్య 40, 44.

సీ. కుటిలులు పిశునులు ♦ గురుభక్తిశూన్యులు, కరుణావిరహితులు ♦ పరధనపర
దారాభిలాషులు ♦ ధర్మహీనులు కృతఘ్నులు దరిద్రులు నిత్య♦కలుషమతులు
కలహప్రియులు హరి♦కథలనువిననట్టి, వారు నిజాన్వయ♦మూరులైన
ఖలులు కామాంధపం♦గులు బధిరులు నాత్మనుతి జేసుకొనువారు ♦ సతతముపర
గీ. నింద జేయుచు నున్నట్టి ♦ నీతిబాహ్యు, లాత్మజాయావిదూరు లా♦త్మార్థమునకు
జగఫలవిఘాతకులు లోభ♦పరులు నీదు, కంటబడనట్టివార లో ♦ కమలపాణి.

భార్గవపురాణము, ఆ 4.

## ఆయుర్వృద్ధిక్షయకారణములు

గీ. క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల, వలన భక్తియు నాయువు పొలుపు నిచ్చు
నలుక బొంకు క్రూరత శుచి♦తాపగమము, గురువిరోధమాయువుఁ గడుఁ♦గుందఁ జేయు.
గీ. తపమునను బ్రహ్మచర్యవ్ర♦తమున హితమి, తాశనమున రసాయనా♦భ్యాసమునను
బెరుఁగు నాయువు క్రియలపైనరుఁడు ప్రీతి, గలుగుటయుఁ బూర్వభవకృతకర్మఫలము
క. తనలావున కధికమయిన, పని సేయుటయుక్తమును న♦పథ్యమునగు భో
జనములు హరించు నాయువు, వనిత యవియుఁ బూర్వకర్మ♦వశతన కలుగున్.
ఆ. సుకృతు లమరలోక♦సుచిరవాసులు నిట, దిగి చిరాయువులును ♦ నగుదు రితరు
లతిచిరముగ నరక♦గతు లయి తుది నాయు, వల్ప మగుమనుష్యు♦లగుట గలుగు.

భారతము, ఆను. ఆ 5 పద్య 130, 34.

ఆ. ఆవులింత నోర♦నాఁచి ముక్కునఁ బుచ్చి, వెలయఁ దుమ్ము నట్లు ♦ వీడుకొలిపి
చరమధాతురక్షఁ ♦ సమ్మతి నొనరించు, సజ్జనుండు వర్ష♦శతము బ్రదుకు. 1301

చారుచర్య, ప 63.

## అనావృష్టి

సీ. ఏకొండ చూచిన ♦ నెరగలివడిఁ బర్వి, పొగలేనియనలంబు ♦ లెగయుచుండ
నే చెట్టు చూచిన ♦ నెలమిఁ బచ్చనియాకు, వెదక మందునకైనఁ ♦ జిదుమలేక
యేనది చూచిన ♦ నెల్లెడజలమింక, విసరెడిగాలితో ♦ నిసుము చల్ల
నే దిక్కు చూచిన ♦ నెండమావులపజ్జ, మృగములుఁ జలమంచుఁ♦దగిలి పఱవ
గీ. సలిలతత్త్వంబు వనరుహా♦సనుఁడు మాన్పఁ, బోలునో కాక యింతలోఁ♦బొడవడంగ
ననఁగ సకలజంతుభయావ♦హంబుగాఁగ, దూషితముగ ననావృష్టి♦దోష మయ్యె.

పంచతంత్రము, నారా. సంధి. ప 78.

తెలఁగ జనుడెసఁ దొలకరి♦నేమి సెప్ప, నెల్లజనముల మనములు ♦ దల్లడిల్ల.
గీ. గుములు లూదన్ల బరపటల్ ♦ గోళ్లగుండు, లల్లిబియ్యంబు వెదురుబి♦య్యంబు గొల్లె
చెట్లు నిండెట్లు తుంగ ము♦స్తియల నీఁత, గుంజుమొవలు గఁదినదొర♦కొనియెజనము
ఉ. తోలును సెమ్ములు న్నమిగిలి ♦ ద్రోసినఁ దొంబదిచోట్లఁ గూలువా
రాత్రిని బిడ్డల న్విడిచి ♦ యాఁకటిచిచ్చున వెచ్చ పోవువా
రేలికబంబు వాసియొక ♦ యించుక లేకఁ గృశించువారు నై
తూలెజనంబు మానశశి♦దోషము దాఁకి నిరస్తసస్యమై. 1309
క. నవయుచు నుండియు నొక్కొక, దివసంబున నశన మబ్బఁ దినిదగమిగులన్
భువి నొరగి లేవ నోపక, శివశివజనకోటి విడుచు ♦ జీవానిలముల్.
క. కలవంతంతకు నొత్తఁగఁ, గరవెరుకతినంగనోపఁ ♦ గలుగకమనుజుల్
సురసుర క్రుక్కి కొందఱు, పరదేశంబులకుఁ జనిరి ♦ బ్రతుకులకొఱకున్. 1311
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 149, 151, 153, 154, 155.

## శుభశకునములు

తే. సీతకప్పుడు మంగళ♦చిహ్నలొదవె, నెడమదెసఁ జన్నుఁగన్నున♦దొడయుభుజము
మొగినదరఁజొచ్చెరాహువి♦ముక్తుఁడైన, చందురుగతివెల్గు చునుముఖ♦చంద్రుఁడొప్పె
రామాయణము, సుంద. ప 261.

సీ. గంధవాహుఁడు మంద♦గతి ననుకూలుఁడై, వీచె నల్దిక్కులు ♦ విశద మయ్యె
నఖిలలోకంబులు ♦ నానందమునుబొందెఁ, దుముల మై దేవదుం♦దుభులు మ్రోసెఁ
గర మొప్ప జలధుల ♦ కలఁక లడంగెను, మించినగతిఁ బ్రవ♦హించె నదులు
గంధర్వకిన్నర♦గానముల్ వీతెంచె, నప్సరోజనములా♦స్యములు సెలఁగె
గీ. సురలు గురియించి రందంద ♦ విరులవాన, మునిజనంబులు సంతోష♦మునఁ జెలంగి
వినుతు లొనరించి రవ్వేళ♦విశ్వ మెల్లఁ, బరమమంగళ మై యొప్పె♦భవ్యచరిత.
భాగవతము, స్కం. 4 పద్య 29.

సీ. నగరు వెల్వడఁగనె పొం♦దుగ వాయసము పిల్చెఁ, గదలి దక్షిణమున ♦ గౌళి పలికెఁ
బూర్ణకుంభయుగంబు ♦ పొడకట్టె ముందటఁ, నిద్దఱు బ్రాహ్మణు ♦ లెదురిరెదుట
సకిలించె నుత్తమా♦శ్వము సమీపంబున, వైనతేయుఁడు కేక♦వైచి యాడెఁ
గుడినుండి యలపాల ♦ యెడమకుఁ జనుదెంచె, వలకెక్కఁజూపుచు♦మెలగెఁ జనుడు
గీ. ప్రజ్వరిల్లెచుఁ గనుపట్టెఁ ♦ బావకుండు, దధి ఫలంబులు సుమములు ♦ దారసిల్లె
ననుమనుచు వెను వెంట♦నధిపునకును, హితవు మీఱంగ నిజరాజపురో♦హితుఁడు దెలిపె.
షట్చక్రవర్తి చరిత్రము, ఆ 6 పద్య 83.

సీ. వేదనాదముతోడ ◆ విప్రయుగ్మము నిల్చె, మఱి నిల్చెఁ బూర్ణకుం ◆ భద్వయంబు
పాలకుండలును ద ◆ ర్పణమును గనుపించెఁ, గన్యక మూపున ◆ ఖ్యముగ నిల్చెఁ
బువ్వుదండలు ఫల ◆ ములు నెదుటఁ జెలంగె, శంఖభేరీమృదం ◆ గస్వనము గ్రమ్మె
వృషభఘోటకమద ◆ ద్విరదరావము మించె, దీప్యమానాగ్ని ◆ దీప్తి దిశల
గీ. దివ్యధవళాతపత్రముల్ ◆ దీప్తిఁ దోచెఁ, జేరుగను పర్చెఁ బాలతో ◆ క్షేమకారి
యిట్టి కళ్యాణశకునంబు ◆ లెన్ని యేని, సుకరముగ నయ్యె శోభ ◆ సూచకములు. 1315
నాగరఖండము, ఆ 5 పద్య 97 సంపుట 2.

గీ. కాకి కట్టసెఁ దోఁచెను ◆ గాలి పలికెఁ, బొలిచె నట్టింటఁ గుమ్మరి ◆ పురువు మొలఁగి
యున్నియును గల్లగాకుండ ◆ నేఁగుదెంచె, హృదయనాయకుఁడో మన ◆ సుదిరయె నాఁటి.
శుకసప్తతి, ఆ 2.

ఆ. భూసురద్వయంబు ◆ పుష్పముల్ ఫలములు, మాంసఖండమును ◆ మద్యఘటంబు
నెదుటఁ జేర్చె వాజి ◆ హేషారవంబులు దగతిఁ దనర్చెఁ బక్షి ◆ గతులు దీర్చె.
నృసింహవిలాసము, ఆ 3.

సీ. మును క్షేమకారి యా ◆ డినపాలకుడినుండి, యెడమకే తెంచినఁ ◆ గుడిభుజ మద
రిన వాయసంబు దీ ◆ ర్చిన పైఁడికంటె వేఁకలయఁ బలికె శుభం ◆ గా కలశ
మెదురైనఁ గుడిపల్కె ◆ వెనసినగాడిద, తెలుఁగిడ వేశ్యల ◆ నెలమిఁ గన్న
కలకలదక్షిణ ◆ గాలి పల్కిన మేకఁ, జల్లనిగాడ్పువి ◆ సరినఁ గవగ
గీ. బ్రాహ్మణు లెదిర్చినను ఘంట ◆ రవళి వినిన, నైదువలు పాటఁబాడిన ◆ నశ్వహేష
వినఁబడినఁ బండ్లుగా నవ ◆ చ్చినవి మొదలు, మేలుశకునంబు లెఱిఁగి య ◆ వ్వేళలందు.
ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 761.

సీ. హర్మ్యంబు పైడల వా ◆ యసము చేరువఁ దీర్చె, వృషభం బెదుర అంకె ◆ వేసి నిలిచె
వాడలో శునకంబు ◆ వచ్చెను దక్షిణాం, బుధ పూర్ణకుంభంబు ◆ లెదురుపడియె
నవని వెల్పటబెరి ◆ కయుఁ బోతు చలగొనె, వల కెక్కెనూ మెఁ జే ◆ వలతిఁ జెమరు
పరువు నేలను వచ్చెఁ ◆ బాలపయ్యెదవంక, కుడినుండి యెడమకు ◆ నడిచె నక్క
గీ. నీవు వేఁటకు విచ్చేయు ◆ నెడ నృపాల, పంచి పెండ్లికి నగుశకు ◆ నంబు లయ్యె
నేఁడు గొల్లలమాట మ ◆ న్నించి నిలిచి, ప్రియ కరుగుట మిక్కిలి ◆ మేలు చేపు.
శకుంతలాపరిణయము, ఆ 1.

గీ. పురుషులకుఁ గుడిపార్శ్వంబు పొలఁతులకును, వామపార్శ్వంబు నదరిన ◆ వాంఛ కోలఁది
శుభము చేకూరునని బ ◆ ధసూక్తు లెలమిఁ, గలవు గావున శుభముగాఁ ◆ గలదు నీకు.
కుబ్జాకృష్ణవిలాసము, ఆ 3.

సీ. సకలదిక్కులను బ్రి◆సన్నతఁ గాన్పించెఁ, జలువనెత్తావిగా◆డ్పులు చరించెఁ
గుసుమవర్షంబు లో◆పల కద్భుతము చేసె, శుభలీల దివ్యదుం◆దుభులు మ్రోసె
సర్వాసురసురజయ◆శబ్దముల్ విలసిల్లెఁ, బరఁగఁ ద్రేతాగ్నులు ◆ ప్రజ్వరిల్లెఁ
బరమసాధుజనంబు ◆ భావంబు లుప్పొంగెఁ, గలుషచారిత్రుల◆ బలిమి గుంగె
గీ. శౌర్యగాంభీర్యధైర్యసౌ◆జన్యనీతి, సత్యకీర్తిప్రతాపాది ◆ సకలసుగుణ
పుంజగంజిప్యమాణభూ◆భువనుఁ డగుచు, నిమ్మహారాజవరుఁ డుద◆యించునపుడు.
సీ. గంధవాహములు సు◆గంధంబు వెదజల్లె, శుభములన దేవదుం◆దుభులు మొఱసెఁ
గుసుమవర్షంబులు ◆ గురిసె మేఘంబులు, దిక్కులు మిక్కిలి ◆ తెలివి నొందె
రంభాదిసురవధూ◆నర్తనంబు లాడిరి, పాడిరి గంధర్వ ◆ పద్మముఖులు
కాంచనదిగ్గజములు ◆ విలసిల్లె నదు లెల్ల, నబ్జమిత్రాదిగ్ర◆హంబులలరె
గీ. సురలు నిర్నిద్రమునితోష◆సుభరితు లైరి, మౌనిహృద్యానుంబు లానంద◆మయము లయ్యె
సౌఖ్య మొదవెఁ జరాచరం◆జంతుతతికి, శైలకన్యావతార వా◆సరమునందు.
జాహ్నవీమాహాత్మ్యము, ఆ 1 ప 94.

సీ. దివిపిక్కటిల మ్రోయు ◆ దివ్యదుందుభులసం,రావంబు లభ్రగ◆ర్జలుగాఁగ
నటియించు నప్సరః ◆ కుటిలాలకలమేని, మెఱుఁగులు తొలుకరి◆మెఱుఁగులుగను
దిలకించు వైమాని◆కులచిత్రభూషణాం,బరకాంతి యింద్రచా◆పంబుగాఁగ
మలయాచలాయాత ◆ మందమారుతములు, తతసితవాతపో◆తములుగాఁగ
గీ. జనముదశ్రుప్రవాహము◆ల్సందడింప, మునిజనానందకందము◆లొమ్మలకలెత్త
రావణగ్రీష్మతప్తధ◆రాతలంబు, శైత్యమొందంగఁ బుష్పవ◆ర్షములు గురిసె.—1323
దశావతారచరిత్ర, ఆ 7.

క. బలిపిండముఁ బలలమ్మును, ఫలములు తేనెయును నెయ్యి ◆ పాలనుగొనుచున్
వలకొని చనిగొను కాకము, ఫలియించును మనుజతతికి ◆ బయనము లోనన్.
కసవమంత్రివిజయము.

క. పంచమహావాద్యంబులు, మించిన భేరీస్వనములును ◆ మెఱపడిశబ్దం
బంచితశుభవాక్యములా,లించిన శుభశకునములగు ◆ శిఖినరసింహా.
క. ఫలములు గాయలుబువ్వులు, వెలయింతియుఁ గన్నెపడుచు ◆ విప్రద్వయమున్
దెలుపన్నము పాయసమును, జెలువగుశుభశకునములగు ◆ శిఖినరసింహా.
క. ఏనుగు గుఱ్ఱము బీనుగు, మానుగ బసవేశ్వరుండు ◆ నుతిపాల్వారకన్
సేనయు గొప్పగు మంటయు,శ్రీనాథా శుభములివియు ◆ శిఖినరసింహా. 1327
క. నిండినకడవలు రెండున్, మెండుగ జేపలును గల్లు◆మించినకావి

ళ్ళండనె గాజులసెట్టియు చెండునుమఱిదోషములను ♦ శిఖినరసింహా. 1328

శిఖినరసింహశతకము, ప 4-7.

# దుశ్శకునములు

ఉ. వేఁకనిబండివానికిని ♦ విప్రునికిం బతికిన్ విపాడికిన్
వ్రేఁకనిమేపువానికిని ♦ వృద్ధునకుం గడుఁ జిన్నబిడ్డకున్
వ్రేఁకటియూఁడుమానిసికి ♦ వేఁదుఱువానికిఁ దెప్పగొంటుకుం
దేఁకువతోఁ దొలంగునది ♦ తెల్లముగా నెదురేఁగుదెంచినన్.

విజ్ఞానేశ్వరము, ప్రాయ. ప 16.

సీ. ఎచటి కేఁగెదవని ♦ యెవ్వరు నడుగక, తంబళిబాపఁడు ♦ తారసిలక
తుమ్మెదుపులినక్క ♦ తోడువచ్చెదనను, పలుకులు వీనులఁ ♦ బడకపిల్లి
యడ్డంబుగాకను ♦ గొడ్డురా లెదుటను, నిలువక జాగిలం ♦ బలుకు డిదక
పాలవెన్నకుఁబోక ♦ పక్కపై రొప్పక, పానుపుబడినయగ్ని ♦ బొగ్గులు దిస
గీ. మొల నరుపరపుమైలచీ♦రలును దూది, కసవు తొండయు గుడ్డిమూ♦గకటిచిలువ
విధవ కుండేలు పొగవొంటి ♦ పిచ్చిగుంటు,నూనెతలవానియెదురుగాఁ♦గానఁబడక.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 760.

సీ. తక్రంబు తృణమును ♦ తైలంబు తేనెయు, నుముకయు సర్పంబు♦నుప్పు నిప్పు
ప్రత్తియు చర్మమున్ ♦ పంకంబు గుడమును, కట్టెమోపులు రిక్త♦కడవ పిల్లి
పొల్లును యెజ్జురి ♦ పువ్వులు తడికోక, యెముకలు రిక్తంబు ♦ యెనుముతుమ్మ
జడలవాడును దేహ♦జాడ్యుండు పతితుండు, నతికృశుండును మందు♦లమ్మువాఁడు
గీ. బోడెతలవాఁడు శత్రుండు ♦ పేడివాఁడు, విడిచతలవాఁడు దిసమొల♦వెట్టివాఁడు
కలహకారుండు యెదుటను ♦ గానఁబడినఁ,బయనముడుగుట యుక్తంబు♦పార్వతీశ.

క. ఒకనాఁడు తుమ్మ కుడుగుట, శకునమ్మన మూడునాళ్లు ♦ సర్పంబునకున్
బ్రికటంబుగ నారునెలలు, సకలము కుడుగంగవలయు ♦ శశకముఁజూడన్. 1332

కసవమంత్రివిజయము.

క. పోవద్దన బోసేయన, నేవచ్చెదనన్న నేడ♦కేగెదవన్నన్
బోవంగని చెరగొడిసిన, జీవములకుహానియంద్రు ♦ శిఖినరసింహా.

క. వినునూతక మగుసతివెల్లనిజడతలక్రొత్తకడవ ♦ విధవాసతియున్
వెనుగాలిధూళియెడనెడ, జనులకుబయనంబుతగదు ♦ శిఖినరసింహా. (?)

క. బాపండొక్కడు కట్టెల, మోపును ముక్కిటియు మెండు ♦ మొనసినపాగసం

తాపము జాడముకల్గిన, శ్రీపతి సైనంబు దగదు ♦ శిఖినరసింహా.

క. తలపట్టు పెట్టుతలయును, దలనూనియు నెఱ్ఱజడల ♦ తల విరిదలయున్
నిలుగని పయనముబోయినఁ, జెలువము నెడబాసిచనును ♦ శిఖినరసింహా. 1336

శిఖినరసింహశతకము, ప 8-11.

# మహోత్పాతములు

మ. కులశైలంబులు గ్రక్కదం గదలె ది ♦ క్కుల్ వ్రయ్య లయ్యెన్ మహీ
వలయం బంతయు జిఱ్ఱనం దిరిగె దే ♦ వవ్రాతముల్ సాధ్వసా
కులతం బొందెఁ బయోధు లన్నియును సం ♦ క్షోభించె సప్తాశ్వస
ప్తులు బిట్టుల్కి రథంబు నల్ దెసలకుం ♦ బో పీడ్చె నుద్భ్రాంతిమైన్.

భారతము, ఆర. ఆ 5 పద్య 208.

క. ఉర్వీవలయము వడఁకెను, బర్వము గాకయును రాహు ♦ భానునిఁ బట్టెం
బర్వతము లురిలె వఱళులు, సర్వదిశల నఱచె నభము ♦ శర్కర గురిసెన్.

భారతము, శల్య. ఆ 2 ప 240.

సీ. చిలుకలు గూబల ♦ యొలుఁగుల చందంబు, దోఁపంగ నఱచు రా ♦ త్రులను దివము
లందును నక్కల ♦ యట్లు మేఁకలు గూయు, మొదవుపిండానకు గా ♦ డిదలు పుట్టు
ముంగుల కుదయించు ♦ మూషికంబులు గుక్క, లెల్లను బిల్లుల ♦ నీను బలుఁదు
హారియును దక్కఁగ ♦ యాదవనివహంబు, బ్రాహ్మణప్రతతికి ♦ బాధసేయు
గీ. గురుల కవమాన మొనరించుఁ ♦ దిరుగు లజ్జ, విడిచియభిలాషముల వెంట ♦ విభుల పంపు
సేయ కున్మార్గములఁ దమ ♦ చిత్తములకు, వచ్చినట్ల వర్తింతురు ♦ వనిత లధిప.

క. అనలములు హోమకాలం,బున నానాభూతవర్ణ ♦ ములతోడ శిఖల్
మనుజేశ్వర వామావ,ర్తన మొందఁగ నుగ్రగంధ ♦ రౌద్రంబు లగున్.

క. విను కూడగూర పాకము, గనుఁగొని ప్రాయి వాపి ఉంపఁ ♦ గానప్పుడ సం
జనితము లై ప్రువ్వులు గల, గొవ మిలమిల మెదలు నందుఁ ♦ గురుకులముఖ్యా.

భారతము, మౌస. ఆ 1 పద్య 18–21.

సీ. జంతువు లొండొండు ♦ జాతుల నీనుట, పెల్లుగర్జిల్లుచుఁ ♦ బెను మెయిళ్లు
నెత్తురుగురియుట ♦ నిష్ఠురంబుగ శారి, కలు రోదసేయుట ♦ గములుగట్టి
నక్కలు నెలవుల ♦ నగరవీథులఁ బట్టపగలు వాపోవుట ♦ బలులు గాకు
లకు కుండుట గూబ ♦ లంతఃపురంబులు, సొచ్చుట సేనలు ♦ సొంపువడుట 1342
గీ. గతిగియున్నది మఱియును ♦ గ్మలి యొకర్తు, శాతదంష్ట్రిలు బభ్రుకే ♦ శములఁ గ్రష్ణ

జీమూతము నట్టహాసప్ర◆దీప్తముఖున్ నగుచు లంకలోఁ దిరిగెన◆[illegible].
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 428.

మ. వసుధామండలి సంచలించెఁ గలశ◆వ్యాధారాశి ఘూర్ణిల్లె నా
కస మెల్లం బొరిఁ గప్పెఁ జీకటులు సౌ◆ధక్రమంబు గంపించె న
శ్వసమూహంబులు మ్రొగ్గె మత్తకరటి◆వ్రాతంబు మూలెన్ రథా
త్తసమస్తాంగము భగ్నమై పడియె సు◆త్వాత్మప్రదేశంబునన్. 1344

మ. కురిసెన్ నెత్తురువాన మేఘగణముల్◆క్రూరాశనిస్తోమముల్
దొరఁగెన్ నిమ్నక జంబుకవ్రజములుం◆దోడ్తోన వాపోయె ని
ష్ఠురభంగిం బడియెన్ మహోల్కలు పరి◆క్షోభంబుగా గాలియుం
బరుషప్రక్రియ వీచె శర్కరిలమై◆ప్రత్యంతదేశంబునన్.
భాస్కరరామాయణము, యుద్ధ ప 1484, 1485.

క. మార్జాలంబులు చెలఁగుచు, గర్జించెను గొబలనుండి◆కంపించె బహు
స్ఫూర్జితనినదముతో ధర, గర్జితపర్జన్యుఁడయి రాహు◆వడిఁ బట్టె రవిన్

గీ. విడువ కెప్పుడు పెనుగాలి◆వీవఁదొడఁగెఁ, దోఁచె దక్షిణదిక్కున◆ధూమకేతు
వసురకన్యలు పూజింప◆నరుఁగుతోడ, నున్నతంబైన రచ్చమా◆నొఱగి కడసె

గీ. కృత్తికలయందు వక్రించి◆కీడు సూపె, మంగళుండు దివాకర◆మండలంబు
ప్రచ్చికొనెఁ జుక్క వడి మెల్లె◆వారిఁ గలఁచెఁ, గూర్మి నిర్ఘాతపాతంబు◆గుండెదిగులు

గీ. రచ్చమ్రాకుల నెల్లను◆రక్తధారలుద్భవించెఁ బ్రిభాకరుం◆డుక్కుమడుపఁ
గడఁగి బాణునిజన్మన◆క్షత్రమైన, భరణి వీక్షించె నది దన◆పక్షమైన.

గీ. తెలుపుఁ గెంపును పరిక్కల◆వెలయ నలుపు, మెడ బెడంగుగఁ గొత్తంపు◆మెఱుఁగువోలె
మూఁడువన్నెలతో నొక◆మొండె మెగసి, సాంఖ్యసమయంబునందు భా◆స్కరునిఁ గప్పె.
ఉత్తరహరివంశము, ఆ 5 ప 35-40.

సీ. ఓడక నామునందౌ◆లోకసారమేయంబు, మొఱఁగుచు నున్నది◆మోర యెత్తి
యాదిత్యుఁ డుదయింప◆నభిముఖంబై నక్కవాపోవు మంటలు◆వాతఁ గలుగ
మిక్కిలు చున్నవి◆మెఱసి గృధ్రాదులు, గర్దభాదులు దీర్చె◆క్రిందుకొనియె
నుత్తమాశ్వంబుల◆కుదయించెఁ గన్నీరు, మత్తగజంబుల◆మదము లుడిగెఁ

ఆ. గాలు మాతభంగిఁ◆గదిసెఁ గపోతము, మండ దగ్ని హోమ◆మందిరములఁ
జుట్టుఁ బొగలు దిశల◆సొరిది నాచ్ఛాదించెఁ, దరణి మాసెఁ జూడ◆ధరణి గదలె.

క. వాతములు విసరి రేణు, వ్రాతము లాకసముఁ గప్పె◆వడి సుడిగొని ని
ర్ఘాతములు వడిరె ఘనసంఘాతంబులు రక్తవర్ష◆కలితము లయ్యెన్. 135[illegible]

క. గ్రహములు పోరాడెడి నా, గ్రహముల వినఁబడియె భూత♦కలకలములు దు
స్సహము లగుచు శిఖికీలా, వహముల క్రియఁ దోఁచె గగన♦వసుధాంతరముల్.
క. గోవులు గుడువవు చన్నులు, దూడలకున్ గోవు లీవు ♦ దుగ్ధము లొడలం
నీడలు పొందవు పశువులఁ, గూడవు వృషభములు దఱపి♦కుత్తుల నెక్కన్.
క. కదలెడు వేల్పులరూపులు, పదలెడుఁ గన్నీరు వాని♦వలనం జెమటల్
వొదలెడిఁ బ్రతిమలు వెలిఁ జని, మెదలెడి నొక్కొక్కగుడిని ♦ మేదినియందున్.
క. కాకంబులు వాపోయెడి, ఘూకంబులు నగరఁ బగలు ♦ గుండ్రలు గొలిపెన్
లోకంబులు విభ్రష్ట, శ్రీకంబులుగతి నశించి ♦ శిథిలము లయ్యెన్. 1356

భాగవతము, స్కం 1 పద్య 337-342.

సీ. కాకఘూకంబులు ♦ కనకసౌధములలోఁ, బగలు వాపోయెడి ♦ బహువిధముల
నశ్వవాటములందు ♦ ననల ముద్భవ మయ్యె, నన్నంబు మొలిచె మ♦హాద్భుతముగ
శుకశారికలు రాత్రి ♦ సొగసె విస్వరముల, జంతువు వే ఱొక్క♦జంతువుఁ గనె
నొగిఁ బౌరగృహముల ♦ నుత్పల లుదయించెఁ బెగసెఁగావిరి రవి♦బింబ మప్పుడు
గీ. గాన నుత్పాతములు చాలఁ♦గానఁ బడియె, నరయ నిందుండ వలవదు♦యాదవులార
తడయ కిపుడ ప్రభాసతీ♦ర్థమునకరుగుఁ, డనుచు శ్రీకృష్ణుఁ డెంతయు♦నానతిచ్చె.

భాగవతము, స్కం. 11 పద్య 86.

ద్విపద. పన్నగేంద్రుని శేయు ♦ పడగలు గ్రుంగ, మిన్ను బిట్టుదరె ని♦మ్మేదిని దిరిగ
జలధులు గలఁగె న♦క్షత్రముల్ రాలెఁ, గులగిరు లగలె ది♦క్కులు వ్రక్క లయ్యె
వెల్లుగాఁ గావిరి♦బెరసి యద్దంపు, బిల్లపోలికి రవి♦బింబంబు దోఁచె
గుండె జల్లనఁ జేతి♦కులిశంబు వైచి, పండెఁ బొమ్మని దేవ♦పతి కొల్వు విచ్చె.

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. ఆ 1.

క. సురగాలి యెదురువీఁచెను, వఱ డొక్కటఁ గూఁక వెట్టె ♦ వసుమతి వణఁకెన్
ఉరగంబులు పొడచూపెను, హరిణసమూహంబు త్రోవ ♦ కడ్డము దాఁటెన్.
గీ. ఎడమనుండి పాల♦కుడికి నేతెంచెను, బసిఁడికంటి వీఁచె ♦ బయలు రొప్ప
విఱిగిపడియెఁ దరువు ♦ దొరలుచు ధరమీఁద, గుండెలవియ మింటఁ♦ గొఱడు దోఁచె.

మైరావణచరిత్రము, ఆ 2 పద్య 3-4.

ద్విపద. నేల గాలఁగఁ జొచ్చె ♦ నాగివడ్డట్టు, చాలిమేఘంబు లా♦సన్నమై బర్వె
పవలు చుక్కలుగానఁ♦బడియె ధూమ్రంబు, గవిసె నెల్లెడవంట♦కంబులు పుచ్చె
ఘూకంపురావ మ♦ద్భుతమయ్యె రాత్రి, కాకకౌశికజంబు♦కములార్వఁ దొడఁగె
గాలిఘూళియుఁ బర్వఁ♦గడు మోర లెత్తి, తూలుచుఁ బశువులు♦దొరలంగఁ జొచ్చె

నింద్రచాపములు ఖం♦డేందుచాపములు, చంద్రార్కపరివేష♦జాలము ల్వ్యాపించె.

పండితారాధ్యచరిత్ర, మహి. ప్రక.

సీ. ఆవేళఁ గంకగృ♦ధ్రావళి పురివిచ్చి, యాడఁగాఁ దొడఁగె ని♦శాస్యులోఁదఁ
గరము నెత్తురువాన♦గురిసె సేనలమీఁదఁ, బిడుగులు పడఁజొచ్చెఁ♦బుడమి కడఁకె
వడఁకు లంతంతకు ♦ వాపోయెఁ దలలెత్తి, వెసఁ గొన్ని గాడ్దెలు ♦ విఱిగి పడియె
నెదురుగా నేతెంచె ♦ నేపుమైఁ బెనుగాలి, మెఱుఁగేదితురగముల్ ♦ మోఁకలిలుడికెఁ
గీ. గడు విలాపించి యొఱలె నా♦కాశవాణి, చెలఁగి యార్తంబుగా వచ్చెఁ♦జెవులపోతు
మఱియు ముందట నొక మహా♦మలినమైన, విప్రరాత్రే ద్రెస్పెఁబోయిన♦విభునిఁదలఁచి

సీతావిజయము, ఆ 3 పద్య 124.

# దంతధావనపద్ధతి

క. రేపకడ మేలుకొని యొసఁ, బాపకమతి దంతధావ♦నమ్ము విధిజ్ఞుం
డై పుణ్యకాష్ఠమున మౌ,నోపేతుం డగుచు సలుపు ♦ నొనరింపంగన్. 1363

ఆ. ఖదిరమును వటమును ♦ కానుగు జిల్లేడు, వేము మద్ది జువ్వి ♦ వినియందు
నొగరు చేదు కార ♦ మొనరిన చెక్కలం, దడప తోమ వలయు ♦ దంతములకు.

సీ. ఆయురారోగ్యంబు♦లగు మద్దిమామిడి, కణమున శ్రీలక్ష్మి ♦ గలుగు మిగులఁ
బీడ లెల్లను బాయు ♦ బీజపూరంబున, రణజయం బొదవుఁ గ♦రంజకమున
విత్తలాభము సంభ♦వించు మారేడున, నొదవు ఘనప్రజ ♦ యుత్తరేన
నరుచిహరము జాడ్య♦హరము నగును జండ్రి, సిద్ధించు వతులవా♦క్సిద్ధి జువ్వి
గీ. జాజి దాడింబమున దరి♦శమున గొడిసె, మొదల సంకోలమునఁ గల్గు ♦ మోక్షలక్ష్మి
సిందువారంబునను రావు ♦ చెడ్డ కలలు, దంతధావన కష్ఠంబు ♦ లింతపట్టు.

క. ప్రియరుచ్యము కఫపైత్య, క్షయకారి మనఃప్రసాద♦కారణము శ్రుతి
ద్వయనాడీశుద్ధికరము, నయసహితము దంతధావ♦నము మనుజులకున్.

చారుచర్య, ప 4-7.

క. పాలొండె ముండ్లు లొండెన్, జాలఁ గలిగి తోలు గలుగు ♦ సరసపుఁ బుడకన్
శీలోత్కృష్టుఁడు ప్రాతః,కాలమునన్ వలయు దండ♦కాష్ఠము చేయన్.

గీ. పంచపర్వంబులందును ♦ బాడ్యములను, జన్మదినములవ్యతిపాత ♦ షష్ఠినవమి
శ్రాద్ధకాలంబులను వ్రత♦చర్యలందు, దంతకాష్ఠంబు కొఱుకుట ♦ తగవుగాదు.

విజ్ఞానేశ్వరీయము, ఆచా. ప 44, 45.

## భూషణధారణపద్ధతి

చ. చెవులకు నెంచ నోడునది ♦ దేవత లిత్తురు మెచ్చి సంతతో
త్సవములు కర్ణభూషణవి ♦ తానముఁ దాల్పఁగ నట్లు లేనినాఁ
డవశకరాధి హేమరుచి ♦ రాభరణంబులు దాల్పఁగాఁ దగున్
గవయము పొందె లక్ష్మియును ♦ రాగియు నిద్దవిగావు దాల్పఁగన్. 1369

చారుచర్య ప 29.

## వస్త్రధారణపద్ధతి

శా. శీతుం గందువఁబట్టుచీరలును మూం♦జిష్ఠంబులున్ దోఁపులున్
వాతశ్లేష్మనివృత్తిహేతువులు దు♦ర్వారోష్ణకాలంబునన్
శీతస్ఫీతియుఁ జైత్యహానియుఁ గడుఁ♦ జేకూరుఁ జెంగావులన్
శ్వేతచ్ఛాయపటంబు లభ్రిపటలీ♦వేళన్ ద్రిదోషఘ్నముల్.

ఆ. మలిన మైన యదియు ♦ మగువ గట్టినయది, యితరజనులయదియు ♦ నెలుక పొట్లి
ఖండ మైనయదియుఁ ♦ గాలినయదియు వర్జింప వలయుఁ జూపు ♦ చీరలందు.

ఉ. మాసినదానఁ దీఁటయు న♦మంగళభావము నొందు సంగవా
వాసముఁ గట్ట భాగ్యము న♦వారితశౌర్యముఁ దప్పఁ బుణ్యముల్
చేసినఁ గోలుపోవు నొరు♦చీర ధరించిన నెల్కపోటు సం
త్రాసముఁ జేయు ఖండపరి♦ధానము జ్యేష్ఠఁ బట్టు మేదినిన్.

క. కాలినచీర ధరించిన, మేలు దొలంగుటయె కాదు ♦ మిక్కిలి కీడై
కాలుని వశమగుఁ గావున, వాలాయము దానిఁ బాఱ♦వైవఁగ వలయున్. 1373

చారుచర్య, ప 25–28.

## పుష్పధారణపద్ధతి

క. పచ్చిపుష్పము గలుగు పువ్వులు, ధరియింపఁగ దానఁ జుండు ♦ తలఁబట్టదు చె
న్నెచ్చరఁ జెమటకంపు దొలఁగును, నసులకు రతి దెలియు నసువు ♦ నయనముల కగున్.

ఉ. కేదఁగిపువ్వుఁ దాల్చి సు♦ఖింతురు మేలుజవాది పూని హృ
న్మోదము గాఁగఁ గన్నెరలు ♦ మొల్లలతో వకుళప్రసూనముల్
జాదులు పాటలంబులును ♦ సంపెఁగలున్ శతపత్రకంబులున్
శ్రీదనరార భోగులు ధ♦రింతురు కస్తురిఁ గూర్చి వేడుకన్.

మృగనాభిన్ సుస్ఫురంబునుం గలిపి య♦మ్మేఘావలీవేళలన్
దగు సద్వర్తనపూర్వకంబుగ నలం♦దన్ జందనం బిమ్ములన్. 1385

చారుచర్య, ప 23.

# ప్రాతఃస్నానాదులు

క. తొమ్మిదిచిల్లులబొందిన్, గ్రమ్మెడు మలములును గీడు ♦ కంపులుఁ జెడుఁ బు
ణ్యమ్ము గలుగుఁ బ్రాతస్స్నానమ్మెప్పుడుఁ జేయు బుధజ♦నంబుల కెల్లన్.

సీ. పోఁతనీళులకంటె ♦ భూమిస్థములు మేలు, వానికంటెను గూప♦వారి మేలు
కొలనిజలంబు త♦జ్జలమునకంటె మే, లేటినీళులు వాని♦కన్న మేలు
పుణ్యతీర్థోదకం♦బులు వానికిని మేలు, గంగాజలము లధి♦కముగ మేలు
తొలివానఁగల్గిన ♦ జలములనదులలో, ముట్టునీళులయట్లు ♦ ముట్టఁ జనదు.

ఆ. సంగనీరదెంత ♦ కలఁకను బడసిన, బ్రోఁచిపడిన కడవఁ ♦ బట్టియున్న
స్నానయోగ్య మగ్ర♦నదులజలంబుల, కంటెనంద్రు ధర్మ♦కర్మవిదులు.

సీ. తెలియఁ బ్రజాపతి♦తీర్థంబు చిటికెన, వ్రేలిమొదలు జుట్టు♦వ్రేలిమొదలు
పితృతీర్థమనఁ జెల్లుఁ ♦ బెనువ్రేలిమొదలితీ, ర్థంబునా బ్రహ్మతీ♦ర్థమనఁ బరగు
నన్నివ్రేళులకును ♦ నగ్రంబు దేవతా, తీర్థం బనంగ వ♦ర్తిలుచునుండు
నయ్యయివారల ♦ కయ్యయితీర్థంబు, లందిచ్చు జలముల♦యందుఁ దృప్తి

గీ. బ్రహ్మతీర్థజలంబుల♦ బ్రాహ్మణుండు, వెలయ ముచ్చోటు చఱచుట♦ విహితవృత్తి
తొడలు చేతులు మోకాళ్లు♦ నడుమనుండ, నొనరఁగూర్చుండి వార్చుట♦ యుత్తమంబు.

సీ. పూర్వాభిముఖమొండెఁ ♦ బోలనుత్తరమొండె, నొనరఁ గూర్చుండి శు♦ద్ధోదకముల
వరుస బ్రహ్మక్షత్ర♦వైశ్యులు హృత్కంఠ, తాలుదేశంబుల♦నొలి నిలిపి
ముమ్మాఱు ప్రాశించి ♦ మూతి యద్దమునిమ్ము, నొకమాఱు ముమ్మాఱు♦ నొనరఁ దుడిచి
నాసికాపుటములు ♦ నయనముల్ శ్రోత్రముల్, బొడ్డును వక్షంబు ♦ భుజములందు

ఆ. వలప లాదిగాఁగ ♦ జలములఁ దడియఁగ, ముట్టి వార్చవలయు ♦ ముదముతోడ
నివ్విధమున వార్చి ♦ యెల్లకృత్యములను, మఱియొనర్చు టుచిత♦మార్గ మండ్రు.

గీ. ప్రీతి మంచముపైనుండి ♦ పీఁటనుండి, చెప్పుపావలు దొడి తల ♦ చీరచుట్టి
నవ్వుచును మాటలాడుచు ♦ నడిచినడచి, వంగి శయనించి నిలుచుండి♦ వార్వఁ జనదు

గీ. అనుపవీతద్విజుండును♦ వాఁడుదియును, శూద్రుఁడును నీళులొకమాటు♦ సోఁకఁ జెదపి
యంటునప్పుడె శుద్ధాత్ము♦లగుటనిక్క, మనిరి ధర్మజ్ఞులైన మ♦హాత్ములెల్ల. 1391

శ్రాద్ధయాగ ప్రాణ♦సంక్రాంతి మృతజాత, సూతకముల [illegible]

నపుడు పుణ్యాహముల♦ నుండుదుదక్కఁగా, స్నాన ముష్ణవారి♦జన దోసఁగు.
ఆ. అంటరానివారి ♦ నంటిరేనియును సే, కాసనమునునికి ♦ యట్లు పుష్పద
స్నానమాచరింప ♦ సంశుద్ధి యగుఁగాన, ముట్టినను మనునికి ♦ మూర్ఖతనము.
గీ. కుక్కనక్కఁబందిఁ ♦ గోడిగాడిదె వాయసంబు నంటెనేని ♦ శౌచమునకు
జలములేనియెడల ♦ మలమూత్రములు సేయు, నేని ద్విజుఁడు వలయు♦ సీటమునుఁగ.
గీ. చాకి బోయవాఁడు ♦ జబ్బరి సొడసరి, కుక్కనూనగాఁడు ♦ కోడి పంది
బొడ్డుక్రిందియంగ♦ములు విప్రుసోఁకిన, నచటు గడుగవలయు♦ చంద్రు బుధులు.
క. పీనుఁగు మాలని సూతకి, నూఁకరి బ్రహ్మంతకారి♦ సోఁక సచేల
స్నానము నగ్నిస్పర్శము, మౌనమునను జేసి ఘృతము ♦ నుత్తివాకఁదగున్.
క. సూతకిఁ బీనుఁగు మాలను, పాతకము గనంటునతని ♦ నంటునతఁడు సు
స్నాతుఁడగునేని శుద్ధుం, డాతని నంటుటయు శుద్ధి♦ యగు నుచ్చుట్లన్. 1399
క. స్నానమున భోజనంబున, దానమునఁ బ్రతిగ్రహమున ♦ దైవతపితృపూ
జానియమంబులయందును, దా నిసుమడి నార్చవలయుఁ ♦ దగ విప్రుఁ డెటన్.
విజ్ఞానేశ్వరము, ఆచా. ప 49-61.

క. ప్రాతస్స్నాయికి లోవెలి, పాతకములు దుగుదివిసుఖ♦పడు మధ్యాహ్న
స్నాతుఁడు స్నానవిహీనుం, డై తినువాఁ డామిషాశి ♦ యనఁబడు నధిపా.
ఉ. స్నాన మొనర్చి భుక్తిగొను♦ సాధులు భక్తులు నాకు గావునన్
స్నాన మొనర్చి రేపకడ ♦ నాదగు నామవిధిం జపించువాఁ
డై నవశుభ్రవస్త్రధరుఁ♦డై పితృతర్పణ మర్ఘ్యముం దృఢ
ధ్యానము సల్పెనేని సక♦లామరులు న్నుతియింతు రాతనిన్.
శివధర్మములు, అ. సు. ఆ 2 పే 45.

# భోజననియమములు

క. పెక్కిండ్ల భిక్షఁ గుడుచుచు, చక్కనిధర్మంబు బ్రహ్మ♦చారికి నది దా
నొక్కింటియన్నమైనను, నక్కఱపడి కుడువఁజెల్ల♦ దని రాచార్యుల్.
క. అంగనసంగతి గురువుల, యెంగిలి మధుమాంససేవ♦ యేండ్రఁ బలుకులన్
భంగము పఱుచుట లేములను, శృంగారము వడుగునకు ని♦షిద్ధములు మహిన్.
క. నలుమూలయు ముమ్మూలయు, వలయముఁ బ్రోక్షణము చేసి ♦ వర్ణులయినయా
నలువురకుఁ గుడుపవోట్లుం, జెలువొందకమున్నె శుద్ధి♦ చేయఁగవలయున్.
గీ. చరణములు కేలు గడిగి ము♦చ్చట్లు చఱచి, పీఠముననుండి కాళ్లు దాఁ♦ బృథివి మోపి
యార్ద్ర వాపోశనమున ప్రా♦ణాహుతులను [illegible]

గీ. వీఁడియన్నంబులోఁ గొన్ని ♦ మెతుకు లెత్తి, ధర్మరాజాయ చిత్రగు♦ప్తాయయనుచు
భూమిపైనిల్పి పిదప నా♦పోశనంబు, గొనుట ధర్మంబు విప్రుండు♦ గుడుచునపుడు.

క. ప్రాణాహుతులు గొనిన త్రుటి, మౌనముఁ దాల్పంగవలయు ♦ మానినహుంకా
రాననయినఁ జెడుఁ గావున, మౌనవ్రతము నడఁదగదు ♦ మతిమంతులకున్. 1408

క. అతిథుల కభ్యాగతులకుఁ, బితరులకును వేల్పులకును ♦ బెట్టినశేషం
బతిశుద్ధ మట్టియన్నము, సతతముఁ గుడుచుట గృహస్థ♦సద్ధర్మ మిలన్.

క. ఇనుమును బొదిగినపీఁటను, మునుగాలినయట్టిపీఁట ♦ మోదుగుపీటన్
జెనఁటిగఁ బగిలినపీఁటను, గొనకొని విప్రుండు గుడువఁ ♦ గూర్చుండఁ డిలన్.

క. ఇనుపతెలె న్మంటితెలెన్, బెనుచేతులనాకుపెణకఁ ♦ బీఁటపయిన్ భో
జన మొనరించుట తగదని, మును చెప్పిరి జనుల కాది ♦ మునివరు లెల్లన్.

క. పెక్కండ్రు చూచుచుండఁగ, నొక్కఁడుఁ దాఁగుడువఁగఁ జన♦ దొకరుఁడు చూడన్
బెక్కండ్రు గుడువఁ జనదని, తక్కక చెప్పుదురు ధర్మ♦తత్త్వవిధిజ్ఞుల్.

క. నెలనాళ్లు నియతుండై, పలాశపత్త్రములపులియఁ♦బాయక ద్విజుఁ డి
మ్మలభోజనంబు చేసిన, ఫల మిలఁ జాంద్రాయణంబు ♦ ఫలముం గలుగున్.

క. ఒకఁ డుదకంబులు త్రావఁగ, నొకరునికంచంబులోని ♦ యుచ్ఛిష్టపుఁ జిం
గుకణంబొలికిననాపాత్రికయన్న మభోజ్య మండ్రు ♦ ద్విజవరు లెల్లన్. 1414

క. పూనితనపాత్రయన్నము, ప్రాణాహుతి గొనినపిదపఁ ♦ బాత్రిక యుచ్చ
స్థానమున నునిచి కుడుచుట, తానుత్తమసరణియండ్రు ♦ ధర్మవిధిజ్ఞుల్.

క. మెండియపువ్రేలవెండియు, మెండీనికిఁ బొరుగువ్రేల ♦ మేలిమిపసిఁడిం
గొండొకవ్రేలజలంబును, నుండంగావలయు బ్రాహ్మ♦ణోత్తముచేతన్.

క. వడ్డింపఁగ నెంగిలి దోఁడిఁ, బడ్డవెసలవంటకంబు♦పాయ నిడఁదగున్
వడ్డించునతనిసోఁకిన, వడ్డింపక డించి వార్చి ♦ వడ్డింపఁదగున్. 1417

క. కూటిముడి మోచునాతఁడు, పాటించక వేసె నేని ♦ ప్రస్థానంబా
కూటిముడియు డించక మూ, చ్చాటులు చటివంగవలయు ♦ సద్ధర్మగతిన్.

క. కుడిచినతుదిగొట్టము గొని, పుడిసెటిలోసగమునీళ్లు ♦ భూతలముపయిన్
విడిచినఁ బాతాళంబున, నొడఁగూడినవారకులకు ♦ నుత్సవమందున్.

క. కుడిచినయెంగిలిచేతను, దడయక గొట్టంబు గొనుట♦తగు నెంగిలివోఁ
గడిగినతుదిఁ గొనె నేనియుఁ, గడునల్గు సమస్తదేవ♦గణ పితృగణముల్.

క. బడబాగ్ని శన లాగస్త్యులు, కుడిచినకుడు పఱుగఁజేసి ♦ కుశలప్రదుల
య్యెడ మాఱనుచు వలచేఁ, గడుపు నిమిరి చదువఁగట్టి♦ కండ్లుం గమరున్.

క. ప్రాణాపానవ్యానో,దానసమానములు తృప్తిఁ • బలకొని హస్తా
హానందం బిడుఁగాకని, జానుగఁ దనకడుపు నిమిరి • చదునఁగ వలయున్. 1422
శిజ్ఞానేశ్వరము, అచా. ప 54-88.

చ. మనమున నన్ దలంపుచును • మానియు సంస్కృతవాణి నాయుష్య భో
జన మొనరించువాఁడు దివి • జత్వము నొందు మఱియనాసము
ల్దనరఁబఠింపుచున్నకబ • ళంబులు ముప్పదిరెండుగాభుజిం
చినసరుఁడుండు నాకమున • నిష్ఠులు గిన్నరులు న్నుతింపఁగన్. 1423

క. మితభోజి నిరామయుఁడై, యతిసుకృతము నొందుఁ గువల • యాక్షికిఁగాల
త్రితయమునం దర్ఘ్యస్తుతి, సతు లిడునపుఁ డాతనిఘన • సంబున నిలుచున్.

క. గృంజనలశునాద్వయములు, సంజాదులోను గభుజించి • నన్ నిరయమునన్
నెంజలి జెందును బహుపా,ప్పంజము వలుక నఘ మగును • భోజనవేళన్.
శేషధర్మము, అ. సు. ఆ 2 పే 46, ఆ 3 పే 51.

గీ. పతితసూతక దేవల • యతిగణాన్న,ములు భుజించిన నెంగిలి • ముట్టుకొనుచు
నైన ఋతుమతివాక్యంబు • లాలకించి,నైన నశనంబుఁ గొన సురా • పానసమము.
శేషధర్మము, ఆ 3.

గీ. ద్విజుఁడు భుజియించుతఱి బహు • దేశభాష,ణములు పలికిన లశునద్వ • యమును గృంజ
నంబు నింద్యము నూతకా • న్నంబుఁ గొనిన, ఘోరనరకంబు పాలయి • కుందుచుండు.

గీ. తల్లిదండ్రులు కొడుకులు • తాతమనుమ, లాఁడుబిడ్డయుఁ దోఁబుట్టు • వత్తమామ
లైనఁ బొత్తున భుజియింప • నధికపాప,మనినసునుసకువడుగైన • యంతటఁ దలఁచ. 1428
ఒడయనంబివిలాసము, ఆ 5.

# అష్టవిధవివాహములు

క. కమలదళనయన వినుమార్షము బ్రాహ్మ్యము నాసురము వె • సన్ బ్రాజాప
త్యము పైశాచ్యము గాంధ,ర్వము దైవము రాక్షసము వి • వాహాష్టకమా.
శకుంతలాపరిణయము, ఘ. వేం. ఆ 3.

## —• బ్రాహ్మ్యవివాహము. •—

క. తగువరుని బిలిచి కన్యకఁ, దగినయలంకార మిచ్చి • ధారాపూర్వం
బుగఁ బెండ్లి సేయుటయు నది, వగవక బ్రాహ్మ్యంబనెడివి • వాహం బయ్యెన్.

## —• దైవవివాహము. •—

క. క్రతువునకు ఋత్విజుండై, సతతంబును మంత్రవిధులు • సల్పినతనికిన్

గీ. వేఁడియన్నంబులోఁ గొన్ని ♦ మెతుకు లెత్తి, ధర్మరాజాయ చిత్రగు♦ప్తాయయనుచు
భూమిపైనిల్పి పిదప నా♦పోశనంబు, గొనుట ధర్మంబు విప్రుండు ♦ గుడుచునపుడు.
క. ప్రాణాహుతులు గొనిన త్రుటి, మౌనముఁ దాల్పంగవలయు ♦ మానినహుంకా
రాననయినఁ జెడుఁ గావున, మౌనవ్రతము విడఁదగదు ♦ మతిమంతులకున్. 1408
క. అతిథుల కభ్యాగతులకుఁ, బితరులకును వేల్పులకును ♦ బెట్టిన శేషం
బతిశుద్ధ మట్టియన్నము, సతతముఁ గుడుచుట గృహస్థ♦సద్ధర్మ మిలన్.
క. ఇనుమున బొదిగినపీఁటను, మునుగాలినయట్టిపీఁట ♦ మోదుగుపీటన్
జెనఁటిగఁ బగిలినపీఁటను, గొనకొని విప్రుండు గుడువఁ ♦ గూర్చుండఁ డిలన్.
క. ఇహపతెలె న్మంటితెలెన్, బెనుచేతులనాకుపెణకఁ ♦ బీఁటపయిన్ భో
జన మొనరించుట తగదని, మును చెప్పిరి జనుల కాది ♦ మునివరు లెల్లన్.
క. పెక్కండ్రు చూచుచుండఁగ, నొక్కఁడుఁ దాఁగుడువఁగఁ జన♦ దొకరుఁడు చూడన్
బెక్కండ్రు గుడువఁ జనదని, తక్కక చెప్పుదురు ధర్మ♦తత్త్వవిధిజ్ఞుల్.
క. నెలనాళ్లు సునియతుండై, పలాశపత్త్రములపులియఁ♦బాయక ద్విజుఁ డి
మ్మెలభోజనంబు చేసిన, ఫల మిలఁ జాంద్రాయణంబు ♦ ఫలముం గలుగున్.
క. ఒకఁ డుదకంబులు ద్రావఁగ, నొకరునికంచంబులోని ♦ యుచ్ఛిష్టపుఁ జిం
గుకణంబొలికిన నాపా, త్రికయన్న మభోజ్య మండ్రు ♦ ద్విజవరు లెల్లన్. 1414
క. పూనితనపాత్రయన్నము, ప్రాణాహుతి గొనినపిదపఁ ♦ బాత్రిక యుచ్ఛ
స్థానమున నునిచి కుడుచుట, తానుత్తమసరణియండ్రు ♦ ధర్మవిధిజ్ఞుల్.
క. మెండియపువ్రేలవెండియు, మెండీనికిఁ బొరుగువ్రేల ♦ మేలిమిపసిఁడిం
గొండొకవ్రేలజలంబును, నుండంగావలయు బ్రాహ్మ♦ణోత్తముచేతన్.
క. వడ్డింపఁగ నెంగిలి దొడిఁ, బడ్డ వెసలవంటకంబు♦పాయ నిడఁదగున్
వడ్డించునతనిసోఁకిన, వడ్డింపక డించి వార్చి ♦ వడ్డింపఁదగున్. 1417
క. కూటిముడిమోచునాతఁడు, పాటించక వేసె సేని ♦ ప్రస్థానంబా
కూటిముడియు డించక మ్రుచ్చాటులు చఱవంగవలయు ♦ సద్ధర్మగతిన్.
క. కుడిచినతుదిఁగొట్టము గొని, పుడిసెటిలోసగమునీళ్లు ♦ భూతలముపయిన్
విడిచినఁ బాతాళంబున, నొడఁగూడిననారకులకు ♦ నుత్సవమందున్.
క. కుడిచిననెంగిలిచేతను, దడయక కొట్టంబు గొనుట♦ తగు నెంగిలివోఁ
గడిగినతుదిఁ గొనె నేనియుఁ, గడునల్గు సమస్తదేవ♦గణ పితృగణముల్.
క. బడబాగ్న్యత్రిన లాగస్త్యులు, కుడిచినకుడు పఱుగఁ జేసి ♦ కుశలప్రదుల
న్యశుమాలిననుచు వలచేఁ, గడుపు నిమిరి చదువఁగట్టి ♦ కండ్లుం గమరున్.

క. ప్రాణాపానవ్యానో, దానసమానములు తృప్తిఁ ♦ దలకొని బ్రహ్మా
నందం బిడుఁగాకని, జానుగ దనకడుపు నిమిరి ♦ చదురుఁ దలఁచున్. 1422
విజ్ఞానేశ్వరము, ఆచా. ప 64-88.

చ. మనమున నన్ దలంపుచును ♦ మానినయా సంస్కృతవాణి నాయజ్ఞ భో
జన మొనరించువాఁడు దివి ♦ జత్వము నొందు మదీయనామము
ల్దనరఁబఠింపుచున్న కబ ♦ ళంబులు మున్నదిరెండుగా భుజిం
చినసరుఁడుండు నాకమున ♦ సిద్ధులు గిన్నరులు న్నుతింపఁగన్. 1423

క. మితభోజి నిరామయుఁడై, యతిసుకృతము నొందుఁ గువల ♦ యాదికిఁ గాల
త్రితయమునం దర్ఘ్యప్రస్తుతి, సతులిడునపుఁ డాతని భువ ♦ నంబున నిలుచున్.

క. వ్యంజనలశునాద్యయములు, సంజుడులోనుగ భుజించి ♦ నన్ నిరయామునన్
నెంజలి జెందును బహువ్యంజనము లలుక నఘమగును ♦ భోజనవేళన్.
శేషధర్మము, అ. సు. ఆ 2 పే 46; ఆ 3 పే 51.

గీ. పతిత సూతక దేవల ♦ యతిగణాన్నములు భుజించిన నెంగిలి ♦ ముట్టుకొనుచు
నైన ఋతుమతివాక్యంబు ♦ లాలకించి,యైన నశనంబుఁగొన సురా ♦ పానసమము.
శేషధర్మము, ఆ 3.

గీ. ద్విజుఁడు భుజియించుతఱి బహు ♦ దేశభాషణములు పలికిన లశునద్వ ♦ యమును వ్యంజ
నంబు నింద్యము నూతకా ♦ న్నంబుఁ గొనిన, ఘోరనరకంబుపాలయి ♦ కుందుచుండు.

గీ. తల్లిదండ్రులు కొడుకులు ♦ తాతమనుమ, లాఁడుబిడ్డయుఁ దోఁబుట్టు ♦ వత్తమామ
లైనఁ బొత్తున భుజియింప ♦ నధికపాప, మనినసువనరువడుగైన ♦ యంతమాఁద.-1428
ఒడయనంబివిలాసము, ఆ 5.

# అష్టవిధవివాహములు

క. కమలదళనయన వినుమార్షము బ్రాహ్మ్యము నాసురము వె ♦ సన్ బ్రాజాప
త్యము పైశాచ్యము గాంధర్వము దైవము రాక్షసము వి ♦ వాహాష్టకమౌ.
శకుంతలాపరిణయము, ఘ. వేం. ఆ 3.

## —♦ బ్రాహ్మ్యవివాహము. ♦—

క. తగువరుని బిలిచి కన్యకఁ, దగినయలంకార మిచ్చి ♦ ధారాపూర్వం
బుగఁ బెండ్లి సేయుటయు నది, వగవక బ్రాహ్మ్యంబనెడివి ♦ వాహం బయ్యెన్.

## —♦ దైవవివాహము. ♦—

క. క్రతువునకు ఋత్విజుండై, సతతంబును మంత్రవిధులు ♦ సల్పినతనికిన్

సుతఁ బెండ్లిసేయుటయు సీక్షితి దైవవివాహ మనఁగఁ ♦ గీర్తిత మయ్యెన్.

### ——♦ ఆర్ష వివాహము. ♦——

క. మొదవులు రెండుంకొనగా, ముద మారఁగ నిచ్చి గుణస♦ముత్సుకుఁడై యిం
పొదవంగఁ బెండ్లి యాడిన, నది యార్ష మనెడు వివాహ♦మయ్యె ధరిత్రిన్. 1432

### ——♦ ప్రాజాపత్యాసురవివాహములు. ♦——

క. అర్థంబుఁ గొనక వరునకు, బ్రార్థనతో నిచ్చుటయును ♦ బ్రాజాపత్యం
బర్థించి వరునకును సుత, నర్థముఁ గొని యిచ్చుటయును ♦ నాసుర మయ్యెన్.

### ——♦ గాంధర్వవివాహము. ♦——

క. రమణియు రమణుఁడు నోడఁబడి, తమలోపలఁ గూడి తల్లి♦దండ్రులు వెలిగా
సమయముఁ జైకొనియున్నను, గ్రమమున నా పెండ్లి పేరు ♦ గాంధర్వ మగున్.

### ——♦ రాక్షసవివాహము. ♦——

క. నెయ్యమున నడిగిపుచ్చుట, యియ్యకొనక యర్థిమీఁక ♦ యీర్ష్యాపరుఁడై
కయ్యమున గెలిచి కన్యకఁ, గ్రయ్యంబడి చేసికొనిన ♦ రాక్షస మయ్యెన్.

### ——♦ పైశాచవివాహము. ♦——

క. గురుజను లెఱుఁగకయుండను, వెరవిడియై మినుకుగట్టి ♦ పెళ్లిచనువునన్
వరియింపఁదగిన పురుషుఁడు, పరిణయ మగుసేని యదియ ♦ పైశాచ మగున్.

విజ్ఞానేశ్వరము, ఆచా. ప 95-101.

## వివాహపద్ధతులు

క. కులమును శీలము విద్యయుఁ, గలవానిం బిలిచి ప్రీతిఁ♦గన్నియ నీఁగా
వలయు నుదకప్రదానా, కలితంబుగ బ్రాహ్మకర్మ♦గతి యిది యధిపా.

ఆ. శాస్త్ర మంత్రము బుధులు ♦ గన్య పురుషుఁగోర, నతఁడు గన్యమీఁద ♦ నాససేయ
వచల మగుపరస్ప♦రానురాగము గని, ప్రమద మెసఁగఁ జేయు ♦ పరిణయంబు.

క. కన్న మనంబును దనిసినఁ, గన్నియ యెవ్వానిఁ గోరు♦గాంధర్వం బా
యన్న నతని కిచ్చుట వెల్లవన్నుట యాసురము నూవె ♦ పౌరవముఖ్యా.

క. బలిమి మొయి వరుఁడు గన్నెరుఁ, గలవారిం బోడిచి కరము ♦ క్రౌర్యంబున న
ప్పొలఁతుక దుఃఖింపఁగ వారల వోగులఁగఁ దెచ్చికొనుట ♦ రాక్షసము నృపా.

ఆ. అయిదు తెఱఁగులందు ♦ నారయ మూఁడువిధములు ధర్మకృతులు ♦ ధర్మపుత్త్రి
యాసురంబు రాక్ష♦సాహ్వయంబును ధర్మ మారసంవిధాన ♦ దూషితములు. 1441

గీ. మాతృపితృహీన లైనను ♦ భ్రాతృసహిత భావ మొందిన నబ్జాక్షి♦పరిణయార్థ
వరణమున కర్హ గాదని ♦ కురుకులాగ్రగణ్య చెప్పుదురు పరిణయ♦కల్పవిదులు.
ఆ. ఆత్మజాతియందు ♦ నవరజాతుల రెంటఁ, గ్రమవివాహ మొప్పు♦ బ్రాహ్మణునకు
ననఘ శూద్రవనిత♦యందు నాతని కపత్యంబు గలిమి పాప♦కరణియుఁ గలదు.
గీ. రాజునకు రాజవంశజ♦రమణి యైన, వెనుక వైశ్య వరించుట ♦ విహితవిధము
వైశ్యునకు శూద్రినయుఁ దన♦వంశములన, పరిణయంబుగాఁ దగు నర♦పాలవర్య.
ఆ. అనఘ విషయ మైన ♦ యట్టికార్యంబు న్యాటలిరఁ జూచి పెద్ద♦వలచి యైన
లోభమునను శూద్రఁ ♦ బాభార్యఁగాఁ గొను, విప్రుఁ డధిక పాప♦వృత్తిగామి.
క. విను హవ్యకవ్యములు మజ్జనభోజనములును విప్ర♦జాతివనిత చేఁ
బని సేయ నడపునది యొప్పనులకుఁ బెఱసతులు గామి♦బ్రాహ్మణుఁడు నృపా.

భారతము, అను. ఆ 2 పద్య 221_229, 240.

క. కులమున నధికుం డొండెను, గులమున సరిపురుషుఁ డొండె ♦ గుణయుతులగు క
న్యలఁ బెండ్లియాడు [illegible], కులహీనుఁడు కులజఁ జేసి♦కొనఁ జనఁ డెందున్.
క. కులమొక్కటియై గోత్రము, కలయక శుభలక్షణములు ♦ గలిగి ప్రియంబున్
గలకన్నియలను విప్రులు, వలయు సమంత్రకముగా వి♦వాహం బాడన్.
ఉ. శూద్రియ శూద్రభార్యయగు ♦శూద్రియు వైశ్యయు వైశ్యభార్య లా
శూద్రియు వైశ్యయున్ నృపతి♦నూతియు రాజతనూజభార్య లా
శూద్రియు వైశ్యయున్ నృపతి♦నూతియు విప్రసుతవిప్రకన్యయుం
భద్రగుణప్రసిద్ధుఁడగు ♦ బ్రాహ్మణభార్య లనుక్రమంబుగన్.
క. మేలగు విప్రుఁడు శూద్రిని, నాలింగాఁ జేసికొనుట ♦ యన్యాయ్యంబా
యాలి యుదరమున విప్రుఁడు, పోలంగా, దానె పుట్టి♦ పుత్త్రుం డగుటన్. 1450
క. జనకుఁడు తాతయు భ్రాతయుఁ, దనకులజుఁడు తల్లియును య♦థాక్రమముఁ
జనవములగుదురు కన్యకు, మనమున దోషంబు లేక ♦ మనువారైనన్.
క. కన్నియఁ దగువరునకు నీ, కున్నను నది యెన్నిముట్టు♦లొనరఁగనగుఁ దా
నన్నింటి భ్రూణహత్యలు, పన్నగఁ బాపించునంత♦పాపము వచ్చున్.
క. జనకుఁడు మొదలుగ నేవురుఁ, దగువరునకు నిచ్చువారు ♦ దగలేకున్నం
దనకును దగియెడువరునిం, దనయంతన చేసికొనుట ♦ తగుఁ గన్నియకున్. 1453
క. ఇచ్చినకన్యక మగుడం, బుచ్చుకొనుట చాలతప్పు ♦ పురుషునకును దాఁ
బుచ్చుకొనునేని నాతఁడు, మచ్చరియన్ దండ్యుఁ [illegible]

పించుట గలిగినసతివర్జించి పయిం బెండ్లి యాడఁ • జెల్లదు పతికిన్.

క. పతియున్నను పతిచచ్చిన, నితరులఁ దాఁ బొందదన్న • యీలువుటాలీ
క్షితిఁ గీర్తియుఁ బిమ్మటఁ బ్రాగ్వతితోడ సఖిత్వమును ధ్రు•వంబుగఁ బడయున్.

క. పతిపంచినంత సేయుటు, పతిపతితుండైనఁ బాసి • ప్రాయశ్చిత్తం
బతఁ డొనరించినఁ గ్రమ్మఱఁ, బతిఁ గూడుట ధర్మసంప్రదా • పత్నులకెల్లన్.

క. చాలం బుత్త్రిలు గల్గిన, యాలిపయిం బెండ్లి యాడు•నప్పుడు దాఁ బె
ద్దాలికినిధనమునీడవ, పాలిచ్చుట ధర్మసంప్రదా • భర్తల కెల్లన్.

క. మున్ను వివాహము సేయని, కన్నియ యొరుఁ గలిసె నేని • క్షతయగు మఱపాం
దెన్నఁడులేక విధవయగు, కన్నియ యక్షతసమాఖ్య•గలిగి చరించున్. 1468

విజ్ఞానేశ్వరము, ఆచా. ప 91-109.

చ. వరుసను బ్రాహ్మణోత్తముఁడు • వర్ణచతుష్టయజాతకన్యలన్
బరిణయమౌట ధర్మమని • పల్కుదు రాదిమునీంద్రముఖ్యు ల
వ్వర వొడఁగూడు నేనిఁ బృథి•వీవర యీకరకర్ణి నీయజిన్
గరమనురాగలీలఁ బ్రియ•కామినిగాఁగఁ బరిగ్రహించెదన్.

విక్రమార్క చరిత్రము, ఆ 1 ప 155.

ఉ. ఈగతిఁ జెప్పితిన్ వసుమ•తీశ చతుర్యుగవర్తనంబుగ
న్యాగమనంబునందుఁ బరి•హారము చెప్పెద నింక బ్రాహ్మణ
స్త్రీగమియింప రాజునకుఁ • జెల్లదు కోమటిరాకుమారిసం
యోగముచేయరాదు కడు•నొప్పదు శూద్రుఁడు వైశ్యఁ బొందఁగన్.

గీ. బ్రాహ్మణుఁడునాల్గుజాతుల•రాజుమూఁడు,జాతులవణిగ్వరుఁడురెండు•జాతులను ఛ
తుర్థుఁ డొకజాతిఁబెండ్లాడి•తొయ్యలుల రమింపఁదగునట్లుగాక ర•మింపరాదు.

సీ. నాల్గుజాతులకునీ•నలువునఁగానిత,క్కినహీనజాతికా•మినులఁ బెండ్లి
యాడి కూడంగ భా•వ్యము గాదు విప్రున, కజ్ఞానమున నగ•మ్యాగమనము
ప్రాపించె నేని స•ప్తపరిణవగాయత్రిఁ బ్రా,ణాయామశతము చే•యంగవలయు
సంకరాన్వయవధూ•సంగతిఁ బెక్కేండ్లు, నడచె నేనియును ద•న్మంత్రమునన

గీ. వలయు యుగ్మాబ్దములు • వరుసవాయు,ధారణము చేయ నేవాయు•ధారణమున
బ్రహ్మహత్యాదిపాతక•ప్రకరమైన, దప్పు నుపపాతకంబులు • చెప్పనేల.

వరాహపురాణము, నం. మ. ఆ 9 ప 127-129.

మ. స్తుతిపాత్రింబగు నీకు విప్రకులబం•ధుత్వంబు దూష్యంబురే
వతి నక్తింబతిగాఁగ శాంతగనె శాం•తావాసువైభండకిన్

ఖతిగాఁ గోరె స్వతుష్టిజాత్మజ జగ♦త్ప్రఖ్యాతిగా గౌతమున్
మతి నర్చింపదె గాశిరాజసుతభ♦ర్మావాసకున్ గౌశికున్.

చ. వలపగుచూపురేఖగల♦వానిఁ గోరును కన్నె ద్రవ్య స
ల్లలితునిఁ గోరు తల్లి శ్రుత♦లక్ష్యుఁ గనజ్ఞునిఁ గోరుఁ దండ్రి స
త్కులజునిఁ గోరు బంధుతతి♦కూరిమి శోభనకార్యవేళ లో
కులు సరసాన్నభుక్తి♦మదిఁ గోరుదు రీధరలోన నెల్లెడన్.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

### —♦ వివాహమాడఁదగుకన్యలు. ♦—

తే. అనఘ! తనవయసున దృతీ♦యాంశమైన, ప్రాయమునఁ గలకన్నియఁ♦బరమసాధ్వి
నాభయకులములఁ దనయట్లు♦మెప్పుదానిఁ, బెండ్లియాడంగ వలయు సం♦ప్రీతితోడ.
ఆ. తల్లివంక నైదుతరముల విడిచి, తండ్రివంక నేడు♦తరము లరసి
వారివారి గోత్ర♦వంశసంకరము గా, నియక యతివఁ బెండ్లి♦యయిన మేలు. 1476

విష్ణుపురాణము, ఆ 4 ప 182, 184.

### —♦ వివాహమాడఁదగనికన్యలు. ♦—

సీ. నైసర్గికాంగహీ♦నను శోషి నతికేశఁ, గేశహీన నతివఁ♦గృష్ణవర్మ
శోమాంగిఁ గులటను♦రోగి దుష్టాత్మను, దుష్టవాత్సల్య ని♦కృష్టవృత్తి
నధికపింగళ వివ♦యాచారహీన మా, తాపితృప్రీతికూలఁ♦బాపహృదయ
శ్మశ్రుముఖిని బుర♦షస్వరరూక్షాక్షి, ఖర్వరూపకహీన♦కంఠనాద.
ఆ. హస్తపాదహీన♦నతిదీర్ఘవామన, క్లిన్నరక్త నతివి♦కీర్ణకేశఁ
గపటహృదయఁ బంగు♦గమనఁ బాణిగ్రహ, ణంబు గాఁగఁ దగదు♦నరవరేణ్య.

విష్ణుపురాణము, ఆ 4 ప 184

## మేనరికము

చ. కొమరగు మేనమామకును♦గూతురు బుట్టినయేని నాఁటనే
నమరఁగ మేనయల్లుని కు♦లాంగనయౌ సుముహూర్త మప్పుడే
ప్రమదముతోడఁ జేయఁగ శు♦భంబగు దక్షిణసంబు దుర్నిమి
త్తములు దలంప కిచ్చుటది♦ధర్మువు వైశ్యుల కెల్లకాలమున్. 1478
క. మేనరికంబును దప్పక, పూని యొనర్చినయతండు♦పుణ్యుండగు నా
మేనరికమివఁ ద్రోచిన, హీనుఁడు కులబాహ్యుఁ డగుచు♦నిలవీడఁ జెడున్.
క. తొలుత వివాహంబైనను వలనుగ నది తప్పెననుచు♦వచ్చినయేనిన్

కానీనసుతుని కతఁడు ♦ గొడుకగుఁ గానీన, నామకమునఁ బరగు ♦ నరవరేణ్య.

క. వినుగర్భిణి యగు తెఱఁగెఱుఁగక, యును నెఱిఁగియుఁ బెండ్లి యైన ♦ నుదయించిననం
దనుఁ డా వరునకుఁ గొడుకగు, జననాథ సహోఢుఁ డనఁగ ♦ జను నండ్రు బుధుల్

గీ. విభునిఁ దాను గొఱంగిన ♦ వెలఁది విభుఁడు, విడిచి నట్టి సుమధ్యమ ♦ విధవ యట్టు
తాత్మవశ నెవ్వనికిఁ గనుఁ ♦ దనయుఁ డాతఁ, డతనికొడుక పౌనర్భవుండనఁగఁ బరగు.

క. జననీజనకులు లేకున్నను వారలు దన్ను విడిచినం దాన తగున్
దనయుఁడు నొరుల కిచ్చిన, ననఘా యాతండు సను స్వ ♦ యందత్తుఁ డనన్.

ఆ. తల్లిదండ్రు లమ్మఁ ♦ దనయుఁ గా నొక్కరుఁ, డాత్మసదృశజన్ముఁ ♦ డైనవాని
విలిచికొనినఁ బొండె ♦ వేయుమహాత్మ, యక్కుమారుఁ గ్రీతుఁ ♦ డండ్రు బుధులు.

క. అని భీష్ముఁడు వెండియు ని,ట్లను నాపన్నిరువురను ధ ♦ రాధిప యోగ్య
త్వనిరూఢు లెల్లకర్మం,బుల కౌరసుఁ డందులోన ♦ ముఖ్యుం డరయన్.

ఉ. కానిన పోలు నండ్రు బుధ ♦ వర్యులు కౌరవనాథ! పుత్త్రికా
సూనుని దక్కనీవిని ♦ సూనులు యోగ్యత గాంతు రుత్తమం
బైనకులద్వయంబును స ♦ మాగత మై విధివత్ప్రయోగతా
నూనత గల్గెనేని నిగ ♦ మోదితకర్మకలాపయుక్తికిన్. 1496

భారతము, అను. ఆ 2 పద్య 242-256.

క. ధరణీసురరాజవణి,క్తరుణులకును విప్రువలనఁ ♦ గల్గినతనయుల్
గురునాథా! ద్విజు లనఁగాఁ, బరఁగుదు రది లేదు శూద్ర ♦ భామసుతులకున్.

సీ. విను జనమేజయ ♦ మనుజేంద్ర యమ్మేది, నీశ్వరుతో భీష్ముఁ ♦ డిట్టు లనియె
బ్రాహ్మణు నర్థంబు ♦ పదిపాళ్లు గాఁ జేయ, నాలుగు బ్రాహ్మణీ ♦ నందనుండు
క్షత్రియాత్మజుఁడు భా ♦ గములు మూఁడును వైశ్యతనయుండు రెండు శూ ♦ ద్రాతనూజుఁ
డొకపాలు గొనుటకు ♦ నొడయలు గుడివాఁడు, వలచి పెట్టఁగఁ గొను ♦ వాఁడు గాని

ఆ. తండ్రితోడఁ ద్రివిధ ♦ తనయులతోడను, దనదుభాగమునకుఁ ♦ బెనఁగి కొనఁగఁ
దగదు వారలకును ♦ దగదు నిర్దయతఁ ద,ద్దశమభాగమీక ♦ తార కుడువ.

సీ. క్షత్రియధనము భా ♦ గము లెనిమిది సేయ, భూపాల వైశ్యల ♦ పుత్త్రికలకు
శూద్రపుత్త్రికకును ♦ సుతు లైనయట్టివా,రోలి నాలుగు మూఁడు ♦ నొక్కటియును
గొనువారు పాళ్లులు ♦ కురుముఖ్య వైశ్యుని,సొమ్మున వైశ్యకు ♦ సూనుఁ డైన
యితఁడు నాలుగును శూ ♦ ద్రాత్మజుఁ డొకటియుఁ, గాఁగ నైదుగ నంశ ♦ కములు గొండ్రు

ఆ. పెనఁగి కొనఁగఁ దగమి ♦ విను శూద్రకొడుకున, కెందుఁ గలదు వాని ♦ కీక కుడువఁ
గామియును సమంబ ♦ యేమిజాతులవారి,కయిన నిట్లు దెలియు ♦ మంశకృతులు. 1499

గీ. ఆలు నిజజాతియందు శూద్రాలి కెల్లఁ బనుపులు సేయంచి కొడుకు ముఁగాఁచు
తనయు లెందఱు గల్గినఁ దండ్రిధనము, ధర్మసంగ్రహతత్పర ధర్మతనయ.
క. విను భక్తియు వెఱపుఁ గలిగి, యనుజన్ములు పెద్దవాని నాగాధిపవ
జనవర యతండుఁ దమ్ములఁ, గొనియాడక సితకిఁ బట్టి కుదు మజ్జ్వలు లై. 1501
క. అనుజుఁ డొకఁడు వెంగలి యైనను దప్పెడుఁ గాని పెద్దకడఁ గార్యజ్ఞా
ననిరూఢిలేక తక్కిన, యనుజన్ములు సిక్కువడుదు రవనీనాథా. 1502
చ. జనవర యన్నదమ్ములు ప్రసన్నమతిం గలసిల్మి పంచి ప
డ్చిన వినుతించు లోకము శ్రీయుఁ బోరిం బోరిఁ దెంపు సొంపు లో
భనిరతిఁ బెద్ద కాసపడి పాడి దొఱంగినఁ బ్రాణగోష్ఠప్రపం
బను లగు న వ్విధంబు మనపద్ధతి గాదె జగం బెఱుంగఁగన్.

భారతము, అను. ఆ 2 వ 230_233.

క. చూతై యుండఁగ నొకయం, డాలింగా వేలుకొనిన యాగర్భమునం
దాలలవగన్న పుత్త్రుఁడు, పోలంగ సహోఢనాము పుత్త్రుం డయ్యెన్.
క. తల్లియుఁ దండ్రియుఁ బుత్త్రిని, వొల్లక పుత్త్రెంచుటయును నుచితస్థితిమై
నుల్లం బలరఁగఁ జొచ్చినఁ, దెల్లం బపవిద్ధనామధేయసుతుఁ డగున్.
క. క్షేత్రజుఁ డాదిగఁ గలిగిన, పుత్త్రులు గ్రహములనుబోలెఁ బొనుపడుదు రస్వ
క్షేత్రమున నౌరసుండును, పుత్త్రుఁడు గ్రహరాజుఁబోలెఁ బొడమూపుటయున్.
క. గోమేధము సేయుటయును, రామాజనములకు దేవరన్యాయంబున్
భామకు రెండవపెండ్లియు, నీమహిలోఁ గలియుగమున నెగ్గని రార్యుల్.
క. ఒకతల్లిగన్నసుతులం, దొకనికి సుతుఁ డుదయమైన నోలినిమతి వా
రికి నెల్ల వాఁడె సుతుఁడని, యకుటిలుఁడగు నలమునీంద్రుఁ డానతి యిచ్చెన్. 1508
క. మనువిప్రునకును క్షత్త్రియ, వనితకు నుదయించినతఁడు వైశ్యుఁడు వైశ్యాం
గనకును విప్రోత్తమునకు, ననుకూలతఁ బుట్టునాతఁ డంబష్ఠుఁ డగున్.
క. భూదేవుఁడు శూద్రస్త్రీ, నాదరమునఁ బెండ్లియాడి యాసతియందు
త్పాదించినపుత్త్రుండు ని,షాదుండనఁ బరగుచుండు సమ్మదలీలన్.
క. రాజన్యువలన వైశ్యాస్త్రీజుఁడు మాహిష్యుఁ డనఁగఁ జెల్లును శూద్ర
స్త్రీజాతుఁ డుగ్రుఁ డనఁ జను, ధీజనమతకీర్తిపూర ధీరవిచారా.
క. కోమటికి శూద్రభామిని, కామినియై కన్నసుతుఁడు కరణుండను నీ
నామమునఁ బరఁగుననిమును, ధీమంతులు తేటపడఁగఁ దెలిపిరి జగతిన్.

క. క్షాత్రితవిప్రాంగనకును, రాజునకుం బుట్టినతఁడు ♦ రథసూతుఁడు వి
ప్రాత్రితవిప్రాంగనకును, వైజాతికిఁ బుట్టినతఁడు ♦ వ్యవహారి యగున్.

క. కోరికతో బ్రాహ్మణకన్యక, దొరసినశూద్రుండుఁ బ్రీతి♦తో నొక్కటియై
వేడుక పుట్టించినయా, బిడ్డకుఁ బుట్టినయాతఁడు ♦ చండాలుఁ డగున్.

క. గోమటికిని శూద్రునకును, భూమీశ్వరపుత్త్రియందుఁ ♦ బుట్టుదు రోలిం
బామాగధుండు నాద్య, గ్రామాఖ్యక్షుండునైన ♦ క్షత్త్రయునన్గన్.

క. సారపునిజవంశంబునఁ, జేరి వివాహంబు తనకుఁ ♦ జేసినపతియం
దారం గఁబుట్టిన పుత్త్రుం, డౌరసుఁ డనఁ బరగు నాతఁ ♦ డధికుం డెంచన్.

ఉ. పుత్త్రులు లేరు నాకు నిది ♦ పుత్త్రిక దీనినలంకరించి నీ
క్షేత్రముగాఁగ నిచ్చెద న♦కిల్బిషమానసనీవు దీనికిం
బుత్త్రుఁడు పుట్టఁగా నతఁడు ♦ పుత్త్రుఁడు నాకని పల్కి కొన్న యా
పుత్త్రుఁడు సౌరసుండు సరి♦పుత్త్రుల కెల్లను ♦ బెద్ద బిడ్డఁడున్.

క. తనగోత్రము నతఁ డొందెను, దనవంశము నాతఁ డొందెఁ ♦ దగ నియుక్తుఁడై
తనపత్నికిఁ బుట్టించిన, తనయుఁడు క్షేత్రజుఁ డనంగ ♦ ధరణిం బరగున్.

క. ధనము గలదు పుత్త్రులు లే, రని యాసను జూపి యొరుని ♦ యాత్మజుఁ దా నే
ర్పున వెఱ్ఱు వెట్టి తగఁ జే, కొనె నేనియుఁ గృత్రిమంపుఁ ♦ గొడు కాతనికిన్.

క. కానీనుండగుఁ గన్యక, సూనుఁడు మాతామహునకు ♦ సుతుఁడం ద్రతనికిన్
వానిజనని యొరునకు నాలైనను వాఁడతనిపుత్త్రుఁ♦డగు నిక్కముగన్. 152

క. మగని దిగవిడిచి యుండెను, మగఁ డీల్గినఁ నొండె వేఱు♦మగనికి నాలై
తగఁ గనిన సుతుఁడు రెండవ, మగనికిఁ బౌనర్భవాఖ్య ♦ మహిఁ బుత్త్రుఁ డగున్.

క. పుత్త్రార్థముగా నడిగినఁ, బుత్త్రులుగలయాతఁ డాత్మ♦పుత్త్రునిఁ దనకుం
బుత్త్రునిఁగా నిచ్చినయా, పుత్త్రుఁడు దనకెందు దత్త♦పుత్త్రుం డయ్యెన్.

క. జననియు జనకుఁడు తనకును, ధన మొడఁబడి యడిగి కొనిన ♦ తనయుఁడు కొన్నా
తనికిఁ గృతకృత్యుఁడనియెదు, తనయుండగునండ్రు ధర్మ♦తత్త్వజ్ఞు లిలన్.

క. నాకొరు లేరును లేరే, నీకొడుకై యుండువాఁడ ♦ నిజముగ నన్నుం
జేకొమ్మని చనఁ జొచ్చిన, యాకొడుకాతనికిఁ దా స్వ♦యం దత్తుఁడగున్.

క. తనపుట్టింపమి యెఱుఁగును, జనకునిఁ దెలియండు గూఢ ♦ సంగతిగఁ గులాం
గనకును జన్మించినయా, తనయుఁడు గూఢజుఁడు ధర్మ ♦ తత్త్వం బరయన్.

క. ప్రతిలోమజాతుఁ డధముఁడు, సతతము ననులోమజుండు ♦ సజ్జనుఁ డని వి

జేతేఁడు నేలమేరుగిరి♦సింధువు వత్సపదంబు దూర్ప
ష్ఠాతసుఁడైనవానికిని ♦ జాంకగతార్థమువవ్వు సిద్ధమున్. 1787

పంచతంత్రము. వేంక. ఆ 2.

## దుర్వ్యసనములు

గీ. వెలఁది జూదంబు పానంబు♦ వేఁట పలుకు, ప్రల్లదంబును దండంబుఁ♦ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ ♦ వమ్ముసేఁత, యనెడు సప్తవ్యసనములఁ♦ జనదు తగుల.

భారతము, ఉద్యో. ఆ 2 ప 44.

సీ. వేఁటఁ బాండుతనూ♦విభుఁడు శాపమునొందె, ద్యూతసంగతినైష♦ధుండు నొగిలెఁ
బానంబునను యాద♦వానీకమిలఁ గూలెఁ, బరుషోక్తిఁ గౌరవ♦ప్రతతి సమసెఁ
గఠినదండమున మా♦గధుఁడు మేను దొఱంగె, భామినీరతిఁ సింహ♦బలుఁడు గడసెఁ
దగనియీవిఁ ద్రిశంకు♦ధరణిపాలసుతుండు, తలపోయరాని దు♦ర్దశఁ జరించెఁ
గీ. గాన వ్యసనంబులేడును♦ గానివగుట, యెఱిఁగి మనమున నందులో♦నించుకైనఁ
దగులొనర్పక నిల్చిన ♦ ధరణియెల్ల, నేలు నిష్కంటకముగ భూ♦మీశ్వరుండు.

రుక్మాంగదచరిత్రము, ఆ 3 ప 4.

శా. ఆలస్యంబును గామినీజనరతి♦వ్యాసక్తియున్ జన్మభూ
లోలత్వంబును రోగమున్ ఘనభయో♦ల్లోభంబు సంతోషమున్
బోలంగా నివి యాఱు నెప్పుడు జగ♦త్పూజ్యప్రతాపోదయ
శ్రీలం జెందఁగ విఘ్నకారణములై ♦ చెల్లున్ ధరామండలిన్.

చ. నెలఁతయు జూదముం బగటి♦నిద్రయు వేఁటయుఁ బానమున్ సదా
వలవని నిగ్రహంబుఁ బరి♦వాదము వాద్యము నాటపాటలున్
నిలనగు కామజంబు లివి♦యిందున సక్తుఁడు గాక మైకడిన్
వలయు నొనర్ప నెందు దశ♦వర్గము నన్ శశివంకభూషణా. శకుంత, ఆ 4.

## వేఁటనిరసనము

మత్త. వేఁట లాడఁగ దూషితంబులు♦ వేఁట లార్యవిరోధముల్
వేఁట లూర్జితధర్మహీనములు ♦ వేఁట లక్రమమార్గముల్
వేఁట లుగ్రతరాఘశాలలు♦ వేఁట లత్యపవాదముల్
మాట లేటికి భూప! వేఁటలు♦ మాని యుండుము సుస్థితిన్.

రుక్మాంగదచరిత్ర, ఆ 3 ప 77.

సీ. పోశంబు పసువులఁ♦ బొడము ఖేదంబునఁ, దగవొట్టి వడదాఁకి ♦ తనువు వలఁగు
సన్నోదకంబులా♦ యాయి వేళల లేక, యొక రోగ మెద్దియో ♦ యుద్భవించు

వాని రాజితమున్ గ్రసత్వము లాగ్రహాంబుసఁ బయిపచ్చినేని నోప్పమి కాటేల్లఁ
దళి సేవి పొదలలోఁ ♦ గరులచాటున శత్రులనరుగాంచినఁ బ్రాణహాని పుట్టు
గీ. నన్యమూగతధర్మంబు ♦ లాచరింపఁ, గాలవేళలుతప్పుటఁ ♦ గలుషమందు
నంచు నప్పుడొందు రా ♦ జ్యాభివృద్ధి,వలనుగానిది వేఁట భూ ♦ వరతనూజ.
శకుంతలాపరిణయము, ఆ 4.

## —♦ ద్యూ త ని ర స న ము ♦—

సీ. ఆహారవేళ శ ♦ య్యారతినంతఃపు,రాంగనాకేళి సౌ ♦ ఖ్యములు దొలఁగు
గెలుపోటములు రెంటి ♦ వలన నుత్సాహదై,న్యములఁ జిత్తము ప్రీతి ♦ నంద దెప్రుడుఁ
దమియుమత్సరముడెంద ♦ మునననంతంతకుఁ,బొడమికానఁడు ప్రొద్దు ♦ పోడుపుఁ గ్రుంకు
నెఱసాము మైఁ పందె ♦ మెక్కించి యోడెనేఁ, గలధనంబెల్లను ♦ బొలిసిపోవుఁ
గీ. గెలినినోడించువిధముఁదా ♦ గెలుచువిధముఁ,దలఁచుకొనుచునురాజ్యతం ♦ త్రంబుచాఁగు
రీతిఁ గోల్పడి యంచిగ ♦ ఖ్యాతిఁ జాయు, నెరప నొప్పదు జూదంబు ♦ నృపకుమార.
శకుంతలాపరిణయము, ఆ 4.

## —♦ సురాపాననిరసనము ♦—

ఆ. నెఱదలిపెక్కుజన్మ ♦ ములఁ బుణ్యకర్మముల్, పరగఁ బెక్కు సేసి ♦ పడయఁ బడిన
యట్టిరోలు జనుల ♦ కక్షణమాత్రిన, చెఱుచు మద్యసేవ ♦ సేయ నగునె.
క. భూసురు లాదిగఁ గలజను, లీ సుర సేవించిరేని ♦ యిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితు లగుదురు, చేసితి మర్యాద దీనిఁ ♦ జేకొనుఁడు జనుల్.
భారతము, ఆది. ఆ 3 పద్య 129, 131.
సీ. త్రాగి యూనాఁడు మ ♦ త్తాగొని పొరలాడు, నెఱుఁగఁ దుల్లములోన ♦ నెదిరిఁదన్నుఁ
బనిలేక చూపుఁగో ♦ పప్రసాదంబులు, భావింపనేరఁడు ♦ నావివరుస
విప్రలాపము లాడు ♦ విడువఁడు మేలంబు, మాటనొక్కటిలేదు ♦ మాటనిజము
గుప్తి పేయఁగ నోపఁ ♦ డాప్తసహాస్యంబు,రాఁగాములనుదెలి ♦ యంగలేఁడు
గీ. లజ్జ వొలియించుఁ దాలిమి ♦ యుజ్జగించు, నింద కొడిగట్టు శీలంబు ♦ చిందఁ జేయు
బ్రహ్మహత్యకు ములునూపు ♦ పాపవితతి, పానగోష్ఠివిధంబు భూ ♦ పాలపుత్త్రి.
శకుంతలాపరిణయము, ఆ 4.

## —♦ యా చ కుఁ డు ♦—

క. శరణములు వడఁకు భీతిం, బరవశవతా వొడలు రాలు ♦ పడు నెలుఁ గాహా
మరణమునకెట్టిచిహ్నము, లరయన్ యాచకుఁడు దాల్చు ♦ నచ్చిహ్నములన్.
పంచతంత్రము, వేంక. ఆ 2.

## ఉద్యోగి

గీ. అమరమండూకములు పల్వ♦లమును బత్తు, లరసి కాసారమును జేర♦నరుగుకరణి
నధిక ధనములు సత్సహా♦యములుఁ దివిరి, ధరణి నుద్యోగిఁ బ్రాపించు♦ననుకుఁ బాము

## నిరుద్యోగి

గీ. అచ్చుపడ నీతిశాస్త్రంబు♦వచ్చెనేనిఁ, బోరి నిరుద్యోగి ఫలసిద్ధిఁ♦బొందలేఁడు
తెల్లసంగ్రహంబు కరమున♦నేప ముండెఁ, నేని యాచటిపదార్థంబుఁ♦గాన లేఁడు.

క. ఉద్యోగరహితు నలసుని, నుద్యత్సాహసవిహీను♦నొల్లదు సిరి సం
పద్యోగుఁ గొల్వఁ జేరదు, చోద్యముగా వృద్ధిఁ దరుణి♦చూడనిభంగిన్. 1758

## నిత్యసంతోషము—తృప్తి

గీ. నిత్యసంతోషవంతుఁడై♦నెగడువాని, కన్నిచోటుల సంపద♦లానియుండుఁ
జెప్పులిడికొన్న కాళ్లకీ♦క్షితితలంబు, తోలు గప్పిన చందమై♦తోఁచునట్లు.

క. ఏవేళ నెంత దొరకిన, నావేళల నంతె చాలు♦నని తనమదిలో
భావించి సుఖము నొందుట, భూవర సంతోష మనఁగఁ♦బొగ డొందు సుహిన్.

పంచతంత్రము, నారా. సుహృ. ప 121, 131, 142, 150.

—♦ గద్య ♦—

శ్రీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ సుకవితావిలసితచరణజకులసంజనిత,
జానరి కొండయాఖ్యసుజనసుత, పీఠికాపురప్రభుపోషిత, సకల
జనవిధేయ, లక్ష్మణనామధేయ సంకలితంబైన
వర్ణనరత్నాకరమునందు తృతీయభాగము
సంపూర్ణము.



శ్రీ

పరమేశ్వరాయనమః

# వర్ణనరత్నాకరము

## చతుర్థభాగము



### నవగ్రహస్తుతి

చ. అరుణ శశాంక మంగళ బు•ధామరమంత్రి నిశాచరేశ్వర భా
స్వరసుత రాహుకేతువులు • సౌమ్యత నొంది యవక్రమూర్తులై
గురుతుగ నిల్చి యాపదుల•నొందక రాశిఫలంబు సంగి భా
సురశుభవీక్షణస్ఫురణఁ • జూతురు సత్కృతకావ్యకర్తకన్.

మహాలక్ష్మీపరిణయము ఆ 1 ప 8.

### మన్మథస్తుతి

క. హరుఁ డాదిగ సకలచరా, చరమయ జీవాళి నెల్ల • సతతము గాఁ హా
తురులుగ వలగతిఁ జేసిన, మరుఁ డీవుత మఖిలవశ్య•మతి మత్కృతికిన్.

కుమారసంభవము నన్నె. ఆ 1 ప 8.

మ. తనదుర్వారతరప్రతాపమునఁ జి• త్తస్నేహముల్ పట్టిసే
యు నితం డెట్టి విదగ్ధుఁడో తలఁప నో•హో యంచు లోకంబు గో
సనపుష్పంబు గరంబొప్పు దర్పకుఁడు రా•జత్సుందరాకారు శో
భనసంపన్నుఁ గృతీశ్వరుం బ్రచురసౌ•భాగ్యాన్వితుం జేయుతన్.

దశకుమారచరిత్రము, ఆ 1.

చ. గొనయము తుమ్మెదల్ చెఱకుఁ•గోల ధనుర్లత పూవుటమ్ము లే
టును నొకమాటు తానతనుఁ•డున్ మనునుగ్రు జయించి జీవరా
శి నొడుచు నేమి చెప్ప నని•చేయునుతుల్ తగు మోహనప్రవ
ర్తనగల కాముఁ డీవుత ము•దంబున మీకిలఁ గామసౌఖ్యముల్. 1764

విక్రమసేనము.

## అష్టాదశపురాణములు

మ. భువి బ్రహ్మాండము వామనంబు గరుడం◆బున్ స్కాందమున్ గూర్మభా
గవతాగ్నేయకమాత్స్య లైంగములు మా◆ర్కండేయమున్ బాద్మవై
ష్ణవ శైవంబులు నారదీయము భవి◆ష్యద్బ్రహ్మవైవర్తది
వ్యవరాహంబులునాఁ బురాణములు ము◆ఖ్యాలయ్యె విప్రోత్తమా.

విష్ణుపురాణము, ఆ 4 ప 99.

సీ. బ్రహ్మాండమును బ్రహ్మ◆బ్రహ్మవైవర్తముల్, వారాహవాసిష్ఠ◆వామనములు
పద్మపురాణంబు◆భాగవతము గారుడంబు భవిష్యో◆త్తరంబు మఱియు
స్కాందపురాణ మా◆ర్కండేయ మాత్స్యలైంగ్యంబులు నారదీ◆యంబు వైష్ణ
వంబు నాశివ్యకూ◆ర్మంబు లిట్టిసంఖ్యల విశ్వలోకవి◆ఖ్యాతిఁ గాంచి
గీ. వెలయు నష్టాదశపురాణ◆ములును మఱియు, నుపపురాణంబులును జూడ◆నుర్విలోన
దమర నీవిశ్వకర్మపు◆రాణమునకు, నరయనంగంబులాయుపాం◆గములుగాదె.

విశ్వకర్మపురాణము, ఆ 1 పే 6.

## పురాణపఠనము

శా. ఆద్యంతంబులఁ దేటతెల్లముగ వా◆క్యార్థంబు లార్యావళి
హృద్యంబౌ పటుభావముం దెలుపుచున్◆శ్రీరాగముఖ్యంబులం
జోద్యంబౌ శ్రవణోత్సవంబు నెఱయన్◆శ్రోతల్ సభన్ మెచ్చఁగా
నుద్యత్ప్రీతిఁ బురాణముల్ సదువు ధ◆న్యుం డొందు భద్రంబులన్.

శేషధర్మములు, అ. సు. ఆ 2 పే 47.

## పురాణశ్రవణము

క. దినదినముఁ బురాణములను, వినువారికి నిత్యకృతవి◆విధదోషంబుల్
జను గంగాస్నాన మొనర్చిన సుకృత మవారతంబు◆సిద్ధించు నృపా. 1768

శేషధర్మములు, అ. సు. ఆ 2 పే 47.

## పురాణలక్షణములు

గీ. సరవి సర్గంబు నాఁ బ్రతి◆సర్గ మనఁగ, వరుసతో వంశవంశాను◆చరితములనఁ
గ్రమపరిప్రాప్తి మన్వంత◆రము లనంగ, నలరఁ బురాణంబునకు నైదు◆లక్షణములు

కాశీఖండము, ఆ 1 ప 74.

# భారతమాహాత్మ్యము

సీ. ధర్మతత్త్వజ్ఞులు ♦ ధర్మశాస్త్రం బని, యధ్యాత్మవిదులు వే♦దాంత మనియు
నీతివిచక్షణుల్ ♦ నీతిశాస్త్రం బని, కవివృషభులు మహా♦కావ్య మనియు
లాక్షణికులు సర్వ♦లక్ష్యసంగ్రహ మని, యైతిహాసికు లితి♦హాస మనియుఁ
బరమపౌరాణికుల్ ♦ బహుపురాణసముచ్చయం బని మహిఁ గొని♦యాడుచుండ
గీ. వివిధవేదతత్త్వ♦వేది వేదవ్యాసుఁ, డాదిముని పరాశ♦రాత్మజుండు
విష్ణుసన్నిభుండు ♦ విశ్వజనీనమై, పరగుచుండఁ జేసె ♦ భారతంబు. 1770
సీ. ఆయురర్థులకు దీ♦ర్ఘాయురవాప్తియు, నర్థార్థులకు విపు♦లార్థములును
ధర్మార్థులకు నిత్య♦ధర్మసంప్రాప్తియు, విజయార్థులకు సువి♦జయసంపత్తియుఁ
బుత్త్రార్థులకు బహు♦పుత్త్రసమృద్ధియు, సంపదర్థులకిష్ట♦సంపదలును
గావించు నెప్పుడు ♦ భావించి వినుచుండు, వారల కిమ్మహా♦భారతంబు
ఆ. భక్తియుక్తులైన ♦ భాగవతులకు శ్రీవల్లభుండు భక్త♦వత్సలుండు
భవభయంబు లెల్లఁ♦బాపి యిష్టార్థసంసిద్ధిఁ గరుణతోడఁ ♦ జేయునట్లు.
మ. అమితాఖ్యానకశాఖలం బొలిచి వే♦దార్థామలచ్ఛాయమై
సుమహావర్గచతుష్కపుష్పవితతిన్ ♦ శోభిల్లి కృష్ణార్జునో
త్తమనానాగుణకీర్తనార్థఫలమై ♦ ద్వైపాయనోద్యానజా
తమహాభారతపారిజాత మమరున్ ♦ ధాత్రీసురప్రార్థ్యమై.
సీ. ఇమ్మహాభారతం♦బిమ్ములఁ బాయక, విహితావధానులై ♦ వినుచు నుండు
వారికి విపులధ♦ర్మారంభసంసిద్ధి,యగుఁ బరమార్థంబ ♦ యక్రమమున
వేదముల్ నాలుగు ♦ నాదిపురాణముల్, పదునెనిమిదియుఁ ద♦త్ప్రమితధర్మ
శాస్త్రంబులును మోక్ష♦శాస్త్రతత్త్వంబులు, నెఱిఁగినఫల మగు ♦ నెల్లప్రొద్దు
ఆ. దానములను బహువి♦ధక్రతుహోమజప, బ్రహ్మచర్యములను ♦ బడయఁ బడిన
పుణ్యఫలముఁ బడయఁ♦బోలు నశేషపాపక్షయంబు నగు శు♦భంబుఁ బెరుఁగు.
భారతము, ఆది. ఆ 1 ప 71.

సీ. కమనీయధర్మార్థ♦కామమోక్షములకు, నత్యంతసాధనం♦బయినదాని
వేదకోటులతోఁ దవిలి తన్ ♦ వినుచున్న వారల, కభిమతశుభకరం♦బయినదాని
రాజుల కఖిలభూ♦రాజ్యాభివృద్ధిని,త్యాభ్యుదయప్రదం♦బయినదాని
వాఙ్మనఃకాయప్ర♦వర్తితానేకజన్మాఘనిబర్హణం♦బయినదాని
ఆ. సర్వవాక్ప్రబంధ ♦ శతసహస్రశ్లోక, సంఖ్యమయినదాని ♦ సర్వలోక

పూజ్య మయినదాని ♦ బుధనుతవ్యాసమహాముని ప్రణీత ♦ మయినదాని.

చ వినుతపరాక్రముల్ ధృతవివేకులు సత్యసమన్వితుల్ యశో
ధనులు కృతజ్ఞు లుత్తములు ♦ ధర్మపరుల్ శరణాగతానుకం
పను లనఁగాఁ బ్రసిద్ధు లగు ♦ భారతవీరులసద్గుణానుకీ
ర్తనముల నొప్పుదాని విది ♦ తం బగుదాని సభాంతరంబులన్.

భారతము, ఆది. ఆ 1 పద్య 31, 33, 65, 71, ఆ 3 ప 9-10.

గీ. మానుగా నింద్రియంబుల ♦ లోన మనసు, సురలలోన ముకుందుండు ♦ నరులలోన
బ్రాహ్మణుఁడుఁ బోలె నెక్కుడై ♦ భారతంబు, వెలయు సకలదివ్యపురాణ ♦ వితతిలోన.

క. జలపూరము పాండవకథ, జలరుహనివహములు విదిత ♦ సరసాఖ్యానం
బులు మృదుపదములు హంసమ్ములు వేఁదిని భారతాఖ్యఁ ♦ బొలుచుకొలనికిన్.

మార్కండేయపురాణము, ఆ 1 ప 51-52.

## భారతపఠనము

ఉ. అనసూయున్ జితకామరోషుఁ గమనీ ♦ యాకారు సత్యోక్తిశీ
లు నశేషాగమశాస్త్రతత్త్వనిపుణున్ ♦ లోకజ్ఞు వాగ్మిన్ ఋజున్
జనతాసమ్మతు భవ్యభక్తినియమ ♦ శ్రద్ధాసమేతుం బ్రియం
బున సత్కారము లొప్ప వాచకునిఁగాఁ ♦ బూజించి యుంచం జనున్.

గీ. అతఁడు విమలవస్త్రోపవీ ♦ తాంగరాగ, మాల్యభూషణశోభియై ♦ మహితలిఖిత
హృద్యమగుపుస్తకముఁ గొని ♦ యెలమి నొలయఁ, బ్రాఙ్ముఖోదఙ్ముఖత్వత ♦ త్వరతనుండి.

క. నారాయణు నరుని సమ,స్కారంబునఁ దలఁచి వాణిఁ ♦ గల్యాణి నెదం
జేరిచి వేదవ్యాసుల, నారాధించి మఱివలయుఁ ♦ బ్రారంభింపన్

చ. మునుకొని పోవ కెంతయును ♦ ముట్టక నిల్వఁగ భావమున్ రసం
బును వెలయం దగుల్పడక ♦ పొందుగ వాక్యవిభాగ మొప్పఁగా
నెనిమిది తానకంబులను ♦ నేర్పడి వర్ణము లుల్లసిల్లఁ నే
ర్పెనయఁగ వాచకుండు కడు ♦ నింపగురీతిఁ బఠింపగాఁ దగున్.

## భారతశ్రవణము

క. వినఁ నమ్మికయును భక్తియు, నెనయఁగ శుచియై శమంబు ♦ ఋజుతయు సత్యం
బును గల్గి విమత్సరమతి, వినవలయును భారతంబు ♦ విధియుక్తముగన్.

క. పరువడి పర్వసమాప్తుల, వరవర పుణ్యాహవాచ ♦ నపురస్సరభూ
సుర భోజన పూజన విధు, లిరవుగ నొనరింపవలయు ♦ నెంతయుఁ బ్రీతిన్. 1783

సీ. ఆదిపర్వము విని ♦ యాంచితమూలఫలాజ్యమధుప్రాయ♦మైనహోమ
సమున బ్రాహ్మణతుష్టి ♦ సలుపుట ధర్మంబు,వినఁ సభాపర్వంబు♦విని హావిష్య
మిడునది యారణ్య♦మింపార విని తని,పండ్లును మేలిమం♦పటము శీత
జలకుంభములు♦గల♦ సర్వకామసమృద్ధి, గలిగించునన్న మిం♦పొలయ నొసఁగఁ
గీ. దగు విరాటపర్వము విని♦తద్విధంబు, చేసి మఱియు విశేషించి ♦ చిత్రమాల్య
విభవరమ్యాంబరంబులు ♦ వేడ్క నిచ్చి,యుక్త మమృతాంశువంశమ♦హాబ్ధిచంద్ర.
క. నవగంధమాల్యపూర్వక, వివిధాన్నము లధికతృప్తి ♦ వెలయసమర్పిం
పవలయు వినయముతో విప్రవరుల కుద్యోగపర్వ ♦ పర్యాప్తిమెయిన్.
క. సరసమును సుగంధియునగు, పరమామృతతుల్యబహుళ ♦ పాకములన్ భూ
సురులకు నభీష్టభోజనపరిణతి సేయునది భీష్మ♦పర్వసమాప్తిన్.
క. మనుజేంద్ర ద్రోణపర్వం,బున కడపట ధరణిదేవ♦ముఖ్యులకుం గో
రిన కుడుపు పప్పు బాణా,సనశరకాత్రేయకము లొ♦సంగవలయున్.
గీ. కర్ణపర్వంబు దా విని ♦ కడను నగ్రి,జన్ములకు నన్న మిడునది ♦ శల్యపర్వ
మున నపూపమోదకఘృత♦భూరిరైన, యంచితాహారకల్పన ♦ సర్వ మనఘ.
క. ఘృతముద్గసూపబహుళం, బతులితభోజనము సౌప్తి♦కాంతంబున స
న్మతి నొడఁగూర్చి ధరాదేవతలకుఁ బరితృప్తి చేయు♦వలయుం బ్రీతిన్.
క. స్త్రీపర్వంబునరత్నము,లోపి తొలుత నిచ్చి బ్రాహ్మ♦ణోత్తమతతికిన్
భూపాల సేయ మొప్పను,హాపూర్తిగఁగుడువఁబెట్టు♦నది కడు భక్తిన్.
గీ. శాంతిపర్వమ్ము నానుశా♦సనికము మఱి, పూర్ణమైనప్పు డాజ్యసం♦పూర్ణవృష్టి
మృదుహావిష్యాన్న మిడునది ♦ మేదినీసు,పర్వులకు భవ్యదక్షిణ♦పూర్వకముగ.
గీ. వరుసనశ్వమేధాశ్రమ ♦ వాసపర్వ, యుగ్మమున భక్ష్యభోజ్యాది ♦ యుక్తవాంఛి
తాన్నమును హావిష్యంబు నిం♦పారఁ గుడుచు,వారు ధారుణీదేవతా♦వర్యులెలమి.
క. అనులేపములును మాల్యములును వస్త్రమ్ములును నిచ్చి ♦ లోకోత్తరభో
జన మిడునది దగ మౌసల,మున దక్కిన రెండుపర్వ♦ముల సమ్మతముగన్.
క. వాచకుఁడు సంతసిల్లిన, వాచతురాననుఁ దొట్టి ♦ యమరవరులు భ
వ్యాచారతుష్టి నొందుదు,రాచంద మెంచర్ప నిచ్చు ♦ నభ్యుదయంబున్.
గీ. అనఘ వాచకుఁ డెట్లుల్ల ♦ యుష్ణుఁ డఖిల,మునకు నాలేఖకుండును ద♦నూన్యతతోడ
నిష్టశుభదంబు సభ్యుల♦ నెల్ల నీగి,వలన నలరించి దీవన ♦ పడయవలయు.
క. భారతపంచమవేద, ప్రారంభమునందుఁ దత్స♦మాప్తిని వెలయున్
ధీరమతిని బహువిప్రసమారాధనమది మహార్హ♦ సంపాదించున్. హరివంశేషు, ఉత్త ఆ10.

## —♦ సౌప్తికపర్వము ♦—

క. సుతసౌప్తికాదిపర్వ, త్రితయంబునఁ దనరి వినుమ తీసురవరస
మ్మతమై సౌప్తికపర్వము, ప్రతిభ వినం బొలుచు దశమపర్వం బగుచున్.

## —♦ స్త్రీపర్వము ♦—

క. పర్వచయ స్త్రీపర్వాదిక, పర్వంబుల నెనిమిదింటఁ గృపాయుత మై స్త్రీ
పర్వంబు పదునొకం డగు, పర్వము నా వెలయు సుకవి పండితసభలన్.

## —♦ శాంతిపర్వము ♦—

క. ఒనరుఁ ద్రయోదశపర్వం, బనఁగా ననుశాసనాద్యమగు పర్వయుగం
బన ఘనమై విబుధశ్రేణిమతం బై యానుశాసనికపర్వ మిలన్.

## —♦ అశ్వమేధపర్వము ♦—

గీ. అభిమతం బగునశ్వమేధాదికద్వి, పర్వయుత మై చతుర్దశపర్వ మనఁగ
నాశ్వమేధికపర్వ మత్యంతవివిధ, వస్తువిస్తర మగు బుధవరులసభల.

## —♦ ఆశ్రమవాసపర్వము ♦—

క. అమితార్థయుక్తితో నా, శ్రమవాసాదిత్రిపర్వ సహితం బయి యా
శ్రమవాసపర్వ మత్యు, త్తమకథలను వెలయుఁ బంచదశపర్వం బై.

భారతము, ఆది. ఆ 1 పద్య 49-68.

## —♦ రామాయణపఠనము ♦—

ఆ. శ్లోకమైన నొక్క శ్లోకార్థమైన రా, మాయణము పఠించునట్టి మనుజుఁ
డఖిలదురితవిరతి నణఁగించి శ్రీవిష్ణు, పదమునొందు సకలబాంధవముగ.

పద్మపురాణము, ఆ 9 ప 60.

## —♦ స్కాందపురాణము ♦—

సీ. పద్మాదికంబులు పదియు నెనిమిదియు, నాదిపురాణంబు లాపురాణ
జాతంబు నాల్గులక్షల సంఖ్య గలయది, యుపపురాణంబు లం దుద్భవించెఁ
బదునొకండవనిరై బహుసంహితలతోడ, బహుఖండములతోడ బహువిచిత్ర
కథలతో నేకలక్ష గ్రంథపరిమాణ, కలితమై శ్రీమహాస్కాంద మొప్పు

గీ. నమ్మహాస్కాందమునకు సారాంశ మనఁగ, నాల్గుపురుషార్థములకుఁ గారణ మనంగ
బ్రహ్మవిద్యకు నాదికారణ మనంగ, నఖిలఖండంబులందుఁ బ్రఖ్యాతి వడసె.

గీ. మూడులక్షలఁ బదియేను [illegible] దాఁ [illegible] గ్రంథ [illegible] తోడ

సముధికస్ఫూర్తి నేపురా♦ణములు సాటి, గరిమకందంబులగు మహా♦స్కాందమునకు.

కాశీఖండము, ఆ 1 ప 71, 72.

## —♦ సూర్యుఁడు ♦—

సీ. వరదాభయాబ్జవి♦స్ఫురితచతుర్బాహు, నరుణప్రభాశుభా♦యతనదేహు
దివ్యపీతాంబర ♦ దిన్యమానకటీరు, విలసితావయవగం♦ధిలపటీరు
చారునాసానన ♦ స్మేరలసద్భాషు, కౌస్తుభవనమాలి♦కావిభూషు
వరరత్నమకుటక♦ రకుండలోజ్జ్వలవర్ణు, మకరకుండలభాస♦మానకర్ణు
గీ. దివ్యభూమణవర్ధాత్రు ♦ దీర్ఘనేత్రు, ననఘుసంజ్ఞాసువర్చల ఛా♦యాసమేతుఁ
బింగళాద్యనుచరయుక్తుఁ ♦ బ్రీతభక్తు, సూర్యనారాయణస్వామి ♦ సుగుణధామి.

బలరామక్షేత్రమాహాత్మ్యము, ఆ 5.

## —♦ చంద్రుఁడు ♦—

సీ. కలశపాథోరాశి ♦ గర్భవీచిమతల్లి, కడుపార నెవ్వానిఁ ♦ గన్నతల్లి
యమలాక్షునకుపటా♦వనవాటి యెవ్వాఁడు, వన్నె వెట్టునసార్థ♦వంశ్రుఁ బుత్త్వ
సకలదైవతబుభు♦క్షాస్ఫూర్తి యెవ్వాని, పుట్టుకామునులేని ♦ మెట్టపంట
కటికిచీకటితిండి ♦ కరములగిలిగింత, యెవ్వాఁడు దొగకన్నె ♦ నవ్వఁ జేయు
గీ. నతఁడు వొగడ్డాంను ఘనకైట♦భారిమఱఁది, కళలనెలవగువాఁడు చు♦క్కలకు రేఁడు
మిసిమిపసను వలరాజు ♦ మేనమామ, వేవెలుంగుల కొరజ్యోడు ♦ రేవెలుంగు.

ఆముక్తమాల్యద, పీఠిక. ప 19.

మ. తళుకుంజెక్కుల రత్నకుండలసము♦ద్యత్కాంతిరంజిల్ల సు
జ్జ్వలముక్తామణిమాలికానఖులు వ♦క్షస్సీమఁ బొల్పార ని
ర్మలసౌరభ్యపటీరచర్చ సుమమా♦రంభైన నెమ్మేనఁ బెం
పలరన్ వచ్చు సుధాంశుఁ జూచి గురుఁ డ♦త్యానందముం బొందుచున్. కవిమ. ఆ 2.

## —♦ పద్మనాయకకులము ♦—

గీ. అట్టిహరిపాదపంకేరు♦హంబువలన, సంభవించెను గాంభీర్య♦శౌర్యధైర్య
కార్యచాతుర్యసౌందర్య ♦ ఘనవిలసదనుపమంబుగు పద్మనా♦యకకులంబు.
చ. రుచిరవారిద్యుధూడనశి♦రోజవిరాజదురోజమండలీ
విచికిలమంజరీ ఘుసృణ♦విభ్రమవిభ్రమకృద్విభావలీ
సుచిరయశఃప్రతాపపరి♦శోభితమై ఘనదానవిక్రమ
ప్రచురతఁ బద్మనాయకకు♦లం బమరారు జగత్ప్రసిద్ధిగన్.

వాసవదత్తాపరిణయము, వ. పీ. ఆ 1 ప 34, 35.

గనుపడు విశ్వకర్మ మహితాంశము లందురు క్రౌంచభేదనా.

నాగరఖండము, ఆ 1 ప 116, 118-120.

## విశ్వకర్మచారిత్రము

గీ. అతిరహస్యములందు రహస్య మనుచు, సూక్ష్మములకెల్లనత్యంతసూక్ష్మ మనుచు
గ్రంథసాహస్రసంయుక్తమై గలిగె విశ్వకర్మచారిత్ర మఖిలవిఖ్యాత మనుచు
చ. హితమొనరించు సాధకుల కెల్లను భుక్తియు ముక్తి నిచ్చు శా
శ్వతమగు విశ్వకర్మసుత శాస్త్రము నా నమృతంబు మాడ్కి వి
శ్రుతమగు తత్త్వసారములు సొంపు వహించి పురాణరాజమై
యతులితలీలతోఁ దగ నిరంతరమున్ శిఖిరాజవాహనా.

నాగరఖండము, ఆ 2 ప 3, 4.

## విశ్వకర్మముఖాద్యవయవములవలనఁ గలిగినపురాణములు

క. తుండమునఁ బద్మమును మార్కండేయము నాభియందు గారుడము తనూ
కాండంబున మాళిని బ్రహ్మాండంబును విశ్వకర్మయం దుదయించెన్.
గీ. శ్రోత్రముల భాగవతమును నేత్రములను, నారదీయంబు లైంగ్యంబు నఖరములను
ఘ్రాణమున వైష్ణవం బంతరమున వాయు,వంబు నుదయించెనో బర్హిణఖగతురగ.
సీ. హస్తాగ్రమున శైవ మాగ్నేయ మంఘ్రుల,ప్రమదంబు వలనఁ గౌర్మ్యంబు రసన
బ్రాహ్మ్యంబు జంఘల బ్రహ్మవైవర్తంబు, సూనువులను భవిష్యోత్తరంబు
ధ్యానసంగతిని మాత్స్యంబు వరాహంబు, హృదయదేశంబున నెందు మిగుల
ఘనతరంబైనట్టి స్కాందంబునను గల్గు, ప్రకటితంబైన పురాణసమితి
గీ. మహిని దీపించె వేదసమ్మతి దనర్చి, శాశ్వతంబుగ జనియించె విశ్వకర్మ
పరమ సర్వాంగములనని పలుకఁ దనరె,ననుచు విన్నప మొనరించి యమరమౌని.

నాగరఖండము, ఆ 2 ప 25-29.

## విశ్వకర్మవలన పంచభూతాద్యుత్పత్తి

చ. అరయ సహస్రశీర్ష పురుషాఢ్యు శిఖిజ్జ్వలనుండు మోమునన్
హరుఁడు భుజంబులన్ హరి నిజాంకములం దజుఁ డంఘ్రులందు మున్
సురపతి చంద్రుఁ డాత్మవల సూర్యుఁడు కన్నులఁ బ్రాణపత్తి ను
త్కరమగు వాయు వున్నభము గైకొని నాభిని బుట్టె నెంతయున్.
క. శిరసున గగనము ధారుణి, చరణంబులఁ గర్ణముల దిశలు నుదయించెన్
పరమోపకారుఁడు జగ,ద్గురుఁ డనఁ దగు విశ్వకర్మకును సేనానీ. 1845

నాగరఖండము, ఆ 2 ప 47, 48.

## — విశ్వకర్మకు త్రిమూర్త్యాత్మకత్వము —

క. కమలాసనరూపం బుదయమునన్ మధ్యాహ్నవేళ • హరరూపము న
స్తమయంబున శ్రీహరిరూపమునగు నవ్విశ్వకర్మ • పరమాకృతియై. 1846

నాగరఖండము, ఆ 2 ప 62.

## — విశ్వబ్రాహ్మణులు —

ఉ. స్వస్తిసమస్తభవ్యగుణ • సాధకు లీశ్వరపాదయుగ్మవి
న్యస్తమనస్సరోజులు స • మాప్రతిమానులు సాధువుల్ సదా
భ్యస్తఘనశ్రుతిస్మృతిన • యవ్యవహారులునైన విశ్వక
ర్మస్తవనీయవంశజు ల • మాన్యచరిత్ర లెఱుంగఁ జెప్పెదన్.

సీ. సర్వలక్షణగుణ • సంపన్ను లసమాన, పరమవ్రతులు జగ • న్నుతులు దుష్ట
నిగ్రహుల్ సజ్జనా • నుగ్రహుల్ లోకప్రతీతులు ధార్మికుల్ • ధీరమతులు
శ్రీయుతుల్ పంచాక్ష • రీమంత్రసిద్ధు లష్టాంగయోగనిరూఢు • లింగితజ్ఞు
లుచితసదాచారు • లూర్జితుల్ బ్రహ్మని, ష్ఠాగరిష్ఠులు సత్య • సంధు లఖిల

గీ. వేదవేదాంగపారగుల్ • విశ్వకర్మ, దైవతధ్యానశీలురు • తత్త్వవేత్త
లమితశాస్త్రపురాణజ్ఞు • లైతిహాసి, కులును సిద్ధాంతవిదులు వా • రలు దలంప.

సీ. పెండోటపురవర • మందుఁ గాఁపుర ముండు, విశ్వకర్మాఖ్యని • విబుధవరులు
శ్రీమాయకొండుధ • రిత్రీవరాగ్రహా, రవ్యాప్తిదత్తవి • ఖ్యాతములగు
నగ్రహారాదిస • మగ్రసుస్వాస్థ్యాది, కములు గల్గుటచేత • కలిమిఁ గాంచి
వేదశాస్త్రాదిక • విద్యలు జదివి దివ్యజ్ఞానసంపత్తి • నతిశయిల్లి
సకలయజ్ఞంబుల • సగవితోఁ గావించి, నిరతాగ్నిహోత్రులై • నెగడుచుండి

గీ. సుకవితానుమానినిశతా • ధ్వరుని గురుని, ధిక్కరించియు నిరతవి • తీర్ణమహిమ
ధైర్యమున వారిదాద్రుల • దలఁకునటులఁ, జేసి బ్రహ్మణ్యులైరి యీ • స్థిరమస్థిగత.

నాగరఖండము, ఆ 2 ప 32, 33, 50.

## — పుత్త్రుఁడు —

గీ. దేవపితృర్షి ఋణములు • దీర్చియధిక, భక్తిఁ బరిచర్యఁ జేయుచుఁ • బరగి తండ్రి
కరుణ బ్రతికియుండెడువాఁడు, గానియనఘు, విమలశరీరప్రదుండను • తనయుఁడగును.

సీ. తండ్రిచే సంపాది • తములైన ధనయశం, బులు ప్రతాపము పాలి • వోవకుండ
దప్పక వర్తించు • తనయుఁడు మధ్యముం, డాత్మీయసత్త్వసా • మగ్రిఁ జేసి
తండ్రిమహత్త్వంబు • దద్దయుఁ దనరార, నొనరించు నందనుం • డుత్తముండు

తండ్రిసద్గుణసము•దయము దుర్గుణుండువడ, మెలఁగుపుత్త్రుఁడుహీనుఁ•డలఘుశౌర్య
గీ. తానవెలయు మనుష్యుఁ డు•త్తముఁడు పిత్రుపి, తామహులచేత వెలయువాఁ•డుజగతి
మధ్యముఁడు మాతచేతను • మాతృబంధుగణముచేత వెలయువాఁడు• నష్టతరుఁడు.

మార్కండేయపురాణము, ఆ 1 ప 123, ఆ 2 ప 340.

సీ. కులము మేదినిమీఁద • ఖిలము గాకుండంగ, నభివృద్ధికారణం • బాత్మజుండు
పౌష్కరవంబైన సం•సారద్రుమంబున, కాలవాలస్కంధ • మర్భకుండు
జనకులకు హర్ష•జలరాశియుబ్బింపఁ, బూర్ణేందుబింబంబు • పుత్త్రకుండు
గృహమేధిధర్మల•క్ష్మికి వీపు మోపంగ, పెనువైనయాధార•భిత్తి సుతుఁడు
గీ. తనయుఁ డాలోకపథమున • కనుపువాఁడు, మందిరాంతరదీపంబు • నందనుండు
సూనుఁ డిలువేల్పు గాకుండ • స్వామికర్త్రు, యపరవయసున నాలంబ•యష్టికొడుకు.

శకుంతలాపరిణయము, ఆ 4.

గీ. బలకలితమయ్యు ఘనరోగ•కలితమయ్యు, మిపులసుఖదుఃఖములుదెచ్చు•మేనిరీతి
సుతుఁడుగుణియైనవద్వయో•న్నతియొసఁగు, సతఁడుఖలుఁడైనఁగులము దూషితముసేయు.
క. అది గావునను సుపుత్త్రుం, డుదయించి కులంబు సద్గు•ణోన్నతిచేతన్
విదితముఁ జేసినఁ దండ్రికి, నది పుణ్యవిపాకయోగ• మనఘచరిత్రా.

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 2.

## —• పుత్త్రగర్హణము •—

చ. కొడుకులు గల్గుదాఁక నొక • కొన్నిదినంబులు చింత, నందనుల్
వొడమిన నాయువున్ బలము • బుద్ధియు విద్యయుఁజాలఁ గల్గఁగా
నుతుఁగనిచింత గల్గి తను•నోలి భజింపని చింత తండ్రికె
ప్పుడుఁ గడుఁ జింత సేయుదురు • పుత్త్రులు శత్రులుగాక మిత్రులే.

కవిరాజమనోరంజనము, ఆ 1.

## —• వీరముష్టివారు •—

సీ. నీలమేఘముకాంతి • నెనయునల్లనిమేన్నులందు విభూతినిం•పొందఁదాల్చి
శిరమున నవరకు•సేరులు వరఝల్లులూగి వెన్కభాగమున్ • దూగులాడ
తలచుట్టులింగముల్ • వలగొని మెఱయంగఁ, బల్లవీసంబులు • పైకినిగుడ
మొలచుట్టుదేవతా•ముఖరూపముల పేర్లు, కాషాయవస్త్రముల్ • కాళికోక
గీ. అమర ఘటియించి వీరప•ల్కులను దాల్చి, గొడుగుపావలపైనెక్కి•కడుముదమున
భళి రె వీరమహావీర• భద్ర యనుచు, వార్భటించుచు నడిచి ర•ణ్యవసరమున.

మాంస్పృహంబులు దుర్గంధ ♦ మందిరములు, నీకుఁ జోర నర్హమే భూమి♦నిర్జరేంద్ర.

సురాభాండేశ్వరము, ప 79.

## —♦ తలవరులు ♦—

సీ. గండ్రగొడ్డండ్లు గొం♦గళ్లును జికినిచల్లాడము లైల చ♦ల్లాడములును
గుఱుతు చుంగులతల ♦ గుడ్డలు గావిబొ, ట్లినుపకడేలుఁ దా♦ళ్ళి నుపదుడ్లు
నీలి కాసెలు మెడ ♦ నీలికుచ్చులత్రాళ్లు, బిరుదైన వడిసెలల్ ♦ బిల్లమెట్లు
కాసమేనులు బలు♦కోరమీసములును, బిగివంపుచూపులు ♦ జెట్టుగుర్రిడ్లు
గీ. నొసలఁ గోరోచనపుఁబూఁత ♦ లుట్టిపడఁగ, వచ్చి తలవరులెల్లను ♦ మెచ్చుదొరయ
నిలిచి చేతులు జోడించి ♦ నేర్పుతోడ,దండముడిరోరయైయున్న♦ధరణివిభుఁడు.

విల్హణీయము, ఆ 1 ప 80.

## —♦ చోరసంగ్రహణీయవస్తువులు ♦—

సీ. భవనదేవాహిత ♦ భ్రమరపేటికవాలు, కాభస్త్రీతలముల్లు ♦ గద్దగోళ్లు
ములుదోరణముబట్టు ♦ మొలత్రాటికుఱువాఁడ,కైదువుదెసకట్టు ♦ కావిబొట్టు
జిలుగుఁగన్నపుఁగత్తి ♦ బలపంబుమొగమాయ, మందుతాలపుటాకు ♦ మైలగోఁచి
మదుపుటాకులపోక ♦ పొడికాయమోరచ్చు, చెప్పులు భుజగవృ♦శ్చికచికిత్స
గీ. సుప్తివృద్ధికరౌషధ♦క్షోభమసిత, వసనభంగంబు ... ...
... ... ... ... ...

పంచతంత్రము, వేంక. ఆ 2.

సీ. మందులముడి తొంట♦మలఁచివేసిరసిగ, బొల్పుగాసఁగనీని ♦ బొమిడికంబు
పసలకుఁ దాసు గ♦స్పదకుండఫాలభాగమునఁ జెట్టిసయాట్టి♦కావిబొట్టు
నెడవంకఁ బచ్చగా♦పిడివంకిఁ బొంకించి, జారికట్టినసీలి♦బాహుదట్టి
వలకేలఁ బిడెము డాఁ♦పలికేలఁ గేడెంబు, సంగఁబునందు వ♦జ్రాంగిజోడు
గీ. మీఱ మతీయునడై తేయ ♦ చోరభటుఁడు,కురుచకన్నపుఁగత్తిసా♦కు,పొడిభరణి
మూలికల్ మణుల్ వాకట్టు♦ మొదలుగాఁగఁ,జోరసంగ్రహణీయవ♦స్తువులుఁగొనుచు

దశావతారచరిత్ర.

## —♦ బ్రహ్మఘాతుకులు ♦—

సీ. మార్గభేదియును బ్రా♦హ్మణమానరుండును, స్వార్థపాకియును వ♦త్యాశనుండు
వేదవిక్రయుఁడు ♦ వీరవ్రతుడు బ్రహ్మఘాతుక లనతి విప్ర♦గణములయిన
ధనముఖ్యవస్తువుల్ ♦ తగ నిత్తు నని పిల్చి, యంత లేదని పల్కు♦ నట్టివాఁడు

ధర్మరహస్యంబు ♦ తనకు బోధించిన, గురునితో వైరంబు ♦ గూర్చినాఁడు

గీ. చెలువునకు నీరు ద్రావింపంగఁ ♦ జేరఁబట్టి, గోగణంబుల మరలించు ♦ పత్నిఁ జంపు
బ్రహ్మఘాతుకుఁ డని చెప్పఁ ♦ బడిన వీఁడు, అనఘ ... ...

## —♦ బ్రహ్మహత్యాస్వరూపము ♦—

సీ. మోకాళ్లు దిగఁబడ ♦ ముడిచికట్టినధాతు, శాటంబు గలకటి ♦ స్థలముతోడ
దట్టంబుగాఁగఁ జం ♦ దనపంక మలఁదిన, యరుణాంబువికటకే ♦ శాంబుతోడఁ
బిల్లికన్నులఁబోలు ♦ పింగళాక్షులందుఁ, గ్రూరంబులగు మిడి ♦ గ్రుడ్లతోడఁ
బొదఁగట్టువడు జపా ♦ పుష్పంబు చెరివిన, చికిచికిపల్లవం ♦ నురికలతోడఁ

గీ. గఱిసదంష్ట్రికాఫాలవ ♦ క్త్రంబుతోడ, జిహ్వనటునిట్టు గ్రొల్లాడు ♦ జిహ్వతోడఁ
గత్తితోఁ బట్టితో మహోగ్రత్వమొంద, ఫాలనేత్రుఁడు సృజియించె ♦ బ్రహ్మహత్య.

కాశీఖండము, ఆ 5 ప 110.

## —♦ బ్రహ్మరాక్షసాకారము ♦—

సీ. ఎలనీటిబొండలం ♦ బులఁబోలె మెదడెల్లఁ జుట్టిపై దివిఁ బొల్లు ♦ పుఱ్ఱెగములు
నెఱచి గిటికజీవ ♦ లేర్పడఁ గుదముట్టఁ, జీఁకిన నులిపచ్చి ♦ కీకసములు
దొనదొనయనునీఁగ ♦ తుట్టెల రూపెరు, పడక క్రంపలనుగ్రే ♦ లెడు నరుసులు
ధూళ్లమక్కెక్కి మం ♦ గళ్లతిప్పలు రేఁగు, వడ పునగాలినా ♦ డెడు నెఱికలు

గీ. దునిసిన శరాంగకములబొ ♦ త్తులను గమిచి, పోక యొండొంటితోఁ బెణఁ ♦ కులాడు
శ్వాపదంబులఁ బదహతి ♦ గ్రస్సి నలుచు, నరుగు దశవర్ణముఖు త్రోవ ♦ నగరి నెదుట.

సీ. ముంగాళ్లఁ జాఁగిపై ♦ ముచ్చనాపులుపన్ని, బొమికలెన్నుముఁబొజ్జ ♦ నొవ్వులనులఁ
బలుతోరణములు ♦ వట్టిబిట్టైగయశా, ఖాధూతినెగయు కం ♦ కములనొడల
నడ్డంబుదిరిగి త ♦ లాహతిఁ బడి రొండి, హస్తంబు విడియంగ ♦ లాస్యశవముల
దబ్బాటుమైనొక్క ♦ డలు మూపియవిమాయ, నడఁగవే జెడఁ బాప ♦ వ్యాఘ్రసింహములు

గీ. నిన్నఁడో యొక్కఁడున్న వాఁ ♦ డిందువాఁడు, నరుఁడు గాఁడింధనాధికా ♦ హారణముకు
వేళయును గాదు పొలగాలి ♦ వీచెఁ దెరువు, వెడపనుచు నాలి గొనిసంశ ♦ యించు పేళ.

ఆముక్తమాల్యద, ఆ 6 ప 17, 18.

## —♦ పర్ణశాల ♦—

సీ. గొనబైనతట్టుపున్ ♦ నను గోడలుగ వైచి, మంచిగంధంపుఁగం ♦ బములు నిల్పి
తలుకుటేనుంగుదం ♦ తముల గూలము లెత్తి, వారాహిదంష్ట్రల ♦ వాసబోసి
తీరుగా పండంపు ♦ తీగెపెండెలమర్చి, ఘట్టికాకురువేరు ♦ కట్లుగట్టి

బహుచామరంబులపై కప్పు సవరించి, కమ్మపచ్చలు గృహాంగణము దీర్చి
గీ. పంచవటిలోన సౌమిత్రి యంచితముగఁ, జాలనేరుపుతోఁ బర్ణశాలఁ గట్టి
వాస్తుహోమంబుగావించి వాసుధేయి, ప్రేమతోఁ గూడియుండె శ్రీరాముఁడచట.

దశావతారచరిత్ర, ఆ 8.

## —— కాకినాడదీపస్తంభము (లైట్‌హౌస్) ——

సీ. ప్రాగ్గ్రీవముఖ్యహర్మ్యాగ్రజాగ్రత్ప్రభా, తాంబరమాణిక్యబింబ మనఁగఁ
ధరణిమండలవసత్పురుషోత్తమార్గపు, రశ్రీకరస్థగీరాజన మన
హరిణాదిరాడ్జయస్థాణోపరిలసచ్చి, రత్నసారసరాగ రత్న మనఁగఁ
శారదురాధరౌ ధరణాకసూణజ్యగ్గ్రదర్పహస్తకమణి యనఁగ
గీ. నగరనగరాలిదిక్స్ఫీతానవజనాఢి. రాజకల్పితకల్పధా నిరపాయ
జలధిపత్త్ర్యఘసందర్శి సత్పథనిక, షోడశస్తంభసంభాసి దీప మలరు. 1870
మ. వసుధోత్తంసితపట్టణప్రథితసౌపస్తంభశృంగాహతిన్
వసుమత్పూర్ణసుధాంశుబింబములు సశ్వభ్రేగ్మయుక్తంబు ల
య్యె సమాఘాతసముజ్ఝితాంగులగుధాతిర్నిశల్ దిశేణ్మండలం
బు సారంబోలునై పచ్చ చంద్రున కిదం బొల్పొందు నే గానివోనో.

సుమనోమనోభిరంజనము. ఆ 1 ప 10, 11.

## —— వల్మీకము ——

ఉ. శ్రీకరమూర్తి యా నృపతి సింహకిశోరము గాంచె నొక్క వ
ల్మీకము సంతతప్రకట లీనవధూకరకంకణప్రభా
నీకము వేష్టితామలక నింబకదంబతమాలవిద్రుమా
శోకము రంధ్రమార్గపరిశోభితగోచరనాగలోకమున్. 1872

విక్రమార్కచరిత్రము, ఆ 6 ప 32.

## —— ఆవుదూడ ——

సీ. పొట్టపాఁడునఁ దల్లి పొదివాసి వీథికిఁ, బాఱి క్రమ్మఱుఁ బెద్దపరువుతోడ
తలయెత్తి చూచుచుఁ బలుమాఱుఁ దనుఁదల్లి, పిలువంగ నిటునటుఁ బొలసియాడు
నిలమీఁద మోమిడి యేమేని మూర్కొనుఁ, బసివెట్టుకొనుచుండఁ దాపిఁదతపంబు
వంతంతఁ జకిత్సల లడ్డంబు నుడిపిన, జంకించి మిన్నంటుఁ జౌకళించు
గీ. నిల్లు శైశవక్రీడల నెసఁగుచున్న, క్రొందుడు దెసఁ జూచి కన్నీరు గ్రుక్కుకొనుచుఁ

గటగటా యిట్టి నెత్తురుఁ ♦ గ్రందు నెచట, వైచి పోవంగ వలసెనే ♦ నీచగతిని.

భోజరాజీయము, ఆ 6 ప 25.

—♦ ఆఁబోతు ♦—

సీ. కంటికింపగు శర ♦ త్కాలఘనము వేసి, పొగరెక్కి సంపూర్ణ ♦ పుష్టిఁ బాల్చి
శిరముఁ గొంతలువంచి ♦ చిఱచిఱ లాడుచుఁ, గాలు దువ్వుచుఁ బ్రతి ♦ గాసెదుస్సిఁ
జగడపుసుఖంబును ♦ బోఁడోలి ఘణిల్లు, రనుచు అంకెలు వైచు ♦ కొనుచు మీఁతి
తటిసితటంబులు ♦ దజిసి దోరగ నిల్చి, సెలవకొమ్ములఁ గ్రుచ్చి ♦ చిమ్ముకొనుచు
గీ. ధరణిలోపలఁ గలయట్టి ♦ దర్ప మెల్ల, విగ్రహము దాల్చి యాకృతి ♦ వెలసినట్టు
లుదతరాటోపమున నొప్పు ♦ మన్న యట్టికడఁదియాఁబోతు నొక్కటిఁ ♦ గాంచి యలరు.

కిరాతార్జునీయము, ఆ 2 ప 6.

—♦ కాకి ♦—

సీ. వసుధ నెవ్వానిపద ♦ న్యాయకర్త జేజేల, కేనికిఁ గులముద్ధ ♦ రించుకొడుకు
పితృకార్యములు సమ ♦ ర్పింతు రెవ్వానికి, నాదిత్యుదర్శన ♦ స్వగ్రభుక్తిఁ
బొదలు నెవ్వనిగృహాం ♦ బున మనోహరభార, తీభారవహముఖ ♦ ద్విజకులంబు
పథిసంతతి కేరు ♦ పఱుచు నెవ్వనికంఠ, మిగ్రశితారావంబు ♦ మేలుగీల్లు
గీ. బ్రజ్ఞపెంపున నెవ్వాని ♦ బలమునకును, బ్రహ్మకొడుకైన లెక్కఁ జె ♦ ప్పంగఁ జాలఁ
డతఁడు నగరోపకంఠచై ♦ త్రాగ్రివర్తి, పక్షిమాత్రుండె వాయస ♦ పరివృఢుండు.

పంచతంత్రము, వేంక. ఆ 2.

—♦ మూషకము ♦—

సీ. పరధరాధిపభేద ♦ కరము నీ కరము నీ, వివరంబు బహుమార్గ ♦ విశ్రుతంబు
రాజశేఖరకుమా ♦ రకమనోహరము నీ, చర్య నీసన్మార్గ ♦ సంబుదాత్త
మవిరళసుగతిహే ♦ తువు నీవినీతత్వ, ములు నీగుణము ధ ♦ ర్మానుకూల
మతివృద్ధిమహిమఁ జే ♦ న్నారు నీయాకార, మిష్టకార్యముల నీ ♦ యోఁగి పెరుఁగు
గీ. నీకరుణలక్ష్మి వాటిల్లు ♦ నే రసజ్ఞ, సత్యభారతినిలుచు నీ ♦ సన్నిధాన
మభిమతార్థంబు లొసఁగు ని ♦ న్నభినుతింప, శక్యమే నాకు మూషక ♦ శ్మాకశత్రు.

పంచతంత్రము, వేంక. ఆ 2.

—♦ నౌబత్తు ♦—

సీ. ప్రళయకాలపయోద ♦ పటలీపరిస్ఫుర, ద్గర్జాసమార్జితా ♦ ఖండశక్తి
శైలశిఖాతట ♦ స్ఖలితగండోపల, జనితనిర్ఘోషప్ర ♦ చండపటిమ

పురక్షోదుద్యత్కరాం♦భోరుహార్చాలిత, కల్పాంతఘర్మకాని ♦ కామకలన
మంధరత్షోణిభృ♦న్మథితమహార్ణవ, ఘుమఘుమారభటికా♦గుంభనంబు
గీ. దెలుపు నిది యేమి కలకలం♦బలుకు వినుచు, సనుడు రాజద్దగోలుగా♦నగ్గడీని
పగ్గలంబుగ బ్రోయించు ♦ వెలమ లేని, యనుపమంబైన నౌబత్తు♦నినద మనిన.
రంగారాయచరిత్ర, ఆ 2.

—♦ కోలాటము ♦—

శా. కేలం బంగరు గచ్చుకోల లమరన్ ♦ గీర్వాణబాలామణుల్
శ్రీలీలావతి పట్టి కట్టి కలవా♦రింబోలితజైత్రవి
ద్యాలాలిత్యము లుగ్గడించి మృదులా♦లాపంబులం బాడుచుం
గోలాటంబులు వైచి రాయతి తముం ♦ గూర్మింగటాక్షింపఁగన్.
క. మలఁచి వలమూఁపుపైఁ గీ, ల్కొలిపినపాదంబుమీఁదఁ ♦ గొమరగు లికుచం
బలఘూర్ణాభాంభోరుహ, తలకర్ణికఁ దెగడనొకతె ♦ తాండవ మాడెన్.
గీ. పాంథమృగయుకుఁ జను మరు♦పజ్జఁ ద్రిప్పు, భర్మమయదండబద్ధాత♦పత్త్రి యనఁగ
మెఱుఁగు మెయిదీఁగవలగొనఁ♦దుఱుముబొదల, దెఱవయొక్కతె బిఱబిఱఁ♦దిరుగుఁగదె.
గీ. తమఁ గలసి యష్టభూతులం♦తకును గొనరు, వేల్పులని తెల్పఁగతిబోట♦ట్రేలనెనయఁ
దగ్గనిఁ జెఱంగుఁగిలించి ♦ తక్కుఁ ద్రేల్లు, మించి నిక్కంగ దేశిన♦టించె నొకతె.
చంద్రభానుచరిత్రము, ఆ 2 ప 139, 142.

——♦ ఆఁకలి ♦——

చ. కనుఁగవఁ జీకటుల్ గవియుఁ♦గర్ణపుటంబులఁ దిమ్మగ్రిమ్మ మిం
చును జఠరాగ్నిదుర్బలత ♦ చొప్పడు నంగములన్ శిరంబు వ్రా
చ్చు నితరభోగ్యవస్తువులు ♦ చూడ సహింపదు మాటమాత్రమా
డనుమదిపుట్టదాఁకటఁ బ♦డన్ వశమే క్షుణమైన నేరికిన్.
దశావతారచరిత్ర.

ఉ. ఏవిధినీతిపద్ధతికి ♦ నేగు దయాపరతంత్రచిత్తుఁడై
కైవడినామహాదురితకర్ముఁడు ♦ గాకెటులుండు ధర్మసం
భావితుఁ డెట్లుగున్ వినయ ♦ పాటవ మేక్రియ నేర్చు గౌరవం
బేవలనన్ భజించు సుఖ♦మేగతిఁ గాంచు బుభుక్షితుం డిలన్. 1893
క. కుక్షిదరికొన్నపట్టున, వీక్షించునె దేహి రుచులు♦వేళలు మునివా
ర్యక్షుము విశ్వామిత్రుఁడు, భక్షింపఁడె సారమేయ♦పలలముఁ దొలుతన్.

గీ. కలశజుఁడు మాఁడ నొకరాజు ♦ శాసలోన, దండియాఁకటఁదినమేను ♦ దానెతిఁగఁడె
వఱపుతఱిఁ బుణ్యఘనులు గీ♦ర్వాణమునులు, చేరి కీసుఁగుఁ గఱచి భ♦క్షింపరొట్టు
గీ. కఱవునఁ గాకమున్నొక్క ♦ కాఁపుకొడుకు, దాఁపుత్రామలవఘించి ♦ తానెతిఁగఁడె
యాపదలపోట నియమకా♦ర్యములువిక్క, శాస్త్రమతమిదివలమదు ♦ సంశయంబు.

పంచతంత్రము, ఆ 1.

## —♦ దాహము ♦—

గీ. పెదవి పేపెత్తు నాలుక ♦ పిడుచగట్టు, గొంతు తడపియు నెక్కిుఁ ♦ గొంతదడవు
దాహమున నుదకము లేక ♦ తడసె నేని, గలదె పుడమి యంతకన్న దుః♦ఖంబు ఘనతి.

దశావతారచరిత్ర, ఆ. 2.

## —♦ అమితభోజనము ♦—

గీ. అన్నపానంబు లొకయింత ♦ యధికమైన, తటి నజీర్ణంబయైనతో ♦ దొరయుశ్లేష్మ
పైత్యవాతాళికజ్వర ♦ బాధలవియు, విషమహేతువులగు పథ్య♦విరహితముగ.

దశావతారచరిత్ర, ఆ 2.

## —♦ నిద్ర ♦—

గీ. కలుగు నూఱేండ్లలోనర్థ ♦ కాల మపహరించు నిద్రయె యానిద్ర ♦ రేపుమాపు
మానియుండిన జాడ్యంబు ♦ మేనఁబొడముఁ, గన్నుఁగవయందునయణిమ ♦ గడలుకొనును

దశావతారచరిత్ర, ఆ. 2.

## —♦ నిద్రఁబొందఁజాలనిమనుజులు ♦—

క. బలవంతుఁడు పైనెత్తిన, బలహీనుఁడు ధనముగోలు ♦ పడినయతఁడు క్రము
చ్చిల వేచువాఁడుఁ గామాకులచిత్తుఁడు నిద్రలేక ♦ యుందురు రథిపా. 1900

భారతము, ఉద్యో. ద్వితీ. ప 9.

## —♦ చలి ♦—

మ. వనితాతీక్ష్ణదృగంబకంబులఁగుచ ♦ ద్వంద్వాగ్రిశూలంబులన్
ఘనసారైణమదేరితప్రణయవా♦గ్బంధంబులన్ బాహబం
ధనలన్ గ్రాఁగెదునీకు లజ్జగలదా ♦ ధర్మాత్ములన్ సత్క్రియా
ధనులన్ మమ్ముఁ గలంపనేఁటికి చలీ ♦ దైవంబవో యొప్పనే. 1901

లలితాలతావిలాసము, ప 106.

## ◆ మంచు ◆

సీ. నేలయంతంతయు ◆ నెఱిఁజంద్రకాంతపు, టాలఁ గట్టించిన◆ లీల మెఱసె
నింగియంతంతయుఁ ◆ బొంగిదుగ్ధాంభోధి, నిట్టవొట్టినమాడ్కి ◆ దట్టమయ్యె
సకలజీవులమీదఁ ◆ బ్రకటమై హరికీర్తి, కలయఁ బర్వినమాడ్కి ◆ దెలుపు మాపె
నక్కజంబుగ నెల్ల◆ దిక్కులు నొక్కటఁ, దెరచీరలెత్తిన ◆ కరణిఁ దోఁచె
గీ. నగములెల్లను నీహార ◆ నగములయ్యెఁ, దరువులెల్లను ఘనసార ◆ తరువులయ్యెఁ
బక్షులెల్లను రాయంచ◆ పదువులయ్యె, గురుతరంబగు నెనుమంచు ◆ గురియుకతన.

పద్మపురాణము, ఆ 3 ప 76.

## ◆ ఋణము ◆

గీ. అప్పుఁ గొనువేళ నధికసౌ◆ఖ్యమగుఁ దీర్ప, నట్టితఱిఁ బ్రాణసంకట◆మై తనర్చు
ఋణము గలవారు జననమ◆రణములందు, నేనిఁ బూనరు సుఖమించు◆కైన నధిప.
క. అప్పుఁగొని పప్పుగూడును, గొప్పగ భుజియించుకన్నఁ◆ గూరదినుట మే
లొప్పగు నుపవాస మయిన, నొప్పగు దినపంచకమున◆కొకపరి దిన్నన్.
గీ. ఋణము కష్టదమగు నది◆ యిక్కడక్కడనఁగ వల దెట కేఁగిన◆ నచటి కరుగు
దెంచి బాధించుఁ గావున ◆ దీని నెపుడు, విడిచియుండుము శుభములు◆ వడయు దీవు.
క. అప్పిచ్చినవానికి న,య్యప్పు గొనినివానికిని సు◆ఖాయాసంబుల్
జొప్పడు నెచ్చటి కేఁగిన, దప్పవు గాన ఋణముఁ గొనఁ◆ దగ దార్యులకున్.
ఉ. కొన్న ఋణంబు దీర్ప కరు◆గుం ధరపై ఋణదాత కేనరుం
డన్నరుఁ డాత్మజాతుఁడయి ◆ యాలయి యెద్దయి దాసికుట్టిఁడై
యెన్నఁటి కప్పుదీర్చుకొను◆ నేఁగును సద్గతిఁ గాన ఋణంబునం
దన్నిభవంబులన్ లఘుత◆ రాయువు నొందును బుట్టికిట్టుచున్.

శైవధర్మములు, అ. సు. ఆ 4 పే 80.

## ◆ ఋణపత్రము ◆

సీ. సంవత్సరంబు మా◆సము పక్షమును దిథి, వారంబు దేశంబు ◆ వ్రాసి మఱియు
జనకపూర్వంబుగా ◆ ధనికునామము వ్రాసి, పిమ్మట ఋణికుని ◆ పేరు వ్రాసి
యాతనిచే నితం◆డింత తద్ధ మీవడ్డి, నప్పుగాఁ గొనెనని ◆ యరసి వ్రాసి
యీయర్థ మెఱుఁగుదు ◆ మిట్టివారల మని, వరుసతో సాక్షుల◆ వ్రాయఁ జెప్పి
గీ. కోరి యిబ్భంగి వ్రాఁబడఁ◆ గొంటి ననియుఁ, బ్రీతిఁ గొన్నాతనిని వ్రాలుఁ◆ బెట్టఁ బనిచి
వ్రాసినాతండు తుదిఁ దన◆ వ్రాలు పెట్ట, నమ్మఁగలపత్రమిదియండ్రు◆ నాగరకులు.

విజ్ఞానేశ్వరము, వ్యవ. ప 109.

## —♦ దొంగసాక్షి ♦—

సీ. నెలకొని యొకచోట ♦ నిలువక పెదవులు, నాలుక యెండఁగ ♦ నాసికంబు
నుదురు చెమర్పంగ ♦ వదనంబు వెల్లనై, పలుకులు తడబడఁ ♦ బలుకుచుండు
వాతెఱ తడిలేక ♦ పలుకట్టుపట్టంగఁ, బెదవులు దడుపుచు ♦ బెదరిచూచుఁ
బలుకులుఁ జెయ్యులుఁ ♦ దలఁపులుఁ దనరిచు, ప్రకృతిఁ బొందక దు ♦ వికృతిఁ బొందు
ఆ. సాక్షి చెప్పుచోట ♦ సభఁ బాడియాడుచో, నెవ్వఁ డతఁడు దుష్టుఁ ♦ డీవు ప్రాజ్ఞ
నిట్టి లక్షణముల ♦ నెఱిఁగి సభ్యులు పాడి, నిశ్చయించి చెప్ప ♦ నెసఁగవలయు.

విజ్ఞానేశ్వరీయము. వ్యవ. ప. ౧౫.

## —♦ మిత్రవిరహము ♦—

ఆ. అంబురాశిపార ♦ మైనను గనవచ్చు, నిశ్చయింపవచ్చు ♦ నింగి పొడవు
బ్రహ్మ మిట్టిదనుచుఁ ♦ బలుకంగనగు సుహృ ద్విరహమహిమ యింత యనుచుఁ ♦ దెలియరాదు
గీ. అదియుసువ్యక్త మది నిజ ♦ ప్రాణతుల్య, మదియు విశ్వాసభవ్యము గా ♦ వయస్యుఁడేని
జననిపై భార్యపైఁ దనూ ♦ జన్ములపయిఁ, గలిమిపై మైత్రిపైఁ బోలెఁ ♦ గలదె మమత.
సీ. కర్మచేష్టితములు ♦ గాలాంతరావర్తితములగు మేలుగీ ♦ ళ్ళవలనైనఁ
గనుఁగొంటి మరిసమా ♦ గమవియోగము లేలఁ, జెనఁటివిధాత సృ ♦ జించె మొదలఁ
బ్రభుల శోకారాతి ♦ భీతిఘాతిప్రమోద, సంపాదిమైత్రివి ♦ స్రంభభాజ
నము మఱి రెండక్ష ♦ రములఁ బూర్ణంబైన, మిత్రశబ్దము సేగ ♦ మెఱసి విడిచి
ఆ. యెట్లు నిలువఁ గూడు ♦ నెబ్బంగి రుచియించుఁ, గూడు కంటికెట్లు ♦ కూర్కు వచ్చు
నని హిరణ్యకుండు ♦ దనలోన దుఃఖించి, యపుడు పలికె వాయ ♦ సాధిపతికి.

పంచతంత్రము, వేంక. ఆ 2.

## —♦ పాండవుల కార్యసాధకత్వము ♦—

చ. అడఁకువఁ గార్యకాంక్షియగు ♦ నాతఁడు, తేజము దాఁచి దుష్కృతు
ల్గుడుచుచు నీచుఁ గొల్చు తిరు ♦ గుం డవిసజ్జనులై ధరిత్రిఁ జే
ర్పడిన సహోదరుల్ దనకుఁ ♦ బ్రాపుగ నుండియుఁ బుణ్యగాథలం
గడపఁడె మత్స్యరాజుసము ♦ ఖంబున ధర్మసుతుండు కాలమున్.
ఉ. పౌరుషము న్మహాబలముఁ ♦ బండితభావముఁ గల్గి త్రియా
ధీరుఁడు కార్యహానిక ♦ తిం బరుఁ గొల్చు మహానసాగ్నిధూ
మారుణితాక్షులు న్మలిన ♦ మైనపటంబు మహావిఘూర్ణితా
కారము దవ్వియు న్మఱియఁ ♦ గానల భీముఁడు మత్స్యుఁ గొల్వఁడే.

దనరి యతిరమ్య మగుకల్ప • తరులు పుట్టెఁ, బాలమున్నీటిలోన భూ • పాలచంద్ర.

లక్ష్మీనారాయణపరిణయము. ఆ 4.

## —• సంతానసూనము •—

సీ. అతనుజపాపృత్తి • నలరారు చెలిపేలు, దొరసిన స్ఫటికాక్ష • సరము గాఁగఁ
బాణిపంకజమునఁ • బ్రభవించి యొంటికొండిఁ, దిగజాలు తళుకును • దెప్పఁబరియున
హస్తాభిధానమౌ • హాతిశయంబుగ, బ్రాలిన నక్షత్ర • మాలికయన
గమనీయనవ్యశృం • గారకకోర్మికా, మెఁపత్తురుబలఁదియ • పాళియనఁగ

గీ. నఖరనిప్పాఁద్రిత్ర కాంతిసంకృతాన మనఁగ, మధుకరాకర్షి ఘుటికాస • మాజ మనఁగ
హస్తగళకంఠుభాగ్యవ • ల్లి యనఁగ, నలరు సంతానసూనమా • ల్యంబుఁ గాంచి.

దశావతారచరిత్ర.

## —• కామధేనువు •—

క. తెల్లసిమేనును నప్పుతము, జిల్లున జల్లించుపాదుఁగు • పిలశృంగములుం
జెల్లగ నర్థులకోర్కులు, వెల్లిగొలుపుమొదవు పాల • వెల్లిం బుట్టెన్.

భాగవతము, స్కం. 8. పద్య 252.

సీ. ఝల్లుఝల్లుమఁ జేపి • చాలపాల్గారెడు, బోడచన్నులకొప్పు • పొదుగుతోడ
వెలిజల్లెతుసకనఁ • గులుజాపుకొమ్ముచ్చు, తోరమౌ నిడువాలు • తోఁకతోడ
కుదురుడెక్కలబాగు • నొరసెలయందంబు, గలపురువాటంపు • కాళ్ళతోడ
తెలిదామరలదాయ • తెలివొందుకనుదోయి, సొగసుమించినసోగ • మొగముతోడ

గీ. సోయగపువంకకుఱుకొమ్ము • దోయితోడ, బ్రేలుపలుచనినునుగంగ • డోలుతోడ
మెఱుఁగుబటువునుగలతెల్ల • మేనితోడ, కామధేనువుపుట్టె వా • కడలియందు.

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 4.

## —• ఐరావతము •—

క. దంతచతుష్టాహతి శై, లాంతంబులు విఱిగిపడఁగ • నవజాతమన
త్వాంతం బగునైరావణ, దంతావళి ముద్భవించె • ధరణీనాథా.

క. తడ లేనిఁడపువడి గల, యొడలును బెమనిడుదకరము • నుతకుంభములున్
గెడఁగై యుపతులమురిపపు, నడకలమేవ్ మూలగురు వ • నన్ గజ మొప్పెన్.

భాగవతము, స్కం. 8. ప 8.

సీ. లలితకుంభస్థలం • బులబాగు జవరాండ్ర, పాలిండ్లజిగి తోజ • పంక్తిగాఁగఁ
బ్రికటంకుంటాదండ • ఘటిమంబు లలనాజనోరు కాండంబుల • కొలకుగాఁగ

షేనిషాంచనదమరుల్ ♦ మానినీవరహంస, తతులకుముూలకం ♦ బములుగాఁగ
గంభీరయానంబు ♦ కాంతాళినడుపుల, కొయ్యారములునేర్పు ♦ నొజ్జగాఁగ

గీ. వాల్గుఁగొమ్ములఁ దనరుసం ♦ దంపురూపు, కలితశృంగచతుష్కంబు ♦ గలుగునట్టి
మేటికైలాసనగముతో ♦ సాటిగాఁగ, వెలయు నైరావతగజంబు ♦ జలధి వొడమె

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 4.

సీ. ఇంద్రనీలప్రభ ♦ లీనుభూషణరుచుల్, చూడ్కికి మిఱుమిట్లు ♦ సొనుపునదియు
పద్మరాగంబుల ♦ భాసిల్లుపదకంబు, తప్పక నుదుటిపై ♦ నొప్పునదియు
హాటకమణిమయం ♦ బగునూపురధ్వనుల్, చెవులకానందంబు ♦ సేయునదియు
హిమగిరిశిరదిందు ♦ హీరతారద్యుతుల్, నిరసించుకాంతుల ♦ నెగడునదియు

గీ. వాల్గుకొమ్ములవిలసిల్లు ♦ నాగ మపుడు, దేవవిభునాజ్ఞ దివిజులు ♦ తెచ్చి నిలుప
నిందుఁ డభిమన్యునెక్కించి ♦ హితులుసుతులు, వెంటనడువంగముదముతో వెడలిరపుడు

శశిరేఖాపరిణయము, ఆ 5.

## —♦ ఉచ్చైశ్శ్రవము ♦—

క. సచ్చంద్రపాండురంబై, యుచ్చైశ్శ్రవ మనఁగఁ దురగ ♦ మొగి జనియించెం
బుచ్చికొనియె బలిదైత్యుం, డిచ్చగొనండయ్యె నింద్రుఁ ♦ డీశ్వరశిక్షన్.

క. ఒఱ పగుమరమును బిఱుఁదును, నెఱిఁదోఁకయు ముఖముసిరియు ♦ నిర్మలఖురముఁ
కుఱుచచెవులుఁ దెలిగన్నులుఁ, దఱ చగుకందంబుఁ జూడఁ ♦ దగు నాహరికిన్.

భాగవతము, స్కం. పద్య 255, 256.

సీ. గతిఁ ద్రుంచ్చిలఁగ వేచు ♦ గాలిఁ దాఁవఁగఁ బాము, నిడినకైవడిఁ గాలి ♦ కడియమున
నలదేవమణికిఁ గాం ♦ వలి యిడ్డ ప్రహరినా, గళమున ఘంటికా ♦ వళులు మొరయఁ
బన్నగాళికి నెదు ♦ ర్పడ వెండిఱెక్కలు, ధరియించె ననఁగఁ బ ♦ క్కేర సెలంగఁ
బారిజాతాహృతి ♦ ప్రభవరోమమనంగ, గతిరోమజనితపూ ♦ త్కృతులు నిగుడ

గీ. ఖురముఖక్షుణ్ణకాంచన ♦ క్షోణిరజము, పర్వ సంధ్యారుణేందుబిం ♦ బంబుఁ బోల
వాహకోత్తముఁడైన శే ♦ వంతుఁ డమర, వల్లభుని మ్రోల నుచ్చైశ్శ్ర ♦ వంబు నిలిపె

పారిజాతాపహరణము, ఆ 4 ప 76.

సీ. కర్పూరకదళికా ♦ కళికాదళంబుల, నెఱమించువిదళించు ♦ నిక్కుఁజెవులు
చేలినవానికిఁ ♦ ద్రైలోక్యసామ్రాజ్య, లక్ష్మి నియ్యఁగఁజాలు ♦ లక్షణములు
మానసాధికవేగ ♦ మూనఁగా జపియించు, పోలికఁ గదలెడు ♦ ప్రోథపుటము
తామరసాప్తసం ♦ దనునివాహమునకు, రోషంబుఁ బుట్టించు ♦ హేషితంబు

గీ. గలిగి శకటడింభకంఠళ♦తృంద బృంద,కుంద గోవింద తుందార♦విందకంద
చందహామంద సూచిరంద♦చంద మగుచు, నొసరుసుచైత్ర శైవంబు నే♦ స్తోత్రముగ.
దశావతారచరిత్ర, ఆ 2.

## —♦ కౌస్తుభమణి ♦—

క. నిస్తులమై నిస్తులతే, జస్తులమై దీప్యమాన♦సకలదశదిశా
వాస్తుభమై కలశాంబుధిఁ, గౌస్తుభరత్నంబు తరణి♦కరణి జనించెన్.
దశావతారచరిత్రము, ఆ 2.

## —♦ శమంతకమణి ♦—

క. దినదిన మెనిమిదిబారువు, కనకంబులు కురియుచుండుఁ♦ గావున నీర
త్ననిధాన మొసఁగ కిమ్మని పలుకను నూరకుండె♦ నంబిక మఱచుచున్. 1933
పద్మపురాణము, ఆ 1 ప 93.

## —♦ పాంచజన్యము ♦—

గీ. చక్రిపూరింపఁ దనముఖా♦బ్జాతనినద,పవనమున దానవాంబుధి♦ప్రతతిఁ దోలు
శంఖహారిశాంకరుకాపాంచ♦జన్యమూర్తి, మూర్తిమంతంబుగా విష్ణు♦మ్రోల నిలిచె.
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 25.

## —♦ చక్రము ♦—

సీ. చండమై కంపితా♦జాండమై ఖండనో,ద్దండమై హసితమా♦ర్తాండ మగుచు
దివ్యమై నిగమసం♦సేవ్యమై దానసం,భావ్యమై త్రిజగతీ ♦ భవ్య మగుచు
సత్యమై ధాతృసం♦స్తుత్యమై ఖండిత, దైత్యమై వంచితా♦దిత్య మగుచు
భీమమై మునిజన♦స్థేమమై విక్రమో,ద్దామమై వినుతసు♦త్రామ మగుచుఁ
గీ. ప్రళయకాలానలవీక్షణా♦నలసహస్ర, శంఖకీలాకలాపభా♦స్వత్కఠోర
చటులధారావృతంబైన♦చక్రమూర్తి, మూర్తిమంతంబుగా విష్ణు♦మ్రోల నిలిచె.
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 24.

## —♦ శార్ఙ్గము ♦—

గీ. త్రిపురవైరిత్రిశూలము♦తిక్రమించు, నిశితశరములు దొనలందు♦ నెగడి శారి
దగిలి తెలుపడి దనుజుల♦ తలలు తునియఁ,జేయు శార్ఙ్గంబు సన్నిధిఁ♦ జేరి కొలుచు.
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 24.

### కౌమోదకి

గీ. కనకశైలోప మాత్యంత ♦ కఠిన మగుచు, భండనంబుల దైత్యుల ♦ పిండిసేయు
చండకౌమోదకియు మహో♦ద్దండలీల, మూర్తిమంతంబుగా విష్ణు♦ మ్రోల నిలిచె.
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 25.

### నందకము

గీ. చారుశతకోటిశతకోటి ♦ సదృశకఠిన, ఘోరధారోగ్రమై దైత్య♦భూధరపక్ష
వితతి ఖండించు నందకం♦బతిముదమున, మూర్తిమంతంబుగా విష్ణు♦ మ్రోలనిలిచె.
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 25.

### వేత్రము

ఉ. సారచరాచరప్రచుర♦సర్వజగంబులు పుట్టఁ బెంప సం
హారము సేయఁగాఁ దగు మ♦హత్త్వముఁ దాల్చి వెలుంగుచున్న యా
సారసనాభు కన్బొమల♦ సంజ్ఞనె ప్రాజ్ఞతసైన్యనాయకో
దారకరస్థరత్నకన♦కాంచితవేత్రము పొల్చు సన్నిధిన్. 1969
మహాలక్ష్మీపరిణయము, ఆ 1 పే 24.

### పారిజాతము

క. ఏతరువుసురాభ్యర్చిత, మేతరువు కరంబభీష్ట♦ మింద్రాణికి వి
ఖ్యాతంబేతరువు నిజవి,భూతిఁ ద్రిభువనంబులం బ్ర♦భూతస్థితులన్.
క. ఏతరువుసమీపమునను, వేతేరఁగ నాత్మణంబ♦ యెంతయు నరుడై
జాతిస్మరత్వ మగునే, జాతికి నే నట్టిపారి♦జాతముఁ గనియెన్.
హరివంశము, ఉత్తర. ఆ 4.

మ. హరి కేలం బెకలించి తెచ్చి భుజగేం♦ద్రారాతిపైఁ బెట్టె సుం
దరగంధానుగతభ్రమద్భ్రమరనా♦దవ్రాతముం బల్లవాం
కురశాఖాఫలపర్ణపుష్పకలికా♦గుచ్ఛాదికోపేతమున్
గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలో♦కీయాచకాఖ్యాతమున్.
భాగవతము, స్కం. ప 10, 215.

క. పరిమళము చెడదు వాడదు, పరువము దప్పదు పరాగ♦భరభరితంబై
నిరతము జగదేకమనో♦హరమగు నీకుసుమరాజ♦ మంబుజవదనా.
మ. అలినీలాలక నీవు నీపతి రహః♦స్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధసంగరంబునను సు♦ల్లాసంబు గల్పించు నీ

జ్వాలదీపాంకురమై రతిశ్రమదనా♦సంజాతధారాళఘ
ర్మజలంబుల్ దొలఁగింపఁగా సురఁటియై ♦ రంజిల్లు నిచ్చాగతిన్.

చ. అడిగినయంతలోన నర♦సాన్నములన్ సమకూర్చి యాఁకటన్
బడలికఁ జెందనీయ దశు♦భంబు లడంచు జగత్త్రయంబునం
బడయఁగరాని సర్వగుణ♦ భవ్యము సుమ్మిది దీనిఁ బోల్చి యి
ష్పదఁతులలోఁ గనుంగొను మ♦పారమహామహిమానుభావముల్.

చ. కువలయపత్రనేత్ర నెఱి♦కొప్పున నీకుసుమంబుఁ దాల్చుటన్
సవతులు వచ్చి నీచరణ♦సారసయుగ్మము లాశ్రయింపఁగా
ధవుఁ డజలేనికూర్మి జవ♦దాఁటక నీపలుకాదరింపఁగా
నవిరళభోగభాగ్యమహి♦మాన్వితవై విహరింతుగావుతన్.

క. నెలకొని వేసవిఁ జలువయుఁ, జలివేళల నుష్ణగుణము ♦ సమచితభంగిం
గలిగించు నీలతాంతము, కొలఁదులు చెప్పంగ విన్న♦ క్రొత్తలు సుమ్మీ. 1౩౪

పారిజాతాపహరణము, ఆ 1 పద్య ౬8_౬౩.

## —♦ నవరత్నములు ♦—

క. చరియించిరి గోమేధిక, మరకతవైడూర్యనీల♦మౌక్తికవజ్రాం
కురపుష్యరాగవిద్రుమ, కురువిందపు మేడలందుఁ ♦ గోమలి పతియున్.

రుక్మాంగదచరిత్రము, ఆ 4 ప ౭౪.

## —♦ అమృతము ♦—

సీ. ఇదిసుమీ మిగులదుః♦ఖదవిదగ్ధహానంబు, నాహుతిఁ గొనెడి ద♦వానలంబు
యిదిసుమీ సర్వరో♦గ దవాగ్ని చల్లార్ప, నొదవిన ధారాప♦యోధరంబు
యిదిసుమీ తలకొన్న ♦ ముదిమి పెన్మరణంబుఁ, బాఱఁదోలెడి మహా♦మారుతంబు
యిదిసుమీ జీవుల ♦ గదిసిన మృత్యుప్రభంజనంబులఁ గ్రోలు ♦ పన్నగంబు

ఆ. సకలలోకవాస♦జనులార యిదిసుమీ, చేటులేనిమందు ♦ సృష్టియందు

... ... ... ... ...

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 4.

## —♦ విమానము ♦—

సీ. శాతకుంభస్తంభ♦సాహస్రములు గల్గి, వైడూర్యతోరణా♦వళులు గల్గి
నవ్యమౌక్తికవితా♦నవితానములు గల్గి, శశికాంతివేదికా♦చయము గల్గి
సొగసైన మగఱాల ♦ సోపానములు గల్గి, కప్పుటాలోవల ♦ యొప్పుగల్గి

కామితార్థములిచ్చు ♦ ఘనవృక్షములు గల్గి, వికచకల్హారదీ♦ర్ఘికలు గల్గి
గీ. మానసజనంబు గల్గి కా♦మగతిగల్గి, కామరూపంబులు వహించు♦గరిమగల్గి
వఱలుపరమేష్ఠిరజతపు♦ష్పకముఁ గాంచి, యందుపైనెక్కి యతఁడుతా♦రాద్రికరిగె
ఉత్తరరామాయణము, ఆ 3 ప 58.

సీ. ఒకనాటు నభమునఁ ♦ బ్రకటంబుగాఁదోఁచు, నొకమాటుధరణిపై♦నొయ్యనిలుచు
నొకమాటుశైలమ♦స్తకమునవర్తించు, నొకపరిఁజరియించు ♦ నుదధినడుమ
నొక్కతోయంబున ♦ నొక్కటియైయుండు, నొక్కెడఁగనుఁగొనఁ♦బెక్కులగును
నొకమాటుసాల్వసం♦యుక్తమై పొడచూపు, నొకతోయమన్నియు ♦ నుడిగితోఁచు
ఆ. నొక్కతేపకొలఁది ♦ యుడుగక త్రిప్పువగతి మహోగ్రవృత్తిఁ ♦ గానవచ్చు
మఱియుఁ బెక్కుగతుల ♦ సరివరుల్లలఁగంగఁ, దిరిగె సౌభకంబు ♦ ధీవరేణ్య.
భాగవతము, స్కం. 10 ఉత్త. ప 866.

సీ. మాననీయానంత ♦ మణికాంతధామమై, యిది హిమానీవేళ ♦ నింపునింపు
శోణపద్మాళిమం♦జులతానిశాంతమై, యలరించు నిది వసం♦తాగమమునఁ
దరళముక్తాదీప్తి ♦ ధారాధివాసమై, వేసవినిది మహో♦ల్లాసమొసఁగు
బహుళవజ్రోపల ♦ ప్రాసాదభాసమై, తొలకరినిది కుతూ♦హలము నిలుపు
గీ. జనవరోత్తమయిది సర్వ♦సమయసౌఖ్య, జనక మిందలియాలేఖ్య♦సాధ్యసిద్ధ
కిన్నరాంగనలవిగీత ♦ గీతనృత్య, వాద్యములు చూపి నిలుతురు ♦ వలయునెడల.
వసుచరిత్రము, ఆ 8 ప 15.

సీ. అదె ప్రభాకరబింబ ♦ మది ప్రభాకరబింబ, మైన రాతిరి యేలఁ♦గానవచ్చు
నదె చంద్రమండలం ♦ బది చంద్రమండలం, బైనఁ గలంకంబు ♦ గానఁ బడదె
యిదె రోహణాచలం♦బది రోహణాచలం, బేని వియద్వీథి♦నేల మెలఁగు
నదె తటిత్సముదయం♦బది తటిత్సముదయం, బేని నదృశ్యమై ♦ యేఁగ దన్నె
గీ. యనుచు జనులు విస్మ♦యము నొందఁ దనదివ్య, తేజమఖిలదిశలఁ ♦ దీటుకొనఁగ
మహికి నేఁగుదెంచె ♦ మహనీయవైభవ, స్థానమైన వరవి♦మాన మొకటి.
బసవరాజీయము, ఆ 6 ప 117.

సీ. దినకరుండునుబోలె ♦ దీప్తాంశుకలితంబు, ఖగముపోలె ననంత ♦ గమనశాలి
గోత్రారిపురిబోలెఁ ♦ జిత్రరేఖాశోభి, పంక్తికంఠుఁడుపోలె ♦ బహుముఖంబు
రతివిలాసముపోలెఁ ♦ దతకామగమనంబు, నమరుండుపోలె ము♦క్తామయంబు
వైశ్రవణుఁడుపోలె ♦ వసుసముద్గమపూర్తి, కేశవాంఘ్రియుఁబోలెఁ♦గేతుయుతము

గీ. వాణియునుబోలె నవహంస♦వాహయుక్త, మనలమూర్తియు భోజేంద్ర♦లాన్వితంబు
నైన దనుజువిమానంబు ♦ నప్పుడు చూచి, మనుజపతిఁ బల్కె మంత్రివ♦మూరకుండు.

సుదక్షిణాపరిణయము, ఆ 5 ప 15.

## —♦ వేదములు ♦—

మ. హరిరూపంబులు వేదజాలములు త♦ద్వ్యాప్తిహారముల్ హాటితో
బరఁగింపన్ గరిమంబులేక రుచులన్ ♦ ధావించి దుష్ప్రేక్షణన్
దలచై తద్గతితాత్మసద్వ్యసనతం ♦ దర్పించి మత్స్యాకృతిం
బరులై మోక్షము నొంద లేరు ఘనుఁడై ♦ యంసాంగనిర్ముక్తులై.

ఉ. ఆను కశేతురిపౌరుషము ♦ లానవసుండిశాఁ దన్నిహంత్రుల
న్యాత్మనసనాథకీర్తులు ది♦నంబును వృద్ధినిబొంద పట్టనే
జ్ఞానముచేతఁ గర్మములు ♦ సంక్షయమందెడుచోట వేదముల్
జ్ఞానమహత్త్వముం దెలుప ♦ సన్నుతి సేయును గర్మయోగమున్.

మత్స్యపురాణము, ఆ 5 ప 155, 156.

## —♦ పాశుపతాస్త్రము ♦—

సీ. బ్రీలిననేలలో♦వెడలి యాదిమభోగి, బహుఫణామణులకి♦పముల నొసఁగఁ
జలితార్కబింబని♦ర్గళదంష్ట్రవీచికల్, వేలుపుప్రమానికొ్రి♦విద్యుతలు గాఁగ
గగనగతాత్తార♦కాకోరకంబులు, ప్రస్థానలాజవై♦భవము గాఁగ
బిగిపాఁతుగదలి బి♦ట్టైగయుభూభృత్కోటి, యావటించుఫలోప♦హారములుగ
గీ. నయ్య జియ్య నమోనమో♦హరమహేశ, యనుచుబ్రహ్మాదిసురలుప్ర♦ణాంజలులుగఁ
జండకోదండమౌర్వీప్ర♦చండముగను, జేసెఁ బాశుపతాస్త్రము♦క్షీణభక్తి. 1957

మత్స్యపురాణము, ఆ 5 పద్య 118.

## —♦ నాగాస్త్రము ♦—

సీ. అప్పుడు కొన్నిమ♦హాహులు శమనపాశములకై వ్రడి శరీ♦రములఁ జుట్టి
కొనియె బోగులు కొన్ని ♦ యినుపశృంఖలములకరణి సైన్యంబుల ♦ కాళ్లఁ బెనఁగె
విసపుకోఱలుకొన్ని ♦ భిదురంబులవిధాన, సంగము ల్గఱచి గా♦యములు చేసె
వితతముఖంబుల ♦ వెడలునిశ్వాసముల్, కాయంబు మిక్కిలిఁ ♦ గమలఁ జేసె
గీ. వాలుకలు సాఁచుచుఁ బ్రచండ♦లీల ఫణులు, మెడలుబంధించెనూపిరి♦వెడలకుండ
సర్పమయమయి పాతాళ♦జగము భంగి, సమరమేదినియొప్పె నా♦సమయమందు.

శిశుపాలవధ, ఆ 4 ప 181.

## —♦ దానపద్ధతి ♦—

శా. అన్యాయార్జిత మైనవిత్తమునఁ జే♦యం బూనుదానంబు మా
క్షన్యాయం బది దానఁ జేసి ఫలపా♦కం బేమియున్ లేదు యు
క్తన్యాయార్జిత మించుకంత యయినం♦ గాలంబు దేశంబు స
మ్మాన్యం బై తగఁ బాత్రయోగమున సౌ♦మ్యంబై ఫలించుం దుదిన్. 1959

భారతము, ఆర. ఆ 6 ప 109, 112.

చ. అడిగిననిచ్చుకంటె మన♦ యాచకుఁ గాఁగ నెఱింగి యిచ్చు నె
క్కుడు ఫల మిచ్చు దానవిధ♦కోవిద వేఁడుట చావు వేఁడ్కగాఁ
బడుటది పెద్దచావు దగు♦ ప్రార్థనపూర్ణము సేయు నాతఁ డా
యడిగినవానిఁ దన్నును ద♦యారతిఁ గావఁగఁ జాలువాఁ డగున్.

భారతము, అను. ఆ 2 ప 26.

సీ. న్యాయార్జితం బైన♦యర్థంబు వేదవి,త్త్వము శాంతి మొదలగు♦ వరగుణములు
గలవిప్రునకుఁ బుణ్య♦కాలపావన దేశ,కలితంబుగా భక్తి♦ గలిగి యీగి
మీఱి దానము శక్తి♦ మిగులుచు శక్తికిఁ, దగుట దానికిఁ గడుఁ♦ దనరమి యుత్త
మము మధ్యమము నధ♦మము నగు దానవి,ధానంబు విను మిట్లు♦ దైవికంబుఁ
గీ. పైతృకంబును లోకైన♦పనులఁ దాను, వేడ్కఁ జేయు వస్తువుఁ గొను♦ విప్రుకోర్కి
కనుగుణంబుగ నది యును♦ నర్థి నిచ్చు, నధికతర మైన ఫల మిచ్చు♦ నంబుజాక్షి.

భారతము, అను. ఆ 5 ప 188.

గీ. చేయు టెంతయు మే లైనఁ♦ జేసి పిదప, వగచినట్టి దానము దనుఁ♦ బొగడికొన్న
దానవిధి నిష్ఫలంబులు♦ గావ రెండు, నుడుగు దాత మహాఫల♦ మొందఁ గాంచు.

భారతము, ఆశ్వ. ఆ 5 ప 180.

గీ. ఎద్దియొక్కొ వీరి కభిలాష♦ మెఱుఁగు భంగి,యడుగక యమున్న యీవి భా♦గ్యంబు గాదె
వాంఛ వెలిఁగియు నర్థార్థి♦వచన దైన్య, మాత్మ సహియింపఁ జాలువాఁ♦ డధమదాత

చ. కటికితనంబు మాన్చి చటు♦కాకు విడంబముఁ గూర్చి లజ్జ సం
కటపడఁ జేసి యర్థిఁ గడుఁ♦ గాఱియ పెట్టినపాతకంబు న
క్కటి తలఁగంగఁ జాలునొకొ♦ కాలవిలంబము నాచరించి పి
మ్మటఁ దదభీప్సితార్థము స♦మర్పణసేయు ప్రదాత యెమ్మెయిన్.

ఉ. దాన కళా కలాప సము♦దంచిత సార వివేక సంపదన్
మానిత యాచమాన జన♦మానస వృత్త్యభిపూర్తి బుద్ధి యె

వ్యానికి లేదొకింతయును ♦ వాఁ డొకరుండు భరంబు ధాత్రికిం
గాఁలు గావు శైలములు ♦ గావు పయోధులు గావు భారముల్.

శృంగారనైషధము, ఆ ౧ ప 53-56.

క. దానమునఁ గల్గుపుణ్యము, దానమునన కీర్తినిలుచు ♦ దర్పితులెల్లన్
దానమునన వశులగుదురు, దానమునకు నధికమైన ♦ ధర్మముగలదే.

మత్స్యపురాణము, ఆ 5 ప 120.

క. మబ్బువిడి నేఁడు లేదని, సబ్బును గొదబొంకి బొంకి ♦ నడిసొండకపల్
గొబ్బున నిచ్చినవాఁడే, యబ్బురమగుదాత దుష్క ♦ రాఘవిధ్వంసా.

యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 2.

క. ఎన్నిని దానములు కలవన్నిట దాతకుఫలంబు, ♦ లబ్బును గొనువా
రన్నింటను మేలువడయరు, కొన్నియ గలవం దుభయము ♦ లకును శుభదంబుల్.

క. బహువిధదానములు ప్రతిగ్రహమున కర్హములు గదవె ♦ కన్యావిద్యా
మహిదానములను నివి మూఁడిహపరసాధనములుం ద్రి ♦ యీసమ్మతముల్.

మహేంద్రవిజయము, ఆ 5 ప 37, 39.

## ♦ ధర్మము ♦

చ. తనువులు గావు నిత్యములు ♦ తామరపాకులు నశ్వముల్ కరుల్
ధనములు రాజసంబులు వృ ♦ థా సహజన్ములు బంధుమిత్రులుం
దనయులు నేమియౌదురు ము ♦ దంబునఁ జేసిన ధర్మ మొక్కటే
మనుజవరేణ్య ! నమ్మఁదగు ♦ మానవకోటికి నెల్లకాలమున్.

రుక్మాంగదచరిత్రము, ఆ 5 ప 136.

క. ధర్మంబు తన్నుఁ బెనుచున్, ధర్మంబభివృద్ధిఁబొంద ♦ తనుబ్రతికించున్
ధర్మము శర్మకరంబని, ధర్మం బేమఱరు సంత ♦ తముఁ దత్త్వజ్ఞుల్.

పంచతంత్రము, వేంక. ఆ 3.

క. ధర్మంబు చెలుపఁజెలుచును, ధర్మము మనుపంగ మనుచు ♦ ధరణీస్థలిలో
ధర్మంబె కర్త యంతకు, ధర్మం బొనరింపు నీవు ♦ ధర్మతనూజా.

శేషధర్మము, ఆ 3.

## ♦ దానపాత్రులు ♦

సీ. అనుటయు ధర్మనం ♦ దనుఁడు దానంబుల, కెవ్వరు పాత్రంబు ♦ లేర్పరింపు
మనిన సద్ధర్మను ♦ నకోత్తిధనులు సత్యరతులు దాంతులును ధీ ♦ రత్వయుతులు

నిజకర్మనిరతులు ♦ విజితేంద్రియులు సర్వ, భూతహితులు నలు♦బ్ధులును శుచులు
దానపాత్రములు వే♦దంబు సాంగంబుగాఁ, జదివి షట్కర్మని♦ష్ఠలఁ దొడంగి
గీ. తత్త్వనిష్ఠులైన బ్రాహ్మణో♦త్తములకీని, విను సహస్రగుణంబగు♦విశ్రుతత్రు
తంబుఁ బ్రజ్ఞయుఁ గీర్తి వృ♦త్తములుఁ గలుగు, వారి కిచ్చుట వంశవి♦స్తారకంబు
ఆ. యోగ్యుఁడైన విప్రుఁ♦డాకటుండు సంతృప్తిఁ, బొంద నట్టి తృప్తిఁ♦బొందు దేవ
వితతి మునిసమూహ♦పిత్రుసమాజములు నట్లుగుటు వెదకి తెచ్చి♦నది విశిష్టు.

భారతము, అను. ఆ 2 ప 50, 52.

సీ. ధనార్థులఁ దుష్టిఁ♦బొందించునతఁడును, దెసవాటువలనఁ ద♦స్కరులచేతఁ
జేటొంది ధనము వాం♦ఛించునతండు వ్రతంబున కుద్యాప♦నంబు సేయఁ
దలఁచి యర్థించున♦తండును గురుఁ దల్లిదండ్రుల సంక్లిష్ట♦దారపుత్త్రు
లను బ్రోవఁబడునతం♦డును మహావ్యాధినిరాసంబు సేయంగ♦నాసచేయు
గీ. నతఁడు నిష్పాపుఁడైన ధ♦రామరుండు, నెవ్వఁడు భిక్షయఁ బ్రతుకగు♦నేని నట్టి
యతఁడు దైవపిత్ర్యములకు♦నతిశయంబు, గల్గు పాత్రంబు లగుదురు♦కౌరవేంద్ర.

భారతము, అను. ఆ 2 ప 59.

క. కులమును విద్యయు వృత్తము, నలఘుమతీ యన్న మిడుట♦కై యడుగంగా
వలవదు విప్రుని సాదర, ములకంగా నిడుట లెస్స♦యడిగినమాత్రన్.
క. వ్యాధార్జిత మగుకన్నము, వేయింటికిఁ బెట్టవలయు♦విప్రజనము హా
ష్టాహత్తెంబుగ దానం, బాయని పాపములుఁ గలవె♦పౌరవముఖ్యా. 1977
గీ. తిలసియేనియు నన్నంబు♦దెచ్చి శిథిలులైన విప్రులయాఁకటి♦యపహరించు
పురుషుఁడూర్ధ్వలోకంబుల♦పురుషవరుల, కర్చనీయుఁడై వెలుఁగుచు♦నందయుండు.

భారతము, అను. ఆ 4 ప 270_276.

## —♦ అన్నదానము ♦—

సీ. పనిలేదు కులశీల♦భావంబు తెలియంగ, నన్నదానము సేయు♦నధికపుణ్యుఁ
డగవుగా నాచార♦ధర్మంబు దలపోయ, నన్నదానము సేయు♦నధికపుణ్యు
సత్యశౌచములు వి♦చారింపఁ బాటిగా, దన్నదానము సేయు♦నధికపుణ్యు
వర్తనంబడుగంగ♦వలువదేక్రియనున్న, నన్నదానముసేయు♦నధికపుణ్యు
గీ. బరుసమున పోఁకి లోహంబు♦బసిఁడియైన, పగిది నిరతాన్నదానసౌ♦భాగ్యమహిమఁ
బాపములువాసి పుణ్యసం♦పదఁ దనర్చు, నతికృతార్థుని మార్గంబు♦లరయఁదగదు.
సీ. అన్నదానముసేయు♦ననఘుఁ బ్రాతఃకాల, మునఁ దలంచిన దోష♦ములు నశించు

నన్నదానము సేయు ♦ నమలచారిత్రుని, గనుఁగొన్నఁ గలుషవ♦ర్గము లణఁగు
నన్నదానము సేయు ♦ నతికృతార్థునితోడ, భాషింపఁ బోలఁగుఁ బా♦పకర్మంబు
నన్నదానము సేయు ♦ నధికపుణ్యుని పాద,ధూళిసోఁకినఁ బాయు ♦ దురితచయము
గీ. నన్నదానంబు నిరతంబు ♦ నాచరించు, పరమపావనశుద్ధగాత్రుఁ ♦ బంక్తియందు
భోజనము సేయువారికి ♦ భూప్రదక్షిణంబొనర్చినయట్టి పుణ్యంబుగలుగు.
చ. వరుణుఁడు వంపెఁ బంపెఁగరి♦వైరి కుబేరుఁడువంపెఁ బంపెభా
స్కరుఁ డుడురాజువంపెఁ బుర♦శాసనుఁడంపె నజుండుపంపె మం
దరధరుఁడంపె నంచు నుబ్ర♦ధానవిమానము లన్నదాతపైన్
బరువడిఁ జూపి రెక్కుమని ♦ పల్కుదు రంత్యమునందు దేవతల్. 1981
రుక్మాంగదచరిత్రము, ఆ 2 ప 74-82.
సీ. అన్నంబు బలకరం♦బన్న మాయుర్వృద్ధి, కర మన్న మత్యంత♦ కాంతికరము
తనుఁ జంపవచ్చిన ♦ ఘనశత్రునకునైన, నన్నంబు బంధుత్వ♦మావహించు
నన్నంబువలనన ♦ యమరులు ప్రీతులై, వరులకుఁ గోరిన ♦ వరము లిత్తు
రన్నదానముఁబోల ♦ వన్యదానంబులు, ధరణిలోపల నెల్ల♦ దానములకు
ఆ. ఫలము సరిగఁ జెప్పఁ♦బదుఁగాని యన్నదానంబుసేఁతకీఫ♦లంబనంగ
నబ్జభవుఁడు నోపఁ♦డటుగాన నీవును, నన్నదానపరుఁడ ♦ వగుము భూప.
భోజరాజీయము, ఆ 7 ప 233.

## —♦ ఉదకదానము ♦—

క. పానీయదాన ముత్తమ, దానం బని యఖిలధర్మ♦తత్త్వవ్యధపరి
జ్ఞానానూనం దగుమను, మానవపతి చెప్పె నృపస♦మాజవరేణ్యా.
క. కావునఁ జెఱువులు నూతులు, బావులుఁ, గొలఁకులును నెపుడుఁ ♦ బౌరవవర్యా
కావింప వలయు నవి గడుఁ, బావనములు పుణ్యలోక♦భాగిత నిచ్చున్.
క. అనఘా యెవ్వని కావిం,చిన సలిలాశయమునందుఁ ♦ జెలఁగుచు గోవుల్
గొను నీ రాతనివంశం,బున కవి గావించు నూర్ధ్వ♦భువనప్రాప్తిన్.
గీ. ఆఁక లేక యెవ్వానిజ♦లాశయమున, మందు వేసవియందును ♦ మనుజకోటి
యవభృథస్నానపానంబు ♦ లాచరించు, నతఁడు వొందఁడు విమదు♦ర్గాభిగతులు
భారతము, ఆ 2 ప 383-386.
గీ. సలిలమున నిల్చుఁ బ్రాణము ♦ సలిలదాత, ప్రాణదాతయనంబడుఁ♦ బ్రాణులెల్ల
దాన సుఖియించు గావున ♦ దానిమహిమ, బొదలునితిహాసమొకటిదెల్పెదనువినుము.
శివధర్మము, ఉ. సు. ఆ 1 పే 24.

గీ. మాఘమాసంబు మొదలుగా ♦ మంచినీళ్లు, చల్లనైనను పానీయ♦శాలఁ గట్టి
పోయువారల పుణ్యంబు ♦ పోలువార, లుభయలోకంబులందును♦శుభముగఁ బ్రము.
శైవధర్మము, ఆ 2.

## గోదానము

క. గోవులపా లమృతం బని, దేవేంద్రుఁడు సెప్పెఁ గాన ♦ ధీరత్వనిధీ
గోవు నొసఁగ నమృతము సద్భావంబున నిచ్చినట్టి♦ఫల మొదఁ గూడున్.
భారతము, అను. ఆ 2 ప 397-403.

క. ఆనయముఁ గొంచెపువెలకుం, గొనవచ్చును సారభూత ♦ గోవును దానం
బున ఫల మధికము దానము, గొనినాతఁడు సుఖము దానఁ♦గొనుఁ జేసేతన్.
ఆ. పుణ్యదినమునందు ♦ భూసురానుజ్ఞతో, నుపవసించి గోవు♦లున్న మంద
కరిగి పరమనియతి ♦ నయ్యహోరాత్ర మగ్గోష్ఠమున వసించి ♦ నిష్ఠతోడ.
ఆ. సంగవాభిదాన ♦ సత్కాలమునఁ దనఁ, యిచ్చుగోవుఁ బేర♦నెలమిఁ బిలిచి
యజుఁడు గరుణఁ జెప్పి♦నట్టి యవ్వాక్యరత్నముఁ బఠించునది యు♦దాత్తచరిత.
ఆ. తల్లిగోవు వృషము ♦ దండ్రిగర్భపరిదేశంబు దినము ధరణి♦సంప్రతిష్ఠ
యని పఠించి యోగ్యుఁ♦డగువిప్రు నర్చించి, పలుక వలయు నీగి ♦ కలిమి దెలియ.
క. సారము లగు గోవులు మద్ఘోరసకలకల్మషములఁ ♦ దుంచును సౌమ్యా
త్వారూఢంబులు శాశ్వత, సారోదారపద మిచ్చి ♦ సౌఖ్యముఁ జేర్చున్.
క. అని పలికి గోవు నిచ్చుతఱి, ననుచు నుదకధారఁ బ్రీతి ♦ నవ్విప్రకరం
బునఁ బోయ వలయు నర్ఘ్యం, బని చెప్పుదు రజ్జలంబు ♦ నాదిమునీంద్రుల్.
క. మొదవులలో నెల్లఁ గపిల,మొదవు వరిష్ఠంబు రాజ♦ముఖ్య నియతిమై
నది విప్రున కిచ్చు టరయఁ, దుది దానంబునకు నణఁచు ♦ దురితాటవులన్.
భారతము, అను. ఆ 3 పద్య 14-19.

క. ధర గోదానము చేసిన, పురుషులు యమధర్మరాజు ♦ పూజింపంగా
సురలోకంబున నుందురు, తరుణీసుతబంధుమిత్ర ♦ దాయాదులతోన్. 1997
క. పదిగలిగిన నొకటీవలె, పదిపదులు గడించెనేని ♦ పదియియ్యఁదగున్
పది పదులు పదులు దొరకిన, పదిపదు లావుల నొసంగ ♦ ఫలమెంత యగున్.
గీ. అన్నిదానంబులకన్న లే ♦ దధిక మొకటి, యవని న్యాయార్జితంబది ♦ యయ్యెనేని
యుభయకులసంభవుల నెల్ల ♦ నుద్ధరించు, నమృతమరయంగ గోక్షీర♦మనియె. ఏహా.

గీ॰ ఒకసియొదవపుబిడ్డనొక్కటి • యుదక శతము గలుగఁబడియుయ్యి దగు సేయు • కల్గునాత్మ
సంగఁ దగునిట్లు గావించు • జనుల కెల్ల, సమఫలము కలుగుచుండును • జన్మ సేయ.

క॰ గోదానముకన్నను మఱి, లేదధికఫలప్రదంబు • లెక్కింపఁగ నా
మోదంబిత్తైనను స్వర్గాదిసుఖములిచ్చు నవ్వ • యుద్యానుణకున్. 2000

సీ॰ ధేనుముష్టము తత్ప్రతి • గ్రహీతృద్విజు, లెంతఁ గోరిలు నప్పుడు • మంత్రముగను
ననిపత్నిఁ బ్రహ్మగా • వున బ్రహ్మచారి వృద్ధ యతులకిడక శా • స్త్రజ్ఞులకుఁ గు
టుంబులకును బురా • ణంబుఁ దెల్పెడివారి, కాహితాగ్నులకు సే • యందగుఁబుణ్య
కాలపత్ని క్రియా • గ్రహణాయనవ్యతీ,పాత సంక్రమణాది • పర్వజన్మ

గీ॰ ధముల వరధేనువులఁ దద • భావమైన, ననుఁ దలఁచి నిష్క్రమాత్రకాం • చనములం గొ
నములు వితతాయురైశ్వర్య • ఫలములనగుచుఁ, బుడిని మద్భవనంబుగాం • తురు సురేంద్ర.

శివధర్మము, అ. సు. ఆ 1 పే 19.

## భూదానము

క॰ దానము లన్నిటికిని భూదానం బెక్కుడు సమస్త • ధాన్యములఁ బరిభూ
తానేకవస్త్రధనరత్నానూనత్వమును భూమి • నవుట కతమునన్.

ఆ॰ పూర్వదత్త యైన • భూమి నెవ్వఁడు పుచ్చు,కొనియె నతఁడు దనదు • కులము వారి
నిరువదొక్క తరము • నరకవాసులఁ జేయుఁ దాను నడుము గాఁగ • ధర్మనిరత.

క॰ మునుఁ దా విప్రున కిచ్చెద, నని భువి యూకుండుకంటె • నధికపుఁ బాపం
బును నడుగ కిచ్చుటకు మిగిలిన పుణ్యము నెందు నరయ • లే వంద్రు బుధుల్.

భారతము, అను. ఆ 2 పద్య 350, 365, 366.

తే॰ విను మకించనుఁడై యున్న • విప్రునకును, ధరణి యంగుష్ఠమాత్రము • దానమిచ్చు
నట్టి పుణ్యుండు భూపాలుఁ • డై జనించు, నఖిలదేవతలును దృప్తు • లగుదు రందు.

క॰ క్షితి దాన మిచ్చునతఁడును, నతి వేడ్కఁ బరిగ్రహించు • నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు, శతమఖులోకమునఁ గ్రీడ • సలుపుదు రెలమిన్.

పద్మపురాణము, ఆ 7 ప 174, 175.

గీ॰ అయిదుతరములపూర్వుల • నవులమీఁద, నందఱను గామనూర్ధ్వలో • కాలయములఁ
గవియఁ బండినవివిధస • స్యములతోడి, యవనిదానంబుచేయు పు • ణ్యాత్ముఁ డందు.

క॰ అనుములు గోధూమంబులు, మినుములు సెనగలును బండు • మేదిని భూదే
వున కిచ్చు నెవ్వఁ డతనికి, ననపాయస్వర్గసౌఖ్య • మబ్బు మహేంద్రా.

భీమేశ్వరపురాణము, ఆ 5 ప 66.

## ——♦ సువర్ణదానము ♦——

క. అలఘుతర సకలకామ్యం, బుల నిచ్చినయట్టి మహిత♦పుణ్యం బై తా
వెలుఁగుఁ గనక మిచ్చుట యని, పలికెం గర్మజ్ఞుఁ డత్రి♦పరహితచరితా.

గీ. కనక మాయుఃప్రదంబు పా♦వనము భావ, శుద్ధి నొనరించు దాతకు♦సువ్రతమున
వేడ్కతో దాని నిచ్చుట♦వేఱ పొగడ, నేల యనియె హరిశ్చంద్రుఁ♦డిద్ధతేజ.

భారతము, అను ఆ 2 పద 381, 382.

క. భూమికి గోవులకును నై, హేమ మిడుట యస్మదీయ♦హితమును దేవ
స్తోమప్రియముం బావన, తామహనీయంబుఁ జుమ్ము ♦ ధర్మవిధిజ్ఞా.

క. పావనము సువర్ణము వం, శావలికిం దనకు నిర్మ♦లాత్మత నిచ్చున్
నీ వది యెఱిఁగి సకలయ, జ్ఞావసరములను సువర్ణ♦యాజివ యగుమీ.

భారతము, అను. ఆ 3 ప 134, 135.

## ——♦ కన్యాదానము ♦——

క. అతివా కన్నియ నిచ్చిన, పితృపతి ముద మందు సురలుఁ♦ బ్రీతు లగుదు రం
చితగతి గర్తకు దొరకొను, నతితేజశ్శ్రీయశస్క♦ముగు నభ్యుదయమున్.

భారతము, అను. ఆ 5 ప 194.

గీ. భూమిధర రాజు సంపూర్ణ♦కాముఁ డయ్యె, ముదముతో మేనకాదేవి♦మొగము సూచి
కన్యకాదానవేళలఁ♦గలదు చనవు, క్షితిగృహస్థులకంటె స♦ద్గేహినులకు.

హరవిలాసము, ఆ 4 ప 67.

గీ. కులము గలిగి ధర్మ♦గుణములఁ జూపట్టి, రోగి గాక మంచి♦రూపు దనర
వేదవేదియైన♦పేదకుఁ గన్యక, నొసఁగునతఁడు బ్రహ్మ♦వసతిఁ గాంచు.

క. ధన మిచ్చి పెండ్లిచేసిన, ఘనునకు నేలోకమయినఁ ♦ గలుగున్ విషువా
యనసంక్రాంతులు గ్రహణం, బును దీర్ఘక్షేత్రములును ♦ ముఖ్యము లొసఁగన్.

క. కన్యాదానము చేసిన, ధన్యుఁడు గంధర్వదేవ♦తాతతి పొగడన్
మాన్యక్రియఁ బితరులతో, దైన్యము లేకుండు నెపుడుఁ♦ దా నా యొద్దన్.

సీ. పెక్కులు గల వన్నె ♦ పితృమోక్షదములైన, దానంబు లందును♦త్తమము దెలియ
విను మెఱిఁగించెదఁ ♦ దనకన్యకను బిల్చి, తగినట్టి వరునకు ♦ దారబోతు
రట్లు గాదనినాటి ♦ కాత్మధనం బిచ్చి, చేయింతు రదియును ♦ జెల్లుచున్న
దొరకినమాత్రంబు ♦ తోడైనఁ బెండ్లికి, ఘనమైన బ్రహ్మలో♦కంబు గల్గుఁ

గీ. గన్యకాదాన మిదిమున్న ♦ కమలభవుఁడు, చేసె నాఁడాదిగా నెల్ల♦శిష్టజనులు

సీ. అనఘ విశాఖ నిర్ద్రుమరాధఁ బైచీర, విను జ్యేష్ఠఁ దగ గఱి♦వేము గూర్చి
ముల్లంగి మూల సు♦వర్ణాలఫలంబుఁ బూర్వాషాఢఁ బెరువుత్త♦రాఖ్య లైన
యాషాఢమాక్షికా♦ర్ద్రాన్నంబు హరివసు, జలతార♦కములఁ గం♦బళము గుజ్జు
లమరినబండియు ♦ యవలుఁ బూర్వోత్తరా,భాద్ర పౌష్ణాశ్వినీ♦భరణులందుఁ
గీ. గ్రొవ్వు గలమేఁకసంజును గొఱియయొఱచి, గంచుకుండతో మొదవశ్వ♦కలితశకటు
మతులతిలధేను లీఁ బొడి♦నఖిలతార,కముల నీగులు నూర్ధ్వలో♦కములఁ జేయు.
భారతము, అను. ఆ 2 ప 878, 879.

## —♦ అభయదానమహిమ ♦—

చ. వెఱచినవాని లోభయము ♦ విప్పినపుణ్యఫలంబు చెన్నుగాఁ
దరమె విధాతకైన ఘన♦దక్షిణ లిచ్చి సమస్తయాగముల్
నెఱపినవారు గంగకడ ♦ నిచ్చలు నుండినవారు నీడుగా
రెఱుఁగు మేకింతయే నభయ♦మిచ్చినవారలతో నరేశ్వరా.
క. విను మున్ను శిబి కపోతం, బనుపులఁ గున కభయమిచ్చి ♦ యఖిలోన్నతుఁడై
తనరెడు వైష్ణవలోకం,బున కరిగెన్ సురలుపొగడ ♦ భూపవరేణ్యా.
శైవధర్మము, ఆ 2.

## —♦ శరణాగతరక్షణము ♦—

క. శరణాగతరక్షణమున, దురగక్రతుఫలము దొరకు ♦ దొరకు యశోలం
కరణముభృతి గల్గు వొలఁగు, దురితంబులు చేర వొందు ♦ దుఃఖౌఘంబుల్.
క. శరణాగతు రక్షించిన, పరహితచరితున కిహంబుఁ ♦ బరముం దురగా
ధ్వరఫలముం గలదనిరో,మురమర్దన కావు మిమ్మ♦హోచిరజీవిన్.
సీ. తనమేనికండలు ♦ దఱిగి డేఁగకు వేఁపి, ఖగముఁ గావఁడె శిబి♦క్ష్మావరుండు
గరుడుని కాహార♦ కబళమై నాగేంద్ర,వరుఁ బ్రోవఁడే మేఘ♦వాహనుండు
నిజశత్రుద్రోహి ♦ నిర్దయాత్ముఁ గిరాతు, మనుపఁడే నిర్నిద్ర ♦ మైత్రి పత్రి
శత్రుసోదరు విభీ♦షణు సమిద్ధ్విషణు, రక్షింపఁడే తొల్లి ♦ రాఘవుండు
గీ. సకలదిక్కామినీకుచ♦స్తబకములకు, హారహీరకలాపమై ♦ తద్యశంబు
నేఁడు నాఁడును నున్నది ♦ నిత్యమగుచు,గంటె శరణార్థి మనుచుట♦కంటె శుభము.
పంచతంత్రము, వేంక. ఆ 3.
క. శరణాగతరక్షణమే, పరికింపఁగ ధర్మ మెంచఁ ♦ బరమాణువుతో
సరిగావు దాన యాగస్స్మరణంబులు కోటిరైనఁ ♦ బుదిన్ దెలియన్. శైవధర్మము, ఆ2.

## ◆ పాత్రాపాత్రనిర్ణయము ◆

సీ. పాడియు నాడియు ◆ బ్రదుకువారలఁ బరిహాసకు దుర్జను◆సంగిహీను
మత్తుని బ్రముచ్చు న◆స్మార్త నపుంసకుఁ, జెనఁటి మాటలఁ దేల్చు◆మనుజుఁ గులము
చాలమి వేదంబు ◆ చదువమి నిజవృత్తి,హాని దుర్వృత్తి గ◆లట్టివాని
దానపాత్రంబులు◆గా నిర్ణయింపరు పెద్దలు వేసుఁడును విప◆ద్బాధితుండు
గీ. నీగి కష్టాలు దయపేర్మి ◆ నిచ్చుచోటు,నైన నవగుణ మెక్కుడై ◆ కానఁబడిన
నిందితాత్ముల కిచ్చుట ◆ నిష్ఫలంబు,పాత్రనిశ్చయ మిట్టిది ◆ పౌరవేంద్ర.
క. శిల చేవ్రమాను దెప్పగ, జలనిధిఁ గడవ గోరఁగొనిన ◆ చాడ్పునఁ బాత్రం
బులు గానివారి దానంబులఁ బాపము నిస్తరింప ◆ బుద్ధిఁ దలఁచినన్.
ఆ. పునుకఁ గుక్కతిత్తిఁ ◆ బోసినపాలు నీళ్ళధకనిందఁ బొరయు◆నట్లు దుష్టు
మై యపాత్రవిషయ◆మగు నీగివ్యర్థమౌవు, నిచ్చుచోటఁ బాత్ర◆మెఱుఁగవలయు
గీ. పండునకు బిడ్డ నిచ్చిన◆చంద మొందు, బూదిలో నేయి వేల్చుటఁ◆బోలు నోటి
కడవ నీళ్లుల వెట్టిన ◆ కరణి యగు న,పాత్రజనులకుఁ బెట్టుట ◆ పౌరవేంద్ర.
క. దానవిధి యరయ నసమీ,చీనం బగునేనిఁ గీడు◆ సేయుం గురుధా
త్రీనాథ మతియుఁ బాత్రం,బైనను గొన్నతని కిచ్చు ◆ నతనికి నెట్లున్.
క. కావున వినుపాత్రము మే,లై విహితాచరణసౌమ్య◆మగుదానము ధా
త్రీవర దాత్రాదాతలఁ, దా వెలయించు భువనద్వి◆తయరంజకతన్.

భారతము, శాంతి. ఆ 1 ప 329_334.

గీ. పుణ్యభూకేవకులమునఁ ◆ బుట్టెనేమి, సకలవిద్యలుఁ దుదిముట్టఁ◆జదివెనేమి
నిత్యకర్మంబు లాచరింప ◆ నేర్చెనేమి, డంభయుక్తుఁ డనర్హుండు ◆ దానమునకు.

సీమంతినీకళ్యాణము, ఆ 5.

## ◆ దేవాలయప్రతిష్ఠ ◆

గీ. క్ష్మాప్రాసాదాన్ప్రత్నులఁ ◆ గాను భక్తి, గడఁక దేవాలయంబులు ◆ గట్టునతఁడు
తవిరి పితరులతోఁగూడ ◆ దివ్యయుగము, లమరపదమున సౌఖ్యంబు ◆ లనుభవించు

పద్మపురాణము, ఉత్తర. ఆ 2 ప 83.

క. దారుశిలాదుల దేవా,గారంబులు కరము భక్తిఁ ◆ గట్టినపుణ్యో
దారుఁడు బహుయుగములు బృం,దారకలోకమున నుండుఁ ◆ దనపితరులతోన్.

జాహ్నవీమాహాత్మ్యము. ఆ 8 ప 45.

క. నటిగ దేవాయతనము, గట్టించినయతఁడు పానె ◆ కట్టినవాఁడు

స్నొట్టుకొని ఘనవిమానము, నెట్టుచు నాలోకమునను ♦ మెలఁగుచునుండున్.

క. గట్టిగ రాలను మంటను, గట్టిన దేవాలయమును ♦ గలిగిన వారల్
నెట్టించి రాలచేతను, గట్టించినయిల్లు నొక్క ♦ గతిఁ బుణ్యమగున్.

శివధర్మము, ఆ 2.

## —♦ బ్రహ్మప్రతిష్ఠ ♦—

గీ. వేడ్క బ్రహ్మప్రతిష్ఠఁ గా♦వించునరుఁడు, వైభవంబున దేవతా ♦ వర్ణ్యుఁ డగుచు
భూతలంబున ధనధాన్య ♦ పూర్తిఁ బొంది, యంతమందునఁ సుఖియించు♦ నసురపురిని.

మత్స్యపురాణము, ఆ 5 ప 149.

## —♦ విష్ణుప్రతిష్ఠ ♦—

క. విష్ణుప్రతిష్ఠ చేసిన, వైష్ణవుఁడు ధరిత్రిలోన ♦ వైభవమున న
ధిష్ణుండై తుదఁ జొందును, విష్ణునివాసంబు లోక ♦ విశ్రుతుఁ డగుచున్.

క. అగణితధర్మప్రదమగు, సుగతికిఁ జేడఁదట్టి తెరువు ♦ శోకాపహమై
బగ వాంఛితార్థఫలదము, జగతిన్ విష్ణుప్రతిష్ఠ ♦ సామాన్యంబే.

క. అతులితపాషాణ వినిర్మితమగు సదనముఁ గట్టి ♦ మెలఁగుచు విష్ణు
ప్రతిమాప్రతిష్ఠ చేసిన, మతిమంతుం డగును మోక్ష ♦ మార్గంబునకున్.

మత్స్యపురాణము, ఆ 5 ప 145-147.

## —♦ శివవిష్ణుప్రతిష్ఠలు ♦—

చ. హరునిఁ బ్రతిష్ఠ సేసిన మ♦హాత్ములు తద్వరరూపయుక్తులై
హరునిపురంబుఁ జేరి ప్రమ♦థావళిలోన సుఖింతు రిందిరా
వరునిఁ బ్రతిష్ఠ సేయుగుణ♦వర్ణితు లెల్లను విష్ణుదివ్యమం
దిరవరసౌధజాలముల ♦ దీనులు కై విహరింతు రెప్పుడున్.

మత్స్యపురాణము, ఆ 5 ప 148.

## —♦ ఆరామప్రతిష్ఠ ♦—

క. ఘనసంపత్ప్రాప్తిక మ్మయ్యును సంతతి నిగుడుకొఱకు ♦ నొగి స్వర్గంబం
దును నిలయము గలుగుటకును, వనములు దలకొలుప ధాత్రి♦వలయు మునీంద్రా.

క. కలకొలఁది మాత్రసంఖ్యను, ఫలపుష్పసమేతరమ్య♦పాదపములచే
నిలుపంగవలయు వనములు, గలిమియు సంతతియుఁ గీర్తి ♦ కలిగెడుకొఱకున్.

మత్స్యపురాణము, ఆ 5 ప 134, 135.

క. ఆరామ భూసేకల కుపకారముగా వేయుంట్టి ♦ ఘనులు పితరులున్
జూరు సుఖంబున నుందురు, సారసభవు లోకమునను ♦ సౌభాగ్యములన్. 2051
శేషధర్మము, ఆ 2.

—♦ వృక్షారోపణము ♦—

గీ. ఛాయ నతిథివర్గంబుఁ బుష్పముల సురగణంబుఁ బండులఁ బిత్రునికహంబుఁ బ్రసుద
మందఁ జేయు వృక్షంబు లట్లుగుటు వృక్షరోపణక్రియ మేటిధర్మువు కుమార.
భారతము, అను, ఆ 3 ప 332.

ఆ. పట్టుమైనసీడఁ ♦ దనరి మార్గము క్రేవఁ, బాదలుతరువులిచ్చు ♦ పుణ్యమునకు
నశ్వమేధశతము ♦ లైనను సమముగా, వనరి ధర్మవేదు ♦ లైననుమనుం.

గీ. వినుము రావియు వటముచు ♦ వేము నొక్కటొకటి బిల్వ కపిత్థంబు ♦ లుసిరికెలుచు
మూఁడుమూఁడా మ్రదశకంబు ♦ మొనసివనము, లానరనిల్పిననరకము ♦ నొందఁడెపుడు.
పద్మపురాణము, ఆ 2 ప 70-73.

గీ. గుబురుకొనునట్టినీడలఁ ♦ గొరలి తెరువు, చెంత నొప్పారు ఫలతరు ♦ శ్రేణులొసఁగు
సుకృతగరిమంబునకుఁ జూడ ♦ జోడుగావు, సద్గుణాకరహయమేధ ♦ శతములయిన

క. పక్షుల కాశ్రయమగు ఫలవృక్షంబులు నఱకుపాప ♦ వృత్తులధర్మా
ధ్యక్షభటుల్ నరకానల ♦ నిక్షిప్తులఁ జేతు రధిక ♦ నిర్దయవృత్తిన్.

క. ఒకరావియు నొకవేమును, నొకమఱ్ఱియు వెలఁగబిల్వ ♦ ముసిరికయును బా
యకమూఁడుమూఁడు చింతిరిణు, లొకపదియునుమావిమ్రాను ♦ లొకతొమ్మిదియున్

క. నిలిపినవాఁడును నరకంబులు చూడక దేవలోక ♦ మున వసియించుం
దులసీవన మఖిలవనంబులలో నెక్కుడగుఁ బరమ ♦ పురుషార్థకమై.
జాహ్నవీమాహాత్మ్యము, ఆ 3 ప 32-35.

—♦ తటాకనిర్మాణము ♦—

సీ. దేవ తిర్యఙ్నర ♦ స్థావరాశ్రయము ద్రటాకంబు విను మట్లుఁ ♦ గాక యందు
గోకులంబులు నీరు ♦ గొని దానికర్తకులము నెల్లఁ బుణ్యలో ♦ కమున కనుచు
నీలోకమున శ్రీయు ♦ నెక్కుడు కీర్తియు, నతనికిఁ జేయుఁ ♦ బ్రాగమమున
నీతున వేసవిఁ ♦ జెఱువులో నీరున్న, నగ్నిహోత్రాదిమ ♦ యజ్ఞవాజి

ఆ. పేయఫలము లొలి ♦ వాయన కగుఁ గట్టఁ, దగినతరువు లిడిన ♦ సుగతి గలుగు
నిహసుఖంబుఁ బొందు ♦ విహగాదిబహుభూత, వాసపౌఖ్య మతఁడు ♦ సేసెఁగాన.

క. సలిలాశయములు సేసిన, నలఘుప్రియ మందుఁ బిత్రుచ ♦ యము లూర్ధ్వగతుల్

గలుగును దానం దన తను, దలఁపున నది గోరుచుండు ♦ ధర్మతనూజా.

భారతము, అను. ఆ 3 పద్య 330, 331.

గీ. చెఱువు వేయించునాతండు ♦ చేతఁ బాపు, వేయునాఁడును నిరయముల ♦ విడుతసేయు
నుండు నావఁడు; శ్రోత్రియుఁ ♦ డొక్కఁడైనఁ, దజ్జలము ద్రావి వారితా ♦ పకత బెంచు.

క. నీరొక్కఁడు దివసమైనను, ధారుణి నిలువంగఁ జెఱువు ♦ ద్రవ్వించినను ని
వారెల్ల బ్రహ్మలోకం, బారూఢిఁ జెందియుండు ♦ [illegible].

ఆ. చెఱువు వేయు మొనలు ♦ చేసినఁ దనుపాయు, మెఱుఁగఁ జెప్పెదరి ♦ మెట్టివారి
కైన బ్రహ్మలోక ♦ మతిసులభంబని, ధర్మవేత్త లండ్రు ♦ ధర్మతనయ.

క. బహువైనపాటిమృత్తిక, చెఱువులలోఁ దీసి బయలఁ ♦ జేర్చిన పురుషుం
డరమరలులేక వేల్పుల, యిరవున వసియించు నాక ♦ హిమముఁ గాంచున్.

క. ఊరుఁ దటాకము దేవా, గారముఁ బాలించువారి ♦ ఘనపుణ్యంబుల్
చేయుమఁ గర్తల కన్నను, నూఱుగుణంబులను మించి ♦ నూల్కొనుచుండున్.

శివధర్మము, ఆ 2.

గీ. న్యాయరూపమునను బ్రాప్త ♦ మైనయట్టి, విత్తముఁ గనపరిమత్తుఁడై ♦ వేడ్కతోడఁ
దద్వ్యయంబున కాత్మసం ♦ తాప ముడిగి, వరతటాకములు నిలుప ♦ వలయు నెచట.

మత్స్యపురాణము, ఆ 5 ప 123.

## —♦ గేహాదినిర్మాణము ♦—

చ. యతిమఠ విప్రమందిర జ ♦ నాశ్రయహీన దరిద్ర గేహముల్
చతురతతోఁ రచించినవి ♦ చక్షణుఁ డంచితకాంచనాలయ
స్థితుఁడగు దాని కెక్కుడగు ♦ జీర్ణసముద్ధరణంబు దేవతా
యతిధరణీసురప్రభవ ♦ వార్త వసించు నపారదుర్గతిన్. 2067

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 3 ప 46.

## —♦ నిక్షేపమహాత్మ్యము ♦—

సీ. అంగుగా నరువది ♦ యంగుళంబులభూమి, గర్తంబుగాఁ జేసి ♦ క్రమముతోడ
నందు నీవారము ♦ శ్యామారణ్యకములైన, పంచధాన్యంబులు ♦ పంచరత్న
ములు హరిద్రయు గవ్య ♦ మును సప్తధాన్యముల్, వేదమంత్రంబులఁ ♦ బాదుకొల్పి
సంఖ్యవిన్నము సహ ♦ స్రము శుద్ధహేమంబు, తామ్రపాత్రాంతస్థి ♦ తంబు జేసి
గీ. యివ్వ లవ్వల నెవ్వరు ♦ నెఱుఁగనట్లు, తనదు వదలిన యర్ధరా ♦ త్రంబునందు
నదిమముఁ దద్గర్త మధ్యము ♦ నందు నిల్పి, పుణ్యుఁ డందును స్వర్గోప ♦ భోగములను

క. నిధి నిలిపిన ఘనపుణ్యుం, డధిక మహాకలుష రహితుఁ ♦ డై తుదినిలుచున్
విధునాగ్నులు గలకాలం, బధిగత పరమార్థుఁ డగుచు ♦ నమరపురమునన్.

గీ. ఎంత కాలంబు నిక్షేప ♦ మీఘరిత్రిఁ, బరులచే బడకుండును ♦ బదిల మగుచు
నంత కాలంబుఁ దత్కర్త ♦ హర్ష మొదవ, స్వర్గలోకంబునందుండు ♦ సత్యచరిత.

మత్స్యపురాణము, ఆ 5 ప 140–142.

## ——♦ గరుడస్తంభప్రతిష్ఠ ♦——

క. గరుడ స్తంభము నిలిపిన, నరులు నరాధీశులై జ♦నన మొందుదు రి
ద్ధగ సర్వమేనపుణ్యా, కర లగుదు రఖండదీప♦ఘటనాకరులున్.

శేవధర్మము, అ. సు. ఆ 2 శ్లో 44.

## ——♦ వృషోత్సర్జనమహిమ ♦——

ఉ. దున్నినదున్న నేని మఱి ♦ దున్న మహోక్షము నేని శైవ లిం
గోన్నత చిహ్నితంబుగ మ♦దుజ్జ్వలచక్రవరాంకితంబుగాఁ
జెన్నలరించి పోవిడుచు ♦ సిద్ధమనోరథు లంతకుండు శ్రీ
తిన్నతిఁ బెంప భోగులయి ♦ దేవపదంబున నుందు రెప్పుడున్.

శేవధర్మము, అ. సు. ఆ 2 శ్లో 42.

## ——♦ మోక్షసాధనములు ♦——

సీ. దత్తానుతాపసం♦తప్తుఁడై యుండక, దీనార్థులకు నిచ్చు♦దాన మొకటి
విఘ్న మేతెంచుచో ♦ విడువక నూటిగా, నిత్యంబు నడపెడి ♦ సత్య మొకటి
భువనమంతయుఁ జతు♦ర్ముఖుని రూపంబని, పొలుపుగాఁ దలపోయు♦బుద్ధి యొకటి
యాత్మలో నతిభక్తి ♦ నంబుజోదరు నామ,ములు సర్వకాలంబుఁ ♦ దలఁచు టొకటి
గీ. మహిని వివరింప సర్వసా♦మాన్యసరణు, లివియె తెరువులు వైకుంఠ♦భవనమునకుఁ
గలుషసహితుని కైన దు♦ష్కర్ము కైన, జాతిహీనుని కైనఁ బ్ర♦ఖ్యాతితోడ.

క. ఇందొకటైనను దప్పక, కందువతో నడపఁ జేర్చు ♦ ఘను లెల్లను సం
క్రందననుతులై మోక్షముఁ, బొందుదు రఖిలాఘకర్మ♦పూరితులైనన్. 2074

సీ. కావించు పుండరీ♦కాక్షప్రతిష్ఠలు, జలజనాభాలయ ♦ స్థాపనములు
భక్తితో విష్ణువై♦భవవర్ధనంబులు, మహిమఁ దన్మందిర ♦ మార్జనములు
దద్వ్యాసు దేవార్చి♦త ప్రణామంబులు, ప్రార్థితో హరిపాద ♦ తీర్థసేవ
పరమవైష్ణవదీప్ర♦పాదాంబురుహపూజ, దానంబు సత్యంబు ♦ దమము శమము
గీ. సంతతాచారవిధియును ♦ సాత్త్వికంబు, ధ్యాన మార్జవ మక్రోధ ♦ మతిముదంబు

పనఁగ నివి భాగవతమాన♦వాళికిని, మోక్షసంప్రాప్తికరధర్మ♦ములు దనరు.

మత్స్యపురాణము, ఆ 2 ప 119, 120, ఆ 3 131.

## —♦ భాగవతులు ♦—

సీ. శ్రుత్యంతవిశ్రాంత ♦ మత్యమత్రమణీయు, భగవత్ప్రసంగాత్ముల్ ♦ భాగవతులు
సకలసమ్మోహయోగ♦జనసమాగమైక, పరమభాగ్యోదయుల్ ♦ భాగవతులు
కృష్ణపదధ్యాన ♦ కేవలామృతపాన, పరిణామయుతులు శ్రీ♦భాగవతులు
బహుపాతకానీక ♦ పరిపవవపవిత్రీకరులు, పరమపవిత్రమూర్తులు ♦ భాగవతులు
గీ. భావతత్త్వార్థవేదులు ♦ భాగవతులు, బ్రహ్మవాదానువాదులు ♦ భాగవతులు
సిరులు దనరంగ నెన్నఁడుఁ ♦ జేటులేని, పదవి నొప్పారువారవో ♦ భాగవతులు.

భాగవతము, స్కం. 6 ప 186.

## —♦ విష్ణుభక్తి ♦—

సీ. జలజాక్షుపదపంక♦జములు పూజింపఁగా, వలవదా చేతులు ♦ గలుగుఫలము
శేషశాయికిఁ బ్రద♦క్షిణ మాచరింపఁగా, వలవదా పదములు ♦ గలుగుఫలము
దితిజాంతకుని దివ్య♦దేహంబు గనుఁగొన, వలవదా కన్నులు ♦ గలుగుఫలము
నలిననాభుని దివ్య♦నామముల్ వినుతింప, వలవదా నాలుక ♦ గలుగుఫలము
గీ. కనకపీతాంబరుని దివ్య♦కథలు వినఁగ, వలవదా కర్ణపుటములు ♦ గలుగుఫలము
భక్తితాత్పర్యముల యదు♦పతికి మ్రొక్క, వలవదా యుత్తమాంగంబు♦ గలుగుఫలము

రుక్మాంగదచరిత్రము, ఆ 2 ప 54.

సీ. హరిపాదభక్తి ద♦న్ననిశంబుఁ బాటించు, సురలకుఁ దంగేటి♦జున్న గాదె
హరిపాదభక్తి త♦న్నాశ్రయించినయట్టి, భక్తులపాలిటి♦కల్పకము గాదె
హరిపాదభక్తి ద♦న్నాసించి వర్తించు, నరులకు పెన్నిధా♦నంబు గాదె
హరిపాదభక్తి త♦న్నాత్మలోఁ గైకొన్న, వారిముంగొంగుబం♦గారు గాదె
ఆ. యరసి చూడ నెప్పుడు ♦ హరిపాదభక్తి ద, న్నాదరమునఁ జెంది♦నట్టిపుణ్య
వసుల కనవరతము ♦ గరతలస్థితదివ్య,లోక రత్నమయశి♦లాక గాదె.

లక్ష్మీనారాయణపరిణయము, ఆ 2.

క. నారాయణవిద్వేషులగు, క్రూరుల కాయువును శ్రీయుఁ ♦ గులము బలంబున్
బేరును బెంపును బోలయును, ఘోరనరకకూపములను ♦ గూలుదురు తుదిన్.

నృసింహపురాణము, ఆ 2 ప 41.

మ. ఉపవాసవ్రతశౌచశీలమఖసంధ్యోపాసనాగ్నిక్రియా
జపదానాధ్యయనాదికర్మముల మోక్షప్రాప్తి సేకూర ద
త్స్వపథప్రాప్తికిన్ హరిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమా
ధిపుఁ బాపఘ్నునిఁ బరేశు నచ్యుతుని సద్భక్తిం గొల్వలేకుండినన్.

భాగవతము, స్కం. 2 ప 214.

సీ. అలయక జొంపములతో నభ్రంకషంబులై, బ్రదుకవే వనములఁ బాదపములు
ఖాదనమేహనాకాంక్షలఁ బశువులు, జీవింపవే గ్రామసీమలందు
విహతిమై నుచ్ఛ్వాసనిశ్వాస పవనముల్, ప్రాపింపవే చర్మభస్త్రికలును
గ్రామసూకరశునకశ్రేణు లింటింటఁ, దిరుగవే దుర్యోనిదేహవృత్తి
గీ. సస్త్రిఖరములు మోవవే యుష్ణభరములఁ, బుండరీకాక్షునెఱుఁగని పురుషపశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ, విషయభరయుక్తితో నుంట విఫలమధిప.
సీ. విష్ణుకీర్తనముల వినని కర్ణంబులు, కొండలబిలములు గువలయేశ
చక్రిపద్యంబులఁ జదువని జిహ్వలు, కప్పలజిహ్వలు గౌరవేంద్ర
శ్రీమనోనాథు వీక్షింపనికన్నులు, కేకిపింఛాక్షులు కీర్తిదయిత
కమలాక్షుపూజకుఁ గాని హస్తంబులు, శవముహస్తంబులు సత్యవచన
ఆ. హరిపదతులసీదళామోదరతి లేని, ముక్కు పందిముక్కు మునిచరిత్ర
గరుడగమనభజనగతి లేనిపదములు, పాదపములపాదపటల మనఘ.
సీ. నారాయణుని దివ్యనామాక్షరములపైఁ, గరఁగని మనములు కఠినశిలలు
మురవైరికథలకు ముగితాఁ గ్రురోమాంచ, మిళితమై యుండని మేను మొద్దు
చక్రికిఁ బ్రమొక్కని జడుని యౌఁదలనున్న, కనకకిరీటంబు గట్టిమోపు
మాధవార్పితముగా మనని మానవుసిరి, వనదుర్గచంద్రికా వైభవంబు
ఆ. కైటభారిభజనఁ గలిగి యుండనివాఁడు, గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదముఁ గననివానిబ్రదుకు, పసిఁడికాయలోని ప్రాణిబ్రదుకు.

భాగవతము, స్కం. 2 పద్య 49-51.

శా. అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితులరక్తవ్యర్థసంసారముల్.

భాగవతము, స్కం 7 ప 168.

సీ. హరిదివ్యనామధేయామృతమ్ము లింపారఁ, జెలఁగి యాస్వాదించు జిహ్వ జిహ్వ

నేతెఱంగు దొఱంగి చేసిన, పాతకుఁడు ధరిత్రిలోనఁ ◆ బాషండుఁ డగున్.

గీ. కాన వర్ణానురూపపరి◆కారవిధుల, నర్చనలు సేయవలయుఁ దా◆నచ్యుతునకు
స్వాధికారంబు చింతించి ◆ శాస్త్రభంగి, జాత్యరాహిత్యభక్తిని◆శ్చలతఁ దగిలి.

పద్మపురాణము, ఆ 11-15.

సీ. విను ముపశ్లోకశీరి◆విష్ణుపూజావిధి, యతిరహస్యము నీకు ◆ నర్థ మెసఁగఁ
దెలిసెద మిశ్రవై◆దిక తాంత్రికము లన, వెలయు తత్పూజ ము◆వ్విధము నగుచు
హరిఁగూర్చి యజ్ఞాదు ◆ లనిశంబు సేయుట, యాదివైదికాచార◆మగు శిలాదు
లగుప్రతిమంబుల ◆ హరిభావనము జేసి, తగఁ బూజసల్పుట ◆ తాంత్రికంబు

గీ. నెలమినుభయాత్మకంబునై◆యలరువదియు,తథ్యముగ మిశ్రమనఁగను◆దనరుచుండుఁ
గాన మనుజుండు తనకర్హ◆మైనసరణి, చక్రధరుపూజ సద్భక్తి ◆ సలుపవలయు.

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 4 పే 96.

## —◆ విష్ణుభక్తపూజ ◆—

ఆ. తరతరంబు విష్ణు◆చరణార్చనముఁ జెంది, హరికి నర్చ సేయు◆నంతకంటె
సతనిదాసజనుల ◆ నతిభక్తి నిచ్చలుఁ, గొలుచుటుఱవు సువ్వె ◆ కుధరతనయ.

మ. హరి నర్చించియు వైష్ణవోత్తములఁ దా◆నర్చింపకున్నేని న
ప్పురుషుం డెందును భక్తిసాంభికుఁడునాఁ ◆ బొల్పొందు నట్లౌట న
ప్పరమేశార్చన సేయుకంటె మది స◆ద్భక్తిం దదీయార్చనా
పరులన్ బూజలఁ దన్పఁగా వలయు వి◆ప్రశ్రేష్ఠుఁ డెల్లప్పుడున్. 2093

పద్మపురాణము, ఆ 11 ప 54, 55.

## —◆ విష్ణుకథలు ◆—

క. చిత్రంబులు త్రైలోక్యప,విత్రంబులు భవలతాల◆విత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన, చైత్రంబులు విష్ణుదేవు◆చారిత్రంబుల్.

క. భూషణములు సెవులకు బుధ,తోషణము లనేకజన్మ ◆ దురితౌఘవినిః
శ్శోషణములు మంగళతర, ఘోషణములు గరుడగమను◆గుణభాషణముల్.

క. తారల నెన్నఁగ వచ్చును, భూరేణుల లెక్క వెట్టఁ◆బోలును ధాత్రిన్
నారాయణగుణకథనము, లారయ వర్ణింప లేరు ◆ హరబ్రహ్మాదుల్. 2096

భాగవతము, స్కం. 6, 10, 11, ప 6, 1681, 61.

సీ. అజ్ఞానమనెడు గా◆ఢాంధకారసమూహ,మంతయుఁ దుదిముట్ట◆నణఁచుకొఱకు
వివిధాన్యకృతమార్గ◆విధుల దుర్వ్యాక్యముల్, శ్రవణముల్ సోఁకక◆పనెడుకొఱకు

బహుజన్మపుణ్యసం♦ప్రాప్తలక్ష్మీశ్వర, పాదాబ్జసద్భక్తి ♦ ప్రబలుకొఱకు
నిబిడదుష్కృతజాల♦నిలయమై వర్తించు, విపులసంసారేచ్ఛ ♦ విడలుకొఱకు
గీ. బ్రిదుకుమిథ్యగమదిలోన ♦ బరగుకొఱకుఁ, సజ్జనులతోడి సంసర్గ♦ జరుగుకొఱకుఁ
బ్రతిదినంబును సంతోషమ♦ ధరితఁ దగుము, వినఁగవలయును దగ్రిమా♦విభునికథలు.

మత్స్యపురాణము, అ 2 ప 48.

## —♦ విష్ణునామసంకీర్తనాదులు ♦—

సీ. బ్రహ్మహత్యానేక ♦ పాపాటవుల కగ్ని, కీలలు హరినామ♦కీర్తనములు
గురుతల్పకల్మష ♦ ఘోరసర్పములకుఁ, గేకులు హరినామ♦కీర్తనములు
తపనీయచౌర్యసం♦తమసంబునకు సూర్య, కిరణముల్ హరినామ♦కీర్తనములు
మధుపానకల్మష♦మదనాగసమితికిఁ, గేసరుల్ హరినామ♦కీర్తనములు
గీ. మహితయోగప్రనిత్యస♦మాధివిధుల, నలరుబ్రహ్మాదిసురలకు ♦ నంద రాని
భూరినిర్వాణసామ్రాజ్య♦భోగభాగ్య, ఖేలనంబులు హరినామ♦కీర్తనములు.
సీ. ముక్తికాంతైకాంత ♦ మోహనకృత్యముల్, గెల్పైన హరినామ♦కీర్తనములు
సత్యలోకానంద♦సౌభాగ్యయుక్తముల్, గెల్పైన హరినామ♦కీర్తనములు
మహితనిర్వాణసా♦మ్రాజ్యాభిషిక్తముల్, గెల్పైన హరినామ♦కీర్తనములు
బహుకాలజనితత♦పఃఫలసారముల్, గెల్పైన హరినామ♦కీర్తనములు
గీ. పుణ్యమూలంబు లనపాయ♦పోషకంబు, లభిమతార్థంబు లజ్ఞాన♦హరణకరము
లాగమాంతోపలబ్ధంబు♦లమృతసేవ, లార్తశుభములు హరినామ♦కీర్తనములు
ఆ. బిడ్డపేరు వెట్టి♦పిలుచుట విశ్రమ, కేలి నైనఁ మిగులఁ ♦ గేలి నైనఁ
బద్యగద్యగీత♦భావార్థముల నైన, గమలనయనుఁ దలఁపఁ♦ గలుషహరము.
ఉ. కూలినచోటఁ గొట్టుపడి♦కుందినచోట మహాజ్వరాదులన్
జేరినచోట సర్పముఖ♦పీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణు భవ♦మారుని఼ బేర్కొని లేని మీఁద న
క్కాలునియాతనావితతిఁ♦గానరు పూనరు దుఃఖభావముల్. 20101

భాగవతము, స్కం. 6 ప 118-123.

సీ. ఉపవాసములనుండి ♦ శైలయునెండల నెండి, వాయుభక్షణసేయ♦వలదు సుమ్ము
పశుమారణకు వోర్చి ♦ బంగారువోకాల్చి, వాజిమేధముసేయ ♦వలదుసుమ్ము
తలయెల్లజడకట్టి♦దలమైనచలికోర్చి, వడిఁ దీర్థములు గ్రుంక ♦వలదు సుమ్ము
బలుఘట్టములు నెక్కి♦గలబాదములు నొవ్వ, వారణాశికిబోవ♦వలదుసుమ్ము

సీ. సత్ప్రియావర్తి దేవతా♦చక్రవర్తి, శ్రితజనాధారు నఖిలదు♦ష్కృతవిదూరు
నామకీర్తన చాలు పు♦ణ్యములు మేలు, ఘనతరంబైన పాపసం♦ఘముల నణఁప.

రుక్మాంగదచరిత్రము, ఆ 2 ప ౯౯.

చ. అపవులఁ గందమూలక ఫ♦లాశనులై విజితేంద్రియాత్ములై
విదితతపోనియుల్ చదివి♦విశ్రుతమైనతపంబు సేయఁగాఁ
బడసిన తత్ఫలంబు బొదవుఁ♦బంకజనాభుని నామసంస్మృతిం
దడయక చేయుచున్న హరి♦దాసులఁ కెందుఁ దలంచిచూడఁగన్.

పద్మపురాణము, ఉ. ఆ 2 ప 125.

సీ. తెల్లవారకతొల్లి♦చల్లనినీటిలోఁ, బాయకో నోడలెల్ల♦వణఁకువారు
నీరుకావులుగట్టి♦నీళ్లువస్త్రములచేత, సవ్యాపసవ్యము♦ల్సల్లువారు
బిగుసుకముక్కులు♦బిగియించి గొణుకుచు, మూఁగన్ను వేయుచు♦తూఁగువారు
సాముచేసినయట్లు♦సాగిలఁబడిపడి, ప్రొద్దుకెదురునిల్వఁ♦బోవువారు
గీ. బిరబిరనుచెట్లుమట్టును♦దిరుగువారు, నేయి చిమ్ముగులు నగ్నిలో♦వేయువారు
వైశ్వదేవాదిపూజల♦నలులువారు, కీర్తనలుసేయువారల♦క్రిందివారు.

శ్రీరామస్తవరాజము, ఆ 2.

## —♦ విష్ణుపాదతీర్థము ♦—

గీ. ఔషధంబున నొక వింత♦యౌషధంబు, భక్తితులసీదళంబు శ్రీ♦భర్తపాద
తీర్థ మనుపానముగఁ జేసి♦దినము సేవ, సేయుదున భవరోగము♦ల్జీర్ణ మంద.

దశావతారచరిత్రము, ఆ 4 పే 140.

క. కలిదోషంబులఁ జెఱచుచు, బలురోగచయంబు నణఁచుఁ♦బాపఘ్నము ని
శ్చలపుణ్యంబుల నొసఁగుచు, దెలియఁగ శ్రీవిష్ణుపాద♦తీర్థము తనయా.

మత్స్యపురాణము, ఆ ౪ ప 14౩.

## —♦ విష్ణుప్రసాదము ♦—

ఆ. భూమిసురుఁడు విష్ణు♦భుక్తశేషాన్నంబు; నర్థిఁ గుడువవలయు♦ననుదినంబు
కలనిపితరు లెల్ల♦నక్షయలోకంబులనుభవింతు రతఁడు♦నరుగు దివికి. 2106

పద్మపురాణము, ఆ 11 ప 214.

## —♦ శివభక్తి ♦—

సీ. వలయాద్రిమధ్యభూ♦వలయసామ్రాజ్యలక్ష్మీనిదానము సదా♦శివునిభక్తి
యగ్నిజవంజవసాగ♦రాలింగ్యమానవస్త్రోద్ధరణంబు పార్వతీ♦శ్వరునిభక్తి

జన్మసహస్రసంపాది♦ పరితో గ్రదురితసంహారణంబు నీలకం♦ఠునిభక్తి
సురవరూపచకుంభ♦పరిదంభమాన విస్ఫీత్రంబు కైలాస♦నిలయుభక్తి
గీ. ముక్తి రమణీమణీనవా♦మోదవత్కూటాక్షవిన్యాసజన్యాస♦దృఢసత్వ
విభ్రమాద్రభ్రసౌఖ్యాని♦శ్వేశభజన, పటుతరోద్యుక్తి యమ్మహా♦నటునిభక్తి.
సీ. నీలకంఠస్తవ♦ నీలకంఠములచే, సమయవే భవరోగ♦సర్పసమితి
గంగాధరస్తోత్ర♦గంగామృతంబుచేఁ, బాతిపోవే మహా♦పాతకములు
పంచాననస్తుతి♦పంచాననంబుచే, వ్రాలవే సంతాప♦వారణములు
లుగ్రసద్గుణకీర్తి♦నోగ్రాంశురశ్మిచేఁ, బాయదే యజ్ఞాన♦ బహుళతమము
గీ. నాగకంకణకథయను♦ నావకతన, మేటిసంసారజలరాశి♦ దాటరాదె
మునికులోత్తమ వేయేల♦ ముదముతోడ, శివపురాణము విన్నంచి♦చెప్పవలయు.
శివరాత్రిమాహాత్మ్యము, ఆ 1.
సీ. శంభుపూజించు హ♦స్తములు హస్తంబులు, శితికంఠు కథ విన్న♦ శ్రుతులు శ్రుతులు
శివవందనము సేయు♦ శీర్షంబు శీర్షంబు, ప్రమథేశుఁ గీర్తించు♦ రసన రసన
చిత్తజారిభజించు♦ చిత్తంబు చిత్తంబు, దేవదేవు నెఱుంగు♦ తెలివి తెలివి
భవునకు వలగొన్న♦ పదములు పదములు, త్రిపురాంతకుని జూచు♦దృష్టి దృష్టి
గీ. భూతనాథునిపై గల♦బుద్ధిబుద్ధి, భర్గుమహిమల నుడివిన♦ పలుకు పలుకు
విశ్వనాథుని దెలిపెడు♦విద్యవిద్య, హరునియెడభక్తిగలిగిన♦నరుఁడు నరుఁడు.
బ్రహ్మోత్తరఖండము, అ 2.

## ——♦ శివభక్తుఁడు ♦——

సీ. యజ్ఞకుండంబున♦ నుండుఁ దీర్థంబాడుఁ, బాయ కెవ్వండు నా♦భక్తుఁ డతఁడు
గ్రుంకు లిడుపులు సప్త♦గోదావరంబునఁ, బాయ కెవ్వండు నా♦భక్తుఁ డతఁడు
ద్వాదశక్షేత్రయా♦త్రావిధాన మొనర్చుఁ, బాయ కెవ్వండు నా♦భక్తుఁ డతఁడు
దక్షవాటీమహా♦స్థానంబునందుండుఁ, బాయ కెవ్వండు నా♦భక్తుఁ డతఁడు
గీ. తెరువునడిచెడువారికి♦నిరవుచేసి, ధాన్యములు నెయ్యి నూనె వ♦స్త్రములు లవణ
మాదిగాఁగల యాత్రాపదార్థసమితిఁ, బాయ కెవ్వండు పెట్టు నా♦భక్తుఁడతఁడు.
భీమేశ్వరపురాణము, ఆ 6 ప 62.
గీ. భూతిరుద్రాక్షములు మేనఁ♦బూనుటయును, మహితపంచాక్షరీమహా♦మంత్రజపము
హరునివరనామకీర్తన♦ ధ్యానపూజనములు భక్తిన కావశ్య♦కములు సాక్షి.
సీమంతినీకళ్యాణము, ఆ 2.

## —♦ శివపూజ ♦—

చ. కలమెయిఁ బాల నేతి మధు♦కంబుల జేని వరాభిషేకసం
గళము నొనర్చి భక్తినతి♦గంధము మాల్యము ధూపదీపసం
కలనములున్ నివేద్యమును♦గాఢసమర్పణ మొందఁ జేసి లిం
గలసితమూర్తియందు నను♦గాంచి భజించిన ముక్తి సేకుఱున్.

భారతము, అను. ఆ 5 ప 272, 273.

సీ. పంచామృతంబులఁ ♦ బంచగవ్యంబుల, విమలోదకంబులఁ ♦ గ్రమముతోడ
నభిషేక మొనరించి ♦ యఖిలేశ్వరుని సమం,చితగంధసమితి నర్చితునిఁ జేసి
భూరిసౌరభచారు ♦ పుష్పదామంబులఁ, బూజించి బహువిధ♦స్ఫురితదీప
తతి యిచ్చి కపిలాఘృ♦తప్లుతవర్తికా,రమ్యదీపముల నా♦రతు లమర్చి
ఆ. భక్ష్య భోజ్య లేహ్య♦పానీయబహుళ నై,వేద్యములు ఘటించి ♦ హృద్యలీల
బగలు రేయి నిట్టు ♦ పరిచర్య నడుపంగఁ, గొలిచి రేడు దివస♦ములు క్రమమున.

హరివంశము, ఆ 6.

సీ. అర్కపుష్పంబుల ♦ నభవునిఁ బూజింపఁ, బరసతీసంగమ♦పాప మణఁగు
తులసీదళంబుల ♦ ధూర్జటిఁ బూజింపఁ, బరనిందచే నైన ♦ పాప మణఁగు
మారేడుదళముల ♦ మతి శివుఁ బూజింప, బ్రహ్మహత్యాదిక ♦ పంక మణఁగు
నష్టగంధంబుల ♦ నభవునిఁ బూజింపఁ, బరహింసనక్రియా ♦ పాప మణఁగు
గీ. ధూప మర్పింపఁ గలుమని♦ర్ధూమకరము, దీప మర్పింప నజ్ఞాన♦తిమిర మణఁగు
నక్షతలఁ బూజ సేయఁగా♦నర్ఘ్య మొదవు, భవుని భావింప సాయుజ్య♦పదము గలుగు
సీ. ధ్యానంబు త్రిజగదా♦ధారచిన్మూర్తికి, నావాహనము శైల♦జాధిపతికి
నవరత్నసింహాస♦నము దేవదేవున, కర్ఘ్యంబు త్రిపురసం♦హారునకును
బాద్యంబు త్రైలోక్య♦పాలనశీలున, కాచమనంబు ఫా♦లాక్షునకును
నభిషేకములు నిర్జ♦రాపగాధరునకు, వస్త్రయుగ్మంబు ది♦గ్వాసునకును
గీ. యజ్ఞసూత్రంబు బహువిధ♦యజ్ఞపతికి, గంధపుష్పాక్షతములు శ్రీ♦కంఠునకును
పరిమళోపేత ధూపంబు♦పశుపతికిని, దీపమిడఁదగు బ్రహ్మాండ♦దీపకునకు.

బ్రహ్మోత్తరఖండము, ఆ 2.

గీ. నుతగుణాకర యీశ్వరా♦ర్పితములయిన, పత్రపుష్పాక్షతోదక ♦ ఫలము లెల్ల
నాతిలోపల నిడఁదగు ♦ నూత నిడక, పారఁజల్లియు లంఘింపఁ♦బాప మండ్రు.

కాళహస్తీమాహాత్మ్యము, ఆ 3 ప 42, 43.

సీ. కడలేనిసంసార ♦ జలధిలో మునిఁగిన, జనులపాలిటినావ ♦ శంభుసేవ
కనుపూజమైయున్న ♦ కైవల్యసీమకుఁ, జక్కనిపెనుదారి ♦ శంభుసేవ
యతిఘోరగర్భార్ణవంబు ♦ లనుముత్తియంబులఁ బసులఁ గూర్చినకోర ♦ శంభుసేవ
సకలాగమజ్ఞాన ♦ సారమహాజాత, జాతంబులోఁజేవ ♦ శంభుసేవ
గీ. నిరవధికదారిద్ర్యపాలిక ♦ సురవగావహ, గహనదహన సముద్రిక్త ♦ శిఖవాహ
సఖిశిఖామాలికలతేఁ ♦ శంభుసేవ, సర్గముల శాంతములతీగ ♦ శంభుసేవ

రాజశేఖరచరిత్రము, ఆ 1 ప 67.

సీ. తొగలు గంధమున్నలు ♦ ముమ్మోదాలబ్బెంత, పుష్పాలు పొన్నలు ♦ పొగడవిరులు
సన్నజాజులు సురపొన్నలు గలిగొల్లు, గన్నెరు సంపఁగుల్ ♦ మొల్లవిరులు
బొండుమల్లె లశోక ♦ ములు మంకెనలు నందివర్ధనంబులు విర ♦ వాదివిరులు
గోరంటలును గొండ ♦ గోఁగులు చేమంతి, వనకుసుమములు గొ ♦ జ్జంగివిరులు
గీ. మాచిపత్రియుఁ గురువేరు ♦ మరువకంబు. దవనమును గరిగయు బిల్వ ♦ దళము లాది
యైన పూజార్హవస్తువు ♦ లర్థిఁ దెచ్చి యంతులకుఁ గొండపాదవు గావౌ ♦ నై మటయును

ఉత్తరరామాయణము, ఆ 3 ప 201.

క. ఉడిగినతావులపువ్వులు, గడిబోయినపుష్పములును ♦ కంటనివిరులున్
తొడిమెలు బాసినపువ్వులు, పడతి పూజింపరాదు ♦ పుష్పకితంబుల్.
క. సకలప్రసూనములలో, ముకుళీకృతపంచకాష్ఠ ♦ ములు తావి దక్కన్
వికసితపుష్పము లర్హము, ముకుళంబులఁ బూజగాదు ♦ ముఖ్యము జాతిన్.
క. పత్రములలోన రవిశత, పత్రాత్పల బృహతికనక ♦ పత్రము లై గుర్వ్
ధాత్రి నిషిద్ధము లిఁకఁగల, పత్రము లన్నియును తెల్లు ♦ ఘనుఁ బూజింపన్.

పర్వతపురాణము, ఆ 4.

## —♦ శివకథాశ్రవణము ♦—

సీ. చిత్తంబు రంజిల్ల ♦ శివకథల్ వినువారిఁ, బ్రాపించు ధన్యమైన ♦ బ్రహ్మపదము
శ్రవణంబొనర్పక ♦ సంతోష మందిన, వారలైనఁ గాంతురు ♦ పరమపదముఁ
బౌరాణికునకుఁ గఁ ♦ బళివస్త్రశయ్యలర్పించిన ఘను లింద్రు ♦ త్రిదివమునను
బురభంజనపురాణ ♦ మునకు నూత్నము సంగు, జనులకు గల్గు వి ♦ జ్ఞానసిద్ధి
గీ. బ్రహ్మహత్యాదిదుష్కర ♦ పాతకోప,పాతకము లాచరించిన ♦ పతితుఁడైన
సంతతపురాణసత్కథా ♦ శ్రవణములను, జెందు నిర్మలమోక్షల ♦ క్ష్మీసుఖంబు. 2122
క. శివదేవసత్పురాణ, శ్రవణావసరంబులందుఁ ♦ జయ్యనఁ జనినన్

ననఘసంధ్యావేళల, ననిరళసంపద్విశాల♦మగు వారలకున్. 2123

సీ. పుస్తకధారియై ♦ యొగిఁ బురాణము విన్న, జనుఁడుఁ జలూకమై ♦ సంభవించుఁ
దాంబూలచర్వణం♦బొనర్చుచు విన్న, దినుచుండు దుర్గతి ♦ శునకమలము
నున్నతాసనమున♦నుండి యాకర్ణింప, వాయసంబై పుట్టు ♦ వసుధయందు
వీరాసనస్థుఁడై♦ విన్న దుర్మానవుం, డర్జునపాదపం♦బై జనించుఁ

ఆ. బవ్వళించి వినిన ♦ పాపాత్మ మనుజుండు, కొండచిలువ యగుచు ♦ నుండు ధరణి
వక్తృసమత వెలయ ♦ వసియించిన ఖలుండు, గాంచు గురుతల్ప ♦ గమనఫలము.

కం. పౌరాణికు నిందించిన, క్రూరాత్ముఁడు రౌరవాది ♦ ఘోరనరకముల్
భూరిగఁ బొందుచు, ధారుణిపై శ్వానయోని ♦ దగ జనియించున్.

చ. ఘనపురజిత్కథాశ్రవణ♦ కాలమునందు దురుక్తు లాడు న
మ్మనుజుఁడు గర్దభంబగుఁ ద్రి♦యంబునఁ దాఁ గృకలాసదేహియై
జననము నొందుఁ గ్రమ్మఱను ♦ శంకరసంహిత లాలకింప కే
మనఁ జనినట్టివాఁడు వన♦ సూకరమై ప్రభవించు ధారుణిన్.

బ్రహ్మోత్తరఖండము, అ. ౯.

## —♦ శివనామసంకీర్తనము ♦—

సీ. జన్మపారంపరీ♦సంపాదితానేక, కలుషకర్మనికాయ ♦ కర్తనంబు
కామాదిశాత్రవ ♦ గ్రామగర్వహరము, దుర్వారరూపతమోని♦వర్తనంబు
సకలపుణ్యవ్రాత ♦ జలజాతవికసన, క్రమధరీభూతవి♦కర్తనంబు
బృందారకాంగనా ♦ బృందవన్మందార, వాటీకృతానంద ♦ వర్ధనంబు

గీ. పరమయోగీంద్రదుర్లభ♦భ్రాజమాన, మానసానందసౌఖ్యసం♦ధాననిపుణ
మన్యముక్తిపథాటికా♦నర్తనంబు, కేవలంబొప్పు శివనామ♦కీర్తనంబు.

సీమంతినీకల్యాణము, ఆ ౩.

## —♦ రామనామము ♦—

సీ. ధరనెన్ని పుణ్యతీర్థము లైనఁ గలుగనీ, రామనామము సరి♦రావు తలఁప
నిర్మలస్థితిమించు♦విధు లెల్లఁ గలుగనీ, రామనామము సరి♦రావు తలఁప
నానావిధములైన ♦ దానముల్గలుగనీ, రామనామము సరి♦రావు తలఁప
నతిశయంబుగ మహా♦వ్రతములు గలుగనీ, రామనామము సరి♦రావు తలఁప

గీ. రామనామంబె సారంబు ♦ రాముఁడే దిక్కు, రామచంద్ర రఘూద్వహ♦ రామ యనుచు

రామ రామ రామ రామ ♦ రామ రామ యంచుఁ ద
న్నామకీర్తనంబుఁ జేసినం గలుంగు మోక్షమున్.
సీతారామాంజనేయసంవాదము, ఆ 1 ప 47, 67.

## —♦ సంధ్యావందనము ♦—

సీ. ఘనపుణ్యోత్తములు సం♦ధ్యాసమయంబులై, వైదికప్రణవపూ♦ర్వముగ వేద
మాతృకయై వెలసిల్లు ♦ మంత్రంబుచే భక్తి, నర్ఘ్యంబు లిచ్చుచో ♦ వారి జలములు
వజ్రంబులై దైత్య♦వరుల నందఱ వధియించి తేజంబు గా♦వించు రవికి
నీ చందమున యామి♦నీచరశ్రేణికిఁ, బ్రతిదినంబును గల్గుఁ ♦ బ్రాణహాని
గీ. యగ్నిహోత్రంబులను బ్రథ♦మాహుతులవి, కర్త నాప్యాయనంబయి ♦ కడునతనికి
ఘనమయూఖంబు లెంతయుఁ ♦ గాంతి మెఱసి, భువనమంతయు నభివృద్ధిఁ ♦ బొందఁజేయు.
క. కావున బ్రాహ్మణులకు సంధ్యావిధు లొనరింపవలయుఁ ♦ దత్కాలమునన్
భూవినుత యగ్నిహోత్రము, గావింపఁగవలయు రెండు ♦ కాలములందున్.
ఆ. కాల మెఱిఁగి సంధ్య ♦ గావింపనేరక, యగ్నిహోత్రవిధియు ♦ నాచరింప
నొల్లఁడేని యెంత ♦ యోగ్యుఁడై యున్న నా, బ్రాహ్మణుండు ద్రోహి ♦ భాస్కరునకు.
గీ. రేపు చుక్కలఁ జూచుచు ♦ మాపు తిమిర, వైరిఁ జూచుచు సంధ్యవా♦ర్వంగవలయు
నట్టివేళలు దప్పించి ♦ యాచరించు, నిత్యసంధ్యావిధానముల్ ♦ నిష్ఫలములు
విష్ణుపురాణము, ఆ 3 ప 180-182, ఆ 4 ప 213.

## —♦ అర్ఘ్యప్రదానము ♦—

సీ. మోకాళ్లు భూమిపై ♦ మోపి హస్తాంబుజద్వయమునఁ దామ్రపా♦త్రము ధరించి
యర్ఘ్యోదకంబుల ♦ యందు దూర్వాంకురాక్షతములు నవరక్త ♦ చందనంబు
కరవీరముఖ్యర♦క్తప్రసూనంబులు, వైచి యొక్కొక్క పేరు ♦ వరుసతో న
మోంతంబుగాఁ జతు♦ర్థ్యంతంబుగా బ్రణవాదిగాఁ బఠియించు ♦ చర్ఘ్యపాత్రి
గీ. ఫాలపర్యంత మెత్తుచు ♦ మాటిమాటి, కర్ఘ్యమిచ్చినఁ బ్రీతుఁడై ♦ యర్కుఁ డొసఁగు
సేవకున కాయు రారోగ్య♦ధీవివేక, భాగ్యసౌభాగ్య వైభవప్రాభవములు. 2140
కాశీఖండము, ఆ 3 ప 185.

## —♦ గాయత్రి ♦—

సీ. గాయత్రి విష్ణుండు ♦ గాయత్రి శంభుండు, గాయత్రి పరమేష్ఠి ♦ కర్మనిష్ఠ
గాయత్రి విధివిష్ణు ♦ కమలసంభవమూర్తి, యైన మార్తాండుండు ♦ మానివర్య

గాయత్రి జపియించి ♦ గాయత్రిఁ గొనియాడి, కాంచువిప్రుఁడు ముక్తి ♦ కలితపుణ్య
గాయత్రి సేవించు ♦ కాలంబు గాలంబు, మంత్రతంత్రములు ని ♦ ష్ఫలము లేక
గీ. యనఘ! సావిత్రి యనఁగ గా ♦ యత్రి యనఁగ, విశ్వజనయిత్రి యనఁజను ♦ వేదమాత
యనఁ బరాపరబ్రహ్మద్వ ♦ యం బనంగ, నమ్మహాదేవి కసమాఖ్య ♦ యాంతరములు.
సీ. మేలైన రెండుతొ ♦ మ్మిదులు విద్యలలోన, మహనీయ మగుమ మీ ♦ మాంస వెలయు
మీమాంసకంటెను ♦ మేలు ప్రాభవమునఁ, దర్కశాస్త్రము మహో ♦ దర్కగరిమ
తర్కశాస్త్రముకంటెఁ ♦ దానమభ్యధికంబు, వివరించి చూడంగ ♦ వేదరాశి
యామ్నాయములకంటె ♦ నభ్యర్హితంబులు, చర్చింప నుపనిష ♦ త్సముదయములు
గీ. నుపనిషత్తులకంటెను ♦ నూర్ధ్వపదవి, మంత్రరాజంబు గాయత్రి ♦ మహిమఁ గాంచు
బ్రణవమనుశ్రేపుతోఁగూడి ♦ పాఁడిఁబిమప, నవనిసురులకు గాయత్రి ♦ యానెమసురభి.
కాశీఖండము, ఆ ౩ ప 181, 191.

సీ. నిన్నుండి సంధ్యాది ♦ నిత్యకృత్యంబుల, బ్రాహ్మ్యకర్మములెల్ల ♦ వఱలఁ గలిగె
నిన్నుండి వెక్కులు ♦ నిగమముల్ ప్రభవించి, సకలధర్మంబులు ♦ చాటఁగలిగె
నిన్నుండి బ్రహ్మాది ♦ నిర్జరులకు భర్గుఁ, డీశ్వరుఁడని ధాత్రి ♦ నెఱుఁక గలిగె
నిన్నుండి దివమున ♦ నీరజమిత్రుండు, మందేహులను మట్టు ♦ మణఁచఁగలిగె
గీ. రమణ నోంకారదివ్యాక్ష ♦ రంబువకును, నెరయ నిన్నుండి విలువంగ ♦ నీవ గతిగ
జనని గాయత్రి నీకును ♦ సతులుసాటి, యనెడు మాటలు విజుగుప్స ♦ కాస్పదములు.
యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 2.

క. గాయత్రీమంత్రజపముఁ, జాయక ప్రతివాసరంబు ♦ భక్తివలిర్పం
జేయుమహాత్ముం డఘములఁ, బాయంగా నడఁచి బ్రహ్మ ♦ పదమున నిలుచున్.
శా. గాయత్రీజపమాచరింప శుభసా ♦ కల్యంబు సిద్ధించు హ
త్యాయాదిప్రభవోగ్రపాపమడఁగుం ♦ గైవల్యమున్ వచ్చు దీ
ర్ఘాయుష్యంబు లభించు లోకములు మం ♦ త్రైబోవు నేమంత్రముల్
గాయత్రీపఠనావమతాంశసమముల్ ♦ గావేదధీరోత్తమా. 2145
జ్ఞానవిమాహాత్మ్యము, ఆ ౩ ప 58, 59.

## — ♦ గాయత్రీస్వరూపము ♦ —

సీ. ఉపటరోంకారసం ♦ యోజితదివ్యాక్ష, రానుకున్యస్వకీ ♦ యాభిధాన
తారకనీలము ♦ క్తావిద్రుమసువర్ణ, ఘనతరకాంతిప్ర ♦ కాశితాంగ
కైరవబాంధవ ♦ ఖండమండలబద్ధ, మాణిక్యకాంచన ♦ మయకిరీట

పరశుతో మరచక్ర ♦ పటుగదాఖేటక, పాశాంకుశాభయ ♦ ప్రకటహస్త
గీ. యుత పరంజ్యోతి పట్వక్షు♦ లైదుతలలు, మూఁడు పాదంబులును గల్గు ♦ ముద్దుగాలు
పుణ్యగాయత్రి శ్రుతులకుఁ ♦ బుట్టినిల్లు, యాజ్ఞవల్క్యకి నెదుటఁ బ్ర♦త్యక్షమయ్యె.
యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ ౨.

## —♦ బ్రహ్మయజ్ఞము ♦—

గీ. బ్రహ్మదేవు నిరూపంబు♦ బ్రహ్మయజ్ఞ, మెఱుఁగు ప్రణవంబుచేసి వ్యా♦హృతులనొడివి
పాదపాదంబు గాయత్రి ♦ పలికి పదప, శ్రుతులు పఠియింపఁదగునది♦ హితము గాఁగ.
శేషధర్మము, ఆ ౨.

## —♦ సూర్యనమస్కారము ♦—

చ. దినకరునిన్ సభక్తిగ ను♦తించి జపించి నమస్కరించినన్
జనునట దుష్కృతవ్రజము ♦ జాఱును వత్సరమాత్ర తజ్జపం
బొనరుప రత్నధాన్యవసు♦ధోజ్జ్వలభూషణమందిరాదులౌ
ఘనతరసంపదల్ గలుగుఁ♦ గావున ముఖ్యము (సూర్యసంస్తుతుల్.)
శేషధర్మము, ఆ. సు. ఆ 2 పే 45.

### వసంతతిలకవృత్తములు.

గాఢాంధకారహరణాయ జగద్ధితాయ
జ్యోతిర్మయాయ పరమేశ్వరలోచనాయ
మందేహదైత్యభుజగర్వవిభంజనాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమో నమస్తే.
ఛాయాప్రియాయ మణికుండలమండితాయ
సూర్యోత్తమాయ సరసీరుహబాంధవాయ
సౌవర్ణరత్నమకుటాయ వికర్తనాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమో నమస్తే.
సంజ్ఞావధూహృదయపంకజషట్పదాయ
గౌరీశపంకజభవాచ్యుతవిగ్రహాయ
లోకేక్షణాయ తపనాయ దివాకరాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమో నమస్తే.
సప్తాశ్వబద్ధశకటాయ గ్రహాధిపాయ
రక్తాంబరాయ శరణాగతవత్సలాయ

జాంబూనదాంబుజకరాయ దినేశ్వరాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమో నమస్తే.
ఆమ్నాయభారభరణాయ జలప్రదాయ
తోయాపహాయ కరుణామృతసాగరాయ
నారాయణాయ వివిధామరవందితాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమో నమస్తే.

యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 2.

## —♦ మంత్రిణులు ♦—

సీ. వైష్ణవి కౌమారి ♦ వారాహి చాముండ, బ్రాహ్మి మహేశ్వరి ♦ బగళ లలిత
కాత్యాయనింద్రాణి ♦ కాళరాత్రి భువనేశ్వరి మహామాయ పం♦చదశశక్తి
భగవతి మాతంగి ♦ బాల మహాకాళి, కామేశ్వరియు భద్ర♦కాళి శక్తి
మలహారి కృష్ణాక్షి ♦ మాధవి శాంభవి, శాకంభరియు లఘు♦శ్యామలాంగి
గీ. మోహినీ కామరాజాఖ్య♦ముఖ్యదేవి, రాజరాజేశ్వరియు మంత్ర♦రాజరాజ
ముఖి వరూపిణి భైరవి ♦ ముఖ్యమాల, మంత్రిణులలోన మోహినీ♦మంత్ర మగుసి.

హంసవింశతి, ఆ 4 ప 95.

## —♦ పంచాక్షరీమంత్రము ♦—

శా. శ్రీమంతంబు శివస్వరూపమును దూ♦రీభూతతాపత్రయం
బామోదప్రద మార్యసమ్మతము త♦త్త్వార్థప్రదీపంబు శ్రీ
రామాగస్త్యమహర్షి లోకభజనా♦ర్హంబైన పంచాక్షర 2151
శ్రీమంత్రంబు నమశ్శివాయయనుచున్ ♦ జింతింపుఁ డశ్రాంతమున్.
సీ. రమణీయతరమంత్ర ♦ రాజంబు లందెల్ల, నధికమై యొప్పు పం♦చాక్షరంబు
ఆగామిసంచిత ♦ ప్రారబ్ధపాతక, హరణకారణము పం♦చాక్షరంబు
గణుతింప ధర్మార్థ♦ కామమోక్షము లవశ్యత నిచ్చు పం♦చాక్షరంబు
కాశికాగస్త్యాది ♦ ఘనముని దెల్పని?, చతురం బరయఁ బం♦చాక్షరంబు
గీ. జపపరాయణులకు సాధు♦జనుల కెల్ల, నక్షయఫలప్రదంబు పం♦చాక్షరంబు
పూర్వజన్మకృతానేక♦పుణ్యసాధ్య,మాగమోక్తంబు శైవపం♦చాక్షరంబు. 2152

బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

సీ. పంచాక్షరీమంత్ర ♦ పంచాననముగాక, తఱుమునే పాపదం♦తావళముల
పంచాక్షరీమంత్ర ♦ బడబానలముగాక, హరియించునే పాత♦కాంబునిధుల
పంచాక్షరీమంత్ర ♦ పవమానమము గాక, యణఁచునే ఘనదుష్కృ♦తామయముల

పంచాక్షరీమంత్ర ♦ పవనవేగము గాక, కలఁడు సే వృజినోగ్ర ♦ జలధరముల
గీ. మగుపపంచాక్షరీమహా ♦ మంత్రిరాజ, గారుడక్షేత్రక్రియానాద ♦ గౌరవంబు
గాక చీకాకుసేయు నే ♦ లోకభీక, రాతికల్మషభూతవా ♦ తాశనముల. 2153
క. ఇమ్మంత్రము పరిణతసహ, స్రమ్ముగ జపియింప నదిమ ♦ దతురమగు మా
రెమ్మెయి భజియించిన నది, సమ్మతమగు శంకరునకు ♦ సన్మునులారా.
సీమంతినీకళ్యాణము, ఆ 2.

## —♦ షడక్షరీమంత్రము ♦—

మ. కలుషధ్వాంతదివాకరం బమృతమా ♦ ర్గస్వచ్ఛదీపంబు ని
శ్చలతాపత్రయజాపపావకము సం ♦ సారాబ్ధిపోతంబు ని
ర్మలకల్యాణఫలప్రదంబు విలస ♦ న్మంత్రాధిరాజంబునై
యలరున్ శైవషడక్షరంబు నిఖిలా ♦ గ్ర్యస్తుత్యమై నిత్యమున్. 2154
ఆ. తారకలయందు శశియును ♦ తరువులందు, కల్పకము శైలములయందు ♦ కనకగిరియు
నటులు మంత్రంబులందు ష ♦ డక్షరంబు, శ్రీనిధి యనంగఁదగు ముని ♦ శ్రేష్ఠులార.
బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

## —♦ అష్టాక్షరీమంత్రము ♦—

క. శ్రీరమహితాష్టాక్షరియను, నామంత్రము సభ్యసింప ♦ నగు విప్రున క
ష్టైమంత్రమష్టవర్ణని, యామకమై ప్రణవపూర్వ ♦ మై విలసిల్లున్. 2156
సీ. ప్రణవనైసర్గిక ♦ పరమార్థమీమంత్ర, మని చెప్పుదురు బుధు ♦ లన్యమంత్ర
ములకుఁ దత్ఫలప్రాప్తి ♦ బొంది చెప్పఁగ శుభ, దంబును సుస్వభా ♦ వంబు లేదు
ప్రణవంబు సర్వమం ♦ త్రములకు నాయకం, బగు నాదియగు బ్రహ్మ ♦ మదియ చూడ
నొకటి రెండును వేను ♦ నొనరింప వర్ణము, లష్టాక్షరాఖ్యమై ♦ యతిశయిల్లు
గీ. నదియు నారాయణాహ్వయ ♦ మాది ప్రణవ, మిడినమస్కృతితోఁ గూడ ♦ నెసక మెసఁగు
సర్వశుభదంబు సర్వార్థ ♦ సాధనంబు, సర్వదుఃఖాపహారణంబు ♦ సౌఖ్యకరము.
పద్మపురాణము, ఆ 5 ప 105.

క. ప్రణవాదిచేసి నారా, యణనామచతుర్థితుదఁ ♦ నటు మధ్యమునన్
బ్రణతిప్రకాశకంబగు, మణిమయశబ్దంబు జొనుప ♦ మంత్రము పుత్రా! 2158
క. ఈయష్టాక్షరిమంత్రము, ధీయుతులై పఠనసేయు ♦ ధృతిమంతులు మ
త్సాయుజ్యముక్తిఁ బొందుదు, రాయాసవిహీను లగుచు ♦ నతిమోదమునన్. 2159
మాత్స్యపురాణము, ఆ 1 ప 120, 121.

—◆ తారకమంత్రము ◆—

క. తారకమంత్రిం జెప్పెడు, పారెపు నొకనియమమున నే◆జప మొనరించున్
గోరిక మత్సన్నిధి నిం,పారు మహాయుగసహస్ర◆ మతఁడు వసించున్. 2160

సీ. దుర్గమపంకాబ్ధి ◆ నిర్గమింపఁగ ధాత్రి, తారకనామంబు ◆ తరణియొన్న
ఘోరసంసారౌఘ◆ గుల్మినుల్ తెగఁగోయ, నలతారకము నిశా◆తాసియొన్న
దారుణకర్మరి◆తగహనంబుల కెల్ల, తారకనామంబు ◆ దావవహ్ని
ఘనకిల్బిషాద్రిసం◆ఘంబుల కవనిలో, తారకం బొగి వజ్ర◆ధారయొన్న
గీ. సహహ తారకమంత్రనా◆మాఖ్య మెవఁడు, నిరుపయించువాఁడు స◆త్కోటులెన్న
మత్పదముఁ జెంది విబుధస◆మ్మాన్యుఁ డగుచు, దివ్యవస్త్రాయుతంబుండు◆ దివ్యసరణి

కవిజనోరసచంద్రోదయము, ఆ 4.

—◆ శంఖచక్రాంకితములు ◆—

సీ. అగ్నిసన్నిధినుండి ◆ యాచార్యుఁ డాజ్యంబు; వోయుచుఁ దన్మంత్ర◆ములను వేయు
నెనిమిది యొండె నూ◆ రెనిమిది యొండెను, వేల్చి తక్కిన వెల్ల◆ విష్ణుమంత్ర
తతిచేతఁ బురుషసూ◆క్తముచేతఁ బాయసఘృతములఁ గొన్ని యా◆హుతులు వేల్చి
యయ్యగ్నిలోపల ◆ నాయ్యనఁ జక్రశంఖములు నిక్షేపించి ◆ క్రమముతోడ
గీ. మతిమదక్షిణ నిరువది ◆ మార్లు వేల్చి, తప్తచక్రంబు మంత్రపూ◆తముగ శిష్యు
కుడిభుజంబునఁ జక్రము◆ద్ర్యొడమవలన, శంఖమును గాఁగఁగరుఁడుగా◆ఁద్రుంగవలయు
క. ధరణీదేవుఁడు దగ సం,స్కారణానలతప్తశంఖ ◆ చక్రాంకములం
గరమూలంబుల భక్తిని, ధరియించినయేని హరిప◆దంబునఁ జెందున్ 2163
ఆ. చక్రమైన శంఖ◆చక్రింబులైనఁ బం,చాయుధంబులైన ◆ నగ్నితప్త
ముగ భుజంబులందు ◆ మొగిఁబూని బ్రాహ్మణుఁ, డాచరింపవలయు◆నర్హవిధుల.
క. చక్రాంకరహితుఁ డగుచుఁ ద్రి,వికర్మముఁ బూజించునట్టి ◆ విప్రుని జపదా
నక్రతుపూజాధ్యయనా,దిక్రియలవి నిష్ఫలములు◆ధీవర తలఁపన్. 2165
క. ఉపనయనవేళఁ బాపవ్యపగతహోమాగ్నిఁ గాఁచి ◆ యాతనిఁ జక్రాం
కపునీతుఁ జేసి తిమ్మటు,నపరిమితబ్రహ్మకర్మ◆మగుఁ జేయింపన్. 2166
క. శ్రీకరచక్రాంకితులగు, లోపలు శుద్ధులు మహాత్మ◆లును నగుదురు వా
రికిక్రియలు లేకయుండినఁ, బ్రాకృతు లన ధాత్రి నెన్నఁ◆బడుదురు మనుజుల్.
క. ఏయాశ్రమస్థుఁ డైనను, బాయక విప్రుండు విష్ణు◆పరుఁడై చక్రాం
కాయతనభుజుఁడు గాఁదగు, నీయర్థము శ్రుతులఁ జెప్పు ◆ నిందునిభాస్యా. 2168

పద్మపురాణము, ఆ ౫ ప ౭౪, ౬౮-౬౯.

## —♦ బ్రాహ్మణప్రభావము. ♦—

సీ. అనలంబు కరముల ♦ నశ్వినీదేవతల్, నయనయుగ్మంబున ♦ నలరుమిహిరుఁడు
మూర్ధభాగంబున ♦ మునుకొని నదు లెల్లఁ, బాదంబులందును ♦ బవనుఁ డాత్మఁ
బరమాత్మ హృత్పుండరీక♦పద్మమధ్యమమున, వరుణుం డురంబున ♦ వాసవుండు
కంఠనాళంబునఁ ♦ గంజాప్తుఁడును గుక్షి, నమరవర్యులు భుజా♦గ్రములయందు
గీ. సాధ్యు లాధారజలరుహా♦స్థలమునందు, వసువు లెల్లను మెహనా♦వర్తములను
నుండు శ్రీకీర్తిఁ దద్భాసు♦రోత్తమాంగ, మందులను దేవసంఘముల్ ♦ సందడిలుచు.
సీ. అదిగాక విను భూసు♦రాంఘ్రిపదర్శనం, బఖిలసంభవపాప♦శిక్షకంబు
సర్వేశు లేర్చ్వరా♦శీర్వాదములు వాంఛి, తార్థప్రదంబులై ♦ యలరుచుండుఁ
బెంపైన వసుధా ని♦లింపవందనముచేఁ, దనుకల్మషములెల్లఁ ♦ దఱఁగిపోవు
నిట్టివిట్టిజగంబు♦లెల్లఁ బావనములు, గావించుచుండురు ♦ ధీవరేణ్య
గీ. కోటిజన్మములకుఁగాని ♦ నూటిపడదు, విప్రజన్మంబు వసుధను ♦ విప్రుఁ డయ్యు
విష్ణుపాదాంబురుహభక్తి ♦ విడిచెనేని, యతనికన్నను శ్వపచుఁ డ♦త్యధికుఁ డరయ
మత్స్యపురాణము, ఆ 2 ప 126-131.

క. దైవాధీనము త్రిజగము, దైవము తన్మంత్రవశము ♦ తన్మంత్రము భూ
దేవతలచేతిదగుటను, దైవములకు దైవతములు ♦ ధరణీదివిజుల్. 2171

సీ. రాజద్వివేకమ♦హాజనాళికి నెల్లఁ, బుణ్యచరిత్రుండు ♦ భూసురుండు
అతులితాగామిసం♦చిత నటత్ప్రారబ్ధ, భూతసంవేద్యుండు ♦ భూసురుండు
యజనాధ్యయనసుక♦ర్మాచరణాత్త వి,లాసవిశ్రాంతుండు ♦ భూసురుండు
వరతపోనైష్ఠికో♦న్నతకృపాంచితో,ల్లాసమానధనుఁడు ♦ భూసురుండు
గీ. భూరికరుణాసముద్రుండు ♦ భూసురుండు, భోగశక్రసమానుండు ♦ భూసురుండు
భూమిభృద్వరసేవ్యుండు ♦ భూసురుండు, భాసురాంబురుహాప్తుండు ♦ భూసురుండు
సత్యభామాపరిణయము, ఆ 1.

సీ. ఆకొన్నసురలెల్ల ♦ ననుదినం బెవ్వరి, క్రతుశాలపంచలఁ ♦ గాచియుంద్రు
భజియింతు రెవ్వాని ♦ భవనముల్ ప్రతిమాస,మును పితృదేవతల్ ♦ భుక్తిగోరి
సకలభూతంబులు ♦ సంతృప్తిఁ జెందు నెవ్వరు సేయఁదగు బలి♦హరణసిద్ధి
సర్వావతారంబు ♦ లక్షాంతమును బూజ,లందు నెవ్వా రొనర్తు ♦ రర్హరీతి
గీ. వేదశాస్త్రంబు లెరిచే ♦ వెలయుచుండు, నెంచు నెవ్వరిదినచర్య ♦ స్మృతిచయంబు
లర్కజయ మిచ్చు నెవ్వరి ♦ యర్ఘ్యతోయ,మట్టి విప్రుల కెన రెవ్వ♦రఖిలమునను.
దశావతారచరిత్రము, ఆ 3.

—♦ బ్రాహ్మణప్రశంసాఫలము. ♦—

సీ. బ్రాహ్మణులకుఁ బదా♦ర్పణమునఁ జేసిన, బహుళతీర్థస్నాన♦ఫలము దొరకు
ధరణీసురవరులకుఁ ♦ దలయంటి నూనెఁ బోయ్య, గంగ నాడిన యట్టి ♦ ఘనత యబ్బు
సద్విప్రులకు కేలు♦నుష్ణోదకము పోయు, వంశంబునకు బ్రహ్మ♦వసతి గలుగు
విప్రుల కాసనా♦దిసరంబు నొసఁగిన, దివిజనాయకుఁ గూడి ♦ తిరుగవచ్చు
గీ. ప్రథమ నేత్రాల కిడ్డిచ్చు ♦ పుణ్యశాలి, కన్యకోపాధం బొనర్చిన♦ యట్టి సుకృతి
మొదవుఁ బాఁపలపనుపాఁడి♦ మొదవు లిచ్చు సత్యలోకంబు గలుగుని♦శ్చయము గాఁగ.

శేషధర్మము, ఆ 2.

—♦ బ్రాహ్మణతిరస్కారదోషము. ♦—

సీ. జన్మాతిశయముఖ♦ జలచంద్రయోగంబు, వంశసస్యక్షేత్ర♦వగ్రహంబు
దారిద్ర్యలతికావి♦తానదోహదకేళి, ఘనకష్టజీవన♦ కారణంబు
దురితోపదేశ స♦ద్గురుమంత్రసారంబు, మిథ్యాపవాద స♦మృద్ధికారి
దైన్యగుణాభీష్ట ♦ దైవసాక్షాత్కృతి, యజ్ఞానదీపతై♦లాభివృద్ధి
గీ. కోపభయతాపదైన్యఘం♦టాపథంబు, పరమకారుణ్యకీర్తికాం♦తవిపదంబు
ప్రాణహరణంబు బ్రాహ్మణ♦పరిభవం బనంగ విప్రాపకార మొ♦ప్పంగ నేల.
గీ. సగర దశరథ పాండు త్రి♦శంకు నహుష నృగ విషయ పౌత్రి కర్ణాది♦నిపుణమతుల
కథలు చంద్రేంద్రమూర్తుల♦కథలు వినఁడొ, తెలిసి విప్రాపకృతి కెట్లు♦ తెగువఁ జేసె.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 5.

—♦ బ్రాహ్మణవిత్తాపహరణము. ♦—

క. దురితము లనేకములు గల, వరయఁగ లోకమున నాని ♦ యన్నిటికంటెన్
ధరణీసురధనము పాపపుఁ, దెరువునఁ గొను టధిక మండ్రు ♦ ధర్మవిచారా. 2177
క. భూసురధనాపహరణము, సేసినఁ గులనాశ మగుట ♦ సిద్ధము దానం
జేసి యగును జండాలత్వాసంగము నపరభవము♦నందు నరేంద్రా. 2178

భారతము, అను. ఆ 4 పద్య 43, 44.

సీ. నరనాథకులకాన♦నము దహించుటకును, నవనీసురులవిత్త ♦ మగ్నికీల
జననాయకుల నిజై♦శ్వర్యాబ్ధి నింకింప, బ్రాహ్మణక్షేత్రంబు ♦ బాడబంబు
పార్థివోత్తముల సం♦పచ్ఛైలములఁ గూల్ప, భూసురధనము దం♦భోళిధార
జగతీవరులకీర్తి ♦ చంద్రికమాప విప్రోత్తముధనము మా♦ర్తాండోదయంబు
తే. విప్రవిత్తసామ్యము కంటెను ♦ విషము గాదు, గరళమునకును బ్రతికృతి ♦ గలదు గాని
దాని నూన్పంగ భువి నౌష♦ధములు లేవు, గాన విప్రస్వమును నెంతయు♦ గాచుపతికి

క. ఎఱుఁగమి నైనను భూసుర, వరుల ధనం బపహరింప ♦ వలవదు పటికిన్
మఱి పుణ్యనాలము మట్టిన, దరికొని వెసఁ గాల్పకున్నె ♦ తన పెరుమ, గన్. 2180
భాగవతము, ఆ 10 ప. 478, 479.

## —♦ గోప్రభావము. ♦—

క. అరుణశబలశ్వేత మేచక ధూ, సరవర్ణాకలితగోవి ♦ షయదానంబుల్
ఖచరాసురపాగ్ని పవన, వరలోక సుఖముల నిచ్చు ♦ వసుధాధీశా. 2181
క. ధేనువు ప్రియమున యాగు తిల, ధేనువు నిచ్చిననరుండు ♦ దీప్తుం డగుఁ బు
ణ్యానూనలోక సంవా, సానందోన్నతిఁ జరించు ♦ నప్రతిహతుఁ డై. 2182
క. విను గోవులను బ్రభాతం, బునఁ దలఁచుట తద్గుణములు ♦ వొగడుట భక్తిం
గనుఁగొనుట యధిక పుణ్యము, లని యొఱిఁగించు జనములకు ♦ నాగమఫణితుల్.
ఆ. చిన్ని నంబు గోశ ♦ కృతఘ్నమిత్రఘ్నుల కేశపఱుట సకలమాంస ♦ భక్షకైన
ఘోరపాప మంద్రు ♦ గోమాంసభక్షణ, మజ్జసంభవాదు ♦ లైన సురలు. 21 84
క. జనములు దుస్స్వప్నంబులు, గని గోకీర్తనము సేయఁ ♦ గాఁ దద్దురితం
బునఁ బొరయరు గోమయయుత, వినుతాంబుస్నాన మతిప ♦ విత్రం బనఘా. 3185.
చ. పరమపవిత్రముల్ యజన ♦ భాజనముల్ దమ విన్నఁ జూచినన్
దురితచయంబులం దొలఁగఁ ♦ ద్రోవఁగఁ జాలుఁ బ్రదానకర్తకు
త్తరగతిలాభవైభవము ♦ తంగెటిజున్ను గఁ జేయు గోవు లె
న్నఁగ దగ నారిఁ గొల్వ రని ♦ శారణఁ జొత్తురు వారు నాకముల్. 2185
సీ. ఆననంబునను జి ♦ హ్వాను శృంగముల బల, వైరి రంధ్రంబుల ♦ మారుతుండు
గకుదంబునందు శ్రీ ♦ కంఠుండు పదముల, యందు మరుద్గణ ♦ మనఘ కుక్షి
వహ్ని చన్నుల సర ♦ స్వతి పేడఁ బంచితీ, కుల లక్ష్మియును గీర్తి ♦ యును గ్రీవమున
రుధిరంబునందుఁ జం ♦ ద్రుఁడు హృదయంబున, భగుఁ డను దేవత ♦ పాల వేధ
గీ. వెండ్రుకలయందు నస్తా ♦ వితతి దోఁక, ధర్ముఁ డక్షుల సూర్యేందు ♦ చర్మమునఁ ద
పంబు సిద్ధి తేజము సంధి ♦ పట్లు సిద్ధులు నిక్కగఁ దలఁచి గోవు సే ♦ వనఁగవచ్చు.
భారతము, అను. ఆ 8 పద్య 51-60

## —♦ కపిలగోలక్షణాదులు. ♦—

గీ. కపిల నిచ్చినవానికిఁ ♦ గామ నిజము, కొన్నవానిని బుణ్యాత్ము ♦ కుఁడుగఁ జేయు
నీవుఁ గపిలాస్మమర్పవా ♦ నిరతమాన, సుండ వగు మెంతయును మేలు ♦ సుచరితాత్మ.
సీ. కర్ణశృంగాక్షిఖురనాసి ♦ కాపుటములు, గపిలములు గుత్తుకయును ము ♦ ష్కములు గవిల
పట్టు లొండు నెం దేహైక ♦ పట్టు కపిల, మైనఁ గపిలాత్యగుణమున ♦ క్షమియించాలు.

క. ఏ పేరెల్లఁ గపిల మైనను, దానిం జెప్పంగ నేల ◆ తగదు కపిలలన్
మానితగుణ విధికి గుడువఁగా నేపనికైనఁ గాడి◆ గట్టన్ దేవశన్. 2190

ఆ. కాలఁ గేలఁ గోలఁ ◆ గపిల దండించిన, నరకవాసము...ప ◆ నరునకవలయుఁ
బూరి నీరు లెస్స ◆ యారసి యగ్గోవు, సత్కరింప సుగతి ◆ సంభవించు. 2191

క. అనఘ కపిలాప్రదానం,బునకు ఫలం బిట్టి దనఁగఁ ◆ బోలునె కమలా
సనుఁడు మహానందప్రభ,వుని వెలయు మఁ జెప్పఁ జాని◆ నటు లేమంగున్. 2192

భారతము, అను. ఆ 3 పద్య 106-108

—◆ గోలోకము. ◆—

సీ. ప్రవహించు నెచ్చోటఁ ◆ బాలపూర్ణసంపదఁ, బాలుకాదుచు నపార◆ దుగ్ధనదులు
నవరిల్లు నెచ్చోట ◆ జర వర్ణబంగళిక, సంతతయౌవన◆సౌష్ఠవంబు
లలరొందు నెచ్చోట ◆ నాజన్మనిర్ఘరులతో, బహుసంఖ్యఁ బాయస◆పర్వతములు
బెడఁగొందు నెచ్చోటఁ ◆ గడవరయెంతయు శేమి, సాధునిర్మలఘృత◆సంచయంబు
గీ. నట్టి గోలోకమానమందు ◆ నధివసింతు,రధవుచేఁ బ్రొద్దుప్రొద్దునె◆ చ్యాంబుఁగనుచు
నలఘుమూర్తులు గోమాతృ◆కలు గుశీల, యాదిగాఁగల పరమక◆ల్యాణనిధులు.

కాశీఖండము, ఆ 2 ప 28.

—◆ విఘ్నేశ్వరపూజ. ◆—

సీ. ఉండ్రాలునానఁబిండి◆వుండేరికులుం దేనె,యనంటిపండ్లుం బూరి◆యలు ఘృతంబు
పెసరుఁబప్పును బాలుఁ◆ బెరుఁ గోగిరంబులు, బాయసాన్నంబులుఁ ◆ బోనకములు
నారికేళంపుబొం◆డాలు మీఁగడయును, నవదధిపిండఖం◆డాల్ గుడుములు
లడ్డువంబులు చక్కె◆ లాలు మోదండలు, ఖండంబు చలిమిడి ◆ మండపప్పు
గీ. లాదిగా భక్ష్యభోజ్య లే◆హ్యాదులైన, బహుపదార్థంబు లర్పించి ◆ ప్రీణితులైరి
(వేలుపులు రాక్షసులును నా◆విఘ్నపతికి, దుగ్ధపాథోధిమథనో◆ద్యోగవేళ.)

హరవిలాసము, ఆ 6 ప 58.

—◆ శనివారవ్రతము. ◆—

మ. శనివారోత్సవ మాచరించె ముని శ◆స్యవ్రతముం దానుఁ గ
మ్మని పణ్యాన్నములతోడఁ బూరిగమితో ◆ మండెంగలండంబుతో
ననుఁగుంబాసములతోడఁ బొందుకలమా◆హారంబుతో నేతితో
ఘనరంభాఫలఖండశర్కరలతోఁ ◆ గారుణ్యపాథోధికిన్. 2195

భీమేశ్వరపురాణము, ఆ 2 పద్య 67.

## —♦ ఆదివారవ్రతము. ♦—

క. నరుఁడు రవివాసరంబున, నిరుమారు భుజించెనేని ♦ హృతపుణ్యుఁడై
నిరయస్థితుఁ డగు మవ్యాధ్యాపరిగతుఁ డగు బ్రహ్మకల్ప ♦ పర్యంతంబున్. 2196
క. దినకరుఁ డుదయింపకమును, జనుఁ డినవాసరమునందు ♦ స్నానముఁ గావిం
చిన నదెంగుఁ దొంటియోనిమిది, దినములఁ జేసిన యఘంబు ♦ ధీరవరేణ్యా. 2197
గీ. భానువారవ్రతీ పాక ♦ పర్వసంక్రమణములందేకభుక్త ♦ మాచరణము
వెలయు సంగానకై స్నాన ♦ ఫలదమగుచు, నిరయమిరుమారుఁగుడిచిన ♦ నరుఁ డొందు.
గీ. రవిదినంబున నాదివా ♦ రాయణుండు, సర్వగతుఁడై వినిర్మల ♦ స్వాంతుఁ డగుచు
నుండుఁ గావున నేతద్వ్ర ♦ తోత్తమమును, నతని నర్చింప శుభఫలో ♦ న్నతులొసంగు.
శైవధర్మములు, అ. సు. ఆ 6 వ 141.

## —♦ సోమవారవ్రతము. ♦—

గీ. అమృతకరువాసరము నప ♦ రాహ్ణవేళ, హరునిఁ బూజించి భోజనం ♦ బాచరించి
మాపు భుజియింపకుండిన ♦ మానులార, సద్వ్రతమె యందు రన్యప ♦ తుంబునందు.
గీ. ఇందువాసరమునను రా ♦ త్రిదివసంబు, భోజనము మాని హరుపదాం ♦ భోజపూజ
జేసి మఱునాఁడు పారణ ♦ జేసెనేని, నుత్తమోత్తమమంద్రుడు వే ♦ ల్పోక మతమున.
సీమంతినీకళ్యాణము, ఆ 1.

సీ. సోమవారవ్రత ♦ స్ఫుటభానుబింబంబు, పుణ్యవారిజన ము ♦ ద్బోధకంబు
సోమవారవ్రత ♦ భీమజీమూతంబు, పాపదావానల ♦ భంజనంబు
సోమవారవ్రత ♦ సురభూజరాజంబు, కామితఫలదాన ♦ కారణంబు
సోమవారవ్రతా ♦ శుగ మహావేగంబు, దారిద్ర్యజలదవి ♦ ద్రావకంబు.
గీ. సోమవారమహావ్రత ♦ కామవిశిఖ, సముదయంబు నసర్గదు ♦ ర్గమమదాప
వర్గలక్ష్మీనభూమనో ♦ వారియహా వశీకరణకారణంబు రా ♦ జీవగంధి. 2222
సీ. ఉర్విసుపర్వుఁ డంభఃఖర్వసౌ శైత్యశ్వైర్య, విద్యానవద్యుఁడై ♦ వెలయుచుండు
రాజనందనుఁ డన్య ♦ రాజపూజితపదాం, భోజవిభ్రాజిత ♦ స్ఫురణఁ గాంచు
నూరుసంభవుఁడు ని ♦ త్యోర్వరా మేరుసమాన, చారుకాంచనరాశి ♦ సంగ్రహించు
శూద్రుండు సద్విజో ♦ న్నిద్రసేవారూప, భద్రవద్రిమ్యమై ♦ భవముఁ గాంచు
గీ. సతులు పతివల్లభత్వంబు ♦ సంగ్రహింతు, రతివ యతివాంఛితార్థంబు ♦ లందుచుండు
జనములెల్ల సౌఖ్యభా ♦ జనములగును, దథ్యముగ సోమవారవ్ర ♦ తంబుచేత. 2223
సీమంతినీకళ్యాణము, ఆ 2.

సీ. సోమవారమున వి♦శుద్ధమనస్కుఁడై, దినమం దుపవసించి ♦ శివుని సోమ
ఖండావతంసు శం♦కరు మహాదేవుని, గౌరీశు రుద్రసూ♦క్తమున నొంచె
వామదేవాదిమ♦హామంత్రముల నొండె, నభిషిక్తుఁ జేసి శృ♦స్సాపితముల
నర్చించి గీతనృ♦త్యపురాణగోష్ఠుల, సేవింప సంతుష్టిఁ ♦ జెందిమఱఁదు
గీ. వాంఛితార్థము లొసఁగునీ♦వ్రతముసర్వ, కామదము దోషహరమున♦క్తమునఁగుజువ
నుపవసించిన శంభుసా♦యుజ్య మబ్బు, నవనిపవరేణ్య పాండవే♦యాగ్రగణ్య.
శైవధర్మములు అ. సు. ఆ 6 శ్లో 140.

## ఏకాదశీవ్రతము.

సీ. పరుల నిందింపక ♦ పాషండజనగోష్ఠి, సలుపక యనృతభా♦షణము లాడ
కాగ్రహింపక శూద్రు♦నటు కింతునియుండి, ఖలునితోఁ గలయ క♦న్యస్త్రీల నెట్లైన
నేయక దుర్జన♦శ్రేణిసంగతిఁబోక, క్రయవిక్రయాదుల♦ కనని పడక
కోర్కులు మదిఁబుట్ట♦కుండ నిద్రింపక, యనుచితకర్మము♦లాచరింప
గీ. కమలమానసుఁడై యచ్యు♦తావతార, కథలు సద్భక్తి వినుచు ♦ భాగవతజనుల
సంగడంబునఁ గాలంబు ♦ జరుపవలయు, హరిదినంబున నుపవాసి♦యైనయతఁడు.
శ్రీరంగమహాత్మ్యము, ఆ 5 ప 130.

సీ. దశమినాఁ డేకభు♦క్తముచేసి దేవగృ,హమున నధశ్శాయి ♦ యగుచు దేవు
నిద్రించి మఱునాఁడు ♦ నియతుఁడై యేకాద,శీదినంబునను రా♦జీవనేత్రుఁ
దలఁచుచు నిమ్నగా ♦ జలకృతస్నానుఁడై, విమలుఁడై సంధ్యాది♦విధులఁ దీర్చి
లీలతో గోమయ♦లిప్తస్థలంబునఁ, బద్మనాభాకృతి♦ప్రతిమ నిలిపి
గీ. యందు భావించి లక్ష్మీశు ♦ నావహించి, పుష్పచందనములచేతఁ ♦ బూజ చేసి
భక్తి నైవేద్య మర్పించి ♦ ప్రస్తుతించి, యతిముదంబునఁ దా నమ♦స్కృతులొనర్చి
ఆ. విష్ణుకథలచేత ♦ వితతనర్తనవాద్య, గీతనుతులు వెలుఁగఁ ♦ బ్రీతితోడ
జాగరంబుచేసి ♦ చతురత నా రాత్రి, గడపవలయు నిట్లు ♦ గరిమ మెఱయ. 2227
క. హరివాసరమున నన్నము, పరితృప్తి భుజించువెల్లఁ ♦ బానగృహమునన్
సురతోడుత గోమాంసము, వెలువక భుజియించునట్లు ♦ వీక్షింపంగన్. 2228
ఆ. అనుపనీతులగుచు ♦ నజ్ఞులై తిరిగెడు, పంచవత్సరముల ♦ బాలకులను
వృద్ధరోగులకును ♦ వీక్షింపఁ జెందదు, విష్ణువాసరాన్న ♦ వృజిన మరయ. 2229
సీ. భూదేవగురువిత్త♦ములు హరించిననైన, సంతతానాచార ♦ సహితుఁడైన
బ్రహ్మహత్యాదిపా♦పములఁ జెందిననైన, గురుభామినీబాల♦గోఘ్నుఁడైనఁ

జారజాబకామిపై సంగతుండైనను, దఱచుగమధుపాననిరతుఁడైనఁ
దల్లిఁ దండ్రిని ద్వేషించువాఁడైనఁ, బాషండమార్గసంచరితుఁడైన
గీ. నఖిలదోషాశ్రయుండైన యట్టినరుఁడు, సుస్థిరంబగుబుద్ధిచే సొంపు మిగిలి
యొక్కహరివాసరంబున నుపవసింపఁ గలుగు నతనికి లక్ష్మీశనిలయ మబ్బు.

క. పతియనుమతిగలిగినచో, వ్రతములు సతి కాచరింపవచ్చును లక్ష్మీ
పతివాసరోపవాసవ్రతమునకుం బతియనుజ్ఞ వలవదు తలఁపన్. 2231

క. వ్రతమంబగుసద్భక్తిని, బురుషుం డొకదూరయాత్ర పోయిననైనన్
హరిపూజయు నుపవాసము, హరిదినములఁ జేయవలయు సతివల కెల్లన్. 2232

మత్స్యపురాణము, ఆ 4 ప 156-169, ఆ 5 28-26.

సీ. తల్లివంకను పది తరములవారును, తండ్రివంకను పది తరము లాలి
దెసఁ బదితరము లగ్గిం దనతోడ రా, నోలి నేకాదశి నుపవసించు
పుణ్యశీలుఁడు దేవపూజితుఁడై విష్ణు, ధామంబునకు నేఁగి తరలకుండు
బాలవయోవృద్ధభావంబులను నెప్పు, డైన నేకాదశియందు నొక్క
గీ. సారి యుపవాస మొనరించు జనుఁడు పాపమాచరించియు నిశ్చలహరిపదంబుఁ
జేరు నేకాదశేంద్రియార్జితమహాఘ, తతులఁ దొలఁగు నేకాదశీవ్రతముకతన.

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 3 ప 94.

సీ. అమితపాపౌఘవనాశాటవీఘనదావ, శిఖికీల యేకాదశీవ్రతంబు
దర్పితాహితచైత్యదళనోగ్రవిష్ణుకా, జ్యేయకం బేకాదశీవ్రతంబు
కఠినపాతకసముత్కరభేకలోకభు, గ్జిహ్మగం బేకాదశీవ్రతంబు
సంసారసంతాపసంతప్తమానసో, జ్జీవనం బేకాదశీవ్రతంబు
గీ. సువ్రతాకల్ప మేకాదశీవ్రతంబు, చిరశుభాకార మేకాదశీవ్రతంబు
చిన్మయానంద మేకాదశీవ్రతంబు, శ్రీసమంచిత మేకాదశీవ్రతంబు. 2234

సీ. పతికార్యభారసంభ్రమవశంబుననైన, నాఁకలి లేకైన నరుచినైన
భామినీవిరహసంప్రాప్తిఁ బొందుటనైన, నశన మబ్బకయైన నలుకనైన
మృగయావినోదనిమిత్తము లందైన, వ్యసనంబు నందైన వనటనైన
దారుణజ్వరపీడఁ దగులుటనైన సంగర మొనర్చుటనైన నగుపునందు
గీ. నైన హరివాసరమునాఁడు హర్నిశంబుఁ, జాల నుపవాసంబు సంభవించె
నేని సాయుజ్యనకుఁ గల్గు నిప్డు సిరి దనర్చు శ్రీహరి వైకుంఠనగరసుఖము. 2235

ఉ. కోటిమహావ్రతంబులును ♦ గోటిశతంబు విశిష్టదానముల్
కోటిసహస్రయాగములు ♦ కోటిశతాయుతతీర్థసేవలున్
పాటలగంధి పంకరుహ♦బాంధవసూను దినవ్రతమొందఁజేసిన్
హాటకశైలచాపధరు ♦ నర్చన సేయుట కోటిసాటియే. 2243

సీమంతినీకల్యాణము, ఆ 2.

## —♦ సప్తమీవ్రతము. ♦—

ఆ. షష్ఠి నుపవసించి ♦ సప్తమీతిథి నోము, తెఱఁగు వినుము బిల్వ♦దళము మొదట
శాకమైనయరఁగు ♦ సవరించి లక్ష్మీసమేతు శౌరినందు♦మీఁద నునిచి. 2245
క. తూర్పుఁ దోఁజలములు నించిన, హైమంబగుపాత్రియందు ♦ నలరు లునిచి ది
గ్భాగముల నాలుగు కలశము, లామేర యమర్చి యంబు ♦ లమరించి తగన్.
క. బడి సప్త తిలలు బసపుం, బోడిధాన్యములుంచి మట్టి♦మూఁకుడులందున్
గుడమును జేనియు పాలున్, బోడిశర్కర యునిచి విప్ర♦పూర్ణాంగనలన్. 2247
క. ఎనిమిది వాయనముల కొక, తొనమంత్రడ సమర్చి పూజ♦లిచ్చి యొసఁగి భో
జన మిడి కలశప్రతిమల, నెనయ రమకు శౌరి నావ♦హింపఁగవలయున్. 2248
క. పూజించి షెప్పులగు నీ, రాజనములు వారతులును ♦ రసజలు పాటల్
శ్రీజానిఁ దదష్టాక్షర, పూజారాధనలఁ బ్రీతిఁ ♦ బొదలింపఁదగున్. 2249
గీ. ఈవిధత్తో నాఁటి దినమెల్ల ♦ నుపవసించి,దక్షిణ లొసంగి మంగళ♦గాయకంబు
సప్తమీవ్రత మీరీతి ♦ జరుపవలయుఁ, జేసి మఱునాఁడు పారణ ♦ సేయవలయు.

శ్రీరంగమాహాత్మ్యము, ఆ 8.

## —♦ అష్టమీవ్రతము. ♦—

గీ. అష్టమీవ్రత మెట్లన్న ♦ నష్టదళము, లలరఁ బద్మంబు తండులం♦బుల నమర్చి
పూజ లొనరించి మెట్టుల♦పాడఃను సొంపుఁ,దనర నొక హోమకుండమ♦త్తఱి నమర్చి
క. ధుత్తూరపుష్పసమగతి, నత్తుగడక్ హేమనాళ♦మలరించి కడున్
జిత్తులు దర్భలు సమర్చి, యత్తఱి బెడిదముగ జ్వాల♦ లల్లా నుతఱిన్. 2252
క. జ్వాలామధ్యంబున లక్ష్మీలోలుని యుగ్రనార♦సింహుని గల్గఁగన్
మేళించి తలఁపునిలిపి ధ్యానాళుని బ్రణవోక్తి వహ్ని♦నట నిల్పఁదగున్. 2253
... జేసి పూర్వాగ్రములుగ, దర్భ లమరించి తత్క్రియా♦ద్రవ్య మెల్ల
... దనుంచి వేల్చి ♦ యిధ్మమాజ్యమున హవిస్సుసహోమంబు ♦ దనరఁజేసి
గీ. ... పర్ణించి కలికితో ♦ ... వేఁడి, బిల్వదళముల రుజలువో♦జెట్టి నుత్త

తేనెఘృతమున తిలలు దంబూని తిప్పి తీగ నవస్పృత్యువ్రతము సల్పిల్ల వేల్వ. 2255

క. సంపదలు వేఁడువారును, సంపెఁగపువ్వులను వేల్వఁ జను వైశల ని
ర్జింఘటుకు నెత్తిగన్నైను, లింపున హోమంబు సేయ నెసఁగు మునీంద్రా. 2256

క. మారణహోమంబునకున్, గారణ మావాలు వేల కాయలజిగురున్
పూరించ మూప్పు నెముకయు, గారంబులు తప్పదు మొదలు గా వేల్వనగున్. 2257

క. చిత్తభ్రమ బొందఁగ నున్మత్తులు దానవలచేత మెలఁతిలవలపున్
బత్తియు స్తంభనమోహన, వృత్తాదులకొఱకు నిటూల వేలువఁగఁదగున్. 2258

క. కదళీఫలములు వేల్చిన, యది నృపవశ్యముగ నెతి యూహాంతు తిరువేత్
పదివేలు నైనవేలుత్, గురురుగఁ జేయవలెఁ గోరు కోటికొలఁదిన్. 2259

క. ఆకలశోదకములచే, శ్రీకరముగ స్నాన మప్రుడు చేసి నివాళుల్
వైకొని వ్రతము సమాప్తిగ, నెకడ సంకల్పసిద్ధి నెసఁగుచునుండున్. 2260

శ్రీరంగమాహాత్మ్యము, ఆ 8.

## నవమీవ్రతము.

ఉ. నేయును బాలునుం బెరుఁగు నించినపాత్రిలు వాయనంబుగాఁ
జేయుచు దాన విప్రవలయుఁ జేకొని యేపుగ పేరఁటాండ్రికిన్
బాయక శారివల్లభుల పంక్తిని భోజన మాచరింపఁగాఁ
జేయుట యొప్ప్యోడన్ నవమి సిద్ధము లిట్టివ్రతప్రకారముల్. 2261

శ్రీరంగమాహాత్మ్యము, ఆ 8.

## దశమీవ్రతము.

చ. దశమిని దండ్రిసోదరియుఁ దల్లియు మున్నగువారిలోపలన్
గుశలముఁ గోరి కన్యకలకున్ వ్రతముల్ నడిపింప నొప్పుఁ దా
రశనము మాని యానవమియం దుపవాసముఁ జేసి యిందిరా
పతునిఁ దలంచి కుంభము సవారిగ నుంచఁ దగున్ యథస్థలిన్. 2262

గీ. ప్రాద్యమైనగుడాన్నసైవేద్య మిచ్చి, తిలలు మండలముగ నునిచి తెల సితాక్ష
దళసరోజంబు వ్రాసి యందు తదుని గముల. భద్రికర్ణిక నావహించి సంగవలయు.

క. మొదలన్ గలశముపై శ్రీసదనుని బంచాయుధును లెసంగించి ముదం
బొదవ నిరుగడలఁ బూజలు, సదమలమతిఁ జేయవలయుఁ జక్రాదివిధులన్.

గీ. తనమహోబుద్ధ్యహంకార తతులఁ గూర్చి, కాలమూర్తిని లక్ష్మీనుఁ గాఁ దలంచి
కల్లకనిహితాయుధాంచితుఁ గాఁగ నాత్మ, భావనముఁ జేసి కాంచన ప్రతిమయందు

క. వేదము విప్రులకొసఁగి సన్మోదరమునఁ జిల్చి యధిక♦మగు దక్షిణతో
శ్రీతంబగు కాలప్రతిమాదాన మొనర్చి విప్ర♦మండలి కెల్లన్. 2266

సీ. కామితాన్నంబు లిడి యందు ♦ కలశవారి, చేత నభిషిక్తుఁడై యన్న ♦ శేష మపుడు
బాంధవులఁగూడి భుజియింపఁ ♦ బాయు నఘము, నాయు వభివృద్ధి యగు సిరు♦ లతిశయిల్లు.

శ్రీరంగమాహాత్మ్యము, ఆ 8.

## —♦ చైత్రమాసవ్రతము. ♦—

మ. చైత్రమాసంబున రేపు శుద్ధమతితో ♦ మర్త్యుండు సుస్నాతుఁడై
మనస్వైరింగల హారపంచకమున ♦ మాంగల్యలీలన్ యథా
విధిఁ బూజించి గుడాన్నపాయసము నై♦వేద్యంబు గావించి యు
త్కృష్టం బైన వ్రతంబు సల్పి మఱి యు♦త్కృష్టాన్నంబు విప్రాళికిన్. 2268

పద్మపురాణము, ఆ 11 ప 43.

## —♦ వైశాఖమాసవ్రతము. ♦—

తే: కోరి వైశాఖమున నవ♦వారిజముల, విష్ణుఁ బూజించి యుపచార♦విధు లొనర్చి
పానకంబును దధ్యన్న♦బహుపదార్థ, తతియు నుపహార మిచ్చి వ్ర♦తంబు సలిపి.

పద్మపురాణము, ఆ 11 ప 45.

క. మాసాంతంబున విష్ణ్వాసన మొనరించి పరమ♦భాగవతుల క
న్నాసముల భోజన మ్మిడు, నా సుకృతికిఁ గలుగు మోద♦నక్షయఫలముల్.

పద్మపురాణము, ఆ 11 ప 46.

## —♦ జ్యేష్ఠమాసవ్రతము. ♦—

సీ. జ్యేష్ఠమాసమున సు♦స్నాతుఁడై విప్రుఁడు, పాటలసౌగంధి♦పద్మములను
నీలోత్పలంబుల ♦ నీలవర్ణునిఁ గృష్ణు, నర్చించి యతిభక్తి ♦ ననుదినంబుఁ
బానకసహకార♦ఫలసమేతంబుగ, నుపహార మర్పించి ♦ ముగిసిన యట్లు
మాసంబు కడపట ♦ మతిమ విప్రసమితికి, నిష్టభోజన మర్థి♦ నిడెడు నతఁడు

గీ. కోటిగోవుల ద్విజులకుఁ ♦ గోరి యిచ్చు, నట్టి ఫలమును బొంది దే♦హాంతరమున
నజభవామరవరులకు ♦ నందరాని, హరిపదప్రాప్తుఁడై యొప్పు ♦ నద్రితనయ.

పద్మపురాణము, ఆ 11 ప 47.

## —♦ శ్రావణమాసవ్రతము. ♦—

సీ. శ్రావణంబునయందు ♦ శనివాసరంబునఁ, గొమరారు నుభయపూ♦ర్ణిమలయందు
గ్రహణంబులందును సం♦క్రాంతులయందును, హరికిఁ బ్రీతిగ విశే♦షార్చనములు

నాఁడు నేకటు నిడి ♦ నరకచతుర్దశి, యనఁగఁ బ్రసిద్ధమై ♦ తనరవలయు
నభ్యంజనం బొందు♦నాచరించిన నిన్ను, సంస్మరించినఁ బూజ ♦ సలిపిన నిల
మానవు లఖిలకా♦మ్యఫలసంయుతులు గావలయు నావుఁడు విని ♦ జలజనాభుఁ
గీ. డట్లఁ గాక యాదివం♦బందు నన్నుఁ, గొలిచినఁ దలంచిన యభీష్ట♦ములు ఫలించు
ఘనసుకృతము లబ్బు నధ్యాయ♦మునను భోజనం బొక విప్రున కిడ సమ♦నఫలమొనవ్వు.

శైవధర్మములు, అం. సు. ఆ 6 పే 187.

## ఆశ్వయుజశుద్ధనవమి.

సీ. అరయంగ ధరణి మ♦హానవమి యనంగ, సొబగొందు నాశ్వయు♦శుద్ధనవమి
యందుఁ బ్రొద్దున లేచి ♦ యత్యంతభక్తితో, భారతిఁ జేపిని ♦ బ్రస్తుతించి
ధ్యానంబు జేసి పు♦స్తకనికరంబుఁ బూజించి నైవేద్య మ♦ర్పించి వేల్చి
ధనధాన్యవస్తువా♦హనభూషణాంబర, తాంబూలముఖ్యదా♦నంబు లొసఁగి
గీ. భోజనంబులు వెట్టి వి♦ప్రులను దనుప, నీప్సితార్థంబు లెల్ల నీ♦డేఱుచుండుఁ
గాన నవమీవ్రతమహత్త్వ♦గరిమ నెన్నఁ, బద్మజునకైన సాధ్యమే♦పాఁడుతనయ.

శైవధర్మము, ఆ 5.

## కార్తికమాసవ్రతము.

సీ. కార్తికమాసమా♦ఘస్నానమునఁ బాయు, బహుజన్మజనితపా♦పవ్రజంబు
కార్తికమాసవి♦కాసదీపమునంతు, భస్మంబులౌ నఘ♦ప్రతతు లెల్ల
కార్తికమాసభా♦స్కరనమస్కారంబులను మహాదురితజా♦లంబు లణఁగు
కార్తికమాసగో♦గణపూజఁ దాపత్రయానేకదోషంబు ♦ లడఁగఁ జేయుఁ
గీ. కార్తికమునందు శుక్లప♦క్షమున ద్వాదశీదినంబున శ్రీమూర్తి ♦ మేదినీశు
పత్న్యసమ దానమిచ్చిన♦భవ్యుఁ డొందు, దివ్యకైవల్యపట్టణ ♦ భవ్యసుఖము.

రుక్మాంగదచరిత్రము, ఆ 2 ప 58.

## ఫాల్గునమాసవ్రతము.

ఆ. పరఁగ ఫాల్గునమున ♦ నరుఁడు సుస్నాతుఁడై, యుదయవేళ విష్ణు♦పదయుగంబుఁ
గోమలమగులఁ గ్రొత్త♦కురువిందపువ్వులఁ, బూజచేసి భక్తి♦పూర్వకముగ.

పద్మపురాణము, ఆ 11 ప 41.

## శివరాత్రివ్రతము.

గీ. బ్రహ్మవధయును గోవధ ♦ బాలవధయు, ఘనసురాపానచండాల♦గమనములును
ధూర్తగతిఁ గోటిజేసిన దురితమయినఁ, జేరి శివరాత్రిమహిమవి♦క్షింపఁబోఁగు.

—— అతిథిసత్కారము. ——

సీ. సన్యాసులును బ్రహ్మచారులు వేదవిద్యార్థులుఁ దీర్థయాత్రాభిముఖులుఁ
బరదేశులై భూమిఁ దిరిగెడువారును, గతిలేక యాఁకటఁ గ్రాఁగువారు
దూరంబు నడచి ప్రొద్దుగ్రుంకఁబోకవచ్చిన, తెరువరులును వసతిదిక్కు లేని
పేదబ్రాహ్మణులు విప్రోదంబులకుఁ దమ్ముఁ జూడఁగ నవచ్చిన భూమిసురులు
తే. మొదలుగ నతిథులయి తమసదనములకును, నేఁగుదెంచిన భక్తితో నెదురువోయి
తోడుకొనివచ్చి తినయింటఁ గొరకినట్లు, లన్నపానంబులను నుపాయంబు సేయఁ
గలుగు గృహమేధి పుణ్యలోకముల కరుగు.

ఆ. ఇంటఁగల పదార్థ మేమియు దాఁపక, లేకయున్న ఋణము దేక యతిథి
కధికభక్తితోడ నన్నపానాదులఁ, దృప్తిసేయవలయు దినదినంబు.
తే. అతిథి యాఁకటిగొని యింటి కరుదెంచి, కడు నుదాసీనతను బొంది వెడలెనేని
తనకుఁగల పాపమా గృహస్థునకు నిచ్చి, వానిపుణ్యంబుఁ గొనిపోవు వసుమతీశ.
ఆ. కాన నతిథియందు గర్వంబు మదమును, బరుసఁదనము తెలుకుఁ బిల్లదంబుఁ
బొడమకుండఁ జేసి భోజనశయ్యాసనములఁ బ్రీతుఁ జేయుటమరు గృహికి.

విష్ణుపురాణము, ఆ 4 ప 154-157.

సీ. ఎదురేఁగి సాష్టాంగ మెరఁగి పాద్యం బిచ్చి, నారికేళీకటాసనముల నునిచి
మునుపోఁకఫాత్తిఁ గుట్టిన దొప్పగమితోడ, రంభావిశాలపర్ణములు పఱచి
శాల్యన్నసూపాజ్యకుల్యాబహువ్యంజనక్షీరదధు లర్పణంబుఁ జేసి
వార్చినపిదప సంవాహనమంత్రముల, గొనరించి తాంబూల మొసఁగి కుశల
తే. మడిగిపోయెదమన్న దవ్వనిచి సిరికిఁ, దగినసత్కృతిఁ జేసి ఖేదమునమగిడి
యర్చఁ గావింతు రెపుడు నిట్లతిథులైన, భాగవతులకు నప్పురిభాగవతులు.

ఆముక్తమాల్యద, ఆ 1 ప 76.

క. జలమొండె తక్రిమొండెను, ఫలమొండెను శాకమొండె భయభక్తి విడక్
వలెఁ గాని యతిథికారకె, నిలయము వెడలింపరాదు నిర్దయుఁడగుచున్. 3018
క. మాపటి యతిథిం గడపిన, పాపమునకు మితములేదు భానుజ! యతనిం
జోపింపక భోజనశయ్యోపేతముగాఁగఁ బూజ యొనరింపనగున్. 3019

రుక్మాంగదచరిత్రము, ఆ 2 ప 69-73.

—— ఉపవాసములు. ——

క. భూసురులకు వృత్తులకు నుపవాసము దగుఁ గాని యాన్యవర్ణులకుఁ దతీ
యాసక్తి గల్గిన పెద్దయు, దోషం బని యిందు ధర్మశాస్త్రాంతా. 3020

తే. యాశ్రయించిన వారల ♦ కర్థి నిచ్చు విష్ణుసాలోక్యసారూప్య ♦ వివిధదివ్య
భోగసామ్రాజ్యవైభవా ♦ భోగమహిమ, శాశ్వతంబైనదేవ యా ♦ చార్యసేవ.
తే. అనిశ మాచార్యసేవ గ ♦ ల్గినజనులకు, దేవభూదేవతీర్థసం ♦ సేవ లేల
అనిశ మాచార్యసేవగ ♦ ల్గని జనులకు, దేవభూదేవతీర్థసం ♦ సేవ లేల. 3039

వైజయంతీవిలాసము, ఆ 2 ప 112. 113.

## —♦ దేవపితృసమారాధనము. —

క. నృపవర పూర్వాహ్ణంబును, నపరాహ్ణము దేవపితృస ♦ మారాధన వి
ధ్యుపదిష్టకాలములు మ, ధ్యపుసమయము మానుసార్చ ♦ నార్హం బనఘా.
సీ. నరనాథ కాలహీ ♦ నంబును నశుచి సం, స్పృష్టంబుఁ బరిభుక్త ♦ శేషమును స
మంత్రికంబును వీత ♦ తంత్రంబుఁ గీటకే, శస్పృష్టంబు రా ♦ క్షసులు గొండ్రు
మాననీయద్రవ్య ♦ మేనియు సురపితృ, క్రియల దురాత్మకు ♦ లైనవారు
గుడిచిన నట్లు య ♦ క్కూడు పులఁ జొనుపక, యత్తని జమని నా ♦ స్మత్తుఁ బతితుఁ
గీ. గ్లిబుఁ గుష్ఠి దేవలకుఁ జి ♦ కిత్సకునిసి, పితనియము నపస్మారి ♦ శ్విత్రి రాజ
యక్ష్మయుతుని నర్తకుని గా ♦ యకుని సోమ, విక్రయుని వేదవిక్రయు ♦ విడువవలయు
ఆ. వడ్డి కిచ్చి కుడుచు ♦ వాఁడు ననగ్నియుఁ, బ్రాణివిక్రయమున ♦ బ్రదుకునతఁడు
దైవపిత్ర్యములకుఁ ♦ దగరు సంధ్యోపాస, నములు లేనివారు ♦ నరవరేణ్య. 3043

భారతము, అను. ఆ 2 పద్య 54–57.

## —♦ ధూపదీపనైవేద్యాదులు. ♦—

గీ. సల్లకీజాతనిర్యాస ♦ మెల్ల దేవ, తలకు మే లంతకంటె గు ♦ గ్గిలము లెస్స
యగలు గంధర్వయక్షోర ♦ గాదులకుఁ బ్రి, యంబు ధూపదానము నెడ ♦ నధిపవర్య.
గీ. తగినయట్టి ధూపము దేవ ♦ తలకు నిచ్చి, పరమపుష్టియు నాయువుఁ ♦ బడయుఁ గర్త
యక్షగంధర్వపన్నగ ♦ రాక్షసులును, ధూపమున మెచ్చి కోర్కు లి ♦ త్తురు కుమార.
ఆ. దైవతార్చ లపుడు ♦ తామసభూత ర, క్షోముఖంబులైన ♦ కుత్సితంపు
జాతు లెల్ల దీప ♦ సన్నిధి నడఁగు న, ట్లగుట దీపదాన ♦ మధిక ఫలము.
గీ. ఆలనేయి ముఖ్యము మహి ♦ షాదిమేష, జనితఘృతములుఁ దైలంబు ♦ మనుజనాథ
మధ్యమము లగు మేదోస్థి ♦ మాంసరసము, లరయ నింద్యముల్ దీపస ♦ మర్పణమున.
క. దేవతలకు వగ్రిపుసం, భావన నుపహార మిచ్చి ♦ పదపడి కుడువం
గా వలయు నట్లు సేయని, ధీవిరహితుఁ డసుర యగుట ♦ దెల్లం బధిపా.
క. తనయింటఁ గలుగు నన్నము, మును దేవతలకు నివేద్య ♦ ముగఁ జేసి ప్రణా
మనియమసహితసమర్పణ, మునఁ గృతకృత్యుండు గా వలయుఁ ♦ బురుషుం డనఘా.

నానాఖ్యాతంబగుయాగమున్ సలిపి విష్ణుప్రీతిఁ గావింపుచున్. 3064

వేంకటాచలమాహాత్మ్యము, దా॥ చిన॥ ఆ 2 ప 243.

## యజ్ఞశాల.

గీ. హోమకుండము నాభికా ధూమరేఖ, లాలుపునూఁగారు తళుకుగాఁ బూర్ణకనక
కలశయుగళంబుఁ జాలిండ్లు గాఁగ యాగ,శాల మెలఁగు జవరాలి లీలఁ దాల్చె.

కామవిలాసము, ఆ 2.

చ. పనిచిన దారఁ జేఁగి కను భంజితనీలతరాజకాయ సం
జనితకరోటికాటమును రాసఘృతప్లుతసచ్చలాశమాం
సనికరపక్వమానవిల సత్పటువహ్నిశిఖా ప్రభాసమ
త్యనుపమమంత్రతంత్రకర యాజకఘాటమయు యజ్ఞవాటమున్. 3065

చంద్రరేఖావిలాపము, ఆ 3.

గీ. వ్యంజనవిభక్తి చాతురి నంద మొంది, కర్మకారకగుణవృద్ధి గరిమ నొంది
యుక్తనాగమపురుషా మాత్రమగుచుఁ, గ్రమభుజక్రియ మించె వ్యాకరణసరణి
గీ. అత్తసోమంబు సజహ్వావర్త గాజినంబు, హరిచితశ్రీతిపదము గపాలయుతము
హవ్యవాహనరథమునై హతనివిగ్రహంబుఁ దలపించె నయ్యధ్వ శాలయంబు.

రామాభ్యుదయము, ఆ 3 పద్య 26 20.

సీ. మాళవ నేపాళ మగ ధాంధ్ర పాంచాల, భోజ కాంభోజాది భూమిపతులఁ
గరిరథాశ్వశ్రేణి ఘనసమిత్కుశముల, జీమూతసమహోమ ధూమతతుల
దర్భాసనంబులఁ దగినపీఠంబులఁ, బండితులై కూర్చున్న పరమమునుల
సరసస్వరోదార సామఘోషంబుల, సురుచిరయాగోప కరణతతుల
గీ. భూరిదధిఘృతక్షీరసం పూర్ణకుంభ, కనకమయవేదికాసము త్కరములమరి
పసుసమంచితయూపాళిఁ బరగుజవను, యజ్ఞవాటము సౌత్రేయ నప్పు డెసఁగె.

భాస్కరరామాయణము, బాల. ప 518.

## యాగభాగానర్హులు.

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠానకృత్యంబుల, సమకాలములయందు జరుప కునికిఁ
ఖటులోభమూలదుర్భరతరాశాపాశ,బంధనంబునకు లోఁబడుటవలన
రసవిషగంధక ప్రముఖవస్తుగణైక,పాకనిరూఢి చూపుటఁ జేసి
సంకీర్ణవర్ణసంస్పర్శాద్యనాచార,కలనంబు గలిగి వర్తిలుటఁ బట్టి
గీ. రొక్కి వైద్యాగ్రగణ్యుల కెప్పుడైనఁ, యాగభాగోచితత్వయో గానురూఢి

లేపటించుచు గొందఱు ♦ వేదవిదులు, చెప్ప వినినాఁడ నేనేమి ♦ సేయువాఁడ.

నయనోల్లాసము, ఆ ౭ ప 11.

## —♦ రాజసూయము. ♦—

క. వేదనినాదము నాశీ,ర్వాదనినాదము ననేక ♦ వాదిత్రమహా
నాదంబుఁ జెలఁగ నవ్వని,నాదంబు జనంబులకు వి ♦ నంబడ కుండన్. 8070

సీ. అస్మద్హోమఖముసం ♦ దగ్నిముఖంబున, విపులమంత్రాహుతి ♦ వితతిఁ జేసి
సకలదేవతలును ♦ సంప్రాప్తదక్షిణా,దానోత్సవంబుల ♦ ధరణీసురలు
సముచితసత్కార ♦ శతసహస్రంబుల, నఖిలరాజన్యులు ♦ నధికమతాన్న
దానంబు పెంపున ♦ ధరణీజనంబులుఁ, దద్దయుఁ దృప్తులై ♦ ధర్మచరితు

ఆ. నాఘు ధర్మతనయు ♦ ననుజసమన్వితు, సంస్తుతించి రధిక ♦ సమ్మదమున
( నని కురుప్రభునకు ♦ నట్లు వైశంపాయ,నోక్తమైనకథ న ♦ నోత్కటముగ. )

భారతము, సభా. ఆ 1 పద్య 292, 293.

సీ. వందిమాగధమాత ♦ వైణికవాంశిక,నాదుల కర్థసం ♦ భావనంబు
బధిరాంధమూకుల ♦ కధికధనంబును, భోజనార్థుల కిష్ట ♦ భోజనంబు
నామయార్తులకు ది ♦ వ్యరసాయనంబును, బ్రసవించుసతులకుఁ ♦ బథ్యములను
దీనసాధులకును ♦ బెంపుగా విత్తంబు, గణికాదులకును బు ♦ ష్పకలధనంబు

గీ. నడిగియడుగకమున్నె తా ♦ నరసి యరసి, చాల నిప్పించి యందఱ ♦ సత్కరించె
నాగతజనంబులం దొక్కఁ ♦ డైనఁ గాని, కష్టపడకుండ నందఱు ♦ తుష్టులైరి.

శిశుపాలవధ, ఆ ౩ ప 181.

## —♦ అశ్వమేధము. ♦—

క. క్రమయుక్తము యుక్తముగా, నమరగురుప్రతిము లైన ♦ యాజ్ఞికులు క్రియా
సముదయము నడపఁగా స్ఖలి,తములేకపహుతము సారక ♦ తత్కృతు వొప్పెన్.

సీ. వివిధభోజ్యపదార్థ ♦ విభవంబువలనను, సంతృప్తిఁ బొందక ♦ చనఁడొకండు
ధనధాన్యవస్త్రసం ♦ తతిలబ్ధి దారిద్ర్య,మడఁపక యేఁగు ♦ నట్టివాఁడు
గోరి యొయ్యదియైన ♦ గారవ మెసఁగంగఁ, బడయక రత్నవో ♦ యెడుమనుష్యుఁ
డెద్దియేనియు దుఃఖ ♦ మెలమినఁ జనుదెంచి, యది నిస్తరింపక ♦ యరుగునతఁడు

గీ. నందునకు వెదకినను లేఁ ♦ డంద మొందు, నరసి కుడువుఁడు కట్టుఁడి ♦ చ్చానురూప
వస్తువులు గైకొనుఁడు దుర ♦ వస్థదెలిపి, పాపికొనుఁ డని భీముండు ♦ పలుకుచునికి.

క. వలుగాలివానిఁ బక్షుల, జలచరముల విధియుతముగ ♦ సంయోజింపం
బొలిచెం బశువులు మున్నా,ఖిలఘుయశోమహిత యమ్మ ♦ హాయజ్ఞమునన్.

క. వాయమానసునౌజిత మగు, తురంగమము చుట్టుఁ బశుతతుల నిల్పినఁ దం
దరభావము దనుముఖస్ఫురణం బిట్టి దని చూపు♦పోలిక మెఱసెన్. 3076

ఆ. అశ్వమేధమునకు ♦ నాద్యంబు దక్షిణ, ధరణి యండ్రు గాన ♦ నరునిచేత
విజిత యైన ధరణి♦ పరిజనిలప్రీతమై, ఋత్విగర్చనముగ ♦ నిచ్చినాఁడు. 3077

సీ. కోటికోటులు మాడలు ♦ గుప్పవోసి, ధరణి వెల యని చెప్పి యా♦స్వరమసంయ
మాధిపతికి సమర్పించె ♦ నతఁడు ఋత్విగావలికిఁ బంచిపెట్టె న♦య్యతులధనము.

గీ. అతులకనకమయము లైన ♦ యజ్ఞవాట, వేదికాయూపతోరణ ♦ వివిధభాండ
దండశయ్యాసనాదుల ♦ ధరణివిభుఁడు, డొసఁగె విప్రచయంబుల ♦ కుల్ల మలర.

గీ. అట్లు విప్రుల కిచ్చి య♦నంతరంబ, రాజులకు వైశ్యులకు శూద్ర♦రాజి కన్య
జాతులకు మ్లేచ్ఛులకును బ్ర♦భూతధనము, ద్రవ్యతండంబు లిచ్చె నా♦ధరణివిభుఁడు.

భారతము, అశ్వ. ఆ 4 పద్య 190-200.

క. పాటీరహీరవర్ణము, హాటకఘుచ్ఛమును నల్ల♦నగుచెవులు నిరా
ఘాటజవంబును నశ్వర, ఘోటకలక్షణములివియు ♦ గోచరమైనన్. 3081

ఉ. కాయము చిత్రవర్ణములు♦ గల్గి మనోజవమైనయశ్వమే
ధీయహయంబు నాగమవి♦ధిన్ విడువందగుఁ జైత్రపూర్ణిమన్
రాయఁడు మా సైన్యముల్ గొలిచి♦ రాసుతులైనను దమ్ములైన న
త్యాయతశక్తిఁ గావ నొక ♦ హాయన ముర్విఁ బరిభ్రమింపఁగన్. 3082

క. శూరులు గల్గినఁ బట్టుఁడు, ధీవరనని హయము నిటల♦దేశంబున బం
గారపుఁబట్టముపైఁ బతిపేరాంకము వ్రాసి కట్టి ♦ విడువఁగవలయున్. 3083

సీ. విణ్మూత్రములు సప్తి♦ విడిచినతావుల, నెల్లహోమంబు సే♦యించి యచట
గోసహస్రంబు ధా♦త్రీసుపర్వుల కాగ, మోక్తదక్షిణలతో ♦ నొసఁగవలయు
దీక్షితుండు హయంబు ♦ తిరిగివచ్చెదు దాఁక, నియతభోగంబు ల♦న్నియును మాని
భార్యతో డుత నసి♦పత్రవ్రతముఁ బూని, బ్రహ్మచర్యంబు స♦ల్పంగవలయు

గీ. సమరపతి నూఱు తురగమే♦ధములు చేసెఁ, గాని యీనిష్ఠ జరియింపఁ♦ గానఁ డయ్యె
వ్రతముఖతంబుగఁ జేయుమీ♦ క్రతువు నీవు, పాండునందన సకలపా♦పములు నడఁగు

సీ. హరికథావిముఖుని ♦ నన్యాయవర్తనుఁ, బురుషార్థరహితుఁ ద♦పోవిహీను
మిత్రవంచకుని స్వా♦మిద్రోహిఁ బతితుని, యుద్ధభీరువు నన్య♦యోనిరతుని
మాతృపితృభ♦క్తిహీను ధర్మబాహ్యుని, యతి విదూషకుని దు♦ర్వ్యసనశీలు
బహుళపాపి విశ్వాస♦ఘాతకు ఋతుకాల, కర్మపరిత్యాగిఁ ♦ గష్టులోభి

గీ. ఖలు వికత్థను బహువాద♦కరుఁ గృతఘ్ను, నాత్మకృత్యప్రతారకు♦నాతతాయిఁ
దగదు కానిపోవఁగా నెంత♦ఘనిష్ఠుఁడైన, సర్వశాలోక వాచ్యత్వ♦లగుటఁ జేసి

సీ. ఆపుణ్యదివసంబు♦నందు ధర్మసుతుండు, ద్రుపదపుత్త్రియుఁ దాను♦నుపవసించి
జపహోమదానసం♦పన్నపూర్వకముగా, సద్వరప్రతతికి♦నలవరించి
తురగరత్నంబుఁ గో♦త్రాహ్వయంబున గంధ, పుష్పాక్షతాదులఁ ♦ బూజచేసి
నిజబిరుదాంకురా♦న్వితహేమపట్టిక, ఫాలభాగంబునఁ ♦ బదిలపఱిచి

గీ. చిత్రపటరత్నఖచితపం♦జీరకనక, కింకిణీచామరముల న♦లంకరించి
మ్రొక్కి వలగొని బహువాద్య♦ములు చెలంగఁ, గదలె నశ్వంబు మధ్యాహ్న♦కాలమునను

సీ. జననాథ బహుముఖ♦సాధ్య మీయశ్వమే, ధంబు తత్క్రతువిధా♦నంబు వినుము
గోక్షీరతనువుఁ గుం♦కుమశిరోధియుఁ బీత, వాలంబు నసితశ్ర♦వంబునైన
వీతి నర్చనచేసి ♦ విడిచి తద్రక్షకై, యతిశౌర్యఘనులఁ దో♦డనుపవలయు
వేవు రుత్తమకుల♦ద్విజాతుల ఋత్విజులుగా, వలయు వేర్వేఱ వా♦రలకు నొక్క

గీ. గజము నరదంబు భటచతు♦ష్కము సుబూజ్య, గోశతంబును నన్నియ♦ఘోటకములు
వేయిబారువు లర్థంబు♦విశదపాత్రి, కములు నట్టివి వలయు దా♦నము నొసంగ.

క. మహీనసిపత్రం బీవ్రత, మహిమాంశుకులేంద్ర దీని♦కరయఁగ భార్యా
సహితుఁడు గావలెఁ బత్నీ, రహితునకు నుపక్రమింప♦రాదనిపలుకన్. 3088

జైమినిభారతము, ఆ 1 ప 75–78 ఆ 6 ప 101, 103.

## తలిదండ్రులు

సీ. జఠరంబు నిండుల మాం♦సములు దొమ్మిది యుదరంబునం గరము భ♦రంబుతోడ
భరియించి పదపడి ♦ ప్రాణసంశయదశ, నొంది పుత్త్రునిఁ గాంచు ♦ నోసరఁ దల్లి
తపములు యజ్ఞముల్ ♦ దానముల్ వ్రతములు, దేవతాసజ్జన♦సేవనములుఁ
గావించుఁ బుత్త్రునిఁ ♦ గామించి జనకుఁ డిట్లిరువురపాటును ♦ సరియె తలఁపఁ

గీ. దనయుఁ గని తల్లిదండ్రులు♦తమకు నతఁడు, భక్తుఁ డగుటకు ధర్మార్థ♦సక్తుఁ డగుట
కాసపడుదురు విను మట్టి♦యాస సిద్ధిఁ, బొందఁ జేయునతఁడె చు♦మ్మీ నందనుండు.

క. జనకుం డధికుఁ డుపాధ్యా, యునకుఁ బదిమడుంగు లెక్క♦డుర్వీనాథా
జనకునకు దశగుణంబులు, జననిగురుత్వమున నిది ప్ర♦శస్తము శ్రుతులన్. 3090

భారతము, అర. ఆ 5 ప 5 అను. ఆ 4 ప 189.

—♦ పితృభక్తి. ♦—

సీ. సకలశాస్త్రజ్ఞుఁ డౌ♦టకు నేమిఫలమన్నఁ, బితృభక్తియే కాదె ♦ సుతవరులకు
ఘనవిక్రమక్రీడ ♦ కలిమి కేఫలమన్న, జనకుఁ గొల్చుట గాదె ♦ తనయులకును
బహుతరద్రవ్యలా♦భమున కేఫలమన్నఁ, దండ్రిసేవయె కాదె ♦ తనయులకును
సక్రియైశ్వర్యసా♦మగ్రి కేఫలమన్న, నయ్యఁ గొల్చుట కాదె ♦ యాత్మజులకుఁ
గీ. గానఁ బితృభక్తి గలయట్టి♦మానవులకు, నఖిలధర్మంబు సేకూరు ♦ నతఁడు సేయు
పనులు కల్యాణయుతములై ♦ పరగుచుండు, నమరపదసౌఖ్య మతనికి♦హస్తగతము

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 2.

—♦ మాతృభక్తి. ♦—

సీ. సవదరించుట యెట్లు ♦ జఠరగోళంబున, నవమమాసావసా♦నంబు దాఁక
ప్రేఁకనైనప్రసూతి♦వేళాసముద్భూత, సంకటం బోర్వంగఁ♦జాలు టెట్లు
కుత్సింపకుం డెట్టు♦లుత్సర్గవిణ్మూత్ర, లాలాద్రవశ్లేష్మ♦జాలమునకు
నందంద వక్షోరు♦హములు దింపులుపోవఁ, గుడుకనిచ్చుట యెట్లు ♦ దుగ్ధరసము
గీ. పంచకరపాట్లువడి తన్నుఁ ♦ బెంచి పిదప, యాపదలఁ బాపి రక్షించి♦నట్టి తల్లి
దేవతాబుద్ధి భావించి ♦ తెలియువలయుఁ, గొడుకు వంశాభిసంవృద్ధి♦కొనలు సాఁగ.
క. రేపాడిఁ గొడుకు జననీ, శ్రీపాదములకు నమస్క♦రింపఁగఁ దగుఁ ద
చ్ఛ్రీపాదక్షాళనసలి,లాపోశన మెపుడు సుతుల♦కాయువ్య మగున్. ౩౦౯౪
గీ. సర్వతీర్థాంబువులకంటె ♦ సమధికంబు, పావనంబైన జనయిత్రి♦పాదజలము
వరతనూజుల కఖిలదే♦వతలకంటె, జనని యెక్కుడు సన్నుతా♦చారనిరత.

కాశీఖండము, ఆ 4 ప 18-20.

—♦ పితృకర్మ. ♦—

క. అమవస నమవసఁ బితృయజ్ఞముఁ దగఁ బిండప్రదాన♦సహితముగా భ
క్తిమెయిం జేయునతఁడు నిత్యముఁ జేసినవాఁడ యగు స♦మంచితచరితా.
సీ. పాడ్యమిఁ బితృయజ్ఞ♦పరుఁడైనఁ జారుకాం,తాపతి విదియఁ గాంతలకుఁ దండ్రి
తదియను జవితిని ♦ దా వాజిధనకుండు, పశుభాగి పంచమి ♦ బహుసుతుండు
షష్ఠి భావాత్ముండు ♦ సప్తమిఁ గృషిభాగి, యష్టమి వాణిజ్య♦ప్రష్ఠుఁడు వసు
గజధర్మవిష్ణుచి♦త్తజతిథులం దేక,శఫజంతువులును గో♦చయముఁ గుప్య
గీ. ములును దగ బ్రహ్మవర్చస్వి♦పుత్త్రికులును, ధనము గలవాఁడు విను చతు♦ర్దశి రణైక
భాగి పున్నమ నమవస♦భవ్యసర్వ, కామ్యఫలభాగిఁ యగుఁ జువ్వె♦కారవేంద్ర.

క. సౌహార్దవచనరచనా, బాహుళ్యతవలన నెల్ల ప్రాణుల నధిక
స్నేహమున బుజ్జగించుచు, నైహికములు విడుచు టుచితమగు భిక్షుకునన్.

ఉ. ఏకదినంబు గ్రామమున నేనుదినంబులు పట్టణంబునం
దేకమనంబుతోడ వసియింపక త్రివర్గగృహంబులందు న
స్తోకతభిక్ష మెత్తి పరితోషమునన్ భుజియించి దేహయా
త్రావశీలంబుఁ గైకొనుట ధర్మము భిక్షునకున్ నరేశ్వరా. 3167

విష్ణుపురాణము, అ 4 ప 162-166.

క. వ్యామోహంబును లోభము, కామక్రోధములు మదమహంకారము వర్జి
ద్దామమును లేక యాత్మారాముండై భిక్షుఁ డున్న సంజెల్లుఁ జుమీ. 3168

క. భిక్షాకదంబకంబున, నక్షయశాకీరవహ్నియందును దినమున్
లక్షించి వేల్వఁ గల్గిన, సాక్షాదీశ్వరుఁడు గాఁడె సన్న్యాసి నృపా. 3169

విష్ణుపురాణము, అ 4 ప 168.

## —యతిధర్మములు.—

సీ. సర్వభూతదయానుషంగంబు గలిగి యతీతవస్తువులఁ జింతింప కెపన
నాగతంబులమీఁద నాస సేయక వర్తమానలబ్ధము లుపేక్షానియూఢిఁ
గూర్చు చంగంబులఁ గూర్మి మెట్టట్టు యింద్రియముల లోనికిఁ దిగిచికొనుచు
సముచితకాలభిక్షా వర్త్య దొరకొన్నయంతన నిజదేహయాత్ర నడపి

గీ. గ్రాస మాచ్ఛాదనంబు దక్కఁగ నెవ్వఁ, డెట్టి నెయ్యది యిచ్చిన సంజలేక
వారభోజి యగుచు నమస్కారసఖ్యనుతి నిరాకృతిరహితుఁడై యతి వెలుంగు.

క. అనసూయయు నక్రోధంబును దమమును బ్రహ్మచర్యమును బుజుభావం
బును సత్యంబు నమైథునము నహింసయుఁ జూవె యతికి ముఖ్యవ్రతముల్.

గీ. వృక్షమూల నదీతీరవిజననిలయ, విపినగిరిగుహానిత్యవివిక్తదేవ
సదనవాసి యై కౌటిల్యసాధ్యవస్తుసంచయనము లుడిగి యతి సంచరించు.

క. తన మేలు ప్రకాశింపక, తనుఁ గనుఁగొనునట్టిజను లుదాసీనతమై
నునికికిఁ దగియెడుచందంబున వర్తించుయతి సర్వముక్తత నొందున్. 3173

ఉ. ఏప్రొద్దైనను నిల్చు నాఁకటికి నేమేనిం గొనుం రాత్రియై
నప్డు నెమ్మి శయించు నగ్నిపరిచర్యం బాసి వర్తించుఁ దా
నిప్పం గోరఁ డొకండు నింద్రియజయాం చేవాకభోగంబులన్
మెచ్చన్ బ్రొముచ్చను నొల్లకుండు మతి పేర్మిన్ [illegible]. 3174

చ. కినిసమి సంగవర్జన మ◆కించనభావము దాల్మి విప్రవా
సనము ప్రశాంతి యార్జవము ◆ శౌచము సత్వ్రతనిష్ఠ భైక్షభో
జన మిల నిద్ర సేఁత కృప◆ సంతతతత్త్వవిచింతనంబు మా
నిని యతిధర్మములు వ్రతిగ◆ణించినభంగిన యేను జెప్పితిన్. 3175

భారతము, అశ్వ. ఆ 2 ప 172-175. శాంతి. ఆ 2, 5 ప 283, 16.

## —◆ యోగిధర్మములు. ◆—

ఉ. ఆలసతయున్ విచిత్తతయు ◆ సత్యకథానాదరణంబు రోగముం
గలయును లోభమున్ భయముఁ ◆ గామముఁ గ్రోధము లౌల్యమున్ విరో
ధులు నను యోగసేతకు న◆దుష్టతఁ జేర్చిన యోగ మిచ్చు సి
ద్ధి తెలివిమింత నప్రతిహా◆తుం డయి యోగి చరించు నెల్లెడన్. 3176

ఆ. నిద్ర పెంపు నిద్ర◆నిగ్రహించుటయును, గొలఁది మీఱకుండ బుఁ◆గుడువమియును
యోగి కొప్ప నతఁడు ◆ యుక్తవర్తనుఁ డైన, సువిదదుఃఖహారి ◆ యోగమొందు.

భారతము, అను. ఆ 5 పద్య 262, 263.

క. మానము నవమానంబును, మానవులఁ బ్రమోదఖేద ◆ మగ్నులఁ జేయున్
హానము యోగికి విను మవమానం బమృతంబుసుమ్ము ◆ మహితవిచారా. 3178

గీ. త్రావునుదకంబు వస్త్రపూ◆తంబు నడుగు, పెట్టు నెడ దృష్టిపూతంబు◆ప్రీతితోడఁ
బలుకు సత్యపూతంబును ◆ బరమమైన, తలఁపు బుద్ధిపూతంబు గా◆వలయు యతికి.

గీ. సిద్ధిఁ గోరు యోగికి విను ◆ శ్రాద్ధమునకు, దైవయాత్రామహాజన◆స్థానమునకు
నధ్వరాతిథ్యపూజల ◆ కకులితోత్సవముల కెప్పుడు నరుగంగ◆వలవ దనఘ.

చ. మనుజులు దన్నుఁ జూచి యవ◆మానపరాభవముల్ పొనర్చువ
ర్తనమును నట్టివేనచును ◆ దాల్చి సమస్తజనమ్ములున్ భుజిం
చినమఱియోగి బొగ్గు పొగ ◆ చీఁకిలి ముంగలలేనియిండ్లకున్
జనునదిభిక్షు కెప్డు మున◆ సన్న గృహంబుల కేఁగరా దొగిన్. 3181

గీ. వేదవేదాంగపారగ ◆ విప్రగృహము, లందు సంపాదితం బైన ◆ యట్టిభిక్ష
మనఘ ప్రాణాగ్నిహోత్రంబు◆ పాంగము నొ,నర్చి యొనరించునది భోజ◆నంబు యోగి.

క. విశ్వకరచరణకంధరు, విశ్వావన నయనకర్ణు◆ విశ్వాకారున్,
విశ్వాత్ముఁ బొందుటకు యోగీశ్వరుఁడు జపింపవలయు ◆ నెపుడు ప్రణవమున్.

మార్కండేయపురాణము, ఆ 3 ప 334, 336-341.

ఆ. కుమతమునఁ బోఁటి నృపతి•కీనాల్గువృత్తులఁ దగుఁ, బ్రతిగ్రహంబు • దగదు తలఁప
వావదవసవముల • నధముఁ డెక్కుసజాతి, వృత్తిఁ బన్న దోష•విధము గాదు.
భాగవతము, స్కం. 7 పద్య 410.

## —• దశావస్థలు. •—

ద్వి. సోఁకఁ జూడంగ నొక్కటి • చూడ్కికి రెంటివగ మాట నూర్పులు • నిగుడ నాల్గింటఁ
దాప మైదింటను • దప్పి నాఱింట, నేపారఁ గుదురమి • యేడింట మరులు
సొక్కఁ జెందుఁ బల్కమి • యొగి దొమ్మిదింట, నిక్క మార్పులు లేమి • నెరిఁ బొమ్మిదింటఁ
జావు పదింటఁ గ్రి•చ్చరవిరహులకు, భావింప నివియ ద•శావస్థలండ్రు. 3204
పండితారాధ్యచరిత్రము, దీక్షాప్రకర. పుట. 79.

## —• ప్రతాపవాక్యములు. •—

సీ. మన్నాను మంత్రంబు•మానుగా యమదూత, చటుల భూత గ్రహో•చ్చాటనంబు
మ త్ప్రతాపప్రౌఢి • మహిమ గంధర్వ యక్షాసిక గహన దా•వానలంబు
మ ద్భుజావనములు • మహనీయ జయలక్ష్మి, విహరించు నుద్యాన • విపుల తటులు
మ త్కోప వేగంబు • మత్తారి కుల శైల, పక్షపాతనిశాత • పవి వరంబు
గీ. అట్టి నాలావుఁ దలపోయ • కనువు లేక, నిఖిల రక్షణ పర యాగు•నీతి లేక
ఘనతరంబగు సద్వివే•కంబు లేక, పోరొనర్పంగ వచ్చితే • బుద్ధిలేక. 3205
భాస్కరరామాయణము, యుద్ధ పద్య 1946.
సీ. అస్మదీయంబగు • నాదేశమునఁ గాని, మిక్కిలి రవిమింట • మెఱయ వెఱచు
నన్ని కాలములందు • ననుకూలుఁడై కాని, విద్వేషియై గాలి • వీవ వెఱచు
మత్ప్రతాపానల•మందీకృతార్చియై, విచ్చలవిడి నగ్ని • వెలుఁగ వెఱచు
నతితీక్ష్ణమైన నా•యాజ్ఞ నుల్లంఘించి, శమనుండు ప్రాణులఁ • జంప వెఱచు
గీ. నింద్రుఁ డొందల నామోలి•నెత్త వెఱచు, నమర కిన్నర గంధర్వ • యక్ష విహగ
నాగ విద్యాధరావలి • నాకు వెఱచు, నేల వెఱవవు పలుప నీ•కేటిదిక్కు. 3206
భాగవతము, స్కం 7 ప 226.

సీ. దిక్పాలకులఁ బట్టి • తెత్తునా క్షణములోఁ, బ్రక్కలు సేతునా • వసుధ యెల్ల
ముక్కలు, ఱాల్తునా • సూర్య చంద్రులఁ బట్టి, మోదుదునా భూమి•మీఁద వ్రాల
దిగ్గజంబుల నొక్క•దిక్కుకు దెత్తునా, చితుపరల్ సేతునా • శేషుతలలు
కులపర్వతంబులు • కూల్తునా కూర్మంబు, పెడచేత వ్రేతునా • పీఁచ మణఁగ

గీ. వేఁడి యశ్రులు నిగుడంగ♦ వెక్కి వెక్కి యేడ్వఁ దొడఁగె లతాంగి పృ♦థ్వీశు మ్రోల
వృద్ధుల పరివేదనాక్షరో♦న్మిశ్ర మధుర,కంఠకాకువికారకా♦కలిక యలర.

శృంగారనైషధము, ఆ 4 ప 87.

చ. కొసరి వసంతకాలమునఁ ♦ గోయిల కోర్చిన భంగి నేడ్చె న
బ్బిసరుహనేత్ర కొండ చఱిఁ ♦ బెద్ద యెలుంగున వెక్కి వెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ ♦ గాటుక కన్నుల నీరు సోనలై
యుసిరిక కాయ లంతలు ప♦యోధరముల్ దిగఁ బాఱుచుండఁగన్. 3213

కాశీఖండము, ఆ 5 పద్య 167.

ఉ. పాటున కింతు లోర్తురె కృ♦పారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము ♦ సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నె♦పం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచను♦మిట్టల నశ్రులు చిందు వందగన్. 3214

మనుచరిత్రము, ఆ 1 పద్య 70.

ఉ. ఈసునఁ బుట్టి డెందమున ♦ హెచ్చిన శోకదవానలంబుచేఁ
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు♦కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోము పయిఁ ♦ జేలచెఱం గిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకల♦కంఠవధూకలకాకలీధ్వనిన్. 3215

పారిజాతాపహరణము, ఆ 1 ప 133.

శా. ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డా♦యన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁ బటా♦గ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ♦రాజత్కరాంభోజ కాం
భోజీ మేళ విపంచికా రవ సుధా♦పూరంబు తోరంబుగాన్. 3216

వసుచరిత్రము, ఆ 4 పద్య 52.

శా. వేణీ వేష్టిత కంఠయై తగళ్ భా♦పీ భూత చైతన్యయై
ప్రాణాలంబిత బిల్వాణ స్మరణయై ♦ ప్రాణింపు సెల్గెత్తి యా
వీణాలాపిని యేడ్చె నిర్జరవధూ♦విన్యస్తహస్తాబ్జ క
ల్యాణీరాగ విపంచికాశ్రుతి సొయా♦రంబొ సుతారంబుగన్. 3217

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

మ. అకటా! చేరకు నేలఱం దగఁడె స♦ప్తాంభోధివేష్టీభవ
త్సకలక్ష్మాతలభూపమకుటాం♦చత్పద్మరాగోజ్జ్వల

క. క్షమ గలిగిన సిరిగలుగును, క్షమగలిగిన వాణిగలుగు ♦ శౌరప్రభయున్
క్షమగలుగఁ బోన కలుగును, క్షమగలిగిన మెచ్చు శౌరి♦ సదయుఁడు తండ్రీ.

భాగవతము, స్కం. 9 పద్య 463.

## —♦ పగ. ♦—

ఆ. పగయ కలిగెనేనిఁ ♦ బాముస్న యింటిలో, నున్న యట్లుకాక ♦ యూఱడిల్లి
యుండు టెట్లు చిత్త♦ మొకమాటుఁ గావున, వలవ దధికదీర్ఘ♦వైరవృత్తి.

చ. పగ యడఁగించు టెంతయు శు♦భం బది లెస్స యడంగునే పగం
బగపగఁ గొన్న మాఱొక♦ పల్కకయుండఁగ వచ్చునే కడుం
దెగ మొదలెత్తి పోవఁ బగ♦ దీర్పఁగ వచ్చినఁ గార్య మొందునే
మిగులఁ దలంచినం బగకు ♦ మేలిమిలేదు ధ్రువంబు కేశవా.

భారతము, ఉద్యో. ఆ 3 ప 53, 54.

## —♦ ఉత్సాహము. ♦—

మ. అసిఁ జెండాడి విపక్ష వృక్షములు శౌ♦ర్యాగ్నిచ్ఛటం బేల్చి శ
స్త్రసరస్సీరుహములన్ రణోర్వితలమున్ ♦ సంకీర్ణముం జేసి వై
ర్యసృగార్ద్రిం బొనరించి ప్రోడ గొన కు♦ద్యత్కీర్తి సస్యోఘము
ల్వెసఁ సిద్ధించు నని యంచుఁ బల్కు నరసో♦ర్వీనాథు ఘోరాధావుల్.

## —♦ హాస్యము. ♦—

చ. అదె యిదె వచ్చె వచ్చె నర♦సాధిపు డాడి యటంచుఁ బాళెము
ల్వదరి పరీదుఁ దేఁగు నెడఁ ♦ బెంపటి ఖానులు వెన్క ముందుగాఁ
గదిసి హయాళి నెక్కి హయ♦కంధరము ల్పొడగాన కప్పుడే
చదిపిరి వాజి మస్తముల ♦ శత్రులటంచు భ్రమింతు రెంతయున్. 3229

నరసభూపాలీయము. ఆ 3 పద్య 12, 13.

## —♦ చింత. ♦—

సీ. భేషజం బెద్దాని ♦ భేదింపఁ జాలదు, లంఘనంబున నెద్ది ♦ లావు చెడదు
తఱిగించుబుద్ధి ని♦ద్రామహోత్సాహక్షు,ధాకాంశ తేజోబ♦లాది నెద్ది
నాసత్యచరకధ♦న్వంతరిప్రభృతివై,ద్యులకు నసాధ్యమై ♦ యుండు నెద్ది
దివసంబు లాఱేడ♦తిక్రమించినయట్లు, జీర్ణత్వదశనధి♦ష్ఠింప దెద్ది
గీ. పరిత్యాహంబు నవత్వంబు ♦ వదలు నెద్ది,యట్టి చింతాజ్వరంబు స♦న్నలముకొనిరో

సేవిం జేయుము నింక నే ♦ వెచటఁ జొత్తు, నెట్లు నిర్జింతు నే దుష్ట♦హేతుకముల.

కాశీఖండము, ఆ 1 ప 111.

## —♦ మూర్ఛ. ♦—

చ. పవనతనూజుచేత విని ♦ బడ్డ విభాకరసూనుతోడి కాం
ధవము నిజంబు నిక్కమొకొ ♦ దైవమ యీవెడువార్తయంచు నీ
ట్టవిసినయుల్లముం దొరఁగు ♦ నశ్రులునై యటులుండి పోలన
య్యవనిజ మాచి రాముశిర♦మౌనని మూర్ఛిత వ్రాలె భూస్థలిన్.

క. నఱకినకదళీకాండము, తెఱఁగున నటు వ్రాలి తెలిసి ♦ తెప్పిరి మనమై
విఱిగిపడినట్లు కదు ని,ర్వెఱపడి మఱియును నటు సూచి ♦ విహ్వలయగుచున్.

చ. విని విని యంతలోన తెఱ♦వీనులు ప్రియ్యఁగ వేనమూర్ఛయం
బునఁ బరివీతమైనక్రియఁ ♦ బొల్పగలం బ్రళయాపతిన్మహో
శనిహతిఁ బొందుచాడ్పున ని♦శాతతరక్రకచంబు కోఁతలం
దునిసినభంగి నెమ్మనము ♦ దూలఁగ వ్రాలె నతండు భూస్థలిన్.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 885, 886, 1884.

మ. బలితంబైన యనంగవేదనలచేఁ ♦ బల్మాఱు నిశ్వాసతే
కలితీలాలక ప్రాణము ల్వెడలి నే♦త్రాంభోజమార్గంబునం
గలయం బ్రాఁకుచు వచ్చి యున్నలవునం♦గన్నీటిచే నొడ్డమై
నిలుప న్నిల్చె నృసింహభూరమణ మ♦న్నింపం గదే తోడితన్. 8884

కావ్యాలంకారచూడామణి, ఆ 8 పద్య 184.

## —♦ ధైర్యము. ♦—

సీ. బుద్ధీంద్రియాశోక♦మూలకుఁ బెట్టుకోట, విపదంబురాశికి♦ వ్యాకృతిపోత
ఖలదురాలాపమా♦ర్గణవజ్రకవచంబు, రణమహీస్థలికి శ్రీ♦శామరతు
క్షాత్రవదుర్గర్వ♦సంస్తంభనౌషధి, మొసయు చింతాశ్రేణి ♦ మూఁకవిప్పు
యోగాదిసంసిద్ధు♦లొసఁగూర్పుపెన్నిధి, తూలు నేకాకుల ♦ తోడునీడ

గీ. సకలసుగుణప్రధానంబు ♦ సకలకార్య,జాలసాఫల్యకరణైక♦సాధనంబు
ధైర్యగుణ మట్టి ధైర్యంబు♦ దక్కఁ బోర, దత్తరింతురె యొకట ధీ♦రవరమువారు.

మనుచరిత్రము, ఆ 4 పద్య 108.

## —◆ శమము. ◆—

క. వేఁ లక్షింపను గీడును, జాలింబడి తొలఁగఁ ద్రో◆యుఁ దుష్టిగా
వాలంబిమనస్కుఁడనై, యాలంబుగఁ జేసి పదతు◆ నయ్యాగుడెఱుఁగున్.
క. సరసాన్నముఁ బిణ్యాకము, సరిగాఁగ భుజించు ప్రముఖ◆శయ్యాతలమున్
ధరణియు శయనసంచికినా,కరయంగ నొక్కరూప◆ యనుకృశచరా.
ఆ. నారచీరయేనిఁ◆ జారుచీనాంబరఁ, బైనఁ గట్టికొనిన◆ చాపుడు హ్వానయు
మొప్ప దొప్పు ననక◆ యుండు రూపాదుల,నలమికొనవు చక్షు◆రాదికములు.

భారతము, శాంతి. ఆ 4 పద్య 58. 60

## —◆ దమము. ◆—

సీ. శౌచ మక్రోధంబు◆ సంతోష మార్జవ, మనసూయ విగతదై◆న్యత్వవృత్తి
యప్రమాదంబు దు◆ష్కథిమానరాహిత్య,మతివాదవర్జ◆ మఖిలభూత
దయ గురుపూజ నిం◆దాస్తుతిప్రవణతా, త్యాగం బనైశున్య◆త్వంబు సాధు
జనసంగమం బస్పృ◆హాభావణంబు నిస్పృహాత యహింస సు◆శీలభావ
గీ. మింద్రియగ్రామజయమివి◆యెల్లదమము,నాకృతులువీనిఁగలపుణ్యు◆ లుభయలైహి
కములవెలసిను నాముష్మి◆కములవలన, శాంతిమంగళనిధి బోధ◆సౌమ్యమూర్తి.

భాగతము, శాంతి, ఆ 4 పద్య 264.

## —◆ సత్త్వరజస్తమోగుణములు. ◆—

క. అతినిందితము దమోగుణ, మతిమోహకరయుంబు సత్త్వ◆మనయంబుఁ బ్రకా
శత నొప్పు నుభయగుణమిశ్రితఁ బరఁగు రజోగుణంబు◆ సన్నుతచరితా.
మ. అసుఖాకారతినిద్రదైన్యము విమో◆హం బత్యుత్వంబుఁ దా
మసభావంబులు రాజలోభజడతా◆మానంబు లూహింప రా
జసవృత్తంబులు ధైర్యశాంతికరుణా◆సంతోషవిద్యాదు లిం
పెసఁగన్ సాత్త్వికచేష్టితంబులు నిజం◆బిట్లాత్మఁ గన్గొన్నియున్.

భారతము, ఆర. ఆ 5 ప 96, 97.

## —◆ ఉచ్ఛిష్టము. ◆—

క. తలిదండ్రులతోడను బుత్త్రులతోనైనను సహోద◆రులతోనైనన్
లలి నుచ్ఛిష్టము దినువారలకుఁ బునరుపనయనంబుఁ◆ బ్రాపింపఁదగున్. 3242

శైవధర్మము, అ. సు. అ 3 పే 52.

## —♦ పాత్రాదిశుద్ధి. ♦—

సీ. ఘృతయుక్తిఁ జిరపర్యు♦షిత మయ్యు భోజ్యమౌ, నన్నంబు గోధూమ♦యవలు నేర
ఘృతఁజేయఁబడినవి ♦ విమతఘృతాక్తమ్ములు, గాకున్న నవి పాఁచి♦ గావు మత్స్య
కూర్మశల్యకశశక♦గోధావరిజంబులు, భక్షణార్హము లూరఁబంది కోడి
యనుపయోగ్యములౌష♦ధార్థమై సేవింపఁ, నగుఁ బ్రోక్షితంబైన ♦ యామిషంబు
గీ. పసిఁడి వెండి రాగి ♦ పవడంబు శంఖంబు, నీరు సాలఁ బెరుఁగు ♦ కూర గాయ
మౌక్తికంబు మణులు ♦ మనుజానియొడలంబు, సేచనమున శుద్ధిఁ♦జెందు ననఘ.
గీ. అరయు నుపహతి వాటిల్లి♦నట్టిచోటు, నాజ్యతైలాభ్యుపేతభాం♦డావళులకు
వేఁడినీళుల నొండె వే♦ నీళ్లనొండెఁ, గడుగఁజాలఁదోమిన నొండెఁ ♦ గలుగుశుద్ధి.
క. విను శూర్పధాన్యకృష్ణా,జినముసలోలూఖలములు ♦ చీరలపెనుప్రో
వును శుద్ధిబొందుఁ బ్రోక్షణ,మున నిట్టుల యుష్ణతోయ♦ముల వల్కలముల్.
సీ. భసితోదకముల గా♦ర్పాసోద్భవంబులు, దారుశృంగాస్థిదం♦తములు శుద్ధిఁ
బొందు మృద్భాండము♦ల్పునరగ్నిసంస్కృతి, నతిశుద్ధిదాల్చుఁ బ♦ణ్యంబు భైక్ష
మును గారుహస్తంబు ♦ వనితాముఖమునిజ, స్త్ర్యపాసక్త♦తనయవతియు
దుర్గంధబుద్బుద♦మాన్యతఁ బొరయని, యూటనీరును శుచు♦లుర్విదహన
గీ. మార్జనంబులఁ గాలక్ర♦మమున గోచ,యంబు ద్రొక్కనవినుము గృ♦హంబు మున్న
గలయఁ బ్రోక్షనఁ బూసిన ♦ నలికినను న్నలంకరించిన శుద్ధిను♦ల్లాస మొందు.
గీ. మనుజకృతతటాకాదుల♦మన్ను మద్ధ, లైదుపుచ్చక సుస్నాన♦మాచరింపఁ
జనదు దేవఖాతములగు ♦ సరసులందు, బావులందును నదులందు ♦ వలదువత్స.
సీ. అన్నంబు గోవు మూ♦ర్కొన్న కీటక మీఁగ, కేంద్రుకలందున్న ♦ విమలభూతి
యుతజలప్రోక్షణ ♦ నతిశుద్ధమగు భస్మ,తమునఁ గాంస్యంబు నా♦మ్లమునఁ దామ్ర
మును క్షారమున సీస♦మును దగరంబు నై, పైవారిచల్లఁ ద్ర♦వవిచయములు
శుద్ధి వహించుర♦శ్మలు రజోగోవహ్ని, లశ్వంబుమారుత ♦ మవనిపీళ్ల
గీ. బిందువులు మక్షికలు నీడఁజెంబియును బవిత్రత నెపొందు నెప్పుడు♦వినుమజాశ్వ
వదనములం పక్షికులముఖ♦విదళితంబు, లై పడిన ఫలములు శుచు♦లండ్రు బుధులు.
క. ఇన శశి కర పవనస్పర్శనముల నతి శుద్ధిఁ బొందు ♦ శయ్యాయానా,
సనయానపాత్రమార్గ్యములను ద్రుణమును బణ్యములును ♦ లోకస్తుత్యా. 3256

మార్కండేయపురాణము, ఆ 3 ప 252-258.

## —• ఆచారపద్ధతి •—

మ. అనురాగం బొదవన్ గృహాధిపతి బ్రా•హ్మంబౌ ముహూర్తంబునం
దొనరన్ మేల్కని సావధానమతితో • నవ్యద్వికాసంబునన్
దనయాచార్యుని నిష్టదైవచరణ • ధ్యానంబుఁ గావించి ధ
ర్మవిరోధంబులు గానియర్థమును గా•మంబున్ విచారించుచున్.
తే.గీ. ప్రకటధర్మార్థకామంబు•లకుఁ బరస్పరానుకూలంబుగలయుపా•యములు దలఁచి
యతిసుఖోదర్కమును జగ•దభినుతంబు, నైవధర్మంబు వదలని • మానసమున.
సీ. బుద్బుదవిరహితం•బుగ వారిఁ గరమున, గొనకొని పారి డెంద•మునకుఁ జేరు
నట్లుగ నిశ్శబ్ద•మై యుండ మున్మారు, ద్రావి యిన్మారు త•ద్వగ్రధమున
నాస్యంబు దొడసి నీ•రంధ్రముల శిరమునఁ, బ్రోక్షించి రోమాగ్రసం•ఘటము ముట్టి
నాసికాపుటములు•నయనముల్ సెవులుమూఁపులు హృదయము నాభి•తలము మరి
ఆ. ముట్టవలయు హస్త•ములు పాదయుగమధ్యగతములుగ నుదఙ్ము•ఖత్వ మొండెఁ
బ్రాఙ్ముఖత్వ మొండెఁ•బ్రాపించి యిమ్మెయి, నాచమనము సేయు•టార్యమతము.
సీ. మున్మూటిజలపాన•మున నోలి ఋగ్యజు,స్సామవేదంబులు • సంతసిల్లుఁ
దొలితొలి వక్త్రంబు•దొడయ నధర్వవా,ర్షంబును రెండవు•సారి ధర్మ
శాస్త్రతో షేతిహా•సప్రమోదపురాణ, సంప్రీతులును గల్గుఁ • జరణయుగముఁ
బ్రోక్షింపఁ బుండరీ•కాక్షుండు ప్రియ మందు, నయనంబులంటిన•నలినహితుఁడు
గీ. సమ్మదంబునఁ దేలు నా•చమనసంప్రయోగ మిట్టిది వస్త్రయ•జ్ఞోపవీత
ధరణముల నన్నపానతం•త్రముల మున్ను, సేసి పిదపను విధి యను•ష్ఠింపవలయు.
గీ. ఆస్యశుద్ధి యొనర్చిన•యపుడు నోక, భక్ష్యభోజ్యలవంబులు • పండ్లనడుమ
నిలిచి పదపడి పోవుట • గలిగెనేని, నాచమన మాక్షణంబ చే•యంగ వలయు.

ఆను. ఆ 3 పద్య 285-87.

క. వలచెవి జన్నిద మిడి దివముల సంధ్యల నుత్తరాభి•ముఖుఁడై తా రా
త్రుల దక్షిణాభిముఖుఁడై, మలమూత్రోత్సర్జనంబు • మఱిచేయఁ దగున్. 3368
సీ. పండినచేనిలో•పల దానిచేరువ, రాజమార్గంబుల • రచ్చలందుఁ
బుట్టలో వేదిపై • బొక్కలో బూదిపై, మసనంబులో చాల•మందలోన
జీవరాసులమీఁద • దేవాలయముపొంతఁ, జొటబావులఁ దరు•చ్ఛాయలందు
నడుచుచు నిలుచుండి • నరు లేఁగుతెరువున, మలము వీక్షించుచుఁ • గలికి పతికి
గీ. యాగశాలను గట్టిన•యట్టియెడల, ననలవిప్రానిలంబుల • కభిముఖముగ

నెన్నెనెలలఁబాలుఁ ♦ డీల్గె నన్నిదినంబు, లశుచిభావ మొందు ♦ విశదకీర్తి!

మార్కండేయపురాణము. ఆ 3 ప 263–265.

## —♦ ప్రాయశ్చిత్తపద్ధతి. ♦—

తే. అనఘ మూఁడునెలలనొండె ♦ నాలుగునెలల, నొండె నేమిప్రాయశ్చిత్త ♦ మొనరఁజేయ
జనములకు వాఙ్మనఃకాయ ♦ జంబులైన, యఘములడఁగును యమపురి ♦ కరుగఁడతఁడు

సీ. వినుము కర్మము దెల్పు ♦ చును గపాలంబున, నెత్తినధ్వజమ్ము ♦ నేకకాల
మశనంబు గొనుచు ఖ ♦ ట్వాంగచిహ్నము బ్రహ్మ, చర్యంబునై యధః ♦ శయన మాచ
రించుచు నిల్లిల పం ♦ డ్రెండుపక్షంబులు, వ్రతవృత్తి నడపంగ ♦ బ్రహ్మహత్య
కిల్బిషంబు దొలంగుఁ ♦ గృచ్ఛ్రముల్ నడపిన, నాలుగువత్సరముల ♦ నడఁగు మూఁడు

గీ. హోమనంబులు నడపఁ జాం ♦ ద్రాయణములఁ, బోవు విప్రనిరతి మాస ♦ భోజియైన
నబ్దమునఁ బాయు నటుగాక ♦ యశ్వమేధ, యాజి యగునేని వలదు భి ♦ క్షాదులధిప.

గీ. పుష్టగోలక్ష మొండెఁ గాం ♦ భోజవాజి, శతక మొండెను భూసుర ♦ తతికి నొసఁగఁ
బాయు బ్రాహ్మణార్థాహవ ♦ ప్రాణహాని, యైన నొండెను జెడు బ్రహ్మ ♦ హత్యకీడు.

సీ. కల్లుద్రావినపాత ♦ కం బది యగ్నివర్ణము గాఁగఁ గాఁచి పా ♦ నంబు సేయఁ
గను మారి యుఱుకంగ ♦ ననలంబుఁ జొరమహా, ప్రస్థానమాచరిం ♦ పంగఁ బాయు
నట్లును గాక బృ ♦ హస్పతిసవన మస్క్రతు వొనరించిన ♦ నతివిశిష్ట
భూమిదానమునను ♦ బోవు నక్కఁ, గురుతల్పగుం డనలప్ర ♦ తప్తమైన

ఆ. యాయసాంగనాంగ ♦ మాలింగనము సేసి, యైనఁ గోసి కరము ♦ నందు మేహ
నము ధరించి యంబ ♦ రమునఁ జూచు చరిగియో, నియమను జచ్చి యఘము ♦ నిస్తరించు.

క. గురుతల్పగుండు రణమున, గురునకునై చచ్చియేనిఁ ♦ గురువర ధరణీ
సురులకు సర్వధనము భ, క్తిరతి నొసఁగి యేనిఁ బాత ♦ కిత్వముఁ దొలఁగున్.

క. ధరణీసురుస్వర్ణము నప, హరించినతఁ డంతకనక ♦ మట్టిద విన రౌ
త్రుఁడై మగుడఁగ నిచ్చినఁ, బరిహృత మగుఁ గల్మషంబు ♦ పౌరవముఖ్యా.

క. అనృతోపచారకలనం, బునఁ బుట్టినపాతకంబు ♦ వోవుం దానె
వ్వని నపచరించెఁ దగ నా, తనిఁ బ్రీతుం జేయ ధర్మతత్త్వప్రవణా.

క. గురువునకు నాలుక వల్కుటఁ, బొరసినకల్మషము వాసి ♦ పోవు నతనికిం
బరితోషముగా వినయపు, వెరవున నుపహార మిచ్చి ♦ వినతుం డయినన్.

క. పరదారగమనదోషము, పరిహృతమగు నొక్కయేఁడు ♦ పరమనియతుఁడై
చరియించినఁ గృచ్ఛ్రంబులు, గురుకులజలనిధిశశాంక ♦ గుణమణినికరా. 3293

క. క్షత్రియపతి శూద్రుఁడు విప్రోత్తముపైనిం దప్పులేక ♦ తా గర్వితుఁడై
యుమిసినఁ బెదవులు గోయుట, యుమికొలఁది విపించుటౌచిత ♦ మర్వీశులకున్.

క. ఏయంగముఁ గొని శూద్రుఁడు, పాయక విప్రునకుఁ దాను ♦ బాధకుఁడగువాఁ
డాయంగము గోఁతపడక, పోయెదననరాదు తఱచు ♦ భూపతిచేతన్.

క. ప్రీతిఁ గులశ్రేష్ఠునిపై, పాతకముగలేని బ్రహ్మ ♦ హత్యాదిమహా
పాతకముపెట్టి తిట్టిన, యాతం డేనూటనాలు ♦ గచ్చుఁ బణంబుల్.

క. భూవల్లభ వేదవిదుని, దైవతమును దిట్టినతఁడు ♦ దండువు పేరం
బేవణముల నెనిమిదిటిని, వేవేగమె యఱువవలయు ♦ విధివంతముగన్.

క. అడిచెవననియూఁకించుట, యడుచుట మెయి తట్టుగట్టు ♦ నడుచుట నెత్తు
ర్వెడలఁగ నడుచుట విఱుగఁగ, నడుచుట యొండొంటికంటె ♦ నధికపుఁదప్పుల్.

క. హీనుని నడిచిన నర్థము, హీనుఁ డధికు నడిచె నేని ♦ నినుమడి సరివాఁ
డైనఁ బదిపణము లచ్చుట, తానుచితము తప్పకొలఁదిఁ ♦ దగు రెట్టింపన్.

క. మెడ చెయ్యి కన్ను పాదము, తొడ నాలుక ముక్కు చెవులు ♦ తునియలుగాఁ దా
నడిచెననిని యొరుఁ బరుసము, నొడివినతఁడు దండు గచ్చు ♦ నూఱుపణంబుల్.

క. ఒక్కనిఁ బెక్కండ్రడిచినఁ, దక్కక వేర్వేఱ రెట్టి ♦ దండువు గొని తా
నక్కజముగ దండించుట, నిక్కపుధర్మంబు మేది ♦ నీనాథునకున్.

ఆ. ముటికినాటివారు ♦ మోఱకులు పెనుపరు, లఱవవారు ద్విజుల ♦ కొసపెద్ద
యనుమ దేశభాష ♦ లను గులంబును దిట్టు, నతఁడు దండువచ్చు ♦ శతపణములు.

సీ. ఖలులతో నెమ్మెయిఁ ♦ గలిసినవిప్రుండు, మొఱయిడి నచటికిఁ ♦ బఱవకున్న
రత్నె యుత్తము ♦ మొత్తిరఁజండాలు, నంటిన భ్రష్టశూ ♦ ద్రాదులకును
బిత్రుదేవభుజ్యముల్ ♦ పెట్టినఁ దల్లితోఁ, బుట్టువు పేరఁ దా ♦ నొట్టు గొన్న
వేదాదివిద్య శూ ♦ ద్రాదికిఁ జెప్పినఁ, జోరిఁ బెద్దలిచ్చిన ♦ పాత్రుధనముఁ

గీ. బొడిచి తా నీక కుడిచిన ♦ విడిచి తండ్రిఁ, గొడుకు నన్నలఁ దమ్ముల ♦ గురుని పత్ని
వెలయఁగాఁ దప్పులేకయె ♦ విడిచెనేని, యతఁడు తా నచ్చు నృపతికి ♦ శతపణములు.

క. మడివాఁ డొడయనివస్త్రము, తడఁబడిచిన నమ్మికొనినఁ ♦ దా గో యిడినం
బడిదియ పెట్టినఁ గట్టిన, నడయఁ బణత్రయము దండు ♦ నఱుపఁగవలయున్.

క. వెలయొనిమిదియగుపాలును, వెలనాలవపాలు నోలి ♦ విడువఁగవలయున్
తోలు రేవున మలు రేవునఁ, జెలు వేదఁగఁ జాకిచీర ♦ చెఱిచినచోటన్. 3316

క. గరళానలశస్త్రాదులఁ, బరహింస యొనర్చె నేని ♦ బంద్రెండును పై

నసమాడ యనువపలయును, నరిచావఁగవలయు నెవిదిఁ ♦ బలికినపోలన్.

క. చంపినవానిని సరిగాఁ, జంపుటతగు విప్రుఁడైనఁ ♦ జంపక పతి త
త్సంపదఁ గొని తలగొఱిగి పదంపడి కుక్కచ్చు వ్రాసి ♦ ఖండింపఁ దగున్.

సీ. ఉత్తమపురుషుని ♦ యుత్తమరత్నంబుఁ, జనములుచ్చిలినవానిఁ ♦ జంపవలయు
నన్యులెవ్వరిధన ♦ మైనను గొనఁజేయ, విని మిడిపణములు ♦ గొనఁగవలయుఁ
బరసతీహారకుఁ ♦ బట్టించి సర్వస్వహరణంబు నృపతి చే ♦ యంగవలయుఁ
గన్నియనే చెఱ ♦ గొన్న దుర్జనుఁ, జిత్రవధంబుగాఁ ♦ జేయవలయుఁ

ఆ. కన్న మిడఁగ రాత్రిఁ ♦ గన్నబో ముచ్చులఁ, దోడితెచ్చి కేలు ♦ ద్రుంచి శైలి
వాఁడికొఱ్ఱలవిగిచి ♦ వారిఁ జంపుట రాజధర్మ మనుచు నూత్న ♦ వంశి చెప్పె.

సీ. ఇగులున నొంటిఁబోఁ ♦ బరసతి నెట్టుట, యది తన్ను నంటుట ♦ కాస పడుట
నలువురముందఱఁ ♦ వలచీరపట్టుట, చేరి యేకాసనా ♦ సీనుఁ దగుట
పువ్వులుపూఁతతే ♦ మృత్తులమర్చిఁ బుచ్చుట, ముచ్చటలాడుట ♦ మూలయొనికి
సరసకు శాపాత్రి ♦ సరిగలచేయల్ల, మగనియాలికి నిచ్చ ♦ మాటలాడు

ఆ. చేమదొల్లియిట్లు ♦ యీలువు చెఱిచితి, నని యహంకరించి ♦ యాలిఁ గొనుట
సజ్జనుండుగాని ♦ జనుఁడు చేసినఁ బరదారగామియట్లు ♦ దండ్యుఁ డతఁడు.

సీ. తల్లితోఁ బుట్టువు ♦ తండ్రితోఁ బుట్టువు, తల్లిదండ్రుల సహో ♦ దరులసుతలు
తనతోఁడబుట్టువు ♦ తనతోఁడబుట్టినవారలసుతలు భూ ♦ వరులసుతలు
తనయుని కాంతయుఁ ♦ దనకన్న కూఁతును, గోడలు సత్తియు ♦ గోత్రజలును
బతిహితవ్రతయైన ♦ బ్రాహ్మణభార్యయుఁ, జెలికాని సతియును ♦ శిష్యసతియు

గీ. గురునిసతి దాదియు ననంగఁ ♦ బరగువారిఁ, గవయుకష్టుండు గురుతల్ప ♦ గామి వాఁడు
ఉత్తమబ్రాహ్మణుఁడుగాక ♦ యుండెనేని, చంపకాతని కోరును ♦ ద్రెంపవలయు.

క. హీనుం డుత్తమకన్యకఁ, జానుగఁ దాఁ గలిసెనేనిఁ ♦ జంపుట తగు న
న్యూనుఁడగునేనిఁ గన్నియ, వానివలచునేనిఁ దగు వి ♦ వాహము సేయన్.

క. మును దాఁ దిట్టిన దండ్యుఁడు, తనికిఁ బిదపఁ దిట్టినతఁడు ♦ దండ్యుఁడైనన్
మును దిట్టినతఁడు దండుగ, ధన మినుమడి యఱువవలయు ♦ ధరణీశునకున్.

క. ఉద్ధులపు పెనఁకువలయం, బిద్దఱు సరియైన చోట ♦ నెవ్వఁడు మైమై
గద్దించి యరుగునాతఁడ, పెద్దయు దండ్యుండు చలము ♦ పెక్కువకతమిన్.

క. సరిగా వొండొరువులతోఁ, బరుసపుఁ బెనఁకువలు పెనఁగి ♦ వాడికి ధరణీ
శ్వరుసభకు వచ్చెనేనియు, సరిసరిదండంబు గొనుట ♦ సద్ధర్మ మ్మగున్. 3325

సీ. ముడిచినయొంటికెం♦జడమూయ మువ్వన్నె, మొగముతోలు కిరీట♦ముగ ధరించి
కకపాలకేదార♦కటకముద్రితపాణిఁ, గుఱుచలాతాముతోఁ♦గూర్చిపట్టి
నైజోపమైనయో♦డ్డాంబు లవణిచే, నక్కళించినపొట్ట♦నక్కళింప
యారటూటుచ్ఛాయ♦నవఘుళింపఁగఁజాలు, బడుగుదేహంబున♦భస్మ మలఁది
గీ. మిట్టయురమున నిడుయోగ♦పట్టె మెఱయఁ, జెవుల రుద్రాక్షపోగులు♦చవుకళింపఁ
గావికుబుసంబు జలకుండి♦కయునుబూని, చేరెఁ దద్గేహ మొకపథ♦సిద్ధుఁ డొకఁడు.
చ. లలితపుబూదిపూఁతయును♦లాతపుఁగోలయుఁ గక్షపాలయున్
మలకొనుచిన్నకెంజెడలు♦మండులపాత్రము నాగబెత్తమున్
లలిఁ గనుపట్టుకిన్నెరయు♦లాహిరిమోదము శృంగినాదముం
జెలు వలరంగనొప్పు నొక♦సిద్ధుఁడు సింగపువారువంబుతోన్. 3337

కళాపూర్ణోదయము. ఆ 2 పద్య 48.

## — ♦ బ్రహ్మవిజ్ఞానులు. ♦ —

క. ఇది నగర మిది యరణ్యం, బిది సౌఖ్యం బిది యసౌఖ్య♦మితఁడు పురుషుం
డిది సతి యని తోఁపద యెయ్యది చూచిన బ్రహ్మమయమ♦యారూఢునకున్.
తే. సంగములు సర్వమును గల్గి♦సంగి కాఁడు, భోగములు సర్వమును జెంది♦భోక్త గాఁడు
కార్యములు సర్వమును జేసి♦కర్త గాఁడు, విగతసంకల్పుఁడగు బ్రహ్మ♦వేత్త యధిప.
ఉ. చేయఁడు సత్క్రియల్ బయలఁ♦జేసినయట్లు సుఖించు లోపలన్
జేయును గార్యముల్ బయలఁ♦జేయనియట్లు సుఖించు లోపలం
జేయఁడు కృత్యమంచు మఱి♦చేసె నకృత్య మటంచు నెంచరా
దేయెడ బ్రహ్మవిద్య కుడ♦కెక్కినయట్టిమహానుభావునిన్.
చ. అమితములై ఘటించువిష♦యానుభవంబుల భోగియయ్యు ను
త్తముఁడగు యోగి బ్రహ్మమయ♦తన్ మది రంజిలుచుండు గీతనృ
త్యములను దాళమానవశుఁ♦డయ్యు శిరస్స్థితపూర్ణకుంభమున్
సమధికయుక్తి నిల్పికొనఁ♦జాలిననాట్యధురీణుకైవడిన్. 3343

కవిరాజమనోరంజనము. ఆ 1.

సీ. పుత్రమిత్రకళత్ర♦మైత్రివర్తిల్లువసిష్ఠసంయమిబ్రహ్మ♦నిష్ఠ వినమె
కర్మఠుండయి రాజ♦ధర్మ మూని చరించు, జనకుని విజ్ఞాన♦చర్య వినమె
వాణిజ్యవృత్తి జీ♦వనుఁడైన యల తులా,ధారుని పూర్ణబో♦ధంబు వినమె
కటికగాయకముచేఁ♦గాలంబుఁ గడపు ధర్మవ్యాధు విజ్ఞాన♦మహిమ వినమె

గీ. వారిపొర్నిగర్భమున నుండ•వలసి జ్ఞానులెట్టి వ్యర్థకపోగముల నున్న•నేమి కొఱవ
జ్ఞానవైరాగ్యనిశ్చలానందపూర్ణు లయినవారు జీవన్ముక్తు•లగుట నిజము.

కవిరాజమనోరంజనము, ఆ 1.

## —• పాషండులు. •—

సీ. హరికంటె నొకదైవ•మన్యంబు గలదను వారలు హరిభక్తి•మాలమతులు
బహుళకపాలాస్థి•భస్మలింగాంకులు, వైదికవిరహిత•వర్తనులును
ఘనవనప్రస్థితుల్•గాక జటావల్కల ధారులై చరియించు•తాపసులును
బొంకు జక్రశంఖోర్ధ్వ•పుండ్రాంకములులేక హరికథావిముఖాత్ము•లైనవారు
గీ. దైవముల విష్ణుసరిగాఁగఁ•దలఁచువారు, విష్ణుధర్మంబు గాదని•విడుచువారు
నఖిలధర్మంబులును హరి•యందుఁ జేర్పకుండువారలుఁ జూడ్వ పా•షండు లగజ.

పద్మపురాణము, ఉ ఆ 6 ప 152, 155.

## —• దొంగసన్న్యాసి. •—

సీ. ఇంటిలోనైనను•లిల్లాలితోనైన, నగరికప్పులనైనఁ•దెగుళఁజేసి
కావికోకలుగట్టి•కచ్చలు బిగియించి, బోడితలయి మెడ•పోచకీసి
కుండకోలయుఁబట్టి•నిండబూడిదెఁబూసి, పూసలు మెడఁగొన్ని•వేసి చేత
జపమాలధరియించి•జనులుగన్గొనుచోట, హరిహరియనుకొంచు•వాడుకొంచు
గీ. వేస మమరంగ భిక్షుకు•వెంటవెడలి, తిరిగి యమరికగలచోట•తినఁగమరిగి
విషయసంగ్రతయంబులు•వీగువాని, కేవ సన్న్యాస మదివాని•కేడగతులు.

శ్రీరామస్తవరాజము, ఆ 2.

## —• శ్రోత్రియుఁడు. •—

ఉ. జ్ఞాని పురాణవక్తయును•శాస్త్రవిదుండు బ్రశాంతచిత్తుఁడున్
మానితసత్క్రియారతుఁడు•మామకభక్తియుతాత్ముఁడైన స
న్మానవుఁ డొప్పు శ్రోత్రియుఁడ•నన్మతి యాతఁడు సంవృతాఖిలాం
హోనివహుండునై దివము•నొంది సుఖించు సమంచితస్థితిన్.
గీ. అట్టి శ్రోత్రియుఁ డింటను•వెట్టినట్టి, యన్నము భుజించునరుఁడు జ•న్మాంతరముల
యందు బ్రాహ్మణుఁడై చెలు•వొందుభువినిశ్రోత్రియాన్నంబుకన్నఁబ•విత్ర మెద్ది.

శేషధర్మము, ఆ. సు. ఆ 2 పే 47.

## —♦ వృద్ధబ్రాహ్మణుఁడు. ♦—

సీ. తెల్లని గడ్డంబు ♦ తెల్లని మీసముల్, నరసిన రోమపాఁ♦ దురశిరంబు
మేధావిబొట్టును ♦ మెఱుఁగు జన్నిదములు, భూతిలలాటత్రి♦పుండ్రకంబుఁ
గావిదోవతియును ♦ గంతోత్తరీయంబు, నిష్టికోలయుఁ జంక♦ నిడ్డతోలుఁ
బంచాంగముష్టియుఁ ♦ బాణిఁ బవిత్రంబు, నొక్క వ్రేలికి వెండి♦యుంగరంబు
గీ. జాఱుబొజ్జయు నునుదబ్బ♦సంబెలయును, జెత్తగొడుగును జక్కఁదా♦ల్చి కుతుకమునఁ
దనకు సజ్జాతి గా నొక్క♦ తపసి వృద్ధ, బ్రాహ్మణుఁడు వచ్చె నొయ్యొయ్య♦ బార్థుకడకు

హరవిలాసము, ఆ 7 ప 12.

## —♦ వృద్ధముని. ♦—

ఉ. పూరఁగవెల్లి చందమున♦ నొక్కట బీఱనరాలు దేఱఁగా
మీసలు గడ్డముం జడలు ♦ మే నుదరంబును వీనులున్ జరా
ధూసరమైన రోమతతి♦తోఁ బెనఁగంబడి దూది రాశిగాఁ
జేసినరీతి నున్న యొక♦ జీర్ణమునిం గని కౌతుకంబునన్.

మనుచరిత్రము, ఆ 4 పద్య 79.

సీ. దీర్ఘదీర్ఘంబులై ♦ తిరిగట్టిపడమలు, గడచి కూలాడుకెం♦జడలతోడ
వింజామరము పిచ్చి ♦ వ్రేలవైచినమాడ్కి, డాలొందు నరపగ♦డ్డంబుతోడ
ఫాలబాహూదర♦పార్శ్వదేశంబులఁ, గొమరారుభూతిపుం♦డ్రములతోడఁ
బుచ్చంబు విడిచి క♦ప్పుకొనివచ్చినక్రొత్త, మడుఁగుఁ జమూరుచ♦ర్మంబుతోడ
గీ. బ్రహ్మతేజోధికులరైన ♦ బ్రహ్మచారు, లిద్ద ఱిరువంక నలమిరా ♦ వెలమితోడ
నగ్నిశిఖవోలియును జల్ల♦నైనకాంతి, యడర నొకవృద్ధమునివచ్చె ♦ నధిపుకడకు.

శకుంతలాపరిణయము, పి॥ వీ॥ ఆ 2.

## —♦ యో గి ని. ♦—

సీ. అలికంబుపై రక్త♦తిలకంబు తెలిగన్నుఁ, గవయందుఁ గాటుక♦ కర్ణపాశ
ములఁ బటికంపుఁగుఁ♦డలములు గళమున, సంకుఁబూసలకంఠ♦సరులు గుబ్బ
చనుదోయి వన్నెకు♦ చ్చెలిగంతె డాఁపలి, కరమునందు విభూతి♦కక్షపాల
పాణిపద్మంబున♦ మాణిక్యమయువీణ, పదయుగంబునఁ బైఁడి♦పాదుకలును
గీ. మదనబంధంబు లాతంబు♦యోగపట్టె, సింగివాదంబు బెత్తంబు♦ చెన్ను మెఱయ
నుట్టిపడ్డట్లు యోగిని♦యొకర్తు వచ్చి, లీల నారాజశేఖరు♦ మ్రోల నిలిచె.

రాజశేఖరచరిత్రము. ఆ 2 ప 94.

మిక్కిలి దశేంద్రియంబుల • స్రుక్కఁజేసి, ఫలితముగ యోగ మభ్యసిం • పంగవలయు.
సీతారామాంజనేయసంవాదము. ఆ 1 పద్య 99.

సీ. అంత సుషుమ్నయా • నావరోహణము మెల్లనఁ జేసి ప్రాణంబు • లను దశేను
నిలయంబులను బూర్వ • విలసనంబుల నిల్పి, యీగతి దినమును • యోగివరుఁడు
సంధ్యల మధ్యని • శాసమయంబుల, సలుపంగఁదగు యోగ • సరణి వేడ్క
వాయుధారణ సేయ • వలదు కరంబుచే, నభ్యాసమున వాయు • వాగవలయు
గీ. నీకరణిఁ జేయ వజ్రమ • యాకృతియును, కాలమృత్యుజయంబును • గలిగి యతఁడు
బ్రతుకు నాచంద్రతారక • మితఁడనర్చ్చ, కాల మమరౌఘములు నుతు • ల్గడలుకొలుపు.

సీ. మంత్రయోగంబుచే • మారుతసంసార, దేహమర్మంబులు • దెలియవచ్చు
లయముచేఁ దనలోని • లలితప్రణవనాద, సూత్రంబు మది నూని • చొక్కవచ్చు
హఠముచే జరను రో • గాళిని మృత్యువున్, ఛేదించి ధీరుఁడై • నిలువవచ్చు
సాంఖ్యయోగంబుచే • సకలేంద్రియవ్యాప్తు, లరయుచుఁ దన్నుదా • నరయవచ్చుఁ
గీ. దారకముచేతఁ దనువులోఁ • దాను వెలుఁగుచున్నరీతిని గనవచ్చు • నుచితమయిన
రాజయోగంబుచేఁ బర • బ్రహ్మమందు, బొందియుండఁగవచ్చు సం • పూర్ణుఁడగుచు.
వేంకటాచలమాహాత్మ్యము. దా॥చిన॥ ఆ 3 ప 235, 236.

సీ. విను మంత్రయోగిక • న్నను గొప్ప లయయోగి, లయయోగి కధికుఁడు • లాసిరైన
హఠయోగియగుచుండు • హఠయోగికన్నను, సరసమానసుఁడైన • సాంఖ్యయోగి
యధికుఁడయగు వాని • కన్నఁ దారకయోగి, యధికుం డగుచునుండు • నతనికన్న
సాంఖ్యతారకముల • సంగ్రహించుకొని వైరాగ్యభావన నొప్పు • రాజయోగి
గీ. యుత్తమోత్తముఁడని చెప్ప • నొప్పు నతని,కన్న గొప్పైనయోగి లేఁ • డవనిమీఁద
నతఁడు సంసారమందున్న • నడవినున్న, సకలనిర్లేపుఁ డగుచుండు • శాంతుఁడగుచు.
వేంకటాచలమాహాత్మ్యము, ఆ 3.

## —• హఠయోగి. •—

సీ. హఠయోగసిద్ధుఁడై • యమరినపుణ్యుండు, మిగుల విఖ్యాతిచే • మెలఁగుచుండి
క్రమమున నణిమాది • కంబులై తనరెడు, నైశ్వర్యములతను • నాశ్రయింప
మఱి దేవతలయందు • మహిమ బెంపొందుచు, సకలలోకములందు • సంచరించు
నతఁడు వసించిన • యట్టిస్థలంబులు, పుణ్యతీర్థములౌచుఁ • బొలుపుమీఱు
గీ. నతఁడు పుణ్యుఁడగణ్యుండు • మితయశుఁడు, నతఁడు భవ్యుండు దివ్యుండు నసఘచరితుఁ

సీ. ప్రకటవిశుద్ధంబునకు వేయుహంసలు, నర్పితంబగువేళకగును రెండు
గడియలు సహస్రమైన గడియపదాఱు వి,గడియలుం హంసలక్కడికి నాల్గు
నాగ్నియందు సహస్రహంస లర్పితమగు, నపుడు రెండరగడియలు విగడియ
లును బదాఱును హంసలునునాలుగునుసహ,స్రారంబునందు సహస్రహంస
గీ. లర్పణము గాఁగ రెండున్నరై గడియ లలవిగడియలు పదియాఱు హంస లొక్క
నాలుగుమందు నీరీతి ననుదినంబు, జరుగున ఱువదిగడియలై జనుల కెల్ల.
వేంకటాచలమాహాత్మ్యము, ఆ 3.

## — రాజయోగము. —

సీ. పరమహంసంబు రేపగలు చింతింపంగ, బిందు లిందందుఁ గన్పింపకుండు
దశవిధప్రణవనాదము నాలకింపంగఁ దదనుఘంటానాద మొదవి మ్రోయు
బహుళతులక్ష్యముల్ పరికించిచూడంగ, సురుచిరంబై స్వయంజ్యోతి యొప్పు
యామనస్కయంబు యోగారూఢుఁడై వాని, ధ్యానింపఁ దన్మయత్వంబు గలుగు
తే. నట్టి యున్మనియందు మనోవిలయము,వివిధవిషయేంద్రియములతో విలయమొందు
నిదియెనూ సర్వవేదాంత విదితపరమ,రాజయోగంబు దేవతారాజివినుత.
సీతారామాంజనేయసంవాదము, ఆ 1 వ 187.

## — మంత్రయోగము. —

ఆ. ఏకవర్ణమైన నెలమి ద్వివర్ణంబు,లైన వర్ణషట్కమైన నెనిమి
దక్షరంబులైన నాత్మసిద్ధ్యర్థమై, జపము చేయవలయు జనుల కెల్ల.
విజ్ఞానప్రదీపిక. ఆ 3.

# యోగాసనలక్షణములు

## — వీరాసనము. —

క. ఒకతొడపై నొకపాదము, నొకపాదముమీఁదఁ దొడయు నునిచి శరీరం
బకుటిలగతి నిల్పినఁ దక్కక యది వీరాసనంబు కైవడి యయ్యెన్.

## — స్వస్తికాసనము. —

క. పిక్కల తొడల నడుములం, దొక్కటఁ బదతలము నిడి సమున్నతి నొడలిన్
నిక్కించిన నీయాసన, మక్కజముగ స్వస్తికాహ్వయంబగు జగతిన్.

## — పద్మాసనము. —

శా. వామాంకంబున దక్షిణాంఘ్రియును దద్వామేతరాంకంబునన్

వామాంఘ్రిన్ ఘటియించి పశ్చిమదిశా • వ్యాప్తంబుగా చేతులన్
నేమం బారఁగఁ గాళ్ళయంగుళములం • జేకొన్న పద్మాసనం
బౌ ముక్కుం గొనఁజూపునుం జుబుకహృ • న్న్యాసంగముం గల్గినన్.

సీ. ఆది పద్మబంధంబె • యగునైన నుత్తాన, చరణంబు లూరుసం • స్థములు గాఁగ
నూరుమధ్యంబున • నుత్తానకరతల, ద్వయమును రాజదం • తముల మొదట
హత్తియుండెడి రస • నాగ్రంబుఁ గొంటిభ్రాంతిన యున్న చుబుకంబు • దృష్టిఁ గలిగి
మారుతం బల్లనఁ • బూరించుచుండిన, నది పద్మమగు మతాం • తనమునందు
తే. మఱియు నిది ముక్తపద్మమునఁ బూర్వ, పద్ధ మొందుము సంస్తుతిహస్తయుక్త
మున గుదాకుంచనముఁ జల • దనిలపూరితము విసర్జనవిధియు ధ్యా • నమును వలయు.

## —• యోగాసనము. •—

క. యోగవటుజానుయుగసం, యోగంబునఁ బదతలంబు • లుర్విఁ నిలిపి లో
నీగినకరముల నుండిన, యోగాసన మండ్రు దీని • యోగవిధిజ్ఞుల్.

## —• కూర్మాసనము. •—

క. వీడఁబడినగుల్ఫంబులఁ, గూడక సంధించిపట్టి • గుదపులవడఁగాఁ
బీడించినఁ గూర్మాసన, మూడితమతి నెఱుఁగుదురు య • మీంద్రులు దీనిన్.

## —• ఉత్తానకూర్మాసనము. •—

తే. కుక్కుటాసనబంధంబుఁ • గూర్చినట్టి, కరయుగంబుల మెల్లనఁ • గనుదరంబు
బంధనముఁ జేసి వెల్లికిలఁ • బడిన కూర్మ, మట్లు పడఁగ నుత్తానకూ • ర్మాసనంబు.

## —• భద్రాసనము. •—

గీ. అండములక్రింద నెలవుల • యందు నుభయ, పార్శ్వములరానురెండు గు • ల్ఫములఁ బెట్టి
పార్ష్ణిపదములఁ గరములఁ • బట్టి నిశ్చ, లాత్ముఁడై యుండెనేని భ • ద్రాసనంబు.

## —• సిద్ధాసనము. •—

శా. యోనిస్థానముఁ బార్ష్ణిభాగఘటనా • యుక్తిన్ నిబంధించుచున్
దాన న్మేఢ్రముమీఁద నొజ నొక పా • దం బూన సిద్ధాసనం
బౌ నం దింద్రియనిగ్రహంబును సు దే • వస్థానుభావంబు యో
గానందైకమనంబు భ్రూయుగళమ • ధ్యాలోకముం గల్గినన్

క. వెండియును సవ్యగుల్ఫము, దండముపైఁ బెట్టి మీఁద • దక్షిణగుల్ఫం

బుండఁగ నవక్రముగఁ గూర్చుండిన సిద్ధాసనంబ • యగుఁ బతుమునన్.

## —• సింహాసనము. •—

శా. అండాధస్స్ఫురి నూరుపార్శ్వముల స • వ్యాపసవ్యగుల్ఫద్వయం
బొండొంటిం గ్రమహీనభంగి నిడి దో • ర్వ్యగ్రాంగుళుల్ జానులం
దుండ న్వే ప్రసరించి నిక్కి వివృతా • స్యుండైన సింహాసనం
బొండేమిం గనఁబోక నాసికముఁ దా • నోలిం బరీక్షింపఁగన్.

## —• కుక్కుటాసనము. •—

క. జలజాసనంబునం గరములు జానూరువులమధ్య • మునఁ జొనిపి ధరన్
నిలిపి గగనమున నంగం, బలవడ నిలుపంగఁ గుక్కు • టాసన మయ్యెన్.

## —• గోముఖాసనము. •—

క. వామదిశ పృష్ఠపార్శ్వము, ధామముగా దక్షగుల్ఫ • తలమును నట్ల
వామపుగుల్ఫము వలనిడ, గోముఖ మీయాసనంబు • గోముఖభాతిన్.

## —• ధనురాసనము. •—

క. మునుపాదాంగుష్ఠంబులు, దనచేతులు చెవులు దాక • ధనువు దివియున
య్యనువున నెడమఁగుడిఁదివియ, ధనురాసన మండ్రు యోగ • తత్త్వవిధిజ్ఞుల్.

## —• మయూరాసనము. •—

మహాస్రగ్ధర. ధరణిన్ హస్తస్థలంబుల్ • దగులనిలుపుచుం • దండముం బోలెఁ దత్కూ
ర్పరయుగ్మన్యస్తనాభీ • భవనతలయుగో • ద్భాసియై యున్నతాస్య
స్థిరుఁడై యాకాశదేశ • స్థితినిలిచినఁ దా • శ్రీమయూరాసనంబా
హరియించున్ రోగదోషా • యతన విషసమూ • హంబులన్ రంహయుక్తిన్.

## —• కపాలాసనము. •—

సీ. ఊర్ధ్వసంస్థితనాభి • యును నధస్తాలువు, నూర్ధ్వభానుఁడు నధో • యుక్తి శశియు
నూర్ధ్వపాదంబులు • నొగి నధశ్శిరమును, గలయదివిపరీత • కరణసంజ్ఞ
గలకపాలాసన • క్రమ మయ్యె గురువాక్యమున నది సిద్ధించు • జనుల కెలమి
నిత్యంబు నభ్యాస • నిరతునకీకపా, లాసనం బఖిలరో • గాళిఁ జెఱుచు
తే. జఠరవహ్ని వర్ధిలఁజేయు • జగతినట్టి, సాధకునకు నాహారంబు • సంగ్రహింపఁ
జను బహుళముగ నల్పభోజనముచేత, ననిలవేగంబు విడిపించు • నతనితనువు. 3384

— ముక్తాసనము. —

క. పదయుగ్మంబున గుదమును, గదియంగా నిల్పి యంక • గతమై యుండం
బద మొక్కటి సంఘటించిన, నది ముక్తాసనమపక్ర • మగు మే నమరన్.

— టిట్టిభాసనము. —

క. వెలికిలఁ జరణతలంబులు, దలమీఁదం జేర్చి ధరణి • తలమున నిలుపం
గలిగెడు కట్లుగఁ గరములు, నలపఱ్చిన మెత్తఁ డిట్టి • భాసనమయ్యెన్.

— పశ్చిమస్థానము. —

చ. పదముల భూమిఁ దండముగ • భాతిగఁ జాచి కరాంగుళంబులన్
బదయుగళాగ్రము ల్బిగియఁ • బట్టి లలాటము జానుయుగ్మముం
బదిలముగా ఘటింప నిది • పశ్చిమతానము చేయ రోగముల్
గదియవు పశ్చిమంబునను • గాలియగున్ జఠరాగ్ని కార్శ్యముల్.

— పూర్వతానము. —

తే. వరుస నీఁగాళ్లు నేలమో • పంగ నడిచి, మడమలును బిఱుఁదులు గూర్చి • మస్తకంబు
నడుముఁ గరతూర్పరంబుల • నదిమి మోపి నడుము మెగయున్నఁ బూర్వతా • నం బటండ్రు.

— అర్భకాసనము. —

మ. పదతలముల్ ధరాతలము • పైఁ గదు దగ్గఱ నిల్పి లోతొడల్
గదిసిన జంఘలు న్మతి ల • లాటము మోపిన జానుయుగ్మముల్
బిరుదుల కయుండు హస్తపరి • పీడితజానువు గల్గియుండెనే
నిదియగు నర్భకాసన మ • హీనసుఖాస్పద మందురీ సంయముల్.

— కామదహనాసనము. —

చ. అవనితలంబుఁ బొందఁగఁ బ • దాంగుళిమూలములోన నిల్పి జా
నువులు నభస్స్థలంబునను • నాల్గొనఁ బార్ష్ణియుగంబు యోనియం
దవులఁగ రోగదండఘటి • తాస్థిహస్తతలంబు లుండ నే
నవిరళమైన కామదహ • నాసనమం డ్రిది రోగలక్ష్యముల్ 3310

సీతారామాంజనేయసంవాదము, అ 1.

## —♦ పంచముద్రలు. ♦—

క. వరుసన్ ఖేచరి యన భూ,చరి యన మధ్యమ యనంగ ♦ షణ్ముఖి యనఁగా
వరశాంభవి యనఁ గలవీ, ధరలోపల ముద్రలైదు ♦ తారకమునకున్.

## —♦ ఖేచరీముద్ర. ♦—

ఆ. కనులు మూసి యైనఁ ♦ గనువిచ్చి యైన భ్రూ,మధ్యమమునఁ జూపు ♦ మలఁచి నిలిపి
యూర్ధ్వముఖముగాఁగ ♦ నొనరఁ జూచిన నది, ఖేచరియను ముద్ర ♦ కేశవర్య.

## —♦ భూచరీముద్ర. ♦—

క. లోచనములు గదలింపక, యాచార్యోక్తస్వనాసి ♦ కాగ్రం బెపుడున్
గోచరముగఁ జూచిన నది, భూచరియనుముద్రయగును ♦ బోధశరణ్యా.

## —♦ మధ్యమముద్ర. ♦—

ఆ. కనులు సగము మూసి ♦ ఘననాసికామధ్య,సీమయందుఁ జూపుఁ ♦ జెదరనీక
నిలిపి మీఁద నున్న ♦ నిటలంబుఁ గాంచిన, మధ్యలక్ష్యమగుఁ గు ♦ మారతిలక.

## —♦ షణ్ముఖీముద్ర ♦—

తే. కర్ణలోచననాసాయు ♦ గంబుమూసి, మలఁచి భ్రూమధ్యమునఁ జూ ♦ పులను మనము
నిలిపి వరనాదబిందుచి ♦ త్కళలఁ గనుట, షణ్ముఖీముద్ర యండ్రు సు ♦ జ్ఞులువత్స.

## —♦ శాంభవీముద్ర. ♦—

క. అంతర్లక్ష్యము బహి,ర్యంతవినిశ్చలసుదృష్టి ♦ యపగతపవన
స్వాంతవికారము గలయది, వింతయగుచు నొప్పు శాంభ ♦ వీముద్ర యనన్.

## —♦ ప్రణవము. ♦—

తే. సద్గురుప్రోక్తముద్రచే ♦ శ్రవణయుగము,మూసియాలింపఁ బ్రణవంబు మ్రోయు మొదలఁ
జిణియనుచు నంతటను జిణి ♦ చిణి యటంచు,మించి రెండవమాఱు ఘో ♦ షించు ననఘ.

సీతారామాంజనేయసంవాదము, ఆ 1 ప 102-109, 118.

## —♦ సూర్యభేదనకుంభకము. ♦—

సీ. వరయోగి యగుతాఁను ♦ వజ్రాసనమునుండి, నయమొప్పఁగా వామ ♦ నాడిచేత
నాలోన కుంభించి ♦ నట్టిమారుతమును, మెల్లన విడిచి యా ♦ మీఁద మఱల
దక్షిణనాడిచే ♦ తను వెలుపలివాయు,వును మెల్లనే లోని ♦ కొనరఁ దీసి
యప్పుడు కేశన ♦ ఖాగ్రపర్యంతంబు, నరికట్టి కుంభకం ♦ బచట జేసి

గరిమ మరుద్ధారణ నెయ్యము ముఖంబున నిల్పె దశప్రకారముల్. 3404

ఒడయనంబివిలాసము, ఆ 5.

### ప్రత్యాహారము.

సీ. ఇంద్రియార్థములందు ◆ నింద్రియంబులఁ బ్రవ,ర్తిలనీక మదయించి ◆ త్రిప్పుటొకటి
యావియందుఁ జరియించె ◆ నటి సమస్తంబు నా,త్మయ కాఁగ మనసులోఁ ◆ దలఁచుటొకటి
నిత్యకర్మంబుల ◆ న్నియు నాత్మయందసం,తతము చిత్తముచే నొ ◆ నర్చు టొకటి
తనువునఁ గలపదు ◆ నెనిమిది మర్మసీ,మలఁ గ్రమంబున గాఢ ◆ నిలుపు టొకటి
ఆ. యోగశాస్త్రశీల ◆ యుతులు ప్రత్యాహార,భేదరీతు లనుచు ◆ నాదరమున
సాంద్రబోధకముగ ◆ సలుపుచునుందురు,రో వసుంధరాసు ◆ రావతంస.

### ప్రాణాయామము.

సీ. పాదాదిగాజాను ◆ పర్యంతము ధ్వరము,ర్వ్యాదిగాఁ బాయుప ◆ ర్యంత ముదక
ముదకాదిగా వహ్ని ◆ హృదయాబ్జపర్యంత, మగ్నియగ్న్యాదిగా ◆ నంసమీఁద
భ్రూమధ్యపర్యంత ◆ ము మరుత్తు మరుదాది,గా మూర్ధపర్యంత ◆ మోమహాత్మ
నభము వర్తిల్లుఁ దా ◆ నకమదియైను భా,వింపఁగా వేర్వేఱ ◆ విహితగతిని
గీ. ధాత్రృ విష్ణు రుద్రేశ స ◆ దాశివాఖ్య, దైవతములఁ బృథివ్యాది ◆ తత్త్వపంచ
కమున ధారణ మొనరింపఁ ◆ గావలయును, బ్రణవమునఁ బ్రాణాయామ ◆ భంగులమర.

కళాపూర్ణోదయము, ఆ 5 ప 166, 167.

### యమనియమములు.

క. ఏచిన నియతి యుఁ దపమును, శౌచము వేదమును గలిగి ◆ సంతోషముతో
వాచవులు విడిచి బ్రహ్మముఁ, జూచుట యమయోగ్య మంద్రు ◆ సుజనులు మొదలన్
క. సకలాసనములలోపల, నొక భద్రాసనము పూని ◆ యోగియు గుణపం
చకయుతముగఁ దనచిత్తముఁ, బ్రకటబ్రహ్మమునఁ గూర్పఁబడ నియమ మగున్.

విష్ణుపురాణము, ఆ 8 ప 438, 440.

### నాడులు.

తే. కాయముఁ దనువున డెబ్బది ◆ రెండువేలు,నాడు లొకటియు నూఱు గ ◆ ణ్యంబులందు
నందుఁ బదునాల్గు శ్రేష్ఠంబు ◆ లందులోన, మూఁడు నతికెక్కు నందున ◆ ముఖ్య మొకటి

కళాపూర్ణోదయము, ఆ 5 పద్య 164.

క. ఇడవామనాడి పింగళ, నడినాడి సుషుమ్న మధ్య ◆ గోచరయగుని

కుడియెడమమధ్యనాడుల, గుదురాజానన! త్రిమూర్తు • లొగి దైవంబుల్.
క. హరియుడకు నలువపింగళ, కరవిందదళాయతాక్షి! యమృతాంశుకళా
ధరుఁడు సుషుమ్నానాడికిఁ, బరిపాటి నధీశు లనుచుఁ • బలుకుదు రార్యుల్.

కాశీఖండము, ఆ 2 ప 122, 123.

ఉ. వినుమా పింగళనాడి రెండునెలలున్ • దీప్తిష్ఠమై యాడినన్
యనుమానంబును లేక నారునెలలం•దాపై మృతుండౌఁగదా
వనిలో మాసము పక్షమున్ విడువ కా•వశ్యంబు నానాడినన్
దినవర్షాంతము మృత్యు వందును సుమా•తథ్యంబునో పార్వతీ.
క. పక్షంబు పింగళాడిన, రక్షణ లేకుండ మృతికి • రాజానసుమా
తక్షణము స్తంభనైనను, అక్షీణంబైనరోగ • మానరుఁ దందున్.
సీ. పదిదినంబులు యాపొ•పట్టుగా నడిచిన, మూడుమాసములలో•మృత్యు వగును
మూడుమాసములీడ•నాడుచున్న నరుండు, మే డాదిలో దేహ•జాడ యుడుచు
సంవత్సరంబునే•చంద్ర మాడకయున్న, పోవు రెండు వ•హోమృతముగ
అష్టమిదినవార • మిష్టనాడియులేక, కష్టనాలైతుది • నష్టనందు
గీ. విదియలో నాడి వెనకైన• వెడలు ధనము, తదియాదిన మాడ లేకున్నకష్టి ఫలము
నాలుగవనాడు వారంబు • నడువకున్న, బంధువైరంబుచే మహి•బాధ గలుగు.
క. పంచమివారస్వరమును, చంచలమై లేకయున్న • చపలత్వంబున్
మించినరాజతో వైరము, రెంచును ధననష్టమౌను • యింతే వినుమా.
గీ. సృష్టివారమలేకున్న • కష్టతరము అటులసప్తమివారంబు • నంటలేక
నాడిపరమైన దేశాల•నంటితిరుగు, యీడపింగళవాహుళి • జాడనుండు.
గీ భానుమంగళ గురుస్థిరత్ • భాస్కరునివి, తక్కినవిచంద్రవారముల్ • తలప వెలుగు
నారమాలయుంచు నాడులు • నడుపలేక, మారు నడచినవారికి • మారుతత్వ.
సీ. జలమానుసూర్యప్ర•పాదబింబముగను, విందైనయారోగ్య•మొందు తనువు
పూర్వాదినలుదిశల్ • పూర్ణంబు గాకున్న, నారుమాసాలరెండ•నటుల నెలను
కన్నులుబడురీతి•గాబింబముండిన, పదిదినంబుల మృతి•ప్రాప్తి యగును
ధూమాకృతిఁ గనుల•బోఁచ నిర్వదిదినాల్ మంటగానగపిన•మంచిదేబో
గీ. ధ్రువుడ నేమున్ముఁచివరయు • తోపకున్న, నటు లరుంధతి వాలుక • యానకున్న
ఇంద్రబింబము చొకమై•సాగుచున్న నారునెలలకు యమలోక•మంటియుండు. (?)

సనాదివిశ్వేశ్వరసంవాదము, ఆ 1 ప 166–172.

## —♦ సంచారములు. ♦—

సీ. వ్రీడావహిత్థప్ర♦వేగోన్మదోగ్రగ్లాని, మపస్మారమతివితర్క♦చపలదైన్య
విషమసత్రాసక♦చరమలీలాలసని,ర్వేదనాసూయావి♦షాదగర్వ
మోహాంచితౌత్సుక్యస్మృతి♦సుప్తమానమాధుర్య,జడగుప్తిశ్రమవ్యాప♦స్మారహైన్య
హర్షనిద్రాశం♦కాలస్యసుఖనామ,ధేయముల్ గల్గి వ♦ర్తిల్లునట్టి
తే. ముప్పదియుమూఁడు సంచార♦ములను మగ్గి, స్వేదవైవర్ణ్యరోమాంచ♦విశ్రుతాస్య
కంపముల్ ప్రళయస్తంభ♦కము లనఁ జను, సాత్త్వికపుభావములచేత♦జడిసి తెలిసి.

హంసవింశతి. ఆ 4 ప 87.

## —♦ చక్రములు. ♦—

క. రెండును బదాఱును పదిపై, రెండును పదియాఱు నాల్గు♦రేకుల దిరమై
యుండును షట్చక్రంబులు, దండిగ జంతువుల కెల్లఁ♦దల క్రిందగుచున్.
సీ. తతఘాలచక్రంబు♦దళయుగ్మమునరూఢి, హంసలుండెడును బీ♦జాక్షరములు
కంఠచక్రంబుగ♦గలపదాఱుదళంబు,లందు సుస్వరములు లిం♦పొందియుండు
హృదయచక్రంబునఁ♦బదిరెండుదళముల, కఠమధ్యవర్ణముల్♦గలిగియుండు
పటునాభిచక్రంబు♦పైని గల్గుడదశా,ద్యంతాక్షరంబులు♦దవిలియుండు
గీ. లింగచక్రంబు దళము లా♦రింటియందు, బాలమధ్యాక్షరంబులు♦ప్రబలియుండు
లాలితాధారచక్రద♦ళముల నాల్గింట నాసాంతవర్ణంబు♦లంటియుండు. (?)

ఒడయనంబివిలాసము. ఆ 5.

తే. ఘనపుళిందకొల్లాపురి♦వెనకపటుక, కాలరేఖమహామాలి♦కానిరామ
యాఖ్య లలరారుచక్రము♦లందు బీజపంక్తి లిఖియించి తత్ఫలా♦ఫలము లరసి.

హంసవింశతి. ఆ 4 ప 51.

## —♦ మనస్సు. ♦—

గీ. కళకుఁడిరుగనియశ్వంబు♦కరణిఁ గడిఁది, యంకుశము మీఱి తట్టిని♦శ్శంకగజము
మంత్రము నతిక్రమించిన♦మత్తఫణియు, నెడియన్న నహృదయంబు♦కాదె చెలియ
క. సాధన మొక్కటి గల్గఁగ, సాధింపఁగవచ్చు నెట్టి♦సాధ్యముఁ దానే
సాధనసాధ్యమ్ము లౌటను, సాధింపఁగరాదు మనము♦సన్మునికైనన్, 3424

సీమంతినీకల్యాణము. ఆ 2.

ప్పురుషుల్ ల్సర్వజగంబుఁ బుణ్యగతులం ♦ బొందింతు రజ్ఞానసా
పద్మపురాణము, ఆ 5.

క. ఏజాతివారలైనను, భూజనములు నుదుటు భూతిఁ ♦ బూసినమాత్రిం
జేజమున సర్వయూనవపూజితులై శివపదంబుఁ ♦ బొందుదు రనఘా.
బ్రిహ్మోత్తరఖండము, ఆ 5.

—♦ [illegible] ధారణము. ♦—

సీ. భసితంబు [illegible] బుద వాతంబు, భసితంబు దారిద్ర్య ♦ ఫణిసుపర్ణి
భసితంబు [illegible] ♦ [illegible]గావంబు, భసితంబు దుఃఖాబ్ధి ♦ బాడబంబు
భసితంబు సంసార ♦ పర్వతదంభోళి. భసితంబు గర్వాస ♦ [illegible]దంతి
భసితంబు యజ్ఞాన ♦ పటలకాననవహ్ని, భసితంబు మృతభయా ♦ పహాసుధంబు
గీ. గాన భసితంబు లకుగం ♦ గావగాహ్వానములఫల మిచ్చు సద్విధి ♦ ననుదినంబు
ధారణముఁ జేయుచునతని పా ♦ దమున నున్న, రేణుపటలంబు సాటిగా ♦ రితరజనులు.
నీలకంఠలీవిలాసము, ఆ 3.

—♦ రుద్రాక్షధారణము. ♦—

క. రుద్రుఁడు పురములఁ గూలిచి, భద్రింబుగ నున్నతతి శు ♦ భావహ మగుచున్
దద్రుద్రుని నేత్రజలమున, రుద్రాక్షలు బొడమె దేవ ♦ బుధులకు హితమై.
క. ఏకముఖాక్షము శిరమునఁ, బ్రోకటముగఁ దాల్చెనేని ♦ పరశివుఁడై యు
ల్లోకములయందుఁ బూజ్యుఁడు, గాకుండునె దానిమహిమఁ ♦ గనఁగాఁ దరమే.
[illegible] దమోనా తి ♦ రెన్ని [illegible] యాయదురాక్ష పేరుల
[illegible] బోరయుండిడినఁ ♦ జెన్నలరాఁగ వీనులందు సొం
[illegible] దండలంను నిరు ♦ ప్రక్కల గుత్తులయందు గుత్తుకన్
[illegible] సిద్ధినిఁ జెందుఁజుమీ కుమారకా.
క. [illegible] ఖంబులు [illegible]వడు, మించినరుద్రాక్ష లెవరు ♦ మెయిఁ దాలిచినన్
[illegible] ఖుడై యూర్వ్యరుఁ, డంచితముగ భక్తకోటి ♦ కధికుని జేయున్. 3440
సీ. [illegible] ముసధరియింపఁ ♦ జెప్పె ముప్పదియారు, ఘనత ముప్పదిరెండు ♦ కంఠమునకు
వీనుల మూడేసి ♦ బూనవచ్చు నటంద్రు, మణిబంధములకు స ♦ మ్మత్రముగాను
పదిరెండు పదిరెండు ♦ బాహుదండలయందు, బదియారుబదియారు ♦ బరగుచుండు
మరమున నెగడ్లాందు ♦ నరువదినాల్గేసి, ధరియింపవచ్చు నం ♦ దంబుగాను

సీ. కర్మవశంబునఁ ♦ గామితార్థము గల్గుఁ, గర్మవశంబునఁ ♦ గలుగు శుభము
కర్మవశంబునఁ ♦ గలుగు సద్భావంబు, కర్మవశంబునఁ ♦ గలుగు జయము
కర్మవశంబునఁ ♦ గలుగు భోగంబులు, కర్మవశంబునఁ ♦ గలుగు భక్తి
కర్మవశంబునఁ ♦ గలుగు సుజ్ఞానంబు, కర్మవశంబునఁ ♦ గలుగు ముక్తి
గీ. కడఁగి కర్మవశంబునఁ ♦ గలుగు నియతి, నరిగి కర్మవశంబునఁ ♦ గలుగు బుద్ధి
ఘనత కర్మవశంబునఁ ♦ గలుగు విభవము, గలుగుఁ గర్మవశంబునఁ ♦ గాంచ సిద్ధి.

విజ్ఞానప్రదీపిక, ఆ 1.

ఉ. నలువకులాలుభంగి నలి ♦ నప్రభవాండమునందు దేనిచే
నిలిచె దశావతారవ ♦ నిస్థితుఁ డయ్యె మురారి దేనిచేఁ
బెలుచఁ గపాలహస్తుఁడయి ♦ భిక్షుకుఁ డయ్యెఁ బురారి దేనిచే
నలరవి దేనిచేఁ దిరుగు ♦ నా ఘనకర్మము వంద్యమేకదా.

మ. ఖలునిన్ సజ్జనుఁగాఁగ మూర్ఖజను సం ♦ ఖ్యావంతునింగాఁగ దా
యల సన్మిత్రులఁగా నగోచరము ప్ర ♦ త్యక్షంబుగాఁ బ్రాణహృ
త్కాలవ్యాలంబైనమహావిషం బమృతముం ♦ గాఁ జేయు సత్కర్మ ము
జ్జ్వలనిష్ఠాసిద్ధమై భజింపుము వయ ♦ స్యా వాంఛితార్థాప్తికిన్.

భర్తృహరిసుభాషితము, నీతి 93-94.

క. విను పూర్వకర్మఫలములు, దనకు వశము గాక పొందుఁ ♦ దఱితో వానిం
గనికొని సైరక మూఢుఁడు, దన కాపద యైనచోట ♦ దైవము దూఱున్.
గీ. కార్యఫలములయెడఁ దాన ♦ కర్తననుట, కడు నెఱుంగమిఁ జుమ్మి తాఁ ♦ గర్తయేని
తగిలి తనదైన కార్యజా ♦ తంబు నెల్లఁ జెడక ఫలియించునట్లుగాఁ ♦ జేయరాదె.
సీ. నీతిమంతులు ధర్మ ♦ నిరతులు దక్షులు, నగువారు సేయుకా ♦ ర్యములు గొన్ని
సిద్ధి బొందవు దుష్ట ♦ చిత్తులుఁ గ్రూరులై, చేయఁ గొన్ని విశేష ♦ సిద్ధిఁ బొందు
నూరక యుండంగ ♦ నొందుఁ గొందఱు విపు, లార్థముల్ గొంద ఱా ♦ యాసపడియు
నిష్ఫలారంభులై ♦ నిలుతురు గొందఱు, పేదవారికిఁ బ్రజ ♦ పెల్లు వొదవు
గీ. వర్ధవంతులు గొందఱ ♦ కర్థి నధిక, దానములు ధర్మములు సుప ♦ విత్రములుఁ జేయఁ
బ్రజలు పుట్టిన విను పట్టి ♦ భంగి సుమ్ము, కర్మఫల మాత్మతంత్రంబు ♦ గాకయుండు
క. పురుషుఁడు కర్మాధీనత, కరుగక తనవశము ననిన ♦ నాపదలు రుజల్
మరణ[illegible] విధి యేమియు, బొరయక యుండంగ బ్రదుకఁ బోలదె చెప్పుమా.[illegible]21
ఆ. కర్మవశతఁ జా[illegible]గలుగు దేహము దేహ, వర్తనంబు కర్మ ♦ వశతఁ బుట్టు

దేహపాత మైన ♦ దేహస్థుఁ డగుజీవుఁ, డనఁగఁ గర్మకృతాంత♦మైనయదియ.

భారతము, అను. ఆ 5 పద్య 66, 67.

క. మొలకం బెట్టినయట్టిది, మొలచు తోలుకేనికాన♦ముల నానాక్షం
బులు సిద్ధింపఁ బ్రయత్నం,♦బులు లేకయును నిరత నిజము ♦ ఘనాపక తీర్థా.

గీ. అలఘుతపములు వోలు పెనఁ ♦ గలిగినేని, వెదకకొని వచ్చు నన్నియు♦విపులభోగ
ములు పురాకృతసృష్టసే♦వల ఫలించు, బద్ధికలిమియు విద్యలఁ♦బోలుమనుజనాథ.

క. తోలుమేన సహింపనోపుచి, గలిగిన దీర్ఘాయు వొందఁ ♦ గారణఘాతం
బులు భూవర యివి యాగుణ,ములు లేమియుఁ గీడులకును ♦ మూలం బగుదన్.

భారతము, అను. ఆ 6. ప 420-428.

సీ. నలువకా శనిచేత ♦ యలఁత హరిశ్చంద్ర,పతిహాపాలకశాశి కా♦వహ్నికొల్పు
రోహిణిభర్తకా♦రాహుచేఁబడుపాటు, పంచపాండుసుతకా ♦ ఘస్మ పకుటు
వనజసంభవునంతే♦వారికా తలపోక, పాకశాసమునికా ♦ బ్రహ్మహత్య
యరవిందనేత్రునికా♦కా బోయచేఁ జావు, హరునకా భిక్షాట♦నావసక్తి

గీ. ఘనుఁడు రామనృపాలునకా♦కా తలంప, నుత్కటంబైన పత్నీవి♦యోగదుఃఖ
మెంతవారికిఁగాని మ♦హీశ దేంద్ర,కర్మ మనుభవనీయంబు♦గాకపోదు.

నిరంకుశోపాఖ్యానము: ఆ 4 ప 97.

## —♦ ఓంకారము. ♦—

శా. కంటే న్నెమ్మదిఁ గంటి సద్గురుని నిం♦కన్ మేనిలోఁ బుష్పలా
టింటన్ బూజ లొనర్తునంచుఁ గర మ♦ర్థిన్ దేహ దా మున్నగా
ఘంటానాదముఁ జేసెనో యనఁగ నోం♦కారంబు హృత్కీర్తిపున్
మింటన్ మ్రోయుఁ దదారవంబుగతి యా♦మింటన్ విజృంభించు మన్.

సీతారామాంజనేయసంవాదము. ఆ 1 ప 119.

## —♦ ఆధ్యాత్మికాదులు. ♦—

తే. అనఘ యాధ్యాత్మికంబును♦నాధిభౌతి,కంబు నాధిదైవికమునాఁ♦గలుగునట్టి
వ్యథలు తాపత్రయంబులై♦యఖిలజంతు,వులమహాదుఃఖములఁ బెట్టి♦యాలఁ ప్రచండు.

క. శారీరమానసము లన, వారయ నిరుదెఱఁగులందు♦నాధ్యాత్మికమా
శారీరము రోగములు మ,హారోగప్రక్రోధమదము♦లగు మానసముల్.

క. ఇలఁ బరులవలనఁ బ్రాణికిఁ, గలదుఃఖము లాధిభౌతి♦కము లన వాత,
జ్వలనాదుల పీడల నొ,ప్పలవడి యుండుటయె యాధి♦భౌతిక మయ్యెన్.

విష్ణుపురాణము, ఆ 8 ప 852-854.

దమపనుల్ సేయు వి♦ధాత్ర్యవశమున నా,యువు వెగినట్టి జం♦తువులు నవ్వ
నేము సంపితి మని ♦ యించు కేనియు నహం,కారంబు వారికిఁగలుగ దట్టు
ఆ. గాన చూవె వారిఁ♦ గల్మష మొందదు, పుణ్యపాపములకు ♦ బుద్ధిమూల
మని శివుండు మతియు♦ఁ జను హింసవోలె నై, యధికధర్మమైన♦ విధము వినుము.

భారతము, అను. ఆ ౫ పద్య ౬౫, ౬౮, ౬౯.

ఉత్సాహ. ఈగ పేను నల్లి చీమ ♦ యీఁగ మొదలు జంతులన్
గ్రూరసర్ప వృశ్చికాది♦ కుటిలవిషప్రాణావళిన్
ఘోరమృగములన్ వధింపఁ♦ గోరకునికి నాగమో
క్రూరహింస సేయ రెండు♦నొప్పు నా యహింసకున్. 350

సీతారామాంజనేయసంవాదము, ఆ 1.

ఆ. మానసంబుచేత ♦ మాటలచేతఁ గ,ర్మంబుచేత నెప్పుడు♦ బ్రాణిహింస
సేయఁబూనువాఁడు ♦ చేరు దుర్గతులకుఁ, దగ నహింసపరమ♦ధర్మ మనఘ.
సీ. మశకకీటకదంశ♦మత్కుణప్రభృతిదు,ర్బలజంతుకులములఁ♦ బరమకరుణ
రక్షించుసుకృతులు ♦ వీక్షింపరు దురంత,నరకముల్ తమపాటి♦ కొఱకుఁ గవిసి
జలచరస్థలచరం♦బుల వధియించువా,రలు కాలసూత్రసం♦ప్రాప్తులై ని
జాంగమాంసాశను♦లగుచు రక్తంబు ద్రాగుచు మొత్తువెట్టుచు ♦ ఘోరనరక
గీ. నిలయములఁ బెద్దగాలంబు♦నిలిచి యడలి, స్థావరత్వము నొంది య♦త్యంతమూఢ
భావకలితతిర్యగ్యోని ♦ బహుశతముల, మొనసి జన్మించి కష్టంబు♦లనుభవించి.

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 3. ప 26, 28.

## మాంసభక్షణము.

గీ. వాజిమేధంబుకంటెను ♦ బూజనీయ,కర్మమందురు మాంసభ♦క్షణము విడువ
వినుము చంపుటయును జంపఁ♦బనుచుటయును,గల్మషంబుల కెల్ల న♦గ్గలము లధిప
క. పితృకార్యయజ్ఞముఖముల, శ్రుతిచోదితహింసఁ గీడు♦సార నేరదు వి
శ్రుతగుణ మాంసముచవి గోరి తినం బ్రాణిఁ దెగటార్చు♦ క్రియఁ బాప మగున్.
క. తను నమలినవాని నమలు, నని మాంసము తెఱఁగు సెప్పు♦నాగమములు గా
వున దద్భక్షణ ముడిగిన, ననఘు తపంబునకుఁ బోలు♦నది యొక్కండున్.
క. జనవర మాంసముచవిఁ గడ,చినచవు లరయంగ లేమిఁ♦ జేసి చవి యెఱిం
గినవాఁ డది యుడిగిన నా,తని దేవసమానుఁ డండ్రు ♦ ధర్మవిధిజ్ఞుల్.
ఉ. ప్రాసను జాతినుం గలదె ♦ మాంసము ప్రాణులవేసఁ గాక య
శ్మేనుల నొంచునప్డు దమ♦ మేనులు సోఁకినమాత్ర నెట్టగున్

దాని దలంపఁగా వలదె ♦ తా నది మానిన హింస లన్నియున్
మానవె యంత నుత్తముఁడు ♦ మాంసము మాను దయార్ద్రచిత్తుఁడై. 3508

ఆ. మాంస మాన కొనికి ♦ మను జేశ ప్రాణిప్రభాభిరతి దొఱంగు♦టగుటఁ జేసి
యట్టివాని కభయ♦మఖిలభూతంబుల వలన నెప్పుడు నెందుఁ♦గలిమి నిజము.

క. స్వాయంభువుఁ డనుమనువును, నీయర్థము సెప్పె లోక♦హితముగ మార్కం
డేయాదులు మాంస ముడుగు, టాయుశ్శ్రీరూపకారి♦యగు నని రధిపా.

క. విను మాంసము గోరనరుఁడు, దనుజుఁడ చూవె మును దేవ♦తలు మాంసంబుం
దిను టుడిగి కాదె దానవజనితభయముఁ బోవఁ ద్రోవఁ♦జాలిరి వత్సా.

క. తపముల దానంబుల బ్రహ్మపురనివాసంబు దప్ప♦దన రాదు జనా
ధిప మాంసము నచులని పుణ్యపురుషునకు సులభ మందు♦రా నెల వార్యుల్.

సీ. అధిప యాషాఢముఖ్యంబు♦లైన నెలలు, నాలుగింటను మాంసంబు♦నమల కుడుగు
టాయురారోగ్యబలకీర్తు♦లను ఫలములు, నాలుగింటిని నిచ్చు న♦న్నరున కండ్రు.

ఆ. సగర నల దిలీప♦నృగ భగీరథ ముఖ్యనృపులు వార్షికంపు♦నెలలు నాల్గు
మాంసభక్షణంబు♦మానుట నుభయలోకంబులందుఁ బెంపు♦గాంచి రండ్రు.

భారతము, అను. ఆ 4 ప 293-302.

## —♦ దైవపౌరుషంబుల తెఱఁగు. ♦—

క. విను పురుషుఁడు గావింపని, పనులకు దైవ మది యెట్లు♦ఫల మొసరించున్
జనములు గార్యము నడపఁగ, ననుకూలత నిచ్చుఁ గాక ♦ యర్థ్యైకఫలముల్.

గీ. పౌరుషమ్ము దైవంబుతో♦డ్పాటు లేక, ఫలము బొందంగ నేరదు♦పార్థివేంద్ర
విత్తు సహకారి గాకున్న ♦ కత్తె నేల, వంధ్య మగుఁ గాక తా ఫల♦వంత మగునె.

గీ. మేలు రెండులోకంబుల ♦ మేల తెచ్చుఁ, గీడు సేసినఁ దప్పదు ♦ కీడయగుట
గాన పురుషవర్తనమున ♦ కానుకూల్యశీల మగు దైవ మది ఫల♦సిద్ధిఁ జేయు.

సీ. తాపసవేషంబు♦ధరియించె రాముఁడు, బంధనప్రాప్తుఁడై ♦ బలి యడంగె
వనవాసగతులైరి ♦ వరఁ బాండుతనయులు, యాదవు లన్యోన్య♦హతులఁ జనిరి
ఘోరదుర్దశ నొంది ♦ కుందె నైషధరాజు, శరతల్పగతుఁ డయ్యె ♦ శాంతనవుఁడు
నాఘనరూపంబు ♦ వాసుదేవుఁడు దాల్చె, దశకంఠుఁ డర్జునో♦ద్ధతికి నొదిగె

గీ. సర్వమును దైవవశమున♦జరుగు జగము, గాన నేరక తాఁ గర్త♦గాఁ దలంచు
మూఢచిత్తుఁడు సుజ్ఞాన♦మూర్తియైన, పురుషుఁ డిన్నియు నెఱిఁగి సు♦స్థిరతనుండు.

పంచతంత్రము, నారా. సంధి. ప 354.

చ. గగనమునన్ జరించు పత♦గంబు లగాధసముద్రవారిలోఁ
దగ విహరించుమీలు వల♦తంతువులంబడి చచ్చు నగ్నిశిఖిన్
దెగిచన స్థానశక్తి గల♦దే పల దేర్పడఁ జింత సెన్నికై
తెగుసెడ కెంతదవ్వయినఁ♦దెచ్చుఁ గదా విధి దేహధారులన్. 3519

పంచతంత్రము, వేంక. ఆ 2.

గీ. దైవమునకంటె మనుజయ♦త్నంబె మిగుల, నధిక మటువలె గాకున్న♦నక్షి లపించి
దర్పకగురుండు మూడవ♦తారములను, వెలసి మానవుఁడై పట్టి♦వెతల్ పడఁడె.

క. తానె స్వతంత్రుండైనను, మానవుఁ డిల నేలఁజచ్చు ♦ మనలక దైవా
ధీనము మృత్యువు ప్రాణము, పోవనసాధ్యంబె కాల♦పూర్ణంబైనన్.

సీ. ఐశ్వర్యములు పెక్కు♦లనుభవింపఁగఁగోరు, బ్రహ్మకల్పంబులు♦బ్రతుకఁగోరు
సర్వసర్వంసహా♦స్థలము లేలఁగఁగోరు, చంచలాత్మల సంతో♦షించఁగోరు
గుఱుతుమీరిధనంబుఁ ♦ గూడఁబెట్టఁగఁగోరు,కడు బుత్రపౌత్రులఁ♦గనఁగఁగోరు
కడలేనిగృహములు ♦ గట్టింపఁగాఁగోరు, షడ్రసరసాన్నంబు ♦ గుడువఁగోరు

ఆ. కట్టఁగోరు మేలు♦గడితంపుఁగోకలు, నలఁదఁగోరు మంచి♦కలపడములు
తాను దలఁచినట్లు ♦ దైవంబు సేయునే, మనుజయత్న మేడ♦మంతు సెప్ప.

క. తానతి విద్యామాన్యుఁడఁ, దానె సమర్థుండఁ బెక్కు♦ధనధాన్యంబుల్
తా వెగణించితి ననుకొను, మానవుఁ డఖిలంబునకును ♦ మాధవుఁ డుండన్.

క. తనపదములు తనకరములు, తనమోహము తనమనంబు ♦ తనదై యుండన్
తన కింపగు పను లొనరుపఁ, దనకును శక్యములు గావు ♦ దైవకృతంబుల్.

యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ ౩.

## ♦ గ్రహచారము. ♦

గీ. నాతి విను గ్రహచారంబు♦హేతువులుగ,నశుభములు శుభములు నరుఁ♦డాచరించు
గ్రహము సేయించునే తాన♦ కాకచేఁత,కొడయుఁడటుగాన ఫలములు♦గుడువవలయు

భారతము, అను. ఆ ౫ పద్య 123.

## ♦ మనోవాక్కాయకర్మలు. ♦

సీ. మానిని త్రివిధముల్ ♦ మానసవాచిక,కాయికంబులఁ బాత♦కంబు లందుఁ
బరధనాపేక్షణ ♦ పాపానుమోదధ,ర్మద్వేషముఖములు ♦ మానసంబు
లనృతదారుణభాష♦ణాదులు వాచిక,ములు వధంబును బంధ♦మును నభక్ష్య
భక్షణంబును నన్య♦భామారతము మద్య,పానంబు మొదలైన♦పాపకృతులు

గీ. గాయకంబుల విను పాఠకంబు సేయుఁ, దాన మది దుష్కృతంబులలోన నెల్లఁ
దానముక నిందతో వచ్చు బ్రాణగోత్రములును జేటులు నరకాబ్ధి మునుఁగుటలును

భారతము, అను. ఆ 5 పద్య 174.

## —— పరోపకారము. ——

సీ. అమరేంద్రసంగతుఁ డర్థియై యొసఁగఁడే, యలయక కోలెమ్ము వాదధీచి
ప్రాణంబు లీఁడె తప్పక భోగిసుతునకై, యూహించి జీమూతవాహనుండు
నర్పింపఁడే కృతిమాంద జన్మిగుండై, చెక్కి మాంసం బెల్ల శిబివిభుండు
తనువుఁ ద్రిలోకముల్ ధారగాఁ జేయండె, బలివామనుండైన బల్లిదునకు
గీ. నోపి సత్కీర్తి కాశకుఁ బరోపకారపరుల కొదవింపరాని దుష్కరము గలదె
తనువుపని యెంత ధర యెంత తనయుఁ డెంత, పుత్రునకొక్కొ గావింప విప్రుల తేజ.

సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 62.

మ. చెవికిం గుండల మొప్పుగాదు శ్రుతమే చేదమ్మికిం గంకణం
బు విభూషాఖ్యము గాదు దానమె మహిన్ బుణ్యాత్ము నెమ్మేనికిన్
బరితాపంబులు గావు సొమ్ము లుపకారప్రౌఢియే నిక్కమౌ
లవిభేంద్రాతిగవైభవా సురభిమల్లా నీతివాచస్పతీ.

మ. జలజాతంబులు వేఁడెనే రవి వికాసం బొందఁగాఁ జేయఁ గ
ల్వలు ప్రార్థించెనె చందమామ యనువేలం బొప్పు రంజించు లో
కులు లంచం బిడిరే తటిన్ జలము మేఘుం డిచ్చుఁ బుణ్యాత్మకుల్
దలఁపన్ విశ్వహితక్రముల్ సురభిమల్లా నీతివాచస్పతీ.

మ. తమ స్వార్థంబు త్యజించి కొందఱు పరార్థం బుత్తముల్ మధ్యముల్
తమయర్థం బెడకుండఁ గూర్తురు పరార్థంబుల్ పరార్థంబు స్వా
ర్థముకై త్రుంతురు మర్త్యరాక్షసులు వ్యర్థంబల్గి యన్యార్థముల్
సమయం జేయు మనుష్యులే సురభిమల్లా నీతివాచస్పతీ. 3580

భర్తృహరిసుభాషితము, ఎ॥ బా॥ ప 62-64.

## —— స్థానబలము. ——

క. నెలవులు దప్పిన మిగులన్, బలుచన నఖదంతకేశమానవులనుచుల్
తలపోసి బుద్ధిమంతులు, దొలఁగరు తమతావు లెంత దుర్దశలైనన్.

క. తనయున్న చోటనుండఁగ, ననుకూలతఁ గార్యసిద్ధు•లగుఁ దగిన క్రియన్
విను మేఁకపొదుగుచన్నుల, జనితంబగుపాలు ద్రావు•చన్నులఁ గలవే.
పంచతంత్రము, నారా. సుహృ. ప 138, 139.

—• ఆశ. •—

క. ఆశయు యింద్రియజయము వి,నాశముఁ బొందించుఁ గావు•నం దొలఁగిన చే
నాశను సౌఖ్యము నిచ్చు ని,రాశయ యని పలికి యట్టి•దై నిద్రించెన్.
భారతము, శాంతి ఆ 4 పద్య 19.

చ. విసికితి దుర్గమార్గమయ • విభ్రమయుక్తిఁ గులాభిమానమున్
జనచెడ సేవఁ జేసితి వి•పన్నుఁడనై పరగేహసీమ వా
యసమువలెన్ భుజించితిఁ బ్ర•యత్నము నిష్ఫలమై నశించె సం
తసపడ వ్యగ్రకర్మపిశు•నత్వముఁ జూపెద వాశ యేటికిన్.

చ. నిధియనుశంక భూతలము • నిద్దపుఁ ద్రవ్వితి నావచే మహా
దధిఁ దరియించితిన్ శిఖరి•ధాతువులూఁగని కాఁచుఁ గొల్చితిన్
వ్యథఁగొని ఘోరమంత్రజప•మర్థి నొనర్చితి గప్పరైన నే
పిఫమునఁ బొందనైతిఁ గద•వే ముదమందఁగదే దురాశరో.

చ. పలుకలు పల్కుమాటు లోక•భంగి సహించితి బాష్పవారి లో
పలనె హరించి శూన్యమగు•భావమునన్ జెడనవ్వు నవ్వితిన్
బొలుపఱి విత్తజాడ్యహత•బుద్ధుల కంజలిఁ జేసితిం గటా
తలఁకక యింక నేపనికిఁ•దార్చెదు నన్ను దురాశ నీవిటన్. 3586
భర్తృహరిసుభాషితము, ఏ॥ ల॥ తృష్ణా పద్య 2-4.

—• మాయాప్రభావము. •—

సీ. ఉన్నది లేదని • యూహింపఁగా నేర్చు, లేనిది కలదన•లెస్స నేర్చు
నజడంబు జడమని•యాగడింపఁగ నేర్చు, జడ మజడంబని•చాట నేర్చు
సుఖము దుఃఖంబుగాఁ•జూపి చెప్పఁగ నేర్చు, దుఃఖంబు సుఖ మన•దొలఁత నేర్చు
నిది యది గాదని • యింపుగా నన నేర్చు, నిది యిది గాదని • యనఁగ నేర్చుఁ
తే. బిదపఁ గలదియుఁ గలదు లే•నిదియు లేదు, కడగియజడంబె యజడము•జడ మజడమ
సుఖమె సుఖముతలంపన•సుఖమసుఖము,అడిరయె యిదియిది యదియని•యాడ నేర్చు
సీతారామాంజనేయసంవాదము, ఆ 3 ప 81.

## — ♦ వేదాంతము. ♦ —

సీ. తనువను కాననలో ♦ నావలంబైయుండు, నరయ నహంకార ♦ మనుగృహంబు
పగర నాన్నృ నములలో ♦ పల నాల్గు శునకముల్, కరణంబు లన వాని ♦ గట్టిబెట్టి
గొలుసు మనసు దాన ♦ నురియించి బిగబట్టి, వాయునిరోధంబు ♦ వలలలోను
జేసి జ్ఞానము సు ♦ స్థిరదృష్టిఁ గీలించి, సరగ సోహంభావ ♦ శరము దీటి
గీ. కలితసద్ధైర్యమను కార్ముకంబు దొడిగి, వేడ్క హృదయవివేకంబు ♦ వేటకాఁడు
నవసనరిఁ గోలవేసి జ్ఞా ♦ నాగ్ని పండు, భక్తి భక్షింప బోయకు ♦ ప్రభువు సేర్పె.

ప్రభులింగలీల, పి। బస।। ఆ 4.

## — ♦ వైరాగ్యము. ♦ —

సీ. అనఘసుగుణాం ♦ బునకు బెట్టనికోట, యీషణత్రయమున ♦ కెదురుఁజుక్క
చింతామహాంబురా ♦ శికిని జెల్లెలికట్ట, రాగంబునకుఁ జేర ♦ రానిచేటు
బలవదంతర్వైరో ♦ ఘులకును వేవ్రాత్తు, శ్రేయోవధూటికి ♦ జీవగఱ్ఱ
చిత్తనైర్మల్యసం ♦ స్థితికిని విడిపట్టు, ప్రహ్లాదమునకును ♦ బట్టుఁగొమ్మ
గీ. మారు ఘనరత్నములకు వి ♦ హారభూమి, శమదమాదికములకును ♦ సంశ్రయంబు
దైన్యరసమున కెడదవ్వు ♦ హైన్యమునకు, నపరిదేశంబు వైరాగ్య ♦ మరసిచూడ.

విప్రనారాయణచరిత్రము, ఆ 1 పద్య 84.

## — ♦ అద్వైతమతము. ♦ —

క. సత్యము సత్యము సత్యము, నిత్యము యద్వైతమతము ♦ నిరుపమమఖిరా
హిత్యము మోక్షశ్రీసాహిత్యము మీరెల్ల సందియింపకుఁ డీకన్.

శంకరవిజయము, ఆ 2.

## — ♦ ఆత్మబుద్ధి. ♦ —

గీ. ఆత్మబుద్ధి సుఖం బిచ్చు ♦ నంతకన్న, గురువుసెప్పినసద్బుద్ధి ♦ పరులబుద్ధి
కొదవ దెచ్చును స్త్రీబుద్ధి ♦ కులముఁ జెఱచుఁ, గాన నాబుద్ధివిని సిరుల ♦ గనుము నీవు

దశావతారచరిత్రము, ఆ 4.

## — ♦ ఆత్మశక్తి. ♦ —

క. చెడు నాత్మశక్తి యెఱుఁగక, కడు గర్వముతోడఁ గడిఁది ♦ కార్యము చేయన్
దొడరి యవిచారమూఢుం, డడవిన్ గూపమునఁ బడిన ♦ యంధుఁడువోలెన్.

క. విను శక్యమైన కార్యము, చనుఁ జేయ నశక్యమైనఁ జనునే చేయన్
వననిధిపై శకటంబును, నోపరంగా మిట్ట నేల నోడయుఁ జనునే.

పంచతంత్రము, మా. నారా.

## —♦ ఏకాంక. ♦—

సీ. రాజేంద్ర విను మనః♦ప్రాణంబు లాత్మగా, దన్నిటి నెఱిఁగెడి♦యొఱుక యాత్మ
పుత్రమిత్రకళత్ర♦భూమ్యాదు లాత్మగా, దన్నిటి నెఱిఁగెడి♦యొఱుక యాత్మ
తాపత్రయంబులు ♦ తలఁపులు నాత్మగా, దన్నిటి నెఱిఁగెడి♦యొఱుక యాత్మ
యష్టాంగయోగాది♦నిష్ఠలు నాత్మగా, దన్నిటి నెఱిఁగెడి♦యొఱుక యాత్మ
ఆ. యట్టి యాత్మ నీవు♦యఖిలంబులును నీవు, నీవు నే ననుట♦భావ మీవు
గాన వేరు లేదు ♦ కైవల్యపదమార్గ, మేనటంచుఁ దలఁచు ♦ మెఱుక పవ్వ.

శ్రీరామస్తవరాజము. ఆ ౩.

## —♦ నియమము. ♦—

సీ. నియమంబు వాఙ్మనో♦నియమంబు శారీర, నియమంబు నింద్రియ♦నియమ మగును
నియమంబు గురుభక్తి♦నియమంబు సత్కర్మ, నియమంబు నాచార♦నియమ మగుచు
నియమ మాత్మజ్ఞాన♦నియమంబు నధ్యాత్మ, నియమంబు సంతుష్టి♦నియమ మగుచు
నియమంబు సద్గోష్ఠి♦నియమంబు దైవిక, నియమంబు నాత్మైక♦నియమ మగుచు
గీ. నియమమతులితసద్భావ♦నియమమగుచు, నియమమసదృశమోక్షార్థ♦నియమమగుచు
నియమమనుపమచిద్ధ్యాన♦నియమమగుచు, నియమమాత్మానురాగ♦సన్నియమమయ్యె.

విజ్ఞానప్రదీపిక, ఆ ౩.

# సాముద్రికము

గీ. తిర్యగూర్ధ్వంబు కొలువంగ♦దేహయష్టి, యెవ్వనికి వ్రేళ్ల నూఱును నెనిమిదియగు
మానమున వాఁడు ధరణిసా♦మ్రాజ్యపట్టబంధయోగ్యుఁడు భాగ్యవై♦భవము కలిమి
గీ. ముక్కు భుజములు లోచనం♦బులును జాను, హనువులును నైదు దీర్ఘంబు♦లగుట మేలు
మెడయు జంఘాయుగంబును♦మేహనంబు, హ్రస్వములు గాఁగ వలయు భా♦గ్యవంతునకు
గీ. నాభిరంధ్రంబు సత్త్వకం♦ఠస్వరములు, మూఁడు నత్యంతగంభీర♦ములు గవలయు
నంగుళీదేశజత్రిత్వ♦నంఘ్రిగుల్ఫ, పంచకము సూక్ష్మమైయుండు♦భాగ్యనిధికి.
గీ. కరములును గుక్షియును గటి♦స్కంధములును, ఫాలమును మోమునున్నతి♦వడయవలయు
హస్తరేఖాదృగంత జి♦హ్వాధరోష్ఠ, తాలునఖములు కెంపైన♦ధన్యుఁ డతఁడు.

గీ. కటియు వక్షస్థలంబును • నిటలతటము, విస్తృతము లెవ్వనికి వాఁడు • విభుతఁ గాంచుఁ
బదము గోనల మయ్యును • బాణికతిఁ, నుయ్యు నైశ్వర్య మొసఁగు మ • హానుభావ.

గీ. తాల్పు నెవ్వఁడు భ్రూలతాం • తరమునందు, వర్తులంబైన దక్షిణా • వర్తరేఖ
యాతఁ డేకాతపత్త్రమా • ట్లుగాఁగ, ధరణిరాజ్యంబుఁ బాలించు • ధన్యచరిత.

క. కమలోదరారుణములై, సమగుల్ఫములై మృదుత్వ • సంయుక్తములై
విమలారుణనఖరములై, చెమరింపని యడుగు లొసఁగు • సిరి మనుజులకున్.

సీ. లింగంబు కృశమైన • లెస్స మూత్రము దక్షి • ణావర్తవిస్తృతం • బైన మేలు
మధుగంధమైనను • మత్స్యగంధంబైన, నింద్రియంబు శుభంబు • నీనఁ జాలు
గంతనిర్హ్రాదంబు • క్రౌంచదుందుభిఘోష, గంభీరమగుట సౌ • ఖ్యప్రదంబు
చక్షుఃకనీనిక • సఘూకమధుచ్ఛాయఁ, బింగళంబై యిచ్చు • మంగళంబు

గీ. హస్తమిఱియించి పట్టిన • యప్పుడు కదిసి, యంగుళులు రంధ్రహీనంబు • లయ్యెనేని
నతనిఁ గల్యాణలక్షణా • న్వితునిఁగాఁగఁ, జెప్పు సాముద్రికజ్ఞాన • సిద్ధబుద్ధి

కాశీఖండము, ఆ 4 ప 24-32.

## —• స్వప్నఫలములు. •—

ఆ. స్వప్న మనఁగ సుప్త • జనమునశ్చేష్ట, యదియుఁ గాంచు నొగి న • నాగతములఁ
గాన కలలు సూచ • కము లగు భావిశు, భాశుభోదయముల • కనుచుఁ జెప్పె.

భారతము, అను. ఆ 5 పద్య 154.

క. మనమున విషయేంద్రియముల, పనులూహం జేసి కర్మ • ఫలములచేతన్
దనివోందక నానావిధ, జనితములగుచున్న యదియ • స్వప్నం బరయన్.

విజ్ఞానప్రదీపిక, ఆ 2.

క. పాయసముం గలలో భూ, నాయక భోజనము సేయు • నరులకు నంతే
శ్రేయస్కరమని స్వప్నా, ధ్యాయంబునఁ జెప్ప విందుఁ • దజ్జ్ఞులచేతన్.

శకుంతలాపరిణయము, ఆ 1.

సీ. ఋక్షవానరముల • నెక్కి పొడుచుఁ దాన, కాలుని దెసకేఁగఁ • గంటి ననియుఁ
దనమూలమున బొగ్గు • లును శిరోజంబులు, నుముకయు భక్షించు • చుంటి ననియు
నగ్నుఁడై జైనస • న్న్యాసి నవ్వుచు మ్రోల, గంతులు వేయంగఁ • గంటి ననియుఁ
దైల మాపాదమ • స్తమునందు వడియంగ, నుర్విపై నిద్రించు • చుంటి ననియు

గీ. నతిభయంకరమూర్తులై • యస్త్రధరులు, ఆలఁగొని రువ్విరనియును • నీలిచీర
కాంతబడి దక్షిణమువోవఁ • గంటి ననియు, స్వప్నమునఁ గన్న వారికిఁ జావు ధ్రువము.

జైమినిభారతము, ఆ 8 పద్య 103.

బనిలేనిపనిబక్క ♦ బలిసినబొసుకచిక్కినవాఁడు దెగు నెల ♦ లెనిమిదింట
నడుగుచొప్పునఁ బార్శ్వ ♦ ములైన వ్రేళ్లయినఖంబుఁ జిత్రమైనవాఁ డేడు ♦ నెలలఁ దప్పఁ

గీ. గాత్రయైన గర్భదైవ సం ♦ లూఁక మైన్క నెత్తి సోకినవాఁ డాఱు ♦ నెలలఁ గడయు
స్నానమర్దనవేళల ♦ పేనిచర్మ మదరువాఁ డైదు నెలలకు ♦ నంతరించు.

క. తనసీద వేఱె యొకలాగున నుండినవాఁడు నాల్గు ♦ నెలలకు నీల్గున్
ఘనరహితమైన మెఱపు జన్మునిదెసఁ గనువాఁడు నాలు ♦ నెలలకు నీల్గున్.

క. తనబింబ మద్దమునఁ జూచినఁ దల లేకున్న వాఁడు ♦ చెల్లును రెన్నె
ల్లను తనతనువు గసురువల చినపక్షములోనవాఁడు ♦ జీవముఁ దొఱఁగున్.

గీ. జలకమాడిన నవయవ ♦ ములకు మించి, హృదయమధ్యంబు జివ్వని ♦ యుండెనేని
నీరుఁ గ్రోలిన దాహంబు ♦ నిలువదేని, వాఁడు వేంచేయు సిరైదు ♦ వాసరములఁ.

క. మనుజులలోచనములలోఁ, దనరూపముఁ గానకున్నఁ ♦ దన వీనులలో
నను వ్రేళ్లు వెట్టి మూచిన, ధ్వని వినఁబడకున్న వాఁడు ♦ తడయక పొలియున్.

జైమినిభారతము, ఆ 8 ప 98-103.

## —♦ గ్రహములు. ♦—

సీ. విద్రుంమతజినోండె ♦ నెరయ వేల్కనియున్న, తఱినొండె సురసము ♦ దయముఁ గాంచి
బ్రమసినపలుకులు ♦ వలుకు మానవుఁ బొందు, నదియ దేవగ్రహ ♦ మని యెఱుంగు
నదిశయానుం డయ్యు ♦ వాసీచుఁ డయ్యుఁ బిత్ృశ్రేణిఁగని యున్మ ♦ దించెనేని
నది పిత్ృగ్రహము బ్రాం ♦ తాత్ముఁ డైవరుఁడు గంధర్వులఁ గనిన గాం ♦ ధర్వమనియుఁ

గీ. బరఁగు గ్రహము సోఁక దికాల ♦ పర్యయమునఁ, గదిసి భ్రమియించెనేనియు ♦ తుగ్రహంబు
వాతపైత్త్యాదివికృతుల ♦ వలన బుద్ధి దప్పుటయు నొక్క గ్రహవైకృ ♦ తంబ యండ్రు.

క. విను డెబ్బదియేండ్లగుదాఁక ను మానవులకు గ్రహోప ♦ ఘాతంబులు గ
ల్గు ననంతరంబ గ్రహముల పని వలవదు ముదిమి యొల్ల ♦ పనులకుఁ జాలున్.

క. నియతి గలిగి యింద్రియముల, జయించి శుచులైన శాంతి ♦ సంపన్నులకున్
భయ మొనరింపఁగ లే వ, వ్వయ పుణ్యగ్రహము లేయ ♦ వస్థలయందున్.

ఆ. ఆదిదేవుఁ డగు మ ♦ హాదేవుమీఁద నె, వ్వాని మనసు భక్తి ♦ వైభవమున
నల్లసిల్లు నతని ♦ నెల్లకార్యముల డగ్గఱవు సూవె గ్రహవి ♦ కారకృతులు. 3572

భారతము, అర. ఆ 5 పద్య 253-257.

## వృక్షపుష్పఫలలక్షణములు.

గీ. అవనితంగెడు రేలయు♦నవును కుసుమ, పూచె నేనియు ముద మగు భూమిప్రజకు
నళిని బూచినద్విజులకు♦త్పలము పూయ, క్షత్రియులకం ద్రుజయము వే♦కటనరేంద్ర.

గీ. జమ్మి చంద్రేలు గాచినఁ♦జాలపంట, గలుగు వేములు లెస్సగాఁ♦గాచె నేని
రోగములు లేవు ప్రజలకు♦భోగ మమరు, మిహిరసంకాశ వేంకట♦మేదినీశ.

సీ. శమిగొన మోదుగు♦కాయలో గింజలు, గట్టిగా మూడు జూ♦పట్టె నేనిఁ
గ్రమముగా నార్ద్రాది♦కార్తులు పదునాల్గు, నన్నియు వర్షించు♦నదియె గాక
మొదటిగింజయయున్న♦మొదటికార్తులయందు, నడిమిగింజయయున్న♦ననువుమీఱ
నడిమికార్తులయందుఁ♦గడగింజ యుండినఁ, గడకార్తులందును♦గలుగు వాన

తే. అందు నేగింజ కడుకొంచె♦మయ్యె నేని, తబకరై యుండె నేని త♦త్కార్తులందు
నల్పవర్షంబు గురియునం♦డార్యజనులు, కాంతినిర్జితచంద్ర వేం♦కటనరేంద్ర.

సీ. మఱ్ఱి రెయొద్దియు నిప్ప♦మారేడు నేరేడు, మెంతి గోధుమలును♦మినుము యవలు
కవిలియు నడవిలోఁ♦గలచెట్లు గాచిన, రెట్టఁ డల్ప మనెను♦బృథివిఁ బంట
కొడిసె బూచిన రుజ♦బొడము భూజనులకు, కడిమి గాచిన వాన♦కడచు యగును
జీడి గాచిన భీతి♦సిద్ధించు నాగకేసరులు గాచిన వాంతి♦సంభవించు
బిల్లు గాచిన నగ్ని♦భీతి సంధిల్లును, వెలగ గాచిన గాలి♦గలిగియుండు
బుడమలు గాచిన♦భూమిపాలకులకు, దళవాయులకును ప్ర♦ధానులకును

తే. దళములకుఁ జాల నన్యోన్య♦కలహ మొదవు, నేచి లొద్దుగ దిరిసెన♦పూచె నేని
పంట లల్పంబు లనియెను♦ బ్రాజ్ఞుఁ డగుచు, నేర్పుమీఱఁగ రెట్టకం♦దర్పుఁ డిలను.

రెట్టమతశాస్త్రము. ఆ 1 ప 59–64.

## మేఘవిషయము.

క. తరులవలె మేఘ మున్నను, విరివిగఁ దళుకెచ్చి తెల్ల♦విధముగ నున్నన్
ధనవర్షప్రదమగునని, గురుతరముగఁ బల్కె నయ్య♦క్రూరవిదారా.

సీ. మఱియు మేఘము జూడ♦మంచంబువలె కుంభి, కుంభంబురీతి సిం♦గంబు కరణి
చామరంబులతీరు♦చంద్రబింబముసొంపు, గోపురంబులు వెండి♦కొండలగతి
కొలనులు చెఱువులు♦గొడుగులు మకరముల్, దేవవిమానముల్♦దీటుగాను
శృంగారవనములు♦చెలువమౌ కత్తుల, విధము శంఖచయంబు♦వృషభములుగఁ

తే. గడిమి రాజసాలి♦గతిఁ గానుపించిన, వర్షమునకు హేతు♦వగుచునుండు
గానఁ దెలియుమిటులఁ♦గడుఁ బ్రేమననిపల్కె, సుఖమొసంగు మయ్య♦సుబ్బరాయ.

క. కోఁకయుత్తరపాండుఁ, బూరాభను మూల రోహి◆ణుల రేవతిలోఁ
బైరులు బెట్టుట యుత్తమ,మారసి చూడంగ వేంక◆టాద్రిన్పాలా.
క. మఱియుత్తరయును రోహిణి, వరుస ననూరాధనంత్య◆ వరబుకుమునన్
ధర జొన్న పైరుఁ బెట్టుట, కర ముత్తమ మనెను శెట్టి◆కవివరుఁ డధిపా.
గీ. అశ్విని ధనిష్ఠ శతతార◆ యార్శ్రవణము, మఱి పునర్వసు లెంచంగ◆ మధ్యమమును
బృహస్పలోపలఁ బైరులు◆ పెట్టఁగును, నిజము కొండ్రాజువేంకట◆ నృపవరేణ్య.
గీ. జ్యేష్ఠయు విశాఖ కృత్తిక◆చిత్త యార్ద్ర,భరణి పూర్వత్రయంబునఁ◆ బైరు లిడుట
సరసిచూడంగ నిష్ఫలం◆బనఁగ (బగను,వితతనయసాంద్ర) కొండ్రాజు◆వేంకటేంద్ర.
సీ. తొలుతగంధాక్షతల్◆ ధూపోపహారముల్, గొఱ్ఱుజడ్డిగమున◆ గొసఁగవలయు
హర్షంబుతో జొన్న◆లాదిగా ధాన్యముల్, విత్తిన ఫలియించు◆ వెలితిలేక
విత్తుచుండెడివేళ◆ వెగపగ్గంబైన, మోకులైనను వెస◆ముఱిసెనేని
యెద్దులు రొప్పగ◆ నెద్దులు పడెనేని, యులపంటరాచకా◆ర్యములచేత
తే. జెడును మునుయెద్దు పడినదో◆షంబుచేత, చోరులకు నైన యనువునఁ◆ జేరుగాని
తకులు నాకాపుతమ్ముగ◆ దళము మీఁదఁ, గల్గుహానియనెను శెట్టి◆ఘనుఁడు మహిని.
సీ. విత్తుచుండెడివేళ◆ వినుపైడికంబైదా, పలరొప్పి నిలిచిన◆ వలపటికిని
గాడిదముంగిస◆ కాకంబు వోయిన, శునకంబు వామది◆క్కునకుఁ జనినఁ
జెలఁగి పుణ్యాంగనల్◆ సేసలుచల్లిన,ముదమున వేదముల్◆ చదువుచున్న
విత్తైనప్పుడు◆ వృషభంబు లెడముగా, జాలువాఱిన మఱి◆ చాలు దిరిగి
వచ్చెడో నెద్దులు◆ వలపట దిరిగియు, వచ్చిగీములుజేర◆వచ్చుతఱిని
ధాన్యంకుంబురొప్ప నవ్వారిగాఁ బైరవ,శ్యంబును ఫలియించు◆ చక్కఁగాను
తే. శెట్టి కవివర్యుఁ డీరీతి◆ పట్టుదెలిసి, గట్టిగాఁ బల్కె నిలలోన◆ దిట్టఁడగుచు
సరసు లెల్లను విని చాల◆ సంతసింప,నర్థికల్పకవరవేంక◆టాద్రివర్య.

—◆ వరిచేనుకోఁత ◆—

సీ. కోరిపండినపంటఁ◆ గోయఁ బోయెడువేళ, వలపటఁ గాకంబు◆వచ్చి మఱియు
బల్లిపల్లిన యామ◆భాగంబునందునఁ, జేష్టలు గావింపఁ◆ జేనికల్లి
షేటియేనుంగులు◆ మించుటద్దంబులు, ననఁటికంబంబులు◆ నట్లు పూర్ణ
కలశంబులును వన్నె◆గట్టినకోకలు, వీక్షింప ధాన్యసు◆వృద్ధి మఱియు
తే. నట్టి ధాన్యంబు లలరుట◆లంతలేక, యిల్లు చేరును గాఁపుల◆ కింపు మీఱ
రసికమందార పెద్దతిమ్మ◆రాజకుమార, వేంకటక్ష్మాప సర్వజ్ఞ◆సింగభూప. ౩౮౬౮

గీ. పైకఁ గోయ, బోవ ♦ బాటింప విభవ కుం,జేలు నన్ని కనవు ♦ తెక్కకాతి
వాతిఁ జూచి రేని ♦ వారికి నాపంటు, దక్కు దనియె శెట్టి ♦ కుక్కు దినాళ.
శెట్టిసుతశాస్త్రము. ఆ ౫ ప 2-28.

## —♦ గ్రహణము ♦—

సీ. ఫణిరాజు తల్పంబు పైఁ బద్మనాభుండు, తిన్నగా శయనించు ♦ వన్నెఁ దోడి
తనరు శ్వేతద్వీప♦మున గాఢతమి నొక్క, దెసనుండి పద్వేదు ♦ పస హసించి
క్రమమునఁ బుప్పగు♦చ్ఛము మీఁద మగతేటి, మొత్తంబు వ్రాలెడు ♦ గతి హిమాద్రి
హిమశైలతుంగశృం♦గమున నీలాభ్రంబు, పర్యాయమునఁ గప్పు♦ భాతి మెరయ
గీ. సారకర్పూరడిండీర ♦ హారహీర, తారకోదారధవళాంశు ♦ వారకలిత
నీరజారాతిబింబము♦న్నిదరిరౌద్ర,గతి గ్రసించెను రాహు వ♦క్కాలమునను.
హంసవింశతి. ఆ ౫ పద్య ౬13.

సీ. ఉత్తరాషాఢయు ♦ నుత్తరాభాద్రియు, హస్తపునర్వసు ♦ లశ్వినియును
చిత్త నుత్తరయును♦ జెలఁగు నీయేడుతా,రల వాయుదిశనుండి ♦ గ్రహణమైన
నరులకుఁ జిన్నవాం♦ద్రకు వ్యాధి గల్గును, ధాన్యంబు దఱుగు యు♦ద్ధంబు లగును
కోపంబు బహుళంబు ♦ కొంచెమౌ వానయుఁ దర్శించి చూడంగ ♦ ధరణియందు
తే. సరవి నీచెప్పినట్టిదో♦షములలోన, నొక్కటైనను గల్గిన ♦ నుర్వియందు
నత్యుదగ్రతఁ బకుతి♦యంబులోన, ననియె శెట్టఁడు సకలవి♦ద్యావిదుండు.
శెట్టిసుతశాస్త్రము. ఆ 3 ప 44.

## —♦ అశ్వలక్షణాదులు. ♦—

క. పెట్టిన మొదవిరదంబులు, బుట్టిననొకనేడు నడిమి♦పళ్లను నొవరం
బుట్టినరెండేడులు తుద,బుట్టిన మూడేళ్లు నిట్టి♦పరువడి నడచున్.
గీ. ఈనవవ్యంజనంబులు♦యట్లు నడువ, నెలమి యిరువదియేడేండ్లు♦యిందులోనఁ
దొలుత నైదేండ్లు గూడగ తురగమునకు,నరయ ముప్పదిరెండేండ్లు♦యాయువయ్యె
క. ధురిపులు పది యశ్వజాతికి, నవితక్కువయైనతురగ♦మల్పాయు వగున్
నవరించుబతి కరిష్టము, నవరించరుగానబుధులు♦సహియించరుగా. 3601
క. బాహులను సుళ్లుగలిగిన, బాహోవర్తంబులంద్రు ♦ ప్రభులకు నెపుడున్
బాహుల్లను నొడుగ తొడవులు, ఆహవమున జయము నొసఁగు♦నరిబలశ్రేణి.

క. పరగిన మొగమును నాలుగు,చరణంబులు తెలుపు గలుగ ♦ జయ మొసగు నరే
శ్వరునకు నత్తురగం బిల, ఖరకరనిభ తేజ పంచ♦కల్యాణి యగున్.

క. నాలుగుకాళ్లుం గొనచెవి,వాలము వదనమువిశాల♦వక్షము తెలుపై
గ్రాలునది యష్టమంగళి, నేలినపతి యేలు ధరణి♦నేలినపతులన్.

క. పట్టముక్రియ ఫాలంబున, నెట్టణమున సుళ్లు మూడు♦నేర్పడియున్నన్
గట్టుము హయమును శాలను,సృష్టికి బతి యతఁడు సుమ్మ♦శీఘ్రగమతిఁ దలఁపన్.

క. కుత్తుకసుడిగలతురగము, చిత్తజనిభుడైన నేమి ♦ సిద్ధము దలఁపన్
ఉత్తమపురుషులు విలువరు, నిత్యంబును జూడజముని ♦ నిలయము కేఁగున్.

క. పట్టును గోడిగ నేక్రియ, సృష్టీశ్వర వెనుకపదము ♦ సితమై యున్నన్
నెట్టనమూత్రము విడినను, బుట్టువుదోషంబులండ్రు ♦ బొల్లరెలేమిన్.

క. వెన్నున సుడిగల తురగము, కన్నంతనె విడక యెక్కి♦గడగుట యెల్లన్
మున్నుగొని బ్రహ్మఘాతుకుఁడున్న మహీజంబు నెక్కి♦నుబ్బుట తలఁపన్.

క. మును చెంపలరోమజములు, గను పట్టు హయంబు నెక్కఁ♦గడఁగుట యనిలోఁ
దనభటులఁ దాను తథ్యము, నెనుబోతును ప్రియమూతోడ♦నెక్కుట కృష్ణా.

సీ. అశ్వంబునకుఁ బర♦మాయుః ప్రమాణము, పదులుముప్పదిరెండు♦వత్సరము లు
పరమాయువందులోఁ♦బదియవభాగంబు, తనరారు నొకదశ♦యనఁగఁ బరగు
మూడేళ్లు రెన్నాళ్లు♦మూన్నాళ్లుదివసంబు, లొకదశకలదియై♦యొప్పుచుండు
నత్తెఱంగునదశ♦లయిదును రెండును చెవులుండినన్నియ♦క్షేత్రములను

గీ. పదిలమైదశా క్షేత్రంపుబద్ధతులను లావణంబులునున్నట్టి♦లాగెరింగి
చెప్పఁగాఁదగుపత్ఫలమొప్పుగాగ, రాజదేవేంద్రయాభళి రాజచంద్ర. 3610

సీ. గార్ధభంబు కోతి♦కరణిని మఱిసల్ల,కాకిపగిది జంబు♦కంబుజాడ
నూరఁబందిభాతి ♦ నుష్ట్రింబువిధమునఁ, గడఁగి రవము సేయఁ ♦ గాంతిఁ జెఱచు.

అశ్వశాస్త్రము.

# వాస్తులక్షణాదులు.

సీ. ఊసరభూములఁ♦నూరికి నడుమను, గోణదేశంబుల ♦ గుంటపట్ల
నీళ్లుపారెడుచోట ♦ నిందితంబగుతావు, పరగంగ గుడినీడ ♦ బాదు నేలఁ
బుట్టలెత్తెడుచోటఁ♦జెట్టుబొందెడుచోట, గోగణంబులు మంద♦గూడుచోటఁ
దగ్గైనపుణార్కి♦తనయులదెసలను, బిలసమీపమునందుఁ ♦ బ్రేతభూమిఁ

ఆ. చేసె నెయ్యి పెరుగు ♦ విూను రక్తంబును, కసము పిట్టకంపు ♦ లపనకరము
తగదు యిండ్లఁగట్టఁ దథ్యంబు నరులకు, వాస్తుశాస్త్రసహితము ♦ వాక్రిజాక్ష.

—♦ మాసఫలలక్షణములు. ♦—

సీ. చైత్రంబు ధనహాని ♦ జయము వైశాఖంబు, జ్యేష్ఠంబు మృతకీర్తిఁ ♦ జేయు నిజము
ఆషాఢమునఁ బశు ♦ హారణంబు శ్రావణంబున భృత్యసంతతి ♦ మొనయఁ జేయు
భాద్రపదంబున ♦ బహురోగములు నొందుఁ, గలహ మాశ్వీజఁజేయుఁ ♦ గార్తికంబు
శ్రీపదంబగు మార్గ ♦ శీర్షంబు భయమగు, నల పుష్యమునఁ జెందు ♦ నగ్నిభయము
గీ. భాగ్యకరమగుమాఘంబు ♦ ఫాల్గునమున, రత్ననాశంబుఁజేయు ప్ర ♦ యత్నగుణము
అధికమాసము క్షయమాస ♦ మశుభదంబు, లనుచుఁ జెప్పిరి మునివరు ♦ లబ్జనాభ.

—♦ శంకుస్థాపనలక్షణములు. ♦—

గీ. శంకుసంస్థాపనంబును ♦ జేయుటకును, శుక్లపక్షంబులో నెన్న ♦ శోభనంబు
నందరిక్తలుదర్శయు ♦ నష్టకారి, సౌమ్యగురుశుక్రివారముల్ ♦ సౌఖ్యకములు
గీ. శతభిషశ్రవణోత్తరా ♦ షాఢహస్త, రేవతి స్వాతి రోహిణి ♦ మృగశిరాశ్వ
యుత్తర పునర్వసు ధనిష్ఠ ♦ చిత్త పుష్య, లలను నిశ్చేష్టలైశంకు ♦ నిలుపుతగిని.
గీ. శంకుస్థాపనసంభవ ♦ సంగతులకు, మొదటిజాముత్తమము రెండు ♦ మొదమువూట
నధమమగుజాల్గిటనుసంధ్య ♦ లందు రాత్రి, లందు నింద్యము వాస్తుసి ♦ ద్ధాంతపథవ.

—♦ మాసక్రమవాస్తుపురుషస్థితి. ♦—

సీ ఊర్వి భాద్రపదాశ్వ ♦ యుజ కార్తికంబుల, నల వాస్తుప్రాగ్దిశ ♦ తలగ దొను
మార్గశీర్షముపుష్య ♦ మాఘమాసంబులు, దక్షిణశిరసుఁడై ♦ తనరియుండు
వరుసఫాల్గుణచైత్ర ♦ వైశాఖములయందు, బడమటితలగడై ♦ పవ్వళించు
సరవిజ్యేష్ఠాషాఢ ♦ శ్రావణంబులయందు, నుత్తరశిరసుఁడై ♦ యుండునెపుడు
ఆ. వామశాయి యగుచు ♦ వర్తించు నిరతంబు, నతని దృష్టి పథము ♦ నందు నిండ్లు
గట్టిరేని మృత్యు ♦ ఘనరోగములఁజెందు, శిరమునందు వెనుక ♦ సిరులు కృష్ణ.

—♦ పక్షఫలము. ♦—

ఆ. శుక్లపక్షమునను ♦ శుభములు సేకూరుఁ, గృష్ణపక్షమైనఁ ♦ గీడుఁ జేయుఁ
బక్షములను రెండిఁ ♦ బరికించి గృహములు, గట్టిరేని సుఖము ♦ గలుగుఁ గృష్ణ.

— తిథిఫలనిర్ణయము. ♦—

ఆ. నందతిథులయందు ♦ నర్థహానర్థంబు, భద్రతిథులయందు ♦ బంధనంబు
దగ్ధరిక్తలందు ♦ దప్పదుమృత్యువు, పూర్ణజయలశుభము ♦ బొందుఁ గృష్ణ. 3619

గీ. మానుకాటుపెట్టి మంజిష్ఠకలరవ, తైలగుడపిశంగ నీలకపిల
కాంతులున్న గస్ప గౌళి తేలువరాయి, యిడుముపాము నిల్వఁదగదు కృష్ణ.
క. భూజములు నలుకుతటివి, (భ్రా)జితముగ దక్షిణమునఁ బశ్చిమమున బల్
తోఁచుఁ బడినను గీడగు, రాజితముగఁ దూర్పునుత్తరముల శుభంబుల్. 3638

—◆ మాసద్వారనిర్ణయము. ◆—

మ. మును దా శ్రావణికంబునందు భవనంబుల్ గట్టిరం దూర్పది
క్కైయున వాకిలి నిల్పి కార్తికమునం దింపొందఁ దద్దక్షిణం
బున నమ్మాఘమునందు బశ్చిమదిశన్ బొందింప యుక్తంబగున్
జను వైశాఖమునందు నుత్తరదిశన్ శాస్త్రోక్తి సర్వేశ్వరా.

—◆ చోరాదిఖండిక ◆—

ఆ. వైరిచోరరాజవహ్నిభయంబుల, వలన బయలు దేఱు వెలయుఁ గండి
కెలమి లక్షణంబు వలదు గూఢంబుగా, వలయుచోట నిలుపవచ్చుఁ గృష్ణ.

—◆ ద్వారబంధలక్షణాదులు. ◆—

గీ. సప్తతాలోన్నతంబు నై చఁగఁ ద్రితాళ, మాయతము ద్వారబంధంబులందుఁ దగును
నిడుపుతొమ్మిది పాళ్లును వెడలు నైదు, పాళ్లతోనైనఁ దగు ద్వారబంధమభవ.
గీ. దాయవులు రెంటి ద్వారబంధంబు తగదు, మంచమునమూఁడుజాతు లమర్పరాదు
తలుపుసరిపల్కలయియున్నఁ దగదటండ్రు, తొడరిదూలమునడుముగా నదువరాదు
గీ. బయటివాకిలి కెదురుగాఁ బరునింటు, వాకిలియు గోడమూలయు వైర మొదవు
యింటిలోనైన వాకిలి కెదురుగాను, గోడమూలయు గంబముల్ జూడరాదు.
క. బట్టకెలన్ ద్వారంబును, పట్టఁ దగ్గయినచోట నిలయంబు వెసన్
గట్టిక మేలు దొలంగును, కొట్టము వెనుగాడి నిడివి గూడదు నడవన్. 3639
గీ. మూలతలవాకిలైయున్న మేలు దొలఁగు, కొంచమైయున్న బాడవైనఁ గూడదండ్రు
యెదురుగా వాకిటను బరునింటిదీపకాంతి తోఁగిటు వెలుఁగ రోగప్రదంబు.

—◆ దూలములు ◆—

సీ. తనరు సూత్రాదిప్రదక్షిణంబుగ దూలములు చౌకములుగూర్చవలయునప్పుడు
ఆగ్నేయముపను మూలాగ్రసంయోగంబు, మూలఁబు మూలంబు నైనయది నైరృత్య
దిక్కునఁ బవమానదిశ యగ్రమూలసంఘటనంబు నీశానుకడను బొల్చు
నగ్రమగ్రము దీనికభిధానములు తూర్పు, గజమై నబోతు భానుజునికడను.

గీ. వృషముపడమటనుత్తరం • బెనయునజము, గజముపై పోతు పోతుపై • కపకుక్కతాను
వృషభగజములపైనజం • బెసఁగు వరుస, తెలిసికూలము లెత్తగా • వలయుఁ గృహము.

— • గోడలప్రమాణము. • —

మ. పదిజేనల్ పొడవైనగోడ ద్విజభూ • పాలప్రశస్తంబు తొ
మ్మిదిజేనల్ మఱి వైశ్యశూద్రులకు నె • మ్మిన్నంకరశ్రేణి కె
న్మిదిజేనల్ మఱివీటికెక్కువయినన్ • మేలొందు లోభంబు చె
ల్లను మందంబిడ మూరెడాది తగు నీ • హస్తాంతపర్యంతమున్.

— • గోడపెట్టెడులక్షణము. • —

క. తినదినము గోడ బెట్టఁగ, నెనయఁగ నృత్తిక గ్రహింప • నిశాన్యమునన్
దనరుచు మూరెడుకీలును, నొనరిచి మఱి గోడ బెట్టు • నుచితము కృష్ణా.

— • గోడవిరిగినఫలము. • —

క. కేలిమిగ గోడ బెట్టఁగ, గ్రీలిన దస్కరభయంబు • వెళ్ళినగినచో
నాలమ్ములో విరిగిన నిల్లాలికి భయమగు నట యదు • రార్యులు కృష్ణా.

— • కిటికీలు. • —

క. నానావిధహర్మ్యములకుఁ, బూనఁగఁదగు చిత్రకములు • పొలుపుగఁ జుట్టున్
మానుగ గృహస్థులిడ్లకు, భానుజదిశఁబశ్చిమమునఁ • బరగు గవాక్షల్.

— • గృహోన్నతిసూత్రము. • —

గీ. మూలమునకును భూమికి • నాలు పట్టి, ఎన్నియంగుళులగునవి • యెనిమిదింటు
పాలుగొని శేష మాయమా • ల్వరగునందు, బేసులు శుభంబు సమలందు • వెరయుఁగీడు

గీ. తల్లి దండ్రియు నన్నలు • దక్షిణమునఁ, బశ్చిమంబుననుండిన • భద్ర మగును
ఉత్తరము తూర్పు జరుపంగ • నుత్తమంబు, దక్షిణంబునపడమర • తగదుకనుప.

— • అష్టభాగగృహలక్షణము. • —

మ. అరయన్ మజ్జనశాల తూర్పుదెసఁ బా • కాగారమాగ్నేయమౌ
యరుతన్ సుప్తగృహంబు యామ్యమున న • స్త్రాగారమౌ నైఋతిన్
గురియౌ భోజనశాల పశ్చిమమునన్ • గోశాల వాయువ్యము
త్తరమందున్ ధనశాల శంకరుదెసన్ • దేవాలయంబున్ దగున్. 4648

### —♦ వివాహవేదిక. ♦—

గీ. వెలవు నిమ్మపున వాల్గుచే♦తులున నొకటి, పొడవువేదిక యింటికి♦ యెడమదిశను
చవికె యొనరించి సోపాన♦సరణిఁగూర్చ, విభవము భాసంగ వైవాహ♦వేదియందు.

### —♦ వివాహవేదికాస్తంభలక్షణము. ♦—

సీ. మృగపతిత్రయమున ♦ మిహిరుఁడు నెలకొన్న, హరునికోణంబున ♦ నమరవలయు
నళికత్రయంబున ♦ హరిదశ్వుఁ డుండిన, ననిలకోణమునందు ♦ నునుపవలయుఁ
గలశత్రయంబునఁ ♦ గమలాప్తుఁ డుండిన, దైత్యకోణాదిగాఁ ♦ దలఁపవలయు
వృషభత్రయంబున ♦ నుష్ణదీధితియున్న, జ్వలనదిశాదిగా♦ దెలుపవలయు
గీ. ధరణి పరిణయవేదికా♦స్తంభసమితి, నిలుపుటకు వాస్తుశాస్త్రోక్త♦నిర్ణయంబు
గాక వేరొక్కవిధముఁ ♦ ఘాత పయిన, సంపదలు లేక హానియౌ♦ దంపతులకు.

### —♦ నుయ్యిత్రవ్వుట. ♦—

సీ. ఈశాన్యమున వృద్ధి ♦ గేహప్రాగ్దు నపునను, పొలుపొందు తూర్పునఁ♦ గలిమిఁ జెందు
ఆగ్నేయమునఁ బుత్ర♦హరణంబు గావించు, శమనుదిక్కున నున్న♦ సతికి నష్టి
నిరుతిదిశయందు ♦ నగయు మృత్యుభయంబు, పశ్చిమంబునఁ గల్గు♦ భాగ్యమెపుడు
వాయువ్యమునఁ బచ్చు ♦ వైరులచే బాధ, యక్షరాడ్దిశయందు ♦ నల్పసుఖము
గీ. మధ్యమంబున ద్రవ్యంబు ♦ మడిసిపోవు, నవని నీరీతి దిక్కులఁ♦ గరసి త్రవ్వ
వలయు బావుల నిలయందు♦ నెళవు దెలిసి, సుగుణులైనట్టి మానవుల్ ♦ నిగమవేద్య.

### —♦ పొయ్యినివేయులక్షణము. ♦—

గీ. వహ్నినక్షత్రమునఁ గుజ♦వాసరమున, లగ్నమున నైనసప్తమ♦రాశియయిన
గుజుఁడు వసియించుతరి హోమ♦గుండములును, బ్రాయిలు పొందింప♦ భాగ్యముల్
పొదలుఁ గృష్ణ.

### —♦ మంచములకు, పీఁటలకు. ♦—

క. శయ్యాసనయత్నంబులు, చయ్యన రచియింపధ్వజమ్ము♦ శుభసింహములన్
నెయ్యంబగునితరక్రియ, లొయ్యన రచియింపధ్వజమె♦యుత్తమముహరీ. 3658

### —♦ కంచములు తొలిచి నీళ్లను చల్లుదిశలకు ఫలము. ♦—

గీ. ఎలమిభుజియించుకంచముల్ ♦ తొలిచి చల్లు, దిశలఫలమెత్తు సురపతి♦దిక్కు మొదలు
గాఁగఁ గల్మియు వాహనభం♦గమును మృతియు, తెవులు సిరిపగ ధనముభూ♦తియును గృష్ణ

శ్రీకృష్ణవాస్తుశాస్త్రము.

తే. అనఁగ వేఱొక్క గొల్లత♦యమ్మ వినుము, బావిలోపల యవటిండి♦పంచదార
యొదవఁగలపి మూఁలను దాఁచి♦యుండ వచ్చి, తినియె నంతయుఁ గృష్ణుండు♦ దేవరాన.

హరివంశము, ఆ ౬.

క. బాలురకుఁ బాలు లే వని, బాలెంతలు మొఱలు వెట్టఁ ♦ బకపక నగి యీ
జాలిం దాలము సేయుచు, నాలకుఁ గ్రేపులను విడిచె ♦ నంభోజాక్షీ.

క. పడతీ నీబిడ్డఁడు మాకడవలలో నున్న మంచి♦కాఁగినపాలా
పడుచులకుఁ బోసి చిక్కానకడవలఁ బో నడిచె వాఙ్మ♦గలదో లేదో.

క. మాపాపఁడు మాగృహముల, నాపోవఁగఁ బాలు ద్రావ ♦ నగపడకున్నం
గోపించి పిన్నపడుచులు, వాపోవఁగఁ జిమ్మికొనుచు ♦ వచ్చెం దల్లీ.

మత్తకోకిల. పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁ♦బోయి మాయలు సొచ్చి తా
నట్టి యందక జోలుఁ దీఁటులు ♦ నొక్కట్రో విడి యెక్కి చే
వెట్టఁ జాలక కుండకిం దొక ♦ పెద్దతూఁ టొనరించి మీ
పట్టి మీగడ పాలుఁ జేరలఁ♦బట్టి త్రావెఁ దలోదరీ.

క. ఆడం జని వీరలపెరుఁ, గోడక నీసుతుఁడు ద్రావి ♦ యొకయించుక తాఁ
గోడలిమూఁతిం జరిమినఁ, గోడలు ద్రుము చ్చనుచు నత్త♦గొట్టె లతాంగీ.

క. వారిల్లు సొచ్చి కడవలఁ, దోరం బగు నెయ్యి ద్రావి ♦ తుది వాకడవల్
వీరింట నీసుతుం డిడ, వారికి వీరికిని దొడ్డ♦వా దయ్యె సతీ.

క. వేలుపులకై నాకం దెచ్చు, వేలుపు మతి యెవ్వఁ డనుచు ♦ వికవిక నగి చూ
వేలుపులగోడపై నో, హేలావతి నీతనూజుఁ♦డెంగిలిఁ జేసెన్.

క. వెన్నఁ దినఁగఁ బొడగని మా,పిన్నది యడ్డంబు వచ్చి ♦ పిత్తీఁదికిఁ దివియం
జ న్నొడిసిపట్టి చీరెను, జిన్నికుమారుండె యితఁడు ♦ శీతాంశుముఖీ.

క. ఇమ్మగువ దన్ను వాకిటఁ గుర్రిమ్మరుచోఁ జీరి విలిపి♦కొని పేరడుగం
గొమ్మావిఁ గఱచి వడిఁ జనె, నమ్మా యీముద్దుఁగుఱ్ఱఁ ♦ డల్పుఁడె చెప్పుమా.

క. చేబంతి దప్పి పడె నని, ప్రాబల్యముతోడ వచ్చి ♦ భవనము వెనుకన్
మాబిడ్డ జలక మాడఁగ, నీబిడ్డఁడు వలువ దెచ్చె ♦ నెలఁతుక తగునే.

క. ఇచ్చెలువఁ జూచి మురిచ్చిలి, యచ్చుగ నుటికించుకొనుచు ♦ నరిగెద నాతో
వచ్చెదవా యని యన్నా,డిచ్చిఱుతఁడు సుదతి చిత్ర♦మిట్టిది గలదే.

క. కొడుకుల్లే రని యొకసతి, గడు వగవఁగఁ దన్ను మగవిఁ♦గాఁ గైకొనినం
గొడుకులు గలిగెద రని నైఁబడినాఁ డిది వినుము శిశువు♦పనులే తల్లీ. 3672

గొంతుకూర్చొనొక్కచోట ♦ దొర్లించు పరికించు,నొకచోట మెట్లపై ♦ నట్లికెక్కు-
నుతిగాయనొక్కచోట ♦ మార్గ్వంబుఁగావించు,నొకచోట మాయావి ♦ యోజఁదిరుగు
గీ. నాదుగునొక చోటఁగికురించునొక్కచోటఁజిక్కునొకచోటఁబర్విడునొక్కచోటఁ
జిక్కుముచ్చటలాడు న ♦ వ్వొక్కచోట, వల్లవార్భకమౌళి వ్రే ♦ పల్లెయందు

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 4.

## —♦ కృష్ణుఁడు చల్దులారగించుట. ♦—

శా. ఎండన్ మ్రగ్గితి రాఁకటం బడితి రిం ♦ కేలా విలంబింపఁగా
రం డో బాలకులార చల్దిఁ గుడువన్ ♦ రమ్యస్థలం బిక్కడే
దండన్ లేఁగలు నీరు ద్రావి యిరవం ♦ దం బచ్చికల్ మేయుచుం
దండంబై విహరించు చుండఁగ సమం ♦ చద్ప్రీతి భక్షింతమే.

మ. జలజాతస్థితకర్ణికం దిరిగి రా ♦ జత్సంఘంబు లై యున్న రే
కులచందంబునఁ గృష్ణునిం దిరిగి రాఁ ♦ గూర్చుండి వీక్షించుచున్
శిలలున్ బల్లవముల్ దృణంబులు లతల్ ♦ చిక్కంబులుం బువ్వు లా
కులు కంచంబులు గా భుజించి రచటన్ ♦ గోపార్భకుల్ భూవరా.

సీ. మాటిమాటికి వ్రేలు ♦ మడిచి యూరించుచు, నూరుగాయలు దిను ♦ చుండు నొక్కఁ
డొకనికంచములోని ♦ దొడిసి చయ్యన మ్రింగి,చూడు లేదని నోరు ♦ చూపునొక్కఁ
డేగు రార్గురచల్దు ♦ లెలమిఁ బన్నిద మాడి, కూరొక్కనికొక్కొని ♦ కుడుచు నొక్కఁ
డిన్నయుండఁగఁబంచి ♦ యిడుట నెచ్చెలితనమనుచు బంతెనగుండు ♦ లాడునొకఁడు
ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ ♦ గికురించి వడి బ్రోల,మేలిభక్ష్యరాశి ♦ మెసఁగునొకఁడు
నవ్వునొకఁడుసఖుల ♦ నవ్వించునొక్కఁడు,ముచ్చటాడునొకఁడు ♦ మురియునొకఁడు.

సీ. కడుపున దిండుగాఁ ♦ గట్టినవలువలో, లాలితవంశనా ♦ ళంబుఁ జొనిపి
విమలశృంగంబును ♦ వేత్రదండంబును, జాఁటి రా నీక డా ♦ చంక నిఱికి
మీఁగడపెరుఁగుతో ♦ మేళవించినచల్ది,ముద్ద డాపలిచేత ♦ మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తె ♦ చ్చినయూరుగాయలు, వ్రేళ్లసందులయందు ♦ వెలయనిఱికి
ఆ. సంగడీలనడుమఁ ♦ జక్కఁగఁ గూర్చుండి, నర్మభాషణముల ♦ నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ ♦ డమరులు వెఱఁగంద, శైశవంబు మెఱసి ♦ చల్ది గుడిచె.

భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 493-498.

## —♦ మృద్భక్షణము—విశ్వరూపప్రదర్శనము. ♦—

క. మన్నేటికిభక్షించెదు, మన్నియమము లేల నీవు ♦ మన్నింపవు మీ
యన్నయు సఖులును జెప్పెద,రన్నా మన్నేల మఱి ప ♦ దార్థము లేదే. 8689

శా. అమ్మా మన్నుదినంగ నే శిశువనో • యాకొంటినో వెఱ్ఱినో
నమ్మం జూడకు వీరిమాటలు మదిన్ • నన్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కా•దేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము సేసి నావచనముల్ • దప్పైన దండింపవే.

క. ఆలలితాంగి గనుంగొనె, బాలునిముఖమందు జలధి•పర్వతవనభూ
గోళశిఖితరణిశశిదిక్పాలాదికరండ మైన • బ్రహ్మాండంబున్.

మ. కలయో వైష్ణవమాయయో యితరసం•కల్పార్థమో సత్యమో
తలఁపన్ నేరక యున్నదాననొ యశో•దాదేవిఁ గానో పర
స్థలమో బాలకుఁ డెంత యీతనిముఖ•స్థంబై యజాండంబు ప్ర
జ్వల మై యుండుట కేమిహేతువొ మహా•శ్చర్యంబు చింతింపఁగన్.

ఆ. బాలమాత్రుఁ డగుచు,లీలనిముఖమందు, విశ్వ మెల్ల నెట్లు • వెలసి యూరకు
బాలుభంగి నితఁడు • భాసిల్లుఁగాని సర్వాత్ముఁ డాదివిష్ణుఁ • డగుట నిజము.

ఆ. ఏమహాత్మువలన • నీవిశ్వరూపంబు, గానఁ బడిన బుద్ధి • కంప మయ్యె
నామహాత్మువిష్ణు • నఖిలలోకాధారు, నార్తు లెల్లఁ బాయ • నాశ్రయింతు.

క. నామగఁడు నేను గోవులు, నీమందయు గోపజనులు • నీబాలుని నె
మ్మోమున నున్నవిధము గని, యేమఱితిమి గాని యింకుఁ • డీతఁడు మాకున్.

క. జడనుపడి రోలుకొనెడి యా, పడఁతుక సర్వాత్ముఁ డనుచుఁ•బలుకక మఱలిం
గొడుకని తొడపై నిడుకొని, కడువేడుకతోడ మఱత • గావించె నృపా.

భాగవతము, స్కం 10 పూర్వ పద్య ౩౩౫-౩౪౮.

—• ఉలూఖలబంధనము—యమళార్జునభంజనము. •—

క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ, జిక్కఁడు సనకాదియోగి • చిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావళిఁ, జిక్కె నతఁడు లీలఁ దల్లి•చేతన్ ఱోలన్.

క. తజ్జననిలోఁగిటంగల, రజ్జుపరంపరలఁ గ్రమ్మ•ఱన్ సుతుఁ గట్టన్
బొజ్జ సిరిగిరా దయ్యో జగజ్జాలము లున్నబొజ్జఁ • గట్టన్ వశమే.

ఆ. ఒడలఁ జెమట దొరగ • నుత్తరీయము జాఱఁ,వీడి యున్నతుఱుము•విరుల రాలఁ
గట్టరానితన్నుఁ • గట్టెద నని చింతఁ, గట్టుకొనినతల్లిఁ • గరుణఁ జూచి.

క. బంధవిమోచనుఁ డీశుఁడు, బంధింపఁ దెఱంగుజనని • పాటొర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ,బంధంబునఁ గట్టువడియెఁ • బాటించి నృపా 370

క. పాలుండవు జూ డొడ్డము దివ్యమూలంబులు వెకలి విటప♦ములు విఱిగి మహా
భీలధ్వని గూలెను శాపాలస్యవివర్జనములు ♦ యమళార్జునముల్

క. ఈపాదపములు గూలఁగ, నీపాపఁడు ఱులూఖలమున ♦ నిటు బద్ధుం డై
యేపగిది బ్రదికెఁ గంటిరె, వాపోవఁడు వెఱవఁ డెట్టి♦వాఁడో యితఁడున్.

ఆ. పిడుగు పడదు గాక ♦ పెనుగాలి విసరదు, ఖండితంబు లగుట ♦ గానరాదు
బాలుఁ డితఁడు వట్టి ♦ పడఁద్రోయఁ జాలఁడు, తరువు లేల కూలె ♦ ధరణిమీఁద

క. సంయమికోపమునఁ దను విముక్తీసందున మును దూటి జోలు ♦ సరి యొద్దముగా
ముందటి కీడ్పించుద్దులు, గ్రిందుకొనం గూలె జనులఁ♦గంటి మిరువురన్.

భాగవతము, స్కం. 10 పూర్వ పద్య 379-416.

## ♦ వేణుగానము. ♦

సీ. కర్ణావతంసిత♦కర్ణికారప్రభ, గండభాగద్యుతిఁ ♦ గడలుకొలుప
భువనమోహన మైన ♦ భ్రూవిలాసంబుతో, వామభాగానత ♦ వదన మొప్ప
నపసవ్యకరమృదు♦లాంగుళీచాతురి, వడ్జస్వనికి మర్మ♦సరణిఁ జూప
డా కాలిమీఁద న♦డ్డము సాఁచి నిల్పిన, పదనఖద్యుతిభూమిఁ ♦ బ్రబ్బికొనఁగ

గీ. నెమలిపింఛముఁ గంఠదా♦మమును మెఱయ, విలసితగ్రామముగ నొక్క♦ వేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు ♦ పరఁగఁ జేసెఁ, జతురనటమూర్తి గోపాల♦చక్రవర్తి.

క. గిరు లెల్ల జలము లయ్యెం, దరు లెల్లను బల్లవించె ♦ ధరణిగగనభూ
చరు లెల్లను జొక్కిరి హరి, మురళీరవామృతము సోఁక ♦ నుద్దియ కంటే.

భాగవతము, స్కం. 10 పూర్వ పద్య 767-794.

సీ. ప్రాణేశ్వరుని శయ్య♦పైనుండి యొకయింతి, కృష్ణలీలలను సా♦గించి పాడె
నత్తమామలు చూడ ♦ నలివేణి యొక్కతె, తతకారములు చేసి ♦ తాళ మొత్తెఁ
దల్లిదండ్రులమ్రోలఁ ♦ దమకించి యొకలేమ, లీలాగతుల సుమా♦లించి పాడెఁ
జుట్టంబు లెల్లను ♦ జూడ నొక్క మృగాక్షి, మెల్లనఁ దల యూఁచి♦ మెచ్చె నతని

ఆ. వనజనయనుమీఁది ♦ వలపున నొకకొమ్మ, యిల్లు వెడలివచ్చి ♦ యెదురుకట్ల
పెద్దవారలున్నఁ ♦ బెద్దయు శంకించి మమతతోడ మేను ♦ మఱచియుండె.

చ. వలపలిపాద మడ్డ మిడి ♦ వామపదంబు ధరిత్రి మోపి మై
మలఁచి త్రిభంగియై నిలిచి ♦ మానుగ నర్ధనిమీలితాక్షుఁడై
యలసతదోష్ణ సంగుళము♦లార్చుచు నిం పెసలార వేణువున్
మెలయఁగ నొత్తెఁ గృష్ణుఁ డర♦విందదళాక్షుఁడు సౌమ్యమూర్తియై. 3708

తీవ్రాగ్రంబున రోషవహ్ని తెరయన్ ♦ భీమంబుగా వీఁడె న
ల్లుగ్రోత్తుంగతరంగమై నడుఁగు దు♦ర్లోక్యంబుగా బాహులన్. 3714

శా. బాలుం డొక్కఁడు వీఁడు నామడుఁగు వి♦భ్రాంతోచ్చలత్క్రూర్మిక
ల్లోలం బై కలఁగం జరించె నిట సే♦లో నుంటఁ జూడండు మ
త్క్రూలాభీలవిశాలదుస్సహవిషా♦గ్నిజ్వాలలన్ భస్మమై
కూలం జేసెద నేఁడు లోకులకు నా♦కోపంబు దీపింపఁగన్.

ఉ. ఘోరవిషానలప్రభలు ♦ గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్యవి
స్ఫారుఁడు కాళియోరగుఁడు ♦ వాఁడి వడిం గఱచెం బయోధరా
కారుఁ బయోవిహారు భయ♦కంపవిదూరు మహోగ్రభీరు నా
భీరకుమారు వీరు నవ♦పీతశుభాంబరధారు ధీరునిన్.

క. కఱచి విడువక మఱియును, వెఱవక నిజవదనజనిత ♦ విషదహనశిఖల్
మెఱయఁ దన నిడుదయొడలిని, నెఱి హరిఁ బెనఁగొనియె భుజగ♦నివహాపతి వడిన్.

సీ. ఘనయమునానదీ♦కల్లోలఘోషంబు, సతతమృదంగఘో♦షంబు గాఁగ
సాధుబృందావన♦చరచంచరీకగా, నంబు గాయకసుగా♦నంబుఁ గాఁగఁ
గలహంససారస♦కమనీయ మంజుశ, బ్దంబులు తాళశ♦బ్దములు గాఁగ
దివినుండి వీక్షించు ♦ దివిజగంధర్వాది, జనులు సభాసీన♦జనులు గాఁగఁ

గీ. పద్మరాగాదిరత్నప్ర♦భాసమాన, మహిత కాళియఫణిఫణా♦మండపమున
నళినలోచనవిఖ్యాత♦నర్తకుండు, నిత్యనైపుణ్యమునఁ జేర్చి ♦ నృత్య మాడె.

భాగవతము, స్కం 10 పూర్వ ప 634-645, 663.

సీ. తనఫణావలిగలం♦తయు విచ్చి యెత్తిన, గగనంబు సర్వంబు♦ గబళితముగఁ
దనమిక్కుటపుఁగోఱ♦ దాడలు దెఱచిన, విసపుచిచ్చొండాండ♦దిసలు వేల్వఁ
దనచూడ్కులు గ్రింపుఁ ♦ గినుకతోఁ జర్వినఁ, జంబరచరకోటి♦ యార్తి నొందఁగఁ
దనమేనుమలఁక లై ♦ తనరారి నిగిడిన, యమున యంతయుఁ దన్మ♦యత్వ మొందఁ

గీ. బొదలు తన ఫూత్కృతులనెల్లఁ♦ బొగలు గవిసి, యబ్జజాండము దరవెట్టినట్లు గాఁగఁ
గాలకల్పకాయుండు ♦ కాళియుండు, గవిసె గోపాలబాలుపై♦ గినుసంగి. 3719

హరివంశము, ఆ 7.

చ. ఫణినిభుపుచ్ఛముఁన్ మలఁచి♦ పట్టి భయంకరరేఖతోఁ దఁ ద
త్ఫణములు ద్రొక్కి నొక్కి ఘన♦పాదహతిన్ గటినృత్తఘంటికా

ఘనాఘనానాదముల్ మొరయు♦గా వెస నృత్యము సేసి పల్లవా
గ్రణి మధుసూదనుండు బల♦రాముఁడు గోపురిఁ జూచి పొంగఁగన్. 3126

పద్మపురాణము, ఆ 9 ప 171.

క. నీవింక నిందు నుండక, నావచనముఁ బూని యంగ♦నామిత్రసుత
తాళివితో జలరాశికి ♦ వేవేగమకదలిపొమ్ము ♦ విషధరముఖ్యా.

క. నీపడగమీఁదనుండెడు, నాపదచిహ్నములు చూచి♦నను గరుడుఁడు ని
న్నేపున భక్షింపఁడు నా, నాపన్నగవరుల నట్టు♦లనుచు నరిందమ్.

క. మఱుఁగు వెడలి హరి వచ్చినఁ, గడుమోదముతోడ గోపి♦కలు గోపకులున్
వడిఁగ్రచ్చి కౌఁగిలించిరి, కొడుకుం దలిదండ్రు లెత్తి♦కొనిరి ముదమునన్.

విష్ణుపురాణము, ఆ 7 ప 181-190.

## —♦ గోవర్ధనోద్ధారణము ♦—

సీ. కదలి డొల్లెడుమహా♦గండశైలములతో, నిలమ్రాఁకులును జెల్లఁ♦గిలిపడంగ
వడిఁ దూలి చెదరెడు ♦ వారివాహములతో, ఘనమృగవ్రజములు ♦ గలఁగి పాఱ
నదరి క్రేళ్లుఱికెడు ♦ నుగ్రకేసరులతో, బిలగతాహులుఁ గింక ♦ వెలికి సనఁగ
వెసఁ బాసిపోయెడు ♦ విద్యాధరులతోడ, నియమస్థమునిజనా♦ళియుఁ గలంగ

గీ. నొత్తువడి కాంచనాదిధా♦తూచ్చయములు, రసము లొల్కఁగ ఘనిరత్న♦రాసు లొలుక
నదరి సానుసంధులు వ్రయ్య♦నమ్మహాద్రి, గలయ నాభీల మయ్యెఁ ద♦చ్చలనవేళ.

హరివంశము, ఆ 7.

క. కిరియై ధర యెత్తినహరి, కరిసరసిజముకుళమెత్తు♦గతిఁ ద్రిభువనశం
కరకరుఁడై గోవర్ధనగిరి యెత్తెం జక్కనొక్క ♦ కేలన్ లీలన్.

క. దండిని బ్రహ్మాండంబులు, చెండులక్రియఁ బట్టి యెగుర♦జిమ్మెడు హరికిన్
గొండఁ బెకలించి యెత్తుట, కొండొకపనిగాక యొక్క♦కొండా తలఁపన్.

శా. బాలుం డాడుచు నాతపత్రమని సం♦భావించి పూగుత్తి కే
లం దాల్చినలీల లేవగవుతోఁ♦గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపుల♦చ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుతదుర్శిలాచకితగో♦పీగోపగోపంక్తికిన్. 3127

క. వడిగొని బలరిపుపనుపున, నుడుగక జడిగురిసె నేడ♦హోరాత్రములు
న్నొండ గోపజనులు బ్రతికిరి, జడిఁ దడియక కొండగొడుగు♦నాటున నధిపా.

క. ఉడిగెను వానయు గాలియు, వడిసెడి నదు లెల్లఁ బొలిచె ♦ వఱద తిరిసెఁ గొం
డడుగున నుండక వెడలుఁడు, కొడుకులుఁ గోడండ్రు సతులు ♦ గోవులు మీరున్.
భాగవతము, స్కం. 10 పూర్వ ప 913.

—♦ మందరగిరిధారణము. ♦—

సీ. అంగదాభరణంబు♦లందుఁ గీలించిన, వజ్రాలకీలన ♦ వదలకుండ
వక్షస్స్థలంబున♦వైచిన నవకంపుఁ, దులసిదండకు వాడు♦దోఁపకుండఁ
గడునొప్పఁ దీర్చిన♦కస్తూరితిలకంబు, చెమటబిందులచేతఁ ♦ జెదరకుండ
నెట్టెంబు సుట్టిన ♦ పెమ్మిపించముదండ, కొనరేక యొక్కింత ♦ గుదియకుండ
గీ. శ్రవణకల్హారముకుళంబు ♦ జాఱకుండ, నిరులకీల్కొల్పు పువ్వదవలి పై♦ కెక్కకుండ
నెత్తె శృంగారకంతుకం♦బెత్తినట్లు, కైటభారాతి మందర♦క్ష్మాధరంబు.
హరవిలాసము, ఆ 6 ప 34-45.

—♦ గోపికావస్త్రాపహరణము ♦—

ఉత్సా. కదలకుం డని తోడివారలఁ ♦ గన్నుసన్నల నిల్పుచుం
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ ♦ బద్మనేత్రుఁడు మౌని యై
పొదలమాటున నల్లనల్లన ♦ పొంచిపొంచి నతాంగుఁ డై
యదను గోరుచు డాసి వ్రేతల♦యంబరంబులు దొంగిలెన్.
శా. ఉద్యద్గంధగజేంద్రగౌరవముతో ♦ యోషాంబరంబుల్ విభుం
డాద్యుం డర్భకభంగి నర్భకులతో ♦ హాసార్థియై కొంచుఁ ద
స్నద్యంభఃకణశీతవాతజనితా♦నంతంబుతో నెక్కెఁ దా
సద్యోముక్తదురంతపాపజను♦సంతాపమున్ నీపమున్.
క. మామావలువలు ముట్టకు, మామా కొనిపోకుపోకు ♦ మన్నింపు తగన్
మామాన మేల కొనియెదు, మామానసహరణ మేల ♦ మానుము కృష్ణా.
సీ. బహుజీవనముతోడ ♦ భాసిల్లియుండుట్లో, గోత్రంబు నిల్పుట్లో ♦ కూర్మితోడ
మహినుద్ధరించుట్లో ♦ మనుజసింహంబ వై, ప్రజలఁ గాచుటో కాక ♦ బలిఁ దెరల్చి
పిన్నవై యుండియుఁ ♦ బెంపువహించుట్లో, రాజుల గెల్చుట్లో ♦ రణములందు
గురునాజ్ఞ సేయుట్లో ♦ గుణనిధి వై బలప్రఖ్యాతిఁ జూపుట్లో ♦ భద్రలీల
ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్ర♦బుద్ధత మెఱయుట్లో, కల్కితనము సేయ ♦ ఘనత గలదె
వావి లేదు వారి♦వారు నావారను, నెఱుక వలదె వలవ♦[illegible] కృష్ణ. 3734

సీ. శృంగారవతులార ♦ సిగ్గేల మిముఁ గూడి, పిన్నవాఁటను గోలెఁ ♦ జెలిగినాఁడ
నెఱుఁగనే మీలోన ♦ నెప్పుడు నన్నాఁడ, జేను జూడ నిమ్మత్త ♦ మెద్దిగఁ జెపుమ
వ్రతనిష్ఠ లై యుండి ♦ వలువలు గట్టక, నీరు సొత్తురె మీరు ♦ నియతి దప్పి
కాత్యాయనీదేవిఁ ♦ గల్లసేయుట గాక, యీరీతి నోఁచువా ♦ రెందుఁ గలరు
ఆ. వ్రతఫలంబు మీకు ♦ వలచినఁ జక్కఁగ, నింతు లెల్లఁ జేతు ♦ లెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుఁడు ♦ చీరలు సిగ్గు వోఁ, వాడ ఏల ముగ్గ ♦ లాడ నేల. 3735
మ. వ్రతముల్ సేయుచు నొక్కమాటయిన దై♦న్యాపేక్ష విచారించినన్
వ్రతభంగంబులు మాను నట్టివరదున్ ♦ వామాక్షు లీక్షించియున్
గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభం♦గం బంచు శంకించి ఫా
లతటన్యస్తకరాబ్జ లై సరసలీ♦లన్ మ్రొక్కి రట్లంచితన్.
క. బాలలకు హాస్యకీలిత, ఫాలలకు నితాంతశీత♦పవనాసమనా
లోలలకు నంబరముల కృపాలుఁడు హరి యిచ్చె భక్త♦పాలనఁ దగుటన్.
ఆ. చీర లపహరించి ♦ సిగ్గులు విడిపించి, పరిహసించి రైనఁ ♦ బరఁగ సుకృత
ఘనుఁడు నోముకొలఁత ♦ గాకుండ మ్రొక్కించె, ననుచు హరి నుతించి ♦ రబల లెల్ల.
క. ఉల్లములు నొవ్వ నాడినఁ, గల్లలు సేసినను నగినఁ ♦ గలఁచిన నైనన్
వల్లభులు సేయుకృత్యము, వల్లభలకు నెగ్గు గాదు ♦ వల్లభ మధిపా.
సీ. లక్షణవతులార ♦ లజ్జించి చెప్పను, గాని మీ మర్మముల్ ♦ గానఁ బడియె
ననుఁ గొల్వఁ జింతించి ♦ వారు నాచేతను, సత్యంబు మీనోము ♦ సఫలమగును
గామితార్థంబుల ♦ కలిమి జెప్పఁగ నేల, ననుఁ గొల్వ ముక్తికి ♦ నడవవచ్చుఁ
గడను కూడఁగ నంబి♦కాదేవి నోఁచంగ, నటమీఁద రాత్రుల ♦ యందు మీకు
ఆ. నన్నుఁ బొందఁ గల్గు ♦ నమ్ము పొం డని హరి, వల్క నింతు లెల్ల ♦ భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ ♦ దత్పదాంభోజముల్, మానసించుకొనుచు ♦ మందకడకు.

భాగవతము, స్కం 10. పూర్వ పద్య 815-847.

ఉ. కోకలు ముచ్చిలించి తటి♦కుంజగృహంబున నిల్వ సిగ్గునన్
భ్రూకుటియున్ దరస్మితని♦రూఢియుఁ బ్రేమముఁ దోఁపఁగట్టుకున్
రాకయు డేమిరా తగదు♦రా యని ముగ్ధవధూటి నీటిలోఁ
జేకొనఁ బూనె నీదయగు ♦ చిన్ని ముకుందుని చేతిచేలముల్. 3741

శ్రీకృష్ణకర్ణామృతము; ఆ 2 ప 8

## —♦ ద్రౌపదీవస్త్రాపహరణము. ♦—

ఉ. ఆవనజాననం గురుకు♦లాపళిముందు గడంగి రాజనా
యావభృథంబునందు వసు♦ధామరమంత్రపవిత్రవారిధా
రావళిఁ జేసి పావనము♦లైనశిరోజములం దెమల్చి పా
పావహుఁ డీడ్చి తెచ్చె సభ♦కందఱు సంభ్రమ మంది చూడఁగన్.

సీ. ఇది సేయఁ గాదని ♦ మది విచారింపక, సద్గర్హితుండు దుః♦శాసనుండు
పెట్టిన ద్రౌపది ♦ గట్టినపుట్టంబు, సభలోన నొల్చెనా ♦ శంక లేక
యొఱుఁగక యొలువంగఁ ♦ బడియు ము న్నపనీత,మైనతద్వస్త్రంబు♦ నట్టివలువ
లలితాంగి జఘనమం♦డలమునఁ బాయక, యొప్పుచు నున్న న♦య్యువిదఁ జూచి
ఆ. సభ్యు లెల్ల ముదిత♦సమ్మదు లయిరి దుః,శాసనుండు వస్త్ర♦చయము పర్వ
తోపమాన మయిన ♦ నొలువంగ నోపక, యుడిగె లజ్జఁ బొంది ♦ యుక్కుడక్కి.

సభాపర్వము, ఆ 2 పద్య 206-231.

## —♦ కృష్ణుఁడు—గోపికలు. ♦—

సీ. అమ్మ నేనెల్లె మా♦యత్త జూచినఁ గొట్టుఁ, బయ్యెద విడర గో♦పాలరాయ
ఓరి నా......♦గోర జీరకు పోర, నీకు మ్రొక్కెద యశో♦దాకుమార
అవులేర మంచివాఁ♦డవు గంటి సేతురా, వాతెఱపై నవ♦నీతచోర
చెల్లబో నడివీథి ♦ నెల్లవారును జూడ, ముద్దాడ వత్తురా ♦ ముద్దుకృష్ణ
గీ. ఘుంచుఁ బక్కనుపవళించు ♦ మించుబోండ్లు, విదురమబ్బున వగ లిట్టు♦ చదురులెల్ల,
గలవరించిన యాసంచు♦ తెలియలేరు, పసులఁ గాచిరో కాని త♦త్ప్రాణవిభులు.

చ. కడిపెడు వేడినీళ్లజల♦కంబయి కమ్మనిపాలు వంటక♦
బిడిన భుజించి నాథుఁడు శ♦యించిన వీడెము వేసుకొక య
ప్పుడె నిదురా యటంచు నొక♦బోటిహసింపుచుఁ దల్పుమూసి వె
ల్వడియె ముకుందుఁడున్నెడకు ♦ బంచశిలీముఖచంచలాత్మయై. 3745

సీ. మొగములో తేటలే♦నగవుపీడెము కెంపు, పెంపునింప సమర్తు♦ పెండ్లికూతు
లనువంద నీసువ♦ట్టిన పేనితెళతళల్, దిలకింపఁ దొలిచూలు ♦ తలిరుబోండ్లు
పసదేరుపసపుము♦వ్వులు కాటుకబొట్టు, వింతచెల్వ్వానఁ బా♦లింతరాండ్లు
గమకపుగుబ్బలం♦గములలో నుదుటు ని,చ్చలు ప్రేమగల నిండు♦ జవ్వనులును
గీ. మఱియు వ్రేపల్లెలోనున్న ♦ మందమంద,గామినులు కామినులు కీర♦కాండకాండ
కుసుమబోధాయమానమా♦నసముతోన, తోనదన్నందపుత్రుండు ♦ తోన నగుచు.

ధవళాతపత్త్ర మా♦తతధనుర్బాణముల్, దాల్చి లక్ష్మణుఁడు కై♦దండ నలర
శశినిభగడల విం♦జామరంబులు బూని, భరతశత్రుఘ్నులు ♦ పరిఢవింప
తే. ననుపమోజ్జ్వలరత్నసిం♦హాసనమున, నమరఁ గూర్చుండి కోటిసూ♦ర్యప్రకాశుఁ
డై వసిష్ఠాదిమునిసమూ♦హములచేతఁ, జెలఁగి రాముండు పట్టాభి♦షిక్తుఁ డయ్యె.

సీతారామాంజనేయసంవాదము, ఆ 1 ప 72.

## —♦ రామకృష్ణపట్టాభిషేకము. ♦—

సీ. ఘనుండు గురుఁడుగాఁ బరగి ♦ నెయ్యమున ముప్పట్టి యాపావని ♦ యగ్రదిశను
శోభనాకృతి లక్ష్మ♦ణాభిఖ్యుఁ డొప్పు సు,సీతవిందు సహజ♦నిరయె వెనుకను
అలసత్కృపామహో♦ర్యబ్జాసరావతా,రములె మహితతఁ జే♦రఁ గుడివెడమఁ
దారాదిహరాంక♦తిసువత్ససుగ్రీవ,భద్రసద్భృతి మహి♦మాద్రికలుప
గీ. భావహృద్విభీషణసుదం♦తావలశుభ,కలితసద్బాహుగదభల్లు♦కవరజాత
నాథులయ్యనిలావిశో♦ణముల వెలయ, నడుమ ననుహితనయత న♦న్నవిభుఁ గొల్తు

లంకావిజయము, ఆ 2.

## —♦ లంకాదహనము. ♦—

మ. అమరేంద్రాయుధసన్నిభంబులయి ఘ♦ల్లాశోకకాలాయసా
భములై కంచుకలోహితప్రకరరో♦చిస్స్ఫూర్తులై హేమవి
భ్రమధూమప్రతిమంబులై వివిధవ♦ర్ణశ్రేణులై వీతధూ
మములై యొక్కొకయింటిపై నెగసెఁ జే♦ర్మంట లుగ్రహోగ్రధ్వనిన్.
చ. పదములు వట్టుచుం దొడలు ♦ ప్రాఁకుచు నేచి కుచంబు లంటుచుం
బెదవులు చీఁకుచుం గరము♦ పేర్చి కచగ్రహణంబు సేయుచున్
సుదతులయందు రాగములు ♦ సూపుచుఁ బావకుఁ డొప్పె నెంతయున్
మదనసుఖోచితక్రియలు ♦ మక్కువసల్పెడు కాముకైపడిన్.

భాస్కరరామాయణము, సుంద. 478, 488.

సీ. పాకాసురాంతక♦ప్రాసాదభిత్తులఁ, బొలుపారుగస్తూరి ♦ ఘ్రాతయయ్యె
మహిమవాహోస్థాన♦మంటపస్థలియందు, నానీలచేలవి♦తానమయ్యె
వరుణమహాపురీ♦వరహర్మ్యరాజుల, గమనీయ హరినీల♦కాంతియయ్యె
రాజరాజాంతఃపు♦రస్త్రీశిరోజవ్ర,జంబుల నగరుధూ♦పంబులయ్యె
గీ. వసుధైతేయముఖమహా♦రాక్షసేంద్ర,వధవిచక్షణదక్షిణ♦నాయుతనయ
వాలగతభాసురానల♦కీలదగ్ధ,భూరిలంకాపురీధూమ♦పుంజ మపుడ. 3756

రామచంద్రోపాఖ్యానము, సుంద. ఆ [illegible]

గీ. చటచటధ్వనితో స్ఫుటం♦పటలి దెస్లెల్ల, శాఖశాఖావిజంతుసం♦ఘంబు లడల
మిన్ను మన్నును దాఁ యై♦యున్నయట్టి, గాడ్పు వేస్తుండు వనమెల్లఁ♦గాల్చెఁ దాని.
కాళిందీపరిణయము, ఆ 3 ప 37.

## —♦ క్షీరసాగరము. ♦—

సీ. శతపవాలోత్తి ప్త♦జలశీకరంబులో, మెఱుఁగుముత్యము లేఱ♦వలుపరాదు
శశికిరాయంచ కెం♦క్కలమించు తెలిచాయ, తెరలతేటయు గుఱు♦తెఱుఁగరాదు
జలబాలికాపాలి♦కలవాక్కులు లవర్త, లావర్తములభేద ♦ మరయరాదు
తఱచుగా గిఱికొన్న♦నురుఁగులకుప్పల, నిసుకతిప్పల నిర్ణ♦యింపరాదు
గీ. కనుఁగొనఁ దుదత్త్రదాత్పర్య♦జనితకీర్తి, ముంచుకొనెనన సహజమై♦మించుధవళ
కాంతి దిక్కులనెల్లఁ దిక్కు♦టిల వెలయు, పాలమున్నీరు కన్నుల ♦ పండువయ్యె.
ఉత్తరరామాయణము, ఆ 5 ప 207.

సీ. ఘనుతేఁగు దెంచిన ♦ తనవారిలోనెంచి, జీవనంబిచ్చి ర♦క్షించుదాత
భువననిదానమై ♦ కువలయప్రియమూగాఁ, గళలకిమ్మగు పుత్త్రుఁ ♦ గనిన యోఁఘు
కీర్తిజనన్గ్లానియాడ ♦ సిరికిఁబుట్టినయిల్లు, పురుషోత్తమస్థితిఁ ♦ బొసఁగు ధన్య
బలవైరిభయమునఁ ♦ బరఁగుభూభృత్తుల, మనుపవాహినులనే♦లినమహాత్ము
గీ. శోభితానంతరత్నధా♦మాభిరాముఁ, గంకణకలాపలసదూర్మి♦కాపరంప
రావిరాజితచిత్రాంబ♦రప్రదేశు, భూరిసత్త్వనపారగం♦భీరుఁ గనిరి. 3767
రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 1 ప 99.

## —♦ క్షీరసాగరమథనము. ♦—

సీ. కపటకచ్ఛపమైన ♦ కైటభారాతివీఁపు, కొమరుమీఱినచుట్టు♦కుదురుగాఁగ
నారసాతలమూల♦మైనమందరమహా,ధరణీధరంబు మం♦థానకముగ
దందశూకాన్వయా♦ధ్యక్షుండు వాసుకి, తరపరిగ్రహణమా♦త్రంబుగాఁగ
నావహాప్రవహోదు♦లగుమారుతంబులు, తగులఁగట్టిన యోక♦త్రాళ్లుగాఁగ
తే. బలిపురోగములగు దైత్య♦పరివృఢులును, దివిజనాయకుఁ డాదిగా ♦ దేవతలును
దరిచి రంభోధిఘుమఘుమ♦ధ్వానరవము, భువనగోళంబు దిక్కులు♦ చెవుడు వడఁగ
భీమేశ్వరపురాణము, ఆ 4 ప 59.

సీ. పాలమున్నీటిలో♦పల సర్వతృణలతో,మధనులు దెచ్చించి ♦ చాలమైచి
మేదరశైలంబు ♦ మంథానముగఁ జేసి, తనరవాసుకిఁ దరి♦త్రాడు సేసి

నాసహాయతచేత ♦ నలి నందఱును మీరు, తఱువుఁడు శేషము ♦ తత్ప్రసంగమున
ఫలము మీఁదయ్యెడు ♦ బహుళసుఖంబులఁ, బడుదురు దైత్యులార ♦ పాపసులు
ఆ. అలసటేమిలేక ♦ అఖిలార్థములుగల్గు, విమధిలోన సౌఖ్య ♦ విషము పుట్టఁ
గలఁగి వెఱవవలదు ♦ కామరోషంబులు, వస్తుచయమునందు ♦ వలదు సేయ.
సీ. వాసవవర్ధకి ♦ వాఁడిగాఁ జఱచిన, గుద్దాలముఖములఁ ♦ గొంతి ద్రవ్వి
ముసలాగ్రములసాన్ని ♦ మొగలిపాఁతగలించి, ప్రేమ్మపాశంబులఁ ♦ బిడింప సుట్టి
పెకలించి బాహులఁ ♦ బీడించి కదలించి, పెల్లార్చి తిమురును ♦ చేసవాడి
పెటికిమీఁదికిసెత్తి ♦ పృథులహస్తంబులఁ, దలల భుజంబుల ♦ దాలకుంప
గీ. వానిమెల్లన కుఱుతప్పు ♦ టడుగులిడుచు, భారమధికంబు సుమ్మని ♦ పట్టుఁడనుచు
మంధరనగంబుఁ దెచ్చిరి ♦ మందగతిని, దేవదైత్యులు జలరాశి ♦ దెసకుఁ బట్టి 2770
క. మందరము మోవనోపమి, నందఱుపైఁ బడియె నదియు ♦ నతిచోద్యముగాఁ
గొందఱు నేలం గలిసిరి, కొందఱు నుగ్గయిరి చనిరి ♦ కొందఱు భీతిన్.
క. హరియును దేవానీకము, సురగేంద్రుని తలలుపట్ట ♦ నుద్యోగింపన్
హరిమాయాపరవశులై, సురవిమతులు గూడి పలుకఁ ♦ జొచ్చిరి కడిమిన్.
మత్తకోకిలము. స్వచ్ఛమైన ఫణంబుమీరలు ♦ సక్కఁబట్టి మథింపఁగాఁ
బుచ్ఛమేటికి మాకుఁ బట్టఁగఁ ♦ బూరుషత్వముగల్గి మే
మచ్ఛమైనతపోబలాఢ్యయ ♦ శాన్వయంబుల వారమై
యిచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి ♦ నిందు మాకు ఫణాగ్రముల్.
క. విస్మయముఁ బొందె దానవ, ఘస్మరుఁ డహిఫణము విడువఁ ♦ గైకొని యసుహల్
విస్మితముఖులై యార్చి య, విస్మితముగఁ గొనిరి సురలు ♦ వీఁకన్ దోఁకన్.
క. విడువిడుఁడని ఫణిపలుకఁగఁ, గడుభరమున మొదలఁ గుదురు ♦ గలుగమి వెడఁగై
బుడబుడరవమున నఖిలము, వడవడవడఁకఁగ మహాద్రి ♦ వనధి మునింగెన్.
ఉ. గౌరవమైనభారమునఁ ♦ గవ్వపుఁగొండ ధరింపలేక దో
స్సారవిహీనులై యుభయ ♦ సైనికులుం గడు సిగ్గుతో నకూ
పారతటంబునం బడిరి ♦ పౌరుషముం జెడి పాండవేయ యె
వ్వారికి నేరఁబోలు బల ♦ వంతపు దైవము నాక్రమింపఁగన్. 2776

భాగవతము, స్కం 8 ప 175, 188, 184, 194-200.

—♦ ఈశ్వరుఁడు హాలాహలమును మ్రింగుట. ♦—

క. కటుకమగు విషము విషధర, కటకంబగు కేలఁబూని ♦ కాకూహలియై
ఘటికాసంసిద్ధుఁడు రస, ఘుటికయునుంబోలె మ్రుడుఁడు ♦ గుటుకున మ్రింగెన్.

గీ. కంఠికాశీలరత్నంబు ♦ కరణి నొప్పెఁ, లలితమ్మగు నాభిపంకంబు ♦ చెలువు దాల్చెఁ
గాలకూటవిషంబు త ♦ త్కంఠమునకు, నాభరణ మయ్యె బ్రహ్మాదు ♦ లభినుతింప.
హారవిలాసము, ఆ 6 ప 69, 70.

సీ. కాలాంతకాలోల ♦ ఘోలానలోజ్జ్వల, జ్వాలవళీశితా ♦ భీల మొక్కొ
కల్పావసానప్ర ♦ కల్పోష్ణకరశిఖా, నల్పాశ్రితాంకస ♦ హస్ర మొక్కొ
యక్షీణతరదుర్ని ♦ రీక్షణక్షయకాల, రూక్షసప్తతురంగ ♦ లక్ష యొక్కొ
దుర్వారభయదోగ్ర ♦ సర్వాయు విషయుతా, ఖర్వార్వకోటిప్ర ♦ కాశ మొక్కొ
గీ. యనుచుఁ జూపరు లతిభయం ♦ బంది పరువ, మొదల నల్లన నల్లనై ♦ యొదవి యాకు
పచ్చనై యంతఁ బొగరాజి ♦ ప్రబలెనపుడు, ఘోరతరమైన యక్కాల ♦ కూటవిషము.

సీ. భుగభుగమనిలోనఁ ♦ బొగలుచు గ్రక్కున, రవరవమనిపొగ ♦ రాజికనలి
భగభగమనిచాల ♦ ప్రజ్వలంబై మండి, చిటచిటమిణుఁగురుల్ ♦ చెదరమించి
ధగధగ మెఱమంట ♦ లెగయ నల్గడ కేఁగి, చిగిచిరజలధులు ♦ తిరుగఁబారి
పటపటదిగిభకుం ♦ భస్థలంబులగల్చి, పెటపెటబ్రాణులఁ ♦ బేల్చి యుఱికి
గీ. యడుగునకు జారి పాతాళ ♦ మాదిగాఁగ, గ్రిందిలోకంబులేడును ♦ నంది కాల్చి
రొగసి యామీఁదిలోకంబు ♦ లేడుఁ గట్టి, దరికొనుచునిండె నెల్లచో ♦ దద్విషంబు.
లక్ష్మీనారాయణపరిణయము, ఆ 3.

చ. శిరమున వేల్పుటేటిచెలి ♦ చెక్కుచెదర్పదు శైలకన్యతోం
దరపడ దర్ధదేహమునఁ ♦ దాల్చినపాపసరుల్ జవాడుచుం
బొరలవు మౌళినున్న శశి ♦ పువ్వు రవంతయుఁ గందకుండు చే
మెఱపెడిజింక తూల్పడదు ♦ మేచెను పెక్కుఁడు శంభుమూర్తికిన్.

ఉ. కలఁగదు నెమ్మనంబు కసుఁ ♦ గందదు కొరిండలపువ్వు కాఁక చి
ట్లలమదు కోమలాంగము జ ♦ వాడదు బింకెము వీడ దూహ డీ
ల్పడదు నిజప్రకాశము త ♦ లంగ దొకింత జటాభరంబునన్
హాలహాలమాత్మకంఠమున ♦ కాహుతిఁ జేసిన శూలపాణికిన్. 3782
మహాలక్ష్మీపరిణయము, ఆ 2 ప 47.

—♦ భూగోళము. ♦—

సీ. తెలియు భూగోళంబు ♦ వెలగపండువలె నంచుచందురు సిద్ధాంత ♦ లరసి యద్ది
కొండలపిండుతోఁ ♦ గూడియుండుటచేతఁ, బనసపండువలెనఁ ♦ జనఁగను జను
బహునదీనదములఁ ♦ బరఁగుచుండుటచేత, గుమ్మడిపండుపో ♦ ల్కమ్మనఁ దగుఁ
బలుసంద్రములతోడ ♦ నలరుచుండుటచేతఁ, బండిపండని దబ్బ ♦ పండన నగుఁ

పృథ్వీపలాగ్రణి ♦ కృష్ణుఁ డెవ్వఁ డతండు, మనుజేంద్రుఁ డనఁగ నీవు ♦ వినఁగలేదొ
ధరణీతలంబెల్లఁ దడవుభరించిన, భరతుఁ డెవ్వఁ డతండు ♦ వరుఁడుగాఁడొ
గీ. పటుతరంబైన దివ్యప్ర♦భావకలన, నిపుడు చెప్పినవారిలో♦నెవఁ డతిశయుఁ
డెవఁడు దేవత యనఁగ నిం♦దెన్నఁ బడియె, దానవుండన యెవ్వఁడు♦ధాత్రి నెసఁగ
సీ. మహిమాతిశయుఁడైన ♦ మాంధాతయను రాజు, కేవలఘనుఁడు భ♦గీరథుండు
సర్వోత్తముండైన ♦ సగరమహారాజు, గుణఖనియైన క♦కుత్థ్సనృపతి
పురుహూతసముఁడనఁ ♦ బరఁగు పురూరవుం, డింగు ఘనుఁడు శశి♦బిందునృపుఁడు
గీ. నతి వదాన్యుఁడు శిబియు రు♦క్మాంగదుండు, జనకనహుషులు హైహయ♦జనవిభుండు
పార్థివులు యయాతినాఁ♦బరఁగునృపతి, యిందుఁ బ్రభవించి ప్రజలకు♦నెసఁగలేదె.

విశ్వగుణాదర్శము.

## —♦ చోళదేశవర్ణనము. ♦—

సీ. వారకాంతాకుచా♦పారమర్దనకళా, శౌరీణతను సదా♦పరిఢవిల్లు
కరములన్ఖాద్యాది♦కంబులు విడుతురు, తద్వీటికారసో♦ద్వాసితంబు
లగునోళ్లచేతనే ♦ నిగమార్చనామంత్రముల నుచ్చరింతురా ♦ మహాఘమతులు
నిశ్చయంబున దేవు♦నికిఁ గల విత్తముల్, ధీరతఁ గొందురా ♦ దేవలకులు
గీ. ఇట్టి దుశ్చారవర్తులై♦నట్టివారి, పూజలేవేళలనుబొంది♦పొదలునట్టి
విగ్రహంబులయందు నే♦విధమున హరి, యెంచిచూడంగ సాక్షాత్క♦రించియుండు
ఆ. హంతచోళవాస♦మందతి స్థైర్యము, చిరము గల్గి యున్న ♦ చేడియలకు
విగతచోళబంధ♦విదులుగోజంబుల, కనుటయే విరుద్ధ♦మై లభించె.
తే. బుధజనంబులు నిజగృహ♦ముల ననేక, రుచులఁ జేసినయన్న మ♦రుచ్యమగును
దిండురహాదిస్థలంబుల♦యందు పెట్టి, యన్నమైనను భవహార♦మనుచుఁ దలఁచి.
తే. ఆహితాగ్నులు శ్రీగృహ♦మందుఁ గనిన, హృద్యశాస్త్రవదోల్లాస♦హృద్యయులధిక
పుణ్యశాలులు పండిత♦పుండరీకు, లనఘులను జేతు రీప్రజ ♦ నఖిలవిధుల.
చ. అనఘపతివ్రతాత్వముల♦సద్వ్రతశీలములన్ విశుద్ధలై
తనరెడి చోళకాంతలకుఁ ♦ దద్దయుఁ గంచెలలేమి దూష్యమా,
ప్రణుతరతోపభోగ్యవయ♦వంబు బయల్పడియుంకి దూష్యమం
చనినను మాడియింతులకు ♦ నావృతిఁగాంచెనె వస్త్రసంతతిన్. 3795

విశ్వగుణాదర్శము.

ఉ. ధాతుపరీక్ష, దేహముల♦తత్త్వము, వస్తుగుణంబు, శాస్త్రని
ర్ణీతపథంబు, నోషధులనేమము, సర్వరుజానిదానమున్
బ్రీతిగ నేర్చి పై ననుభ♦వజ్ఞులఁ బెద్దల నాశ్రయించి య
జ్ఞాతరహస్యయోగముల ♦ సార మెఱింగినవైద్యుఁ డెవ్వఁడో. 3814

హేమసుందరోపాఖ్యానము.

## —♦ రోగి. ♦—

సీ. వేదాంతదేశిక♦వివిధబోధితమహా,సాధుజనోచిత♦సరణి విడిచి
యన్యపదంబుల ♦ నంధులై దేహులు, చపలత నరికట్టి ♦ చనుదు రింత
నిష్టవస్తువుల నా♦హీనంబుగాఁ దిను,మిష్టాంగనారతి ♦ నెలమి సేయు
మని క్రిగౌరాక్తుల చెప్పు♦నట్టి వైద్యునిఁ గడుఁ, జపలరోగార్తుఁడు♦సన్నుతించుఁ
గీ. గాని పథ్యము సేయింపఁ ♦ గడఁగునట్టి, కట్టివైద్యునినైనను ♦ ఘనుఁ డటంచుఁ
దథ్యముగ సన్నుతింపఁ డ♦పథ్యకాంక్షి, యైనరోగిజనంబు మ♦ర్యాద యిదియె.

విశ్వగుణాదర్శము.

## —♦ నేత్రరోగము-తచ్చికిత్స. ♦—

సీ. తొలుదొల్త దూరానఁ ♦ గలదాని నిదియది, యని నిరూపించుదా♦ర్ఢ్యంబు విడఁటు
తెంచవేసినట్టులే♦డైటఁ జూడ్కి కటుమీఁద, నావంతకొంతసఁ♦ప్రాప్త మగుట
మునునొనిచుబ్బగ్రి♦మ్మినమాడ్కిఁ బిదపవ♦స్తువుల నొక్కింతయ♦స్ఫుటతఁగనుట
కదపడి యతిసమీ♦పములోని దేనియు, విస్పష్టలీలఁ గా♦న్పింప కునికి
గీ. కంటి కడ్డంబుగా నిల్పి♦కలయ దిరిప్పు,నంగుళులసంఖ్య దెలియంగ♦నలవి గామి
యనుసవస్థలఁ బొరయక ♦ యంతలోన,హీనదశఁ గాంచె నొక్కఁట♦హానిదృష్టి.

నయనోల్లాసము, ఆ 2 ప 63.

సీ. కోకపొట్లంబావిఁ గొనమూఁడి యొత్తుచుఁ, గవణోష్ణకరభభా♦గమునఁ గాఁచి
నెత్తితంగేడాకు♦ మెత్తి రేచకినిమ్మ, పంటిపుల్సున నూతి ♦ పట్టువెట్టి
తెల్లదింఫైనపువ్వుఁ♦ దెచ్చి శద్రస మిడి, కలివెపువ్వులు గోసి ♦ నిలిచి పిడిచి
పేరిననెయి వెట్టి ♦ నెరుగువత్తులు వైచి, చనుఁబాలతో రాచి ♦ సంకు చమిరి
గీ. విన్నమందులు తా నయి♦ కన్నమందు,లడిగి తెచ్చినమందులు ♦ నడవినుండు
లెన్ని చేసిన పానక♦యెందుపాళి, కన్ను తొడిబడి నెత్తుర ♦ గాఱుటయును.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 ప 110.

## —♦ అర్థార్థులు ♦—

సీ. దినవాథనందను ♦ డిత్తొల్చి విడిచిరి, కరుణతో నెముకలే ♦ చ్చిరి దధీచిఁ
బాతాళబిలమున ♦ బలిఁ గట్టివైచిరి, జీమూతవాహను ♦ జీవివాపి
రత్తి పాల్గొనిరి శి♦బీంద్రుఁ నంతటివానిఁ, గలగుండు వెట్టిరి ♦ కలశవార్థిఁ
చిపుటఁ జుక్కలరేనిఁ ♦ దిసఁగొరు మెసఁగిరి, పండ్లు దుల్చిరి కల్ప ♦ పాదపంబు
గీ. నయ్యా లెంతపు నేర ర♦ర్థార్థిజనులు, వీరిమనసులపట్టు నె♦వ్వారితరము 3928
కీర్తియటులుండె విడుఁడు దా♦క్షిణ్య మింకఁ, దారు గల్గిన బదివేలు ♦ తమకుఁ గలవు.

శృంగారనైషధము. ఆ 7 ప 8.

## —♦ విప్రకుమారుఁడు ♦—

సీ. వెన్నెలఁజరిఖుడ్డ ♦ వెండితీఁగెలఁ బోలు, యజ్ఞోపవీతంబు ♦ లలిత నమరఁ
గవ్వె చెంగల్వపూ ♦ వన్నె మించిననీరు, కావిదోవతికట్టు ♦ కటిఁ దలిర్ప
వెలిదమ్మివిరిమీఁద ♦ యొలదేఁటిగతి గంగ, మట్టిపై వేలిమి ♦ బొట్టు దనర
నీలికందుకముపైఁ ♦ గీలించుముత్యాల, విధమున సిగఁ గమ్మ ♦ విరులు మెఱయ
గీ. లలితనవయౌవనారంభ♦కలితమైన, మేని మెఱుఁగులు మెఱుఁగుల♦ మెఱుఁగు దెగడఁ
జంద్రధరుకృప బ్రహ్మవ♦ర్చసముఁ గన్న, మారుఁ డన నొప్పువిప్రకు♦మారుఁ గాంచె

విక్రమార్కచరిత్రము. ఆ 7 ప 143

## —♦ వైఖానసులు ♦—

సీ. వైఖానసులు ఖర♦వ్రతు లెట్టు లంటేని, శిలఁ దృణధాన్యముల్ ♦ సిదుక నడిచి
కొందఱు పండులుఁ ♦ గొతికి కొందఱు గన్న, గుఱుముల గువ్వల ♦ తెఱఁగు దోఁప
నప్పటి కప్పటి ♦ కాననంబున వైచి, కొని కొంద ఱాకు లెం♦డినవి యేటి
కొని కొంద ఱంబువుల్ ♦ గొని కొంద ఱనిలంబు, గొంద ఱాహారంబు ♦ గొందు రట్లు.
గీ. గాక యాహారపరులును ♦ గలరు వార, లింద్రునకుఁ బూజనీయు లై ♦ యెక్కు డైన
పదవిఁ జిరకాలబహుసౌఖ్య♦భాగులగుదు, రని మహేశ్వరుఁడు మమునిఁ♦ ట్లనియె మతియు

భారతము. అను. ఆ 6.

## —♦ శివాలయము ♦—

సీ. రూఢిగా బహువిధ♦రుద్రసూక్తంబుల, శివు నభిషేకంబు ♦ సేయువారు
గంధపుష్పాక్షతా♦గరుధూపదీపనై, వేద్యంబు లిచ్చి సే♦వించువారు

శివుని సన్నిధిఁ బ్రద♦క్షిణపూర్వకంబుగా, మునుకొని పలుమాఱు♦ మ్రొక్కువారు
స్కాందపురాణాది ♦ శైవాగమములెల్ల, వీనుల కింపుగా ♦ వినెడువారు
గీ. నీలగళుపాట వినుచు మై♦సోలువారు, శంఖమర్దళధ్వానముల్ ♦ సలుపువారు
నగుటఁ గని చోరుఁ డలుకఁ♦కరుగురత్నని, లలితమైనట్టి యావా♦లయము నందు.

శివరాత్రిమాహాత్మ్యము ఆ 4.

## —♦ వేదోత్పత్తిక్రమము. ♦—

సీ. నలువతొలిమోమున ♦ నవజపాచ్ఛవి రజోగుణయుక్తమై వెడలె ఋ♦గ్వేద మద్ది
దక్షిణాస్యమున ర♦క్తచ్ఛవి సత్త్వగుణమున్ గలదై యజు♦ర్వేదమెసఁగె
జరమముఖంబున ♦ సామంబు తెలుపయి, పుట్టెఁ దమోగుణ♦స్ఫూర్తి మెఱయ
నుత్తరాననమున ♦ నుద్భవించె నథర్వ, మసితమై సత్త్వ ♦ మోహ తమోత
గీ. నమరు నీనాల్గు శ్రుతులకు ♦ సాధ్యమైన, యట్టి పరిణామంబు తేజోమహత్త్వమునను
ఋగ్యజుస్సామ తేజంబు ♦ లేకభావ, మొందె త్రిగుణమయాకృతి ♦ నల్లనెల్ల.

## —♦ దేవమనుజాద్యుత్పత్తిక్రమము ♦—

చ. వెరవగు నీశ్వరాజ్ఞఁ బ్రభ♦వించిరి బ్రహ్మయు విష్ణుదేవుఁడున్
హరుఁడు చరాచరాత్మకచ♦యంబుల సద్భవరక్షణక్రియా
హరణ గరిష్ఠులై తన య♦హంకృతి మించి ♦ విరించి లోకముల్
వరగ సృజింపగా ద్విషత♦పంబు మహత్త్వము జూపు నయ్యెడన్.
చ. శిరమున నంబరస్థలము ♦ చిత్తమునన్ విధుఁ డాననంబునన్
సురపతి వహ్ని విప్రులును ♦ సూర్యుఁడు కన్నుల సర్వదిక్కులున్
బరువడిఁ గర్ణరంధ్రములఁ ♦ బ్రాణములన్ పవనుండు బాహుల
న్నరయఁగ రాజరాజియును ♦ సంచితనాభిమహాంతరిక్షమున్
క. ఊరుతలంబున వైశ్యులు, చారణనుతినొప్పు చరణ♦సరసీజములన్
భూరమణియు సచ్ఛూద్రులు, గారవమునఁ బుట్టిరట్టి♦ఘనతరమహిమన్. 383

వైశ్యపురాణము. ఆ 1

## —♦ ఎఱుక చెప్పుట ♦—

సీ. సరసవతీదేవి ♦ సదువులదొర రేణుకాపరంజ్యోతి, యా♦కాసవాణి
వేఁడి వెల్గులసామి ♦ వెన్నెలరాజము, కన్నులదేవర ♦ కాశినాథ
సిరికొండమల్లేశ ♦ శ్రీకూర్మనాయక, మాపాలిరంగ హ♦నుమంతరాయ
శ్రీరామదేవతా ♦ శ్రీవెంకటేశ్వర, ముల్లోకమాత ము♦ద్దుగుమ్మ సత్తి

గీ. సీతపూజసేవి మాపాలి ♦ సిరులతల్లి, నమ్మ కొల్లాపురీదేవి ♦ యాదిలక్ష్మి
విశాలంబులం దోడయి ♦ మించి యుంచి, వాయదయ సేయుండిపుడు భా♦వమున నుండి
గీ. సకలభాగ్యశాలివై నీవు ♦ సన్నుతాంగి, గరిమ నీపాటి సకలలో♦కములయందు
చూడఁగా లేదు నినుఁ గొల్వఁ ♦ బాడి పంటు,సొమ్ము సోబనములుగల్గు సుమ్ము తల్లి

వేంకటేశ్వరవిలాసము.

# తెలుఁగు భాష

ఆ. తెలుఁగదేల యన్న ♦ దేశంబు తెలుఁగేను, తెలుఁగువల్లభుండఁ ♦ దెలుఁగొకండ
యెల్లనృపులుగొలువ ♦ నెఱుఁగవే బాసాడి, దేశభాషలందుఁ ♦ దెలుఁగు లెస్స.

ఆముక్తమాల్యద. పీఠిక ప 15.

## —♦ కవితాప్రశంస ♦—

చ. కవితయనంగఁ బద్యములు ♦ గద్యములున్ రచియించుటౌనె భా
వవిలసనంబు, లోకహిత♦వర్తనముం బచరింపఁజేసి, క
ర్తవకును నద్దమెట్లుటుల ♦ గ్రంథచమత్కృతి నేర్పు పెంపునన్
బ్రవిమలవస్తుతత్త్వమును ♦ భాసిలఁజేయుట గాక యారయన్.

చాటువు.

శా. సౌరభ్యంబును బంధచాతురితగన్ ♦ శయ్యాచమత్కారశృం
గారంబున్ వివిధార్థముల్ సరససాం♦గత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభవమున్ ♦ పాంచాలరీతిం దగన్
వారస్త్రీయునుబోలె నొప్ప వలదా ♦ వర్ణింపఁ గావ్యం బిలన్.
క. నానుడులును శృంగారము, నానావిధవృత్తవర్ణ♦నలు సంపూర్ణం
బై నిల్చిన కృతి సత్కృతిఁ, గా నుతియింతురు గదా సు♦కవు లెయ్యెడలన్.
క. బాజులపోట్లనువిప్పిన, యోజఁ గవిత్వంబు వెలయ♦నుండిన సభలన్
బూజింతురె యాకృతిబుధ,రాజులు రాజులును సుకవి♦రాజులు గరిమన్.
చ. పడియును బ్రాసమున్ గణము ♦ వర్ణన లర్థము శబ్ద మొప్పునే
కడమయుండేదు మత్కృతికిఁ ♦ గైకొని చూడుఁడు సత్కవీంద్రు లె
య్యెడ నెది యొక్కపద్యమున ♦ నిందులసత్త్వము పద్మలోచనల్
కడివెఁడుకూటిలో మెదుకుఁ ♦ గైకొని పాక మెఱుంగుకైవడిన్. 3842

రుక్మాంగదచరిత్రము. ఆ 1 ప 24-27.

గడచి ఘటించు కావ్యములు ♦ కావ్యములా హరణాఘుకాంతికై
విడువక కూలిఁ బెట్టి చది♦వించు కృతుల్ గృతులే వసుంధరన్. 3849

పంచతంత్రము, వేంక. ఆ 1.

క. నిగుడు నవరసములొలుకఁగ, ద్విగుణంబగు వర్ణములును ♦ దీపింపఁగఁ ద
ద్విగుణాలంకృతులును ద,ద్విగుణములగు నర్థభావ♦విధములు గలుగున్.

క. తెనుఁగైన నేమి కవితా,జనితాలంకారచిత్ర♦సంగతపదవ
ర్ణన వచనరచనచతురత, వినయోగ్యంబయిన కృతియ♦వింద్రు మహాత్ముల్.

ఉ. దోషసమేతమెంతయును ♦ దొడ్డది యైనను నిందితంబు ని
ర్దోషము గొంచమైన జగ♦దున్నతి వొందుఁ గళంకహీనసం
వేషశశాంకఖండమును ♦ విశ్వవిభుండు కిరీటకోటిపై
భూషణలీలఁ దాల్చె నల ♦ పూర్ణశశాంకు ధరింపఁ గోరునే.

క. భూషణశీలల దేశవి,భాషలదత్తత్ప్రదేశ♦భాషణములగున్
భూషించునస్తమట్లు సు,భాషితమై సంస్కృతంబు ♦ బహుదేశములన్

చ. జనని సమస్తభాషలకు ♦ సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవి♦కాసి తెనుం గభిగమ్యమంతకున్
గనుఁగొనఁ జాతబీజమున ♦ కంటెను కోమలపత్రపుష్పశో
భనమగు పల్లవాభినవ♦జాలగసాలము సొంపు నింపదే.

ఉ. జల్లియుఁ గ్రమంబు నప♦శబ్దము వైరిపదంబు జడ్డునుం
బొల్లయు గ్రామ్యకంటకము ♦ బూరకమున్ విరసంబు లాదిగా
నల్లికలల్లు కబ్బములు ♦ నాదరణీయమె వాక్యచాతురీ
సల్లలితార్థసృష్టిగల♦సత్కృతి సేవ్యము బొందుకైవడిన్.

మ. సరసాలంకరణోపమానకవితా♦సంధిక్రియాచాతురీ
భరితప్రౌఢిరచించు సత్కవిజగ♦త్ప్రఖ్యాతివర్తింపఁగా
గరిమం బేర్చిలుచు దుస్సమాననిపుణుల్ ♦ గర్వింతు రల్పజ్ఞులై
హరియుండన్ హరినామభేకతతులై ♦ యబ్ధింబ్రలాపింపవే. 3856

గీ. కావ్య ముత్పాద్యమైన స♦త్కావ్య మింక, నుక్తకావ్యంబయే పునః♦రుక్తిఁ దెచ్చుఁ
గాఁగఁ గవితాభిముఖుఁడైన♦కవివరునకు, మిశ్రకావ్యంబె కావ్యమై♦ మెఱుఁగుదెచ్చు

గీ. పరగుణాంకితమయ్యు నే♦ పరసకృతియు, దూష్యమగు శునిధృతగత♦దుగ్ధమట్లు
హరిగుణాంకితమయ్యునే ♦ నసమకృతియు,హరసూత్రంబుగతి పావ♦యంగమంబు

కవికర్ణరసాయనము, పీఠిక. ప 10, 24, 26.

సీ. సరసపుష్పములుగ మాల♦కరి పెక్కుతెఱఁగుల, విరులనెత్తురుఁ గా♦వించుమాట్లు
కర్పూరకస్తూరి♦కావస్తువితతిచే, శ్రీఖండచర్చ గా♦వించుమాట్లు
ఒడికంబుగా గంధ♦వాడికి నానానూన, పరిమళంబులు గూర్చ♦ బఱచినట్లు
సరఘులు వివిధపు♦ష్పమరందలవములు, గొనివచ్చి తేనె గాఁ♦ గూర్చినట్లు
గీ. భారతప్రోక్తకథ మూల♦కారణముగఁ, గాళిదాసుని నాటక♦క్రమము గొంత
తావకోక్తికి నభినవ♦శ్రీ వహింపఁ, గూర్మిఁ గృతిసేయు నాప శా♦కుంతలంబు.

శకుంతలాపరిణయము, ఆ 1.

సీ. శబ్దాపశబ్దవి♦చారియై ట్రివ్యాకరణజ్ఞు జనకుని♦గాఁ దలంచు
యుక్తివాదములచే♦ నొప్పారు తార్కికు, భ్రాతగా బుద్ధి [illegible]♦[illegible] దలంచుఁ
జతురుఁడౌ మీమాంస♦శాస్త్రపారీణుని, గడియఁగ [illegible]♦గాఁ దలంచు
నాదిగ వైదికనిష్ఠ♦నుఁడు నధ్యాపకుఁ, గనలి [illegible]♦గాఁ దలంచు
తే. వివిధముగ నిట్టు లధిప క♦విత్వకన్య, కావ్యనాటకలసదలం♦కార [illegible]
నవరసాభిజ్ఞు మది వి♦నాయకునిగఁ, దలఁచి వరియించుఁ దనుఁ దానె♦[illegible]

బిల్హణీయము, ఆ 1 ప 78.

ఉ. శ్రీమదగచాతురీమృదుల♦మిశ్రవిచిత్రకవిత్వతత్త్వసం
మోదగసజ్జితాభిరతి♦మూర్ధుఁ డెఱుంగునె ప్రాజ్ఞుకైవడిన్
మోఁదటి యాకులన్ మెసఁగు♦ మేష మెఱుంగునె యిక్షుఖండికా
స్వాదరసానుభావ మతి♦ సారమదేభ మెఱుంగుకైవడిన్.
ఉ. వారిజగర్భపత్నికర♦వారిజసన్మనుమాధురీధురీ
సారకవిత్వతత్త్వమును♦ ప్రాజ్ఞునికైవడిఁ గూళ మెచ్చునే
సారపయోధిశీత సర♦సత్వవికస్వరచంద్రచంద్రికా
పారమయూఖరేఖలకు♦ పైఁబడి యుబ్బునె యల్పకూపముల్.

పర్వతపురాణము, ఆ 1.

మ. విపులంబై విన యోగ్యమై విశదమై♦ వింతై విశేషంబునై
సమధారామధురంబునై సరసమై♦ చాతుర్యవంతంబునై
యమకం బందుఁ జెలంగు చిల్కవెన్నెల[illegible]♦ హర్షప్రదంబై సుగం
ధమరుత్ప్రోతములీలఁ జూ కవిత యు♦ద్ధాత్రిం జరింపందగున్. 3863

విశ్వకర్మపురాణము, ఆ 1 ప 7.

గీ. మారుమూలలఁ గలుగు క♦ఠోరశబ్ద, కలితపాషాణపాకముల్♦ గడలుకొలిపి
శబ్దములు చెప్పి యరసిక♦గ్రామణులకుఁ, గృతు లిడుదురవిశ్వాంక్షికో♦[illegible]లు గాన.

తే. తగ నుపాధ్యాయజనులు వే♦దములుశిష్య,జనములకుఁ గష్టపడిచెప్పు♦ మొనయుశేని
యుర్వి నిర్వేదవాదము ♦ నిర్వితాన, మప్పుడేకాద తలపోయ♦నద్భుతముగ.

విశ్వగుణాదర్శము.

# బంధకవిత్వము

## —♦ శంఖబంధము ♦—

క. మరకతమణిమయమహితత, కరమలరుతనుకళికలిమి ♦ కలికిసతమ్మా
యురమున భుజగవరధరా, ధరమును నమరు హరి మదన♦దమన నుత పదా.

## —♦ రథబంధము ♦—

క. శ్రీ మీ వెంట న్గామక, రా మకరిని పెక్కడించి ♦ రమ్యగజేశ
గ్రామణి గావన్ లేదా, నీమాయాలీల నూవె ♦ నీలనగపతీ.

## —♦ చక్రబంధము ♦—

శా. సత్యాకల్పక ప్రస్ఫుటాశరభిదా♦చారావిశంక క్రమా
మత్యావిష్కృతబంధురాదరణభూ♦మా జంతుకూటాశ్రితా
దిత్యావేంధనధర్మసారరతమూ♦ర్తి ముత్కరాదిప్రికుమా?
మాత్యుల్లాసపదామహావిదితధా♦మా సాధుతారకుమా.

## —♦ నాగబంధము ♦—

చ. కరివరదానశూరసుర♦గౌరవసజ్జితపాదసారసా
ధరధనధారిసూరినర♦తారకనిత్యనశోకదాసభా
స్వరమదకౌశలారహిత ♦ సారకుభృద్వరధీరమానిభా
సురశుకగీతమారనిభ♦శోభనరమ్యశరీరసంభృతా

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. పద్య 853-862.

## —♦ కంకణబంధము ♦—

ఉ. నారదసుందరాంగ ఖగ♦నాథయధర్మహరాహరార్చితా
వారకలోకదూరవర ♦ నందప్రవర్తసుతాసురస్తుతా
తారప్రియాప్రియాకనక♦ధామపవిత్రపరాపదప్రదా
దారుణకోణపావళివ♦ధప్రితవజ్యనఘావివర్ధనా. 3883

## — చాపబంధము —

ఉ. సారవిమత్త పుణ్యజన • సార్థపరిక్షిప్త కరాతిసాహసా
సారసలోచనాలసిత • సాగరకన్యరతీపరిలాలసా
సారససూర్యనేత్ర బుధ • సంస్తుతతాకపుణ్యాప్రిమానసా
సారవిమత్త పుణ్యజన • సార్థపరిక్షిప్త కరాతిసాహసా. 2881

కవిజనచకోరచంద్రోదయము. 1 ఆ. ప 157-158.

## — ఖడ్గబంధము —

మగం. భీమనామసోమదైత్య • భేదనాథనామనామా
యామవత్యధీశకల్పి • తాభిరామశేఖరా
రామపూజ్యపాదభక్త • రక్షణాదికక్రియా
యామరేంద్రమౌళిఘృష్టి • తాంఘ్రిపద్మశంకరా !

సీమంతినీకల్యాణము, ఆ 6.

## — పద్మబంధము —

చ. కనుఁగొన రేకు లెన్మిదియుఁ • గర్ణికమధ్యమ సద్గురాంఘ్రులన్
మునుపటియేడువర్ణములు • నుం గడయేడుఁ బ్రవేశనిర్గతు
ల్పనుపడ నాల్గుదిగ్దళము • లన్ లిఖియించి విదిగ్దళంబులం
దెనయఁగఁ బాదమధ్యగము • లేదును వ్రాయఁగఁ బద్మబంధమౌ.

నరసభూపాలీయము. ఆ 4 ప 86.

## — ఛత్రబంధము —

క. సారసభూనుతవనలమ, సారసభవభయభకాభ • సరమారామా
మారామారవహాబాధా, ధారాహరసామలనవ • తనుభూసరసా.

## — మర్దలబంధము —

చిత్రపదవృత్తము. భూరిదయావలదక్షా, నూరిభవాపహదక్షా
వారిదకోమలగాత్రా, వైరిభయావహగాత్రా. 2882

సుమనోమనోభిరంజనము. ఆ 2 199, ప 197.

## ♦ గోమూత్రికాబంధము ♦

క. హరిపదసరసిజమధుకర, మురభిదసితమూర్తిరామ ♦ భోగసురామా
కరిరదసురకుజవిధుకర, శరదుడసితకీర్తిధామ ♦ చాగయరామా.

శ్రీరంగమహాత్మ్యము. ఆ ౫ ప 1292.

## ♦ శుద్ధాంధ్రగోమూత్రికాబంధము ♦

క. పునితోలుం బలుమేలుం, దలపై విన్నేటిజాలు♦దగునలవేల్పా
తెలిడాలుం నలుగేలుం, దలమా విన్మేటివాలు♦దగునెలదాల్పా.

శేషధర్మము. ఆ సు ఆ ౫.

## ♦ అష్టదళపద్మబంధము ♦

చ. జలనిధికన్యకాంతకల♦సారసనేత హిమాంశులోచనా
సలలితవ్యాసమూరినుత♦సామజవైరిశిరఃప్రలుంఠనా
సలిలజపత్రనాభసర♦సాఘనమాధవశౌరిగోపికా
జలజనిభాస్యపోషరభ♦సా రిపుదూషవిరించివందితా.

కవిజనచకోరచంద్రోదయము. ఆ 2 ప 158.

## ♦ చిత్రబంధవిచిత్రకందము ♦

క. దారవతనువభజయజయ, సారశమసమగ్రమహిమ ♦ శరహాసరసా
సారసహారసుకరభా, భాకరసురసాయజయజ ♦ భవనుతవరదా.

ముకుందవిలాసము. ఆ 2 ప 259.

## ♦ పుష్పమాలికాబంధము ♦

చ. శమదమధామమానసల♦సద్వసనావృతనూతనాతసీ
సుమసమకోమలాంగ శుచి♦శుభ్రశుభాకరధీరసారకీ
ర్తిమహిమసామగేయకృత♦కృత్యకృపానిధిరాధికాధిపా
సమదమహామురారిచః♦చక్రచరాచరవారణాకరణా. 3893

కవిరాజమనోరంజనము, ఆ 4.

## ♦ పుష్పగుచ్ఛబంధము. ♦

స్రగ్ధర. ఘ్మావారీవాధవాశీ♦కనయనకనదా♦కారధీరప్ఫురద్ధ్వ
ధ్యావాధీనాత్మనారా♦యణగుణగణపూ♦ర్ణావిధూవిజ్ఞవిష్వ

తేనేనేనే నేనే

నేనేనేనేదె వేనె ♦ జేజేజేజే.

షట్చక్రవర్తిచరిత్రము. ఆ 3 ప 105-114

## —♦ సర్వలఘుసీసము ♦—

నవవికచసరసిరుహ ♦ నయనయుగనిజచరణ, గగనచరనదిజనిత ♦ నిగమవినుత

జలధిసుతకుచకలశ ♦ లలితమృగమదరుచిర, పరిమళితనిజహృదయ ♦ ధరణిభరణ

ద్రుహిణముఖసురనికర ♦ విహితనుతికలితగుణ, కటిఘటితరుచిరతర ♦ కనకవసన

భుజగరిపువరగమన ♦ రజతగిరిపతివినుత, సతతజపరతనియమ ♦ సరణిచరిత

తే. తిమికమఠకిటినృహరిము ♦ దితబలినిహి, తపదపరశుధరదశవ ♦ దనవిదళన

మురదమనకలికలుషసు ♦ ముదపహరణ, కరివరదమునినరసుర ♦ గరుడవినుత.

భాగవతము. స్కం౦॥ప 72.

## —♦ సర్వలఘుసీససమసీసము ♦—

నిఖిలసుగదనుజ ♦ నికరమథితజల, నిధిభవఘుమఘుమ ♦ నినద మనఁగ

నభినవఘనసను ♦ యసముదయదళని, లసదమితపెళపె ♦ ళరవ మనఁగ

సహంపగమనటు ♦ దభవకరధృతప, రథమరుషమథమ ♦ రణిత మనఁగ

ఖలకనకకసిపు ♦ దళనవిహరణనృ, హరిభయదకహక ♦ హరుత మనఁగ

గీ. దతతుహినమహినమహిధరతట ♦ పతపతులిత, గగనసరిదుదితబహుళ ♦ ఘుళఘుళమహి

మయనఁగ దివిభువినెనయు ♦ నయము మెఱయ, రహి వెనుకొనినిజపటుహ ♦ రభటి నిగుడ

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. పద్య 75.

## —♦ ముక్తపదగ్రస్తము. ♦—

సీ. శ్రీమత్కూటాక్షర ♦ క్షితపనద్విపరాజ, రాజవిభూషణ ♦ ప్రణుతసార

సారంగరూపరా ♦ కుసదానచణబాణ, బాణరాత్రించర ♦ ప్రాణహరణ

రణభోజవాత్రిమా ♦ ర్కండేయనుతిబృంద, బృందావనాంతర ♦ ప్రియవిహార

హారకోటీరకే ♦ యూరముఖ్యాకల్ప, కల్పాగసుమధరా ♦ నల్పమహిమ

గీ. హిమమయూఖాబ్జబాంధవ ♦ కమలనేత్ర, నేత్రవల్కలధారణ ♦ నృపతిధామ

ధామవిదళితరావణ ♦ దస్యుసార, సారఘనధామవేంకట ♦ శైలధామ. 3916

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 387.

## —♦ పాదాంతపాదాదిముక్తపదగ్రస్తము. ♦—

క. సుదతీనూతనమదనా, మదనాగతురంగపూర్ణ♦మణిమయసదనా
సదనామయగజరదనా,రదనాగేంద్రనిభకీర్తి♦రసనరసింహా. 3922

నరసభూపాలీయము, ఆ 4 ప 83.

## —♦ యతిభేదకందము ♦—

క. వలసినమేవులుగొని క్రాల్గులావులునునిక్కలించి ♦ దుక్కగరిపయిన్
బులుగులుచట్టుప లార్చుచుఁ, గొలకొలమనికూఁతలిడుచు ♦ గూడులు సేరన్.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. పద్య 6.1

## —♦ ఏకప్రాససీసములు ♦—

సీ. డెందంబునింద్రియ♦బృందంబు నొకటిని, ప్పందంబుఁ గావించి ♦ క్రిందుపఱిచి
యందంబుగ మనోర♦విందంబునకు మూల, కందంబునౌ చిదా♦నందజలధి
నందంబు చిందువ♦మందంబుగానొందు, చందంబునం బొంద♦మందు లెల్ల
నిందించినను నభి♦నందించినను మేలుఁ, జెందించినను గీడుఁ ♦ జెందునవ్వ
తే. డెందుఁ దగులుక విందుగా ♦ నందుకొనుచు, సందియంబులసందడి ♦ నిందఁజేసి
కందువేనిమనీషిస♦నందనాది, వందనీయుండతైనవా ♦ యందుఁ గలదు. 3924

సీతారామాంజనేయసంవాదము. ఆ 2 ప 150.

సీ. ఔరగంధపుమెట్టు ♦ దారిఁదారెడుపాంప, కోరనొక్కినసెక ♦ యూరుటకుమ
తీరైనపాండ్యరా♦ణ్ణారీకుచోదార, హారావళీయుక్త ♦ చారుగంధ
సారపంకవిహార♦హారియై నిబిడశృం,గారవనంబులఁ ♦ జేరిమీఱి
సారససారస ♦. సారసౌరభములు, చూరలుగొనుచుఁ గ♦ర్పూరముల ను
గీ. మారములు దోఁటి హిమవారి♦పూర మాని, పేరెములు చాటి మిగుల గం♦భీరముగను
సారె పురవీథి గడిజేటి ♦ స్వారి దిరుగు, మేర నందంద మందస♦మీరణంబు.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. పద్య 17.

సీ. వనజాక్షి యాడఁబో♦యినతీర్థ మెదురయ్యె, ననురీతి నిటఁ గనుఁ గొనఁగ నయ్యె
వనజాతమిత్రుని ♦ తనయ యిక్కన్నియ, నిను భర్తగాఁ గోరి ♦ తనదు తండ్రి
యనుమతిఁ గొని సఖీ♦జనములతో నిన్న, దినశక్తికృతగేహ♦మున వసించి
నినుగురించిసపర్య♦లెనలేని భక్తిచేఁ నొనరించు చుండెను ♦ దినదినంబు

గీ. కనికరంబున నను వారిఁ • గనికరంబు, మనుచునో వేఱు సేయునో • యనుచు నాఁడు
మనసు కడలేనికడలిని • మునుఁగుచుండఁ, గనక కనకాద్రిగాత్రి యుం • జెను [illegible]

కాళింది పరిణయము. ఆ 2 ప 122.

## —♦ ద్వ్యనుప్రాసము ♦—

క. వనము నిఖిలజనసంజీవనము సకృద్దర్శనాఖి • వర్ధితపుణ్యా
వనము నిరంతరమునిసే, వనము పగతిజీవనము సు • [illegible]పావనమై. 3927

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. ప 41

క. మోమోటము లే కింద్రుం, డామాటం బలుక నలుక • [illegible]
డామేటికిఁ దగ మని జే, జేమేటిం గారణంబుఁ • జెన్నఁ [illegible].

నయనోల్లాసము ఆ 3 ప 10

క. ఆపురమవనిరమణిమణి, నూపురమై శోభిల్లి • నోపక్రమమహా
గోపురమై నృపకోటికిఁ, గాఁపురమై తనరు యజ్వ • [illegible]మై.

వల్లవీపల్లవోల్లాసము. ఆ 1 ప 13.

## —♦ త్ర్యనుప్రాసము ♦—

క. చిందమ్ముల చందమ్ముల, కెందమ్ముల తెగి డెగడు స • కియామెడ [illegible]
రందమ్ముల చెందమ్ముల, యందమ్ములగు మహీశాధ • రాస్త్రేక్షణముల్.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. పద్య 609.

క. హితులార యచ్చినీపిరియా, సుతులార యకారణంబ • చొప్పడుఁ గడునీ
గతిమీర నిచ్చటికి స, మ్మతిమీఱఁగ వచ్చు టెన్న • మాభాగ్యమెకా.

నయనోల్లాసము. ఆ 3 ప 62.

## —♦ లాటానుప్రాసము ♦—

చ. ఘనతనృసింహుఁజూడఁ గల • కన్నులు కన్నులు వాని కౌఁగిటం
జనువున చేపు చూపఁగల • చన్నులు చన్నులు వానిమోవికిం
జొనిపినపాటలాధరము • జున్నులు జున్నులు వానిమేనఁ జే
ర్చినసరసాంగవల్లికల • చెన్నులు చెన్నులు వో తలోదరీ. 3932

నరసభూపాలీయము. ఆ 4 ప 78,

త్సాహధికశోణితమురక్త • తతుణరక్షితపక్షిలోకనిన్
గములదశాత్ముం డేలు బల • గౌరవసింహాన్నసింహభూవరా.

నరసభూపాలీయము. ఆ 4 ప 77.

—♦ కకారాద్యక్షరకందము ♦—

క. కలకంఠము కరపులుకును, కలవింకముకంకణంబు • కహ్వాము కరుడున్
కలతవము కనకభుక్కును, కళుకును కంకమునుగాకి • కక్కెర్కైదున్

ప్రపంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. పద్య 230

—♦ ద్విరుక్తికందము ♦—

క. నకనకనినదమునక్కలు, చకచకలవెలాన్బతోడలు ♦ జక్కనితో గలన్
వికవికనగుతెలిగన్నులు, వికచకమలవదనకొనశె ♦ వేడుకమీఱన్.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. పద్య 460

—♦ పాదభ్రమకందము ♦—

క. దానవజలేజవనజా, భానుతతవిభాకరైక • భావితనూభా
మానాథవివిధనామా, యానసరసహారహీర ♦ హాసరసనయా.

కవిరాజమనోరంజనము. ఆ 4.

—♦ పాదయమకము ♦—

క. ఔరా యోబన్నపాలకు, మారా మనుమదనసమర • మాధుర్యుండవై
ధీరా న్నసింహకూడితి, మారామనుమదనసమత • మాధుర్యుండవై.

నరసభూపాలీయము. ఆ 4581.

—♦ ఉభయభాషాకందము ♦—

క. రామము దేవర కావవ, యామాజేజేయనయమ • యామున్నలజే
శమదినినారదేయుయి, తేముద్దామోదరయది • తేలందానిన్.

లంకావిజయము. ఆ 2.

—♦ ఆంధ్రగీర్వాణభాషాశ్లేషము ♦—

క. దేవరమే లారసికా, యేవరసన్మానకమది • నే ననయము నీ
తావవుసన్నాకదనం, దావాలాయమనుమాట ♦ దప్పవినశయా. 3939

కవిరాజమనోరంజనము. ఆ 4.

గీ. నాఁడశేరజ్జలదకాళి♦కారజాతి, తితఁయ ధరాజచందన♦త్రిదశశక్ర
కాలహాతిచంద్రసచ్ఛాయ♦కజని గేయ, రైన నీలగళాకృతి♦కాననయ్యె. 3945

సర్వకామదాపరిణయము, ఆ 2.

## ఓష్ఠ్యనిరోష్ఠ్యసంకరము.

శా. భూనాథోత్తమ జంభభంజనమహా♦భోగాభిరామక్రియా
భానోజ్జృంభితవారిపూరభరితో♦ద్యద్వార్ధివీచివ్రజా
మానామేయసుధాబ్ధివిస్మలగుణా♦మాధ్యన్మహాయూథప
శ్రీనూత్న ప్రథమానభాగ్యవరదై♦రిద్రాతభేదివ్రతా.

నరసభూపాలీయము, ఆ 4 ప 90.

## అచలజిహ్వాము.

మాపై పాపము మున్నె
డాపమునై మొప్పవమ్మ్రి♦ప్రభమింపుఁజే
మీపై ప్రేమంజేపై
పాపై పెంపొప్ప మమ్ముఁ ♦ జంపుము భీమా.

వాసవదత్తాపరిణయము, ఆ 4 ప 80.

క. భోగాంబువాహవాహావి, భాగేహోభావుకాంగ♦భావభవమహా
భాగమహీభాగమహా, భోగావహబాహుభోగి♦పుంగవభోగా.

నరసభూపాలీయము, ఆ 3 ప 159.

## ప్రాసభేదము

క. పక్షీశ్వరతుఖ్యారథ, వక్షస్థమంకరగభీర♦పాథోధిమహా
క్షోణీనాధ్వజనుతదయా, రక్షింపుము వలదుపేక్ష♦రాజీవాక్షా.

క. అనిసంశయంబుతోఁదన, మనమునఁ జర్చింపఁగఁగ♦మాలికనియె నే
నినుఁగని దెల్పినవాన్యాయణుఁ డితఁడే జక్కఁజూడ♦వమ్మాకొమ్మా.

క. మిత్రుని తేజము విశ్వామిత్రునిశక్తి గలదంచు♦మెండుగ మిధ్యా
మితస్తోత్రము వినను విధాత్రుఁడు నీరీతి నీదు♦తలవ్రాసెనొకో.

క. నేతను మంత్రములందఱు, నేతను దత్రిపుల పేరిపు♦లీరణముపకున్
నేతుబిరియంపదతాలుపుగ, నేత్రివిధమ్ములను మీరఁ♦లైఁ యే తనకున్. 3952

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము.

## —◆ భంగ్యాంతరకల్పన. ◆—

క. మిన్నగు మెయిగమున నెలకలి, మిన్నగురాదానికౌను ◆ మెయిగణువృకశెన్
మిన్నవనా మిన్నవనా, మిన్నగాఁ జాలవేమి ◆ మెప్పానె నరన్.

వల్లభీవల్లభోల్లాసము, ఆ 2 ప 194.

## —◆ అనులోమము. ◆—

క. సారసనయనా పావనచర, సారవరాహాకనక ◆ రవితతరామా
మా రాతతవిశదకనక, హారావరసారచరవ ◆ నాయనసరసా.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 4 ప 212.

## —◆ సంస్కృతచతుర్థ్యాంతములపద్యము. ◆—

సీ. మాధవాయ నమదు ◆ మాధవాయ నమస్తు, సాధుయూధారాధ ◆ మాధవాయ
శ్రీకరాయ దయాకర ◆ సాకరాయ రుచిప్రభాకరాయ విమల ◆ భీకరాయ
వ్యాపకాయ జగత్స్వ ◆ రూపకాయ నిగమ, స్థాపకాయ పవిత్ర ◆ దీపకాయ
కారణాయ భువన ◆ కార్యస్యదురితాబ్ధి, వారణాయ సదార్తి ◆ వారణాయ
తే. హారిణే భక్తహృదయవి ◆ హారిణే ఘ, సారిణే సంతిపేర్థోంఘ ◆ ధారిణే వి
చారిణే పోషితానంత ◆ చారిణే ని, రంతరం తే నమోస్తు మం ◆ త్రాహి కృష్ణ.

సుమనోమనోభిరంజనము, ఆ 2 ప 11.

## —◆ అర్థయమకగీతము. ◆—

అమృతగోరాజకుండలీ ◆ శాభ్రిహంస
కళుచిమూర్తి తనూకృతి ◆ కామదేవా
అమృతగోరాజకుండలీ ◆ శాభ్రిహంస
కళుచిమూర్తి తనూకృతి ◆ కామదేవా. 3956

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3.

## —◆ అచ్చతెనుఁగుసీసము. ◆—

సీ. గుడుగుపాల్ మబ్బులా ◆ పిడుగువానకుగట్లు, గొడుగువాటముదాల్పు ◆ వడుగువాఁడ
నుడుగువాల్ గమిమైల ◆ గడుగువారి మెఱుంగు, ఉడుగువానినెఱ్ఱి ◆ మడుఁగువాఁడ
పడుగువాలికనని ◆ చెడుగువారిని చెండ, పొడుగువానగుకత్తి ◆ దొడుగువాఁడ
వడుగువాతకబలి ◆ నడుగువాకువఁజేరి, యడుగువాలఁగదొత్తిత్రు ◆ నడుగువాఁడ
గీ. నడుగు వదలనిజగకెట్టి ◆ ముడుగుటకును, చిడుగుడునగరిడీసడచె ◆ క్కుసగువాఁడ
సొగసుకాటుకపేరిగొం ◆ డగవిదారి, నోమినెక్కొన్న నలమూపు ◆ సామిమిన్న.

## —◆ సంవత్సరయుక్తసీసము. ◆—

శ్రీముఖ ప్రభవ సు◆స్మేరాభ కౌస్తుభ, సర్వజి ద్విక్రమ◆ చక్రిహస్త
సౌమ్య భావమునీంద్ర◆సన్మనోంబుజభృంగ, యువ్యయానందహ◆ద్భవ్యరూప
ధాత్ర సాధారణ◆స్తవనీయ నిజచర్య, విభవ ప్రమోదాప్త◆విబుధనాథ
జయ దుందుభిధ్వాన◆చకితాసురాధ్యక్ష, దుర్మతి రాక్షస◆శర్మహరణ
చిత్రభాను స్వభానుజి◆త్సిద్ధ తేజ, విజయ నందన ఖరనూత◆విధివినోద
మన్మథ క్రోధి ధర్మని◆ర్మధనపార, వృషగిరీశ్వరసంకాశ◆వేంకటేశ. 3958

## —◆ ఏకద్విత్రిచతుఃపంచషట్సప్తాక్షర క్రమపాదనియమసీసము. ◆—

సీ. రారాతరారర◆హూహూతరేరార, రేరరరీరర◆హూనరార
భాభీరుభీభర◆భాగభేరీభేరి, భూరిభాభాభీభూ◆భూభరాభ
నిలినీనిలీనైక◆లలనాకళానూన, లాలనలోలాక◆లంకలీల
దరహాదదరధర◆కరదనాదోదర, దారకాదరకర◆దారవరద
గీ. గోపబాలక పాలక◆పాపలోప, పాలకవిలాసవేంకట◆శైలవాస
భవ్యభావకవాకార◆దివ్యరూప, రాధికాస్ఫుటదిక్కారి◆కాధరాంగ.

## —◆ { నవగ్రహ, నవరత్న, నవనిధి, నవరస ప్రతిపాదకప్రతాపసత్కీర్తిసీసము. } ◆—

పద్మాప్తనిగ్రహ◆ప్రభఁ గరుణగనిహి, మకరతశృంగార◆మహిమ వెలసి
ఘననీలగారుమణి◆ఖగరౌద్రతమగేరి, శంఖజకవులహా◆స్యంబుజేసి
క్ష్మాజవిదూరజా◆ఘముకొందభయమిడి, కృతివజ్రవరతను◆స్థితిశమమయి
బుధపుష్యరాగసా◆ద్భుతకచ్ఛపఁ బరగించి, భానీలకుందభీ◆భత్సమందఁ
గీ. దగి మహాపద్మగోమేధి◆కగరిమహార, వీరకేతుద్యుతిజయించి◆వేఱువేఱ
నీప్రతాపంబు సత్కీర్తి◆నెగడె నౌర, యప్పయామాత్యకవివేంక◆టార్యవర్య.
ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము.

## —◆ నవగ్రహరత్నరసనిధానసీసము ◆—

పద్మరాగార్కప్ర◆భాభయానకమయి, హిమకరతారాద్భు◆తము ఘటించి
నీలాప్తగురుచక్రి◆ నిధరౌద్రగతిమించి, శంఖవజ్రోత్తమా◆జ్జ్వలతనవ్వి
విద్రుమభౌమకరుణ◆ వీరకేతువు మీఱి, మందతారామంద◆ కోపమూని
రక్తాంగవరపుష్య◆రాగభీభత్సమై, నవవిదూరజమాత్ర◆ కచ్ఛపాప్తి

గీ. బలిభవనిలుసిద్ధసాధ్యసు ♦ పర్వశర్వ, విధివిధుబ్రధ్నసాధ్యోధి ♦ విబుధనాథ
భావనుతిమూడిగూఢపా ♦ త్పరిబృఢాఖ్య, భూరిధరణీధరవిహార ♦ హరిశౌరి.

— ఏకసమాససీసము. —

కలిఁగిగానిప్రదబ్జ ♦ దళగళన్మకరంద, ఝలఝలంధిలమిళింద ♦ కలనినాద
డిండిమఘుండలీ ♦ ధిమిధిమినిర్ఘోష, విలసితశోణాక ♦ వలయముకుళ
కైతవదినవిపి ♦ కాశ్రేణి కాద్యుతి, శాతవాతాహత ♦ చరితతుంగ
నగత్తరంగస్ఫు ♦ రచ్చామరాదిమ, మంగళబిరుదాంక ♦ మహిమకలిత
గీ. వర్ణనీయాపగాధ్యసా ♦ త్వప్రభావ, ధుర్యగంగాగ్రజన్మహే ♦ తుపరిశస్త
హాలకులిశమత్స్యపర్మాంశు ♦ శాతపత్ర, భవ్యచుహానీయుతావక ♦ పాదసేవ.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము.

— ప్రాకృతసీసము —

లచ్ఛిధణాహేయ ♦ లలితహద్ధసరోయ, ఖామ్మళ్ళోయజళోయ ♦ పుణ్ణాసిజ్జ
ఖయవళాయాకోయ ♦ గయళాయరఖయఖి, ఘరఖిండసిఖయర ♦ రయిణీయాస
యాసకజణయమ ♦ హేసరభయణిజ్జ, దిక్కమజాహతే ♦ క్లోకకణాహ
పుణ్ణమయంకళా ♦ వణ్ణస్పసుందర, ఖేచుద్ధరాధార ♦ కిసనవణ్ణ
గీ. ఛత్తకామియిపళదాణ ♦ సారియాయ, యాయయాయజణఝయయాయాయరూయ
వాసుదేయణయాణంద ♦ వణయణాహ, కిత్తిణీజణమహ్నిద ♦ ఖేహిదేయ.

దశావతారచరిత్ర. ఆ ౯.

— లాలిపద్యములు. —

క. మూడవనెలనుయ్యేలలోఁ, జేడెలు బండుకొనఁజేసి ♦ జిలిబిలిపాటల్
పాడుచు నూచుచునుండిరి, వేడుకతో రామరాయ ♦ విభుపౌత్రుమణిని.
సీ. లాలి మహారాజ ♦ లాలి నూతనభోజ, లాలి రావన్వయ ♦ రాజ లాలి
లాలి సద్గుణసాంద్ర ♦ లాలి సన్ముఖచంద్ర, లాలిమహిమహేంద్ర ♦ లాలి లాలి
లాలి పద్మదళాక్ష ♦ లాలి బాంధవపక్ష, లాలి యాశ్రితరక్ష ♦ లాలి లాలి
లాలి రమ్యాకార ♦ లాలి రాజకుమార, లాలి వాగ్జితవీర ♦ లాలి లాలి
గీ. భళిర శ్రీసూర్యరాయప్ర ♦ పౌత్ర లాలి, లాలి శ్రీరామరాట్పౌత్ర ♦ లాలి లాలి
లాలి శ్రీసూర్యరాట్పుత్ర లాలిలాలి, లాలి శ్రీరామరాణ్మహా ♦ రాజ లాలి.
క. లాలీ విద్యలభోజా, లాలీ సుకుమారనైజ ♦ లాలీ మహరాజా
లాలీ ముఖజితరాజా, లాలీ శ్రీరామరాయ ♦ రాజా లాలీ.

నద్దిను సేయుచున్నయది♦యుష్ణమయూఖసుత ప్రసూతికిం
బ్రొద్దులు పొచ్చి యున్న యవి ♦ పూర్వ దిశా సరసీరుహాక్షికిన్.
శా. వైదర్భీ హృదయేశ మేలుకొని ని♦ర్వర్తింపు సంధ్యా నవ
ప్రాదుర్భావ విధేయమున్ విధికలా♦పంబున్ ముహూర్తంబులో
నాదిత్యుం డిటఁ దోఁడు నూపుఁ బటురం♦హఃపిష్టపిష్టీకృత
క్ష్మాదిగ్వ్యోమమహాతమోఘ్నమున మో♦ఘంబున్ మయూఖౌఘమున్.
క. మేల్కొనుము దేవ యిదె రా, చిల్కలు గను మొగిచి యున్న♦చెలువలఁ దమకుం
బల్కులు నేర్పఁగ ముద్దులు, గుల్కెడు పల్కులను మేలు♦కొలిపెదుఁ గృష్ణా.

పారిజాతాపహరణము, ఆ 2 పద్య 58.

సీ. చోఱవై వారాశిఁ♦దూఱి చోరునిఁ జీరి, మీఱుచారువిహార♦మేలుకొనుము
మేటితాఁబేటిబూ♦మెలు పూని మంథాన,శైల మెత్తిన ధీర♦మేలుకొనుము
ఘోణి వై సంభృత♦క్షోణివై రిపుయుద్ధ,కేళిఁ గూల్చినశూర♦మేలుకొనుము
భక్తుమాటలఁ బట్టి♦బలుకంబమునఁ బుట్టి, మెఱసిన నరసింహ♦మేలుకొనుము
గీ. లీల వటువృత్తిఁగనుభవ్య ♦ మేలుకొనుము, మేదినీశప్రవర్ధన♦మేలుకొనుము
శూలికోదండఖండన ♦ మేలుకొనుము, నీలనీలాంబుదశ్యామ♦మేలుకొనుము.

ఉత్తరరామాయణము, ఆ 5 ప 242.

## —♦ నివ్వాళులు. ♦—

సీ. పద్మరాగనవీన♦పాత్రితప్రభలకుఁ, గరనఖద్యుతులు శృం♦గార మొసఁగఁ
దిన్నవై విలసిల్లు♦దీపదీప్తులకును, కలికికన్నులడాలు ♦ జెలువొనర్ప
ఘనసారవర్తికా♦కలితగంధమునకు, తనసౌరభంబు మో♦దంబు సేయ
మధురమంగళగీత♦మహితవాదములకుఁ, గరకంకణధ్వనుల్ ♦గరిమ యిడఁగ
గీ. మెఱుఁగుజెక్కులకాంతులు♦నెఱయఁ బర్వ, వజ్రతాటంకరుచులకు♦వన్నె వెట్ట
వారిజానన లపుడు ని♦వ్వాళు లొసఁగి, రమ్మహీపాలునకుఁ బ్రియ♦త్నమ్ములలర,

రుక్మాంగదచరిత్రము, ఆ 4 ప 11.

## —♦ శోభనగీతము. ♦—

శోభనమే విష్ణునకున్, శోభనమే భక్తభవ♦సుచరిష్ణునకున్
శోభనమే జిష్ణునకును, శోభనమే కృష్ణునకును♦శోభన మనుచున్. 3982

ముకుందవిలాసము, ఆ 3 ప 305.

ఉ. ఎక్కడియూరు కాల్ నిలువ◆కింటికిఁ బోయెద నంచుఁ బల్కె నీ
వక్కట మీకుటీరనిల◆యంబులకున్ సరిరాక పోయె నే
యిక్కడిరత్నకంబళము ◆ లిక్కడినందనచందనోత్కరం
బిక్కడిగాంగసైకతము ◆ లిక్కడియాలవలీనికుంజముల్.

ఉ. వేలిమియున్ సురార్చనయు ◆ విప్రసపర్యయుఁ జిక్కె భక్తికిన్
వేళ యతిక్రమించె జన◆నీజనకుల్ కడు వృద్ధు లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురు◆సూచుచు నుందురు రాహితాగ్ని నేఁ
దూలుసమస్తధర్మములుఁ ◆ దొయ్యలి నేఁ డిలు సేరకుండినన్.

ఉ. నిక్కము దాఁప నేల ధర◆ణీసురనందన యింక నీపయిం
జిక్కె మనంబు నాకు నను◆జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల ◆ చూఱలఁ బాటలు పాడు తేంట్ల సొం
పెక్కినయట్టిపూఁబొదల◆రిండ్లను గౌఁగిట గారవించెదో.

మనుచరిత్రము, ఆ 2 పద్య 41-53.

## — చెంచులక్ష్మీనృసింహమూర్తులు. —

సీ. తెరవ పనిస్పృహా◆త్మైమురుడియ్యామ్ము, నేర నేర్తువె ధా◆నింపు మీఱ
నిసుకపాకుండ్లపై◆ వెసచండఁగలవే యు,సిరికాయలదొంతి◆ జేర్పఁగలవె
వటుబీజసంతతి◆ వలవప్రవీణత, మొలక లెత్తించెడి◆ బలిమి గలదె
మధుమక్షికలదోలి◆ మధుకోశములు తేవె, గుదురుగా వడపోసి◆ కూర్పఁగలవె
గీ. యమృతాహారణ్యముల నొంటి◆ నరుగుదెంచి, క్షుత్పిపాసల కోర్వ◆ నూటి గలదె
పాటుటాకులు దెచ్చియిం◆ పారమృదుల,వస్త్రములు గూర్పఁగలవెయో◆ వన్నెకాఁడ.

చిత్రవతీపరిణయము, ఆ 1.

సీ. పసిబాలవైనఁ జె◆ప్పనిబుద్ధి గలదను, మాతల్లి వినినఁ బ◆ల్మారుఁ గసరు
కులగోత్రములవన్నె◆ గొనియున్న మాతండ్రి, విన్నంత మిక్కిలి◆ వెతఁ బూను
మాయత్త తెలిసిన◆ మాటికి మర్మంబు, బయటఁ బెట్టుచు నవ్వ◆ పాలు సేయు
గుణవంతురాలు మా◆ కోడలంచు గణించు, మామామ గాంచిన◆ మాట వచ్చు
గీ. బావ వినినంత దెబ్బలే◆ ర్పాటు సేయు, మఱఁది గనఁగొన్న నిలు వెళ్లు◆ మనుచుఁ దఱుము
ధవుఁడెఱింగిన నాపొందుఁ◆ దలఁపఁ డింక, సామి! యేనింద కెట్లోర్వఁ◆ జాలియుందు

సీసమాలిక. ఇవ్విరిదోఁటలో◆ నేటికి మెలఁగెదు, వింతి నీవుగని పే◆ రెవరు చెప్పుమ
ఎవ్వాతె తేనెమి◆ తేమికార్యమున్నది, యొందువెంచేయుదు◆ వందుఁ జనుము

మఱువఁజాలను నీపాండు♦మధురవాణి, మోహవారిధిఁ దరిజేర్చు♦ముద్దుహరిణి.

చ. పలుమొనమోవిఁ బొక్కినను♦బల్మఱుఁ దేనియ చిందునంచు గో
ళులు జిగి......లంటినఁ జా♦లుసుక్కిన బిక్కటిల్లునంచుఁ గే
ల్బలిమిని గౌఁగిలించినను ♦ బంగరుమై కసుఁగందునంచుఁ గా
వలసినయట్లుబల్ ......♦వన్నెలదీఱక మోసపోయితిన్.

సీ. పరిపక్వసురసాల♦ఫలరసంబులు గ్రోలు, కీరంబు చనునె దు♦త్తూరములకు
తెఱఁగంటిమానిపూఁ♦దేనె లానెడితేఁటి, చేరునే చెనటిబ♦ర్బూరములకు
నలమావితలిరుసవిం♦దులగఁదుఁగోయిల, చొచ్చునే యలవేము♦జొంపములకు
మినువాఁకతరఁగచా♦లున నూఁగు రాయంచ, డాయఁ గోరునె జల♦ప్రాయములకు

గీ. వేంకటాచలనాథుపై♦ వెలయునాదు, మదికి హితమౌనె యొకరాక♦మారుఁగదియ
బోటి నీవెంతదాన వీ♦లాటిమాట,లింక వినఁజాల మదిలోన♦శంక లేల.

వెంకటేశ్వరవిలాసము, ఆ 3.

## లక్ష్మీనారాయణులు

సీ. మంజులాధరసుధా♦మాధుర్య మానుమఁ, గలశాబ్ధికన్యతోఁ ♦ గలయవలయుఁ
క్రౌశీతి .. ♦ చతురతల్ నెఱపుచు, మీనాంకజననితో ♦ మెలఁగవలయు
జక్కుముద్దులుగారు ♦ చెక్కిళ్లు నొక్కుచు, శ్రీదేవిఁ గౌఁగిటఁ జేర్పవలయు
...సామ్రాజ్యసౌ♦ఖ్యాబ్ధి నోలాడుచు, వనజగేహినితోడఁ ♦ బెనఁగవలయుఁ

గీ. గమల చిరకాలమెడబాసెఁ♦ గఱవుదీఱఁ, గోర్కెలీడేరఁగాఁ గేళిఁ♦గూడవలయు
ననుచు నిమిషంబు యుగశతం♦బగుచుఁ దోఁప, నెదురుచూచుచునుండెఁ బ♦ద్మేక్షణుండు

సీ. మృగనాభితిలకంబు♦నొగి దిద్దునెపమున, మెఱుఁగుచెక్కులపైని ♦ మీటుచుండు
మణిసరంబులచిక్కు ♦ మలపించునెపమున, మలసి చక్కిలిగింత ♦ గొలుపుచుండు
నుపగూహన మొనర్చు ♦ నెపమున నధరాధ,రామృతపానంబు ♦ నాచరించుఁ
జెలఁగి చూర్ణాలకం♦బులచిక్కు వదలించు, నెపమునఁ గీల్జడ ♦ నివురుచుండు

ఆ. నిట్లు కొంత దేర్ప ♦ నిద్దఱి..., మమితకంపమాన ♦ మమితఘర్మ
మమితచిత్తవేగ ♦ మమితసుఖానంద, మమితకుతుకమయ్యె ♦ నంతనంత. 4014

సీ. కొలుకులు వదలి చి♦క్కులువడ్డహారముల్, సడలినరత్నభూ♦షాచయములు
గౌఁగిళ్లఁ జెనఁగొన్న ♦ కరసరోజంబులు, సుడివడ్డ మందార ♦ సుమసరములు
ఫుక్కిళ్లఁ జెందుతాం♦బూలరసంబులు, చిందరలైపోవు ♦ చిన్నికురులు
శ్రమబిందుసంకీర్ణ♦చందనలేపముల్, కదనిద్రఁ జొక్కిన ♦ కన్నుఁగవలు

గీ. కటులదిగజారుదివ్యాంశుకములం కలిగి, వేడ్క శిరోరత్నగా నిశా ♦ వేళలందు
జలధిరాజన్యకన్యకా ♦ చక్రిభర్తలు, చిగురుసెజ్జను సుఖనిద్రఁ ♦ జెందెదిరపురం.

మహాలక్ష్మీపరిణయము. ఆ 5 పే 119

సీ. కలికిచే నొకవేళ ♦ గానంబు చేయించి, యతివేడ్కతోడఁ దా ♦ నాలకించు
పణతిచే నొకవేళ ♦ పద్యముల్ జదివించి, తేటగా నర్థముల్ ♦ దెలుపుచుండు
మగువచే నొకవేళ ♦ మడుపులు జుట్టించి, మించుగా జేతి కి ♦ మ్పించుకొనుచుఁ
బద్మాక్షినొకవేళఁ ♦ బాన్పుపై నిడికొని, వేడుక సరసంబు ♦ లాడుచుండు
గీ. భ్రేమదీరంగ నాచెలి ♦ మోము తనదు, మోముపై నంటగా నుంచి ♦ ముద్దుగొనుచు
గ్రొక్కనచురుక్కుమన మోవి ♦ నొక్కి కౌఁగిలించునొకవేళ మిగులలా ♦ లించుకొనుచు
క. పొలతుక తనపై నెయ్యపు, టలుకన్ బవళించియుండు ♦ నత్తఱి మరుప్రా
ములికి కలికి చిలుకల, కొలికి లెమ్మనుచు ముద్దు ♦ గొని లాలించున్.
సీ. వలపించు నొకవేళ ♦ వనితపై మోహంబు, దగిలి యొక్కొకవేళ ♦ దానె వలపు
పల్కరించఁగ జేయు ♦ పణతినొక్కొకవేళ, భ్రమనుదా నొకవేళఁ ♦ [illegible]
నవ్వించు నొకవేళ ♦ నాతి ముచ్చట విని, తలయూచి యొకవేళఁ ♦ దానె నవ్వు
నోడించు నొకవేళ ♦ నువిదనాటలయందు, దడబడి యొకవేళఁ ♦ దానెయోడు
గీ. మురసి యొకవేళ సఖికి తా ♦ ముద్దు బెట్టు, నతివనొకవేళ దానె ము ♦ ద్దాడుచుండు
...దేలు మాధవుఁ ♦ డొక్కవేళ, రమణి నొకవేళఁదా......దేల్చు.

కుబ్జాకృష్ణవిలాసము. ఆ 4 పే 81-85.

## యామినీపూర్ణతిలకావిభ్రమములు

క. మధురాధరమధురసుధా, మధురాలాపములఁ బ్రేమ ♦ మన్నింపఁగదే
మధురాజితనవకుంజము, మధురాజితదంతకాంతి ♦ మహిమ జెలంగన్.
క. హరిణీకృతాధరస్మిక, భరణీవరణీయచిత్త ♦ భవవనభరణీ
హరణీసుఖకరణీవర,తరుణీయధరామృతంబు ♦ దయసేయఁగదే.
క. బిగిమాటల మరుఁ డొగి జిగి, బిగిమాటలరించి పొంచె ♦ బిగికౌఁగిటదే
రఁగఁ జేరిచి వగ గూరిచి,దగదీరిచి మనుపవేలఁ ♦ దగునటె బాలా.
క. మనవే నవరుగవేగను, గొనవేననవిలుతు బారి ♦ గొనబెననొనవే
వినవే నిను వేడెద నెద, నను వేడ్కను మనుప వేల ♦ నవ్యేందుముఖీ.
క. ఇంతయు దయ జూడఁగ నను, జింతలవంతలను జివక ♦ జేయుట దగునే
యింతీ విరిబంతీ మను, దంతీ మురిపెములదొంతి ♦ తరుణిసుకాంతీ.

క. అలికేరకేకికోకిల, ములవేలలమోసములకు ♦ నులికితి నహహా
కలికీ మురుగులికీ మరు, ములికీ వలపేటికట్టి ♦ ములకారో గదే.

క. కొమ్మా సెమ్మది నోకలి, కిమ్మా యిమ్మాటలంచు ♦ లిమ్మాటలు నై
కొమ్మా యిదె రమ్మా మది, ముమ్మాటికి నమ్మకొమ్మ ♦ ముద్దులగుమ్మా. 4027

సీ. వలకాక తీరనాఁ♦గిలనింపకున్న గ,వ్వలకాక దీరవో ♦ కలువకంటి
తెరగుపాటునఁదీసి ♦ జోరకున్న మాయుఁడే, తెరవుబాటించునో ♦ తెరవమిన్న
కులుకుగుబ్బలరొమ్ము ♦ గుదియింపకున్ననో, కులుకుగుబ్బలరనో ♦ తలిరుబోడి
తళుకుజెక్కులముద్దు ♦ తమిదీరకున్నఁ గ్రొ,త్తళుకుజెక్కులమునో ♦ జలజగంధి
గీ. మేలనన్నేలవేల యీ♦వేళఁ జాల, జాలిపాలైతి నిఁక జల♦మేలఁ దాళఁ
జాల నీలావిశాలక♦పోలఫాల, ఫాలలితమృగమదపుంజ♦బాలబాల.

ఉ. వాగురులయ్యె నేమరుని ♦ వార్తలు మోహ మిదేమొ జాడఁగా
సాగరమయ్యెనే వలపు♦జాడ లివేమొ దలంప రేబగల్
జాగరమయ్యెనే మధుర♦సంబులు నాచవిజాడ చేదుబా
టోగిరమయ్యెనే యిఁక నె♦టోగదె నీవిఁక జాగుచేసినన్.

సీ. అతివనీకెమ్మోవి♦యరుణబింబబలంబు, సఖియనీనెమ్మోము♦చంద్రబలము
చామ నీమెయిగోము♦సర్వమంగళబలం, బబల నీచూపుసో♦మాఖ్యబలము
కొమ్మనీచనుదోయి♦గురుబలం బలరుల, బోమ్మ నీపలుకులు♦కావ్యబలము
కలికి నీమురిపెంపు♦గతులు మందబలంబు, ముదిత నీవేణిత♦మోబలంబు
గీ. అతనుకేతుబలంబు చే♦లాంచలంబు, రమణి నీనఖపాళితా♦రాబలంబు
లలన నీవబ్బుచే మంచి♦లగ్నబలము, గాకయున్నదె శుభము లోకములయందు.

యామినీపూర్ణతిలకావిలాసము. ఆ. ౫.

శా. అంధుం డెక్కడ చంద్రుఁ డెక్కడ తదీ♦యంబైనయావర్ణనా
బంధం బెక్కడ నిట్టి వింత గలదే ♦ భావింప నెచ్చోటనై
నం ధాత్రీందుఁడు మాకు నిర్వ్వరకు నం♦దం బొప్ప నన్యోన్యవ్యా
త్సంధానంబగునంచుఁ జేసె నిటులం♦జర్చింప వేఱున్నదే.

క. వ్రతిభంగ మయినఁ గానీ, మతిమంతు నుదాత్తవేషు♦మానితవిద్యా
న్వితునిం గాంచెదఁ గన్నుల, కతులమహోత్సవముగాఁగ♦యని చెలి ప్రీతిన్.

ఉ. తామరసాక్షి నీనిశిత♦దారుణవీక్షణతీక్ష్ణబాణముల్
వేసుటు నాటి నాహృదయ♦వీథివసింపఁ బొనరించెఁ జూడుమా

నీ మెయి సౌష్ఠవద్వితయ◆మిద్ధ్యావె క్రొంకెవఁ బూతఫ్రౌఢవన్
నీమధురాధరామృతము◆నీ...కుంకుమపంక మేర్పడన్.

సీ. సరవి నెన్నఁడును భో◆జనము సేయఁగలేను, నీపాఁది క్రీతిచే◆నీరజాక్షి
యెలమిగా నెన్నఁ డిం◆తులను గూడఁగలేను, నీపాఁది క్రేమచే◆నీరజాక్షి
యరయ నెన్నఁడు చంద◆నాదిచర్చయులేను, నీపాఁది క్రీతిచే◆నీరజాక్షి
చెలఁగి యెన్నఁడు మాల్య◆ములు ధరింపఁగలేను, నీపాఁది క్రీతిచే◆నీరజాక్షి
తే. గాన భవదీయవిరహాంధో◆గమున నాకుఁ, గలిగెంతల మనస్సును◆గాఁడవచ్చెఁ
గాంచి నమ్ముఁడవైనస◆త్కవిని నన్ను, రా మిటునూని క్రోవవే◆రాజపుత్రి.

సీ. శృంగారమూర్తివై ◆ చెలువొందు నినుఁ జూడఁ,వలెఁ గాక కన్నులు◆కలఫలంబు
చక్కనైనట్టినీ◆చెక్కులు ముద్దాడ,వలెఁ గాక కెమ్మోవి◆కలఫలంబు
మది కింపు సేయు నీ◆యొద ఱొమ్ము పెస గుబ్బి మ్మవ,లెఁ గాక......◆కలఫలంబు
నేర్పుమీరినయట్టి◆నీతోడ మాటాడ,వలెఁ గాక నాలుక◆కలఫలంబు
గీ. సేవ సేయంగవలెఁ గాక◆చెలువరాను యలయులను గేస చేవాయి◆కలఫలంబు
కలసి...మెలఁగుటవలనఁగాక, కవిశవిభావణిచెలిమిచే◆గలఫలంబు.

చ. సమయ మెఱింగి నేఁదలువు◆చాటున నుండఁగఁ గేలువమ్మిమో
హామున మొగంబునం దిడి మ◆నాగమనంబుఁ దలంచి చూచుచుం
గ్రమమున నుత్కళాంకపద◆కాండములన్ మృదుగీతిఁ బాడుచున్
రమణిమనోవికారయుయి◆రాజిలు దాని మదిన్ భజించెదన్.

విల్హణీయము, ఆ ౫.

## —◆ రాధాకృష్ణులు ◆—

క. ఆహా యే కనిదెల్పెదు, సాహసమునరాధకృష్ణు◆జనకినవేళన్
యూహింపఁడు నీవంబని,బాహాటముగాగరాధ◆పదములుబట్టున్. 4021

సీ. పిరుదడగ్గరిమొగ్గి ◆ బిగి.........,నొత్తుచు వెతికినవల్◆మనువుకీర్చు
యొడికట్టుపైదోడ◆లూని తిల్కము దిద్ది, గద్దించి బుగ్గలు ◆ గఁటుసేయు
బలుజరీమస్తులు◆పైని శృంగారించి, బిగికౌఁగిటను జేర్చి ◆ పెదవి నొక్క
అధరిపాటునవచ్చి ◆ యదిమి మద్దిడుమని, వదలక ముద్దుల◆గుదులు గుచ్చు
గీ. మరలివేగిరరమ్మని ◆ మనవి వ్రాయు, బాసి నిముసంబు యుగమని ◆ పలువరించు
నిమిషమైనను నెడబాసి◆నిలువగలదె,యోహహో కృష్ణునకు దగి◆యుండె రాధ.

సీ. ఏమిరా కృష్ణ నా◆సామి రారాయని, కద్దికదండముల్ ◆ వంగియొసఁగెద
నాముద్దు లిల్లుఁడా ◆ నమ్మితిరాయని, మోము తప్పక చూచి ◆ ముచ్చటించు
నేమోయి మాధవా ◆ యెంచటి కేఁగితివని, పనిలేని సెపములఁ ◆ బన్ని చుండు
అనుచుయ్యాలయ్యాల ◆ మత్తకు జూపకు, దగదు నీకని గుట్టు ◆ మిగులఁ బల్కు
ఆ. మోహవార్ధిలోన ◆ మునుఁగుచుఁ దేలుచు, సాహసంబుఁ జేయఁ◆జాలలేక
గదియుమాను పఱల ◆ గౌఁగలించును రాధ,..ఓనమాలు ◆ నభ్యసింప.

బృందావనవిహారము.

సీ. తోడలపైనుంచి యు◆గ్గిడువేళ చికిలిపెం,దొడలసందొయ్యన◆బుడికిజూచు
వేడుకవిందుల◆విందులంచును బిల్వఁ,గదిసి పయ్యెద జార్చి◆కౌఁగిలించు
నునుముద్దుబెట్టనుం◆చును వేడుకొన గోటి,కొనజెక్కుమీటి చుం◆బన మొనర్చు
ముఖముతో నెత్తుక◆మోవిముద్దాడినఁ, జక్కెరకెమ్మోవి◆చప్పరించు
గీ. పట్టుకొనిలేచు గతినీడ్చు◆కట్టుకొంగు, తొలఁగి జఘనంబు గనుపింప◆గెలసి నవ్వు
నెన్ని మాయలు నేర్చె నీ◆చిన్నికృష్ణుఁ, డనుచుఁ దనుబెంచు రాధ ము◆ద్దాడ శౌరి.
సీ. ఫలపుష్పములు దెచ్చి◆పట్టుమంచుమఁబైఁట,నించు నో........డా◆కించు దేల
నిట్టట్టు త్రోవల◆నెదురైన నెదురుగ, నొయ్యారిమేను మే◆నొరయ నేఁగుఁ
జీకటిలోఁ గన్నుఁ◆జెలియ నాపైనయ,లేదటే యని కౌఁగి◆లింపఁ దివురు
సఖులతో ...రహ◆స్యములు ప్రసంగించు, నెలనాగ వినఁగ తా◆నెఱుఁగనట్లు
గీ. చిలుకసాంబ్రాణి తేజిన◆జీను గేరు, కమ్మనెమ్మేన వగవగ◆సొమ్ము లూను
యెమ్మె మెరయించు శ్రీకృష్ణుఁ◆డెల్లవేళ, రాధతిలకించుకొనెడియా◆రాటమునను.
సీ. పనిలేనిపనిబూని◆పైఁడియందియ ఘల్లు,ఘల్లనఁ గృష్ణుచెం◆గట వసించుఁ
దనపైఁట యతనిదా◆కిన గిరుక్కున మొగం,బోరగాఁ జూచు సి◆గ్గొలయఁ జూడ్కి
నేజెల్లనమ్మ వా◆నికి నెట్లు దోఁచునో, చెఱఁగుదాకెనటంచుఁ◆జెవికి దెలుపు
నెటుల దోచినమంచి◆దేయన్న మటిచాలు, షామ్మంచుఁ గెంగేల◆తమ్మి వైచు
గీ. వానవము వంచు బొటనవ్రే◆లవనివ్రాయు, వేడినిట్టూర్పులుంచు నా◆వెతయొఱుంగ
వింతకదెయంచునను బోరి◆కవంతలోన, గుర్రుకుమక్కువచొక్కియ◆క్కోమలాంగి.
చ. నిరతము నాపయిన్ జలము◆నిక్కము బూనిన దానవైనచో
ఖరతరమౌ నఖంబులను◆గంటులొనర్పుము పంటికాటులన్
నెరపుము బాహువల్లులను◆నేర్పున నొర్పునఁ బట్టి కట్టు మీ
తిరమగు నీదుకోపమును ◆ దీరును హాయియౌ మీఱు రాధికా. 4043

రాధామాధవవిలాసము.

క. ఎక్కడిమీ రెక్కడినే, మెక్కడి...పరమమునుల ◆ కివియుం గలవే
ప్రొక్కెడి వీవించుటకై, యెక్కటి రీనిట్లుపలుక ◆ నెల్లిన మైతిన్.
క. సామాన్యులఁగా మమ్మం, గామింపకుఁ డేము నాఱు ◆ క్రతువులవానిం
గా మోపభోగములకుం, గామింతుము సూ నిజంబుఁ ◆ గనుఁగొను మనఘా.
క. పావనభవదంఘ్రిద్వయ, సేవనమును విమలకమల ◆ శిశిరనభస్వ
త్సేవనమున్ దొరఁకొనునిటు, నీవనమున మెలఁగువార ◆ మిారలుగకుఁడీ.
తే. అనుచుఁ బ్రీతికూలవాక్యంబు ◆ లతివపలుకఁ, జిలుకబోబావజీయుండు ◆ బిబ్బోకములను
లలకుంపఱకాఁకున ◆ నలసి సొలసి, ధీరవర్తన మెడలి ప్రా◆ర్థింపఁ దొడఁగె.
సీ. ఆ జీవి వెన్నెలవేఁడి ◆ తలఁకించెఁ గలికి నీ, యధరాధరామృతం ◆ బొసఁగనిమ్ము
వలపుఁదెమ్మెరకూన ◆ వడఁకించె మగువ నీ, కళుకుపైఁటుచెఱంగుఁ ◆ గప్పనిమ్ము
వికటార్పుజోడు ◆ వెఱపించె వెలఁది నీ, ......దుర్గముల హత్తు ◆ కొనఁగనిమ్ము
పికశుకనికరమ్ము ◆ బెదరించె నతివ నీ, సాహాయ్యమునఁ గేలి ◆ సలుపనిమ్ము
గీ. జలదళఫణానిలాహార ◆ సదుపవాస, చిరతరవ్రతదీక్షా౽ ◆ శేషశుష్క
దవయవాయాసమునభావ ◆ ములస మయ్యె, బాల నీప్రోల శుశ్రూషఁ ◆ బడయనిమ్ము
క. మెలఁగుచ్ దలఁగుచ్ భయమునఁ, గలఁగుచ్ మలఁగుచ్ లతాంగి ◆ కపటారభటిన్
జెలఁగుచ్ వలగొను నెనరుచ, నలగుచ్ దొలఁగుచ్ నగుచ్ వ ◆ యారము మిాఱన్.
కవిరాజ. కిలకిల సేయకువే చిలికీ నుడిఁ ◆ గైకొనవే వర పూములికీ
కొలఁకులఁ గ్రుంకకువే యబలా మదిఁ ◆ గొంకకువే భృతకామబలా
కెలఁకుల డాఁగకువే లలనా వెద ◆ కింపకువే కనుఁగోఁగలనా
సిలుకులఁ బెట్టకువే రమణీ నను ◆ జేకొనవే గుణహారమణీ.
తే. అనుచుఁ బ్రార్థించి దౌష్యంతం ◆ బవధిగాఁగఁ, గూడియుండుటకొడఁబడి ◆ కుసుమగంధి
సంయమీంద్రునితో వచ్చి ◆ సహచరీసుకల్పితంబైన కిసలయ ◆ తల్పమునకు.

## — శకుంతలాదుష్యంతులు. —

సీ. జలజాక్షి నీతను ◆ శ్రమవారిపూరమ్ము, పాద్యోదకమ్ముగా ◆ బరిణమించు
భద్రేభగమన నీ ◆ ప్రమదాశ్రుకణజాల, మర్ఘ్యతోయమ్ముగా ◆ నవధరింతు
గలికి నీకడగంటి ◆ గరువంపులేఁజూడ్కు, లలరులపోనగా ◆ నందగింతు
నతివ నీ యధరాధ ◆ రామృతాస్వాదంబు, సరసపువిందుగా ◆ సమ్మతింతు
గీ. ......చమత్కార ◆ భరిత......మానితాయాసనిశ్వాస ◆ మారుతమ్ము
హితజలార్ద్రాంబిలమ్ము కా ◆ విష్పగింతుఁ, గనికరమ్మున బంగారు ◆ గనిక రమ్ము. 4057

సీ. పరువవల్లలచీర • పరిధాన మెట్లోర్చె, నీమేనునవనీజ • కోమలంబు
మృగలూనకుశశిఖా • మిళిత మెట్లు సహించె, నీయంఘ్రియుగళ • నీరజములు
బాలపాదపసేక • పాత్ర మెట్లు వహించె, నీకేలు పల్లవ • శ్రీకరంబు
ప్రసవరేణుకరాళి • పవన మెట్లు భరించె, నీమోము పద్మినీ • బింబలంబు
గీ. శీతలజలావగాహను • స్నేహతుచర్య కందమూలఫలాశాది • కష్టశతము
సేయుటకు నెట్లు దగరె శ • చీవిలాస, మెన్నఁడౌరకొన్న నీచిన్నె • ముప్పపోసి.
మ. గతురంభోవిధిమధ్యభూవలయభూ • జ్యప్రాజ్యసామ్రాజ్యశా
శ్వతదివ్యావ్యయశవ్యభవ్యముల సం • క్రాంతింబు విక్రాంతుఁడౌ
ఒతిఁగా నన్ను వరించి యంచితమహా • భాగ్యమ్ముఁ గైకొమ్ము రా
మ్మతివా నామతి వాంఛఁ దీర్తు వదినే • లాలించి లాలింపవే.

శకుంతలాపరిణయము. కృష్ణ. ఆ 2.

## —— కైకాదశరథులు. ——

ఉ. ఎందుకు బల్కవే తరుణి • యేమిటి కల్గితివే మితాకి నా
యందలి నేరమేమె చెలి • యేమిరయెఱుంగనె కొమ్మ కొండెముల్
విందురె ముద్దుగుమ్మ వెడ • వింటివజీరు కొప్పగించకే
యిందుముఖీ యయో........ • నేలఁగదే జగదేకసుందరీ.
సీ. తరుణి నీయధరామృ • తం బొసంగఁగఁ గాదె, యవనిలో నాకు దే • వత్వము వొడవె
రమణి నీదుముఖాంత • రమున గాదెయశేవ, రాజమండలము గ • ర్వంబడంగె
లలన నీశ్రోణీఫ • లకజితమైగదే, ధరణిచక్రంబు నా • వశమునఁ జొచ్చె
లోలాక్షి నీదయా • లోకంబునను గాదె, ప్రాపించె నాదుకే • పరజయంబు
గీ. యిట్టి నినుఁ బాయజాల నీ • కేల యలుక, యనుచుఁ గైకను దశరథుఁ • డనునయించి
ముదిసి ముప్పునఁ దనకేల • మోహ మనుచు, మరుఁడు రతిచేతిలోఁ జెయి • పడచెనఁగ.

దశావతారచరిత్ర ఆ 8.

## అహల్యాదూతికలు. ——

ఉ. ఇంతిరో నీదుభాగ్య మిపు • డెంతని సన్నుతి సేయువాఁడ వి
క్రాంతదిగంతకాంతలు శి • ఖామణికాంతులు గూడ మోడ్చుకే
లెంతయుఁ బాల్తురెవ్వనిదయా • హీనకటాక్షము గోరి యాశచే
వాంతుఁడు గాచినాఁడు కుతు • కంబున నీకు కటాక్షవీక్షణన్. 4063

శా. ఔనా నే వెలయాలనా యిటుల నీ♦వాడన్ బళా చాలు పో
పోనేర్వా రెవరైన విన్న నిటు నే♦ర్పన్ జూపఁగా వచ్చితో
నానాథుం డిది విన్నయంతఁ దనకున్♦ నాకున్ మహాహానిరా
దా నావంటికులాంగనామణికి న్యా♦యంబౌనె యీమార్గముల్.

మ. తగ వౌనే తనవంటివాఁడు పరకాం♦తం గోర సామాన్యుఁడే
మగువా తాను శతాశ్వమేధి త్రిజగ♦న్మాన్యుండు నేఁ జెల్ల యీ
వగవర్తిం దన యాగభాగములఁ బి♦ల్వం జూతురే బ్రాహ్మణుల్
నగరే తోడిసురల్ మహాఋషులచెం♦తన్ గౌరవం బబ్బునే.

సీ. మంచిపున్నమచంద♦మామ చూడనె కాని, వేడుకతోడ ము♦ద్దాడ వశమె
యూఁగక చూచి సో♦గూరు టింతియె కాని, యందని మ్రానిపం♦డ్లంద వశమె
తళుకుతత్తి ల్లివిమించు♦తొలుకారిమెఱుము గాం, చనెగాని కౌఁగిలిం♦చంగ వశమె
కనకాద్రిశృంగముల్ ♦ గనుఁగొననే కాని, సులభంబు గాఁబట్టి ♦ చూడ వశమె

గీ. యిటులఁ బరకాంత నగుమొగం♦బధరబింబ, మంగవల్లియు జనుదోయి♦ గులుకుఁజోఁడి
సొగసుటయె కాక యేలఁ జే♦కూరుఁ దనకు, వలవని దురాశ యేటికి♦ వలదు పొమ్ము.

దశావతారచరిత్ర. ఆ 7.

## — అహల్యాసంక్రందనులు. —

చ. నిలుఁపునకుం జెమర్చె రమ♦ణీమణి మోహమొ కాక భీతియో
తెలియఁగఁ గూడ దప్పు డల ♦ దేవవిభుండును గంప మొందె మి
క్కిలి యొడబాటులేనిపర♦కీయకరంబు దెమల్పఁ గౌఁగిటం
గలయఁగ దొడ్డసాహసము♦ గాదె బలారికిఁ జెల్లె నయ్యెడన్.

ఉ. నీపయి నాకు నాపయిని♦నీకును గూరిమి గల్గఁ జూచియున్
బాపపుదైవ మిట్టు లెడ♦బాయఁగ జేసెను దొంటిపుట్టువం
దేవగఁ జేసినామొ విధి♦ కేమన నేర్తును తోయబంధముల్
నాపయిఁ బేర్చుచుండు సుర♦నాయక మర్వకు నన్నొకప్పుడున్. 4067

సీ. మానినీమణి బల్మి ♦ మరిపట్టఁబోదునో, పట్టఁ బోయిన నెంత ♦ ప్రియ మగునో
అతివ నే నింద్రుఁడ ♦ నని సందడింతునో, సందడించిన నెంత ♦ మండిపడునో
వెలఁది నీకపురంబు ♦ విడెము నిమ్మందునో, విడె మిమ్మనిన నెంత ♦ వికట మగునో
కమ్మవిల్తునికేళి ♦ గలయ నిమ్మందునో, కలయనిమ్మన నెంత ♦ కలహ మగునో

గీ. జూడక మొగంబు ద్రిప్పి మా♦టాడ కిపుడు, చేసిగిచిపట్టుకపరాకు ♦ చెప్పినప్డె
యేమి ఘట్టునో నైకిలాటు ♦ మింక మీఁద, తరుణిదయలేక విడనాడఁ ♦ దగునె నీకు.

సీ. అర్జునుఁడను నేనె ♦ యని తెల్పినంతనే, మిట్టిమీనై పడె ♦ మెలఁత చూపు
గాంధర్వమునఁ బెండ్లి ♦ కమ్మనుమనంతనే, పచ్చకప్పురమాయె ♦ భామపలుకు
బలిమిమైఁ బట్టంగఁ ♦ దలకొనునంతనే, యొకబండికల్లయ్యె ♦ నువిదపిఱుఁదు
సాలపుఁబయ్యెదఁ జేజే ♦ మాతునన్నంతనే, పచ్చప్రాసాయెఁబో ♦ పడతియూరు.

గీ. పేరు వివరించి నేనేల ♦ బేలనైతి, కోరికెతిగించి నేనేల ♦ గోలనైతి
బలిమిఁ బైబడి నేనేలఁ ♦ బయటఁబడితి, బత్తిఁ గనిపించి నేనేలఁ ♦ బలుచనైతి.

విజయవిలాసము. ఆ ౩.

## —♦ హిరణ్యాకశిపువరములు. ♦—

సీ. దేవకులంబుచే ♦ దేవయోనులచేతఁ, బితృకోటిచే దైత్య ♦ వితతిచేత
గ్రహములచేఁ దార ♦ కములచే మునులచే, ననలసమీరతో ♦ యములచేత
నరులచే గిరులచేఁ ♦ దరులచేఁ బశుమృగ, పక్షిదంశకకీట ♦ పంక్తిచేత
నశికుంతశరపరి ♦ ఘాద్యాయుధములచేఁ, గాష్ఠపాషాణసం ♦ ఘములచేత

గీ. నవని నంతరిక్షంబున ♦ దివమునందు, వాసరంబులయందు శ ♦ ర్వరులయందు
నా కపాయంబు లేకుండ ♦ లోకవంద్య, యిమ్ము మతియెవ్వియును నొల్ల ♦ నింత నిజము

నృసింహపురాణము, ఆ 2 ప 98.

## — యక్షప్రశ్నములు. —

క. దినకరు నెయ్యది నడపును, దినకరు నెవ్వారు గొలిచి ♦ తిరుగుదురర్ద్రే
వునియస్తమించు నేమిటి, ననఘ తదాధారభూత ♦ మది యెయ్యదియో.

గీ. అనిన ధర్మజుఁ డిట్లను ♦ నబ్జహితుని, నడపు బ్రహ్మంబు సురకోటి ♦ నడచుఁ గొలిచి
ధర్మచే నస్తమితుఁ డగుఁ ♦ దపనుఁ డమ్మ, హాత్మునకు సత్యమాధార ♦ మండ్రు బుధులు

క. ఏమిట శ్రోత్రియుఁ డనఁ జను, నేమిటఁ గను మహిమ వడయు ♦ నిమ్మగఁ బురుషుం
డేమిట సహాయయుతుఁ డగు, నేమిట నగు బుద్ధిమంతుఁ ♦ డేర్పడఁ జెపుమా.

క. శ్రుతమువలన శ్రోత్రియుఁ డగు, నతులతపోయుక్తిఁ గను మ ♦ హత్త్వమువడయున్
ధృతిచే సహాయయుతుఁ డగు, నతిశయముగ బుద్ధిమంతుఁ ♦ డగు బుధసేవన్. 4081

గీ. ఏమికతమున భూదేవుఁ ♦ డెసఁగు దేవ, భావమున నాతనికి సాధు ♦ భావ మెవ్వి
ధమున నగు నసాధుత్వ మెం ♦ ద్దానఁ జెందు, మానుషుం డగు నాతఁ డే ♦ దానఁ జెపుమ.

ఆ. విను మహింస మేటి◆యనఁ జను ధర్మంబు, యాగకర్మ మెపుడు◆నొనరఁ బండి
యుండు మనసు క్రొవ్వు◆ఖండింపఁగా మోక్ష, మెసఁగు సుజనసంధి◆యెడల దెలుపు
సీ. అనిన నతఁడు లోకమున కె◆య్యదియు దిక్కు, జలము నన్నము నెద్దాని◆సంభవించు
విను మనంగ నెయ్యది శ్రాద్ధ◆విధికి నెద్ది, సమయ మనిన నిట్లని చెప్పె◆జనవిభుండు
గీ. సజ్జనులు దిక్కు నీవెయా◆సర్వమునకు, నభము ధరణియు జలము న◆న్నమ్ము సుద్భ
వించు నెలవులువిను మగు ◆ విప్రధనము, లఘు శ్రాద్ధకాలము బ్రాహ్మ◆ణాగమంబు
గీ. సర్వజనసమ్మతుం డగు◆గర్వ ముడిగి, క్రోధమడఁచి శోకమునకుఁ◆గొలువు గాఁడు
వినవె యర్థాఢ్యుఁడగు లోభ◆మొంచర విడిచి, తృష్ణవర్జించి సౌఖ్యంబు◆తెరువుఁగాంచు
క. దివి ముట్టి ధరణి యంతటు, నివిడి మెఱయుచుండు నెవ్వ◆నియశోరమ య
ట్టివిశిష్టచరితుఁడు యతువరా పురుషుండు నాఁ బ్రకాశత నొందున్.
ఆ. ప్రియము నప్రియంబుఁ◆బెల్లగు సౌఖ్యదుఃఖములుభూతభావి◆కార్యములును
నెవ్వనికి సమంబు◆లివి సర్వధని యనఁ, బరఁగుఁ జువ్వె యట్టి◆భవ్యుఁ డనఘ.

భారతము, అర. ఆ 7 పద్య 422-454.

## —◆ ప్రహ్లాదచరిత్ర ◆—

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ◆జేరినయట్లైనఁ, జెలికాండ్ర నెవ్వరిఁ◆జేర మఱచు
నసురారి దన మ్రోల◆నాడినయట్లైన, నసురబాలులతోడ◆నాడ మఱచు
భక్తవత్సలుఁడు సం◆భాషించినట్లైనఁ, బరభామలకు మాఱు◆పలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ◆ జూచినయట్లైనఁ, జొక్కి సమస్తంబుఁ ◆ జూడ మఱచు
గీ. హరిపదాంభోజయుగచింత◆నామృతమున, నంతరంగంబు నిండిన◆యట్లైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁ డగుచు నే◆మిన్నియును మఱచి, జడతలేకయునుండును◆జడునిభంగి.
శా. పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ ◆ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ ◆ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదయుగ్మయుగళీ◆చింతామృతాస్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డే◆తద్విశ్వమున్ భూవరా.
సీ. వైకుంఠచింతావి◆వర్జితచేష్టుఁడై, యొక్కఁడు నేడుచు◆నొక్కచోట
నశ్రాంతహరిభావ◆నారూఢచిత్తుఁడై, యుద్ధతుఁడై పాడు◆నొక్కచోట

సీ. ఒకమాటు దిక్కుంభి • యూధంబుఁ దెప్పించి, కెరలి డింభకుని ద్రొ • క్కింపఁ బంపు
నొకమాటు విషభీక • రోరగశ్రేణులఁ, గడువడి నర్భకుఁ • గఱవ బంపు
నొకమాటు హేతిసం • ఘోగ్రజ్వాలములోన, విసరికుమారుని • వ్రేయఁ బంపు
నొకమాటు కూలంక • షోల్లోలజలధిలో, మొత్తించి బాలకు • ముంపఁ బంపు

ఆ. విషముఁ బెట్టఁ బంపు • విదళింపఁగాఁ బంపు, దొడ్డకొండచరులఁ • ద్రోయఁ బంపుఁ
బట్టికట్టఁ బంపు • బాధింపఁగాఁ బంపు, బాలుఁ గినిసి దనుజ • పాలుఁ డధిపుఁ.

ఉ. ముంచితి వార్ధులన్ గదల • మొత్తితి శైలతటంబులందు ద్రొ
బ్బించితి శస్త్రరాజిఁ బొడి • పించితి మీఁద నిభేంద్రపంక్తి ద్రొ
క్కించితి ధిక్కరించితి శ • పించితి ఘోరగదాగ్నులందుఁ ద్రో
యించితిఁ బెక్కుపాట్ల నల • యించితిఁ జావఁ డిదేమి చిత్రమో. 4109

శా. పాతోదం బ్రతిభాష లాడెదు జగ • న్నాథుండ నాకంటె నీ
భూతశ్రేణికి రాజు లేఁ డొకఁడు సం • పూర్ణప్రతాపుండు మ
ద్భ్రాతం జంపిన మున్నె నే వెదకితిం • బల్మాఱు నారాయణుం
డేతద్విశ్వములోన లేఁడు మఱి వాఁ • డెందుండురా దుర్మతీ.

క. ఎక్కడఁ గలఁ డే చక్రి యనే, చక్కటి వర్తించు నెట్టి • జాడను వచ్చుం
జక్కడుతు నిన్ను విష్ణునిఁ, బెక్కులు ప్రేలెదవు వాని • భృత్యుని పగిదిన్.

మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డా • కాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ • ఖద్యోతచంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిం • గవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకం • గా నేల నీ యాయెడన్.

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని, సందేహము వలదు చక్రి • సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన, నందందే కలఁడు దాన • వాగ్రణి వింటే.

క. డింభక సర్వస్థలముల, నంభోరుహనేత్రుఁ డుండు • ననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ • స్తంభంబునఁ జూపఁ గలవె • చక్రిన్ గ్రక్కన్.

మ. విహగేంద్రుం డహి ద్రచ్చుకైవడి మహో • ద్వృత్తిన్ నృసింహుండు సా
గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసం • ఘాతంబులన్ వ్రచ్చె దు
స్సహదంభోళికఠోరదేహు నచలో • త్సాహున్ మహాబాహు నిం
ద్రహితాశాంతకు భీకరున్ ఘనకరున్ • దైత్యాన్వయశ్రీకరున్. 4115

భాగవతము సప్తమస్కంధము

శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా.

క. విను దఁట జీవులమాటలు, చను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో
యను దఁట పిలిచిన సర్వముఁ, గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్ధీ.

ఉ. ఓ కమలాప్త యో వరద యో ప్రతిపక్షవిపక్షదూర యో
కావ్యకవియోగివంద్య సుగుణోత్తమ యో శరణాగతామరా
నోకహ యో మునీశ్వరమనోహర యో విపులప్రభావ రా
వే కరుణింపవే తలఁపవే శరణార్థిని నన్నుఁ గావవే.

ఆ. విశ్వమయత లేమి వినియు నూరక యుండి, రంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు, భక్తియుతున కడ్డపడఁ దలంచె. 4126

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నా మూలసౌధంబు దా
పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

మ. తనవెంటన్ సిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్ దాని వె
న్కను బక్షీంద్రుఁడు వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

మ. తనవెంచేయుపదంబుఁ బేర్కొనఁడు నాథశ్రీజనాలాపముల్
వినఁడో ముచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో భక్తులం
గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁ డని ధిక్కారించిరో దుర్జనుల్.

మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరితాకంపితభూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా

నరిభూతాంతరచక్రమున్ బహువిధ•బ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాం•ధశ్చక్రమున్ జక్రమున్.

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాం•భోరాశిసౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహా•భూతప్రచైతన్యమున్
సారోదారసితప్రభాచకితప•ర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును ని•ర్ధూతాశ్వమత్తైన్యమున్.

మ. మొరసెన్ నిర్జరదుందుభుల్ జలరుహా•మోదంబులై వాయువుల్
దిరిగెం బువ్వులవానజల్లు గురిసెన్ • దేవాంగనాలాస్యముల్
వరఁగెన్ దిక్కులయందు జీవచయఘో•షధ్వానముల్ నిండె సా
గర ముప్పొంగెఁ దరంగచుంబితనభో•గంగాముఖాంభోజమై.

క. విడుదయగుకేల గజమును, మడువున వెడలంగఁ దిగిచి • మదజలరేఖల్
దుడుచుచు మెల్లన పుడుకుచు, నుడిపెన్ విష్ణుండు దుఃఖ•ముర్వీనాథా.

క. శ్రీహరికరసంస్పర్శను, దేహము దాహంబు మాని•ధృతిఁ గరణీసం
దోహంబుఁ దాను గజపతి, మోహనఘీంకారశబ్ద•ములతో నొప్పెన్. 116

క. కరమున మెల్లన నివురుచుఁ, గర మనురాగమున మెఱసి•కలయఁబడుచున్
గరి హరికతమున బ్రదుకుచుఁ, గరిపీడన మాచరించెఁ•గరిణుల మరలన్.

సీ. నరనాథ నీకును • నాచేత వివరింపఁ,బడినయీకృష్ణాను•భావ మైన
గజరాజమోక్షణ•కథ వినువారికి, యశము లిచ్చును గల్మ•షాపహంబు
దుస్స్వప్ననాశంబు•దుఃఖసంహరంబుఁ, బొద్దున మేల్కాంచి•పూతవృత్తి
నిత్యంబుఁ బఠియించు•నిర్మలాత్మకు లైన, విప్రులకును బహు•విభవ మొసఁగు

గీ. సంపదలు గల్గు పీడలు•శాంతిఁ బొందు, సుఖము సిద్ధించు వర్ధిల్లు•శోభనములు
మోక్ష మఱచేతిదై యుండు•ముదము సేయు ననుచు విష్ణుండు ప్రీతుఁడై•యానతిచ్చె.

క. గజరాజమోక్షణంబును, నిజముగఁ బఠియించునట్టి•నియతాత్ములకున్
గజరాజవరదుఁ డిచ్చును, గజతురగస్యందనములుఁ • గైవల్యంబున్.

భాగవతము, అష్టమస్కంధము.

## —♦ వామనచరిత్రము ♦—

మ. వటుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సం•వాసస్థలం బెయ్యది
యొయ్యదనన్ నీవరుదెంచుటన్ సఫలమ•య్యెన్ వంశమున్ జన్మముం

గడు ధన్యాత్ముఁడ నైతి నీమఖము యో♦గ్యంబయ్యె నా కోరికన్
గడతేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుం♦గల్యాణ మిష్టార్థముల్.

మ. వరచేలంబులొ మాడలో ఫలములో ♦ వన్యంబులో గోవులో
హయములో రత్నములో రథంబులొ విశి♦ష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో ♦ గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యే మడిగెదో ♦ ధాత్రీసురేంద్రోత్తమా.

సీ. ఇది నాకు నెలవని♦యేమని పలుకుదు, నొకచో టనక యెందు♦నుండ నేర్తు
నెవ్వని వాఁడనం♦చేమని పలుకుదు, నా యంతవాఁడనై ♦ నడవ నేర్తు
నీ నడవడి యని♦యెట్లు వక్కాణింతుఁ, బూని ముప్పోకలఁ ♦ బోవ నేర్తు
నది నేర్తు నిది నేర్తు ♦ నని యేల చెప్పంగ, నేరుపు లన్నియు ♦ నేన నేర్తు

ఆ. నొరులు గారు నాకు ♦ నొరులకు నే నాదు, నొంటివాఁడఁ జుట్ట♦మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు ♦ చెప్పెద నా టెంకి, సుజనులందుఁ దఱచు ♦ సొచ్చి యుండు

ఆ. ఉన్న మాట లెల్ల♦నొప్పును విప్రేంద్ర, సత్యగతులు వృద్ధ♦సమ్మతంబు
లడుగఁ దలఁచి కొంచె♦మడిగితివో చెల్ల, దాత పెంపుసొంపుఁ దలఁప వలదె.

ఆ. ఒంటివాఁడ నాకు♦నొకటి రెం డడుగుల, మేర యిమ్ము సొమ్ము♦మేర యొల్లఁ
గోర్కి దీర బ్రహ్మ♦కూఁకటి ముట్టెద, దానకుతుకసాంద్ర♦దానవేంద్ర.

మ. వసుధాఖండము వేఁడితో గజములన్ ♦ వాంఛించితో వాజులన్
వెస నూహించితొ కోరితో యువతులన్ ♦ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీ వడుగ నీ♦భాగ్యంబు లీపాటిగా
కసురేంద్రుండు పదత్రియం బడుగ నీ♦యల్పంబు నీ నేర్పునే.

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నా♦కున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూము లెక్కడ కరుల్♦వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదా♦కాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్. 4154

సీ. సంతుష్టుఁ డీ మూఁడు♦జగములఁ బూజ్యుండు, సంతోషి కెప్పుడు ♦ జరగు సుఖము
సంతోషి గాకుంట ♦ సంసారహేతువు, సంతసంబున ముక్తి♦సతియు దొరకుఁ
బూఁటపూఁటకు జగం♦బుల యదృచ్ఛాలాభ, తుష్టిని దేజంబు ♦ దోన పెరుఁగు
బరితోషహీనతఁ♦బ్రభ సెడిపోవును, జలధార ననలంబు ♦ సమయునట్లు

ఆ. నీవు రాజ వనుచు ♦ నిఖిలంబు నడుగుట, దగవు గాదు నాకుఁ ♦ దగినకొలఁది
యేను వేఁడికొనిన ♦ యీపదత్రయమును, జాల దనక యిమ్ము ♦ చాలుఁ జాలు

ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁ♦దై నాకరం బుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే ♦ కాయంబు నాపాయమే.

మ. నిరయంబైన నిబంధమైన ధరణీ♦నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ ♦ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం♦డభ్యాగతుండైన నౌఁ
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా♦ధీవర్య వేయేటికిన్.

మత్త. ఎన్నఁడుం బర వేఁడఁ జోఁడఁట ♦ యేకలుం డఁట కన్నవా
రన్నదమ్ములు నైన లేరఁట♦యన్నివిద్యలమూలగో
ష్ఠి నెఱింగిన ప్రోడ గుజ్జఁట♦చేతు లొగ్గి వసింపనీ
చిన్నిపాపనిఁ ద్రోసి పుచ్చఁగఁ ♦ జిత్త మొల్లదు సత్తమా.

ఆ. బ్రదుకవచ్చుఁ గాక ♦ బహుబంధనములైన, వచ్చుఁగాక లేమి♦వచ్చుఁ గాక
జీవధనములైనఁ ♦ జెడుఁ గాక పడుఁ గాక, మాటఁ దిరుగలేరు♦మానధనులు.

క. సురలోకసముద్ధరణము, నిరతశ్రీకరణమఖిల ♦ నిగమాంతాలం
కరణము భవ సంహారణము, హరిచరణము నీటఁ గడిగె ♦ నసురోత్తముఁడున్

శా. విప్రాయ ప్రకటవ్రతాయ భవతే♦విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం♦దాస్యామి యంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం♦జేసాఁచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం♦బాశ్చర్యముం బొందఁగన్.

ఆ. కమలనాభు నెఱిఁగి ♦ కాలంబు దేశంబు, నెఱిఁగి శుక్రుమాట♦నెఱిఁగి నాశ
మెఱిఁగిపాత్రమనుచు♦నిచ్చె దానము బలి, మహి వదాన్యుఁ డొకఁడు♦మఱియుఁ గలఁడె

క. బలి చేసిన దానమునకు, నలినాక్షుఁడు నిఖిలభూత♦నాయకుఁ డగుటం
గలకల మని దశదిక్కులు, బళిబళి యని పొగడె భూత♦పంచక మనఘా.

శా. ఇంతింతై వటుఁ డింత యై మఱియుఁ దా ♦ నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున క♦ల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంత యై ధ్రువునిపై ♦ నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్ర♦హ్మాండాంతసంవర్ధియై. 4172

సీ. దానవ త్రిపదభూ♦తల మిత్తు నంటివి, ధరణిఁ జంద్రార్కు లెం♦దాక నుందు
రంతభూమియు నొక్క♦యడుగయ్యె నాకును, స్వర్లోకమును నొక్క♦చరణ మయ్యె
నీసొమ్ము సకలంబు ♦ నేడు రెండడుగులు, గడమపాదమునకుఁ♦గలదె భూమి
యిచ్చెదనన్నర్థ♦మీని దురాత్ముండు, నిరయంబుఁ బొందుట♦నిజము గాదె

## —• భ్రమరగీతలు. •—

మ. ఒకపువ్వందలితేనె ద్రావి మధుపా యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడు భంగి మమ్మధరపీయూషంబునం దేల్చి మా
యకలంకోజ్జ్వలయౌవనంబు గొని యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం
డకటా యాతని కెట్లు దక్కె సిరి మిథ్యాకీర్తి నమ్మెంజుమీ. 4181

శా. భృంగా కృష్ణుఁడు మంచివాఁడనుచు సంకీర్తిం బ్రశంసించెదీ
సంగీతంబున నేము సాక్షుఁడను తచ్చారిత్రముల్ వింతలే
యంగీకారము గావు మాకుఁ బురకాంతాగ్రప్రదేశంబులన్
సంగీతం బొనరింపుమా రిపుహరోజ స్నేహనిష్టార్థముల్

సీ. కాంచనరత్నసంఘటితసౌధంబులే, మా కుటీరంబులు మాధవునకు
వివిధనరేంద్ర సేవిత రాజధానియో, మాపల్లె యదువంశమండనునకు
సురభిపాదపలతాశోభితారామమో, మా యరణ్యము సింహమధ్యమునకు
గమనీయలక్షణాగజతురంగంబులే, మా ధేనువులు కంసమర్దనునకు

గీ. రూపవిభ్రమనైపుణభూషలైన, మగువలమె మేము మన్మథమన్మథునకు
నేల చింతించుమముఁ గృష్ణుఁ డేల తలఁచుఁ, బృథివి నధిపులు నూతనప్రియులు గారె.

భాగవతము, దశమస్కంధము.

## —• అన్యాపదేశము •—

ఉ. మాయురె భృంగమా వికచమల్లికల న్విడనాడి తమ్మిలో
నీయెడఁ బూవుఁదేనియల నింపుజనింపఁగఁ గ్రోలి సొక్కియుం
బోయెద వన్నభ్రాంతి నినుఁ బొందదు రా జుదయించె నిప్పు డీ
తోయజపత్రముల్ వరుసతో ముకుళించెఁ జలింప కుండుమా.

చ. అళికులవర్య పద్మముకుళాంతరమందున నిమ్ము చాలకే
చలనము నందె దేల నవసారసమిత్రుఁడు రాక యుండునా
తొలఁగక యందె యుండు మిఁకఁ దోయజవైరి తిరంబె రాత్రి యీ
కలవర మేల తమ్మితుదఁ గానక ఘూటక యూరకుండుమా.

మ. అళి నీతత్తర మేల నీడ నిదె నీయాత్మేశుఁ డౌభృంగుఁ డీ
జలజాతస్థమరందపానవశతన్ సానందుఁడై యున్నవాఁ
డలికెం తేనియ యా లేక నీ వరుగుమీ యొప్పారఁగా వేడ్క నీ
కెల్లుఁబుంటుం బళితెంపు వేఁకువను రాజీవంబు పుష్పించినన్. 4186

గీ. యల విభీషణు లంకకు ♦ నధిపుఁ జేసి, భూమిసుతఁ గూడి సాకేత ♦ పురమునందు
రాజ్యసుఖములు గైకొని ♦ రామవిభుఁడు, వరుస ననుబ్రోచుచుండుఁ బ్రి♦ వాసగతుల

భాగవతము. షష్ఠస్కంధము.

## ♦ శివకవచము ♦

క. శివదాహ్వయుఁడైనసదా, శివునకు వందన మొనర్చి ♦ సేమము వెలయన్
శివభక్తుఁడవగు నీకును, శివకవచ ముపన్యసింతుఁ ♦ జిత్తం బలరన్

సీ. భూస్వరూపమున నే ♦ పురుషుండు సకలప్రపంచంబు దాన భ♦రించు నెపుడు
జలరూపుఁడగుచు నే ♦ సర్వజ్ఞుఁ డిలఁ గల్గు, నరులకు సంజీవ♦నం బొనర్చుఁ
కాలాగ్నిరూపుఁడై ♦ కల్పాంతమునఁ ద్రిలోకములెల్లఁ నెవఁడు ద♦గ్ధములు చేయు
వాయురూపమున స♦ర్వప్రాణియై యుండు, గగనాకృతిని బూర్ణుఁ♦ డగుచు వెలయు

గీ. నట్టి లోకైకనాయకుఁ ♦ డష్టమూర్తి, సచ్చిదానందమయుఁడు వృ♦షభధ్వజుండు
సలిలవాతాగ్నిబాధలఁ బొరయకుండఁ, జిరకృపాదృష్టి నన్ను ర♦క్షించుఁ గాత.

క. శూలాయుధుఁడు గిరీశుఁడు, కాలాంతకుఁడైన నీలకంఠుఁడు పగలున్
రేలును నను రక్షించును, లోకైకరమాకటాక్షు ♦ లక్షితముఖుఁడై.

క. చింతితఫలదుఁ డా గౌరీ, కాంతుఁడు పరమేశ్వరుం డ♦ఖండుఁడు బాహ్యా
భ్యంతరదేశంబుల నన్నెంతయు రక్షించుఁ గాత ♦ ననవరతంబున్.

గీ. నిలిచి కూర్చుండి శయనించి ♦ నిద్ర జెంది, మేల్కనిన వేళలను కాల♦ మృత్యుహరణుఁ
డంబికారమణుండు త్రి♦యంబకుండు, ఖండపరశుండు నను వేడ్కఁ ♦ గాచుఁ గాత

సీ. అనపేక్షనుతవిన♦తాతిరహస్యంబైన, కవచంబు నాచేతఁ ♦ గథిత మయ్యె
నదియును దాపత్ర♦యధ్వాంతమిహిరంబు, ధారుణాపద్వని♦వారణంబు
సకలసౌభాగ్యైక ♦ సామ్రాజ్యసదనంబు, పశుపతికారుణ్య ♦ భాజనంబు
నీశైవకవచంబు ♦ నేకాగ్రచిత్తులై, హితమతిఁ బఠియింతు ♦ రెవ్వ రేని

గీ. వారు శ్రీసాంబశివునికృ♦పారసమున, నతిశయవ్యాధిమృత్యుభ♦యంబులుడిగి
చిరతరాయుష్కులగుచు ల♦క్ష్మీకటాక్ష, పాత్రులై బహుసౌఖ్యముల్ ♦ బడయఁగలరు

బ్రహ్మోత్తరఖండము. ఆ 4.

# రాజనీతి

క. రాజునకుఁ బ్రజ శరీరము, రాజు ప్రజకు నాత్మ గాన ♦ రాజుం బ్రజయున్
రాజోత్తమ యన్యోన్యవ్యాప్తి, రాజితులై యుండవలయు ♦ రక్షార్చనలన్. 4202

శాంతి. ఆ 2 పద్య 274.

మ. పరనారీగమనాదిదోషములు భూ♦పాలుండు సేయంగఁ ద
ద్ధరకున్ వర్షము లేక యుండుఁ బ్రజకున్ ♦ దైన్యంబు వాటిల్లు నై
శ్వర్యరుజల్ పైకొను నెందునుం గలయు న♦క్కాలంబు దేశముం దక్కి ను
ద్ధురసైన్యంబుల శత్రు లొత్తుదురు బం♦ధుశ్రేణికిం జేటగున్.

క. మృదుమధురవాక్యముల నిం, పొదవెడుచిత్తవృత్తితోడ ♦ సుస్నేహుఁడు స
మ్మదము సచివులకుఁ బ్రజలకు, నొదవింపఁగ వలయు నది మ♦హోన్నతిఁ జేయున్

గీ. ఈఁగియును బ్రియవచనసం♦యోగమునన, కాని జనులకు సంతోష ♦ కారి కాదు
పుచ్చుకొనునప్డు పల్కులఁ ♦ బొందు కలిమి, యొదిగించుటిఁ గంద నీదింత ♦ యొలుఁగు మధిప.

క. తనయుల నైనను నమ్మిన, జనపతి సిరి గోలుపోవుఁ ♦ జతురతమై న
మ్మినవాఁడపోలె నమ్మక, యునికి సకలజనులయెడల ♦ వెర వై యుండున్.

ఉ. ఒక్కటి యేను జెప్పెద మ♦హోగ్రపుఁ గేసరి కైనఁ దోడుగా
నక్కను లావునుం గలుగు ♦ నుజ్జ్వలసత్త్వచయంబుఁ గొన్నఁగా
నెక్కుడు కృత్యముల్ నడప♦ నెట్లగు నిట్టివి పాలు నంచుఁ దాఁ
గుక్కలఁ గూర్చి చేయఁ దన♦కుం దలఁపుల్ దలకూడ నేర్చునే.

క. వికచముఖుఁడగుచు శాత్రవు, లకు హితు లగునట్టివార♦లం గని భూపా
లకుఁ డెడ్డ కత్తెరయు నా, లుక బెల్లము నై మనంబు♦లుం గన వలయున్.

క. పానము జూదము వేఁటయు, మానినియును భూపతులకు ♦ మధురవినోద
స్థానము లగు నైనను దగ, వైనవిధము దక్కఁ దగుల ♦ మాపద దెచ్చున్.

క. విని విననివాఁడఁ బోలెం, గని కాననివాఁడపోలెఁ ♦ గావలయు విభుం
డూనరింపఁ దలంచినపని, కనువగునంతకు నభేద్యుఁ♦డై జనులయెడన్.

క. ఒల్లని కార్యం బాసల, నల్లన కాలగతి, గడుపు♦నది కాలముచేఁ
బెల్లావవు విఘ్నములు భూ, వల్లభునకు నెపము వెట్ట♦వచ్చుం బిదపన్.

క. తెగఁ దీర్పక తగ నార్పక, తెగటార్పక కడమ కొంత ♦ త్రిక్కఁగ నున్నన్
జగతీశ యప్పు నగ్నియుఁ, బగయును గడుఁ బెరుఁగుఁ గీడు♦ వాటిల్లఁ దుదిన్.

ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడుఁ ♦ గొండియుఁడున్ జడుఁడుం గృతఘ్నుఁడున్
నేరనివాఁడు బొంకరియు ♦ నిందకు నోర్చునతండుఁ బందయున్
ధీరత లేమి దుర్నయ మ♦తివ్యసనత్వము గల్గువారలుం
జేరువ నున్కి భూపతికిఁ ♦ జెట్ట యొనర్చు నశేషపాత్తమా. 4213

ఉ. కొందఱు మేలుసూడుటలుఁ గొందఱు వావులు దీర్చి పిల్చుటల్
కొందఱు సుద్దుచేయుటయుఁ గొందఱు నెయ్యపుఁ జూపు చూచుటల్
కొందఱు నాత్మభావమునఁ గొందఱు మన్ననభృత్యులందు ని
ట్లొందఱు సన్నిధంగుల నృపాగ్రణి వశ్యులఁ జేయఁగాఁ దగున్.

నీతిసారము. ఆ ౩.

క. వివిధాన్నము లొసఁగ నంపిన, నవవినియోగముల మునుపఁ బెట్టి యతనికిఁ జీర్ణం
బవు టెఱిఁగి భుక్తిఁ గొసఁగఁదగుఁ, బ్రవిమలమతిభక్ష్యభోజ్య పానీయాదుల్.

క. జనపతి యన్యస్వపాలుఁడు, పనిచినభూషణసుగంధ పరిధానంబుల్
మునుమున్న పూనఁగాఁ దగ, దెనయఁగ విషయంత్రభంగు లెఱిఁగినదాఁకన్. 4216

క. పతియు నమాత్యుఁడు దుర్గము, క్షితియును మిత్రుండు ధనము సేనయు ననఁగా
నతి కెక్కును సప్తాంగము, లతులితగతి రక్ష సేయ నగు నరపతికిన్.

క. అక్కఱ కలదని ప్రజపతి, యెక్కువగా ధనముఁ గొనుట యిలపై జెలగవుల్
ప్రక్కలుగఁ ద్రివ్వి మీలను, గ్రక్కునఁ బట్టుకొని తింటఁ గణుతింపంగన్.

క. తనభూమిప్రజల నిరతము, జననాయకుఁ డరయకుండె సచివుని నిలుపన్
ధనహానియె కాదా మీఁదను రాజ్యము చెడు ప్రధానిదా స్వామి యగున్.

క. కానిప్రియ మెన్నఁడును నొక, కానియుఁ జేయంగఁ దగదు కార్యము గలచో
మానకధనము తృణంబుగ, మానవపతి సేయ నగు సమగ్రవిభూతిన్.

క. కృపను లిచ్చిన సుకవుల నాశ్రితుల ధరాప్రజలభటులఁ బ్రియబంధుల భూ
పతి యవసరమున సమసిన, హితులకుటుంబములఁ బ్రోవ నిలపతివలయున్. 4222

రుక్మాంగదచరిత్రము. ఆ ౨ ప 60-66.

సీ. పార్థివోత్తములకుఁ బ్రజల రక్షించుట, పరమధర్మంబగు నరవరేణ్య
ధరణీశులకుఁ బ్రజాపరిపాలనంబునఁ, బూని లోకులు సేయు పుణ్యమందు
షష్ఠాంశ మర్థిని సంప్రాప్తమగునట్లు, ప్రజలఁ బ్రోవని రాజు ప్రజలచేత
నపహృతసత్పుణ్యుఁడై వారు గావించు, ఘనపాపఫలముఁ దా ననుభవించు
గీ. గాన నీవును విప్రవరాను మతము, సాంప్రదాయకవిధమునై జరగుధర్మ
మహిమఁ జేపట్టి యర్థకామములయందు, సమత నమ్మాటియందు నాసక్తి లేక.

భాగవతము, స్కం. 4 పద్య ౮41.

సీ. శక్తిత్రయంబునఁ జతురుఁడై చతురుపాయంబులకును సమయం బెఱింగి
పంచేంద్రియముల నిర్జించి స్వాయత్తుఁడై, షడ్గుణీగరిమఁ బ్రశక్తిఁ గాంచి

వ్యసనంబు లేమను ♦ వర్జించి రాజద్రోహములు పద్మాక్షుఁ జి♦త్తమునఁ దెలిసి
సాక్షిమాత్రంబుగా ♦ సచివుఁ బ్రతిష్ఠించి, యాత్మయత్నము లేక♦ మంత్రమైన
గీ. నింగితాకారచేష్టల♦ నెఱుఁగనీక, పరుల నెవ్వరి విశ్వసిం♦పక మనమున
సంగతంబు శరీర♦ సంరక్షణంబు, లేమఱక యుండవలయు మ♦హీవిభుండు. 4224
సీ. తఱిఁ బ్రోవ జీతంబు♦ కొఱఁత గాకుండ రొ, క్కంబు భండారమునఁ♦ బెంచ బుద్ధి
బంటుఁ దొలంగించి ♦ ప్రతియు వెట్టక యుండఁ, గమి లెక్కలు తెలుప♦ గాకయుండఁ
గడఁగి వేశ్యాగామి♦ గాకుండఁ బరికించి, ప్రతిభానువాదంబు♦ భటులతోడు
చూచుచుఁ దనపన్నె♦ జోకరై యుండిన, వాని మన్నించుచు ♦ లేనివాని
గీ. నాజ్ఞ సేయుచు జీవిక♦ నప్పు వడక, యుండఁ బరికించికొనుచు నా♦నావేదనమున
నైనపదిసేయ నుత్సాహి♦యైనయాప్తబలము నేలఁగ వలయు భూ♦పాలకుండు.
శకుంతలాపరిణయము, ఆ 4.

క. నీతియు హితమును ధర్మముఁ, జాతుర్యముఁ గలుగునట్టి ♦ సచివుఁడు చెప్పన్
బ్రీతి విన నొల్లకుండిన, భూతలనాయకుఁడు తాను ♦ పొలియుం బిదపన్. 4226
ఆ. కాలకూటవిషము♦ కడువాఁడిశరమును, గొనినయతఁడు చచ్చు ♦ నెఱను గాక?
దుష్టమంత్రిమంత్ర♦దోషంబు దాఁకినఁ, బుడమిజనముఁ బతియుఁ ♦ బొలిసిపోవు.
పద్మపురాణము, ఆ 3 ప 56, 57.

ఆ. అరులవద్దనుండి♦ యరుదెంచి కొల్చిన, భటుఁడుఁ బాము నొక్క♦భంగి గాన
మోసపుచ్చి చెఱుచు♦ నాసన్నుఁడౌ వాని, నమ్మినట్లయుండి ♦ నమ్మఁ దగదు.
పంచతంత్రము, నారా. మిత్ర. ప 309.

క. సకలవ్యసనికిఁ జుట్టము, నకు మంత్రికి నిష్ఠభృత్యు♦నకు సజ్జను నా
జ్ఞకు బోటుకాని కర్త్యాధిక మిచ్చుట చనదు నయగ♦తిన్ బద్దెనృపా.
చ. వెరవరి గానివానికను♦ వేసరుచుండెడువాని మాటలన్
సరసుఁడు గానివాని మతి♦చాలవానిని లంచ మిచ్చినన్
బొరసినవానిఁ బోవునెడఁ ♦ బొద్దులు పుచ్చినవాని భీతునిన్
బరుసనివాని రాజు పని♦పంపుట కీడు వివేకభూషణా.
క. నాయకవిరహితమును బహు, నాయకముఖ్యమును బాల♦నాయకమును స్త్రీ
నాయకమై చెడు సిరి నర, నాయకులకు సందు శ్రీ కీర్తి♦ నారాయణుఁడా.
బద్దెనీతులు, ఆ 2.

క. తనువు భరంబని వీడ్కొని, తనలోఁ దలపోయుమూఢ♦ తపచందమునన్
జనపతిపతిచోదకోర్వక, గని రాజ్యము మంత్రికయిప♦నముఁ గావించున్. 4232

క. పవనగౌరవము ధర్మావనునకు నత్యంతగౌర◆వము వెండియు న
న్యూనజనలాఘవము ధర్మావయనకు నత్యంత లాఘ◆వము సు మ్మెందున్.

పంచతంత్రము.

క. సుమువులన బమలుపందిలి, యిడి హస్తము బలుగుముంటి◆ కెరయై దినముల్
గడుపుదుఁ బొమ్మనుచుయ్యా, గడపున్నపుంబోయుఁ జేన◆గలసైన్యంబుల్.

చ. అదనుననజీవితంబిడమి ◆ యారజ మాడుట లేవి పేరము
ల్వేడకుట నిచ్చలుక్ బరిభ◆వించుట కింకరసంకులంబు నె
మ్మదికి నసహ్యమౌట దయ◆మానుట పిమ్మట నాడికో ల్మహీ
పదవికిఁ బాసి యొంటిపడి◆ పాటులఁ బొందు నృపాలు చిహ్నముల్.

క. హితుఁ డని యొకనికిఁ జెప్పిన, నతఁడును దన కూర్చుసఖుని◆కవి దెలుపు నర
ణితమై నృపమంత్రింబీ,గతిఁ బలువురు వినుటచే వి◆ఘాతత నొందున్.

పంచతంత్రము, వేంక. ఆ 1, 2, 3.

సీ. సౌఖశాయనికభి◆వర్ణపూర్వకము శాల్య, వేళఁ గార్తాంతిక◆ద్విజాలగోష్ఠి
జాము వోవ నమాత్య◆సామంతిపూర్వకం,బర్థార్జనస్థకా◆యస్థగోష్ఠి
దినమధ్యమమున మ◆ర్దన మల్లపూర్వకం,బగునూనసూపకృ◆న్నృగయుగోష్ఠి
యపరాహ్ణమున దేవ◆తార్చనాపూర్వకం, బార్యధర్మాధికృ◆ద్వ్యతులగోష్ఠి

తే. భుక్తిమీఁదవిదూషక◆పూర్వకము పు,రాణకవిగోష్ఠి చారపూ◆ర్వకము సంజ
జాము గాయకగోష్ఠిని◆శన్ సుషుప్తి,పూర్వకము ప్రేయసీగోష్ఠి◆ పొసఁగు బతికి.

ఆముక్తమాల్యద, ప 282.

క. మన నిచ్చినఁ దన కోడయు,చన విచ్చినఁ బ్రజలు వెక్క◆సము సేయుదురో
టన్నృపతిమననీయక గడుఁ, జను వీకయ మెలఁపవలయు ◆ సమ్ముఖనులన్.

ఆ. ఎంతబలియురకుఁ ద◆నంతగా సామంత,గణముఁ బెనుప కేల◆కలుగు జయము
శేషునంతవాఁడు ◆ శిరములు వెయి పూని,కాక మహి వహింపఁ◆గలిగె నెట్లు.

క. పతికి ననుకూలసేనా,పతు లనఁగా నెంది అన్ని◆పటుతరభుజముల్
పతికిఁ బ్రతికూలసేనా,పతు లనఁగా నెంద అన్ని◆పటుతరభుజముల్. 4241

కవికర్ణరసాయనము, ఆ 2.

సీ. సరిగాఁగఁ బదవు లొం◆డొరులకు వడవఁగా, సమవివత్తునియందు ◆ సామవిధియు
మూలబలంబు పెం◆పునదుర్గయుండయి, పేర్చుశాత్రవునందు◆ భేదవిధియు
నెంచును సంధిని ◆ హితులబలంగంబు,చేకొన్న రిపునందు ◆ దానవిధియు
సాధునిశ్చితపరా◆జయుఁడై పిహీనబ,లుండైన యరియందు ◆ దండవిధియు

తే. పలుకవలయు ధరాతలే◆శ్వరవరేణ్య, బుద్ధియందు క్షయస్థాన◆వృద్ధులను త్రి
వర్గము నెఱింగి పంచాంగ◆వర్తనములఁ, దెలిసి శక్తిత్రయంబుఁ◆ దెలియవలయు.

సీ. మంత్రిగోపనము నే◆మఱుటయు దీర్ఘచింతయు నిరర్థకపుఁ జంచ◆లతయుఁ గ్రోధ ప్రమాద
విరహితత్వము బుధా◆విజ్ఞానము శుభాప్రయోగంబు విషయాస◆క్తాగ్రహకథనము
ననృతంబు నాలస్య◆మును నాస్తికత్వంబు, నర్థంబులందు న◆నర్థమతియు
దీర్ఘసూత్రత్వంబు ◆ దీర్ఘరోషంబు నిర్ణీతకార్యముల నా◆చరింపమియును

ఆ. భూమిపతికి దోష◆ములు నివి పదునాల్గు, వీనిఁ దెలిసి నెఱయ◆ విడువవలయుఁ
గామరోషజంబు◆లైనట్టి వ్యసనములందుఁ ◆ దగుల వలదు.

క. కొలిచినవారలజీతంబులు వేళలు దప్పకుండఁ◆ బూర్ణముగా ని
వలయును వారల ప్రేమయు, బలము ప్రతాపంబు నెల్ల◆పట్టుల మిగులన్.

క. దండార్హుల దండింపమి, దండానర్హులకు వారి◆ దండించుటయున్
రెండు నకీర్తిదములు భూమండలనాయకులకు నిరయ◆ మున్నలఁ జేయున్.

కళాపూర్ణోదయము, ఆ 7 పద్య 261-265.

క. జలజాసనలిఖితము బలె, ఫలకాలమునందుఁ గానఁ◆ బడఁ జేయఁ దగున్
దలఁచినతలఁ పంతయు మును, వెలిపడకుండంగ మనుజ◆విభుఁ డో వత్సా.

క. కొండీని మాట నిజమని, దండింపఁగఁ దగదు రాజు◆ ధరణీజనులన్
నిండుమదిఁ గల్ల నిజములు, రెండును సమబుద్ధి విచా◆రింపక మొదలన్.

క. ధన మిచ్చిన నీవి కదు, చన పీనము చితము క్రూర◆చరితుల కవనీ
జనులు తదాచరణంబున, మనసెడపిన భద్రదంబె ◆ మనుజేంద్రునకున్.

సుదక్షిణా, ఆ 2 ప 152-156.

క. తనుఁ గొలిచి పోయి పగరను, గని కొలిచిన భటుఁడు మఱలఁ◆ గా వచ్చిన వా
నిని నేలఁ దగదు నరపతి, యను వెఱుఁగక యేలెనేని ◆ హానిం బొందున్.

గీ. వైరి చుట్టంబు గొలువంగ◆ వచ్చెనేని, వాని నేలంగఁ దగదు భూ◆వల్లభుండు
శరణుఁ జొచ్చినయెటువంటి◆ శత్రువైనఁ, గాచు టుచితంబు మేదినీ◆కాంతునకును.

షట్చక్రవర్తిచరిత్ర. ఆ 6 పద్య 59-70.

క. చారులు కన్నులు నిజపరి, వారము ప్రాణంబు మంత్రి◆ వరతతి హృదయం
బారయ భూమిపతిమణి, యై రంజిల మనెడు నృపతి◆కగు విభవంబుల్.

మిత్రవిందాపరిణయము. తుం॥వెం॥, ఆ 1 ప 41.

క. దగ్గఱఁ గొండెము సెప్పెడు, వెగ్గడి పలుకులకు రాజు ◆ ప్రియుఁడై మతి తా
నెగ్గు ప్రజ కాచరించుట, బొగ్గులకై కల్పతరువుఁ ◆ బొడచుట సుమతీ. 4252

క. మే లెంచని మాలిన్యుని, మాలను నగసాలవాని ♦ మంగలి హితుగా,
నేలిననరపతి రాజ్యము, నేలఁ గలసిపోవుఁ గాని ♦ నెగడదు సుమతీ.

సుమతిశతకము. ప 58-104.

క. విశ్వాసపరుల నెఱిఁగి న, రేశ్వరుఁ డధికార మిచ్చు♦ టెంతయు నుచితం
బైశ్వర్యయుతులు గాఁగ న, విశ్వాసులఁ జేయఁ దగదు ♦ విమలవిచారా.

తే. కరుణ తన కెంత గలిగినఁ ♦ గనకవస్తు,వాహనాదులు చాల నీ♦వలయుఁ గాని
భూతలేశ్వరుఁ డెంత యా♦ప్తులకు నైన, సాక్షి ద్రోవంగ నిచ్చుట♦ యనుచితంబు.

క. తా నెంతె యధిపుఁ డైనం, గానీ మనుజేశ్వరుండు ♦ కార్యాకార్య
జ్ఞానము నిజప్రధానులతో నాలోచించి యుక్తి♦తో నెఱుఁగఁ దగున్.

కవిరాజమనోరంజనము, ఆ 1.

గీ. సత్య మనృతంబు పరుషోక్తి♦సరసభాష, ప్రాణిహింసయు దయయు లో♦భంబునీగి
కనకసంగ్రహవ్యయములు ♦ గలుగువార, రమణికైవడి బహురీతి ♦ రాజనీతి.

భర్తృహరిసుభాషితము. నీ॥ ప 39

గీ. కులము గానంబు తన కను♦కూలుఁడైన, తన ప్రయోజనములయందు ♦ మనసు నిలిపి
తనువు గప్పెడ రతోటు ♦ ధరణివిభుఁడు, భూజితము దా స్వజాతినిఁ ♦ బ్రోవవలయు

దిలీపచరిత్రము. ఆ 4 పద్య 278.

సీ. అన్యరాజన్యరా♦జ్యస్థితుం డగువేళ, సరిదొరల్ సంధింప♦ దొరయువేళఁ
జారులు తన బయ♦ల్పచరింపఁ జనువేళ, నారామములఁ గేళి ♦ నలరువేళ
నగరున దుర్గముల్ ♦ సాధింపఁ జనువేళ, వైరిభూభుజు లెత్తి♦వచ్చువేళ
గుఱుతెఱుంగని జనుల్ ♦ గొల్వవచ్చినవేళ, మృగయావినోదాప్తి ♦ మెలఁగువేళ

గీ. మండలేశ్వరుఁ డుద్దండ ♦ దండనాథ, చండభటవీరసామంత ♦ మండలంబు
లండ నుండక వెసనొంటి♦నుండె నేని, గొదవ యగు నంద్రు నీతికో♦విదులు తలఁప

శుకసప్తతి. ఆ 1.

క. తరతరమునాటిహితుల, న్నరపతి విడనాడి యొరక♦నమ్మి యితరులం
బరివారముగా నేలిన, విరవిరగా కేల గాంచు ♦ విజయశ్రీలన్.

నారసింహపురాణము. ఆ 5 ప 8.

సీ. విహారిద్దునాహ్యాళి కేతెంచునే యేఁగి, ప్రజ తెల్పికొనువిన్న♦పముల వినునె
విని లెస్సగా విమ♦ర్శన మొనరించునే, యొనరించి పొడిఁ ద♦ప్పనివిధంబు
గాఁ గర్జములదీర్పఁ♦గావించునే స్వామి, కగుఁ గని నాఁడు కో♦ళ్లైవఁ దీర్చి
మనవు లాలింపునే♦ జనమ్ము లాలించునే, భారముద్యోగులఁ♦పైని జేర్చి

గీ. యూరకుండక యాలస్య ♦ ముజ్జగించి, చారదృష్టులఁ బ్రచ్ఛన్న ♦ సరణిఁ దెలిసి
కొనుచుఁ దప్పున్నఁ దొలఁగించి ♦ గుణులనందు, నిలుపుచుండును మీ ధార ♦ుణీశ్వరుండు

రామరాజవిలాసము. ఆ 3 పద్య 54.

క. కాఁపుల నొప్పింపక తా, నేపట్టున గర్వపడక ♦ యెల్లరు మెచ్చం 4262
గాఁపులవలనను బన్నుల, నోపికతోఁ గొనఁగవలయు ♦ నొడయం డెప్పుడున్.

శుద్ధాంధ్రభారతసంగ్రహము. ఆ 3 ప 42

## —♦ రాజసేవకులు ♦—

సీ. అవికలంబైనసం ♦ ధ్యావిధిపీరికి, లేశమాత్రంబైన ♦ లేదు మిగుల
నచ్యుతసంగంబు ♦ నైన లేదు క్షణంబు, స్వస్వకాలము నందు ♦ సవననియమ
ములనొనర్చుట లేదు ♦ తలఁప నొకప్పుడు, వేదాధ్యయనచింత ♦ లేదు చూడ
నన్నపానాదులు ♦ నాఁకటిసమయాన, నవకాశ మేచాల ♦ నాహరింప
గీ. నిలిచి సుఖనిద్రఁ గావింప ♦ నిమిషమైన, సమయమే కల్గకుండు న ♦ సహ్యమునను
నిష్ఠలను జూచి బాషించు ♦ టేఱుపడదు, మహిపతుల సేవఁ గావించు ♦ మానవులకు.
చ. అలఘుతరాఘదోగ్రకలి ♦ యందును నైజపుధర్మపద్ధతిన్
నిలిచి ప్రమత్తతన్ వదలి ♦ నిశ్చలబుద్ధిఁ బరోపకారులై
చెలిమి బహుప్రజావనము ♦ సేయుటయందు నెపుడు బద్ధదీక్షులై
కొలుతురు వీరు రాజుల న ♦ ఖండితసౌఖ్యనిరాసభావులై.

విశ్వగుణాదర్శము.

## —♦ రాజసేవాధర్మములు. ♦—

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నా కేమి యనుచుఁ ♦ దేఁకువ లేమిన్
మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని ♦ పుట్టకయున్నే.
ఉ. రాజగృహంబు కంటె నభి ♦ రామముగా నిలు గట్టఁ గూడ దే
రాజ నృపాలుఁ డాకృతికి ♦ నొప్పగు వేసము లాచరించు నే
రాజ విహారముల్ సలుప ♦ నల్లను నంగడు వెడ్క సేయు నే
రాజ విదగ్ధుఁడై పలుకు ♦ నొద్దు కుబం దగ దట్లు సేయఁగన్.
ఆ. రాజునొద్దఁ బలువు ♦ రకు సంకటము గాఁగఁ, దిరుగుపనుల కెంత ♦ తేజమయిన
వాని బుద్ధిఁ గలుగు ♦ వారొల్ల రది మీఁదఁ, జేటు దెచ్చు నెట్లు ♦ సిద్ధమగుట.
క. ఊరక యుండక పలువురతో రణమొనగంగఁ బలుకఁ ♦ దొడరుపక పదిం
జేరువ గలనాగరకులుఁ, దారుఁ గలసి పలుక వలయు ♦ ధరణీశుకడన్. 4268

రతికి నువ్విళ్లూరు ♦ నతి శరక్షుతుఁడైన, యవసరంబున వేఁట ♦ లాడి యలసి
ధరణీరుహచ్ఛాయ ♦ లరయుచోటఁ బిపాస, సలిలము న్వేషించు ♦ సమయమునను
గీ. మజ్జనం బాడుచుట్టుఁ ♦ దానినియతి, నర్ధమీలితలోచనుం ♦ డై పురాణ
పురుషు ధ్యానించు నక్కాల ♦ మునన్నృపాలుఁ, జేర రాదండ్రు తద్జ్ఞులు ♦ సేవకులకు.

పంచతంత్రము, దూ. శిం. ఆ 1 ప 178.

సీ. దారుణాటవి రుదితంబుఁ జేసినయట్లుచచ్చేరి శవంబుఁ జై ♦ చేసినట్లు
నిర్జలంబైనచో ♦ నీరజం బిడినట్లు, వట్టిచోటను విత్తు ♦ వెట్టినట్లు
సారమేయముతోఁక ♦ జక్కఁగట్టినయట్లు, చెవిటి కేకాంతంబు ♦ చెప్పినట్లు
తనరఁ జీకునకున ♦ ద్దంబుఁజూపినయట్లు, వెలిమిడిలో నెయ్యి ♦ వేల్చినట్లు
గీ. చాల నవివేకియైనట్టి ♦ జనవరేణ్యుఁ, దగిలి కొలుచుట నిష్ఫల ♦ త్వంబు సేయు
సేవకుల కెల్లభంగి వి ♦ శేషబుద్ధి, నిల వివేకంబు గలరాజు ♦ గొలువవలయు.
ఉ. ఏపని చేయుచుంచుఁ దన ♦ యేలిక సేవకుఁ బంచెఁ బొందుగా
నాపని దీర్చి వచ్చుటయ ♦ యాతనికిం దగు ధర్మ మిట్టిచో
బాపము పుణ్యమున్ విభుని ♦ పాలగు భృత్యుని కేమి గారణం
బేపున మేఘవర్ణునకు ♦ నీసమయం బెఱిఁగింపఁ బొందగున్. 4283

పంచతంత్రము, నారా. మిత్ర. ప 323. సంధి. ప 284.

## —♦ రాజపరదేశగమనము ♦—

క. స్థానంబు సకలఫలసం, ధానం బొనరించుఁ బతికిఁ ♦ దగ నజ కంత
స్థానస్తన మిడుసె యథా, స్థానస్తనభంగి మధుర ♦ తరదుగ్ధంబుల్.
క. చేవఁగలభూమిపతులటు, గావునఁ గోరదు విదేశ ♦ గమనము దేవా
నీవెఱుఁగని కార్యములుం, ద్రోవలు మఱి యొవ్వరెఱుఁగు ♦ దురు లోకమునన్.

పంచతంత్రము. వేంక. ఆ 3.

సీ. ధీమంతుడును వివేక ♦ దీపితుండును నైన, ప్రభునకుఁ బరదేశ ♦ భయము లేదు
నిజభుజవిక్రమో ♦ న్నిద్రభద్రశ్రీల, నాత్మీయులును దాను ♦ ననుభవించు
నెట్లన్న విను సింహ ♦ మేప్రొద్దు వసియించు, నడవిఁ గాకొండొక ♦ యాడవినైన
నల్పజంతువులందు ♦ నాత్మీయపౌరుషో, ద్యుక్తికి సమతాని ♦ యుక్తి మెఱసి
గీ. కులిశసన్నిభనఖముఖాం ♦ కుశవిభిన్న, మదభరాఖిలసంభిమఁ ♦ గుంభ ప్రకీర్ణ 4286
మాంసరక్తానుభవమోద ♦ మానసమునఁ, బొదలుచుండును నెంతో ప్ర ♦ సిద్ధముగాఁగ.

పంచతంత్రము. నారా. సుహృ. ప 141.

## —♦ రాజదర్శనార్థులు ♦—

సీ. మెడపట్టి [illegible] కెడ [illegible] శ్రేష్ఠమైన లంచంబు♦ లిచ్చి యిచ్చి
మాపటి [illegible] వారాంగనవని [illegible] లకుఁ [illegible] చెప్పి చెప్పి
విభునితో [illegible] నసేకు నిచ్చి [illegible] పలికి పలికి
మఱవకుండ [illegible] మా♦ [illegible] మంత్రులఁ, జేరి విన్నపములు♦ చేసిచేసి
గీ. యయ్య [illegible] మాట యేకాంత♦మైనఁ దెలుపు,మనుచు [illegible] లినవానికి♦ మనవిఁ జెప్ప
వలసి తగునాడ [illegible] తో♦ య్యాలుల [illegible] కిల్ల,నింపుమీఱ జనకట్నంబు♦లంపి యంపి. 4288
సీ. ఏలిక యీవేళ♦ నేకాంతమున నున్న,వాఁడటుండుఁడను సే♦వకులపలుకు
రాజుతోఁ బట్టపు♦రాణి చెప్పిన వొప్పి,నాఁ డుండుఁడని యింతు♦లాడుపలుకు
ప్రభుసమీపమున మీ♦పలుకులు చెప్పినా,మేమనియెదుపురో♦హితులపలుకు
అయ్య మాపటికిఁ గొ♦ల్వైన మీరును బొడ♦గనుఁడను మంత్రిశే♦ఖరులపలుకు
గీ. తమకు శుభసూచకంబులై ♦ తనరుచుండ, వా బలీంద్రుని మొగసాల♦ నమరులెల్లఁ
గలయఁగాఁ గాచియుండిరి♦ యలుగువాతి,కొంగలనఁ జేరుకొని గుంపు♦గుఁ పులగుచు.
లక్ష్మీనారాయణపరిణయము. ఆ 3.

## —♦ మంత్రిధర్మము. ♦—

ఆ. చేతిగూన పూని ♦ నిచ్చెన యెక్కెడు, వరునియట్లు రాజ్య♦భరము పూని
పతికి దుర్యశంబుఁ బాపంబు రాకుండఁ, బదిలపఱిచి మంత్రి♦ మెదలవలయు.
పద్మపురాణము, ఆ 3. ప 58.

## —♦ సేనాపతిధర్మములు. ♦—

క. కొలఁదిగ్ర్ర వెరవు యంత్రము, లనేకము లొనర్చు నేర్పు ♦ నాయుధములఁ వి
న్నను వును బోటులకర్జంబును సేనాపతికి నైజ♦ములు గావలయున్.
భారతము, శాంతి. ద్వితీ. ప 87.

## —♦ సూతధర్మము. ♦—

చ. పెఱచినయట్టివేళ మఱి♦వింతగఁ గైదువు చక్కఁ జూనఁగా
మఱచినయట్టివేళఁ బలు♦మాటు పరాతికి వెన్నుఁజూపుచుం
బఱచినయట్టివేళ నగుఁ♦బాటు ఘటింపఁగఁ జేరి పూరిఁ దాఁ
గఱలినవేళలందు నెడ♦గల్గ రథంబు మఱల్చి బొప్పగున్. 4291
సీతావిజయము, ఆ 4. ప 96.

# చమత్కారచాటుపద్యములు

చ. సగసులుగానివారియెడఁ ♦ జాలఁ గవిత్వరసప్రసంగముల్
కలిచుట కంఠశోషణమె ♦ కాక రసజ్ఞతకల్గనేర్చునే
స్మరశరజాలవేదనకుఁ ♦ జాలక భ్రాంతిని బాతిబొమ్మతో
మరఁగిరమింపఁగాఁడివిరి ♦ మానవుఁ డేమిసుఖింపఁగల్గెడిన్.

మ. రసవాదంబులు పెక్కు నేర్చిన మహా♦రాజేంద్రులం గెల్చినన్
బసగా మేరువుచుట్టునుం దిరిగినన్ ♦ బంగారుకొండెక్కినన్
యసహాయంబుగ భారతం గనినఁదా ♦ నంభోధిలంఘించిన
న్నొసటన్ వ్రాసినవ్రాలకన్నఁ గలదా ♦ నూఱేండ్లు చింతించినన్.

చ. నిరుపహతిస్థలంబు రమ♦ణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన ♦ భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయురసజ్ఞు లూహ తెలి♦యంగల లేఖకపాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృ♦తుల్ రచియింపుమనంగ శక్యమే.

ఆ. అల్లసాని పెద్దన ♦ యల్లికజిగిబిగి, ముక్కుతిమ్మనార్య ♦ ముద్దుపలుకు
పాండురంగవిభుని ♦ పదగుంఫనంబును, కాకమానిరాయ ♦ నీకె తగుర.

క. వాకిటికావలితిమ్మా, ప్రాకటముగసుకవివరుల ♦ పాలిటిసొమ్మా
నీకిదె పద్యముఁగొమ్మా, నాకీపచ్చడమె చాలు ♦ నయముగనిమ్మా.

క. ప్రాకృతసంస్కృతఘుర్జర,మూకీకృతకుకవితుంగ ♦ ముస్తాతతికిన్
వాకిటికావలితిమ్మని, వాకిటికవికోటిమాధ ♦ వాకిటికోటే.

మ. కులుకుంగుబ్బలు సోగకన్నుఁగవతళ్కుంజెక్కులున్ మోవిసొం
పులుఁజూపింపక వేగ మవ్వలికిమో♦మున్ ద్రిప్ప నేమాయె ని
వ్వల లేవే నెఱిగుంపులుం బిఱుఁదులున్ ♦ వామాక్షి చాల్ మాకు రో
సైలమున్ రేపునుసున్నమున్ మొదలుగం♦టే వింటివే ? మెచ్చుటన్.

మ. వరబింబాధరమున్ బయోధరములున్ ♦ వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు జూప కవ్వలిమొగం♦బైనంత నేమాయె నీ
గురుభాస్వజ్జఘనంబు నొ్రమ్ముడియు మా♦కుం జాలవే గంగక
ద్దరిమే లిద్దరికీడునుం గలదె! యు♦ద్యద్రాజబింబాననా. 4299

ఉ. శ్రీ సదనాస్పదై పెడద ◆ గందరగోళము పై వెసన్ రసా
భాసపు మూలమై వికటు◆పద్ధతియై సిగపట్లగోత్రమై
దాసరిపాటయై వికటు ◆ ధార్మికజిహ్వవిరాచకార్యహా
కాశముపుట్టి తోఁక తెగి ◆ గాడిదవాలక మయ్యె భూవరా.

క. నరసింహకృష్ణరాయల, కరమరుదగుకీర్తి వెలసె ◆ కరిభిద్గిరిభి
త్కరికరిభిద్గిరిగిరిభి,త్కరిభిద్గిరిభిత్తురంగ ◆ కమనీయంబై.

క. కలనాఁటిధనము లక్కఱ, గలనాఁటికిదాఁచఁగమల◆గర్భునివశమా
నెలనాఁడిమినాఁటివెన్నెల, లలవడునా గాదెవోయ◆ ◆ నమవసనిశికిన్.

క. ఊమితక్కాయదిని సెపితో, పమితబ్బసుచేతఁ జెపితో ◆ పరికింపఁగ నీ
వేమిదిని సెపితో కపితము, నమవసనిశి యనుచుఁ బలుక ◆ నలసని పెదనా.

చ. స్తుతమతియైనయాంధ్రకవి ◆ ధూర్జటిపల్కులకేల గల్గెనో
యతులితమాధురీమహిమ◆హా తెలిసెన్ భువనైకమోహనో
ద్ధతసుకుమారవారవని◆తాజనతాఘనతాపహారిసం
తతమధురాధరోదితసు◆ధారసధారలఁ గ్రోలుటం జుమీ.

క. దంతపుపనిమంచముపైఁ, గాంతా కూర్చున్నవాఁడు◆కంతుఁడు గాఁడా
కంతుఁ డనంగుఁడు;-నీ తెలి,వింతేనా విజయరాఘ◆వేంద్రుఁడె చెలియా.

ఉ. రాజనిభాననా సగసు◆రాలవె జబ్బుగ నల్లినాడటే
రాజడ ? యింతకన్నవలె◆నా ? లలనా !; బిగియించి యల్లవే
రోజవదారాల ? వేరె పని◆యున్నది; దోసమె దోసమే మహా
రాజగునట్టి యావిజయ◆రాఘవుమేన్ చిగురాకె మానినీ.

క. చిన్నయ్య ద్విపద కెరఁగును, పన్నగఁబెదతిరుమలయ్య◆పదముల కెరఁగున్
మిన్నంది మొరసె నరసిం,గన్నకవిత్వంబు పద్య◆గద్యశ్రేణిన్.

ఉ. రాజు కళంకమూర్తి రతి◆రాజు శరీరవిహీనుఁ డంబికా
రాజు దిగంబరుండు మృగ◆రాజు గుహాంతరసీమవర్తి వి
భ్రాజితపూసపాడ్విజయ◆రామనృపాలుఁడు రాజుగాక యీ
రాజులు రాజులా పెను త◆రాజులుగాక ధరాతలంబునన్.

శా. రాజాగా నిదు లుండి యొర్ల కిడకం ◆ దా మెక్కలేనట్టియా
ఘాజీలోభులఁ బట్టి లోపలికి నీ◆పాదోదకం బిచ్చితే
రాజామిచ్చునుగర్ణుఁడైన యహ మేల్ ◆ దాతృత్వ మీక్షించితే
రాజా ! తిమ్మజగత్పతీ వరపతీ ◆ రక్షించు నీవే గతీ. 4309

మ. ఇతఁడా రంగదభంగసంగరదయా♦హేతిచ్ఛటాపావకో
ద్ధతకీలాకలభాయమానరిపురా♦డ్దావాశ్రుధారానదీ
నతరంగిణ్యబలాసమాగమసమా♦నందత్వసౌదస్తుతా
యతశౌర్యోజ్జ్వలుఁడైనవత్సవయరా♦యప్పామాత్యలాధీశ్వరా.
చ. విలసితకావ్యకల్పనల ♦ విశ్వపతీ నినుఁబోలు సత్కవుల్
గలరె వసుంధరాస్థలి ని♦ఖండితతాండవకేళికాఘుళం
గళరవచిందుశేఖరశి♦ఖాలసదభ్రితరంగిణీవిశ్వం
ఖలరవనిస్వనశ్రితిసు♦ఖంబులు నీసుకవోక్తిగుంభనల్.
క. మీఁగాళ్లబంటిసీళ్లకు, వీఁగుదు రమ్మక్కయూనుము ♦ నెరపున వనితల్
రేఁగి పయోధులు దాఁటెను, బాఁపై నీ కీర్తి కాంత♦ రాముని వాచా.
చ. వెలమకులంబునందు నిలు♦పెల్లను గాంచి లటుంచు వెందు మ
ప్పలుకు లబద్ధమయ్యె గుణ♦భవ్యుఁడు ధన్యుఁడు నప్పరాయరా
ట్కులభముకీర్తికాంత కృతి♦కాంత మహీజయకాంత ముప్పురున్
గలసి జగంబులన్ దిరుగఁ♦గాఁగనుఁగొంటిమి చిత్రి మెన్నఁగన్.
ఆ. దేవునావ తొల్లి♦దేశానకొకకవి, యిప్పు డూరనూగ ♦ నింట నింట
నేవు రార్వు రేడ్వు ♦ రెనమండ్రు తొమ్మండ్రు,పదుగు రేసికవులు♦పద్మనాభ.
క. ఆలిని హయమును గజమును, బాలుని బాలార్కమునను♦బని గొన కున్నన్
బాలుఁడు బడుగై పోవును, ఆలివినదు గజము చంపు ♦ నశ్వము గఱచున్.
చ. పరమవివేకి రామమహి♦పాలకచంద్రతటాకమందునన్
విరివిగనున్న భేకముల ♦ వేమని నిత్యము మ్రోయుచుండె మ
త్కరరరమత్రిబత్కరర♦గత్రిబగత్రిబగత్రిగత్రగత్
నెరనెరనీట్టునీట్టునెర♦నీట్టని మాటి కనేకభంగులన్.
క. అల్లుఁడు బహుమానస్థుఁడు, అల్లునికొకపనియుఁ జెప్ప♦నయినంగానీ
చెల్లునమూఁడుపనులకై, యిల్లలుకను పేడజేసి ♦ యెంగిలియెత్తన్.
ఉ. ఆయతవత్సవాయసుకు♦లాంబుధిపూర్ణనిశాపతి జగ
ద్గేయ శుభాకృతీ విజిత♦కీర్తిసతీకమనీయయౌవన
ప్రాయనలాకృతీ సతత♦వైభవ నిర్జితపూర్వదిక్పతీ
ధీయుతవాక్పతీ జగప♦తీ నృపతీ సుకృతీ మహోన్నతీ. 4319
ఉ. తేజము పెంపులేనికడు ♦ దీనునిహీనుని వేఁడఁబోయితే
నాజికినిట్లునన్నొరుని ♦ యాలికినిట్లునునర్థికిట్లునున్

క. పదివేలమాడలిచ్చినఁ యిదె కొమ్మనియగ్రహార ♦ మిచ్చినఁ గానీ
తుదఁ బ్రియముఁ జెప్పకొండిన, ముదుగుసుమీగుంటుపల్లి ♦ ముత్తమమంత్రీ.

గీ. ఏమిసేయుదుఁ బెండ్లాము ♦ యేశ్వరాశి, వెఱ్ఱితలకుండతల్లి వి♦వేకి కాదు
అందుపై నిది నాకాలు ♦ నవిటికాలు, రామకవిగాని బ్రదుకు శ్రీ♦రామరామ.

శా. భూపాలత్వము పక్షిరాడ్ధ్వజమునన్ ♦ భోగీంద్రతల్పంబునున్
గోపాంగావళి నెల్లఁ గామకేళిక్రై ♦ గోవర్ధనం బెత్తుటీ
వ్యాపారంబులు లేవు గాని యిలమా ♦ కూకెళ్ళగంగయ్యకున్?
గోపాలత్వము వస్త్రతస్కరణమున్ ♦ గోపాంగనాకేళియున్
దాపైయున్నవి యెంచిచూడ నితఁడున్ ♦ దైత్యారియంశం బకో.

మ. అల కైలాసము నందివాహనము కా♦మారిత్వసంపత్తి మి
క్కిలి కన్నుం దలయందుచందురుఁడు కెం♦గేలం ద్రిశూలంబు భో
గులహారంబులు లేవు గాని యిలమా ♦ కూరెల్లగంగయ్యకున్
డేయేరుం గజచర్మమున్ గలిగ నీ♦శండీశ్వరాంశంబకో.

ఉ. పోడిమిమీఱఁ బిన్నతుడు ♦ బొల్పుగ మాతలిదండ్రు లిద్దఱున్
నేడుకమీఱ రామకవి ♦ వేషధరుండని పేరు బెట్టఁగా
వాడొక పేరుపోవిడిచి ♦ వాడలవాడలవారు నవ్వఁగా
గాడిదెగుడ్డురాయఁడని ♦ గద్దరిపేరు వహించితిస్థలిన్.

గీ. ఒకటికత్తినవానికిం♦కొకటి లేదు, రెండుగల్గినవానికి ♦ దిండిలేదు
యివియుఁ గల్గెనుబో నటు ♦ యీవి లేదు, కవులకును గాయకులకేటి♦గౌరవంబు.

ఉ. భూపతిఁ జంపితిన్ మగఁడు ♦ భూరిభుజంగముచేతఁ జచ్చెఁ దా
నాపద నొంది నొంది యుద♦యార్కునిపట్టముఁ జేరి వేశ్యనై
పాపముఁ గట్టుకొంటిఁ దన♦పట్టివిటుండని చెట్టపట్టి సం
తాపము నొంది యగ్నిఁ బడి ♦ దగ్ధము గాకిటు గొల్లభామనై
యీపని కొప్పుకొంటి నృప♦తీ వగ పేటికిఁ జల్లచింపెనన్.

ఉ. ఇంచుక నూడిపోటు సహి♦యించినమాత్రిన సంగనాకుచా
దంచితసౌఖ్యకేళి సత♦తంబును గంచుళిగాంచె నాజిని
ర్వంచితతీవ్రబాణనిక♦రక్షతదేహుల కబ్బవే మరు
చ్చంచలలోచనాచకిత♦చారుకుచద్వయసంగసౌఖ్యముల్

క. శీతజలస్నానంబును, భూతలశయనంబు నొంటి♦పూటశనంబున్
నాతిగల బ్రహ్మచర్యము, నాతనమా పూట గడప ♦ నారయభూపా. 4348

మ. ధర సింహాసనమై నభంబు గొడుగై ♦ తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణమై ♦ బ్రహ్మాండ మాకారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై ♦ శ్రీగంగ సత్పుత్రియై
వరుసన్నీ ఘనరాజసంబు నిజమై ♦ వర్ధిల్లు నారాయణా.

క. బాచీబూచులలోపల, బాచయ్యే పెద్దబూచి ♦ పద్మాండ జాతం
బూచంటె రాత్రివెఱతురు, బాచన్నకు రాత్రి పగ్లుం బగలే వెఱతుర్.

క. పిండితో నిప్పటంతే, మండలపతియొంతో నాని ♦ మంత్రియు నంతే
గుండెతొ గూఁటికంతే, మిండనియూ వెంతో వేశ్య ♦ మిండని యంతే

గీ. వేణికాభారమందుండు ♦ వెనుకటూకు, కలికికోడల యొబ్బంగిఁ ♦ గలిగెఁ జెపుమ
పలికి పలికించుకొనుటయే ♦ ప్రాభవంబొ, అత్త నీవిపు వెలిమిడి ♦ యంటు వేమి?

క. అప్పుడవె ప్పయు నాజ్ఞే, దేవుఁ పాదములు యాతుల ♦ నృపులు గవివా
గ్వ్యాపృత్తి వహ్నివాజియు, స్త్రీగదనంబులు గడున్ శు ♦ చిత్వపదంబుల్.

క. తమలము సేయనినోరును, గుణములచే మెఱలనీవ ♦ రాయని మేనున్
కమలములు లేనికొలనును, హిమధాముఁడు లేనిరాత్రి ♦ హీనము సుమతీ.

ఉ. అంగనలేనియిల్లు నసు ♦ గంధబలంబులు లేనిరాజు ని
స్సంగుఁడు గానిమౌని జన ♦ సమ్మతిలేని ప్రధాని కామినీ
సంగములేని యౌవనము ♦ శాంతములేనితపంబు స్త్రీలకున్
మంగళలేని భూషణము ♦ మోదముఁ జే మదహంసగామినీ.

ఆ. పసపుచాయ చెడును ♦ బానిసచేతను, విడెము చెడును ధరణి ♦ విప్రుచేత
విషయభోగ మెల్ల ♦ వెలపలచేఁ జెడు, జనువు చెడును వైశ్య ♦ జాతిచేత.

క. గూఢార్థము ఘనుఁ డెఱుఁగును, మూఢుండే మెఱుఁగు రతికి ♦ మొనసినవేళన్
గాఢాలింగనసౌఖ్యము, ప్రౌఢాంగన యెఱుఁగుఁగాని ♦ బాలే మెఱుఁగున్.

క. మూఢుం డెఱుఁగునె సత్కవి, గూఢోక్తులసారమెల్లఁ ♦ గోవిదునివలెన్
గాఢాలింగనసౌఖ్యము, ప్రౌఢాంగన యెఱుఁగుఁగాక ♦ బాలె మెఱుఁగున్.

ఉ. కోఁతియు మైకవం జెసఁగి ♦ గుండములోఁబడి నిప్పుఁ ద్రొక్కి త
గ్గ్యాతను పచ్చికందదని ♦ వారుణి ద్రాగి యుమాదమెత్తి పెన్
భూతము సోఁకి తామసముఁ ♦ బుట్టి చిటుక్కనఁ దేలుకుట్టితే
యేతెఱఁ గౌనొ యట్టి గుణ ♦ హీనునికీనుఁడు వేఁడఁబోయినన్.

చ. తెలియనికన్నితప్పులని ♦ దిట్టతనాన సభాస్థలంబునన్ 4849
బలుకఁగ రాకుఁడోరి పలు ♦ మాఱుపిశాచపుపాడుగట్టు నీ

పలికినసోటు మామ్మ పదే ♦ భావ్యమెఱుంగక పెద్దలైనవా
రల నిరసింతురా వినుము ♦ రా సరసా విరసా తుసా భుసా. 4280

ఉ. వాడు గుణంబు లేకను మ ♦ నంబున దైవముఁ గొల్వలేకనే
లోకులవారిచింతలకు ♦ లోలుఁడనై కులకాంతమానియున్
జేకొనివారకామినుల ♦ చెంతనుఁ జేరి ఫకీరునైతి నే
డేకలిసానిపొందు లిఁక ♦ నెన్నటి కొందఁగనీకు దైవమా.

క. జగములు వణంకు నొకతెకు, నగణితముగ నిద్ధమైన ♦ నంబుధులింకున్
ముగు రాదువాండ్రుఁ గూడిన, సుగుణాకర పట్టపగలుఁ ♦ చుక్కలు పొడుచున్.

ఉ. కోమటి కొక్కటిచ్చి పది ♦ గొన్నను దోసము లేద యింటికిన్
సేమమెఱింగి చిచ్చిడినఁ ♦ జెందదపాపము వాని నెప్పుడే
నేమఱుపాటునన్ మఱియు ♦ నేమి యొనర్చిన నెగ్గు లే దిలన్
వేములవాడభీమకవి ♦ వేదపరుండనుమాట నమ్మడీ.

చ. గొనకొనిమర్త్యలోకమున, గోమటిపుట్టుగఁ దోడఁబుట్టెబొం
కును గపటంబు లాలనయుఁ ♦ గుత్సితబుద్ధియు రిక్తభక్తియున్
జనిమిరిమాటలున్ బరధ ♦ నంబునుగ్రక్కున మెక్కఁజూచుటల్
గొనుటయు నమ్మతుల్ మిగులఁ ♦ గొంటుతనంబును మూర్ఖవాదముల్.

క. రతిలేకయె చెడు నంగన, రతిగల్గినఁ జెడును వాజి ♦ రత్నము ధరలో
నతిరతులఁ జెడును పురుషుఁడు, గతియురతియు లేక చెడును ♦ గజము ధరిత్రిన్.

క. కవితాకన్యరసజ్ఞత, కవికన్న రసజ్ఞుఁ డెఱుగుఁ ♦ గవి యే మెఱుగున్
నవలాసురతోత్సవపస, ధవుఁ డెఱుగును గాక కన్న ♦ తండ్రే మెఱుఁగున్.

గీ. వ్యాసనారదు లొక్కొక్క ♦ వాసియందు,పాండుపుత్త్రులొక్కొక్క ♦ పట్లయందు
చంద్రదేవేంద్రు లొక్కొక్క ♦ చర్యలందు,వాలిసుగ్రీవు లొక్కొక్క ♦ వావియందు
దిగువతిరుపతికోనేరు ♦ తీరమునను, కాఁపురంబుండువైష్ణవా ♦ గ్రిణులుమణులు.

చ. సరసుఁడు గాఁడొ? జాణ! రతి ♦ సంపద లేదొ? సమృద్ధి! రూపమో
మునునిజయించు మోహ ? మన ♦ మానమె! యున్నియుఁ గల్గ జారవై
తిరిగెద వేల బాల? యతి ♦ ధీరవు పౌఢవు నీవెఱుంగవే
నెరగృహమేధియన్ పలుకు ♦ నీచము దోఁచెఁ గొఱంతదే సుమీ.

ఉ. కోపము నాపయిం గలిగెఁ ♦ గోమలి నేనిఁక నేమి సేయుదున్
బ్రాపగుఁగాక నీకదియుఁ ♦ బల్మఱు నేనిడినట్టిముద్దులన్

గోపము లేనివేళ నొసఁ♦గూర్చిననాదుకవుంగిలింతలున్
నాపయిఁ బాఱవేయు మిఁక ♦ నాకును నీకును జెల్లె నేటితోన్. 4359

చ. చతురులలోన నీవు గడు♦జాణ వటంచును నేను గౌఁగిలిం
చితి నిటు మాఱుమో మిడఁగఁ ♦ జెల్లునె యో రసికాగ్రగణ్య య
ద్భుతమగునట్టిబంగరపు ♦ బొంగరపుం గవఁ బోలు నీ కుచ
ద్వితయము బొమ్మునాటి యల♦వీఁపున దూసె నటంచుఁ జూచితిన్.

ఉ. సానికిఁ దల్లియున్నఁ గల♦శంబునకుం బెనుచిల్లియున్న మం
చానకునల్లియున్నఁ గడు♦జారుశరీరికిఁ బొల్లియుండినన్
సూనశరాసనవ్యథలఁ♦జొక్కెడువానికిఁ ద్రాగువానికిన్
బూనిపరుండువానికిఁగ♦నుంగొనువానికి సౌఖ్యమున్నదే.

ఉ. నల్లనిదేంది ? బేడి ! 'మృగ♦నాభిర గొల్లడ !' 'దాన్ని దిందురా ?'
'అల్లటుగాదు, స్త్రీలు చను♦లందునఁ బూతురు !' 'పూసినంతనే
జల్లునఁ జేపువచ్చుఁ దెగజాఱునఁ !కాదు సుగంధమబ్బు' 'మా
పిల్లకు కాస్త పెట్టు' మన ♦ బేరియుఁ గస్తురి మూసెఁ గ్రిక్కునన్.

గీ. కాలకంధర విశ్వేశ♦గరళకంఠ, గరళమును దిన్న నీనోరు ♦ కనరుదీర
వేములూరిచకోరాక్షి ♦ వెలమయువతి, పనసతొనవంటిమోవిఁజుం♦బనము జేయుఁ

చ. గొరిజల మేఁకపోతులను ♦ గొఱ్ఱెపొటేళ్లనుగోడిపుంజులన్
బరిపరివీథులం దిరిగి ♦ భక్షణ జేసెద వింతెగాని నీ
చరణములంటురానియల♦చాకలదాని···రోమముల్
బెరుకఁగలేవు నీవునొక♦భీకరమూర్తివె కాళికేశ్వరీ.

ఉ. భూతలమందు బ్రిహ్మణకు స♦పూజ్యత గల్గెను రెంటమూఁట భా
గోతులబుచ్చిగానికి ...♦ .....సేయఁగ నేరనందుకున్
భీతమురంగనేత్రియుగు ♦ పెండెలనాగి......సం
ఘాతము జేసినందుకును ♦ గంగిని నల్పొనరించినందుకున్.

గీ. విజయరామమహారాజ♦వీరుఁ డేలు,పట్టము లిఖించె రాజుభూ♦పాలరాజు
కవచుమాట లిఁకేమి యీ♦కాలమునను, పుట్టె నవ్వేను పులిగుడ్ద♦గొఱ్ఱెకఱచె.

మ. సమరక్షోణిని కృష్ణరాయలభుజా♦శాతాసిచేఁబడ్డదు
ర్దమదోర్దండపుళిందకోటియవన♦వ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునన్ గాంచి శబాసహో హరిహరం♦గాఖాఁబుఘోడాకి తే
తుమికీబాయిలబాయిగేమలికియుం♦షర్ మింటికిం బోవుచున్. 4367

క. సర్వజ్ఞనామధేయము, శర్వునకే రావుసింగ ◆ జనపాలునకే
యుర్వింజెల్లును దక్కొరు, సర్వజ్ఞుండనుట కుక్క ◆ సామజ మనుటే.

క. ఆనాఁటియగ్రహారము, లీనాఁటికి గండ్రి కాయ ◆ లీపన్నీటన్
మానాఁడు మాన్యమాయెను, నానాటికి శిస్తుకట్లు ◆ నాగంబోట్లా.

క. లింగాలగుర్వి సెట్టికి, గంగాభవు డేమి వ్రాసె ◆ గత్తించెవతా
బంగారువంటి కోమటి, సంగీతము చేత ఖర ◆ సారకము లుడికెన్.

క. అంగీలుపచ్చడంబులు, చంగావి మెఱుంగుసేలు ◆ సరిగంచుల వేల్
బంగులముప్పట్లెల్లియు, గొంగడిసరిఁ బోలవన్నె ◆ గువ్వలచెన్నా.

క. వెలయాలి సుతుఁడు నల్లుఁడు, నిలపతియును మాచపుంతు ◆ సేవ్రుల ఫణులోఁ
గలిమియు లేమియు నెఱుఁగరు, కులపాంసనమూర్తి వన్నె ◆ గువ్వలచెన్నా.

చ. గురువులరాక దాసిమృతి ◆ గట్టుఫ్రుఁదాడియాడు వాగువెల్లువల్
పొరుగున నప్పు బాధ చెవి ◆ పోటును దొమ్మపులాటల ఇంటిలో
వరసతి గర్భవేదన వి ◆ వాహము విత్తులు చల్లుకాల్యమున్
గఱవు దరిద్ర మార్దికము ◆ గత్తె శోకప్పుడు కృష్ణభూవరా.

క. దేవాసుర లబ్ధిఁ దరువ, నావిర్భూతమయి హాల ◆ హాల మప్పుడు మహా
దేవునకున్ భీతిలి శ్రీ, ఱావులపలి సూతులందు ◆ డాఁగెను జూడీ.

క. వగ చూపి యర్థి కీయని, మగముండదర విహసమేల ◆ మతి మాతిపయనౌ
తెగ గొఱుగఁజాలదు మంగలి, తగ డొంతగఁ గీర్తి కాంత ◆ రాయనిబావా.

చ. ఉలిమిడి చెక్కయుండ్ మిగుల ◆ సుక్కలయుఁ జెప్పనిరోత్తుకుక్కయున్
మలినపుగుడ్డయున్ మ్నలక ◆ మంచపుఁగుక్కియుఁ జీకటింటిలోఁ
దలఁచినరోతవచ్చు నొక ◆ నాఁటిసుఖంబొకయేటిదుఃఖమా
పలి వెలవారకామినుల ◆ పంచలక్షణం బది వేలిదండమున్.

ఉ. మొల్లసుగంధికంతురది ◆ ముంగిటనున్నది దానిఁజూడు నే
నెల్లవిధంబులన్ రతుల ◆ నేలెదు దాన్ని నెనఁజూడు ము
త్ఫుల్లసరోజనేత్రి వర ◆ పుత్రికపుత్రిక దానిఁజూడు నా
కల్లుడవయ్యెదో? మగఁడ ◆ వయ్యెదవో? మనుమండవయ్యెదో?

ఉ. మొల్లసుగంధికంతురది ◆ ముంగిటఁ గంటిని దానిమాన; నీ
వెల్లవిధంబులన్ రతుల ◆ నేలెదు దానవు నిన్ను మాన; ను
త్ఫుల్లసరోజనేత్రి వర ◆ పుత్రి పుత్రిక దానిమాన నే
నల్లుఁడనయ్యెదన్ మగఁడ ◆ నయ్యెద నీమనుమండనయ్యెదన్. ౪౮౯

క. పదివేలపసందికిచ్చియుఁ, దుది నొక్కని కీయకున్న ♦ దొరకవు కీర్తుల్
పదివేలునోమునోచిన, వదలదె యొకరంకువంక ♦ వన్నియసుంకా.

క. పెక్కువు లిచ్చుచో నొక, బక్కవికుండెనేని ♦ పాఁడికిఁగఱవా
పెక్కుదొర లిచ్చుచో నొక, కుక్కలకొడుకీయకున్నఁ ♦ గూటికిఁగఱవా.

మ. కొలిచేసెన్ వగలేక నే యడిగితే ♦ కోపించుటే లేక నే
చెలులన్ మెచ్చుటకోక నే విభవముల్ ♦ చేకూరుటల్ రాక నే
బలవంతుండగుమాక నే సతి చెడున్ ♦ బ్రాణేశుఁ డైకోక నే
జలదశ్యామలశంఖచక్రధరకృ♦ష్ణా యాపదుద్ధారకా.

ఉ. అన్నటు లీయఁడేని సభ ♦ నాతఁడెపో పెనులోభియన్న యా
దున్నకు రెండుకొమ్ములును ♦ దోఁకయు లేమిని మొండిదున్న యా
దున్నతొ మన్న రెవ్వరను ♦ దున్నదుగామతి గంగలమ్మకో
దున్నెదువారియిండ్లఁ జెడ♦దున్నెదు దున్నర యెంచిచూడఁగన్.

ఉ. కూరకు నల్లిగడ్డలకు ♦ గుమ్మడిపిందెకుఁ జల్లనీళ్లకున్
నారకుఁ గట్టెపుల్లలకు ♦ నాథులకుం గృతులీయ రోసి యా
భారతి పోయిలక్ష్మికి ను♦పాయము జెప్పెను కైతకూటికిన్
జేరకుమమ్మ నేఁ బడిన ♦ చిక్కులు పెక్కులు నిక్కమిక్కతల్.

ఆ. కవులు బాగడువేళఁ ♦ గాంతలు రతివేళ, సుతులు ముద్దువేళ ♦ శూరవరులు
రణముసేయువేళ ♦ రాకొట్టిపిలుతురు, పాడి యదియె మిగుల ♦ భజన కెక్కు.

క. ఏమీనవఁదా జేలన, నాముంగిటికేలరాడు ♦ నరహరిపిన్నా
రామునిముమ్మారంపితిఁ, బ్రేమంబునబుద్ధిఁజెప్పి ♦ పిలువవె కలికీ.

క. నక్కలుబొక్కలు వెతకును, నక్కఱతో నూరఁజెంది ♦ యగడితలు వెతకున్
గుక్కలుచెప్పులు వెతకును, తక్కిడినాలంజెకొడుకు ♦ తప్పే వెతకున్.

సీ. తలిరాకుడాలుకం♦దర్పరాజ్యైశ్వర్యముల్, దాలుచుపాలుజెం♦డాలుగాఁగ
తేఁటిఝంకారముల్ ♦ తోఁటవేలుపుబొండ్లు, వాయించువీణార♦వములుగాఁగ
వనదీగబారులఁ ♦ తనుకేళిఁదేలువే,ల్పులతాంగులూగును♦య్యెలలుగాఁగ
చలితప్రసూనముల్ ♦ ఛత్రకాంతులువీచు, మేలైనవ్రూసుర♦టీలుగాఁగ

గీ. చెలఁగుచేఁబ్రోలు తానాక♦చేరిలోని, పూలతోఁటలఁగని వీనిఁ♦బోలుతరులు
నందనమునందువేయఁబు♦రందరుండు, కల్పనముసేయనవికల్ప♦కంబులయ్యె.

ఉ. పెండెలనాగిచెక్కితును ♦ బెద్దకటిస్థలిగంగిగుబ్బచ
న్గొండలనుండు రామకవి♦కుంజరుహస్తముఁ గ్రిందుసేసెగా

పండక బంటుమిల్లి యాది ♦ బాగుగఁబండినరావుధారుణీ
మండలనాథువంటికసు♦మాలపుదాతలవేదనిచ్చునే.

ఉ. రొక్కముతేకఁగాదు మది♦రోసియుఁగాదు మఱొక్క కాంతకుం
దక్కియుఁగాదుచెప్పెద య♦థార్థపుసంగతిఁజిత్తకార్తిలోఁ
గుక్కలరీతి నొక్కవెల♦కోమలికై పదిమందిచేరినన్
జిక్కులనేకముల్ గలిగి ♦ సీయనిపింప విరక్తిఁ జెందితిన్.

క. శివుఁడద్రిని శయనింపుట, రవిచంద్రులు మింట నుంట ♦ రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపైఁ, బవళించుట నల్లిబాధ♦పడలేక సుమీ.

క. క్షురకుం డాయుష్కర్మను, జరబరమని గీకుననుచు ♦ బ్రాహ్మణుత:
గొరిగికొనితీర్థమాడుట, మఱచిరి మంగలులనోట ♦ మట్టినిగొట్టన్

క. తనయూలిచక్కఁదనమును, తనతప్పును పరునిరొప్పు ♦ తనయు
దననాటికవితగుణమును, గనఁజాలినవాని భువినిఁ ♦ గనఁజాలు ♦నిలంపవచ్చు

క. వంకాయవంటికూరయు, లంకాధిపువైరివంటి ♦ రాజుం గలఁడే
శంకరునివంటిదైవము, పంకజముఖి సీతవంటి♦పణతులు గలరే.

సీ. భావింపదేవకీ♦దేవి మాయత్తమ్మ, మామామ వసుదేవ♦మాన్యుఁడమ్మ
బలభద్రమూర్తి మా♦బావగావలెనమ్మ, కొమ్మ రేవతి తోడి♦కోడలమ్మ
సకియరుక్మిణి మాకు♦సవతి యేర్పడెనమ్మ, తగఁ బంచశరుఁడె మా♦తనయుఁడమ్మ
మగువరో సాత్యకి ♦ మఱఁదిగావలెనమ్మ, యలసుభద్రయు మాకు ♦ నాఁడుబిడ్డ

గీ. ఇందఱున్నారనున్నందు♦కేమిఫలము, కలిమిబలఁగము సకలభో♦గ్యములు గలవు
ఎన్నియున్నను నింతుల ♦ కేందుకమ్మ, ప్రాణనాథుండు తన్నేడఁ♦బాయుచున్న

క. చీఁపరపాఁపరతీగలఁ, జేఁపలబుట్టల్లినట్లు ♦ చెప్పెదునీయా
కాఁపుకవిత్వపుమాటలు, బాఁపనకవివరునిచెవికి ♦ బ్రిమదం బిడునే.

క. తువ్వఁట బాబాతలపై, పువ్వఁట జాబిల్లివల్వ ♦ బూదఁట చేదే
బువ్వఁట చూడఁగను హాళి,క్కృ[illegible] యరయంగనట్టి ♦ హరునకు జేజే.

ఆ. చాఁకివానితోడ ♦ జగడాలు పడలేక, సిరిగలాఁడు పట్టు ♦ చీరగట్టె
శివుఁడు తోలు గప్పె ♦ సీ యని మదిరోసి, భైరవుండు చీర ♦ పాఱవైచె. 4397

సీ. కెమ్మోవిపానకం♦బిమ్ముగావలెఁగాని, తాఁబూలమునసేమి ♦ తనివిదీర్పు
మిడి......♦ముడిసడల్చనఁగానిఁయుత్తరాల్ విడదీయ ♦ నడుగునేతమి
మేనినెత్తావిగ్రి♦మ్మినపోయియగుఁగాని, పెనులవందఱుఁబూయఁ ♦ బ్రీతియగునె
వలరాచకేళిలో ♦ పలిమాటలేగాని, ముద్దుమాటలుమోహ ♦ ము.డ. పఁగలవె.

## — వైదికులు. —

ఉ. నీళ్లకు నిట్టితోళ్లకును • నేతికటుల్లకు దొడ్డయుత్తరేన్
వ్రేళ్లకు దర్భముల్లకును • వేదపునోళ్లకు సన్నకట్టువి
స్తళ్లకు రావిపేళ్ల కని•శంబును షళ్లకు పప్పుగూరప
చ్చళ్లకు రాగిబిళ్లకును • సంతస మందుదు రాంధ్రవైదికుల్.

ఉ. లేవరు రెండు రెం డనిన • లేచినవారయినం దటాలునన్
బోవరు పోవుచున్ నిలిచి • పోకుము పోదుము ప్రొద్దుయెక్కుండటం
చీవరుసంగ్రహార్థకల•యింతురు బెండిలిలో సదస్యసం
భావననాఁడుచూడవలె • బాపనసాముల సాము లన్నియున్.

## — నియోగులు. —

సీ. మొలి పెట్టిపిడిచిన • మీసాలపై గొప్ప, నిమ్మకాయలు రెండు•నిలుపవచ్చు
జేటుగాఁ దెల్లఁగా•వెగటాలులంకాకు•బాగచుట్టజుంజురు•బోల్పవచ్చు
నదఁసీథిరెడ్డిగా•లిడి రచ్చతీర్పుచో, సివిలుజడ్జీలని • చెప్పవచ్చు
నసదుగాఁ బాసఁగించి • నోసటఁబెట్టినబొట్టు, లోక్ష్మచూ అప్పని • యూదవచ్చు
గీ. నడివడిగఁజిన్నవాడైన • వడుగునాఁడు, తడబడుచుఁజెప్పుకొన్నట్టి•తప్పుసంధ్య
ముక్క నాలుగునిముసాల•ముగియవచ్చు, ఖిలగయుఁబవచ్చు లౌకిక•బ్రాహ్మణులను.

## — పొగాకు —

క. ఖగపతి యమృతము తేగా, భుగభుగమని పొంగి పొరలి • భూస్థలిఁబడితాఁ
బొగచెట్టై జన్మించెను, పొగఁద్రావనివాఁడు దున్న•పోతై పుట్టున్.

క. వీరుఁ బొగద్రాగుదురా, వారిజభవవాసుదేవ • వైకుంఠపతీ
యోరీ నారద వినరా, యీ రేడుజగంబులకును • నిది ముఖ్యమురా.

క. పొగద్రాగి తొల్లిభీముఁడు, పొగ రణచెన్ గురుబలంబు • భుజశక్తి మెయిన్
బొగద్రాగక దుర్యోధనుఁ, డగ్గిలిఁజెను రణమునందు • నహహా యనుచున్.

క. రావణయుద్ధములోపలఁ, బావనుఁడై లక్ష్మణుండు • పడి మూర్ఛిల్లన్
ఈవలఁ బొగచెట్టుండఁగ, నావల సంజీవి కేల • నగిరి చెప్పుమా ?

చ. ధరణీతలంబునందుఁ బొగఁ•ద్రాగరు వైష్ణవులెల్లఁద్రాగిరో
తిరువణి పెట్టెలోపలను • దేవునిసన్నిధిను•దుఁట్టిదా
కురుచపొగాకుఁదీసికొని • గుక్కెడుగుక్కెడు మెల్ల మెల్లనే
మరుగునసుండి త్రాగెదరు • మాన్యులుగానుబిక్షిపౌళలన్.

క. పొఁగద్రాగని మగబ్రదుకును, పొగడంగానీవితేని ♦ భూపతిబ్రదుకున్
వగతేనివేశ్యబ్రదుకును, తగులాటముదానిబ్రదుకు ♦ దండుగసుమ్మీ.

క. పొగచుట్టకుసతిమోవికి, నగణితముగనీళ్లబావి♦కమృతంబునకుం
దగనుచ్ఛిష్టము లేదని, ఖగవాహముతోడఁగాల♦కంఠుఁడు వలికెన్.

క. పీకబొగ యమృతసారము, చేకొని పొక్కిళ్లతుహిమ♦చెప్పం దరమా
పాకొన్చ్చరాదు గుడుగుడి, యాతనఁ బొగత్రాగువాఁడు ♦ యాజుఁడో హరుఁడో.

క. రావాకునఁ బొగ త్రాగినఁ, గేవల వైకుంఠ మనుచుఁ♦గృష్ణుఁడు వలికెన్
ఆవేళ బ్రహ్మ యానసె, వేవేగము శంకరుండు ♦ విహితము జేసెన్.

చ. పడపడి ధూమ్రపానమునఁ♦ బ్రాప్తము లోఁబడుమూఁడుచేటులున్
మొదల ధనంబు పోవుట న♦పుంసకుఁ డౌట విదాహ మౌటయున్
వెదకుచు జాతిహీనులన♦వేడుట తిక్కటుచొక్కుటల్ రుచుల్
వదలుట కంపుఁజేయుట క♦ళల్ దొలఁగించుట దిమ్మపట్టుటల్
పెదవులు నల్లనై చెడుట ♦ పెద్దకు లోఁగుట బట్టకాలుటల్.

—♦ నస్యము. ♦—

చ. బలువగుశీర్షవాతమును ♦ బాపఁగఁజాలెడుపొడ్డుమందు భూ
తలమున పెట్టివాతలును ♦ దద్దయుయాచనసేయుటిద్దియో
పులుకఁగసర్వలోకజన♦వశ్యము పండితమాననీయమై
చెలఁగెడుధూమ్రిపత్రములఁ♦జేసెడిచూర్ణమువర్ణనార్హమౌ.

ఉ. నస్యము శీతమత్తగజ♦నాశనహేతువిచారధీరపం
చాస్యము సుప్తరోగనిబి♦డాంధతమఃపటలార్కబింబసా
దృశ్యము వేదశాస్త్రపరి♦తోత్తమపండితవాగ్విలాససా
రస్యము సర్వలోకజన♦రంజనదాస్యము రాజవశ్యమున్.

---

సీ. ఎదురైనచోఁ దన♦మదకరీంద్రము డిగ్గి, కేలూఁత యొసఁగి యె♦క్కించుకొనియె
మనుచరిత్రంబందు♦కొనువేళఁ బురమేఁగఁ, బల్లకి తనకేలఁ ♦ బట్టి యెత్తె
బిరుదైనకవిగండ♦పెండేరమున కీవె, తగుదని తానె పా♦దమునఁ దొడిగె
గోకటగ్రామాద్య♦నేకాగ్రహారముల్, అడిగినసీమల♦యందు నిచ్చె

గీ. ఆంధ్రకవితాపితామహ ♦ యల్లసాని, పెద్దనకవీంద్ర యని నన్నుఁ♦బిలుచునట్టి
కృష్ణరాయలతోఁ దివి♦కేఁగలేక, బ్రదికియున్నాఁడ జీవచ్ఛ♦వంబ నగుచు.

సీ. కాశికావిశ్వేశుఁ♦గలిసె వీరారెడ్డి, రత్నాంబరంబులే♦రాయఁ డిచ్చుఁ
కైలాసగిరిఁబండె ♦ మైలారువిభుఁ డేగి, దినవెచ్చ మేరాజు ♦ దీర్పఁ గలఁడు

శంభుఁ గూడెఁ దెనుంగు◆రాయరాహుత్తుండు, కస్తురి కేరాజుఁ ◆ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యోబ◆ళ్లనమంత్రి మఱిహేమ,పాత్రాన్న మెవ్వాని◆పంక్తిఁ గలదు
గీ. భాస్కరుఁడు మున్నె దేవుని◆పాలి కరిగెఁ, గలియుగంబున నిఁక నుండఁ◆గష్టమనుచు
దివిజకవివరుగుండె యదల్ ◆ దిగ్గురనఁగ, నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ◆డమరపురికి.
సీ. గడియలోపలఁ దాడి◆కడఁగి ముత్తునియాగాఁ, దిట్టిన మేధావి ◆ భట్టుకంటె
రెండు గడెలఁ బ్రహ్మ◆దండి ముండ్లన్నియు, డుల్లఁ దిట్టిన కవి◆మల్లుకంటె
మూఁడు గడెలకుఁ దా◆మొనసి యెత్తినగండి, పగులఁ దిట్టినకవి◆భానుకంటె
అఱజాములోపలఁ ◆ జెఱువు నీరింకంగఁ, దిట్టిన బడబాగ్ని◆భట్టుకంటె
ఆ. నుగ్రకోపి నేను ◆ నోపుదు శపియింపఁ, గ్రమ్మరింపశక్తిఁ◆గలదు నాకు
పట్టి మానఁ జిగురు◆పుట్టింపఁ గిట్టింప,బిరుదవేములాడ◆భీమకవిని.
క. దూరాన శత్రుఁ డుండిన, వేఁటవిషమాకురంబు ◆ వెదుకఁగనేలా
యూఁటెంటను తాఁ బెట్టిన,పేరణగును వానియింటఁ ◆ బీనుఁగు వెళ్లున్.
క. అకచటతపయశవర్గలు, ప్రకటితముగ బుతులగిరుల◆పదకొండింటన్
వికటించక కవి చెప్పిన, నకటా పడి చావకుండ ◆ నజుఁడో హరుఁడో.
చ. హయమది సీత పోతవసు◆ధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ ◆ జాహ్నవి వారధి మారుఁ డంజనా
ప్రియతనయుండు సింగన వి◆భీషణుఁ డాగుడిమెట్టలంక నా
జయమును పోతరక్కసుని◆చావును నేఁడవనాఁడు చూడుఁడీ.
క. కాటికి గట్టెలు జేరెను, యేటావలనక్కలెల్ల ◆ నేడువఁ దొడఁగెన్
కూటికి కాకులు జేరెను, లేటవరపు పోతరాజు ◆ లేఁడా ! తేఁడా ? 4426
క. నాఁటి రఘురాము తమ్ముఁడు, పాటిగ సంజీవిచేత ◆ బ్రదికిన రీతిన్
గాటికిఁ బోనీకేటికి, లేటవరపు పోతరాజ ◆ లెమ్మా రమ్మా.
క. సాళువపెదతిమ్మమహీ,పాలుండిదె వచ్చె నిటకుఁ ◆ బద్యము వ్రాయన్
గేలను లేదా గొక్కటి,తాలము ముత్తునియతాఁచు ◆ ధర్మపైఁ బడుమా.
ఆ. కూరపాటి వెంక ◆ కుక్కలుదినుకంక, లేనిపోని శంక◆మాను బొంక
ముఖముఁ జూడఁ గుంక ◆ ముండవనెడు శంక, నాకుఁ దోచెఁ జంక◆నాకు బొంక.
సీ. ఊరు పేరును లేని ◆ యుత్తరంబుల నుత్తములపేర వ్రాసెడు◆ఖలగుణుండు
కనికరంబునసడా ◆ తనమేలు కోరు సజ్జనుల దూషించుమ◆గ్ననవరుండు
అన్నవస్త్రము లిడి ◆ తన్నుఁ బెంచినవారి, కపకృతిఁ జింతించు ◆ నధమతముఁడు
అనువు కాండ్రు సమాప్తు◆నాలోచనంబున, నిరతంబు జరియించు ◆ దురితశీలుఁ

గీ. ఠక్కుపెల్లెంద్రఁ గొట్టెడు♦ నొక్కలీఁడు, తమ్ములకుఁ గీడొనర్పంగఁ♦ దలఁచువాఁడు
తన్నయింటను వాసాల♦ నెన్ను ఘనుఁడు, కలఁడు మాపట్టణంబున♦ ఖలు డొకండు

గీ. న్యాయపదియున్న గౌరవం♦ బసలె యున్న, వితరణమున్న సద్విద్య♦ పెద్దయున్న
సుకృతగుణములు మఱియును♦ నున్న వీని, కాయు వెంతయునున్న గా♦ కధికమగునె.

క. పొట్టకు నొక కడి యన్నము, గట్టఁగ నొక బట్టయైనఁ♦ గనఁజాలకఁ దా
నెట్టిక్షుద్ధ్వంసమునఁ డిల, గిట్టును గొన్నాళ్లలోనఁ♦ గ్రిమిభక్షకుఁడై.

క. ఆరింటిలోన "తా" యిడి, వారక పద్యంబుఁ జెప్పి♦ పాపాత్ముని యీ
క్రూరుని గాఁటికిఁ బంపెద, ధారుణిఁ బ్రజ లెల్లఁ గడు ము♦దంబును జెందన్.

చ. ఒకనికి కవిత్వ మందెనయు♦ నొప్పులు తప్పులు నాకవిత్వమం
దొకనికిఁ దప్పుపట్టఁ బని♦ యుండదు కాదని తప్పు పట్టినన్
మొక మటు క్రిందుగాఁ దివిచి♦ ముక్కులు వోవ నినుపకత్తితో
సిక మొదలంటఁ గోయుదును♦ జెప్పునఁ గొట్టుదు మోము దన్నుదున్.

సీ. కౌఁగిటఁ గదియుచోఁ♦ గాయపరిభ్రాజిత, శంపగాదిది ముద్దు♦ కంపగాని
కావిచక్కెరమోవి♦ గఱచువేళల అతి, కూసగాదిది యేపి♦ కూసగాని
స్తనసఖక్షతములు♦ సల్పువేళల, గల్గ్య, కంటిగాదిది యొల్గు♦ బంటిగాని
ఘనమనోగాఢసుఖకేళిఁ♦ గలయువేళల వెల్గ్యాలు గాదిది యొజ్జ♦ తేలుగాని

గీ. ఠానితోడమ.......గూడు...రోత, కుండుగాని మహోరసి♦ కుండు గాఁడ
టంచు విఖ్యాతిఁ గాంచె నీ♦ యతివమిత్రుల, రసికజనులార సద్గుణా♦ రాధ్యులార.

సీ. రాజనందనరాజ♦ రాజాత్మజులుసాటి, తలఁపనన్నయవేమ♦ ధరణిపతికి 4488
రాజనందనరాజ♦ రాజాత్మజులుసాటి, తలఁపనన్నయవేమ♦ ధరణిపతికి
రాజనందనరాజ♦ రాజాత్మజులుసాటి, తలఁపనన్నయవేమ♦ ధరణిపతికి
రాజనందనరాజ♦ రాజాత్మజులుసాటి, తలఁపనన్నయవేమ♦ ధరణిపతికి

గీ. భావభవభోగసత్కళా♦ భావములను, భావభవభోగసత్కళా♦ భావములను
భావభవభోగసత్కళా♦ భావములను, భావభవభోగసత్కళా♦ భావములను.

సీ. మేఁకతోఁకకుతోఁక♦ తోఁకమేఁకకుమేఁక, మేఁకతోఁకకుతోఁక♦ తోఁకమేఁక
మేఁకతోఁకకుతోఁక♦ తోఁకమేఁకకుమేఁక, మేఁకతోఁకకుతోఁక♦ తోఁకమేఁక
మేఁకతోఁకకుతోఁక♦ తోఁకమేఁకకుమేఁక, మేఁకతోఁకకుతోఁక♦ తోఁకమేఁక
మేఁకతోఁకకుతోఁక♦ తోఁకమేఁకకుమేఁక, మేఁకతోఁకకుతోఁక♦ తోఁకమేఁక
మేఁకతోకతోఁకతోకతోఁకతోఁక మేఁక, మేఁకతోకతోఁకతోకతోఁక తోఁకమేఁక
మేఁకతోకతోఁకతోకతోఁకతోఁక మేఁక, మేఁకతోఁకతోఁకతోకతోఁక తోఁకమేఁక

—◆ మాణిక్యము—గుణవంతుఁడు ◆—

గీ॰ ఘనమణి నీకు సద్గుణ◆గౌరవముల, నంఘుఁ డగువాఁడు నిరసించు ◆ నంతమాత్రిఁ
బ్రాజ్ఞులగువారిచే మెప్పు◆బడయకుండె, ఘారుణీంద్రులు శిరములఁ ◆ దాల్పకుండె?

—◆ గుడ్డికొంగ—కుకవి ◆—

గీ॰ రమ్యతరమూర్తులగుసర్వ◆రత్నములను, డంబు మీఱెడు రత్నాక◆రంబులోన
నత్తగుల్లలసేయనీ◆పత్తమునను, గోరె దేమందు నిను గుడ్డి◆కొక్కెరాయ.

—◆ కాగితపుబుట్ట—దుర్మార్గగామి ◆—

గీ॰ సత్పథము నొంది తిన్నగాఁ ◆ జనెదు నీవు, వక్రిగతియును జంచల◆త్వంబు నిపుడు
గలుఁగఁ జేయుట కేతట్టు◆గాలి వచ్చె, గ్రితుల కపకీర్తి వుట్ట కా◆గితపుబుట్ట.

—◆ తోఁకబుట్ట—లంచముగొను కూటసాక్షి ◆—

గీ॰ పచ్చనగుమంచిమామిడి◆పండ్లు దెచ్చి, కడుపునిండింతు రనిరొంతు ◆ గౌరవముగఁ
బిదప నీనోట గడ్డిని ◆ బెట్టుచుంద్రు, నీకు సిగ్గింత లేదకో ◆ తోఁకబుట్ట.

—◆ గాలిపడగ—ధనగర్వముగలవాఁడు ◆—

గీ॰ ఘనమహోన్నతపదవిని ◆ గంటి నను చు, నెగిరిపడుచుంటి వయ్యయో ◆ బిగువుఁ జూపి
కలితసద్గుణభంగంబు◆గలుగునపుడ, కాంచెద వధోగతి వడిగ ◆ గాలిపడగ.

—◆ చెప్పులజోడు—స్నేహముగొను పరోపకారి ◆—

ఉ॰ ఘాతిగ ముండ్లతో వెలయు ◆ బాటలఁ బాదము లంటి దంటవై
రాతిరియున్ బవల్ జనుల ◆ రక్షణఁ జేసెదు మేరమీఱి బల్
పాతకవృత్తి పైకొనెడు◆వారల గర్వ మణంతు మేల్ బళీ
భూతలమందు స్నేహమును◆బొంది చరింతువు పాదరక్షకా.

—◆ అగ్గిపుల్ల—మంచిపరోపకారి ◆—

చ॰ అలపరదేశముల్ దిరుగు◆నండలు నిన్ దరిఁజేర్చు కొంద్రి చు
ట్టలు గొని కాల్చువారలు చ◆టాలున నిన్ గ్రిహియించికొంద్రి పి
ల్లలుగల తల్లు లెల్ల నిను ◆ లక్ష్య మొనర్త్రి పరోపకారివై
విలయము నీవు జెందుచునె ◆ వెల్గొనరించెద వగ్నికాండమా.

—◆ టెలిగ్రాంతీగె—దేశవార్తలు తెలుపువాఁడు ◆—

చ॰ మతిమతివై విదేశగుల◆మాటలు వీరికి వీరివార్త లం
చితగతి వారికిన్ మితిగ ◆ శీఘ్రిముగాఁ జెవినించి డెందమా

యాతహీతమొందఁజేసి దహ◆హో మహిమోన్నతి గాంచు నీదు సం
గతి శ్రుతిసమ్మతంబగు జ◆గంబున లోహలతామతల్లికా.

—◆ పులుక్కా—నిరతానందకారి ◆—

మ. జల మనలంబునుం బొగయుఁ ◆ జాల సువాసనలీను గాలియుం
గలిగి ధ్వనిం జెలంగి కడు◆గర్జిలుటన్ ఘనసామ్య మొందియుం
గలితవిచిత్రలీలఁ గల◆కాలము మోదరసం బొసంగెడొ
వలనుగ నీదు సేవ గొను◆వారికి వారక ధూమనాళికా.

గీ. పక్షివర్యుండు పరగుఁ బం◆చాక్షరముల, వాని తల దీయ క్షుద్ర దే◆వత జనించు
దానితలదీయఁ దక్కెడ◆జానుమీఱు, దానితలదీసిచూడఁగా ◆ దనరు నృపతి.

(క, పో, త, రాజు.)

గీ. చనినవెనుకను రాకుండు◆జంట లెవియొ, వచ్చినను పోవకుండు వ్య◆వస్థ లెవియొ
మరల వచ్చుచుఁ బోవునా◆మహిమ లెవియొ, తెలియఁజెప్పుము తేటగఁ◆దెలియభువిని.

(కీర్తి, అపకీర్తి, పుణ్యము, పాపము, కలిమి, లేమి.)

గీ. ఇంటి నుండును నెప్పుడు◆నెవ్వి యెవియొ, వెంట నుండును నెవ్వియో◆వేఱుగాక
తప్పకను జెప్పవలయును ◆ తత్క్షణంబ, విమలమతులార విజ్ఞాన◆విబుధులార.

(కలిమి, లేమి, పుణ్యము, పాపము.)

క. బావయు మఱఁదింగని యీ,యావులలో నొకటితెమ్మ ◆ యనఁగా నపుడే
యావని యడిగినవాక్యము, గావలయున్ భాషలైదు◆గా నొకపదమున్.

| | | |
|---|---|---|
| ఏ | రమ్మ | మహారాష్ట్రభాషలో |
| ఆవు | రమ్మ | తురకభాషలో |
| రా | రమ్మ | తెనుఁగుభాషలో |
| బా | రమ్మ | కన్నడభాషలో |
| వా | రమ్మ | అరవభాషలో |

(ఏఆవురాబావా.)

ఆ. మామిడేల పూచు◆మందు వేసంగిని, బాలుఁ డేలఁ బోయెఁ ◆ బసులవెంట
వకనికింద నొకరు ◆ వంగినపనియేమి, మూటికొక్కమాట ◆ ముద్దుకృష్ణ.

(కాయకే)

క. వృక్షము మూఁడక్షరములు, తక్షణమున మధ్య గురువు ◆ తగ్గించినచో
నక్షయము వర్తమానము, నీక్షించును దీనిపేరు ◆ నెద్దియొ చెప్పుమా. (నేరేడు)

ఆ. మూఁడుతలలముసలి, మూతిపండ్లును లేవు, లేవఁ జట్టుకొనిన ♦ లేవ లేదు
కాలవశముచేత ♦ గట్టిలు భక్షించు, దీని భావ మేమి ♦ తిరుమలేశ.

(ప్రొయ్యి)

క. ఉడికియు నుడకని దొక్కటి, వడి నుడికిన దొకటి యచ్చ♦పచ్చిదొకటియున్
గడు నమల నంద మౌనది, వడి దీనిని జెప్పవలయు ♦ వరసరసు లిలన్.

క. శిల వృక్షలతలఁ బుట్టిన, చెలియలు మువ్వురను గూడి ♦ చిడిముడిపడుచున్
తలవాకిట రమియింతురు, సలలితముగ దీని నెఱుఁగు ♦ సరసులు గలరే.

(తాంబూలము)

మ. కదళిం దోఁచె సనాళపద్మ మతు రా♦కాచంద్రుఁడుం బండె నం
దొదవెం గోకనదంబు దానఁ బొడమెన్ ♦ బ్రోద్యత్కళిందాత్మజా
నది యవ్వాహిని మేరు వెక్కె గగనాం♦తర్వర్తియై పాఱఁగా
నది యేఁ జూడ మహాత్మ యో ప్రియవయ♦స్యా! జాతి గూరె న్మదిన్.

మ. పొరుగూరన్ విభుఁ డుండి వేడ్క లలరం ♦ బుత్తెంచు నాభూషణో
త్కరముల్ నెచ్చెలి తెచ్చియిచ్చుటయుఁ గాం♦తారత్న మీక్షించి యు
బ్బర మందెన్ గొనియాడెఁ దిట్టె వగచెన్ ♦ బోఁద్రోచె దీవించె నా
భరణంబుల్ వివరింపుఁడీ సుకవు లీ♦భావోదయస్థానముల్.

మ. రమణుం డున్న యెడాటరున్ సఖియ చే ♦ రంజిల్లు పుష్పాళి సు
ద్విమలంబైన పసిండి పెట్టె నిడి వి♦స్తీర్ణంబుగా దానిపైఁ
గ్రమ మొప్పన్ ఫణి చండికాధవు జగ♦త్ప్రాణోద్భవున్, సంపఁగిన్,
సుమబాణాంగి లిఖించి పంపె మదిలోఁ ♦ జోద్యంబు రెట్టింపఁగాన్.

ఉ. నూతనకేళిబాలిక మ♦నోరథలీలలఁ గేళి సల్పఁగా
నాతల మోముఁ జేర్చి విభుఁ♦డన్యవిచారముఁ జేయుచుండఁగా
నీతరళాక్షి నవ్వి సగ♦మూనిన సింహపుఁబిల్ల నేనుఁగున్
నాతిలిఖించి చూపె నిజ♦నాయకుఁ డాచెలి మెచ్చె నంతటన్.

ఉ. నూతిజలంబులోనఁ బడి♦నూఱుశిరంబులు యెద్దు మేయఁగా
నాతిపయోధరంబుతుద ♦ నల్లన వెన్నెల గాయుచుండఁగాఁ
గోతికి పిల్లికూనకును ♦ ఘోరపుయుద్ధము గూడుచుండఁగా
నేతపుకొమ్ముమీఁద నొక♦యేనుఁగు సింహము వేఁట లాడఁగన్.

మ. సరగతిసేనుసేళ్ళఁ బలి ♦ సంభ్రమ మంతయుఁ బాపి నిగ్గునం
గుముద వనంబులోని తన ♦ కోర్కి బయల్పడఁ జెప్ప లేకఁ దాఁ
గమలదళంబులో నిడిన ♦ కస్తురిచే లిఖియించి చూపి నా
రమణి కుచంబుమీఁద నొక ♦ అంపను, కత్తిని, రాజహంసికన్.

—♦ హిందుస్తాని సంస్కృతం తెనుఁగుపద్యశ్లోకములు ♦—

తుమారాజవానుల్ హమారే గ్రహారే, కదాపీహదంగా సుజానే ముకుందన్
హాకుం నీయతాన్నో హ కాంచాపిదద్యా, త్వోదా తేము జేసాత్సబాజంగలీకా,
ఫలం లేదు బియ్యాల్కు లంబంద్ హోల్ సాల్, అలంమోదు గాపల్ క్వచిత్తైసమాకల్
అవుర్ కోయకొంపల్ మరీమాలకొంపల్, హాయేముళ్లకంపల్ హమారే గ్రహారే.

శా. అంతా తిర్మలయాత్రకంచు జనడం ♦ యాళ్వారుకో నేటిలో
నెంతో వేడుక మంగళిన్ బిలువడం ♦ నెత్తంత దిగ్గొగడం
అంతం బోడగ వేగ నచ్చటికి జీ♦యర్యంగారు వేంచేయడం
పంతంబొప్ప ఘటాలు గాల్చి చనడం ♦ బాగాయె సన్మంగళం.

శా. అప్పంగ్లో ట్లుపయాన వేలుకొనడం ♦ యందర్ని తాఁబిల్వడం
పప్పన్నానికి బోదమంచు జనడం ♦ పల్గోసులూరుండడం
తిప్పల్ పందున దొంగలడ్డపడడం ♦ దిట్టంగ జోడించడం
చెప్పుల్ గుడ్డలు చెంబు వో కెలివడం ♦ చీవాట్లు సన్మంగళం.

# సమస్యలు

సమస్య:—ఎలుకలు తమ కలుగులోని కేనుఁగు నీడ్చెన్.

క. ఇలలో నిద్దఱురాజులు, మలయుచుఁ జతురంగమాడి ♦ మాపటివేళం
జలమెత్తి మఱచిపోయిన, నెలుకలు తమకలుగులోని ♦ కేనుఁగు నీడ్చెన్.

సమస్య:—కుంజరయూథంబు దోమ కుత్తుక జొచ్చెన్.

క. గంజాయి త్రాగి తురకల, సంజాతులఁగూడి కల్లు♦చవిగొన్నా వా
లంజలకొడకా! యెక్కడి, కుంజరయూథంబుదోమ♦కుత్తుక జొచ్చెన్.

క. రంజనచెడి పాండవు లరి,భంజనులై విరటుఁగొల్వఁ ♦ బాల్పడిరకటా
సంజయ! విధి నేమందును, కుంజరయూథంబుదోమ♦కుత్తుక జొచ్చెన్.

సమస్య:—కాకికి శునకంబు కెల్లి కాటుకఁ దీర్చెన్.

క. పాక్రొకటవి కారము గుహనొక్క, కోకస్థ నితిలకమిడియెఁ ♦ గుంకుమతోడన్
భీకరతరసుముఖమున నొక, కాకికి శునకంబు కెల్లి ♦ కాటుకఁ దీర్చెన్. 4580

సమస్య:—ఉత్తరమున భానుబింబ ముదయం బయ్యెన్.

క. అత్తఁగ దూరపు పడమరఁ, జిత్తరువు లిఖించి నిదురఁ ♦ జెందితి నౌరా
చిత్తరువు వ్రాయఁ బోవలె, నుత్తరమున భానుబింబ ♦ ముదయం బయ్యెన్.

సమస్య:—గుండ్రాటికి కాళ్లు వచ్చి గునగున నడచెన్.

క. ఉండ్రాని యడవిలోపల, గుండ్రాయై యున్న యట్టి ♦ కోమలిపైఁ గో
దండ్రాము పదము సోఁకిన, గుండ్రాతికి కాళ్లు వచ్చి ♦ గునగున నడచెన్.

సమస్య:—కమ్మలు మోకాళ్లు దాకి ఘులుఘుల్లు మనెన్.

క. కొమ్మనుం మదనుం డపుడు జ్వమ్మన నీలోత్పలముల ♦ వడి నేయంగా
సొమ్మసిలి మోము వంచిన, కమ్మలు మోకాళ్లు దాఁకి ♦ ఘులుఘుల్లు మనెన్.

సమస్య:—చట్రాతిని నార దీయ చయ్యన వచ్చున్.

క. ఇట్రారయుక్తి చెప్పెద, పట్రా యిది తాటిమట్ట ♦ పదిలముతోడన్
కొట్రా నీభుజశక్తిని, చట్రాతిని నార దీయ ♦ చయ్యన వచ్చున్.

సమస్య:—భల్లూకముకడుపులోన భానుఁడు గ్రుంకెన్.

క. అల్లంతప్రొద్దు కాడను, విల్లందుక వేఁటకాడు ♦ వేయఁ దొడంగన్
జిల్లంపకోలచిక్కను, భల్లూకముకడుపులోన ♦ భానుఁడు గ్రుంకెన్.

సమస్య:—చుక్కలలో నొక్క నక్క సుడివడఁ దిరిగెన్.

క. చక్కఁగ గోవర్ధనగిరి, నక్కజముగఁ గృష్ణుఁ డెత్త ♦ నావులకొఱకుం
గ్రక్కున గిరి మిన్నందినఁ, జుక్కలలో నొక్క నక్క ♦ సుడివడఁ దిరిగెన్.

సమస్య:—చందురులో నిట్టి నేలచంగలి మేసెన్.

క. కందర్పహరుఁడు నరుఁడును, బందికినై పోరిపోరి ♦ పరిపరిగతులన్
గ్రిందైన హరుని జూటపుఁ, జందురులో నిట్టి నేల ♦ చంగలి మేసెన్.

సమస్య:—కప్పను జూడంగఁ బాము గడగడ వణఁకెన్.

క. కుప్పకు గావలి గాయఁగఁ, జెప్పులు గఱ్ఱయును బూని ♦ శీఘ్రముతోడన్
జప్పుడుఁ జేయుచుఁ జను వెం, కప్పను జూడంగఁ బాము ♦ గడగడ వణఁకెన్.

సమస్య:—విపరీతపు పులుసుకూర విస్తరి మ్రింగెన్.

క. అపరూపపు లేతాకుల, విపరీతపు బ్రాహ్మణుండు ♦ విస్తరి కుట్టెం
జపలాక్షి వండిపెట్టెను, విపరీతపు పులుసుకూర ♦ విస్తరి మ్రింగెన్.

సమస్య:—చూతుమె లవుడా యటంచు సుందరి పలికెన్.

క. ఖ్యాతిగల రామచంద్రుఁడు, చేతోమోదంబుతోడ ♦ జెలఁగుచు నెంతేఁ
బ్రీతిగ నిటుఁ జనుదెంచినఁ, జూతుమె లవుడా యటంచు ♦ సుందరి పలికెన్.

సమస్య:—నిను నిను నిన్ను నిన్ను మఱి నిన్నను నిన్నను నిన్ను నిన్నునున్.

చ. అనిలజ! జాంబవంత! కమ♦లాప్తతనూభవ! వాయుపుత్త్ర! యో
పనస! సుషేణ! నీల! నల♦భానుకులుండగు రాఘవేంద్రుఁ డ
ద్దనుజపురంబు వే గెలువ ♦ దైత్యులఁ జంపఁగ వేగ రమ్మనెన్
నిను నిను నిన్ను నిన్ను మఱి♦నిన్నను నిన్నను నిన్ను నిన్నునున్.

చ. అనఘసురాపగాతనయ ♦ యర్కతనూజ! విచిత్రవీర్యనం
దన! గురుపుత్త్ర! ద్రోణ! కృప♦నాగపురీశ్వర! దుస్ససేన! ర
మ్మనుమనె రాజసూయము య♦మాత్మజుఁ డిప్పుడు చేయఁ బూని తా
నిను నిను నిన్ను నిన్ను మఱి♦నిన్నను నిన్నను నిన్ను నిన్నునున్. 46600

చ. అనఘసురేశ! వాయుసఖ ♦ యర్యమనందన! రాక్షసేంద్ర! యో
వననిధినాథ! గంధవహ ♦ వైశ్రవణా! నిటలాక్ష! తాను ర
మ్మనుమని చెప్పె మాధవుఁడు ♦ మారుని పెండ్లికి మిమ్ము నందఱిన్
నిను నిను నిన్ను నిన్ను మఱి ♦ నిన్నను నిన్నను నిన్ను నిన్నునున్.

సమస్య:—విధవాగమనంబు మిగుల వేడుక సేసెన్.

క. అధికారిదర్శనేచ్ఛా, గ్రధితుఁడనై సుశకునంబుఁ ♦ గాంక్షించఁగ నా
కధికఫలప్రద యగుచును, విధవాగమనంబు మిగుల♦ వేడుక సేసెన్.

సమస్య:—కన్నకుమారుండు మగఁడు గాఁగ వరించెన్.

క. అన్నన్న రాధ సొగసున, కెన్నికయగు మగఁడులేమి ♦ హేలాగతిచే
నన్నయగు నందగోపుఁడు, కన్నకుమారుండు మగఁడు♦ గాఁగ వరించెన్.

సమస్య:—రతిరాజగృహంబుమీఁద రవి యుదయించెన్.

క. అతివల మొగ మెఱుఁగక యీ, గతి నతి రతి వాంఛ దగిలి ♦ గస్టసుఖములన్
మతిఁ దలఁపవు లే లెమ్మిక, రతిరాజ గృహంబుమీఁద ♦రవి యుదయించెన్.

సమస్య:—భామాకుచమండలంబుభస్మంబాయెన్.

క. కామాతురుఁడై జంగము, ప్రేమంబున భూతి నలఁది ♦ ప్రియ మలరంగాఁ
గామించి కౌఁగిలించిన, భామాకుచమండలంబు ♦ భస్మం బాయెన్.

సమస్య:—ఆణిముత్యంబు మీసమం దమరియుండె.

గీ. చంద్రశేఖరుఁ డొకనాఁడు ♦ శైలపుత్త్రి, యధరబింబముఁ జుంబించు♦నవసరమున
గిరిజ నాసాగ్రమందున♦ మెఱయుచున్న, యాణిముత్యంబు మీసమం♦దమరియుండె.

సమస్య:—కన్నులలోఁ జన్నులమరెఁ గాంతామణికిన్.

క. చిన్నవి పునుకకింబులుగొని, చెన్నలరఁగ బెస్తవారి◆ చిన్నది రాఁగాఁ
బన్నుగ బొమ్మనఁగల వల,కన్నులలోఁ జన్నులమరెఁ ◆ గాంతామణికిన్.

సమస్య:—కన్నెఱికము చెడక మున్నె గర్భం బాయెన్.

క. చిన్నది పన్నెం డేండ్లది, యెన్నఁడు రతికేళిసుఖము ◆ నెఱుఁగక మునుపే
వెన్నుని తామర పుట్టెను, కన్నెఱికము చెడక మున్నె ◆ గర్భం బాయెన్.

సమస్య:— కామినికుచమధ్యమందు గరుడుం జూడెన్.

క. చేమంతిచెట్టుక్రిందను, భామామణి నిదుర బోవఁ ◆ బదమ్యోదజాలిన్
రోమావళి పామో యని, కామినికుచమధ్యమందు ◆ గరుడుం జూడెన్.

సమస్య:—గుడ్డానికి రెండు కాళ్లు కోడికివలెనే.

క. మట్టాకుఁ బాన్పుగాఁ గొని, బొట్టును బ్రహ్మాండపంక్తిఁ◆బూనిన ముద్దుం
గుట్టఁడ విను వన్నెల గుహా, గుడ్డానికి రెండుకాళ్లు ◆ కోడికివలెనే.

సమస్య:—భార్య లిద్దఱు శ్రీరామభద్రునకును.

గీ. రావణుని సంహరించియు ◆ రాజ్యమునకు, సంగనను గూడి యభిషిక్తుఁ◆డై వెలుంగ
హార తిచ్చిరి ప్రేమతో ◆ హారనిముద్దు,భార్య లిద్దఱు శ్రీరామ◆భద్రునకును.

సమస్య:—గుత్తపుతాపుతారవికకుట్టు పటుక్కున వీడె నింతికిన్.

ఉ. అత్తఱిఁ జిత్తజుండు విర◆హాంగనలం గవలింప నిత్తువి
ల్లెత్తి ధనుర్గుణంబు మెఱ◆యించి నిశాతవినూతనప్రసూ
నోత్తమబాణపఙ్క్తిఁ గుచ◆యుగ్మము బాఁటుపడఁగ నేసినన్
గుత్తపుతాపుతారవిక◆కుట్టు పటుక్కున వీడెనింతికిన్.

సమస్య:—మార్తాండుం డపరాద్రిఁ గ్రుంకె నదిగో మధ్యాహ్నకాలంబునన్.

శా. కీర్తింపందగు రామసాయకమహా◆గ్ని జ్వాల శుంభ న్నిశా
వర్తి నారివణుఁ గాంచి నారదుఁడు దే◆వాధ్యక్షుతోఁ బల్కె◆న
కీర్తిం జెందమియుం జయించెఁగద ము◆న్నత్యుగ్రుఁడై దైత్యరా
ణ్మార్తాండుం డపరాద్రిఁ గ్రుంకె నదిగో ◆ మధ్యాహ్నకాలంబునన్. 4612

సమస్య:—అక్కా రమ్మనుచు మగఁడు నాలిం బిలిచెన్.

క. రక్కసివలె నేప్రొద్దును, మెక్కుచుఁ దిరిగెదవు కాలి◆మెట్టున నిన్నుం
గుక్కక మానను దసినీ, యక్కా రమ్మనుచు మగఁడు ◆ నాలిం బిలిచెన్. 4613

సమస్య:—రారా తమ్ముఁడ రార యన్న యనె నా రాజాస్య ప్రాణేశ్వరున్

శా. గారాబల్లుఁడు నర్జునుండు శ్వశురా◆గారంబునం దుండఁగా
నీరేజాస్య సుభద్ర వచ్చి యతని◆న్వీక్షించి వెన్నెగ్గఁగన్
బాలింజొచ్చెను సత్యపట్టుకొనియిం◆పారంగ నయ్యర్జునున్
రారా తమ్ముఁడ రార యన్న యనె నా◆రాజాస్య ప్రాణేశ్వరున్. 4614

సమస్య:—తోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునన్

ఉ. తోఁచక పట్టితెమ్మనుచుఁ◆దొయ్యలి వేఁడిన వెంట నంటి చేఁ
జాఁచుచు మెల్లమెల్లఁగను◆జాడల జాడల నాశ లాశలన్
నాఁచుక వచ్చు రామరఘు◆నాయకు ముందఱ మాయలేడి తాఁ
దోఁచు నడంగు వెండియును◆దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునన్.

ఉ. పేఁచమడంచి రాఘవ క◆పిప్రవరాదులు వాల్మగంటిమ
న్నేఁచఁగఁ మిన్ను మన్ను దిశ◆లెచ్చటి వచ్చటఁ గాలఁగా రవిన్
గాఁచు శరాగ్నికీలల జ◆గంబులు ఘూర్ణిల నింద్రజిత్తు తాఁ
దోఁచు నడంగు వెండియును◆దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునన్.

ఉ. పూఁచినమాటపట్లఁ దల◆పోయఁగలేక మనోభవుండు ప్రే
రేఁచ గణాలువాలుఁగను◆రెప్పలనార్పక చూడఁగామనం
బాఁచఁగలేనియట్టిత్రిపు◆రారిపురఃస్థలి శౌరి నారియై
తోఁచు నడంగు వెండియును◆దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునన్.

సమస్య:—కుటిలాలక యెడమకన్ను కుడికన్నాయెన్

క. నిటలమున నీవు దాల్చిన, పటుతరకస్తూరిరేఖ◆బహుగతి రతిచే
నటునిటు జాఱిన చెమటకుఁ, గుటిలాలక! యెడమకన్ను◆కుడికన్నాయెన్.

సమస్య:—ప్రాఁతరలో సూర్యుఁ డుదయ పర్వత మెక్కెన్

క. ఈతతిఁ గాపులఁ బిలువఁడి, రాతిరి ప్రొద్దెల్ల జాత◆రాయెను ధాన్యం
బాతురముగఁ బోయింతము, ప్రాతరలో సూర్యుఁ డుదయ◆పర్వత మెక్కెన్.

సమస్య:—బడబానలపంక్తిమీఁదఁ బచ్చిక మొలిచెన్

క. పడఁతిరొ నవమేఘంబులు, విడిఁబడి జడిముసురుఁబట్టి◆విలయపువానల్
కడుఁగొట్టి కురియఁ గోడలు, బడబానలపంక్తిమీఁదఁ◆బచ్చిక మొలిచెన్. 462

సమస్య:—వర్షాకాలము వచ్చె గ్రీష్మమువలెన్ వైశాఖమాసంబునన్.

శా. వర్షం బెట్టుల? కృష్ణదేవుఁ డిటులై యక్షాక్షి! రాఁడాయె సా
హర్షాహంకృతిఁ బంధుఁ జేయుటటి భీ◆మద్వేష సావేగ్రదు
ర్ఘర్ష క్రూరనిశాతఘాతనవఘూ◆ర్ణత్వాంత్రితబాణావళీ
వర్షాకాలము వచ్చె గ్రీష్మమువలెన్ ◆ వైశాఖమాసంబునన్.

సమస్య:—వక్త్రింబుల్ పది కన్నులైదు కరముల్ వర్ణింపఁగా వే యగున్.

శా. ఈ క్త్రాప్రాసము కష్టమౌననుచు మీ◆రింతేసివా గాడఁగా
వాక్త్రిసంబది సత్కవీశ్వరులఁ ద్రో◆చల్ గావు నేఁ జెప్పెదన్
దిక్త్రిరాత్రికిఁ బాగ్వతీశ్వరులకుం ◆ దిగ్మప్రభారాశికిన్
వక్త్రింబుల్ పది కన్నులైదు కరముల్ ◆ వర్ణింపఁగా వే యగున్.

సమస్య:—రండాగమనంబుఁ జేయ రమ్యంబ యగున్.

క. కుండినపురమున రుక్మిణి, చండికకుం బూజ సలుప◆సమయంబున కా
యండజవాహను దోడ్కొని, రం డాగమనంబుఁ జేయ ◆ రమ్యంబ యగున్.

సమస్య:—సుగ్రీవుని యెడమకాలు శునకము గఱచెన్:—

క. అగ్రారపుఁగడివీథిని, నిగ్రహముగ బొమ్మలాట ◆ నేర్పుగ నాడెన్
విగ్రహము లెత్త మఱచెను, సుగ్రీవుని యెడమకాలు ◆ శునకము గఱచెన్.

సమస్య:—మతిలేనినరుండు మిగుల మన్నన నొందున్:—

క. హిత మాచరించువారికి, హిత మొనరించుచును సుజన◆హితుఁ డగుచును దు
ష్కృత మెప్పుడుఁ జేయనుస,న్మతిలేనినరుండు మిగుల◆మన్నన నొందున్.

సమస్య:—అస్ఖలితబ్రహ్మచారి కార్గురు పుత్రుల్.

క. ఈ ఖప్రాసము దుష్కర, మస్ఖలనతనీయఁ దగునె ◆ మది సుకవులకున్
నస్ఖలితులై గుహులంగని, రస్ఖలితబ్రహ్మచారి ◆ కార్గురు పుత్రుల్.

సమస్య:—భూమీశా నరులకాళ్లు భోజన మయ్యెన్.

క. చీమలకాళ్లేలావున, సామజములకాళ్లుచాల ◆ సన్నం బయ్యెన్
భామలకాళ్లేమల్కన, భూమీశా నరులకాళ్లు ◆ భోజన మయ్యెన్.

సమస్య:—మాసానకు మూఁడుకాళ్లు మానవనాథా.

క. ఏసీమ వెదకి చూచిన, నేసానకు నైన గాళ్లు ◆ యెక్కువ గలవా
మాసాన కెన్ని కాళ్లో, మాసానకు మూఁడు కాళ్లు ◆ మానవనాథా. 4628

సమస్య:— పట్టాసన విడెము సేయ మనసాయెం గదే.

క. కొట్టన్నము ఘృతసూపము, బట్టలు పెరుగు నూరుఁగాయ ♦ పచ్చడితో నే
జిట్టున భుజియింపంగా, పట్టాసన విడెము సేయ ♦ మన సాయెం గదే.

సమస్య:— కామి గాఁడు మోక్షకామి గాఁడు.

సీ. నిపుణత్వమున రాజ ♦ సేతియై యుండక, నేల నేలెడువాఁడు ♦ నేల గాని
సంగీతసాహిత్య ♦ సరసలై యుండక, కృతిఁ జెప్పు వాఁడు దు ♦ ష్కృతుఁడు గాని
కుశలుఁడై యింతుల ♦ కోంకల్ దీర్పని, విషయాతురుఁడు దు ♦ ర్విటుఁడు గాని
మాధవశ్రీపాద ♦ మగ్నతఁ జెందక, ముక్తిఁ గోరెడువాఁడు ♦ రక్తి గాని

ఆ. అతిశయాభిషక్తి ♦ యతులితమగుయుక్తి, యంగనానురక్తి ♦ యచలభక్తి
పరతఁ గాంచకున్నఁ ♦ బతి కాఁడు, కవి గాఁడు, కామి గాఁడు మోక్ష ♦ కామి గాఁడు.

సమస్య:— అందఱి కంద కేఁ మఱియు నందఱి కంద కెఱ యంద అందరే.

ఉ. కొందఱు పార్థుకై కరములు ♦ కొందఱు కాలునివాహనంబులుం
గొందఱు భైరవేశ్వరుని ♦ గుఱ్ఱము లీశ్వరవాహనంబులన్
గొందఱు కృష్ణజన్మమున ♦ గూసిరి ధన్యులు గాన నిందులో
నందఱి కంద కేఁ మఱియు ♦ నందఱి కంద కెఱ యంద అందరే.

సమస్య:— కుక్కవో! నక్కవో! ఫణివో! క్రోతివో! పిల్లివో! భూతపిల్లివో!

ఉ. తక్కు కిరాతసింహవసు ♦ ధాధిపుఁ డర్థుల కిచ్చుచున్న చో
దిక్కులలేని కర్ణుం దధీచిని ఖేచరు వేల్పుమ్రానును న్వెం
పెక్కిన కామధేనువు శ ♦ శీంద్రుల నెన్నెద వేమి సూచకా
కుక్కవో! నక్కవో! ఫణివో ♦ క్రోతివో! పిల్లివో! భూతపిల్లివో.

సమస్య:— గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ.

గీ. ఓయి ధృతరాష్ట్ర నీకొడు ♦ కుత్తగోల, కొండవిధ మాలముండఁ గృ ♦ ష్ణుండు గాఁచి
పాండుసూనుల గెల్పించు ♦ పండ యగుచు, నుదరమునఁ బూలదండ కే ♦ కొత్తకుండ.

సమస్య:— గుమ్మ, బుస్సు, జింగు, బొణుఁగు. (మొల్ల)

సీ. అనిలాభిహతి దక్షి ♦ ణావర్తశంఖంబు, గుంభితంబై కేల ♦ గుమ్మరనఁగ
గొడుగయితఱచుగాఁ ♦ బడగలొక్కడఁ దట్టి, భుజగాధిపతి మీఁద ♦ బుస్సురనఁగ
చఱచి నిబ్బరముగాఁ ♦ బఱతెంచు ఖగరాజు, ఱెక్కగాడ్పులు మింట ♦ జింగురనఁగ
దొంతిబ్రహ్మాండపం ♦ క్తులు బొజ్జలోనుండి, బెణఁకి యొక్కొక మాఱు ♦ బొణుఁగురనఁగ

గీ. కూకకనుచూపు మేరకుఁ ♦ గోకవిసరి, వెఱకు వెఱవకు వెఱవకు ♦ వెఱవ కనుచు
గద్దవడి వచ్చి గజరాజు ♦ నొద్ద వ్రాలె, నార్తరక్షాపటుండు నా ♦ రాయణుండు.

# వ్యవహారపద్ధతి.

క. ఇరువదియేఁడులు దనపాల, మొరుఁడు గుడుచుచునికిఁ దెలిసి ♦ యున్ననియూఁదా
దొరలక యున్ననియుఁ దత్పరిభోగము విడిచినతని ♦ పాల్పడి పోవున్. 46౮౫

క. పదియేఁడులు తనధన మొరుఁ, డెదురం గుడువంగఁ జూచి ♦ యెన్నండైనన్
ఇది సాధన మనఁడేనియుఁ, బదఁపడి తాఁ దొడరనేని ♦ ఫలహానియగున్.

ఆ. తండ్రితోడఁ గొడుకు ♦ ధరణీశుతో బంటు, పురుషుతోడ భార్య ♦ గురునితోడ
శిష్యుఁ డోటలేక ♦ చెనసి పైఁబడి సభఁ, బాడి యాడఁ జనుట ♦ పాడిగాదు

సీ. తనదండమునఁ ద్రెవ్వేయఁ ♦ దగదని యెఱిఁగియు, నన్యాయమున గురుఁ ♦ డడచెనేని
తనతాతవృత్తులు ♦ తనతండ్రి యన్యాయ, మున నాక్రమింపంగఁ ♦ జూచెనేని
యాలిసొమ్మాభరణంబు ♦ లన్యాయమునఁ గొని, తులువయై సుగఁ డీక ♦ త్రోచెనేని
తన్నుఁ గొల్చినదాను ♦ దాస్యంబెఱుంగక, యొడయండు కారించు ♦ చుండెనేని

ఆ. పాడి కఱిగి గురుని ♦ తోడ శిష్యుఁడు తండ్రి. తోడఁ గొడుకు మగని ♦ తోడ నాలు
స్వామితోడ బంటు ♦ సభఁ జెప్పఁ జనునైన, నందు నిహపరముల ♦ నిందవచ్చు.

ఆ. నిచ్చనిచ్చవడ్డి ♦ నెలనెలవడ్డొడఁ, బాటువడ్డి వడ్డి ♦ పైనివడ్డి
యనఁగ నాల్గుదెఱఁగు ♦ లయ్యె నావడ్డిబాఁ, దనవుతోడ నెక్కుఁ ♦ దరతరంబు,

క. పది పదునొకండు వడ్డి, వ్వదలక యానడిమివడ్డి ♦ వలయు నిజముగన్
గుదిగొన బేహారులకును, బదిపండ్రెం డుచిత మధిక ♦ పథగాములకున్.

క. తనచేసగ్గము వడ్డికిఁ, గొని నతఁడీవచ్చినపుడు ♦ గొన నొల్లక త్రో
చిన మధ్యస్థులచేతను, నునిచిన నటుమీఁద వడ్డి ♦ యుడుగు ధరిత్రిన్.

క. పానస్త్రీద్యూతాసుల, నైనఋణము తల్లిదండ్రు ♦ లరువరు సుతుఁడుం
దా నరువఁడు వారిఋణము, మానుగ నా లరువదెందు ♦ మగనిఋణంబున్.

క. గొల్లఁడు వ్యాధుఁడు రజకుఁడు, కల్లమ్మెడువాఁడు లోను ♦ గాఁ గొందఱు దా
రిల్లా లప్పరువందగు, నిల్లునడపు చనవు గాని ♦ కిచ్చినకతనన్.

క. సతి తనకొన్న ఋణంబును, బతి యిమ్మని నిశ్చితముగఁ ♦ బనిచిన ఋణమున్
బతి యియ్యకొలుపు ఋణమును, వితతంబుగ నచ్చుగాని ♦ పెఱయరువ దిలన్.

క. జనకుఁడు పరదేశమునకుఁ, జనినను జచ్చినను రోగ ♦ జడుఁడై యున్నన్
దనయులు ఋణ మరువందగుఁ, దనయులు లేరేని నరువఁ ♦ దగు మనుమలకున్.

క. ఎనిమిదియేఁడులశిశువటు, యెనిమిదియేండ్లకును బాలుఁ ♦ డెవ్వఁ డెఱుంగఁడు గా
వున బాలుఁ డెన్నిభంగుల, జనకునిఋణ మరువఁ జనదు ♦ చను నట్టిమీఁదన్.

క. జనకుఁడు గొన్న ఋణము తత్తనయుఁడు వడ్డియును మొదలుఁ ♦ దా నరువఁదగున్
మనుమఁడు మొద లరువం దగు, మనుమల పుత్త్రులకు నరువ ♦ మహి లే దెందున్

ఆ. అన్నదమ్ము లైన ♦ నాలుమగం డైనఁ, గొడుకు తండ్రి యైనఁ ♦ గూడియుండి
పొత్తుధనమునందుఁ ♦ బూఁటవాటును నప్పు, సాక్ష్యమున వహింపఁ ♦ జనదు జగతి.

క. అనువంగఁ బూఁటపడినతఁ, డరువక తాఁ జచ్చెనని ♦ నాతని పుత్త్రుం
డరువఁదగు మొదలు తత్సుతుఁ, డనుతం బని లేదు ధర్మ ♦ మారసి చూడన్.

గీ. తనపడసిన సొమ్మయినను, దన వలసినయట్లు పంచఁ ♦ దగుఁ బుత్త్రులకున్
దన తండ్రిపడపు సుతులకు, జనకుఁడు పంచంగవలయు ♦ సరిపాళ్లుఁగన్.

గీ. జనకునితో వెండైనను, జననికి ఋతుసంభవంబు ♦ సమసినఁ బుత్త్రుల్
మునుకొని తమతమ పాళ్లను, జనకునితోఁ బంచుకొంట ♦ సద్ధర్మ మగున్.

క. పలువురు యువతులఁ బుత్త్రులు, పలువురఁ గలయతఁడు వేఱ ♦ వ్రాయఁ దలఁచినన్
లలనలఁ బుత్త్రులఁ దానును, తలఁగొని మెయిపాలు గొనుట ♦ ధర్మం బెందున్.

క. నాయంత బ్రతుక నేర్తుం, బోయెదనను సుతునికిఁ దత్తఁ ♦ బున్న కణనికిన్
వేయింటికిఁ బదియైనను, దాయము గానిచ్చి పుచ్చఁ ♦ దగు జనకునకున్

క. ఉత్తమమగు ద్రవ్యంబును, విత్తంబును నగ్రజునికి ♦ వింశాంశంబున్
బొత్తున నిచ్చి సహోదరు, లత్తి సమాంశంబు గొనుట ♦ యాప్తం బెందున్.

క. పెండ్లిచేసిన నిలుచెడి పేదలైన, కూఁతులకుఁ దల్లిధనమైనఁ ♦ గొనుట యుచిత-
మందఱు నొకభంగి వా ♦ రగుదు రేని, దాని మెయిపాలు గొనుటయు ♦ ధర్మ మెందు

క. జనకుని ధనమును బొరయక, కనినధనముఁ జెలిమి వేరెఁ ♦ గనిన ధనంబుం
దనయత్తవారు వెట్టిన, ధనముం దనధనమయుఁడు ♦ తత్త్వవిదజ్ఞుల్.

క. జనకుఁడు తనుఁ జదివింపక, జనకుని ధనమైనఁ గుడిచి ♦ చదువక తనయుం
దనకుడిచి చదివి పడసిన, ధనముం బాలడుగఁ దేమి ♦ దాయాదులకున్.

క. పితృధన మితరులచే నపహృతమై చెడియుండి పిదప ♦ నెవ్వనిచే సు
స్థితమగు నది సాధించిన, యతని ధనము సోదరులకు ♦ నతఁడీఁ గలుగున్.

క. నాలుగు వర్ణములందును, నోలిని విప్రునకుఁ బుట్టి ♦ యున్న తనూజుల్
నాలుగు మూఁడును రెండును, బోలఁగ నొక్కటియు నంశ ♦ ములు గొనవలయున్.

సీ. పొత్తున జనకుండు ♦ పుత్త్రుండు నున్నవాఁ, డేర్పడఁ దమలోన ♦ నెవ్వఁడేని
గట్టినచీరలఁ ♦ బెట్టిన తొడవులు, నెక్కుడి వాహంబు ♦ లింటిలోనఁ
బాయని కొలుచును ♦ బానిసలోను గా, నవరుద్ధలై యున్న ♦ యంగనలును
మంచంబు పీఠంబు ♦ కంచంబు చాపలు, చెప్పులు గొడుగులు ♦ చేట తెడ్డు

గీ. పాయ కెప్పుడుఁ జెల్లుసం ♦ పదల వరుసఁ, దొల్లి చెల్లినభంగిని ♦ జెల్లనిచ్చి
వెళ్లుధనంబులు తమలోన ♦ వేఱువేఱ, నొక్కభంగిఁ బాల్గొన ♦ నుచితనంబు.

క. జనకునివస్త్రంబులు వాహనములు శయ్యలునుఁ దొడవు♦లతేఁ దాల్చిన సా
తని శ్రాద్ధంబునఁ గుడిచిన, వానికిం దగుఁ బుచ్చుకొనఁగఁ ♦ దగదు సుతులకున్
క. మనుమలు తాత ధనము పాల్గొన యోగ్యత గల్గి పంచు♦కొనుచోఁ దమతం
జనకులు పెక్కండ్రైనను, జనకులయంశములు గొనుట ♦ సద్ధర్మ మిలన్.
క. కొడుకులు వేఱైన తుదిం, గొడు కుదయం బైనఁ దండ్రి♦ కొని నంశం బా
కొడుకుధనము మును పాసిన, కొడుకులకుం దండ్రిధనము ♦ గొనలే రెండున్.
క. వనిత పతిచేతఁ బడసిన, ధనము తగినవారి కియ్య♦నగు క్షేత్రము దా
ననుభవము కొనక యొరులకుఁ, దనచనవున నీగి యనుచి♦తం బండ్రు బుధుల్.
క. స్త్రీధనంబు పేరఁ ♦ జెల్లినధన మెల్లఁ, గూఁతుఁ జేరుఁ గూఁతుఁ♦గూఁతుఁ జేరుఁ
గూఁతుఁ గాకున్నఁ ♦ గొడుకుపాలగుఁ గాని, వేరుపాలివారు ♦ వెదకలేరు.
క. కొడుకులుగలశూద్రులకుం, బొడమినదాసీసుతుండు ♦ పుత్త్రులలోఁ దా
నొడఁబడి యాపాల్గొనఁదగుఁ, గొడుకులు లేకున్నఁ దానె ♦ కొను ధన మెల్లన్.
క. ముందర వేఱై పదపం, బొందిన సోదరుఁ డొకండ ♦ మృతుండై పో
వం దడవవానియర్థముఁ, బొందినవాఁగలక పోవ♦బో దితరులకున్.
ఆ. జను లెఱుంగఁ బాడి ♦ సవతులకొడుకులు, కలసి రేని యొకఁడు ♦ పాలిసెనేని
వానిపాలిధనము ♦ వానిసోదరుఁడును, వానిఁ గలసినతఁడు♦ వరుసఁ గొండ్రు.
క. ఆకటమును వాసిన భిన్నోదరులును సోదరులును ♦ నొక్కటియైనన్
సోదరులకు వచ్చును భిన్నోదరులకు రాదు పుత్త్ర♦ నోడమిధరిత్రిన్.
ఉ. ఆలును దండ్రియున్ సుతయు♦ తల్లియు సోదరులుం గృహస్థులుం
బోలఁగ సద్గుణుండు తనుఁ ♦ బొందినశిష్యుఁడు పుత్త్రహీనసొ
మ్మెల్లను గైకొనంజను మ♦ఱొక్కనికిం బనిలేదు భూవిభుం
డేలినవాఁడు గానఁ గొను♦ నెవ్వఁడు లేనిధనంబు లిమ్మెగన్.
క. గాలిని దెవులున నాపత్కాలంబున మేటిరాజ♦కార్యంబున ని
ల్లాలిధనము పతిగొనఁదగుఁ, బోలదు వెఱపట్లయందుఁ ♦ బుచ్చుకొనంగన్.
క. చీకుం బిచ్చుకకుంటును, మూఁగ శిఖండియును నిక్క♦ముగఁ దమపాల్గొం
జేకొనఁ జాలరు వారిం, జేకొనఁగా వలయు ధనముఁ♦ జేకొన్న జనుల్.
క. తనయవిహీనుఁడు చచ్చిన, ధనముం గొని ఋణము నరువఁ♦దగు దాయాదుల్
ధనపుత్త్రహీనుపిమ్మటఁ, బనిలేదు ఋణంబు దీర్పఁ ♦ బత్న్యాదులకున్.
ఆ. ఒకనిపాలములోన♦నొకఁడు ధర్మార్థంబు, కొలను బావి నుయ్యి♦ గ్రొచ్చుచోట
నడిగి చేయవలయు ♦ నొడయఁడు చేనికి, హాని కల్గెనేని ♦ నాఁగఁ దగును.
క. దుననియ్యకొన్న కృషికుఁడు, దునకయయున్నని యొకని♦ దున్నింపఁ దగున్
దునక దునకయాఁగినఁ, గొననగుఁ జేనియరి దాని♦ గోరునతని చేన్. 4675

విజ్ఞానేశ్వరము, వ్యవ. ప 46-15.

# లోకనీతులు

ఉ. మాటలచేత దేవతలు • మన్ననఁ జేసి వరంబు లిచ్చెదర్
మాటలచేత భూపతులు • మన్ననఁ జేసి పురంబు లిచ్చెదర్
మాటలచేతఁ గామినులు • మన్ననఁ జేసి మనంబు లిచ్చెదర్
మాటలు నేరకున్న నవ • మానము న్యూనము మానభంగమున్.

చ. పసువుదితోడ నిగ్రహము • బాంధవవర్గముతోడి వైరమున్
గులసతితోడఁ బోరుకడు • క్రూరునితోడ సఖిత్వమున్ మహా
బలయుతుతోడ గాపు పర • భామినితోడ రహస్యభాషణల్
తలఁపఁగఁ బ్రాణహానియిది • తథ్యముసుమ్ము వివేకభూషణా.

ఉ. ఇచ్చెడుదాత యొక్కఁడె య • నేకులు నిమ్మనువారు గాన త
బ్బిచ్చుట కష్ట మేరికిని • నిమ్మని కోరుట కేమి సూక్ష్మమే
యిచ్చగ నిక్షుఖండమున • కంతయుఁ దీపి యటంచు మిక్కిలిన్
హెచ్చుగఁ బీకుచుం దినఁగ • నేమనవచ్చును బాధకం బగున్.

చ. దొరతన కెంతయిచ్చినను • దుఃఖము దీరక చాలదంచుఁ దా
బిరబిరవచ్చి చెప్పుకొని • జేలవ మంతయు వెల్లడింపఁగా
సరసము దప్పి యంత విర • సం బుదయింపక మాన దేచుఁన్
జెఱకు నదేపనిన్ నమలఁ • జిందునె పానక మంతకంతకున్.

ఉ. పద్దెములోభి కేలమఱి • పందికిజాఫరగంధమేల దు
క్కెద్దుకు పంచదారటుకు • లేల నపుంసకుఁడైనవానికిన్
ముద్దులగుమ్మయేలనెఱి • ముక్కరయేలవితంతురాలికిన్
గద్దకుస్నానమేమిటికిఁ • గావలె బెమ్మయసింగధీమణీ.

ఉ. పండితులైనవారలు స • భాస్థలి నుండఁగ నల్పుఁ డొక్కఁ డు
ద్దండతఁ బీఠ మెక్కిన బు • ధప్రకరంబుల కేమిలోటగున్
గొండొకకోఁతి చెట్టుకొన • కొమ్మకునెక్కినఁ గ్రింద మత్తవే
దండమహోగ్రసింహములు • దాలిమి నుండవె రాజచంద్రమా.

క. సామర్థ్య మున్నవేళల, నేమనుజునకేని నింద • యెట్లొదవుఁ గుసుం
బామేల్మిచీరఁ దాల్చిన, భామ చెఱఁగుమాయఁగాక • బయలంబడునే.

క. చేఁతనగువాఁడు కార్యము, కైతగ్గనువంగఁగాక • యల్పుండగునా
యేతమువడిఁ దావంగును, బాతాళమునీరుదెచ్చి • బయలన్ జల్లున్. 4663

ఉ. ఇల్లు భుజంగమైనఁ దన◆యిష్టుఁడు వైరికి మర్మ మిచ్చినన్
గల్లని జంబు నేర్పులుపఁ◆గానక భూపతి చంపవచ్చినన్
దల్లి విషంబుఁ బెట్టినను ◆ తండ్రి ధనాఢ్యుల కమ్మఁ జూపినన్
వల్లభుఁ డొల్లకున్న నిఁక◆ వారల కేఁగతి తిమ్మభూపతీ.

క. బకుఁడేకచక్రపురమునఁ, బ్రకటితయుగ నింటనొకని◆భక్షింపంగా
నొకఁడైనవిడువఁజాలఁడు, సుకరంబుగజన్మభూమి ◆ సుఖమెట్టిదియో.

ఉ. ఆయువునూఱువత్సరము ◆ లందు సగంబు నశించె నిద్రచే
నా యరలోసగంబుగత◆మయ్యెను బాల్యజరాప్రసక్తిచేఁ
బాయక తక్కినట్టిసగ◆పాలుగలించుఁ బ్రయాసవృత్తిచే
నాయువు చంచలంబగుటఁ ◆ బ్రాణులకెట్లు సుఖంబు చేకుఱున్

మ. మడతల్ వల్కు నృపాలుతోఁ బలుమఱు ◆ వ్మారాదు పెండ్లాముతోఁ
జెఱుజాడ న్విహరించునాత్మజునితోఁ ◆ జేడ్పాటు గోష్ఠింకతోఁ
బాడవం దన్నఁగవచ్చు కార్మ్యకవృత్తోఁ ◆ బోరాడు చుట్టంబుతోఁ
గడతేరం దరమా! గృహస్థునకు భర్గా! పార్వతీవల్లభా.

చ. చెఱకురసంబుకన్న నునుఁ ◆ జేడెలకన్నను దేనెకన్న భా
సురసుధకన్న దివ్యనగు ◆ చూతఫలంబునకన్నఁ బాండుశ
ర్కరరుసికన్న ధాత్రి మధు◆రంబయి తోఁచు వివేకియామహా
సరసునితోడిముచ్చటలు ◆ సారకు పల్కుచుమన్న భైరవా.

మ. అధికారంబునముందు వేళలమహా◆హంకారులై కూరులై
బుధులేమాటలు చెప్పినం జెవులకుం ◆ బోనీక యున్మత్తులై
బధిరం బెక్కువ చూపుతక్కువ మహా◆భూపాల్ పరిసంగంతు ర
య్యధికారాంతమునందుఁ జూడవలెఁగా ◆ సాయయ్యసౌభాగ్యముల్.

చ. పిలువనికూటికి న్వెతలఁ◆బెట్టుమహీధవుఁడుండుపీటికిం
జలములులేనియేటికిని ◆ సారసజన్ముఁడులేని మాటికిం
బలువురులేనిచోటికిన్న◆పాలురసాటికిఁబోవరాదయా
బలవదరీదరీకుహర◆భాస్వదరీయదరీదరీహరీ.

చ. కలి చెలువకేసెఁ బామతనిఁ◆గర్వఁగ వింటను మోదె నప్పుడా
కరి నర పన్నగంబుల నృ◆గాలము జూచి క రొక్కమాసము
న్నరుఁడు దినాష్టకంబు నహి◆నాల్గుదినంబులు చాలు నేఁటికి
నరములఁదిందునంచు నది◆నాశముఁ జెందెడు లుబ్ధుకైవడిన్. 4671

మ. “తపసుపుత్రుల్ స్వతంత్రతరమ్ములగు వి◆ద్యల్ నేర్చి పోషింతు” రం
చు మతభ్రష్టులఁ జేయు పండితులు నీ◆మల్ గారె? వీరింక ద్రి
వ్యసనాక్రాంతుల కొల్వెలందులఁ గఁజే◆యన్ లేరె? యీ వ్యాసదూ
ఱ మహాత్ముఁ గలికాలపుణ్యమహిమవా◆క్యంబౌనె? కామేశ్వరీ. 4972
మ. మునుపుద్యోగులు లేరొ? వారలు ధన◆మ్ముం గూర్పరో? పూర్వవ
ర్తనలన్ మానిరె? పూనిరే మలినమా◆ర్గమ్ముల్ వారెట్టు? లే
మనమిప్పున్ బ్రకృతప్రపంచగతి వ◆ర్ణాచారముల్ మాఱె నె
ప్పుడి నెవ్వండని నిశ్చయింపఁదగు? నో◆వామాక్షి! కామేశ్వరీ.
మ. సకలమ్మున్ గొఱిగించుకొందురకటా! ◆సన్న్యాసులా? కారు బ్రా
ట్లౌకయింతేనియు ఫాలమందిడరదే◆మో! ముండలా? కారు వి
ప్రులుత్తంసులకట్టిపాటు కలిగెన్ ◆ బైనారిమాటేల? దాం
దుకులోకంబిటు మాఱె? నీకెఱుఁగరా◆దో? దేవి! కామేశ్వరీ.
మ. ధనమార్జింపడె? వేశ్యయంతయును నిం◆ద్యంబౌన సత్యవ్రత
ర్తనయున్ సేవయు విప్రజాతులకు మే◆రా “నశ్వన్పత్యాకదా
చన” యంచున్ మను వాడఁడా? “యిదియుమూ◆ప్యంటిట్టి కాలమ్ము సం”
దనవర్ణాశ్రమపద్ధతుల్ విడుటయు◆న్యాయంబె కామేశ్వరీ.
సీ. పుచ్చినపోకైన ◆ పెచ్చింపఁ బనిలేదు, వాకిలి దాఁటెడు ◆ పనియు లేదు
కదలక కూర్చుండు ◆ కష్టంబునున్ లేదు, శ్వాసంబు బిగబట్టు ◆ చావు లేదు
బుడికోళ్ళవలె నీట ◆ మునుఁగు కార్యము లేదు, నోరెండవల్లించు ◆ తీరు లేదు
పొగదాకి కన్నులు ◆ పోయెడుపని లేదు, కడుపుగాల్చి శ్రమంబు ◆ పడఁగ లేదు
గీ. పరుల సాయముఁ గోరుచు ◆ వారివెన్కఁ, బరువుపాఱంగఁ బనిలేదు ◆ భ్రాతలార
నాల్కపై మీసొత్తు రెండువ◆ర్ణములు పలుక, ముక్తికన్యక మీసొత్తు ◆ పూజ్యులార.
ఆ. నీకు బనికిరాని ◆ యే కార్యమును గూర్చి, యైనఁ బోకు మొదవు ◆ నధిక బాధ
'యాయి గుర్రద్ద నేల ◆ చేయి వోవఁగ నేల,' యనెడు పల్కు పెద్ద◆లనఁగ వినవె.
గీ. చెడుగు పనిఁ జేయ మొదలిడి ◆ నడుమ పగవ, ఫలిత మే మాదినే మాన ◆ వలయుఁగాని
'యముసుదొ్రక్కనేఁటికిఁ గాలు ◆ గడుగనేఁటి,' కనెడు లోకోక్తి నెప్పుడైన ◆ వినుట లేదె.
గీ. ఎవరితోడను గలహింప ◆ కెల్లవారితోడ స్నేహంబునే చేయఁ ◆ జూడు లాభ
మొందనోఁ 'బోరునష్టంబు ◆ పొందు లాభ,' మనెడి లోకోక్తి బుధులాడ ◆ కొనఁగ వినమె.
గీ. పరుల నీవెంత గౌరవ ◆ భావమునను, జూచెదవో వారు నిన్నట్లు ◆ చూచుచుందు
రవని 'నిందమ్మ యనిన నం ◆ దమ్మ' యనుచుఁ, జెప్పు సామెత వినలేదె ◆ యెప్పుడైన.

చ. అవనిపుఁ డాదరించిన భ♦టాళిభటత్వము వైద్యు వైద్యమున్
గవి కవితామహత్త్వమును ♦ గాయకు గానము కోటిసేయు న
య్యవనిపుఁ డాదరింపని భ♦టాళిభటత్వము వైద్యువైద్యమున్
గవి కవితామహత్త్వమును ♦ గాయకు గానము గవ్వ సేయు సే. 4981

ఉ. తల్లికి భారమా శిశువు ♦ తామరతూఁటికి పువ్వు భారమా
విల్లొక భారమా కడిఁది♦వీరున కొంటెకు గూను భారమా
వల్లికి భారమా ఫలము ♦ బఱ్ఱెకుఁ గొమ్ములు భారమా నుతుల్
చెల్లును లింగధారులకు ♦ లింగపుఁ గాయలు భారమా మహిన్.

సీ. దానంబు సేయఁగ ♦ ధనములు లేవని, వెతనొందఁబోకుఁడీ ♦ వెఱ్ఱులార
మనసు నిల్వదు యోగ♦మును సాధనము సేయ, మని దుఃఖపడకుఁడీ♦ మూర్ఖులార
దేహ మస్వస్థంబు ♦ తీర్థయాత్రలకని, మదిఁ గుందఁబోకుఁడీ ♦ మందులార
అధ్యయనము సేయ ♦ నధికారిఁ గానని, యంగలార్పకుఁడు మూ♦ఢాత్ములార

గీ. జపము లేఁటికి నో యథా♦జాతులార, చేయ నేటికిఁ దపము వై♦ధేయులార
రామకృష్ణ యటంచుఁ గీ♦ర్తనము సేయ, నన్ని సేసినఫల మబ్బు♦ నన్నలార.

## —♦ కాయిదా వర్తకము. ♦—

సీ. కాయిదా కొట్టుకై♦ గడు సుందరంబైన, మేడ నైకొను వంద♦ బాడుగిచ్చి
యొన్నిక కలిగిన♦ యినుపపెట్టె యొకండు, తెప్పించి కొట్టులో♦ గొప్ప జేసి
నిలువుటద్దంబులు ♦ బలువైన లెస్టరు, గడియారములు డాబు♦ గలుగఁ బెట్టి
రతనకంబడి దిండ్లు ♦ రహిమాదిపరుపులు, కోటీశ్వరులకేవి ♦ కూడఁ జొన్పి

గీ. డబ్బు లేకున్న బేరంపు♦ డంబ మలర, నెవనికొంపయొ గూల్ప వాఁ♦ డేడ్చుచుండ
నెలకు మూఁడు దివాలాలు♦ సలుపునట్టి, వారిభాగ్యంబు కాయిదా♦ వర్తకంబు.

## —— ♦ అత్తకోడండ్రజగడము ♦ ——

సీ. పాచి పెంటను దోసి ♦ బాగుచేసిన నేల, పాడుచేసితి వేమి ♦ పాప మమ్మ
నాపాడు కాదు పో♦ నీపాడె యిది. నీదు, తాతసొమ్మాయేమి ♦ ధర్మ మమ్మ
ఆకొంపయేమి నీ♦ యబ్బ కట్టించెనా, నాసొమ్ము కాదటే ♦ సంగనాచి
నాకొంపయో లేక ♦ నీకొంపయో చెపు, కల్ల నీపాట్లుకు♦ కన్నుల కటంచు

నోకటుఁ దప్పులె యుండిన ♦ నుండకున్న, గోకి పోరాడు నత్తయు ♦ గోడలున్న
కాఁపురం బెట్లు కుదురుగాఁ♦ గలదు గాన, వాఁడువాండ్రకు పెద్దయ♦ త్యవసరంబు.

సీ. తాఁజేయు పనులను ♦ తానుజేయక మఱి, యొకని పైనుంచి తా♦నోసలు వాఁడు
గ్రామాంతరంబేఁగు♦ కాలమందు ధనంబు, తనయొద్దనుంచక ♦ చనెడువాఁడు
ఆలిని పుట్టింటి♦ కంపించి చిరకాల, మందె తీసుకురాక ♦ యుండువాఁడు
ఆఁడుదానికి దాన♦ యత్యంతముగ లొంగి, చెప్పినపనులెల్లఁ ♦ జేయువాఁడు
గీ. గుడ్డిగవ్వకు మారఁడు♦ గొప్పవాఁడు, గణన సేయరు గావున ♦ ఘనము లేదు
సద్గుణస్తోమ భూషిత♦ సార్వభౌమ, రాజశేఖరజగతీశ♦ గమ్యచరిత.
చ. ఫలితతరుల్ ద్విజాతులకు♦ భక్తి నొసంగుటయుం గతోదక
స్థలములఁ బ్రాణిలోకము హి♦తంబునకై సరసీతటాకముల్
నిలుపుటయున్ మహాత్ములకు ♦ నెంజిలి వేయుటయుం దలంప నీ
యలఘుసుకర్మపంక్తులు త♦నవ్యయమార్గసుఖైకహేతువుల్.
సీ. భూసుర ద్రవ్యంబు ♦ భూమిసురుల పాలు, రాజధనము మండి♦ రముల పాలు
వైశ్యులధనము వి♦వాహోత్సవము పాలు, కాపులధన మధి♦కారి పాలు
మద్యపాయుల సొమ్ము ♦ మహి నీడిగెల పాలు, జారులధనము వే♦శ్యాలఁ పాలు
గురువుల ద్రవ్యంబు ♦ కూలిజనుల పాలు, సంసారి సొమ్ము వె♦చ్చముల పాలు
గీ. వ్యాధిజను సొమ్ము పొరుగూరి ♦ వైద్యు పాలు, లుబ్ధుని ధనంబు బలిమిదం♦డుగుల పాలు
మాధనము గోడమెకకో♦మటి పాలు, కొమరపురివాల శ్రీవేణు ♦ గోపబాల.
సీ. కప్పురంబును బోలు ♦ కమ్మని వేతలో, గొడ్డుక్రొవ్వును దెచ్చి ♦ కూర్చుటయును
తిలతైలమున వేరు ♦ దినుసు నూనెను గల్పి, వంచించి యది విక్ర♦యించుటయును
పైరు దినుసులను ♦ బాగు సేయక కొన్ని, చిలుచెట్లగూడను ♦ జేర్చుటయును
దొంగతూనికె కది ♦ తోడుగా బూడిదె, నాముదమ్మునఁ గల్పి♦ యమ్ముటయును
గీ. చింతపండున జలములఁ ♦ జిల్కరించి, వల్లమందున గూటిమై♦నంబు గూర్చి
యమ్ముచుండుట లెన్నధ♦నమ్ము గొఱకె, పరిటు ధనమది లేకున్న ♦ సుకము సున్న
సీ. గైరికంబును దెచ్చి ♦ కలబందతో నూరి, మకరధ్వజంబని ♦ మాయఁ జేపి
యినుపచట్రము దెచ్చి ♦ యెఱ్ఱ కాలువు గాల్చి, కాంతం బటంచు నే♦ కాంత మాడి
రంగు గల్పించి పు♦రా హేమ్షిక చూర్ణ, మనుజూపి యభ్రిక ♦ మనుచు బొంకి
పాఁజిల్లపెంకులే♦ పసరుతోడను నూరి, ఖడ్గలోహంబని ♦ కన్నుగప్పి
గీ. అందమగునట్టి సీసాల ♦ మందు బెట్టి, మందు లమ్ముచు జీవింత్రు ♦ కొంద ఱిఁక
నెట్టులైనను ధనముగ♦డించుచుంద్రు, పరికటు ధనమది లేకున్న ♦ సుకము సున్న. 4930
సీ. తండ్రి సంపాదించి ♦ దాచియుంచిన డబ్బు, తనచేతికబ్బిన ♦ దత్‍క్షణంబ
జూదంబు పందెంబు ♦ చుట్టలు సిగరెట్లు, పెసరట్లు వడలు కా♦ఫీలు టీలు

గీ. ప్రాణపదమైన లలితాంగిఁ ◆ బాయకుండు, పురుషులకు నేటి దేవేంద్ర◆పుర సుఖేల
గాంచ మాహాత్మ్యుల్ల ధర్మ◆గావరాహా! గుండభూపాలునరసింహ◆సుందరేంద్ర. 4996

సీ. రాసుల వారేఁటేఁట ◆ గాసులీల లొసరు, మావీటు పేకాట ◆ మాన్పలేవె
శ్రీరంగనాథునిన్ ◆ సేవించు వేశ్యాప్రీతి, మానవుల వ్యభిచార ◆ మాపలేవె
సోమశేఖర నిన్ను ◆ నామసంబునఁ గొల్తు, మధుపాన మిచ్చోట ◆ మాన్పలేవె
వేంకటరమణ నిన్ ◆ వేఁడెద నెప్పుడు దుర్వ్యసనంబు లీయూర ◆ మాపలేవె

గీ. యనుచు నెందఱో దైవాల ◆ నాశ్రయించి, వేడికొని ఫలముగనక ◆ విసుఁగు గలిగె
గాన బుధులార లోకవి◆జ్ఞానులార, పారద్రోలరె యీదురా◆చారములను.

సీ. బాల్యవివాహముల్ ◆ పనికిరావని తెల్పి, పెండ్లాడు మూఁడేండ్ల◆పిల్ల నొకఁడు
సానిమేళంబుల ◆ సభలలో దూషించి, కన్నెఱిక మొనర్చు ◆ ఘనుఁడొకండు
విధవల పెండ్లిండ్ల ◆ వేచోట్లఁ బోధించి, తనయింటిమాటను ◆ దలఁపఁ డొకఁడు
వృద్ధవివాహముల్ ◆ వృద్ధి కావని పోరి, యరువదేండ్లపుడు పెం◆డ్లాడు నొకఁడు

గీ. కలకలా వీరు సంఘసం◆స్కర్తలైరఁట, దేశ మేరీతి నింక ము◆క్తిని బాయుఁ
గాన బుధులార లోకవి◆జ్ఞానులార, పారద్రోలరె యీదురా◆చారములను.

సీ. త్రాగి వీధులవెంట ◆ వాగి యూఁగుచుఁ బోవ, పరులు నవ్వుదురంచు ◆ వెఱుఁగరయ్య
నైలు స్త్రీజనుల రీ◆ఫ్రమ్ మెంటు స్సగిని మీ, పిలుపు తగ్గు నటంచు ◆ దలఁపరయ్య
పేకాటలను నగల్ ◆ తాకట్టు పెట్టిన, నిల్లాలు ఱట్టుసం◆చెఱుఁగరయ్య
పరకాంతలకు మీరు ◆ పసుపులెత్తి నస్వంతి, కాంతమాటేమి కా ◆ నెంతురయ్య

గీ. పిన్నలకు బుద్ధిఁ జెప్పక ◆ పెద్దపెద్ద, పశువులందున్న మీగలే ◆ పసువు విడిచి
నడచుచుండిన దేశంబు ◆ చెడదటయ్య, ఆఁపఁగదరయ్య వేగదు◆ర్వ్యసనములను.

సీ. స్వర్గమా మోక్షమా ◆ సంకటంబులె కాని, సానిపాపలపొత్తు ◆ మానరయ్య
శుచితరంబౌ లేక ◆ శుభకరంబౌ గొడ్డు, మాంసభక్షణమింక ◆ మానరయ్య
ఆరోగ్య మిచ్చునా ◆ యప్పు హెచ్చును గాని, వైను బ్రాందీలను ◆ వదలరయ్య
జనతిణ్ణమా మాన◆ధననష్టమే◆గాని, పేకాట లికఁ గట్టి◆పెట్టరయ్య

గీ. జ్ఞానవంతులె కానిపో◆కడలఁ బోవఁ, బరుల నిందింపఁగా నేమి ◆ ఫలము గలదు
కాన బుధులార లోకవి◆జ్ఞానులార, పారద్రోలరె యీదురా◆చారములను. 5000

☞ నీతిపద్యములలోఁ బ్రస్తుతలోకమున కుపకరించు నాధునికకవుల పద్యములుఁగూడ కొన్ని చేర్పఁబడినవి.

# ఫలశ్రుతి

సీ. పుత్రహీనులకును ♦ పుత్రలాభము గల్గు, ధనహీనులకు నెల్ల ♦ ధనము గల్గు
సువ్వాహరహితుల ♦ కుద్వాహములు గల్గు, స్థితిహీనులకు నెల్ల ♦ స్థితులు గల్గు
మోక్షార్థులకు నెల్ల ♦ మోక్షమార్గము గల్గు, యాత్రాపరుల కెల్ల ♦ యాత్ర గల్గుఁ
విద్యార్థులకు బ్రహ్మ ♦ విద్యలన్నియుఁ గల్గు, జయకాంక్షులకు మహా ♦ జయము గల్గు
గీ. కీర్తికాముల కెల్ల స ♦ త్కీర్తి గల్గు, నీతిహీనుల కెల్ల సు ♦ నీతి గల్గు
నిమ్మహాగ్రంథరాజమ్ము ♦ నెమ్మి మీఱ, వినినఁ బఠియించినను బృథ్వి ♦ జనుల కెల్ల

# భరతవాక్యము

సీ. ప్రజలెల్ల శుభములు ♦ బడయుచుందురు ధర్మ, నిరతి నేలుదు రిల ♦ నృపతు లెల్ల
గోబ్రాహ్మణాల కగు ♦ గురుతరక్షేమంబు, జనులెల్ల సౌఖ్యము ♦ లొందుచు నుందురు
కాలానుగుణముగా ♦ ఘనములు వర్షించు, సర్వసస్యాఢ్యయై ♦ యుర్వర దగు
సంక్షోభరహితమై ♦ జగ మెయ్యెడ రహించుఁ, గడుఁ బుత్రపౌత్రుల ♦ గాంత్రు జనులు
గీ. సంపదలసొంపు వితతంబు ♦ సెంపు మీఱ, నాయురారోగ్యములు మోద ♦ మధిక సుఖము
సత్యశౌచదయాక్షాంతి ♦ శాంతి దాంతి, వెలయ శతవత్సరములు జీ ♦ వింత్రు ప్రజలు

# మంగళము

సీ. మంగళం బఖిలభూ ♦ మండలాధిపునకు, మంగళం బీ మద్ర ♦ మహీపసుతకు
మంగళం బఖిలస ♦ న్మానిసన్నుతునకు, మంగళం బంగనా ♦ మణికి నిపుడు
మంగళం బఖిలాభి ♦ మానభీమునకును, మంగళం బతిమాన ♦ మానవతికి
మంగళంబు భుజంగ ♦ మండనప్రియునకు, మంగళం బీగుణో ♦ త్తుంగమణికి
గీ. మంగళం బసదృశముక్తి ♦ మందిరునకు, మంగళం బిందుబింబాస ♦ మానముఖికి
మంగళం బభ్రనిభవిభా ♦ మహిమునకును, మంగళం బీ రతిప్రతి ♦ మానినికిని. 5103

— ♦ గద్య ♦ —

శ్రీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ సుకవితావిలసితచరణజకులసంజనిత దాసరి కొండయాఖ్యసుజనసుత, పీఠికాపురప్రభుపోషిత, సకల జనవిధేయ, లక్ష్మణ నామధేయ సంకలితంబైన వర్ణనరత్నాకరమునందు చతుర్థభాగము

సంపూర్ణము.

# అనుబంధము

# ఆంగ్లేయులు

ఉ. న్యాయముదప్పి యన్యులధనంబులఁ గైకొన రర్థకాంక్ష నే
న్యాయపుమాటలాడరు మహాద్భుతవస్తువులన్ రచింతు ర
న్యాయపుదండనంబుల మహాగసినైనను జేయ రేమియున్
న్యాయముగా గ్రహింపుమి గుణాఢ్యత నే కడు హలాణకోట్లచోన్.

# ఏసుక్రీస్తుస్తుతి

సీ. వందారుబృందజీవనరాశిపూర్ణాబ్జ, శంకాకళంకభుజంగనకుల
భూరిసంసారకాంతారశాతకుఠార, కామమోహవికారఘనసమీర
దారిద్ర్యదుఃఖాంధకార బాలపతంగ, నరపాపతూలగణస్ఫులింగ
సుచిరకల్యాణసుగుణరత్నకదంబ, మరియాజఠరశుక్తిమౌక్తికంబ
తే. యగణితజ్ఞానకరుణాసయాపరిభావ, భవ్యసువమాలతావాల పరమపురుష
( యనుచు నిష్టాగరిష్ఠత నభినుతించి, తల్లిమరియాంబ నీక్షించి యుల్లసిలుచు )
ఉ. ఈతఁడు దివ్యగాత్రుఁడు సమిద్ధబలుండు సులక్షణక్షమా
నీతికళాదయాన్వయుఁ డనింద్యచరిత్రుఁడు భక్తపూజ్యుఁ డు
ర్వీతలమర్త్యపాపము భరింపఁ ద్వదీయపిచండశుక్తిము
క్తాతిలకంబునాఁ బొడమెఁగా సుతుఁడై జగదేకమాతృకా.

# మాలఁడు

ఉ. మాలఁడు వీఁడటంచు నవమానము జేతురమాఘమానవుల్
మాలని దేది? నాలయుల మాంసమొ రక్తమొ శల్యజాలమో
మేలుఁగ వానిలో మెలఁగు మేటిపదార్థమొ యీవితర్కమున్
మేలుగఁ జేయరీధరణి మించిన వెఱ్ఱిని జానకీవరా.
చ. వలవని కాంతపైఁ గవయు వాఁడొక మాల ధనంబు గల్గియున్
వలసిన సౌఖ్యమున్ గొనని వాఁడొక మాల సభాంతరంబునన్
వలువనితప్పులన్ వెదకు వాఁడొక మాలఁడుగాక యూరికిన్
వెలుపలనిల్లుఁగట్టుకొని వేడ్కనటించినవాఁడు మాలఁడో.
శా. " మాలల్దవ్వున నుండఁగావలెనె? యామ్నాయమ్ము లంఘింపరా
దే? లండన్ జన నేమగున్? చడికి నిస్త్రీగట్టు నింద్యంబె ! " యం
చాలోచింతురు పూర్వమెవ్వరును లేరా? యింతవారక్కటా!
పాలంబోలుకొలమ్మువారలకు నీపాట్లేల? కామేశ్వరీ.

# ఎడ్వర్డుపట్టాభిషేకము.

సీ. ఎవనివిభుత్వమం ◆ దెల్లదేశంబుల, నరయ సౌఖ్యంబుగా ◆ నడుగవచ్చు
నెవ్వానియధికృతి ◆ నెవటివార్తలనైన, సులభంబుగా వేగ ◆ దెలియవచ్చు
నేవానియేల్బడి ◆ నెందుఁజూచినఁగాని, కడు నబ్రమగుపనుల్ ◆ గనఁగవచ్చు
నేనిపాలనమునం ◆ దెట్టియొసధపేని, బలుబీదలకు నైనఁ బడయవచ్చు
గీ. నట్టి నీదైనవారతనం ◆ బవనిలోన, ననుపమానప్రసిద్ధిచే ◆ నలరుఁ గానఁ
బూర్వరాజన్యులను నినుఁ◆బోలఁ గలరె, సద్గుణస్ఫూర్తి యెడ్వర్డు ◆ చక్రవర్తి
సీ. సౌజన్యనిధియైన ◆ శాక్సికోబర్గు సత్ప్రభుమణి యెవనికి◆తామహుండు
మానితప్రాభవుఁ◆డైన కెంటుప్రభుగ్రామణి యెవనిమా◆తామహుండు
ప్రాంచద్యశుండైన ◆ యాల్బర్టునామక, ప్రభుకులమౌళి యె◆వ్వానితండ్రి
విమలగుణశ్రేణి ◆ విక్టోరియారాణి, దీనకల్పకవల్లి ◆ యేనితల్లి
గీ. యట్టి నీకిట్టి భువనవి◆ఖ్యాతమైన, ప్రాజ్యతరపూజ్యసామ్రాజ్య ◆ వైభవంబు
గలుగు టెంతయు నుచితంబు◆గాదె తలఁప, సద్గుణస్ఫూర్తి యెడ్వర్డు ◆ చక్రవర్తి
సీ. అర్ధాంగలక్ష్మియై ◆ యనుగతి మెలఁగునీ, పట్టంపుదేవి పా◆ర్శ్వమున నిలువ
నాత్మస్వరూపుఁడై ◆ యలరునీకొమరుండు, తనరాణితోడఁ జెం◆తను వసింపఁ
గొమరుమంత్రులతోడఁ ◆ గుడిభుజంబగుముఖ్య, మంత్రి కట్టెదుట న◆మ్రతవహింప
నాజ్ఞాకరుల్ బహి ◆ ప్రాణంబులగుసైన్య, నాయకుల్ వలగొని ◆ పాయకుండ
గీ. మూర్తు లానినమీగుణం◆బులనె బెక్కు, దీవులందలినృపులు సే◆వావసరము
గోరనోలగ మున్న మీ◆సొంపుఁ జూడఁ, సంతసమెసంగు నెడ్వర్డు ◆ చక్రవర్తి.

# జార్జిచక్రవర్తి

సీ. మీకాలమునఁగాక ◆ యేకాలమున నెక్కఁ, గలిగినారము రెయిల్ ◆ గాడిమీఁద
మీతరంబునఁగాక ◆ యేతరంబునఁగాంచఁ, గల్గినారము ఫోటో◆గ్రాఫుసొంపు
మీరాజ్యమునఁగాక ◆ యేరాజ్యమునఁజూడఁ, గల్గినారము టెలి◆గ్రాఫుతీవె
మీహయామునఁగాక ◆ యేహయామునఁ బాడఁ, గల్గినారము ఫోనో◆గ్రాఫుమీఁదఁ
గీ. గాన స్వర్లోకసుఖముల ◆ కన్న జనుల, కధికసౌఖ్యమ్ములనొసంగు ◆ నట్టిమీదు
ప్రాజ్యరాజ్యమ్ము సతతమ◆పారమునను వృద్ధినొందెడుఁగాత జా◆ర్జిక్షితీంద్ర. 5018



# పోషకులు

శ్రీ దామెర వెంకట్రామారాయనింగారు, కొత్తపల్లి.
శ్రీ దామెర వెంకటప్పారావుగారు, కొత్తపల్లి.
శ్రీ దామెర జగ్గారాయనింగారు, కొత్తపల్లి.
శ్రీ రావు చినగోపాలరాయనింగారు, కొత్తపల్లి.
శ్రీ రావు రామయ్యగారు, కొత్తపల్లి.
శ్రీ దంతులూరి వేంకటరాయపురాజుగారు, మొఖాసాదార్లు, తుని.
శ్రీ గోలి రామకృష్ణమ్మగారు, భీమవరము.
శ్రీ జోళ్ల పద్దయ్యగారు, భీమవరము.
శ్రీ విప్పర్ల సత్తిరాజుగారు, భీమవరము.
శ్రీ చందలాడ పద్మరాజుగారు, భీమవరము.
శ్రీ ముద్దంపూడి అచ్చయ్యగారు, భీమవరము.
శ్రీ ఉప్పు సత్యముగారు, చేర్మన్, భీమవరము.
శ్రీ యర్లగడ్డ నారాయణప్పారావుగారు, భీమవరము.
శ్రీ మన్యం మంగయ్యమ్మగారు, భీమవరము.
శ్రీ మాడభూషి అనంత నరసింహాచార్యులుగారు, చేబ్రోలు.
శ్రీ పొన్నాడ నారాయణమూర్తిపంతులుగారు, హోమియోపతిడాక్టరు, తుని.
శ్రీ దామెర సత్యనారాయణరావుగారు, చేబ్రోలు.
శ్రీ రావు వేంకటసూర్యారావుగారు, చేబ్రోలు.

# సహాయులు.

శ్రీ వాడ్రేవు వేంకటరత్నముపంతులుగారు, పిఠాపురం.
,, అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు, రాజమండ్రి.
,, బిక్కిన వేంకటరత్నముగారు, తాలూకాబోర్డుప్రెసిడెంటు, రామచంద్రపురము.

## సహాయులు

శ్రీ [illegible] ద్రరావుగారు, రామచంద్రపురము.

" [illegible] రావుగారు, మెడ్రాసు.

" [illegible] సర్వేశ్వరయ్యగారు, సాలూరు.

" కాశినాథుని వీరమల్లయ్యగారు, ఎలకుర్రు.

" చీకుర్తి మల్లికార్జునుడుగారు, స్టాంపువెండర్, ఏలూరు.

" [illegible] బాపయ్య, పోకులలక్ష్మీనారాయణగార్లు, కవిబావమరదులు, [దొప్పలపూడి.

" పుచ్చెప్ప దేవంరాజుగారు, [illegible] పల్లిలంక.

" [illegible] పాపయ్యశాస్త్రిగారు, పిఠాపురము.

" [illegible] వేంకటరమణయ్యగారు, పిఠాపురము.

" నడకుదుటి పార్వతీశముగారు, పిఠాపురము.

" గనగం బైరాగిరావుగారు, శ్రీపిఠాపురంమహారాజావారి ధర్మసత్రం

" పొన్నూరి వేంకటశాస్త్రిలుగారు, సీతారామపురం. [గుమాస్తా.

" మాదిన వీరన్నగారు, వేళంగి.

" వల్లూరి సుబ్బా[illegible] వేళంగి.

" పెద్దాడ బుచ్చిరాజుగారు, కరణము, వేళంగి.

" చల్లా సుబ్బారాయుడుగారు, పెద్దాపురము.

" మలిపెద్ది సుబ్రహ్మణ్యముగారు, మున్సిపల్ కౌన్సిలర్, పెద్దాపురము.

" [illegible] వేంకటరమణగారు, మున్సిపల్ కౌన్సిలర్, పెద్దాపురము.

" బల్ల చినకామరాజు & బ్రదర్సు. శిల్కుబట్టలవర్తకులు, "

" కేసనరపు కామరాజుగారు, ఫస్టుగ్రేడ్ ప్లీడరు, "

" నిరోగి సుబ్బారావుగారు, మున్సిపల్ కౌన్సిలర్, "

" మిడియాల బాపిరాజుగారు, కరణము. వీరవాడ.

" గంగాధరభట్ల లచ్చారావుగారు, ప్రత్తిపాడు.

" రావు వెంకటాప్పుగారు, కొవ్వాడ.

" దామెర వేంకటసూర్యారావుగారు, కరప.

" దామెర వెంకట నరసింహారావుగారు, వీరవరము.

" రావు జగ్గారావుగారు, కొత్తపల్లి.